




# వేదములు

## ఆర్ష విజ్ఞాన సర్వస్వం- 1 నుంచి 3 భాగాలు



## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంథాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంథాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్థం TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వారు ఉచితంగా విలువైన గ్రంథాలను ఆన్ లైన్ లో eBOOK(PDF) అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంథాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(www.google.co.in), మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇంట్లో ఆధ్యాత్మిక గ్రంథాలయం ఉండాలన్నదే మా కోరిక.

ఈ గ్రంథాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సాయి రామ్ సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓం

శ్రీ గణేశాయ నమః

# ఆర్ష విజ్ఞాన సర్వస్వము

## ప్రథమగుచ్ఛము



## 1. ధర్మ కాండము

## ఉపోద్ఘాతము

శ్లో॥ నారాయణః పరోఽవ్యక్తా దండమవ్యక్తసంభవం
అండస్యాంత స్త్విమేలోకాః సప్తద్వీపాచ మేదినీ॥ గీ. త. భా ౧ పే.

తా:- నారాయణశబ్దవాచ్యుడైన పరమేశ్వరు డవ్యక్తమునకంటెను పరుడు. అతని వలన బుట్టిన మాయ (అవ్యక్తము)చే అండము (బ్రహ్మాండము) బుట్టినది. ఆ యండమధ్యమునందీ లోకములును, సప్త ద్వీపయుత పృథివీ మొదలగునవి గల్పించబడినవి.

1. ఈ కనుపించు సృష్టి నామరూప వికారమాత్రమే కావున, మిథ్య యగుటచే జగదుత్పత్తి స్థితిలయాదుల నిరూపించుటలో శ్రుతికి పరమ తాత్పర్యములేదు. మరియు సృష్టిక్రమమును దెలిసికొనినగాని ఆత్యంతిక ఫలమైన మోక్షము లభించనందున ప్రయోజనము లేదు.

ఎవరి వలన నీ జగత్తునకు సృష్టి స్థితిలయాదులు గలుగుచున్నవో యట్టి బ్రహ్మను (ఆత్మను) దెలిసికొనిననే మోక్షఫల మాత్యంతికమైనది లభించునని సర్వవేదాంతములు బలుకుచున్నవి.

2. ప్రత్యక్షమున గనుపించు త్రివిధ తాపములతో సంతప్తులగుటవలన విసుగుజెందుచు, వైరాగ్యము గల్గిన ముముక్షు జనులకును, ఆభాస మాత్రమే యనదగు వ్యావహారిక సంసార సత్యత్వవాదులైన వారికిని,

మంద మధ్యమాధికారులకును ఉపకరించునని పరిణామవాదమును దెలిపినది. అనగా అధ్యారోపాప వాదన్యాయమున శ్రుతి, సృష్టి క్రమమును, దెల్పించి చెప్పినది. ఈ సందర్భమునందు దేని (ఆత్మ) దెలిసిన నంతయు దెలియ బడునను శౌనక ప్రశ్నకు అంగిరసుడను గురువు-"తస్మై సహోవాచ" అనినతో పలికెను.

శ్రుతి॥ ౧ "ద్వే విద్యే వేదితవ్య ఇతిహస్మ యద్బ్రహ్మవిదో
వదంతి పరాచైవాఽ పరాచ" ము. ప్ర. ఖ. 4

తా. రెండువిద్యలు దెలియదగినవి. అందొకటి పరవిద్య, రెండవది అపరవిద్య అనుచు బ్రహ్మవాదులు జెప్పుచున్నారు.

శ్రుతి॥ ౨ "తత్రాఽపరా ఋగ్వేదో యజుర్వేదః సామ
వేదో థర్వవేదః శిక్షాకల్పో వ్యాకరణం
నిరుక్తం ఛందోజ్యోతిషమితి."

తా. అపరవిద్య యనదగునవి ఋగ్వేదాది వేదచతుష్టయములు వానియంగములవి. శిక్షాదికల్పాంతములారు.

శ్రుతి॥ ౩ "అథపరాయయాతదక్షరమధిగమ్యతే యత్తదద్రేశ్యమగ్రాహ్య
మగోత్ర మవర్ణ మచక్షుః శ్రోత్రం తదపాణిపాదం నిత్యం విభుం
సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూత యోనింపరిపశ్యంతిధీరాః"

తా. ఏ విద్యచే నిర్దేశింపశక్యముగాని అక్షరజ్ఞానము గలుగునో యది పరావిద్యయగుననుచు జెప్పెను.

3. పై జెప్పినట్టి యధికారులను గురించియే శ్రుతిపరిణామవాదమును అధ్యారోపాప వాదన్యాయమున కల్పితసృష్టి నిర్వచనము జేసినది. ఉభయవిధవిద్యలలో ముందు అపరవిద్యను జెప్పి తరువాతనే పరవిద్యాబోధ గలుగజేసినది. ఇట్లు తెలుపకుండినచో క్రమభంగమైన యెడల దెలియదగిన విషయ మక్షరమునకంటెను వేరొకటేదైన గలదనుకొందురు. కావున ప్రథమముననే పరిణామరూపమును దెలుపు అపర

విద్యను (వేదవిద్యలను) అనగ సృష్టిక్రమమును జెప్పి, యనంతరము తదప వాదరూపమైన పరవిద్య దెలిపినచో అక్షరమునకంటెను దెలియదగినది వేరొకటి యుండదను నిశ్చయము గలుగునని తాత్పర్యము.

4. నామరూప వికారమాత్రమైన జగత్తునకు పూర్వము సదాత్మ యొకటే గలదు, అక్షర పరబ్రహ్మయనబడు ఆ సదాత్మయె జగత్సృజన (నామరూప వికార మాత్ర బహుభవనమునకు) సంకల్పించి ఈక్షణపూర్వకమున ఆకాశాది క్రమేణసమస్తమును గల్పించినది. ఆ సదాత్మయె తాను సృజించిన సృష్టియందు రాశిద్వయ కల్పనజేసి; ఆకాశ వాయువుల నమూర్త రాశిగను తేజోబన్నములను (పృథివ్యాపస్తేజస్సులను) మూర్త రాశిగను అం దొకొక్కటి త్రివృత్త్రివృత్కృతమగునట్లుజేసి (అమూర్తములగు ఆకాశ వాయువులతో జేరిన పంచీకృత మగునట్లుజేసి) స్థూల, సూక్ష్మ కారణ శరీరముల కల్పనజేసినది. అదే విధమున ఆత్మేక్షణద్వారా-జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ ప్రాణాదిపంచక, మనసాది అంతఃకరణ చతుష్టయములు యథాక్రమమున కల్పించబడెను.

5. ఆ పరబ్రహ్మయే నారాయణ శబ్ద వాచ్యుడు. అతడే మాయా శక్తియుతుడు; కావున మాయా శబలితబ్రహ్మ పరమేశ్వరుడిత్యాది నామములతో బలుకబడుచున్నాడు.

6. మూర్త రాశిలో జలబహుళ్యము గనుపించుచున్నందున కొన్ని శ్రుతులందు జల సృష్టియని జెప్పబడినది.

శ్రు॥ ౪ "సఇమాన్లోకాస సృజత, అంభోమరీచిర్మర
మాపో అదోంభః పరేణదివం ద్యౌఃప్రతిష్ఠాంతరిక్షం
పృథివీ మరోయా అధస్తాత్తా ఆపః" ఐ. ప్ర-1 ఖ-1

తా॥ సదాత్మయే లోక సృజనజేసినది. (సూర్యుని కిరణములం దుండుదకముచే గలుగు మేఘమండలముపైనగల) 1 ద్యులోకము 2 అంతరిక్ష లోకము 3 పృథివీ దానికి క్రింద నుదకము క్రమేణ కల్పించినది.

శ్రు॥ ౫ "స ఈక్షతే ఇమాన్లోకాన్లోక పాలాన్ను సృజా ఇతి
సో౽ అద్భ్య ఏవ పురుషం సముధృత్యా౽ మూర్ఛయత్''
ఐ. ప్రి 1- ఖ-1-

తా॥ సదాత్మయే ఈక్షణ పూర్వకమున లోకములను లోకపాలురను సృజింప సంకల్పించి జలమునుండియే పురుష సృష్టిని గావించెను. ఆ పిమ్మట హస్తపాదముతోడనే పురుషావయవ సంయోగమును జేసి పురుషుని వర్ధింప జేసెను.

తజ్జం తల్లం తదనమను వ్యుత్పత్త్యర్థమా జలమునకుగలదు. గావున అద్భ్యస్సృష్టి చెప్పుటకు విరోధము గాజాలదని శ్రుతి ప్రమాణము గలదు.

శ్రు॥ ౬ "తజ్జలానితిశాంత ఉపాసీత" ఛా. 3-4-1

శ్లో॥ ౭ ఆపోనారా ఇతిప్రోక్తా ఆపోవై నరసూనవః
అయనా త్తస్యతాః పూర్వంతేన నారాయణ స్మృతః
గీత అనందగరివ్యాఖ్య పుట-1

తా॥ అప్పు (నీరు) నారములనబడును. జలములే నరములను (చరాచరములను) బుట్టించును. వానికి లయస్థానము (అయనము) అప్పులేయగును. సృష్టికి పూర్వము అప్పులే కల్పించబడుటచే గాని అప్పులందే శయనించుటచే గాని వానియందే యాత్మ అంతర్యామి రూపమున నుండుటచేగాని ఆత్మ నారాయణుడనబడును.

చరాచరములైన శరీరములం దెల్లప్పుడు అంతర్బహిర్వ్యాపనచే సన్నిహితుడును అధిష్ఠానుడగుచు సదాత్మయే ప్రతిబింబ రూపమున బ్రవేశించుట నారాయణ శబ్దము గలిగినది. అతనికి మాయా సంసర్గము లేనందున అపార్థముచే పరుడను నామము గలదు. ఇట్లతనికి మాయా సంబంధము కల్పితము. అవ్యక్తమునకు మాయాది శబ్దములు పర్యాయ వదనములు. (వాచకములు) గాన ఆ మాయాశబలిత బ్రహ్మకు నారాయణాది నామములు వాచ్యార్థములనుటకు నువపత్తి గలదు.

7. ఆ నారాయణునిచే మాయవలన అండము (బ్రహ్మాండము) కల్పించబడినది. అందే ఈ కనుపించు చతుర్దశ భువనములు సప్తద్వీపయుత పృథివీ జనించినవనుట పైజెప్పినట్లు యుక్తియుక్తము.

8. ఆ పరమేశ్వర కల్పితాండము దేవమానముచే నొక దివ్యసంవత్సర పరిమితిగైన క్రమమున బగిలి యందుండిన సమష్టి శరీరాత్మకుడైన విరాడ్పురుషుడావిర్భవించెను. ఆ పురుషుని నాభికమలమునుండి కార్యబ్రహ్మ యగు చతుర్ముఖ బ్రహ్మయుదయించెను. తపస్సు జేయుమనుచు అతనకి శబ్దము వినిపించగ నతడట్లె జేసిన పరమేశ్వరానుగ్రహముచే వేదము లివ్వబడినవి. ఇట్లా కార్యబ్రహ్మకు వైదికశిజ్ఞానమయమైన సనాతన ధర్మజ్ఞానము గలిగినది.

9. ఆతడా వైదిక స్రష్టవ్యజ్ఞానముచే ఈ భూరాది సత్యలోక పర్యంతబగు (1- భూర్భువస్సువర్మ హార్జన స్తపస్సత్యలోకములను)స ప్తోర్ధ్వ లోకములను ఆ తలాదిపాతాలాంతంబగును (1- అ తల 2 వితల 3 సుతల 4 తలాతల 5 మహాతల 6 రసాతల 7 పాతాలములను) సప్తాధోలోకములను ఇట్లు చతుర్దశభువనములను సృజించినాడనుకథ పురాణములందుగాన వచ్చును. (ఇదేస్థూలసృష్టి)

10. కార్యబ్రహ్మచే సృజించబడిన శరీరము లాయాలోకములకు యోగ్యములగునట్లు విసృజించబడెను. గాని యవి జడములగుటచే కదలక యుండెను ఆ సృజించిన శరీరములందాత్మ (నారాయణుడు) జీవరూపమున మూర్ధస్థానమున గల రంధ్రముద్వారా ప్రవేశించెనని శృతి ప్రమాణము గలదు.

శ్రుతి॥ ౭ "తత్సృష్ట్వాతదేవను ప్రావిశత్" తై- అ ౬ మ ౪

తా॥ ఆసదాత్మయె సృజించి, యదియె వానియందు ప్రవేశించినది.

శ్రుతి॥ ౮ "అనేనజీవేనాత్మాను ప్రవిశ్యానామరూపే వ్యాకరవాణి"

తా॥ సదాత్మేక్షణ పూర్వకమున తెజోబన్నముల నాకాశాదిక్రమేణ సృజించి వానియందు జీవాత్మభావమున ప్రవేశించి వేరు వేరు నామరూపముల నేర్పరచెదనను కొనెను.

11. పైవిధమున సృజింపబడిన చరాచర ప్రాణి శరీరములందాత్మ జీవరూపమున ప్రవేశింపగా నవి సప్రాణులగుటచే నీ సంసారచక్రము పూర్వకల్పానుసారమునను నడుచుచున్నది.

12. చరాచర శరీరములందు క్రమమున నుత్తరోత్తరములు ప్రకృష్టములైన శరీరములు, మనుష్య శరీరములు వానిలో పురుష శరీరముత్తమమైనది.

శ్లో॥ 3 సృష్ట్వాపురాణి వివిధాన్యజయాత్మశక్త్యా
వృక్షాన్సరీసృప పశూన్ఖగదంశమత్స్యాన్
తైస్తైరతుష్టహృదయః పురుషంవిధాయ
బ్రహ్మావలోక ధిషణంముదమాపదేవః మహాభారతము

తా॥ పరమేశ్వరుడు ఆత్మశక్తిచే వృక్షాదిపురుషాంత శరీరములను సృజించి, తానేజీవరూపమున వానియందు ప్రవేశించి, తానాశరీరములందసంతుష్టుడగుటచే మనుష్యశరీరములలో పురుషశరీరమును సృజించి యామనుష్యుడే తనయాత్మ (బ్రహ్మ)ను దెలిసికొను సమర్థుడగుననుచు ముదమొందెను. సమస్తప్రాణులందు మనుష్యశరీరమే యతిదుర్లభమైనదందురు. మనుష్యులందు వర్ణాశ్రమాచార రూపధర్మార్జన జేయుటయందు నానుగుణ్యంబులైన శరీరము లుత్తరోత్తరము లుత్తమోత్తమములగును. జన్మాంతరకృతజ్ఞాన కర్మాతిశయమున బ్రాహ్మణ శరీరముగలిగియు, నాత్మవివేకము గలుగకుండగనే మరణినించిన కృపణుడనబడును.

శ్రుతి॥ — "యోవాఏతదక్షరంగార్గ్య విదిత్వాస్మాల్లో
కాత్ప్రైతిసకృపణో౽థయ ఏతదక్షరంగార్గీవిది
త్వాస్మాల్లోకా త్ప్రైతిసబ్రాహ్మణః"

బృహదారణ్యము

తా॥ ఓగార్గీ! ఎవరీయక్షరమును (బ్రహ్మ- ఆత్మను) తెలిసికొనకయే ఈ లోకమునుండి మరణించివెళ్లుదురో వారు కృపణులు (దీనులు) ఏతద్వి రుద్ధముగ నెవరీయక్షరమును దెలిసికొని మరణించి వెళ్ళుదురో వారె బ్రాహ్మణులగుదురు.

శృతి ౧౦ "ఇహచేదవేదీ దథసత్యమస్తినచేదిహా
వేదీన్మహతీవినష్టి భూతెషుభూతెషు
విచిత్యదీరాః ప్రేత్యాస్మాల్లోకాదమృతాభవంతి" కెనోపనిషద్

తా॥ ఈ మనుష్య జన్మయందె చెప్పిన లక్షణములుగల యాత్మను దెలిసికొనినచో నదియే పరమార్థ సత్యమగును. అనగా కర్మ జ్ఞానాధికృత మైన మనుష్య శరీరము లభించినందులకు సార్థక్యమగును. ఏతద్విరుద్ధముగ నట్లు దెలిసికొనకయే మరణించినచో ప్రబంధ విచ్ఛేదములేని యనేక జన్మ మరణ రూప సంసార ప్రవాహాపతితు డగును. కావున సంసారగతిని దాని గుణదోషముల నెఱింగి యాత్మైకత్వ విజ్ఞానముచే నవిద్యాబీజనాశము జేసి, సమస్త శరీరములందు తానేగలననుచు, యే ప్రాణికిని, హింస గావిం పక, సర్వసముడై, తాను జీవన్ముక్తి పదమునొంది, మరణించగ, విదేహ కైవల్యమును జెందుననుటలో సంశయము లేదు.

11. పదునాల్గు లోకములయందు సప్తద్వీపయుత పృథివి భూలోక మనబడును. ఆ ద్వీపములయందు నాభివలె మధ్యగ నేర్పడినది జంబూ ద్వీపమొకటి. అందు నవఖండము లేర్పడినవి. వానిలో నొకటి భరత ఖండము.

## సంక్షిప్త భూగోళము

12. భూగోళ వర్ణనము విరాడ్పురుషుని స్థూలదేహ నామముతో శ్రీమద్భాగవత పంచమస్కంధ షోడశాధ్యాయమునందు శ్రీ శుకమహా ఋషిచే వర్ణింపబడెను. అద్దానినే సంగ్రహించి వ్రాయబడుచున్నది. అండమధ్యనగల పదునాల్గు లోకములందీ భూలోకము మనుష్య శరీరమం

దలి నాభినిబోలి మధ్యగానున్నది. భూలోకమునందే సప్త ద్వీపములు సప్త సముద్రములు గలవని పురాణములయందు విఖ్యాతిగలదు.

13. ఈ లోక సమూహాము ఆ విరాడ్పురుషుని స్థూలదేహాము. అనగా అండమధ్యమునందే విరాడ్పురుషుడుదయించుటచే నీ లోకము లన్నియు నండమధ్యమునందే గలవు. ఇందుదాహరణ భాగవతమునందు ద్విదళ నిష్పావాదిధాన్యబీజము లార్ద్రములగునప్పుడు ద్విదళములంటువీడగ వేరగునట్లు రెండుగానండ కటాహములు వేరై యూర్ధ్వాధోండార్థములై నవి. ఆ రెండండ కటాహార్ధముల మధ్య నీ పదునాలుగు లోకములు జేరినవని జెప్పబడెను. అట్లే తెలియుటకు మనుష్య శరీరము (పిండాడము) విరాడ్పురుషుని (బ్రహ్మాండము)నకు ప్రతిబింబమగును. ఎట్లొక మనుష్యుని పెద్ద చిత్రపటము (పెద్దఫోటో) అతని చిన్న చిత్రపటము (కారసైజు ఫోటో) లొకటియే యనబడునో యట్లె యనవచ్చును.

14. మనుష్యుని స్థూల శరీరమునందు పార్థివ భాగము హెచ్చుండునట్లు విరాడ్పురుషునికి నాభివలె నేర్పడిన భూలోక శరీరమునందు పృథివీ తత్వము హెచ్చుగా నుండును. మనుష్య శరీరమునందితర భూతాంశము లుండునట్లు భువరాది పై లోకములందు వాని వానికి జెప్పిన పృద్వీతర భూతభాగములు హెచ్చుగా నుండుటతో నవే ఆయాలోకములకు తగు స్థూల శరీరము లనబడును. గాని వానియందు పార్థివ భాగము లేదనుటకు వీలులేదు.

15. భువరాది లోకములు అనేక లక్షల యోజనోన్నతములతో నొకదానిపై నొకటి యుండుటచే మనుష్యుల దృష్టికి అగోచరములగుచున్నవి. ఇందులకుదాహరణముగా మనుష్య శరీరము నందలి షట్చక్రములెట్లొకదానిపై నొకటిగలవో యట్లే భువరాదిలోకములుండుననవచ్చును. యోగశాస్త్ర ప్రమాణముచే మూలాధారాది చక్రములు శరీరము లోపలనే యుండునని దెలియుచున్నది. ఆ చక్రములయందు యోగులు తమ యభ్యాస బలమున ప్రాణాయామ సాధనచె జేరుచు మరల వచ్చుచుందురని

ప్రమాణములు గలవు. అట్లే విరాడ్పురుషుని బ్రహ్మాండ శరీరాత్మక భువ రాది లోకముల జేరవచ్చును.

16. అధోలోక సప్తకము బిలరూపములు (భూచ్ఛిద్రములు) వాని యందు జేరుటకు మార్గదర్శకులు లేమిచే మన కాయా మార్గములిప్పుడు దెలియబడనందున జేరశక్యము గాజాలకున్నది. మన కగోచరమగుటతో డనే యవి లేనివి గాజాలవు. యెన్నియో విషయములిప్పుడు మన కగో చరములు. పరకాయ ప్రవేశాది విద్యలే వానికి నుదాహరణములుగాని వాని యుపలబ్ధియథార్థమన మనకగుటలేదు. బహుకాలమైనందున నిప్పుడట్టి విద్యలు లుప్తములైనవి గాని యభావములైనవి గాజాలవు. "సకాలేనే హమహతా యోగోనష్టః పరంతపః" "సఏవాయం మయాతేద్య యోగః ప్రోక్తః పురాతనః" అను భగవద్గీతా ప్రమాణముదాహరణము.

17. అణి మాది యోగసిద్ధిలేనందునను, మార్గదర్శకులైన విజ్ఞు లేనందునను ఆయా లోకములం దిప్పుడు మనము జేరుటకు వీలుగలుగ కున్నది. నేటి కాలమునందలి వైజ్ఞానికులు పైలోకములను జేరుటకు యంత్ర సహాయమున ప్రయత్నము జేయుచుండుట యందరికిని విదితము. పై లోకముల స్థూల శరీరములు పార్థివ భాగాధిక్యములైనవి గాకున్నను, వానిని జేరుటకై వైజ్ఞానికులు ప్రయత్నించుచున్నారు. ప్రకృతి విజయము నందు వారెంత వరకు సఫలీకృతులగుదురో భావికాలము నిర్ణయించును.

18. పురాణములందు మూడులోకములే గలవని మఱియొక పక్షము గలదు. ఈ పక్షమునందు నాభిగాబోల్చినదే భూలోకమగును. అతలాది పాతాళ పర్యతము మనుష్య శరీరమందలి మూలాధారచక్రముతో బోల్చ వచ్చును. భువరాది సత్యలోకములను అనాహతాది సహస్రార చక్రము లతో బోల్చవచ్చును. భూలోకమును మధ్యలోకము మణిపూరకముతో బోలును.

19. నాభిగా నేర్పడిన భూలోకమే విస్తీర్ణమునందు ఏబది కోట్ల యోజనములని జెప్పిరి. అందేసప్త ద్వీపములు, సప్త సముద్రములు, గలవు. సప్త ద్వీపములమధ్యనాభివలెనున్నది జంబూద్వీపము. అది విస్తీర్ణమున

లక్ష యోజనములుండును. జంబూద్వీపవలయమునకు జుట్టియున్నది లవణ సముద్రము జంబూద్వీపన సంఖ్యకు నదిరుట్టింపు సంఖ్యగానుండును. (రెండలక్షల యోజనములుండు నందురు) లవణ సముద్రమున కావలప్లక్షాది ద్వీపములును వాని వానికి రెట్టింపు సంఖ్యలతో సముద్రములును, ఉండు నని జెప్పబడినవి. ఈ విధమున భూవలయముల కావల సముద్రములు, సముద్రములకావల భూవలయములు (ద్వీపములు) వాని వాని రెట్టింపు సంఖ్యలతోనుండును. ద్వీపముల పేర్లు క్రమమున 1 జంబు, 2 ప్లక్ష, 3 శాల్మలీ, 4 కుశ, 5 క్రౌంచ 6 శాఖ 7 పుష్కరములు- సముద్రముల నామములు క్రమమున 1 లవణ, 2 ఇక్షు, 3 సురా 4 సర్పి (ఘృతము), 5 పయః, 6 దధి, 7 శుద్ధోదకములు. జంబూద్వీపమునందును ఇతర ద్వీపములందును తొమ్మిదేసి ఖండము లేర్పడినవి. జంబూద్వీపము నందలినవ ఖండములు (వర్షములు) ఉత్తరమునుండి, క్రమమున 1 కురు, 2 హిరణ్మయ 3 రమణకములు జంబూద్వీపమధ్యనిలావృతవర్షము దీనికి పూర్వమునందు భద్రాశ్వావర్షము పశ్చిమమునందు కేతుమాలవర్షము ఇలావృతమునకు దక్షిణమునందు క్రమమున 1 హరివర్ష 2 కింపురుష 3 భారత వర్షములుగలవు. ఇతర ద్వీపములందు వర్ష విభాగములిట్లేగలవు. వానియందు కులపర్వత మహానదులును గలవు. జంబూద్వీపమునందలి కుల పర్వతముల వివర మేమనగా ఇలా వృతవర్ష మధ్యన మేరుపర్వతరాజము పాతాళము నుండి పైకి లక్ష యోజనోన్నతమునగలదు. దానిచే ఇలావృతవర్షము పూర్వ పశ్చిమేలా వృతములుగాభాగించబడినవి. మేరుపర్వతమునకు నలుదిశలందు విశాలమైన యెత్తుగల నాల్గు పర్వతములు గలవు. మేరువునకు పూర్వము నందు మందరము, దక్షిణమున మేరుమందరము పశ్చిమమున సుపార్శ్వము ఉత్తరమున కుముదములను నామములతో పర్వతములు గలవు మేరు పర్వతమునకు ఉత్తరమునందున్న కురు వర్ష సీమా పర్వతములు శ్వేత శతశృంగములనెడి రెండు పర్వతములుగలవు. వాని యెత్తు చాల హెచ్చుగ నుండునని చెప్పిరి. వాని యెత్తు భాగములందే రమణకహిరణ్మయ వర్షములుగలవు. ఆ సీమాపర్వతములకు ఉత్తరమునందుండు నిమ్న ప్రదేశము

కురువర్ష మనబడును. దాని నిప్పుడు సాయ్బీరియా, మంగోలియా, ఉత్తర చైనాది నామములతో వ్యవహరింతురు. మేరువునకు పూర్వమునందున్న భద్రాశ్వ వర్షమునకు సీమా పర్వతమైనది గంధమాదన పర్వతము. దాని శిఖరాగ్ర సమప్రదేశమునందు భద్రాశ్వ వర్షము గలదు. గంధమాదన పర్వతమునకు తూర్పుననున్న నిమ్న ప్రదేశములను ఇప్పుడు చైనా, జపాన్ మొదలగు ప్రదేశములని వ్యవహరించుచున్నారు. మేరువునకు పశ్చిమ భాగమునందగు సీమా పర్వతము మాల్యవంత మనబడును. దాని పశ్చిమ ప్రదేశమున కేతుమాల వర్షముగలదు. దానికి పశ్చిమమునందున్న నిమ్న ప్రదేశముల నిప్పుడు యూరోపు ఖండమనియు అమెరికా ఖండమని వాని మధ్యనున్న ద్వీపములన్నియు గలిపి చెప్పబడుచున్నవి. మేరువు, ఇలావృత వర్షములకు దక్షిణమునందుగల మేరుమందర, నిషధ పర్వతముల మధ్య ప్రదేశములందు ఉత్తరమునుండి దక్షిణమునకు క్రమముగా హరి, కింపురుష వర్షములుగలవు. వానికి దక్షిణ సీమాపర్వతమును హిమాలయ పర్వతమని యందురు. హిమాలయమునకు దక్షిణమునగల భూభాగముల నిప్పుడు భారతమనియు, మధ్యఏష్యా మొదలుకొని ఆఫ్రికాఖండము వరకు గల వానిని, దక్షిణ మహాసముద్రమునందు ద్వీపములైన ఆస్ట్రేలియా మొదలగు నామములతో చెప్పుచున్నారు. ఇట్లు జంబూద్వీపమునందే పైచెప్పిన ఇప్పటి దేశములన్నియు అంతర్గతములగుచున్నవి. గాన జంబూ ద్వీపమునకు చుట్టును లవణ సముద్రము గలదని పురాణములందు చెప్పినది సత్యమగును. దీనినే భూగోళమంతయగు ననుటగాని సప్త ద్వీపములు లేవనిగాని ఇప్పటి కాలమునందు ఉపలబ్ధిగాయున ఖండములే సప్త ద్వీపము లనుటగాని యొప్పదు. ద్వీప సముద్రాదుల పరిమాణము పూర్వసృష్టి కాలమునందేర్పరుచబడినవి. బహుకాలము జరిగినందునగాని, భూసముద్రముల పరస్పరాఘాతములవలనగాని, జంబూ ద్వీపాకార పరిమాణములందు భేదము గలుగవచ్చును. సముద్రాఘాతములచే నేర్పడిన ఖండములనిప్పుడు ఆఫ్రికా, అమెరికా, ఇంగ్లాండిత్యాది నామములతో వ్యవహరింతురు.

సగర కుమారులు కారణాంతరముచే భూమిని త్రవ్వినందున భారత సమీపము నందనేక ద్వీప, ద్వీపకల్పము లేర్పడినవి. ఇప్పటి కాలమునందు ఆంగ్లేయులు, ఏష్యా, ఆఫ్రికా ఖండములకంటియున్న భూభాగమును సూయజు వద్ద త్రవ్వి మధ్యధరాసముద్రమును ఎఱ్ఱసముద్రముతో గలిపినది యెల్లరకు విదితము కావున ఇప్పుడు చూపించబడు భూగోళమంతయు జంబూద్వీపమగునేగాని సప్త ద్వీపయుత భూలోకము (భూగోళము) గాజాలదు.

20. ఇప్పుడు మనముండు భారతఖండమున దప్ప తక్కిన వర్ష ద్వీపాదులందు వర్ణాశ్రమాచార రూప ధర్మములు గానుపింపవు. శీతవాతాతపాది నైసర్గికానుకూల్యముండుటచే కర్మాచరణ యోగ్యమైనందున భారత వర్షమే కర్మభూమి, పుణ్యభూమియని జెప్పబడుచున్నది. ఇచ్చట నివసించు వారలకే వర్ణాశ్రమాచార రూపధర్మ భేదము కార్యబ్రహ్మ యేర్పరచినందున నిచ్చట నివాసము జేయువారలకే కర్మాధికార మేర్పడినది. సనాతన ధర్మమైన వైదిక విజ్ఞానము ఇచ్చట నివసించువారల కతడు మహర్షుల ద్వారా బోధించెను. కావున నా ధర్మములను ఆచరించగోరువారు వేదముల దెలిసికొనుట కిచ్చయించుట సహజము. వేదములందు ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థములుగలవని జెప్పబడుటతో యా ఫలములను ప్రతివారలు గోరుచున్నారు.

## పురుషార్థ నిరూపణము

21. పురుషార్థముల స్వరూపము కార్యలింగకానుమానముచే కారణము దెలియబడినట్లు వాని కార్యములతోడనే అవి దెలియబడును.

శ్లో॥ 4 అర్థశ్చమూలం నికృతి క్షమాచ కామస్య రూపం వయోవపుశ్చ
ధర్మస్య యాగాది దయాదమశ్చ
మోక్షశ్చ సర్వోపరమః క్రియాభ్యః సంక్షేప అ 3 శ్లో 365

తా॥ నికృతి క్షమములు రెండును అర్థార్జన సాధనములు. కామకారణములు వయస్సు సౌందర్యములగును. ధర్మసాధనములు యజ్ఞములు,

దయా దమములు, ఇంద్రియ నిగ్రహాదులు. సర్వకర్మల పరిత్యాగము (వైరాగ్యము) మోక్షసాధనమని చెప్పబడినది.

22. ఈ శ్లోకమునందు పురుషార్థముల క్రమ వివక్షతము లేనందున సాంప్రదాయానుగుణ్యా ప్రాప్తమగు ధర్మమే మొదటి పురుషార్థమనదగి నది. ధర్మాచరణవలననే తక్కిన పురుషార్థములు లభించుటతో ధర్మమే ప్రథమ పురుషార్థమనుట యొప్పుచున్నది. ధాన్యబీజములందెట్లు అంకురాది పుష్ప ఫలములుండునో అట్లే ధర్మబీజమునం దితర పురుషార్థములు గలవు. మరియు బీజరూపుడగు పురుషునందెట్లు సత్తారూపమున భార్యా పుత్రాదులు గలరో అట్లే యర్థకామములు రెండును సత్తారూపమున ధర్మ బీజమునందు గలవు. ధర్మ సాధనములు (కార్యములు) యజ్ఞాది కర్మలు ఇంద్రియ నిగ్రహాంతము. పైవాని నాచరింపగ ధర్మార్జన యగుటతో నవియె కార్యకారణముల కనన్యత్వన్యాయమున ధర్మములనబడును. వాని నాచరించు పురుషుని ధర్మాత్ముడందురు. కావున పురుషుడే బీజము బీజావాపన జేయునట్టి వానిని పురుషుడనిన ధర్మమనిన నొకేయర్థమగును. పురుషునిచే గోరబడినందున పదార్థములను పురుషార్థములని బలుకుచున్నారు.

23. రెండవ పురుషార్థము అర్థము. నికృతి, క్షమలు రెండును ఆపురుషార్థమునకు సాధనములుగా జెప్పబడనవి. నికృత్యర్థము ఉద్యోగమునకు జెల్లుచున్నది. ఉద్యోగము జేసిననే యర్థము లభించును గాని ఉద్యోగము లేని వారి కేసంపదలుండవని సాధారణముగ నందరికిని దెలియుచున్నది.

శ్లో॥ 5 ఉద్యోగినం పురుషసింహ ముపైతిలక్ష్మీః ।
దైవేనదేయమితి కా పురుషావదంతి ।
దైవంనిహత్య కురుపౌరుష మాత్మశక్త్యా ।
యత్నే కృతే యదినసిద్యతికోఽత్రదోషః ॥

అనెడి ప్రమాణము గలదు.

1. నిక్కృతికి రెండవ యర్థము మాయ. విశేష ధనప్రాప్తికై ఇతరుల వంచించు టకుగాను మోసము (మాయ) జేయుట కనుపించుచున్నది. ఉదాహరణముగా జూదము మొదలగువానిని జెప్పవచ్చును. అమాయకులైన ధర్మాచరణులు శ్రీమంతులుగా గనుపించు టరుదు. కావున నిక్కృతి (మాయ) ధనార్జన సాధన మగును.

2. అర్థమునకు రెండవ సాధనము క్షమయని పై శ్లోకమునందు గలదు. క్షమాగుణము ధనరక్షణార్థమునకు నుపయోగపడును. ఉపార్జించిన ధనము రక్షణ జేసిననే యుండగలదు. గాన క్షమను అర్థకారణమనుట జెల్లును. యోగ క్షేమములు రెండును ధనార్జన కారణములగునని యనేకచోట్ల జెప్పబడినది. యోగ క్షేమార్థములనిచ్చు నిక్కృతి, క్షమల రెంటికి గూడ లక్షణయా "భార్య" యను నర్థము చెప్పవచ్చును. నిక్కృతిని మాయార్థమన "స్త్రీ" యని చెప్పవచ్చును. క్షమాగుణము స్త్రీయందుగలదు. గాన యోగ క్షేమార్థములై నిక్కృతిక్షమలు మాయతో పురుషుడుపార్జించిన ధనమును స్త్రీ రక్షణజేయును. లక్ష్మీ మా మాయా మొదలగునవి పర్యాయనామములు గావున స్త్రీని (భార్యను) గృహాలక్ష్మి యనుట ఉచితమే యగును.

పద్య॥ ౧ పురికిని ప్రాణము కోమటి । వరికిని బ్రాణంబు నీరు వసుమతిలోనన్ ।
కరికిని ప్రాణము తొండము । సిరికిని బ్రాణంబ మగువ సిద్ధము సుమతీ॥

పై కారణములచే రెండవ పురుషార్థమైన అర్థమును భార్యయని నిలక్షణచే జెప్పుట యొప్పును.

24. కామ కారణములు వయస్సు, సౌందర్యములని చెప్పబడినవి. బాలుడప్రయాప్తేంద్రియుడు గాన వానికి కామ వికారోత్పత్తియే గలుగ జాలదు. వృద్ధునికి కామ వికారముండిననుగాని ఇంద్రియ పాటవములేమిచే కామోపభోగమును జేయజాలడు. యౌవనమునందే ప్రజనన సామర్థ్యముండును. గావున వయోధర్మమునే కామ కారణమనుట యొప్పినది. వపుశ్శబ్దార్థమున స్త్రీ పురుషులకు గల అంగసహజ సౌందర్యము జెర్కొనబడినది. ఇట్లు శరీరసహజ సౌందర్యముగూడ కామకారణమనుట జెల్లును.

శ్లో॥ 6 నకేచన జగద్భావాస్తత్వజ్ఞం రంజయత్యమీ ।
నాగరం నగరీకాంతం కుగ్రామ లలనాయథా ॥

తా॥ నగరవాసియు నవనాగరికుడైన సుందరపురుషుని యెట్లు కుగ్రామ వాసిని, నవనాగరికతలేని (అంగసౌందర్యములేని) స్త్రీ రంజింపజాలదో యట్లే జగద్వికార జాతములు తత్వవిదునికి హర్షజనకములు గాజాలవు.

2. సంతోషము (హర్షము) గలిగిననే రాగము (అనురాగము) గలుగును. రాగము రంజనార్ధమున పురుషునకు హర్షదాయకమగు కామ కారణము. గాన ఇష్ట ధనప్రాప్తియేగాని అణిమాద్యైశ్వర్య ప్రాప్తులు గాని చెప్పబడినవి. ధనమనిన ప్రియురాలి కర్థమగునని పైన వ్రాయ బడినది. ఇట్లు ఇష్టధనమనిన ఇష్టమైన స్త్రీ (భార్య) యనినను ఏకార్ధమనవచ్చును. ఈ విధమున కామోత్పత్తి కారణము ప్రియురాలగు సుందరీలాభము పై శ్లోకోదాహరణ మిచ్చుట కామమునకు ఉదాహరణగా హర్షహేతువుగ నున్నది. కావున జెప్పనైనది. ఇట్లు స్త్రీ పురుషులకుగల అంగ సహజ సౌందర్యాదులు కామకారణములగుననుట యొప్పుచున్నది.

3. మూడవ పురుషార్థమైన కామమునకు గౌణార్థముచే సంతాన మనియు నర్ధము జెప్పవచ్చును. భార్యా సంయోగము కేవలరత్యర్ధమున కనియే జెప్పరాదు.

శ్లో॥ 7 యద్ఘ్రాణభక్షో విహితస్సురాయా ।
స్తథాపశోరాలభనంనహింసా ।
ఏవం వ్యవాయ ప్రజయానరత్యా ।
ఇమం విశుద్ధంనవి దుఃస్వధర్మం । భా. స॥ అ శ్లో 3

తా. సౌత్రామణీష్టియందు కల్లు వాసన జూచుట మాత్రమేగాని త్రాగుటకర్థముగాదు. యజ్ఞాదులందు పశువుల జంపుట హింసగాజాలదు. ఇదే విధమున భార్యా సంయోగము. (మైథునము) సంతానార్థమగును. గాని ఇట్టి పరిశుద్ధమైన తమ ధర్మమెఱుంగ జాలకున్నారు.

శ్లో॥ 8 అగ్నిహోత్రఫలా వేదాః । వృత్తశీలఫలంశ్రుతం ।
రతిపుత్రఫలానారీ । దత్తభుక్తఫలంధనం ।

తా. అగ్నిహోత్రాది ధర్మములాచరించుటే వేదాధ్యయనమునకు ఫలము. వేదాంత శ్రవణాదులకు ఫలము తచ్ఛీలియగుచు వర్తించుట. మరియు భార్యా సంయోగమునకు ఫలము రతియొనర్చుట, పుత్రసంతానమును ఒడయుటకే జెప్పనైనది. త్యాగభోగములు జేయుటే ధనము గలుగుటకు ఫలములగును.

శ్రుతి ౧౧ "ప్రజాతి రమృతమానంద ఇత్యుపస్థే"

తై. భృ. వ. 10 మ. 12

తా. తైత్తిరీయభృగువల్లియందలి అధిదైవికోపాసనలను, బ్రహ్మ దృష్టిచే వృష్ట్యాదులందు తృప్త్యాదుల నుపాసించునప్పుడు ప్రజ (సంతానము) అనగా పుత్రునందు బ్రహ్మయమృత రూపమున నుండుననుచు దెలిసికొని యుపాసనజేయనగును. ఉపస్థ (స్త్రీ చిహ్నము) యందు బ్రహ్మ ఆనందరూపమున గలడని దెలిసికొని యుపాసించవలయునని గలదు. ఇట్లు కార్యాకారణముల కనన్యత్వముండుటతో తన కామమే కార్యరూపమైన సంతానము గావున కామమునే పుత్రుడనుట యొప్పుచున్నది.

శ్రుతి॥ ౧౨ అంగాదంగాత్సంభవసి హృదయాదభిజాయతే
ఆత్మావై పుత్రనామాసిత్వం జీవశరదాంశతం

తా॥ నా సర్వాంగ సారము (రసము) అనగా వీర్యము (శుక్లము) చే నీవు జనించితివి. నా హృదయమువలన (కామముచే) నీవు బుట్టితివి. నిశ్చయముగ నాయాత్మయే పుత్రరూపమున నీవే యగుచున్నావు గాన నీవు శత సంవత్సరములు జీవింపుము. మరియు ఐతరేయోపనిషదందు తానే భార్యయందు పుత్రరూపమున బుట్టుట వలన తన రెండోజన్మ పుత్రుడగునని చెప్పనైనది. గావుననే భార్యకు జాయా శబ్దము పర్యాయ వాచకము గలదు. పై కారణముల వలన కామమనిన సంతానమనిన నొకే యర్థమగుట సిద్ధము. 4 ఆవరణ విక్షేపశక్తులుగల మాయచే (అజ్ఞానముచే) పురుడు కర్త, భోక్త యనబడుచున్నాడేగాని వాస్తవమున వాడసంగుడే యనబడును. త్రివర్గములను (ధర్మార్థ కామములను) ప్రతి దినమనుభవించుచు తానెప్పుడు విరక్తుడగునో యప్పుడు వానిని నిరసించి తప్పించు

కొనుటకు ప్రయత్నము జేయును. దీనినే మోక్షేచ్ఛయందురు. తన ఇచ్ఛానుసారముగ శ్రవణాదులచే దుఃఖముల నాత్యంతిక వినాశ మొనర్చుటయందు సమర్థుడైన నిర్విశేషానందరూపమైన మోక్షముం భించును. చతుర్విధపురుషార్థములలో ధర్మమే ప్రధానమైనందున నీ విచారము ధర్మమునుండి ప్రారంభింపబడుచున్నది. ధర్మమునకు వేదమే మూలకారణము. ఆవైదిక ధర్మము సంస్కార ప్రధానమైనది. ద్విజులకు ఉపనయన సంస్కారము జరుగకున్న యెడల వేదాధ్యయనాధికారము లుండదు. అట్టి సంస్కారములు నలుబది యెనిమిది గలవు. అవి గర్భాధానము మొదలుకొని చెప్పినట్లు జేయదగినవి. వానిని శాస్త్రీయముగ నాచరింపుటే ధర్మము. కావున తల్లిగర్భాధానమునుండియే పుత్రుని సంస్కారము లారంభమగుచున్నవి. పితృ పుత్రాదులకు కార్యకారణభావ సంబంధమున్నందునను, తండ్రి అధ్యయన మొనరించిన వాడైనందునను, దల్లి గర్భాధానాది సంస్కారములను పుత్ర ప్రతినిధి న్యాయమున తండ్రి ఆచరించుట యొప్పుచున్నది. చతుర్విధ పురుషార్థములందలి మొదటి మూడింటిని త్రివర్గములందురు.

# త్రి వర్గ ము లు

25. ధర్మార్థకామములు పరస్పరాత్యంతవిరుద్ధ స్వభావములు గలవి. వాని నొక పురుషుడనుష్ఠింపలేడు. కావున నవి పురుషార్థములేగాజాలవు. ఎట్లనగా.

1. కేవలధర్మాసక్తి యుండినచో అర్థకామములు సిద్ధించనేరవు.

2. అర్థార్జనాసక్తియే యుండిన ధర్మకామముల నడుపలేడు. కేవల కామియేయైన ధర్మార్థములు నశించునుగాన త్రివర్గములకొంతయే కుదురదని కొందరు శంకింతురు. ఇట్టి శంకగలుగుట సత్యమే! పూర్వమే ఇట్టి శంక జేయబడినది.

శ్లో॥ 9 ధర్మశ్చార్థశ్చ కామశ్చ పరస్పర విరోధినః ।
ఏషాం నిత్య విరుద్ధానాం కథమేకత్ర సంగమః ॥ మహాభార. అ.

తా॥ త్రివర్గములైన ధర్మార్థ కామములు పరస్పర విరోధములు గలవి. ఆ నిత్య విరుద్ధములైనవి యొకచోట నుండుటెట్లు ? దీనికి సమాధానము :—

శ్లో॥ 10 యదాధర్మ స్వభార్యాచ పరస్పర వశానుగా ।
తదా ధర్మార్థ కామానాం త్రయాణామపి సంగమః ॥

తా॥ ఎప్పుడు భార్య ధర్మమున కనుకూలురాలగునో అప్పుడే ధర్మార్థ కామములకే కత్రిత సంగమమగునని యతుడడిగిన ప్రశ్నకు ధర్మరాజు పై విధముగ సమాధానమొసంగెను. అదియె ఇచ్చట సమాధానమగును. 26. ధర్మమను పురుషునికి అర్థమను భార్య పరస్పరానుకూలముగ నుండెనేని కామమను సంతానము సిద్ధించును. భార్యయందే తన కామమును పూర్తి జేసికొను పురుషుడు స్వధర్మాచరణమున మన్మథుని గెలుచును. స్వభార్య యందలి కామము అధర్మము గాజాలదు. "ధర్మా విరుద్ధో భూతేషు కామోస్మి భరతర్షభ ॥ " గీత ". ఇట్లు శ్రీకృష్ణు డర్జునుని గురించి గీత యందుపదేశించెను. అర్థమనిన లక్ష్మియేగాన కాముడు (మన్మథుడు) లక్ష్మి పుత్రుడగుటచే అతనిని స్వాధీనపరుచుకొనినయెడల తల్లియగులక్ష్మి పుత్రి ప్రేమచే పురుషుని ఇంటిలో నివసించును. ధర్మార్థ కామములేకత్రి యుండునని భావము.

శ్రుతిః ౧౩ "అపః సృజంతు స్నిగ్ధాని చిక్లీతవసమేగృహే ।
నిచదేవీం మాతరం శ్రియం వాసయమేకులే"

లక్ష్మిసూక్తి ఋ 12

తా॥ అప్పులారా మీరు స్నిగ్ధమును (స్నేహమును) అనగా ప్రేమను లేదా హర్షమును (ఆనందమును) నాకు గలిగింపుడు. ఓయి మనోజా (కామా) నీవు నా యింటనుండుము (ధర్మమునందు నివసింపుము) అనగా స్వభార్యయందే నాకు కామము జనించుగాత ! నీ స్వమాతయగు లక్ష్మిని

(భార్యను లేక అర్థమును) నా కులమునందు (ఇంటియందు) నివసింప జేయుము.

2 లేగను గట్టియుంచిన యింటికెట్లు దానిపై వాత్సల్యతగల యావు తనంతటతానే వచ్చియుండునో యట్లే మన్మథుడు వశుడైనట్టి యాస్వధర్మాచరణుడగు పురుషునింటికి కామ మాతయగు లక్ష్మి (అర్థము) జేరును. మరియు ననుకూలముగ నివసించి యుండును. ఈ విధముగ త్రివర్గములను పురుషార్థము లనజెల్లును.

27. బ్రహ్మచర్యాద్యాశ్రమత్రయనిష్ఠుడై—త్రివర్గముల ననుభవించియు యనుభవింపకయే గాని విరక్తి గలిగినచో సన్న్యసింపవచ్చును. కావున మోక్షము నాలుగవ పురుషార్థము.

## ధర్మశబ్దార్థము

28. ధాఞ్ = ధారణ పోషణార్థములనిచ్చు ధాతువగాన ధాత్వర్థముచే ధరించు, పోషించునవి ధర్మములనబడును. లక్ష్యార్థమున పరబ్రహ్మను, వాచ్యార్థమున కార్యబ్రహ్మను (వేదమును) తెలియజేయుచున్నవి. ఎట్లన "వేదో ధర్మమూల"మ్మను గౌతమ ధర్మసూత్రములందాదిమ సూత్రము గలదు. వేదముఅనుటతో వాచ్యార్థమున వేదపురుషుడు (వాఙ్మయబ్రహ్మ) అతడే లక్ష్యార్థమున పరబ్రహ్మయని చెప్పబడుచున్నది. "శాస్త్రయోనిత్వాత్" అనెడి బ్రహ్మసూత్రమున—ఋగ్వేదాది వేద చతుష్టయమునకు కారణము పరబ్రహ్మయని సిద్ధాంతీకరించబడినది. అనగాధర్మము పరబ్రహ్మస్వరూపము అతనిచే గలిగిన వేదములు ధర్మోపదేశమును గావించుటచే వానికి వాఙ్మయబ్రహ్మ—కార్యబ్రహ్మయని వాచక వాచ్యార్థములనుట సమకూరును. వేదములందే కర్తవ్యాకర్తవ్య, సకల ధర్మములుపదేశింపబడినందున నవి ధర్మములనబడును. పరబ్రహ్మ నిత్యుడు, సనాతనుడును. అతనిని బోధించు వేదములు సనాతములు, సత్యములు. ప్రత్యక్షాది షట్ప్రమాణములలో శబ్దమొక ప్రమాణము. తార్కికుల మతమున హితమును

బోధించు ఆప్త వాక్యము ప్రమాణము. అట్లే శ్రుతులును, శ్రోత్రుహితైషిణులగుటచే ఆప్తవాక్యములే కావున వానిని శబ్దప్రమాణము లనుట నిర్వివాదము.

29. కేవలాప్త వాక్యములు పురుష మతి జన్యంబులగుటచే నవి పౌరుషేయములనబడునుగాని వేదములు అట్లొకానొక బుద్ధిమంతుడగు మహాపురుషునిచే చెప్పబడియుండ వచ్చుననుట కేవప్రమాణోపలబ్ధిలేనందున నవి పౌరుషేయములు గాజాలవు. ఒకవేళ వాక్యత్వావిశేషమున వేదవాక్యములు గూడను వాక్యములేగావున కావ్యాది వాక్యతుల్యములైనందున పౌరుషేయములని అనిత్యములని యనుమాన ప్రమాణమున శంకించినచో ఆ ప్రమాణమునకు సత్ప్రతి పక్షరూప ప్రతిబంధకముగలదు. మరియు "యస్యనిశ్వసితమేవం ఋగ్వేదోయజుర్వేద స్సామవేద" మను ప్రబల శ్రుతి ప్రమాణము గలదు. ఇట్టి శ్రుత్యనుపలబ్ధి రూపములైన రెండు ప్రమాణములున్నందున కేవలానుమాన ప్రమాణముచే వేదములకు పౌరుషేయత్వానిత్యత్వములు సిద్ధింప నేరవు. పౌరుషేయ వాక్యములు పురుష కర్తృత్వమును దెలియజేయునట్లు వేదములును పరబ్రహ్మ కారణమాత్ర కర్తృత్వమును దెలియ జేయును. కావున వేదములు అపౌరుషేయములు.

## పురుష శబ్దార్థము

30. "పురిశయనాద్వాపూర్ణాద్వాపురుషః" ఈ నిర్వచనముచే లక్ష్యార్థమున పరబ్రహ్మ యని స్పష్టమగుచున్నది. పురుష శబ్దమునకు ఇతరార్థములనేక వాక్యమిట్లుగలదు:— "శరీరపురుషోఛందః పురుషో వేద పురుషో మహాపురుష ఇతి" ఈ వాక్యమునందలి పురుషశబ్దమున కనేకార్థములు తెలియబడుచున్నవి.

ఉదాహరణగా శరీర మనగ స్థూల సూక్ష్మకారణ శరీరత్రయములైనందున వానియందు పురుషశబ్దమును ప్రయోగింపుట మిథ్యార్థ మనబడును. ఛందస్సనగ నాహ్లాదార్థముగలదు. ఆహ్లాదము (హర్షము) మనోవికారమైన వృత్తిచే ఛందస్సనగా మనస్సని భావమేర్పడును. మనోవృత్తిప్రాణము

నందేల యమగుటతో వృత్తివృత్తి మతయోరభేద మను న్యాయమున మనః ప్రాణములు రెండును సూక్ష్మ శరీర ధర్మములు స్థూలశరీరమన్న మయకోశమగునట్లు అవియు కోశధర్మములే యగును. కావున శరీర, ఛందస్సులకు పురుష శబ్దార్థములు, మిథ్యార్థములు. విత్ జ్ఞానేయను ధాత్వర్థమున సమష్టి బుధ్యాత్మకుడైన కార్యబ్రహ్మను వేద పురుషుడు, వాఙ్మయ బ్రహ్మయని జెప్పుదురు. అతడే విజ్ఞానమయకోశాభిమానిగాన వేదపురుషుడనబడును. అతనికే "వేదము", ప్రథమశరీరి, కార్యబ్రహ్మ, సమష్టి బుధ్యాత్మకుడు, ఇత్యాది నామములు గలవు.

శ్లో॥ 11 సవైశరీరీ ప్రథమః సవైపురుషఉచ్యతే ।
ఆదికర్తా సభూతానాం బ్రహ్మగ్రేసమవర్తత ॥

తా॥ మహచ్ఛబ్దమునవచ్చిన్నాతుర్దార్థములనిచ్చును. అట్టిదే యానందమునగల మహాత్మ్యము. అదేయానందమయ కోశమునకు గలదు. విజ్ఞానమయానందమయకోశామాభినులిద్దరు, క్రమమున, కర్తృత్వ భోక్తృత్వాద్యభిమానులైనందున జీవులే. వారికి క్రమమున వేదపురుష మహాపురుష నామములు గలిగినవి. "మయట్" వికారార్థమైనందున ఆనందమయకోశమునకు ప్రియశిరత్వాదులు ఉపన్యసించియున్నందున ఆనందమయుడు జీవుడే యనబడును. బోధాయనులు "మయట్" ధాతువునకు ప్రాచుర్యార్థముచే ఆనందమయుడు ముఖ్యబ్రహ్మయగునని చెప్పిరి. కాని శ్రీశంకరభగవత్పాదులు ఆనందాధి కరణమునందు ద్వితీయవర్ణకాంతరమున "బ్రహ్మపుచ్ఛంప్రతిష్ఠే"త్యాది శ్రుతిబలముచే ముఖ్యబ్రహ్మ ఆనందమయుడు గాజాలడు. పుచ్ఛాగ్రమునందు ప్రతిష్ఠింపబడినవాడే శుద్ధపరబ్రహ్మయగునని చెప్పిరి. ఇచ్చట పుచ్ఛశబ్ద మూధారార్థమగును గాని యవయవార్థ మిచ్చుటలేదు, బ్రహ్మ తన మహిమయందు ఆధారాధిష్ఠానమునగలడు. కావున పురుషశబ్దమునకు లక్ష్యార్థము పరబ్రహ్మయని తాత్పర్యము. ప్రమాణములుగలవు:—

శ్లో॥ 12 తమః ప్రధాన క్షేత్రాణాం చిత్ప్రధాన చిదాత్మనాం
పరః కారణతామేతి భావనా జ్ఞాన కర్మభిః ॥

తా॥ తమోగుణ జన్యంబులైన శరీరత్రయమునకును, చిద్బింబులకును, పరబ్రహ్మయే కారణమని జ్ఞానకర్మలచే దెలియుచున్నది.

శ్లో॥ 13 అన్న ప్రాణ మనోమయైః ప్రబోధ పరమానందైః
శిరః పక్షయుగ్ । పుచ్ఛాత్మ ప్రకమైర్మహోపని
షదాంపాక్యైః ప్రసిద్ధీ కృతైర్యత్ । కోశైః పంచభిరేవ మేవ
భవతీమేతత్ప్రలీనాపితి జ్యోతిః ప్రజ్వలదుజ్వలా
త్మచపలాంయోవేద సబ్రహ్మవిత్ ॥

తా॥ అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయానందమయ కోశములకు శిరః పక్షాదులు జెప్పబడినందున నవి ముఖ్యాత్మలు గానేరవని మహోపనిషత్తున గలదు. పుచ్ఛాగ్రమునందుగల దానినే ముఖ్యాత్మయగు నని జెప్పినది. ఈ విధముననుండినను పంచకోశములయందాయా రూపమున పరమాత్మ గలదు. ఇట్లు గూఢమున వర్తించుచు స్వయం ప్రకాశరూపమున ఆ యాత్మల కాత్మయై వర్తించునట్టి ఉత్తమజ్యోతి స్వరూపాత్మ నెవరు దెలిసికొనెదరో వారే పరబ్రహ్మవేత్తలగుదురు.

పై యుపన్యాస రీత్యా విజ్ఞానమయ కోశాభిమాని వేదపురుషుడని, ఆనందమయ కోశాభిమాని అంతర్యామి మహాపురుషుడని, పుచ్ఛాగ్రమందు గలవాడు పరమపురుషుడని తాత్పర్యము.

31. వేదము లపౌరుషేయములని సిద్ధించినను అవి సర్వజ్ఞుడైన ఈశ్వరు నిచే జనింపజాలవు. వాని నీశ్వరబుద్ధిపూర్వక జన్యంబులందురా ? లేక అబుద్ధిపూర్వక జన్యంబులగునందురా ? బుద్ధిపూర్వక జన్యపక్షము నంగీక రించగ నస్మదాదిపురుషప్రయత్నరూప బుద్ధిపూర్వకజన్యంబులైన కావ్యాది గ్రంథములవలె నసత్యములగుచుండును. రెండవపక్షమునందు మత్తోన్మత్త ప్రలా పిత తుల్యములగుచు నవి, యదార్థమును దెలియజేయజాలనందున విజ్ఞాన మును గలిగింపలేవు. మరియు నీశ్వరుడు సర్వజ్ఞత లేనివాడగునని ఉభయ విధదోష ప్రసక్తిన జేయుచు శంకించెదరు. కానియది సిద్ధించనేరదు.

1. పురుషప్రయత్నరూప ప్రమాణాంతర సాధన సాపేక్షగల బుద్ధి పూర్వక జన్యంబులైనవి అస్మదాది వినిర్మిత కావ్యాదులగునుగాని, వేదము

లట్లు ఈశ్వరుని ప్రయత్నరూప, ప్రమాణాంతర సాధనములగు సాపేక్ష జన్యంబులు గాజాలవు. అతనికి ప్రమాణాంతర సాధన సాపేక్షత లేదు. సర్వజ్ఞుడగు నీశ్వర నిశ్వాసరూపముగ ననాయాసజన్యంబు లైనవి వేదములు. ఇందు "యస్యనిశ్వసితమేవంబుగ్వే" దేత్యాది శ్రుతులే ప్రమాణములు. ఈశ్వరప్రయత్నరూప సాధనాంతర నిరపేక్షతను జాటుచున్నవి మరియు శబ్దార్థములకు నిత్య సంబంధము గలదు. వేదార్థమే పరబ్రహ్మ. అతడు నిత్యుడు, తదర్థః ప్రతిపాదక వాచకము లైనందున వేదములు నిత్యములు. శబ్దార్థములకు నిత్యసంబంధము గలదని కాళిదాస మహాకవి నుడివెను.

శ్లో॥ 14 వాగర్థావివసంపృక్తౌ వాగర్థః ప్రతిపత్తయె ।
జగతః పితరౌవందే పార్వతీ పరమేశ్వరౌ ॥ రఘువంశం

తా॥ వాక్యార్థము గోచరించుటకుగాను శబ్దార్థములు పరస్పరైక్యమైనట్లు ఏక శరీరులైన, ప్రపంచమునకు తలిదండ్రులైన, పార్వతీ పరమేశ్వరులకు సమస్కరించెదను.

32. వేదవాక్యములు విమర్శరూపములు (వాచకములు) జ్ఞానమే, ప్రకాశరూపమనగ శబ్దార్థము. కావున వేదములు విమర్శరూపము లవి లేకుండినచో ప్రకాశాత్మకమైన తదర్థ జ్ఞానము గోచరించదు. ప్రకాశమైన శబ్దార్థము గోచరింపకుండినచో దేనిని గురించి విమర్శరూపకములైన వాచకములు జెప్పబడును? ఇట్లు విమర్శ విస్ఫూర్తియగుటకు ప్రకాశరూప అర్థ సాపేక్షగలదు. ప్రకాశరూపమైన జ్ఞానమునకు విమర్శరూప శబ్దసాపేక్షగలదు. దీనికి ప్రమాణము :—

శ్లో॥ 15 వాచకేన విమర్శేన వినాకింవా ప్రకాశతే ।
వాచ్యేనాపి ప్రకాశేన వినాకింవా విమృశ్యతే ।
తస్మాద్విమర్శ విస్ఫూర్తౌ ప్రకాశం సమపేక్షతే ।
ప్రకాశ్చాత్మనో జ్ఞానే విమర్శం సమపేక్షతె ॥ లలిత బా. పె. 122

తా॥ శబ్దార్థములకు నిత్యసంబంధము గలదని తాత్పర్యము. ఒకవేళ వర్ణములు, ఉత్పత్తిస్థానములనుండి వెలువడుటవలన యుత్పన్న ప్రధ్వంసము

లగుటతో అనిత్యము లెట్లగుబడునో, యట్లే వేదవాక్యము లగూడను వర్ణ రూపములగునందున ననిత్యములుగా వచ్చుననినయెడల, వర్ణములనిత్యము లైనను, వానికి ఆకృతి నిత్యత్వము గలదు. గవాదివ్యక్తు లనిత్యములైనను గోత్వజాతి కెట్లు నిత్యత్వముండునో, యట్లే వర్ణములకు ఆకృతి నిత్యత్వ ముండును. కావుననే మహాప్రళయాలందు సహితము వేదములాకృతి నిత్యత్వముగనుండి పునః సృష్టికాలమేర్పడినప్పుడు పరబ్రహ్మ నిశ్వాసరూపమున ననాయాసముగనే మరల వ్యక్తమగుచుండును. పై కారణముల వలన వేదములు నిత్యములై నిత్య పరబ్రహ్మ ప్రతిపాదనయందు ప్రమాణము లగుచున్నవి. దీనిచే ఈశ్వరాబుద్ధిపూర్వక జన్యములు వేదములగునను ద్వితీయ శంక నిరాకరించబడినది. అనగా ఈశ్వరుని సృష్టవ్య జ్ఞానముచే (బుద్ధిపూర్వకముగ) వేదములు జనించెనని యొప్పినందున మత్తోన్మత్త ప్రలాపిత తుల్యములు వేదములుగానేరవు. సర్వజ్ఞుడైన ఈశ్వరునితపస్సుచే (జ్ఞానముచే) అనాయాసముగా యతని నిశ్వాసరూపమున వేదములుజనించె ననుటకు మరొక శృతి జెప్పిన ప్రమాణము గలదు.

శృతి॥ ౧౪ "సతపస్తప్త్వా ఇదగ్ం సర్వమ సృజత"
"యస్య జ్ఞానమయం తపః" తై. ఆనందవల్లి.

ఒకవేళ వేదమునకు నిత్యత్వము పరబ్రహ్మకు నిత్యత్వము నొప్పినందున అద్వైత సిద్ధాంతమునకు హానిగలిగించునట్టి సద్వితీయత్వ మేర్పడుననినచో సిద్ధాంత మతమునందు కేవల పరబ్రహ్మ కారణరహితుడనుచు యొప్పబడి నాడెగాని వేదములనట్లు కారణ రహితములని యొప్పుకొనబడలేదు. ఇంతియెగాక విపరబ్రహ్మ కారణ జన్యంబులని పైన జెప్పబడినది. కావున వేదములు పరబ్రహ్మ కారణజన్యంబులైనను ఆకృతి నిత్యత్వమున నవి పరబ్రహ్మయందు నిత్యముగ నుండవచ్చును.

శృతి॥ ౧౫ "సకారణాధిపాధి పోనకశ్చిజ్జవితానిచాధిపః" శ్వేతా ।

తా॥ సర్వమునకు కారణమగు పరబ్రహ్మకు ఏకారణములేదని శ్రుతియే ప్రమాణము "యస్యనిశ్వసిత మేవం ఋగ్వేద" ఇత్యాదులే వేదములు ఈశ్వర కర్తృజన్యంబులని చెప్పుచున్నవి, కావున పరబ్రహ్మ అద్వితీయుడు.

40. సత్యజ్ఞానానంతాదులు స్వరూపలక్షణములైనను ఆత్మయందు అబాధితనిత్యత్వముననున్నట్లు వేదములు పరమాత్మయందు, ఆకృతి నిత్యత్వముననుండును. పునఃసృష్టికాలమేర్పడినప్పుడు ఈశ్వరుని సంకల్పమాత్ర తపస్సుచే అనాయాసముగనే నిశ్వాసరూపమున మరల చతుర్ముఖబ్రహ్మకు వ్యక్తమగును. అతడు మహర్షులకును, మన్వాదులకును ఉపదేశించును. వారు లోకులకు నుపదేశింతురు. పైయుపన్యాసరీత్యా వేదములు అపౌరుషేయములు నిత్యములు స్వతః ప్రమాణములని సిద్ధాంతము. దీనిచే వీరేశలింగం పంతులుగారి విరచిత ఈశ్వరదత్తమను గ్రంథమునందలి విరుద్ధోపన్యాసము పరాస్తము.

# వేదశబ్దార్థము

41. వేద సత్తాయాం, విద్=జ్ఞానే అను రెండర్థములు వేదశబ్దమునకు ధాత్వర్థములు ఈ రెండును లక్ష్యార్థమున పరబ్రహ్మను దెలుపును. 1 సత్త యనగ నది త్రికాలాబాధిత నిత్యసన్మాత్రమునందే ముఖ్యార్థము 2. జ్ఞాన పదము వస్త్వంతరమునందు భేదమునొందక త్రికాలాబాధితమగుచు, త్రివిధ పరిచ్ఛేద రహితమైన భావపదార్థమునందు ముఖ్యార్థ మిచ్చుచున్నది. ఇట్లు సత్, జ్ఞానములు రెండును లక్ష్యార్థముచే పరబ్రహ్మను దెలియజేయుచున్నవి. ఒకవేళ జ్ఞాయతే=స్ఫోర్యతేయనుధాత్వర్థమును జ్ఞాన శబ్దమునకు జెప్పవచ్చునుగదా ఏదోషము లక్ష్యార్థమునందగునని శంకించినచో క్రియకర్త్రధీనమైనందునకర్తయాక్రియను జేయవచ్చును, జేయకపోవచ్చును. దానిని వేరు విధమున జేయవచ్చును. గాని వస్తుజ్ఞానముక్రియవలె జ్ఞాత్ర ధీనము గాజాలదు. జ్ఞాతకది దెలిసినను దెలియక బోయినను నది వేఱువిధమున దెలిసినను వస్తుజ్ఞానము వస్తువునందే నియమముగ నుండును.

**ఉదాహరణ:** స్థాణువు (మోటు) జ్ఞాతకు దెలిసినను దెలియకున్నను అది స్థాణువేయై యుండును. స్థాణువును పురుషుడగునని తెలిసికున్నచో నది యథార్థజ్ఞానము గాజాలదు. కావున జ్ఞానము క్రియ గాజాలదు. జ్ఞాతృ

జ్ఞానముచే జ్ఞాతకెట్లు దెలియబడుచుండును? అదే జ్ఞానముచే దెలియబడు నన్న చో కర్తృకర్మ విరోధమను దోషము సంభవించును. మఱియొక జ్ఞానముచే తెలియుననిన ఆ జ్ఞాతృజ్ఞానమును దెలియుటకు మఱియొక జ్ఞానము దానికి వేరొకటి గావలసివచ్చిన అనవస్థా దోషమేర్పడును. ఇదే

విధముగ. జ్ఞేయముజ్ఞాన సాధనచే దెలియబడుననినచో జ్ఞాతృజ్ఞానమున కంటెను జ్ఞేయ మల్పమనబడును. అప్పుడు "యదల్పంతన్మర్త్యం" యను శ్రుతికి విరోధముగాన ఆత్మ (జ్ఞేయము) కిం్రియార్థమునిచ్చు జ్ఞానముచే దెలియ బడదు. ఇందు ప్రమాణము.

శ్రుతి॥ ౧౨ "యది మన్యసేసు వేదేతి దహరమేవాపినూనం త్వంవేత్థ బ్రిహ్మణో రూపం యదస్యత్వం యదస్వదే వేష్వథను మీమాగ్స్యం మేవమన్యే విదితం''. కే. ఖ. 2 మ.

తా॥ గురువు శిష్యబుద్ధి చాలనార్థము ప్రశ్నించగ, శిష్యుడు గురువులు బోధించిన, బ్రహ్మనాచే దెలియబడినాడని జెప్పెను. అందులకై శిష్యునితో పై మంత్రమునందు గురువు నుడివినట్లు శ్రుతి స్వయముగ నిట్లు జెప్పినది. ఒకవేళ నీవు బ్రహ్మ (జ్ఞేయము) నాచే దెలియబడినాడంటి వేని! అప్పుడా విషయము నీచే దెలియబడలేదందును. నే దెలిసికొంటిననిన బ్రహ్మ నీచేనెట్లు దెలియబడజాలడో యక్లే దేవతలకు సహితము తమచే దెలియబడినదనిన యెడల సంశయమే గలదందును.

ఇట్లుండబట్టియే తైత్తిరీయానందవల్లి యందు "యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ" యనుచు జెప్పి శ్రుతిజ్ఞేయము (బ్రహ్మ) మనసాదీంద్రియముల కగోచరమని నిషేధించినది.

శ్లో॥ 16 జ్ఞేయంయత్తత్ప్ర వక్ష్యామి యద్జ్ఞాత్వామృత మశ్నుతే।
అనాది మత్ప। రంబ్రహ్మనసత్తన్నా సదుచ్యతే గీ. అ. 13 శ్లో 12

తా॥ ఆత్మసదసద్వి లక్షణ మైనదని యర్థము.

34. సదసచ్ఛబ్దములను సాపేక్షిత సత్యత్వనామరూపాది వస్తువులను గురించి ప్రియోగింతురు. ఆనామరూపాదులు వికారములైనందున, నన్నృతము లైనందున, బ్రిహ్మావానిచే జ్ఞేయముగాదు. సన్మాత్రుడగు బ్రహ్మ వృత్తిజ్ఞానమునందు విజ్ఞప్తుడగునేగాని క్రియార్థమునిచ్చు జ్ఞానముచే దెలియ బడడని యర్థము.

శ్రుతి॥ ౧౬ యస్యామతం మతంతస్య । మతంయస్యనవేధసః ।
అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతాం.

తా॥ యెవరి అమతం (జ్ఞానమనిశ్చితమో) యతని జ్ఞానమే నిశ్చితమైనది. దీనికి విరుద్ధముగ నెవరి మతం (జ్ఞానము) నిశ్చితమో యతనికి దెలియలేదు. అనగా జ్ఞేయము దెలియ బడినదన్న వారలకు దెలియలేదు. జ్ఞేయము దెలియబడనిదని తెలిసిన వారలకు దెలియునని తాత్పర్యము. ఇదే నిశ్చయార్థమైనచో బ్రహ్మవిదునకును, గోపాలునకును (అజ్ఞానికిని) ఎట్టి భేదముండదను శంకగలుగును. కాని శ్రుత్యర్థమన్నృత మగుననియు జెప్పరాదు. శ్రుతి స్వప్రామాణ్యకమైనందున విశేషము గలదు. ఎట్లనగా! ఇషుకారుడు (విలువిద్యాభ్యాసి) లక్ష్య వేధజేయదలచినప్పుడెట్లు అతనికి తన లక్ష్యేతరము గనుపించదో అప్పుడేవాడు లక్ష్యవేధ జేయజాలును. లక్ష్యేతరము గనుపించె నేని లక్ష్యము వీడినందున లక్ష్యవేధ జేయజాలడు. అదే విధమున బ్రహ్మవిదునికి లక్ష్య బ్రిహ్మా కారాకారిత జ్ఞానము దప్ప బ్రహ్మేతరమైన నామరూపాది వికార జాతజ్ఞానము లేనిదైనచో ఆతని "మతం" (జ్ఞానము) సమ్యజ్ఞానమగును. దీనికి విరుద్ధముగ నెవరికి లక్ష్యేతరమైన నామరూపాది వికార జాతజ్ఞానముచే బ్రిహ్మాజ్ఞేయమని నిశ్చయమైనదో వారికి లక్ష్యబ్రహ్మ దెలియలేదని తాత్పర్యము. అనగా బ్రహ్మ హేయోపాదే యవర్జితమని యర్థము ఇందు.

శ్రుతి॥ ౧౭ "తత్కేనకంపశ్యేత్" "విజ్ఞాతారంవారెకేన విజానీయాత్"బృ. అ. 2. బ్రా 4.14 ఇత్యాదులు ప్రమాణములు.

తా॥ ఎవరి నిశ్చయమందు ఆత్మేతరము లేదో యంతయు ఆత్మగాయగు పడుచున్నదో వారలు అప్పుడు దేనితో దేనిని జూతురు? దేనిని దెలిసి కొనెదరు? సర్వమును దెలిసికొను దానిని తానెట్లు దెలిసికొనగలడు? ద్వైతజ్ఞానమునందే యొకడు మరొక దానిని (తనకంటెను వేరగు దానిని) దెలిసికొనగలడేగాని, జ్ఞాత (తనే) సమస్తమును దెలిసికొనువాడగుటచే యనకు (జ్ఞాతృజ్ఞానమునకు) జ్ఞానాంతర సాపేక్ష లేనందున ఆత్మ (బ్రహ్మ) సాధనాంతర సాపేక్ష రహితుడని యర్థము గాన తాను (ఆత్మ) స్వయంప్రకాశ మాన స్వభావుడని సిద్ధము.

35. ఆత్మ విక్రియముగానందుననే క్రియార్థమునిచ్చు జ్ఞానము నిరర్థక మగుచున్నది. "అవి కార్యోయముచ్యతే" గీత ప్రమాణము కావున క్రియార్థమునిచ్చు జ్ఞానముచే అద్వితీయాత్మ దెలియజాలదు. ఇట్లుండ బట్టియే నిత్యవిజ్ఞప్తి స్వభావుడు, స్వయం ప్రకాశమానుడైనందున, ఆత్మ యందు భూతార్థమునిచ్చు జ్ఞప్తిజ్ఞానముపపన్నమగునేగాని యది క్రియార్థ మనిగాని విధిశేషమనిగాని, నియోగమగుననిగాని, జెప్పశక్యము గాజాలదు. పై యుపన్యాసానుసారమున వేదమనగ లక్ష్యార్థముచే పరబ్రహ్మ యనియు, వాచ్యార్థమున కార్యబ్రహ్మయని (వాఙ్మయ బ్రహ్మయని) యర్థము. లక్షణయాబుగాది మంత్రముల ననవచ్చును. అనగా చతుర్వేద ములకు సహితము వేదశబ్దము ప్రయోగించబడుచున్నది.

36. మహామాయియైన నా శబలిత బ్రహ్మయే సకల చరాచరములకు బీజమని భగవద్గీత చెప్పుచున్నది.

శ్లో॥ 17 మమయోనిర్మహద్బ్రహ్మ। తస్మిన్గర్భందధామ్యహం.
సంభవ స్సర్వభూతానాం। తతోభవతిభారత. గీ. అ. 14 శ్లో. 13.

తా॥ అర్జునా! త్రిగుణాత్మికయైన నాయాత్మ శక్తియే మాయ. అట్టి మాయవలన బుట్టిన ఉపాదాన కారణమగు మహద్రూప బ్రహ్మయందు నేను గర్భమును ధరింతును. ఆ మహామాయియైన శబలిత బ్రహ్మయే సమస్తమునకు కారణము. అతడే సర్వజ్ఞుడు, సర్వశక్తియుతుడు, "సర్వకర్మ

స్సర్వకామః, సర్వరసః, సర్వగంధః'' ఇత్యాదిశ్రుతుల తనిని బొగడుచున్నవి. అతడే తన నిశ్వాసరూపమున వేదములను సృజించినాడు. వేదకర్తృత్వ మతనికి యున్నందున సర్వజ్ఞత్వము సిద్ధించినది.

37. వేదము సంహిత బ్రాహ్మణమను చుద్వివిధము. సంహిత మంత్ర రూపము మంత్రములందు ద్రవ్యమునుగాని, దేవతనుగాని లేక ఉభయ ములుగాని బేర్కొనబడును. క్రియార్థముచే వేదమామ్నాయము. అందు వర్ణాశ్రమాచార రూపధర్మోపదేశములు గలవు. ఆ సనాతన ధర్మములందు యజ్ఞదాన తపస్సులు ముఖ్య ధర్మములు. వాని యాచరణ వలన చిత్త శుద్ధి గలుగగ క్రమేణ జ్ఞానోత్పత్తి ద్వారా మోక్షము నొందును. వేదమునందు కర్మలకు ప్రత్యేక ఫలములు గలవు. కర్మలకు ప్రత్యేకఫలములు విధించుట వానియందు కర్తకు రుచి బుట్టించుటకని దెలియుచున్నది. భోగ లోలుపులు సకామనయా జేసిన నవి స్వర్గాది ఫలములనిచ్చును. గాని అవి యనిత్యములైనందున ఉపభోగముచే క్షయించి మరల జనించుటకు కారణమగును కావున.

భోగలోలుపులై సకామనగనైన వైదిక ధర్మాచరణ జేసిరేని వారికి కాలాంతరమున క్రమేణ భోగములందు విరక్తి గలుగగలదు. పరమేశ్వరుడు కార్యబ్రహ్మ ద్వారా ప్రజలకు సనాతన ధర్మోపదేశమును జేయుటకు వేదములను తన నిశ్వాసరూపమున జనింపజేసి యతనికిచ్చెను.

శ్రుతి॥ ౧౮ "యోబ్రహ్మాణం విదధాతిపూర్వం । యోవై
వేదాంశ్చప్రహిణోతితస్మై। తంహోదేవమాత్మ
బుద్ధిః ప్రకాశకః ముముక్షుర్వై శ్శరణమహంప్రపద్యే"

తా॥ కార్యబ్రహ్మ నెవ్వడు ప్రథమ శరీరిగా బుట్టించెనో ఎవ్వడతని కొఱకై వేదములను సృజించెనో ఆయాత్మ బుద్ధి ప్రకాశకుడైనట్టి దేవుని నేను శరణు వేడెదను.

38. కార్యబ్రహ్మ పరమేశ్వరాను గ్రహమున వేదములను బడసి వైదిక జ్ఞానమున పూర్వకల్పము నందున్న కర్మానుశాయులగు ప్రాణులను వాని కర్మ సాపేక్షచే ఈ కల్పమునందు యోగ్యతాను గుణ్యముగ సృజించెను.

శ్రుతి॥ ౧౯. "ధాతాయథా పూర్వమకల్పయ ద్దివంచపృ
థివీంచాంత రిక్షమథోస్సువః" ఋగ్‌సంహిత.

తా॥ కర్మఫలవిధాత (కార్యబ్రహ్మ) పూర్వకల్పమునందున్న ప్రకారముగా ద్యులోకము, పృధివి, అంతరిక్షము, స్వర్గము మొదలగు వానిని సృజించెను.

శ్లో॥ 18. యథర్తుష్వృతులింగాని నానారూపాణి పర్యయే ।
దృశ్యంతేతాని తాన్యేవయథా భావయుగాదిషు,

తా॥ వివిధ ఋతువులు, భావములు ముందెట్లుండెనో అదే విధముగ ప్రతి సంవత్సరమట్టి ఋతువులు, అట్టి భావములే గోచరించుచున్నవి. కావున అదేవిధముగ యుగాదులందును కల్పాదులందును అట్టి భావములే మరల గోచరించును.

39. కల్పాది యుగాదులందు తాను సృజింపబోవు పదార్థములను కార్యబ్రహ్మ స్మరించుచు వైదిక జ్ఞానమున సృజించును.

శ్రుతి॥ ౨౦. "ఏత ఇతివైః ప్రజాపతిర్దే వాన సృజతాఽ సుగ్రమితి
మనుష్యాన్నిందవితి పితౄస్తిరః పవిత్రమితిగ్రహా
నాశ్వఇతిస్తోత్రం విశ్వానితి శస్త్రమభిసౌ భగేత్యన్యాః
ప్రజాః" తై. ఆరణ్యకం

తా॥ ఎతచ్ఛబ్దము నుచ్చరించుచు ప్రజాపతి పరోక్ష ప్రియులగు దేవతలను సృజించెను. అసుపదమునకు రుధిరార్థము ప్రాణార్థమును గలవు. కాని యిచ్చట లక్షణచే స్థూలదేహమను అర్థమగును. అందు రమించునట్టి మనుష్యులను అసుగ్రమనుచు సృజించెను. ఇందు శబ్దముచే లక్షణయా చంద్రస్థానమని యర్థము అచ్చటికి కర్మఫల భోగార్థమువెళ్ళు పితరులను సృజించెను. "తిరః పవిత్ర శబ్దముల నుచ్చరించుచు గ్రహములను సృజించెను. ఋచోశ్శ్నవతాం గీతి రూపస్తోత్రాన్ (ఋఙ్మంత్రముఁజే సామమంత్రములందు వినియోగమొందును) కావున ఆశ్వశబ్దోచ్చారణ జేయుచు

ఋగాది మంత్రములను సృజించెను. విశ్వశబ్దము శస్త్రములందు ప్రయోగించెదురు కావున స్తోత్రానింతరము శస్త్రం (ఒక విధమగు ఋఙ్మంత్రము) ప్రయోగమగుటచే యాశబ్దోచ్చారణతో శస్త్రములను ప్రజారక్షణార్థము సృజించెను. అభిసౌభగ శబ్దమునకు వ్యాప్తి వస్తువాచ్యార్థము. అట్టి అభిసౌభగశబ్దమును బలుకుచు ఇతర చరాచరము నంతయు సృజించెను. శబ్దపూర్వకమైన సృష్టియనుచు శ్రుత్యర్థమును స్మృతి బలపరిచినది.

శ్లో॥ 19. అనాదినిధనానిత్యా । వాగుత్సృష్టా స్వయంభువా ।
ఆదౌ వేదమయీ దివ్యాయతః సర్వాః ప్రవృత్తయః

శ్లో॥ 20. నామరూపంచభూతానాం కర్మణాంచ ప్రవర్తనం ।
వేదశబ్దేభ్య ఏవాదౌ । నిర్మమేస మహేశ్వరః

శ్లో॥ 21. సర్వేషాంతు సనామాని । కర్మాణిచ పృథక్పృథక్ ।
వేదశబ్దేభ్యఏవాదౌ । పృథక్సంస్థాశ్చనిర్మమే

39. యథాక్రమమున పదునాలుగు లోకములు తత్తల్లోక నివాసులైన చరాచర ప్రాణులను వారల కవసరమగు యోగ్యమైన భోగ పదార్థములు తత్తల్లోక మర్యాదలు. (ధర్మములు) వాని రక్షణార్థము లోకపాలురను వారి యధికారములు దృష్టశ్రుతమైన సమస్త వస్తుజాతమునంతయు శబ్దపూర్వకముగనే శృజించి, వారికి ప్రేయశ్శ్రేయస్సాధనంబులైన శాస్త్రములను బోధించి, యవి దెలిసికొనుటకు వారికి విజ్ఞానస్వాతంత్ర్యాదుల గల్పించెను. ఆ వైదిక విజ్ఞానమును దెలుపు నొక వేదమును నాలుగు భాగములుగ విభజించి తన నాలుగు ముఖములతో వచించెనందురు. అవి. 1. ఋగ్వేదము, 2. యజుర్వేదము, 3. సామవేదము, 4. అథర్వణ వేదము. కాని యజ్ఞ కర్మలందుపయుక్తమగునవి ఋగ్యజుస్సామములు మూడు మాత్రమే. అథర్వణ వేదము యాగములం దనుపయుక్తమగుచున్నను శాంతి పౌష్టికాభిచారి కాది కర్మలందుపయోగపడుచున్నది. చతుర్వేదములకు ఉపవేదములు నాలుగుగలవు.

1. ఋగ్వేదమునకు ఉపవేదము ఆయుర్వేదము.
2. యజుర్వేదము ,, ,, ,, ధనుర్వేదము.
3. సామవేదము ,, ,, ,, గాంధర్వవేదము.
4. అథర్వణ వేదము ,, ,, ,, అర్థవేదము (అర్థశాస్త్రము.)

4. బ్రాహ్మణభాగ మెనిమిది విధములు.

1. ఇతిహాసములు, 2. పురాణములు, 3. విద్యలు, 4. ఉపనిషత్తులు, 5. శ్లోకములు, 6. సూత్రములు 7. అనువ్యాఖ్యానములు 8. వ్యాఖ్యానములు.

బ్రాహ్మణము యందుగల 1. భృగుర్వైవారుణిత్యాదు లితిహాసములు.
2. యతోవా ఇమాని భూతాని జాయంతేత్యాదులు. సర్గ ప్రతి సర్గాదు లను తెలుపునవి పురాణములు.
3. య ఏవమేతా మహాసగ్ంహితావ్యాఖ్యాతా వేదేత్యాదులు ఉపాస్య స్వరూపమును జెప్పినందున విద్యలు.
4. పరరహస్యోపనిషదిత్యాదులు ఉపనిషత్తులు.
5. తదప్యేషశ్లోకేత్యాదులు శ్లోకములు.
6. బ్రహ్మవిదాప్నోతి పరమిత్యాదులు సూత్రములు.
7. సత్యంజ్ఞానమనంతం బ్రహ్మేత్యాదులను వ్యాఖ్యానములు.
8. తస్మాద్వా ఏతస్మాత్మనః ఆకాశస్సంభూతేత్యాదులు వ్యాఖ్యానములు.

అధ్యయన ప్రవచన సౌకర్యార్థము వేదమునకు పద, క్రమ, జట, ఘన, ఇత్యాది సంధికల్పన జేయబడినది. వేదార్థజ్ఞానము యథార్థముగ దెలియుటకు షడంగముల నేర్పఱచిరి.

1 శిక్ష, 2 వ్యాకరణము, 3 నిరుక్తము, 4 చందస్సు, 5 జ్యోతిషము, 6. కల్పము.

1 పురాణము, 2. న్యాయశాస్త్రము, 3. మీమాంసాశాస్త్రము, (పూర్వోత్తరములు) 4. ధర్మ శాస్త్రము ఇట్లు వేద వేదాంగములు గలసి పదునాలుగు విద్యలగును. ఉప వేదములను వేరుగ జెప్పినప్పుడు విద్యల సంఖ్య పదునెనిమిది యగును. ఉప వేదములు వేదములందంతర్భూతము లన్నప్పుడు విద్యల సంఖ్య పదునాలుగే. ఇట్టి చతుర్దశ విద్యలు సనాతన ధర్మమును బోధించును. సనాతన ధర్మము నాచరించుట చాల సులభము. "స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతోభయాత్" అని గీతా వచనము.

## చతుర్దశ విద్యలు

శ్లో॥ 22. పురాణ న్యాయ మీమాంసా ధర్మశాస్త్రాంగమిశ్రితాః
వేదాః। స్థానానివిద్యానాం ధర్మస్యచగతుర్దశ.

శ్లో॥ 23. అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః।
పురాణం ధర్మశాస్త్రంచ విద్యాహ్యేతాశ్చతుర్దశ.

శ్లో॥ 24. ఏతత్సత్యమితశ్చాన్యత్పా ఖండం బుద్ధి కల్పితం।
దైత్యానాం మోహనార్థాయమహామోహేన నిర్మితం।
పాశబ్దేనతు వేదార్థః పాఖండా స్తస్యఖండకా:

తా॥ వేదార్థము పావనమైనందున "పా" శబ్దముచే బలుకబడుచున్నది. దానిని ఖండించువారు పాఖండులు.

శ్లో॥ 25. అష్టాదశపురాణాని వ్యాసేన కథితానితు।
అన్యాన్యుప పురాణానితచ్ఛిష్యైర్వ్యాకృతానితు
యుగేయుగేతు సర్వేషాంకర్తావై ధర్మశాస్త్రవిత్

శ్లో॥ 26. ఏవంపైతామహం ధర్మంమనుర్వ్యాసాదయః పరం।
స్థాపయంతి మమాదేశాద్యావదా భూతసంప్లవం

శ్లో॥ 27. ఆభూత సంప్లవం నామ అప్రవృత్తప్వంహిభాష్యతే।
త్రైలోక్యస్థితికాలో యమపునర్మాల ఉచ్యతే.

తా॥ మన్వాదిస్మృతులందు చతుర్దశ విద్యల వివరము గలదు. వేద వేదాంగములు గలిపిన పది. పురాణములన్నియు నొకటి న్యాయ శాస్త్రము రెండు మీమాంసా శాస్త్రము మూడు ధర్మశాస్త్రము నాల్గు మొత్తము కలిపిన విద్యలసంఖ్య పదునాలుగు. ఇది యేసత్యము. దీనికి విరుద్ధమైనది యనృతము. వేదార్థమమృతము. దానిని ఖండించువారు పాషండులు. ఇది పితామహుని సంబంధమైన ధర్మము. నా (బ్రహ్మ) ఆజ్ఞచే మనువు వ్యాసాదులు యుగయుగమున ఈ వైదిక సనాతన ధర్మము స్థాపింతురు. ఆ భూత సంప్లవము (ప్రకృతి ప్రళయము) ఆపేక్షికామృతమనబడును. ప్రస్తుతపు ముల్లోకములస్థితి కాలము అపునర్మారము (మరల మరల జావనది). అనగా ప్రళయ కాలము వరకుండు స్థితికాలము నిత్యమని, భూతప్రళయమును (ప్రకృతి ప్రలయమును) అమృతమనియు జెప్పబడినది. ఈశ్వరేచ్ఛచేపునః సృష్టి కావచ్చును.

# వేదసంఖ్యా విచారము

త్రికాలాబాధితమై, నిత్యమై, అద్వితీయమైన చేతన బ్రహ్మతత్వ మొక్కటియే పారమార్థికమైనది. అట్టి పరబ్రహ్మ తత్వమును ప్రతిపాదించి నందున వేదముగూడ నొక్కటే. సంఖ్యయందు ద్విత్వాదు లసత్యములైన విధముగ నామరూపాత్మకమైన సకల జగత్తు కేవల వాచారంభణ మాత్రము గావున అసత్యము. సదాత్మ వేదమునందు నాచ్ఛాదితమై యున్నందుననేగాని, అట్టి పరబ్రహ్మయొక్క యాహ్లాదమున నిశ్వాస రూపమున వ్యక్తమైనందుననేగాని నిత్యమైన వేదము నొక్కటియే యన వచ్చును.

శ్లో॥ 3॥. ఛందాంసి నామద్విపదాం వరిష్ఠ స్వచ్ఛందయోగేన
భవంతితత్ర ఛందోవిదస్తే నచతానధీత్యాగతా
హి వేద్యస్యన వేదమార్యాః. స. జా. అ. 2 శ్లో. 41.

తా. మనుష్యులలో శ్రేష్ఠుడవైన ధృతరాష్ట్ర మహారాజా! స్వేచ్ఛాయోగముచే వేదము సదాత్మయందున్నది. వేదవిదులు వేదములనభ్య

సించి వేద్యమగు నామరూప వికారాత్మకమైన ప్రపంచమునే దెలిసికొనె దరుగాని "వేదం" అనగా ఆత్మను దెలిసికొనలేరు.

శ్లో॥ 31. యోవేద వేదాన్సచ వేదవేద్యం। నతం విదుర్వేద విదో
నవేదాః। తథాపి వేదేనవిదంతి వేదంయే బ్రాహ్మణా
వేదవిదోభవంతి. స. జా. అ. 2. శ్లో 43.

తా॥ వేదాధ్యయనముచే వేద్యమైన ప్రపంచమే దెలియబడునుగాని, తం (ఆత్మను) వేదములుగాని, వేదవిదులుగాని దెలిసికొనలేరు. అదియే సత్యమైనను వేదాధ్యయనముచేత (లక్ష్యార్థముచేత) "వేదం" (ఆత్మను) వేదవిత్తైదున బ్రాహ్మణులు (బ్రాహ్మణత్వముగలవారు) జ్ఞప్తి మాత్రమని (ఆత్మయని) దెలిసికొనెదరు.

శ్లో॥ 32. కోహ్యేవ మంతరాత్మానం బ్రాహ్మణోమంతుమర్హతి
నిర్లింగమచలంశుద్ధం సర్వద్వంద్వ వివర్జితం॥ స. జ్ఞా. అ. 1. శ్లో 32.

తా॥ లింగరహితము, ద్వైతవర్జితము, (అద్వితీయము) పరిశుద్ధమునైన తన యంతరాత్మను ఏ బ్రాహ్మణుడును (బ్రాహ్మణత్వముగలవాడును) మననము జేయజాలడు.

శ్రుతి॥ ౨౨. "యన్మనసానమనుతే। యేనాహుర్మనోమతం।
తదేవ బ్రహ్మత్వం విద్ధినేదం యదిదముపాసతే॥ కే. ఉ. 1-మ. 5

తా॥ దేనిని మనస్సు మననముజేయజాలదో ఎవరిచే మనస్సునకు మనన మేర్పడుచున్నదో అదియే పరబ్రహ్మయని నీవు తెలిసికొనుము. దేనిని నీ వుపాసించుచుంటివో అది (పరబ్రహ్మ) గాజాలదు.

41. మనసాదీంద్రియములు నామరూప వికారములనే గ్రహించ జాలును. కాని జ్ఞాతను (ఆత్మను) గ్రహించ జాలవు. "యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ" అనుచు శ్రుతి ప్రమాణము గలదు. శమదమాది గుణములుగల శ్రోత్రియునకే బ్రాహ్మణత్వముండును. అట్టి బ్రాహ్మణత్వముగలవాడు ఆత్మను మననమునకు విషయము గానిదని యెఱుంగును.

శ్లో॥ 33. జన్మనా బ్రాహ్మణోజ్ఞేయః సంస్కారైర్ద్విజ ఉచ్యతే
విద్యయాయాతి విప్రత్వంత్రిభిః శ్రోత్రియ ఉచ్యతే. ల. స. భా. శ్లో 20

తా॥ బ్రాహ్మణ వర్ణమునందు జన్మించిననే బ్రాహ్మణుడగును. ఉపనయన సంస్కారముచే ద్విజుడగును. వేదాధ్యయనము జేసినచో విప్రుడగును. పైమూడు విశేషణములుగలవాడే శ్రోత్రియుడగును. పై జెప్పినట్లెవ్వరికి శ్రోత్రియ బ్రాహ్మణత్వముగలదో వారికే ఆత్మజ్ఞానము గలుగును. ఇతరులు బ్రాహ్మణవర్ణమునందు జనిమ్చినందున బ్రాహ్మణులనబడుదురు.

శ్లో॥ 34. చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః।
తస్యకర్తారమపిమాం విద్ధ్యకర్తారమవ్యయం. గీ. అ.4-శ్లో. 13.

తా॥ నాలుగు వర్ణములు, త్రిగుణాత్మికమైన ప్రకృత్యనురూపమైన గుణముల, కర్మల విభాగముగ నాచే సృజింపబడినవి. వానికి నేనేకర్తనైనను వాస్తవముగ, నేను (అవికారియగు ఆత్మ) కర్తనుగానని తెలిసికొనుము.

శ్లో॥ 35. నపాణిపాదచపలో ననేత్రచపలోభవేత్.
నచవాగం చపలః ఇతిశిష్టస్యగోచరం
పారంపర్యాగతోహేష్యా వేదస్సం పరిబృంహణం
తేశిష్టా బ్రాహ్మణోజ్ఞే యాశ్రుతిః ప్రతక్షహేతవః ల. స. భా. పె. 108

తా॥ పాణిపాద చాపల్యనిషేధముచే దుష్పరిగ్రహాదులు, అగమ్యగమనాదులు నిషేధింపబడినవి. నేత్ర చాపల్య నిషేదముచే పరస్త్రీలను మాతృభావముగ జూడవలయునని యర్థము. అసత్యము బలుకకుండుటయే వాక్చాపల్య నిషేధము. అంగచాపల్య నిషేధముచే ధర్మకార్యములనే చేయుమని యర్థము. కావున ఇంద్రియాది చాపల్యములేని వారినే శిష్టులందురు. గురుసంప్రదాయ వేత్తలగువారి వద్ద ఉపసంగ్రహణాది నియమములతో అర్థయుక్తముగ అధ్యయనము జేసిన వారికి వేదప్రతిపాద్య బ్రహ్మ సాక్షాత్కారము గలుగును. కేవలాధ్యయన పరులైన బ్రాహ్మణులకు మహిమము యథార్థ బ్రహ్మ సాక్షాత్కారము గలుగదని సనత్కుమారుడనెను.

శ్లో॥ 36. నవేదానాం వేదితా కశ్చిదస్తి వేదేనవేదంన విదుర్నవేద్యం।
యోవేదవేదం నచవేదవేద్యం। యో
వేదవేద్యం ననవేదసత్యం। స. జా. అ. 2. శ్లో 41.

తా॥ వేదములకే వేతృత్వము లేదు అనగా శృతులకు బ్రహ్మ దెలియబడ నందున విధిముఖమున బ్రహ్మ ప్రతిపాదన జేయలేక, నిషేధముఖమున బ్రహ్మ ప్రతిపాదన జేసినవి. కావున స్వాధ్యాయముచే వేదం (బ్రహ్మను) గాని వేద్యం (ప్రపంచమునుగాని) దెలియలేరు. ఎవ్వరు అర్థావబోధ పర్యంత మధ్యయనము జేసిరో వారికే "వేద్యం" (ప్రపంచ జ్ఞానము) దెలియును. ఎవ్వరికి నామరూప వికారజాతమగు ప్రపంచ జ్ఞానము గలదో వారికి "సత్యం" (సదాత్మ-బ్రహ్మ) తెలియదని తాత్పర్యము.

శ్లో॥ 37. ఏకవేదస్యచా జ్ఞానే వేదాస్తే బహవోభవన్।
సత్యస్యైకస్య రాజేంద్రసత్యే కశ్చిదవస్థితః స. జా. అ. 2. శ్లో 37.

తా॥ వేదమొక్కటే గలదు. అట్టి వేదజ్ఞానములేని వారలకేఆవేదములు బహుగా నేర్పడినవి. ఓయీధృతరాష్ట్ర మహారాజా! సత్యమొకటే యుండునుగాని యట్టి సత్యమునందొకానొకడె నిష్టగల వాడగును.

శ్లో॥ 38. సత్యాత్ప్రచ్యవమానానాం సంకల్పా వితథాభవన్।
తతఃకర్మ ప్రతాయేత సత్యస్యానవధారణాత్. స. జా. అ. 2. శ్లో 30.

తా॥ అద్వితీయ, సత్య, సదాత్మనుండి చ్యుతులగు వారల యొక్క సంకల్పము లనృతములగుచున్నవి. సత్యాత్మావధారణమందు (నిత్య విజ్ఞప్తి స్వరూపమైన ఆత్మ జ్ఞానమునందు) అసమర్థులగుటచే కర్మల విస్తరింప జేసిరి.

శ్లో॥ 39. యఏవం వేద తత్సత్యం ప్రాజ్ఞోభవతినిత్యదా।
దానమధ్యయనం యజ్ఞోలోభాదేవ ప్రవర్తతే. స. జా. అ. 2. శ్లో 38.

తా॥ ఎవరు పైజెప్పిన లక్షణములుగల సదాత్మను దెలిసికొనెదరో వారి జ్ఞానమే సత్యమైనది. వారెల్లప్పుడు ప్రాజ్ఞులనబడుదురు. యజ్ఞదాన తపస్సులు లోభముగల వారలే చేయుదురు.

శ్లో॥ 40. కర్మోదయే కర్మఫలానురాగా_స్తత్రానుయాంతి
న తరంతి మృత్యుం। సదర్థయోగానవగమాత్స
ప_స్తాత్ర ప్రవ_ర్తతే భోగయోగేనదేహీ। స. జా. అ. 1-9.

తా॥ కర్మారంభములచే కర్మఫలానురాగులై నందున తత్రి (స్వర్గమును గురించి) వెళ్ళుదురు. కాని వారు మృత్యువును (జనన మరణములను) అతిక్రమించలేరు. సదాత్మ యాథార్థ్య జ్ఞానము లేనందున భోగాపేక్షచే కర్మలందు ప్రవర్తింతురు.

41. ధృతరాష్ట్ర మహారాజు సనత్కుమారుని గురించి వేదము లెన్ని యని ప్రశ్నించగ నతడు వేద మొక్కటియే గలదు. అట్టి ఏకవేద విజ్ఞానము గలవారికే బ్రాహ్మణత్వముండును. ఇతరులకు పై జెప్పిన వేదము లొకటిగాని, అన్నియుగాని, లేక వేదములందలి యొక్క ఋక్కైనగాని అర్థముతోనైనను, తద్రహితముగనైన నధ్యయనము జేసిన వారిని బ్రాహ్మణులందుర నెను.

శ్లో॥ 41. ఆహవైన నఖాగ్రేభ్యః పరమంతప్యతేతపః।
యద్స్రగ్వపి ద్విజోధీతే స్వాధ్యాయంశ_క్తితో న్వహం. మనుస్మృతి

తా॥ ఏ బ్రాహ్మణుడు వేదమునందలి యొక్క ఋక్కైన ప్రతిని త్యము తన శక్తితో అధ్యయనము జేయునో వాడు ఆనఖ పర్యంతము ను_త్తమమైన తపస్సు జేసినవాడే యగును.

వేద వేదాంగములను, పురాణేతిహాసములతో సహ అర్థయు_క్తముగగాని తద్రహితముగగాని యధ్యయనము జేసిన వానిని బహుపాఠియని, లేక బహువాగ్బ్రాహ్మణుడని చెప్పుదుర నెను.

శ్లో॥ 42. విద్యాద్బహూ పఠతంతు బహువాగితి బ్రాహ్మణం।
యఏవసత్యాన్నాపైతిసజ్ఞేయో బ్రాహ్మణ_స్త్వయా. స. జా. అ. 2 శ్లో 40.

తా॥ ఏ బ్రాహ్మణుడు సదాత్మ (సత్యము) నుండి ప్రచలితుడుగాడో వానికే బ్రాహ్మణత్వముగలదని తెలిసికొనుము. ఇతరులను వాచాలురని బహువాగ్బ్రాహ్మణులని, నీవు తెలిసికొనుము.

శ్లో॥ 43. త్రైగుణ్యవిషయా వేదాః నిస్త్రైగుణ్యోభవార్జున ।
నిర్ద్వంద్వో నిత్యసత్యస్థోనిర్యోగ క్షేమఆత్మవాన్ గీ. త. అ. 2 శ్లో 45

తా॥ త్రిగుణాత్మికమైన ప్రకృతి విషయములను (కర్మలను) వేదములు జెప్పును. నీవు త్రిగుణాతీతుడవుగమ్ము. అద్వితీయ, నిత్య, సత్యాత్మ నిష్టుడవై యోగక్షేమముల నొదిలి ఆత్మమాత్ర స్వరూపుడవై యుండు మనుచు శ్రీకృష్ణ భగవాను డర్జునునితో జెప్పెను.

శ్లో॥ 44. యామిమాంపుష్పితాంవా చంప్రవదన్తి విపశ్చితః ।
వేదవాదరతాఃపార్థ । నాన్యదస్తీతి వాదినః గీ. అ. 2 శ్లో 48.

తా॥ ఓయీ పార్థా, వేదవాదములను (అర్థవాదములను) జెప్పు పండితులు వేదోక్త ధర్మములకంటెను (కర్మలకంటెను) వేరైనదేదియు (ఆత్మ) లేదని వాదింతురు. వారి వాదము వికసించిన పుష్పముల (వాసనచే పైకి శోభాయమానములైన కర్మఫలముల) వంటివనబడును. అనగా ఆత్యంతిక మోక్షఫలమువారి కగుపడుటలేదని తాత్పర్యము.

43. పై కారణముల వలన సదాత్మ నిత్య సత్యస్వరూపమగునట్టిది ఒకటే కలదు. తత్ప్రతి పాదకమైన వేదము యదార్థముగ నొకటే కలదు. కాని సదాత్మనుండి ప్రచలితులగు భోగలోలుపులైన బ్రాహ్మణులను గురించి యీ యొకే వేదము నాలుగువిభాగములుగ జెప్పబడినది. ఇతిహాస పురాణాదుల గలిపిన అయిదు వేదములనబడుచున్నవి. కృతయుగాది పూర్వకాలములందు బ్రహ్మచర్య సత్యశమదమాది సాధనసంపత్తి గలిగి, గురుకులవాసమున, సాంగ వేదాధ్యయనము గావించెడివారు. అందువలన వారికి ఆత్మసాక్షాత్కారము గలుగుచుండెను. నేడు దేశకాల పరిస్థితుల వ్యత్యాసమున, బ్రహ్మచర్యాదులు, గురుకులవాసము మున్నగునవి లుప్తములైనందున విషయాసక్తచిత్తులై బ్రాహ్మణులు, వేదవేదాంగముల నధ్యయనముజేసియు, సదాత్మను సాక్షాత్కరింప జాలకున్నారు. కావున పదునాలుగు విద్యలందసమర్థులైరి. సర్వజ్ఞులగు వ్యాసభగవాను లీసంగతిగుర్తెఱింగి, రాబోవు కలియుగమునందుండు బ్రాహ్మణులపై

దయగలవారలగుటతో తమ శిష్యులందొకొకరి కొక్క వేదముపదేశించి శాఖాభేదములోనర్చెను. కలియుగమునందలి బ్రాహ్మణులు స్వశాఖాధ్యయన మాత్రమున తరించెదరని వారి యాశయము. కాని క్రమేణ యది ౦యులుప్తమై వేదవాఙ్మయము క్షీణించుచు, సనాతన ధర్మము నామమాత్రావశిష్టమగు చున్నది. కావున సనాతన ధర్మము నందాస్తిక్య బుద్ధిగల వారలందరు సాధ్యమైనంత వరకు శక్తితో సహాయపడుచు సనాతన ధర్మమూలములైన చతుర్దశ విద్యలను శ్రవణ పఠనాదులు జేసిగాని, తాము జేయజాలకున్న జేయువారలకు ధనాదులతో నుపకరించియేకాని, తమ కర్తవ్యమును నిర్వహించినచో సనాతన ధర్మము పునరుదరణ కాగలదు. అప్పుడే చతుర్దశవిద్యలు తమ సంపూర్ణ కళలతో ప్రకాశింపగలవు.

# 1. ఋగ్వేదము

శ్రుతి॥ ౨౧. "ఓం అగ్నిమీళే పురోహితం। యజ్ఞస్యదేవమృత్విజం। హోతారం రత్నధాతమం" ఈ మంత్రముతో ఋగ్వేదారంభము. ఇట్టి వేయనక మంత్రములతో నుండునది ఋగ్వేదము.

44. ఒక పాదమునందు నియతాక్షరములుండు (మితముగనుండు) ఛందస్సు ఋగ్వేదము. పైనుదహరించిన మంత్రములో నొకపాదమునందెనిమిది అక్షరములుగలవు. ఋగ్వేదము హ్రస్వ స్వరముతో జెప్పవలయును. వ్యాసుడు ఋగ్వేదము పైలుడను శిష్యునకు ఉపదేశించెను. ఇట్లు వేద శాఖాభేదము లేర్పడినవి. పైలుడు, తన శిష్యులకు ఉపదేశించగ వారివారి నామములతో అవాంతర శాఖాభేదము లేర్పడినవి. వ్యాసుడు జెప్పిన చరణవ్యూహమను గ్రంథమునందు వేద శాఖావిభాగముల విస్తారము గలదు. ఆ వివరమునందు ఋగ్వేదమునందెనిమిది స్థానములు గలవు.

"ఋగ్వేదశ్చాష్టౌ స్థానానిభవంతి" 1. చర్చాశ్రావకః, 2. చర్చకశ్రవణీయః 3. పారః 4. క్రమపారః ౕ. పారః క్రమరథ; 6. పారఃక్రమజటాః 7. క్రమశరః 8. "క్రసుదండశ్చేతి" దండయందు అవాంతర

భేదము నిర్గుణి। నిర్గుణియందైదు భేదములు గలవు. 1 అశ్వలాయనః 2. శాంఖ్యాయనః 3. శాకలః 4. బాష్కలః 5. మండూకః ఇట్లు శిష్యులనామములతో శాఖాభేదములు గలిగినవి.

45. ఋగ్వేదమునకు స్వరూప మున్నట్లు కల్పన. అట్టి స్వరూపములుగల ఋగ్వేదమునకు అత్రిగోత్రము, బ్రహ్మ దేవత, గాయత్రీ ఛందస్సు, రక్త వర్ణము, పద్మపత్రములవంటి నేత్రములు, విపుల గ్రీవము, కంబుకంఠము, కుంచిత కేశశ్మశ్రులు, రెండ రత్నుల ప్రమాణ దీర్ఘాకారము, ధ్యానార్థమునకుగాను కల్పించనైనది. మోచేతినుండి చిటికెన వ్రేలుదనుకగు మూరను అరత్నియందురు. ఉదాత్తాదిస్వర వర్ణోచ్చారణ విజ్ఞానము గురుముఖాధ్యయనముతో గలుగును. నియమ స్వాధ్యాయము జేయుట తపస్సగును. ఆతపస్సు ఫలభూతమగుచు ప్రత్యక్షాధి ఫలముల నిచ్చును. "స్వాధ్యాయాభ్యాసనం చైవవాఙ్మయంతపః ఉచ్యతే" అను గీతాప్రమాణముగలదు. యజ్ఞకర్మలందీ వేదము నభ్యసించిన వారు ఆహుత్రము (హోతకర్మ) జేయుదురు. వారు హోతలనబడుదురు. హోత ఇడాభక్షణయందు ప్రథమాధికారియగును. (ఇడాభక్షణ యనగ ప్రతిపత్తికర్మ) హోతవషట్కారము (ప్రైష) జెప్పినప్పుడే ఆహుతులగ్నిలో హోమము జేయుదురు. ఋఙ్మంత్రములే సామవేదమంత్రసులం దుపసంహారమైనవి. ఈ శాఖయందైతరేయో పనిషత్తు ముఖ్యమైనది. దానిలో ఆత్మవిద్య, ఉపాసనలు జెప్పనైనవి. ఋగ్వేదము కార్యబ్రహ్మయొక్క పూర్వముఖమునండి ప్రథమోత్పన్నమైనందున ప్రథమము. కావుననే ఋగ్శాఖాధ్యాయులు అగ్రిపూజకర్మలు.

## 2. ఋజుర్వేదము

శ్రుతి॥ ౨.౨. "ఓం ఇషేత్వోర్జేత్వావాయస్థో పాయవస్థః। దేవోవస్సవితా। ప్రార్పయతు శ్రేష్ఠతమాయకర్మణే" ఇత్యాది మంత్రములు యజుర్వేదము.

46. యజురమితము (అనియతాక్షర పారబద్ధ ఛందస్సు యజుర్వేదము). యజ—పూజాయామనుధాత్వర్థమున అగ్నిపూజ హోమము. హోమము

యజుర్మంతములతోనగును. యజుర్మంత్రములకు, ఉభయవిలక్షణమని యర్థము. వైశంపాయనుడు వ్యాసముఖమున యజుర్వేదాధ్యయనము జేసెను. అతనితో యజుశ్శాఖాభేదమేర్పడినది. అతడు తన శిష్యులకు జెప్పగ వారివారి నామములతో అవాంతర భేదములేర్పడినవి. యజుర్వేదమందు శుక్లకృష్ణమను రెండు భేదములుగలవు. కార్యాంతరముచే పూర్వకాలమందొక సభ మేరుపర్వత శిఖరముపై జరుగునట్లేర్పాటు జేయనైనది. అందు మహాఋషులందరు విచ్చేయుటకు సమయము జేసుకొనిరి. ఆనాటి సభకురాని వారలకు బ్రహ్మ హత్యాదోషము గలుగుననుచు వారి సమయమునందేర్పడినది. దైవవశమున వైశంపాయనుడు దప్ప మహాఋషులందరానాడు సభకు వెళ్ళిరి. కాని సమయ ప్రకారము వైశంపాయనుడు వెళ్ళనందున అతనికి బ్రహ్మహత్యాదోషము ఘటించినది. (ఆనాటి రాత్రి యతని మేనల్లుడు (శిశువు) క్రింద నేలపై నిద్రించుచుండగ వైశంపాయనుని కాలు పొరపాటుచే శిశుపైబడినందున శిశు మరణించెను.) ఉదయము వైశంపాయనుడు మేనల్లుని మరణముచే తనకు సమయాను సారముగ బ్రహ్మహత్య ఘటించినదని తెలిసికొని తన శిష్యులకు బ్రహ్మహత్యా పరిహారార్థము "బ్రహ్మ హాద్వాదశ వార్షికంచరేత్" అను ప్రమాణముగ తనకు బదులు కృచ్ఛ్రాది ప్రాయశ్చిత్తములను జేయుమని ఆజ్ఞాపించెను. శిష్యులందరిలో యాజవల్క్యులు లేసి నేనొకడనే తమ బ్రహ్మహత్యా పరిహారార్థము ప్రాయశ్చిత్త మొనరించెదను. అల్పులైన ఇతర శిష్యులనేల జేయు మేనదరనగ వైశంపాయనుడు క్రోధముతో నాయాజ్ఞాల్లంఘనజేసి, గర్వముచే, నితర బ్రాహ్మణనింద జేసి నాడవు కావుననే జెప్పిన వేదమును విడువుమనెను. అప్పుడు యాజ్ఞవల్క్యుడు తాను అధ్యయనము జేసిన యాజుషములను, వమనముతోడ వెడలించి భూమిపై బడవేసెను. యాజవల్క్యుడు విద్యార్థియగుటచే

సూర్యుని యుపాసించి మరల యజుర్వేదాధ్యయనమును జేసినాడు. సూర్యుని వలన వచ్చిన వేదమునకు శుక్ల యజుర్వేద నామము గలిగినది. యాజవల్క్యుడు విడిచిన వమనయుక్త యాజుషములను వ్యాసభగవానుడు తిత్తిరి పక్షిచే గ్రహింపజేసెను. ఈ విధమున యజుర్వేదమందు తైత్తిరీయ శాఖవేరుగ నేర్పడినది. కృష్ణద్వైపాయనుల వలన వైశంపాయనులు, వేదము అధ్యయనము జేసినందున యజుర్వేద నామముగలిగినది. ఇట్లు భయనామములతో యజుర్వేదము విఖ్యాతమైనది. ఋగ్వేదమునకు వలెనీ వేదమునకు రూపము జెప్పబడినది. ఈ వేదమునకు భారద్వాజ సగోత్రము, త్రిష్టుబ్ఛందస్సు, కుశమధ్యమునికి, గ్రీవముకపాలము స్థూలము, కాంచన వర్ణము, అతసీ పుష్ప సదృశ నేత్ర ములు, శరీరకాంతి తామ్రమనఆదిత్యుని వరమువంటి రూపము ఐదరత్నుల దీర్ఘమగు శరీరము, ధ్యానయోగ్యముగ నుండును. యజుశ్శాఖయందేను బదియారు బేదములు గలిగినవి. వానిలోని కొన్ని సంగ్రహమగును. 1. చరక 2. అహురక 3. నానాకఠ 4. ప్రాచ్యకఠ 5. కపిష్టలకఠ 6. ఆరాయణీయ 7. వార్తాంతవేయ 8. శ్వేత 9. శ్వేతతర 10. మైత్ర. ఈ పది శాఖలు ముఖ్యమైనవి. మైత్రిశాఖయందు భేదములు గలవవి:- 1. మానవ 2. దుందుభి 3. మికేయా 4. వారాహ 5. హారిద్రి వేయ 6. శ్యామ 7. శ్యామాయణీయ. 2. వాజసనీయశాఖయందు (శుక్ల యజుర్వేదమందు) పదునెనిమిది భేదములుగలవు. 1. జాబాల 2. బోధాయన 3. కణవ 4. మాధ్యందిన 5. శ్యాపీయ 6. స్తాపాయ ణీయ 6. కాపాలః 7. పౌండ్ర 8. వత్స 9. అవటిక 10. ఉన్నత 11. పరమావటిక 12. పారాశల్య 13 వైధేయ 14. వైనేయ 15. ఔఘేయ 16. గాలవ 17. వైజవ 18. కాట్యాయనీయ. తైత్తిరీయ శాఖయందు రెండు భేదములుగలవు. 1. ఔఖ్య 2. కాండికేయ కాండి కేయమునం దవాంతర భేదములుగలవు. 1. ఆపస్తంబ 2. బౌధాయన 3. సత్యాషాఢ 4. హిరణ్యకేశి 5. ఔఘేయ. యజుర్వేదమునందు దాత్తాది స్వరవర్ణోచ్చారణ గురుముఖాధ్యయనిముతో దెలియును. నియమ

స్వాధ్యాయము జేయగ ప్రత్యక్షాది ఫలములు గలుగును. వేదములందు యజుర్వేదము శిరస్సువలె ప్రధానమైనది. యజుర్మంత్రములతోడనే యవదానము లియ్యబడుటతో (హోమములు జేయబడుటతో) ప్రాధాన్యము వహించినది. ఇదే వేదమంత్రములతో ఆధ్వర్యమును చేయుదురు. యజమానునికి బదులు హోమములు జేయువారిని (ప్రతినిధిని) అధ్వర్యులందురు. కృష్ణశుక్ల యజుశ్శాఖలందు క్రమమున తైత్తిరీయ బృహదారణ్యకములు ఉపనిషత్తులు ముఖ్యములైనవి. వానిలో బ్రహ్మవిద్య, ఉపాసనలనేకములు గలవు.

## 3. సామవేదము.

శ్రుతి॥ ౨౩ "ఓం అగ్న ఆయాహివీతయే। ఘృణానోహవ్యదాతయే।
విహోతాసత్సిబర్హిషి।" ఇత్యాది సామమంత్రములు సామవేదము.

47. స+అమ=సామమని ఛాందోగ్యోపనిషత్తునందు నిర్వచనముగలదు. స=వాక్. అమ్=ప్రాణముగలిసి సామము వాక్ప్రాణ మిధునమే ఋక్సామ మిధునము ఇట్లు ఋఙ్మంత్రములు సామమంత్రములందుపసంహారమైనవి. సమమే సామమగును. సమత్వమున్న నే నిర్దోషియగును, సమము పరమేశ్వరుడు. "సమంసర్వేషు భూతేషుతిష్టంతం పరమేశ్వరం" గీత సామోపాసనలందు సమసామోపాసన గొప్పది. సామవేదము గీతి ప్రాధాన్యమైనది. ప్రాణము, స్వరము, తుల్యములు-ప్రాణమములు, స్వరములు, సప్తసంఖ్యాకముల వియోకే స్వభావము గలవి. సూర్యుడు ప్రత్యాస్వరమనబడుటచే ప్రతిదినము, మరల తిరిగి వచుచున్నాడు. కాని ప్రాణ, స్వరములు పోయిన మరల తిరిగిరావు. సామవేదమును జైమిని మహర్షి, వ్యాసులవద్ద అధ్యయనము జేసెను, కావున సామశాఖ యేర్పడినది. జైమిని తన శిష్యులకు ఉపదేశించి వారివారి నామములతో శాఖాభేదముల వాంతరము లనేకములు కల్పించిరి. ఉపాసనార్థమీ వేదమునకు పై రెండు వేదములకువలె రూపకల్పన జెప్పనైనది. సామవేదమునకు కస్యప ఋషిః, కాశ్యప గోత్రము, రుద్రదధి దైవత, జగతీ

ఛందస్సు, స్రజ్మాలికలు ధరించును, శుభ్రవస్త్రధారణ జేయును, శాంతి యుత మనస్సుగలది, ఇందిృయనిగ్రహము గలది, శమీదండధారణ జేయు నది. కాంచన వర్ణనయనములు శుభ్రమైనవి, సూర్యుని కిరణములను బోలి యుండునది. ఆరు అరత్నుల పొడుగగు దీర్ఘ శరీరముగలదు. సామవేద శాఖయందు సహస్రభేదములు గలవు. వానిలో 1.ఆసురాయణి 2. వార్తాంతేయ 3. ప్రాంజల 4. ఋగ్వర్ణభిదా 5. ప్రాచీన యోగ్యజ్ఞానః 6. రాణాయణీయ మనునవి ముఖ్య సామశాఖలు. రాణాయణీయ శాఖ యందెనిమి దవాంతర భేదములు గలవు. 1. సాంఖ్యాయనీయ (సాత్వల) 2. శాట్యాయనీయ 3. ముద్గల 4. ఖల్వల 5. మహాఖల్వల 6. లాంగల 7. కౌథుమ (జైమినీయ) 8. గౌతమ. సామవేదోపని షత్తులు కేన, ఛాందోగ్యములు వానియందు బ్రహ్మతత్త్వోపదేశము ఉపా సనలు గలవు. స్వరవర్ణాదిజ్ఞానమున గురుముఖాధ్యయనము నియమ స్వాధ్యాయముగ చేసినచో పిత్ర్యాజాది ఫలములు గలుగును. యజ్ఞ కర్మలందీ వేదముతో ఔద్గాత్రము జేయుదురు. స్వగవర్ణాది వ్యత్యాసము జేయని దేవతా జ్ఞానముగల ఉద్గాత తనకుగాని యజమానికిగాని ఇష్టఫల ప్రాప్తిని చేకూర్చును.

# 4. అథర్వణ వేదము

శ్రుతి॥ ౨౪ "ఓం శన్నోదేవీరభీష్టయ, ఆపోభవంతు పీతయే।
శంయోరభి స్రవంతునః" ఇత్యాది మంత్రములు అథర్వణ వేదము.

46. అథర్వుడను ఋషినామ మీవేదమునకు గలిగినది. కార్యబ్రహ్మ జ్యేష్ఠ పుత్రుడైన అథర్వుడు, తండ్రియగునతని వలన ఈ వేదము నభ్య సించినట్లు ముండకోపనిషత్తు నందీకథ గలదు.

శ్రుతి॥ ౨౫ బ్రహ్మదేవానాం ప్రథమస్సంబభూవ । విశ్వస్యక
ర్తా భువనస్యగోప్తా । సబ్రహ్మవిద్యాంసర్వవిద్యా
ప్రతిష్ఠాం అథర్వాయ జ్యేష్ఠ పుత్రాయప్రాహ॥
ము. ఖ. 1. మ. 1.

తా॥ కార్యబ్రహ్మ దేవతలకంటెను మొదట జనించినాడు। అతడు విశ్వమున కంతటికి కర్త అతడే విశ్వమును పాలించువాడు. అతడు సర్వ విద్యలందు ప్రతిష్ఠితమైన (ఉత్తమమైన) బ్రహ్మ విద్యను (వేద విద్యను) తన జ్యేష్ఠ పుత్రుడగు అథర్వునకు నుపదేశించెను.

శ్రుతి॥ ౨౬ "అథర్వణేయాం ప్రవేదబ్రహ్మ। అథర్వాతాం
పురోవాచాంగిరే బ్రహ్మవిద్యాం। సభారద్వాజాయ
సత్యవహాయప్రాహ। భారద్వాజోంగిరసే పరావరాం"

తా॥ అథర్వునికి ఏ బ్రహ్మవిద్యను కార్యబ్రహ్మ యుపదేశించెనో దానినే యథర్వుడు అంగిరునకు నుపదేశించెను. అంగిరుడు భారద్వాజ గోత్రుడైన సత్యవహుడను వానికి జెప్పెను. భారద్వాజుడంగిరసునకు నదే పరావర విద్యను (వేద విద్యను) ఉపదేశించెను.

49. సగంహిత, బ్రాహ్మణము, అరుణము, ఉపనిషత్తులు గలిపిననే కృత్స్న వేదమగును. కావున బ్రహ్మవిద్యయనగ పరాపర విద్యలని యర్థము. ముఖ్యముగా అథర్వుడు ఋగ్యజుస్సామములందలిఖిల భాగము నభ్యసించి నందున దానికే అథర్వణ వేదమను పేరుగలిగినది.

శ్లో॥ 46. పరాపర విభాగేనవేదార్థో ద్వివిధస్మృతః।
వేదార్థస్తు పరస్సాక్షాత్పరాత్పరతరంపరం।
అపరోధర్మసంజ్ఞస్యాత్పర ప్రాప్తిసాధనం

లలిత బా. పు. 160. శ్లో. 201.

తా॥ పరమని అపరమని వేదార్థము రెండు విధములు. వానిలో పర శబ్దార్థము నేరుగా పరమున కంటెను పరతరమైన పరబ్రహ్మ. రెండవది అపరమదిపర బ్రహ్మప్రాప్తి సాధనమైనధర్మ సంజ్ఞగలది.

50. అథర్వణ వేదమును వ్యాసుడు సుమంతుడను శిష్యునకు నుపదేశించెను. అతడు తన శిష్యులకు నుపదేశించగ వారి వలన నవాంతర శాఖాభేదము లేర్పడెను. ఈ వేదమునుండియే మంత్రశాస్త్ర మేర్పడినది.. అథర్వణ వేదశాఖలో తొమ్మిది భేదములు గలవు. 1. పైప్పలం 2. దాంతం

3. ప్రదాంతం 4. స్తౌతా 5. మౌతా 6. బ్రిహ్మదా 7. యశదా 8. శౌనకీ 9. దేవదర్శి. (చర్వణ విద్య). ఋగ్వేదాదులకువలె అథర్వణ వేదమునకును ఉపాసనార్థము స్వరూప కల్పన మిట్లు గలదు. వైజానిక సగోత్రము, ఇంద్రుడధిదైవత, విశ్వస్పృజమగు సాధ్యకర్మ. అనుష్టుబ్ఛందస్సు, క్రూరమగు తీక్ష్ణచండకృష్ణ వర్ణము, కామరూపము, క్షుద్రకర్మ, స్వదార యను నామము. ఇందు పంచకల్పములివి;— 1. కల్పము. విధాన కల్పము 3. విధివిధాన కల్పము 4. సగంహిత 5. శాంతికల్పము. అథర్వణ వేదాంతర్గములైన ముండక, ప్రశ్నోపనిషత్తులందు ఆత్మవిద్యా ఉపాసనలు చెప్పబడినవి. స్వరవర్ణోచ్చారణ గురుముఖమున దెలిసికొని నియమస్వాధ్యాయము జేసినచో ప్రత్యక్షాది ఫలములు గలుగును.

# 1. ఆయుర్వేదము (ఉప వేదము)

51. ఆయుశ్శబ్దమిచ్చట ప్రాణార్థము. ప్రాణము శరీరము లోపలనే గలదు. కావున వాని విజ్ఞాన మాయుర్వేదము. ''శరీర మాద్యం ఖలుధర్మ సాధనం'' ధర్మసాధనము శరీరముచేనగు నందున శరీర రక్షణ ధర్మము. శరీర స్వాస్థ్యమున్ననే ధర్మమార్జింపవచ్చునే.గాని అన్యథాధర్మార్జన జేయజాలడు. నామసారూప్యమున్నందున ఋగ్వేదమునకు. ఆయుర్వేద ముపవేదమనవచ్చును. ఋక్కునందు అక్షరములు మితములు రుగ్ రోగార్థము గలది. ధర్మసాధనమైన శరీరము మితాహార విహారములు లేనప్పుడు రోగములుత్పత్తి యగుటతో శరీరమునందు వ్యాధులుత్పత్తి యగుటచే ధర్మాచరణ చేయజాలడు. ఇట్లు ఋక్, రుగ్ రెంటికిని నామ స్వారూప్యమున్నది. కావున ఆయుర్వేదము ఋగ్వేదమునకు ఉప వేద మనిరి. ఆయుర్వేదమునే వైద్యశాస్త్రమని బలుకుదురు. వైద్య శాస్త్రము ఎనిమిది అధ్యాయములందు విభజింపబడినది. 1. సూత్రము 2. శారీరము 3. ఇంద్రియము 4. చికిత్స 5. నిధానము 6. విమానము 7. కల్పము 8. సిద్ధి. అనేక ఋషులచే వైద్యశాస్త్రములు చెప్పబడినవి.

బ్రహ్మ, ప్రజాపతి, అశ్వి, ధన్వంతరి, ఇంద్రుడు, భరద్వాజుడు: అత్రి, అగ్నివేశ్యుడు, పతంజలి మున్నగువారలు వైద్యశాస్త్రప్రణేతలు.

52. ఆదికాలమందు ప్రజాపతి చతుర్వేదముల నవలోకించి ఆయుర్వేదమును సృజించి ఆదిత్యునికిచ్చెను. అతడు ఆయుర్వేద సంహిత స్వతంత్రముగ నేర్పరిచెను. ఆదిత్యుడు తనశిష్యులకు నుపదేశింపగ వారు వేరు వేరు వైద్య గ్రంథముల రచించిరి. వారిలో ధన్వంతరి, కాశీరాజు, దివోదాసుడు, అశ్వినీ కుమారులు, నకులుడు, సహదేవుడు, యముడు, చ్యవనఋషి, జనకుడు, బుధుడు, జాబాలి, జాజిలి, పైలుడు, కరంధుడు, అగస్త్యఋషి మున్నగు వేద వేదాంగ పారంగతులు రోగనాశకు లనబడుదురు. వారిలో ధన్వంతరి ప్రథమమున చికిత్సాతత్వ జ్ఞానమను వైద్యగ్రంథమును, దివోదాసుడు చికిత్సా దర్పణమును, కాశీరాజు దివ్యచికిత్సా కౌముది, అశ్వినీకుమారులు చికిత్సా సారతంత్రము, నకులుడు వైద్య సర్వస్వము, సహదేవుడు వ్యాధిగ్రంధి విమర్దనము, యముడు జ్ఞానార్ణవము, చ్యవనఋషి జీవదానతంత్రసారము, జనకుడు వైద్యసందేహ భంజనము, బుధుడు సర్వసారము, జాబాలి తంత్రసారము, జాజిలి వేదాంగ సారము, పైలుడు నిధాన తంత్రము. కరంధుడు స్వరధర తంత్రము, అగస్త్యుడు ద్వైధ నిర్ణయము, ఇట్లందరు వైద్యగ్రంథము లను వ్రాసిరి. వానిలో రోగ వివరము వాని వినాశోపాయములు మరియు కొన్ని పౌష్టిక విషయాదులు పలువిధముల జెప్పబడినవి. ఆయుర్వేద మహా సముద్రమును జ్ఞానమను కవ్వముతో జిలికి పైజెప్పిన గ్రంథ విషయ నవనీతము దీయబడినది. దానికి భాస్కరసంహిత మని నామము. దానిని దెలిసికొనగ సంపూర్ణాయుర్వేద విజ్ఞానము కలుగును. ఆయుర్వేద విజ్ఞానముచే రోగములను దెలిసికొని రోగుల కారోగ్యమొసగుటయే వైద్యుని ధర్మము. వైద్యుడు ఆయువునకు కర్త కావలెను. తాను ఆయుర్వేద శాస్త్రమును బాగుగా నెఱింగినవాడై సమర్థుడై యుండవలెను. అప్పుడే రోగికి ఆరోగ్యమునందు నమ్మక

మేర్పడును. సమస్తరోగములకు జర్వమే మూలము (కారణము) దాని నాపుట చాలా కష్టము జ్వరమును శివభక్తునిగను, యోగిగను బలుకుదురు. దాని స్వభావము కూ్రరము. దానికి మూడు కాళ్ళు మూడు తలలు, ఆరు హస్తములు, తొమ్మిది నేత్రములు గలవు. ఆ భయంకర జ్వరమును కాలుడని, యముడని, అంతకుడని చెప్పుచున్నారు. వాని వలనే అది వినాశకారి. జ్వరమునకు భస్మము అస్త్రము, రుద్రుడధి దేవత. జ్వర కారణము అజీర్ణము (మందాగ్నిః) అట్టి మందాగ్ని కార్యములు. 1. వాతము 2. పిత్తము 3. కఫము, ఈ మూడు కారణములతో జ్వరము జనించును. ఇదిగాక త్రిదోషమను మఱియొక జ్వరము గలదు. పాండుః కామల (కామిళ్ళ రోగము) కుష్టు, శోధ (శోభ) ప్లీహము, శూల, జ్వరము, అతిసారము. సంగ్రహణి (రక్తవిరోచనములు) దగ్గు, వ్రణములు (పుండ్లు) హాలీ మకము, మూత్రకృచ్ఛ్రము, రక్తవికారములు లేక రక్తదోషములతో నుత్పన్నమగు గుల్మము, విషమ మేహ రోగములు, కబ్బరోగము, గోద, గలగండము, భ్రమరి (అపస్మారము) సన్నిపాతము, విషూచిక (గత్తరి) మొదలగు ననేకవిధములైన దారుణ రోగము లుండును. ఇట్టి యరువదినాల్గు రోగములు మృత్యుకన్యా కుమారులనబడుదురు. జర (ముదిమి) మృత్యువు బిడ్డ యనవచ్చును. జర తన తమ్ములతో భూమండమునందు సంచరించుచుండును. గాని యెవరు రోగోత్పత్తి కారణముల నెఱింగి, వాని నివారణోపాయముల జేసికొనుచు నియమాదులతో వర్తింతురో వారిని జూచి రోగములు గరుడునికి వెఱచి సర్పములు పారిపోయినట్లు పారిపోవును.

53. ప్రతిదినము నేత్రములను జలముతో పరిశుభ్ర పరుచుచు వ్యాయామము జేయుచు అరికాళ్ళకు తైలమురాచుకొనుచు, చెవులలో నూనె వేసికొనుచు మాడపై తిలతైలముతో మర్దన నిత్యము మరువక జేసికొనుచు, వర్తింతురో వారిని ముదిమియంటదు.

2. వసంతర్తువునందు ప్రయాణములు (యాత్రలు) జేయుట, స్వల్ప మాత్రాగ్ని సేవించుట, నూతన వయస్కయగు స్త్రీతో సంభోగించుట, యలవాటుగలవారి దరి జేరదు.

3. గ్రీష్మర్తువునందు తటాకములందేగాని చిన్న చెరువులందేగాని చల్ల నీళ్ళతో స్నానము, శ్రీచందనలేపన చల్లని గాలిసేవనము నలవాటుగల వారిని ముదిమి యంటదు.

4. వర్షర్తువునందు ఉష్ణోదక స్నానము జేయుట, వర్షజల సేవన జేయ కునికి, సమయమందే మితభోజనము జేయుట గల వారిని జరయంటదు.

5. శరదృతువులందు ఎండలో నుండక శరత్కాలపు ఎండలో ప్రయా ణించకునికి, బావినీళ్ళతో స్నానము జేయుట, యలవాటుగల వారలను జరయంటదు.

6. హేమంతర్తువునందు ప్రాతఃకాలమందే చల్లనీళ్ళతో స్నానము జేయుట, సమయానుకూలముగ అవసరమగునంత అగ్ని సేవించుట, తాత్కాలికపాకసిద్ధాన్నములదినుట, యలవాటు గలవారిని జర యంటదు.

7. శిశిరర్తువునందు వెచ్చని బట్టలు దొడుగుట, ప్రజ్వలితాగ్ని సేవ, నూతనపక్వాన్నముల నుష్ణతయుండగనే దినుట, ఉష్ణోదక స్నానము జేయుట యలవాటుగల వారిని జరయంటదు. మరియు వెంటనే సిద్ధమైన (అప్పుడు వండిన) పదార్థములను దినుట, పాలు, పాయసము సేవించుట సమయానుకూలముగ తరుణీ స్త్రీతో సంగమించుట, యలవాటుగల వారిని జరయంటదు.

8. ఆకలియున్నప్పుడే రుచికర పదార్థములనుదినుట, దప్పియగునప్పుడే చల్లని మంచినీరు త్రాగుట, నిత్యము తాంబూల చర్వణ జేయుట యల వాటుగల వారిని జరయంటదు.

9. ప్రతిదినమందు పెరుగు, నూతన వెన్న, గుడము (బెల్లము) దినుట, ఇంద్రియ నిగ్రహము యలవాటుగల వారికి జరయంటదు.

9. జెప్పిన యుపాయములకు విపరీతముగ నెవ్వరు నడచుకొందురో, మాంసమును సేవించినను, వృద్ధ స్త్రీతో సంగమించినను, ఉదయించు సూర్యరశ్మి సేవించినను, అయిదు దినముల క్రిందటిదధి (పెరుగు) త్రాగి నను, వారిపై జర తన సోదరులతో నాక్రమించును.

10. రాత్రి దధిభోజనముజేసిన, వేశ్య (కులట) తో సంగమించిన, రజస్వలతో సంగమించిన, విధవ, జారిణి, శూద్రాతో సంగమించిన, పురోహితుని భార్యతోగూడిన, ఋతుహీనమైన స్త్రీతో సంభోగించిన, పై జెప్పిన వారి యన్నముల దినిన, గొప్ప పాపము గలుగును. పాపము లంటిననే జర (ముదిమి) వచ్చును. రోగములకును పాపములకును అవినాభావ సంబంధము గలదు. పాపములే రోగరూపమున మనుష్యుల నాశ్రయించును పాపములే జరకుగాని, విఘ్నములగాని మూలకారణము లగుచున్నవి. పాపములతో జర, దైన్యము, దుఃఖము, భయము, శోకము లుత్పత్తియగును. కావున మన భారతమందలి సత్పురుషులు భయాతురులై పాపము లాచరించరు.

శ్లో॥ 47. పాపేనజాయతే వ్యాధిః పాపేనజాయతేజరా ।
పాపేనజాయతేదైన్యం దుఃఖశోకాభయంకరః

శ్లో॥ 48. తస్మాత్పాపంమహావైరం దోష బీజమమంగలం ।
భారతే సతతం సంతోనాచరంతి భయాతురః

తా॥ పాపములు వైరములను, దోషములనుత్పన్నము జేయునుగాన నవి, యమంగళకరములు. ఎవరు వర్ణాశ్రమాచార రూప సనాతన ధర్మ పరాయణులో నిత్యము హరినామ సంకీర్తన జేయుదురో, తపోపవాసము లందు రుచిగల వారలో, మంత్రజపాదులు, గురుదేవతారాధనలు, భక్తితో జేయుదురో, పుణ్యానదీ తీర్థస్నానాదుల జేయుదురో, వారిని జూచి పాపములు సర్పములు గరుడునికి వెరచినట్లు భయముచే పారిపోవును.

శ్లో॥ 49. పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణపీడ్యతే ।
తచ్ఛాంతిరౌష దైర్దానైర్జ పహోమసురార్చనైః

తా॥ పూర్వజన్మాదులందు జేసిన పాపములే వర్తమాన దేహములో వ్యాధి రూపమున జనించును. అవి కేవలోపభోగముననే నశించునవైనను, యవి ఔషధ సేవ, దాన, జప, హోమాదులు, దేవతాపూజలు, జేయగ నుపశమించును.

54. జ్వరకారణములైన కఫ వాత పిత్తములు దేహధారులందెట్లు ప్రవేశించునో, ఎట్లు బోవునో వాని వివిధకారణముల సంగ్రహమిట్లు।—

1. దేహధారులకు నాకలి హెచ్చైనందున నెప్పుడు వైశ్వానరాగ్ని ప్రజ్వరిల్లునో ఆసమయమునందు ప్రాణుల కాహారము లభించకుండినచో దేహమధ్యమందలి మణిపూరక చక్రమున (నాభియందు) పిత్తప్రకోప నగును. అప్పుడు ముంజలు (తాటిపండ్లు) గాని, రేగుపండ్లుగాని దిని వెంటనే నీరు ద్రాగినచో మరణింతురు.

2. దైవోపహతులగుచు శరదృతువునందు వేడి నీరు నెవరు ద్రాగుదురో, భాద్రపదమాసమునందు ఉష్ణ పదార్థముల నెవరుదినెదరో వారికి పిత్తాధిక్యత గలుగును. పిత్తాధిక్యమైనప్పుడు ధన్యాలు నూరి చల్లని మంచి నీరులో శర్కర మిశ్రమును జేసి ద్రావిన పిత్తప్రశమన యగును.

3. శనగలు, శనగపిండి పదార్థములు. అవుపాలు, పాలపదార్థములు. తక్రమిశ్రితములేని తియ్యని పెరుగు, పండిన మారేడుపండ్లు, తాటిపండ్లు చెర్కురసము. వానితోనగు పదార్థములు అల్లము, పెసరుకట్టు శర్కర మిశ్రితమైన తిలచూర్ణము సేవించిన పిత్తశమనమగును. మరియు బలము పుష్టియు గలుగును.

4. కఫవృద్ధి దాని శమనోపాయములు.

1. భోజనోత్తరము వెంటనే స్నానము జేయుట, దప్పిలేనప్పుడు నీరు ద్రాగుట, శరీరమందంతట తైలమర్దన గావించుటకొనుట, స్నిగ్ధ తైలము, ఉసిరికస్నిగ్ధ-ద్రవము సేవించుట, పర్యుషితాన్నము దినుట (దాచిన యన్నము దినుట) చల్లద్రాగుట, అరటిపండ్లు, దధి, వర్షజలము,

శర్కర నీరు, అత్యంతస్నిగ్ధ తైలపానము, నారికేళనీరు ద్రాగుట, తైలాభ్యంగనము లేకయె పరియుషిత నీటితో స్నానము, తర్బూజఫలముదినన, పండు దోసకాయదినిన, వీని సేవచే కఫవృద్ధియగును.

వేడినీటి యావిరి బట్టించుకొని చమట శరీరమందు గలిగించుకొనగ, వేగించిన భంగు సేవించిన, వండినతైలము భోజనమందుపయోగించుకొనిన, పాదచారము జేయుట, (తిరుగుట) ఎండిన కర్జూర ఫలములు, బదామ మున్నగునవి తినుట, పక్వమైన హైారకము దినుట, పచ్చి పిండారకము సేవించుట (పెన్నర్జూర్) అరటిపండ్లు దినుట, బేసవారి (ఒక విధమైన కంద) దినుట, సింధువార్ (నిర్గుండి) దినుట, ఉపవాసముజేయుట, నీరుత్రాగకునికి, నేయితో గలిసిన రోచన చూర్ణము, పొడి శర్కర ఘృత మిశ్రముగ దినుట, మిరియాలు, యెండిన అల్లము (శొంఠ) జీవకము, మధు, నీని సేవించిన తత్కాలమే కఫము దూరమగును.

5. వాతప్రకోపన కారణములు వాని శమనోపాయములు.

1. భోజనోత్తరము వెంటనే కాలినడక ప్రయాణము జేయుట, ఉరుకుట, (పరుగెత్తుట) అగ్నికాగుట, నిరంతరము దిరుగుట, మైథునము, వృద్ధ స్త్రీ సంభోగము, మనస్సంతాపమునొందుట, అత్యంత కఠిన పదార్థముల సేవించుట, ఉపవాసములు జేయుట, కలహించుట, ఇతరులద్వేషించుట, నిష్ఠురములు బలుకుట భయశోకములచే పరి భూతుడగుటచే వాత ప్రకోపన యగును. నిమ్మపండ్ల రసముతో షర్బత్, నారికేళ రసము, నూతన తక్రం (కవ్వముక్రింది చల్ల), ఉత్తమ పదార్థములు (పూరీ చకోరీ మొదలగునవి) అప్పుడుసిద్ధమైనవి దినుట, బర్రె పెరుగు (దధి) తియ్యనిది శర్కర మిశ్రముగదినుట, రాత్రివండిన అన్నము, యవాగు, చల్లనీరు ద్రాగుట. తిలతైలము వండినది, కొబ్బరి, త్రాటి పండ్లు, ఖర్జూర పండ్లు, ఉసిరి కాయలతో సిద్ధమైన ఊష్ణ పదార్థములు, వేడినీరు చలినీరు కలిపి స్నానము జేయుట. శ్రీచందనద్రవము,

కమలపత్రశయ్యా, స్నిగ్ధరసవంతమైన వ్యంజనాదుల భుజించుటచే వాత శమనమగును.

2. వాతః ప్రకోపన త్రివిధముగనుండును. 1. శరీరక్లేశముచే జనించునవి. 2. మానసిక సంతాప జనితములు 3. కామజనితములు.

55. మధ్యకాలమునందు చరకునిచే చరకసంహిత (వైద్య గ్రంథము) శుశ్రితునిచే శుశ్రుతము జెప్పబడినవి; వాగ్భటీయము భసవరాజీయము మున్నగు వైద్యగ్రంథములు గలవు. ఆధునికులచే నిప్పటివఱకనేక భాషలలో వైద్యగ్రంథములు వ్రాయబడుచున్నవి. శాస్త్ర పరిశోధనలు జేయబడి నవీనమైన చికిత్సా విధానము లేర్పడుచున్నవి. వైద్య సౌకర్యములు ప్రతి గ్రామమున గలుగజేయబడుచున్నవి. కాని నూతన విధములైన యనేకవిధ రోగోత్పత్తి యధికమగుచున్నది. ఇప్పటి నవీన పరిశోధకులైన వైద్యులు రోగకారణములను దేహమందలి కఫవాత పిత్తాదులనే యనుచుందురు. కాని రోగములు జన్మాంతర కర్మ ఫలములని యొప్పుకొనరు. ఇదేవిధమున కొందరు రోగోత్పత్తి కారణములు కేవల దైవికములని జెప్పుదురు. కాని తమ ఇహజన్మ పూర్వజన్మాంతర కృత దుష్కర్మల (పాపముల) ఫలితములనుచు దెలియజాలరు. ఇట్లు చెప్పువారు తాము జేయు పాపముల నన్ృతాదులచే గప్పియుంచుకొని పాపఫలానుభవముల దప్పించుకొన్నందున కృతార్థులైనట్లు భావించెదరు, కాని న్యాయ శిక్షను బడయుటకు తన తప్పుల వెల్లడించి ప్రాయశ్చిత్తముల గైకొనరు. ప్రతివారు పరమేశ్వరుడు గలడని నామమాత్రమున కొప్పుకొనెదరుగాని, అతడు న్యాయమూర్తియని. యపరాధములను శిక్షించునని దెలియజాలకున్నారు. పరమేశ్వరుడు దుర్మార్గుల శిక్షించనచో జగన్మర్యాదకే భంగము గలుగును. బ్రహ్మాది స్తంబపర్యంత ప్రాణులను పరమేశ్వరుడు శాసించుచున్నాడు. "భీషాస్మాద్వాతః పవతి" ఇత్యాది శృతులు ప్రామాణ్యములు దుర్మార్గులకీ లోకమునందు ప్రాయశ్చిత్తములు జరుగకున్నను పరలోకమందు ప్రాయశ్చిత్తములు జరుగుట సత్యము.

శ్రుతి॥ ౨౭ "నసాంపరాయః ప్రతిభాతిబాలం ప్రమాద్యంతం
విత్తమోహేనమూఢం। అయంలోకోనాస్తి పరఇతి
మానీపునః పునర్వశమాపద్యతే మే"

తా॥ నచికేతును గురించి యముడు జెప్పిన వాక్యము. ధనాద్యభిమానమత్తుడై దుష్కర్మలాచరించు బాలునికి (మూర్ఖునికి) పరలోకము గనుపించదు. వాడు కనుపించునట్టి దీలోకమునే సత్యమనుకొనును. ఆ మూర్ఖుడు మరల మరల నావశమే యగుచున్నాడు (పుట్టుచు నశించుచుండును) కావున పాపాచారి పరలోకమునందు శిక్షలనుభవించి మరల మనుష్యలోకమునందు శేషకర్మచే బుట్టును. శేషకర్మ పాపసంయుక్తమైనందున వర్తమాన దేహము వివిధ రోగయుతముగనుత్పన్నమగును. "ధర్మేణ పాపమనుదతే" అనిగలదు. గాన ధర్మాచరణచే పాపపరిహారమగును. కావున ధర్మానుష్ఠానము జేయగోరువారికి దేశకాలాదివైపరీత్యమున, ఆధ్యాత్మికాదితాపత్రయములవలన, వాతపిత్త శ్లేష్మాదుల యుల్బణమున, శారీరిక మానసిక రుగ్మత గలిగిన యెడల ధర్మానుష్ఠానముల చేయజాలరని, వారికి భవిష్యత్తునందు కలుగబోవు రోగముల నివారణను బోధించుటకై ఈ ఆయుర్వేద శాస్త్రమేర్పడినది. ఈ వైద్యశాస్త్రములో రోగ నిరూపణ, తత్సాధన, ఔషధములు, వాని ప్రయోగవిధి, ఔషధముల సిద్ధముజేయు పద్ధతి, వాని సాధనలు, ఔషధ సేవయందలి నియమములు, రోగ పరీక్ష నాడీ జ్ఞానము మున్నగు ననేక విషయములు పొందుపరుచబడియున్నవి. శాస్త్ర విజ్ఞానమున రోగనివారణ యగుటే శాస్త్రప్రయోజనము. శుశ్రుతమను గ్రంథమునందు దేహపౌష్టికమగు వాజీకరణమను యోగము జెప్పనైనది. దానిని పురస్కరించుకొనియే వాచ్యాయన ఋషి కామసూత్రములను రచించెను. శరీరేంద్రియ స్వాస్థ్యత యుండిననే ధర్మానుష్ఠానముల జేయజాలుదురని పరోపకార పారాయణులగు పతంజల్యాది మహర్షులు వైద్యశాస్త్రముల జెప్పి లోకమునకు మహోపకార మొనర్చిరి. వారికి నమస్కారములుదప్ప మనమేలాటి ప్రత్యుపకారములను జేయజాలము.

శ్లో॥ 50. యోగేన చిత్తస్యపదేనవాచం । మలంశరీరస్యచ
వైద్యకేన । యోపాకరోత్తం ప్రవరం మునీంద్రాం ।
పతంజలిం ప్రాంజలిరానతోస్మి

తా॥ యోగశాస్త్రమును జెప్పి మనోమాలిన్యమును వ్యాకరణశాస్త్రమును జెప్పి వాగ్దోషములను, వైద్య శాస్త్రమును జెప్పి శరీర దోషములను బోగొట్టిన పతంజలి మహర్షికి యంజలి బద్ధుడనై తలవంచెదను.

## 2. ధనుర్వేద ముపవేదము

56. ధనుర్వేదము. ధనశ్శబ్దమునకు రూఢ్యర్థమైనది చాపముగాని ప్రజారక్షణార్ద మవతరించిన శస్త్రాస్త్రములన్నిటియందు ధనుశ్శబ్దార్థ మేర్పరుచనైనది. శస్త్రాస్త్రముల విజ్ఞానము దెలియ జేయునది ధనుర్వేదము. యజుర్వేదమునకు నుపవేదము రూప సాదృశ్యమున్నందున్న యజుర్వేదమునకు ధనుర్వేద ముపవేద మనవచ్చును. యజ్ఞకర్మలందాధ్వరుని కుపకరణములైన జుహ్వాదులు (కఱ్ఱతో జేయబడిన పాత్రలు స్రుక్సువములు కర్మలకు నుపకరణములైనట్లు యుద్ధమునకు నుపకరణములుశస్త్రాస్త్రములు రెంటికి సాధ్యసారూప్యమున్నది. ధనుర్వేదము విశ్వామిత్రమహర్షి ప్రణీతమని, అందుపాదచతుష్టయములు గలవని జెప్పనైనది. ప్రథము పాదము దీక్షాపాదము ద్వితీయము సంగ్రహపాదము, తృతీయము సిద్ధపాదము, చతుర్థపాదము ప్రయోగపాదము.

1. ప్రథమపాదమందు ధనుర్లక్షణము అధికారి నిరూపణము గావింపబడినది. ఇచ్చట ధనుశ్శబ్దమునకు లక్షణ యానాలుగు విధములైన శస్త్రములని యర్థము.

1. ముక్తాముక్తము శల్యాదులు, తదంతర్గత ఇతరాయుధములు.

2. "ముక్తము" చక్రాదులు 3. అముక్తము ఖడ్గాదులు 4. యంత్రముక్తము శరాదులు వీనిలో ముక్తమున కస్త్రమనియు, అముక్తమునకు

శస్త్రమనియు పేర్లు. అస్త్రములందనేక భేదములుండును. ఉ॥ బ్రహ్మా స్త్రము, వైష్ణ వాస్త్రము రౌద్రాస్త్రాదులు.

2. రెండవ పాదమందు ఆచార్యుని లక్షణములు, సర్వవిధాయుధములకు లక్షణ పూర్వక స్వరూపాదులు జెప్పబడినవి.

3. మూడవ పాదమందు గురుసాంప్రదాయాగత సిద్ధులు శస్త్రవిశేషములకు పునః పునరభ్యాసము, మంత్రసిద్ధి కరణములుపదేశింపబడినవి.

4. చతుర్ధ పాదమందు దేవతార్చనలు, అభ్యాస సిద్ధిగల వారలకు మంత్ర విశేషణములతో ప్రయోగాదులు దెలుపబడినవి.

5. క్షత్రియులద్వారా ధర్మరక్షణ, ప్రజాపరిపాలనయగునని ధనుర్వేద ప్రణయనమునకు హేతువగును. ధర్మరక్షణార్థము యుద్ధము క్షత్రియులకు స్వధర్మము.

శ్లో॥ 51. స్వధర్మమపిచావేక్ష్య నవికంపితుమర్హసి ।
ధర్మాద్ధియుద్ధాచ్ఛ్రేయోన్యత్క్షత్రియస్యనవిద్యతే గి. అ. 2. శ్లో. 31.

తా॥ అర్జునా! నీవు యుద్ధము స్వధర్మమగునని యెంచి యైనను చలించవలదు. క్షత్రియునకు యుద్ధమునకంటెను శ్రేష్ఠమైన ధర్మములేదు.

శ్లో॥ 52 యదృచ్ఛయాచోపపన్నం స్వర్గద్వారమపావృతం ।
సుఖినః క్షత్రియాః పార్థలభంతే యుద్ధమీదృశం గి. అ. 2. శ్లో 32.

తా॥ పార్థా! స్వధర్మమైన నీయుద్ధము తనంతటనే (కోరకయే) నీకు ప్రాప్తించినది. స్వర్గ ద్వారములు దెరుచునట్టిది గావున పుణ్యాత్ములగు క్షత్రియులకే ఇట్టి యుద్ధము లభించును.

శ్లో॥ 53. అథచేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం నకరిష్యసి ।
తతః స్వధర్మం కీర్తించహిత్వా పాపమవాప్స్యసి

తా॥ ఒకవేళ నీవిట్టి స్వధర్మయుక్తమైన యుద్ధమును జేయకుంటివేని అప్పుడు స్వధర్మమును, కీర్తిని విడిచినవాడవై పాపమును బొందు

చున్నావు. ధర్మరక్షణార్థము దుష్ట నిగ్రహము, శిష్ట పరిపాలనము క్షత్రియులగు రాజులకు ధనుర్వేద జ్ఞానమును బడయుటకు నీ శాస్త్రమవసరమై యున్నది.

# 3. గాంధర్వ వేదముపవేదము

57. వ్యాఖ్యాన సమత్వరూపమైన సామవేదమునకును సంగీత శాస్త్రమునకు అర్థసారూప్యములు కలవు. నాదము ప్రాణమునందు సమలయమును పొందుట యను నర్థ సామ్యమున్నందున సామవేదమునకు సంగీత శాస్త్రము ఉపవేదముగా నేర్పరుచబడినది.

సంగీత శాస్త్రములోని ముఖ్యములగు గీతము, నృత్యము. అభినయము, భావప్రదర్శన అను నాలుగు కళలను నాలుగు వేదములనుండి గ్రహించి భరత మహర్షి సంగీత శాస్త్రమున బ్రవేశపెట్టెనని క్రింది శ్లోకమునుబట్టి తెలియుచున్నది.

శ్లో॥ 51 జగ్రాహపాఠ్యం ఋగ్వేదాత్సామ భ్యోగీతమేవచ॥
యజుర్వేదా దభినయాన్ర సానాథర్వణాదపి.

తా॥ ఋగ్వేదమునుండి పాఠ్యం (పాట) సామవేదమునుండి గీతము (రాగాలాపాన) యజుర్వేదమునుండి అభినయము, అథర్వణ వేదమునుండి రసమును (భావమును) గ్రహించెను.

58. సంగీత శాస్త్రమునందలి స్వరముల సంఖ్యయు, శరీరమునందుండు ప్రాణముల సంఖ్యయు నేడు గలవు. ముఖ్య స్వరములు, స, రి, గ, మ, ప, ద, ని. ఇవితాల, కాలాది భేదములతో అనేకరాగము లేర్పడినవి. వర్ణము యేదోనొక విశిష్ఠతాలమునందు జేరగ నదే రాగము రంజనార్థము గానము జేయుదురు. భారతదేశమందలి ఈ సంగీత శాస్త్రమందు రాగము లారు విధములుండునని మన్ననగలదు. కాని రాగ నామ నిర్వచనము నందు మత భేదములు గలవు. భరత, హన్మంత మతమునందు. భైరవి, కౌశిక, హిండోలి దీపక, శ్రీ, మేఘములు రాగములు.

సోమేశ్వర, బ్రహ్మమతమందు శ్రీ; వసంత, పంచమ, భైరవి, మేఘ నట నారాయణ రాగములు.

59. నారద సంహితందు మాలవ, మల్లార, శ్రీ, వసంత, హిందోలి, కర్ణాట రాగములు. నేటికాలమందు ప్రాయశః బ్రహ్మ సోమేశ్వర మతరాగ ములు వాడుకలో యున్నవి.

స్వరభేదముచే రాగములు మూడువిధములందురు.

1. సంపూర్ణము, ఇందేడు స్వరములు గలియును.

2. షడ్వా, ఇందారే స్వరములు గలిసియుండును.

3. ఓడ్వా ఇందైదు స్వరములు గలిసియుండును.

మతంగ మతమందు మూడు విధములిట్లు:—

1. శుద్ధము. ఇందు శాస్త్రనియమమువిధి, అనగా ఇందితరరాగచ్ఛాయ లుండరాదు.

2. సాలంకములేక ఛాయాల్గము ఇందితర రాగచ్ఛాయలు గలిసి యుండును. లేదా రెండు రాగముల సమ్మేళన యుండును.

3. సంకీర్ణము. ఇందనేక రాగసమ్మేళన గలదు కావున సంకర రాగ మనబడును.

2. రాగములలో ప్రతిరాగమందొక నిశ్చితమైన సరిగమ లేక స్వర క్రమము, దానికొక విశిష్ట రూపముగలదు. ఆ విశిష్టము ఋతు కాల సమయాదులతో నిశ్చయింపబడును. వానికి రసమొకటి నియతమైన దుండును. ఈవిషయమందనేకాభిప్రాయములు గలవు. ఉదాహార ణార్థము భరత, హన్మంత మతములందు ప్రతిరాగమందైదేసి రాగిణు లుండును. సోమేశ్వరాది మతము లందారేసి రాగిణులు గలవు. కొందరి విశిష్టకల్పనందు నొకానొక రాగ మొకానొక ద్వీపమునం దధికృత మైనందున రాగమున కధిపతి యొకానొక గ్రహమగునందురుగాని యది పరిశంసా మాత్రమే యనిరి. మరికొందరి మతములందెనిమిదేసి

రాగిణులుండుననిరి. కాని యదార్థమునందు రాగరాగిణులందు భేద ముండదు. ఏదైన యవాంతర భేదముండిన నది కల్పితమగును. మొత్తముపైన రాగిణ్యాపేక్షయా, రాగములకు ప్రాధాన్యము గలదు.

3. మానము. గురు, లఘుక్రమ భేదములతో పదభేద, విరామ అతి దీర్ఘ, గమక, మధుర, ఆనందములను ప్రేమపూర్వకమున స్వయం నిర్మించినది, సంగీతమని అర్థము, అది సంసార మందత్యంతదుర్లభమైనది.

4. రాగిణులు రాగముల ఛాయలతో నేర్పడినవి గాన వాని నవాంతర భేదములందురు. మరియు సంకరరాగములుండును కావున శుద్ధ రాగోత్పత్తిని గురించి లోక విశ్వాసమున శ్రీకృష్ణుని మురళి (వంశము) అందలి యేడు ఛిద్రములనుండి యేడు స్వరములు వెడలిన వందురు. మరొకపక్షమందు శ్రీకృష్ణుని పదియారువేల యెనమండ్రుడు గోపికల వలన పదియారువేల యెనిమిది ప్రకారముల గానము చేయబడినందున నన్నియేరాగము లుత్పత్తియైన వనిరి. గాని యవి యిప్పుడు లుప్త మైనవి. ఆరురాగములు ముప్పది రాగిణులు మాత్రము మిగిలినవి.

5. మఱికొందరి మతమునందు శంకరుని పంచముఖములనుండి 1. శ్రీ 2. వసంత 3. భైరవి 4. పంచమ 5. మేఘ యను నైదు రాగములు, పార్వతీ ముఖమునుండి నటనారాయణ రాగమొకటి ఉత్పత్తియై ఆరు రాగములైనవందురు.

60. సంగీత శాస్త్రానుసారముగ తాలమందలి విరామము సమ, విషమ, అతీత అనాగత యను నాల్గు విధములుండును.

సంగీత మందలి యొక స్వరమునుండి వేరొక స్వరము వెలుపుటకై యొకానొక ప్రకారమేర్పరుచబడినది. వానిలో యేడు భేదములు గలవు.

1. కంపితము 2. స్ఫురితము 3. లీనము 4. భిన్నము 5. స్థపిరము 6. ఆహతము 7. ఆందోళితము.

సాధారణులందరు కంపనముననే గమకమనుచున్నారు. గాని కొందరు తప్లా (మద్దెలవంటి వాద్యవిశేషము) యందలిగంభీరస్వరమును గమకమనిరి.

61. గురుముఖాభ్యాసమున శాస్త్ర పరిచయమువలన రాగాదులు గోచరమగును. "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగాన రసంఫణీ" యను న్యాయమున గాన మందఱికిని ప్రియమైనది. దేవతారాధనందు నాదాను సంధానముచే మనోలయము గలుగుటచే శాస్త్ర ప్రయోజనము. మనో లయముతో నిర్వికల్పక సమాధి సిద్ధించునని తాత్పర్యముగాన సంగీత శాస్త్రము నాదాను సంధానమనులయ యోగమును బోధించినది.

62. నానాదేశము లందనేక భాషలలో పలువిధములైన యంత్ర సహాయములతోడ ననేక విధములైన రాగములు గానము జేయబడు చున్నవి. శ్రీకృష్ణభగవానుడు తనకాలమునందు చాళుక్య గాంధర్వ మను రాగమును భూలోకమున కవతరింప జేసినట్లు హరివంశ విష్ణుపర్వ మందు కథగలదు. మొత్తముమీద ఇట్టి సంగీతశాస్త్రమును ప్రజలాదరాభి మానములతో నేర్చి తామానందమును బొందుటయేగాక నితరులకు గూడ నానందమును గల్గించి కళాపోషణ గావించవలయును.

# 4. అర్థవేద ముపవేదము

63. నానార్థములుగల "అర్థ" శబ్దమునకిచ్చట ద్రవ్యమని యర్థము. లోకములో వనితావిత్తములే లౌకికానంద సంధాయకములగుటచే యెల్లరకు దెలిసిన విషయమే. ఇది అథర్వణ వేదమునకు ఉపవేదము. ధనార్జన కగు సాధనములను దెలుపుచున్నది. అభిచారికములు భావ ప్రధాన ములైనవి అథర్వణ వేదమునందు జెప్పబడినవి. ధనార్జనకగు సాధనములు మస్సంకల్పితములు రెంటికిని భావనాసామ్యముగలదు. కావున అథర్వణ వేదమునకిది ఉపవేదమనబడినది. ధనార్జన సాధనలను పలువురు ఋషులు పలుశాస్త్రములలో చెప్పిరి. ఉద్దేశ్యమన్నిటికిని నొకటేగాన నొకే అర్థ వేదము. కాయికవాచక ప్రయత్నమున ధనార్జన జేయుటందు బాహ్యాసాధనములు పలువిధములైన వృత్తులు. దైవారాధనచే విత్తా

ర్జనగోరుట మానసికము. మంత్ర, జప, హోమాదుల నియమముగ జేసిన దేవతాప్రసాదముతో ధనములభించును. కాని కొందరు ధనార్జనకై మంత్రజపాదుల నియమముగ జేయుచు ప్రయత్నములు జేసినను వారికి ధనము లభించుట లేదు. అందుకు ఇహజన్మ పూర్వజన్మాంతర పాప ప్రతి బంధకమే కారణము గావచ్చును.

శ్లో॥ 52. ప్రతిబంధక బాహుళ్యేఫలం జన్మాంతరే స్మృతం
దేవతా తోషణంవ్యర్థం నభవిష్యతికదాచన ।

తా॥ దేవతను సంతోషపెట్టునట్టి ప్రయత్నము ఎన్నటికిని వ్యర్థముగా జాలదు. కావున ఇహజన్మమునందు ప్రతిబంధక బాహుళ్యముచే ఫలము గలుగకుండినచో ఫలము ముందు జన్మలందు తప్పకలభించును.

సక్రమముగా మంత్రజపాదుల తీవ్రప్రయత్నముగ నాచరించినచో ఫలము ఇహజన్మయందే తప్పక సిద్ధించును. "అత్యుగ్ర పుణ్యాపాపై రిహైవ ఫలముచ్యతే" అనునట్లు కారీర్యాది యాగఫలములవలె వెంటనే కలుగును. అట్టి తీవ్రప్రయత్నము లేకుండిన చిత్రియాయాగఫలములవలె కాలాంత రమునందు సిద్ధించును. కావున జేసినకర్మ ఎప్పుడునశించదు.

ఇట్లు
ధర్మ కాండము సంపూర్ణము.

ఓం

శ్రీ గణేశాయనమః

# ఆర్ష విజ్ఞాన సర్వస్వము

## ప్రథమ గుచ్ఛము

## 2. అర్థ కాండము

## చతుష్షష్టి కళలు

అర్థ శబ్దమున కనేకార్థములు గలవు. కాని ఇచ్చట ధనమనగ అర్థమని గ్రహింపవలయును. ధనార్జనసాధనము లనేకములుగ నున్నవి. ఆ సాధనములన్నియు కళలుగా పరిణింపబడినవి.

శ్లో॥ 38 ఇతిహాసాగసూచ్చైవ కావ్యాలంకార నాటకం
గాయకత్వకవిత్వంచ కామశాస్త్రందురోదం
దేశభాషాలిపిజ్ఞానం లపికర్మచవాచకం
సర్వాణిచావధానాని సర్వశాస్త్రంచశాకునం ।
సాముద్రకం రత్నశాస్త్రం రథాశ్వగజకౌశలం ।
మల్లశాస్త్రం సూదకర్మ భూరుహాణంచ దోహదం
గంధవా దోధాతువాదః ఖనివాదోరసస్యచ
జాలవాదోగ్నిస్తంభో ఖడ్గస్తంభోజలస్యచ.
వాచస్తంభో వయస్తంభో వశ్యాకర్షణమోహనం
విద్వేషోచ్చాటనంచైవ మారణంకాలవంచనం ।
పరకాయ ప్రవేశశ్చ పాదుకాసిద్ధిరేవచ ।
వాక్సిద్ధిర్ఘుటికాస్థిరైంద్రజాలికిమేవచ
అంజనం పరదృష్టేస్తు వంచనం పరవంచనం
మణి మంత్రౌషధాదీ నాంసిద్ధయశ్చోరకర్మచ ।
చిత్రలోహాశ్మమృద్దారు వేణుచర్మాంబరక్రియాః ।
అదృశ్యకరణం దండకరణం మృగయావిధిః ।
వాణిజ్యం పాశుపాల్యంచ కృషిరాసవకర్మచ ।
లావకుక్కుటమేషాధియుద్ధకారక కౌశలం ।
చతుషష్ట కలాస్త్వేతా కలావిద్భిః ప్రకీర్తితా ॥

తా॥ 1. ఇతిహాసములు 2. ఆగమములు 3. కావ్యములు, అలంకారములు, నాటకములు 4. గాయకత్వము 5. కవిత్వము 6. కామశాస్త్రము 7. దురోదరము (జూదము) 8. దేశభాషా లిపిజ్ఞానము 9. లిపికర్మ 10. వాచకము 11. సర్వవిధ అవధానములు 12. సర్వశాస్త్రములు 13. శాకునము 14. సాముద్రకము 15. రత్నశాస్త్రము 16. రథ అశ్వగజకౌశలము 17. మల్లశాస్త్రము 18. సూదకర్మ 19. భూరుహోణము 20. దోహదము 21. గంధవాదము 22. ధాతువాదము 23. ఖనివాదము 24, రసవాదము 25. జాలవాదము 26. అగ్నిస్తంభనము 27. ఖడ్గస్తంభనము 28. జలస్తంభనము 29. వాచస్తంభనము 30 వయస్తంభనము 31. వశీకరణము 33. ఆకర్షణము 34. విద్వేషణము 35. ఉచ్ఛాటనము 36. మారణము 37. కాలవంచనము 38. పరకాయ వేశము 39. పాదుకాసిద్ధిః 40. వాక్సిద్ధిః 41. ఘుటికాసిద్ధిః 42. ఐంద్రజాలకము 43. అంజనము 44. వంచనము 45. పరవంచనము 46. మణి 47. మంత్రము 48. ఔషధాదులసిద్ధిః 49. చోరకర్మ 50. చిత్రములు 51. లోహము 52. అశ్మములు (రాళ్లు) 53. మత్తు 54. దారు 55. వేణు (కంక) 56. చర్మము 57. అంబరక్రియలు (వస్త్రనిర్మాణపనులు) 58. అదృశ్య కరణము 59. దండకరణము మృగయావిధిః (వేటాడుట) 60. వాణిజ్యము 61. పాశుపాల్యము 62. కృషి (వ్యవసాయము) 63. రాసవకర్మ (రాసక్రీడ) 64. లావకక్కుటమేషాది యుద్ధ కారక కౌశలము, ఈ కళలందు కొన్ని బుద్ధి ప్రధానములైనవి, కొన్ని భావనాప్రధానములు తక్కినవి వృత్తి రూపములైనవి. ఏ యొక్క కళాకుశలత్వముండినగాని ధన మార్జింపవచ్చును గావున వీనినన్నిటిని అర్థ శాస్త్రమునందు చెప్పనైనది.

1. ఈ కళల తాత్పర్య సంగ్రహమిట్లు :—

1. ఇతిహాసములు: ప్రపంచముయొక్క లేక్క, లేక దేవ, మనుష్యాదులయొక్క చరిత్రను అను పూర్వకముగ బోధించునవి ఇతిహాసములు.

వానిలో చతుర్విధ పురుషార్థములను కథారూపమున కళాత్మకముగ ప్రబోధింపబడుటచే వక్తృత్వ కౌశలముగల వారికి ధనార్జన సాధనమగును. వినిన వారికిని చరిత్రాధ్యయనముచే గలుగు విజ్ఞాన పాటవము గలిగి ఉత్తమ పౌరులు గాగలుగుదురు.

2. ఆగమము :- వేదములే నిగమములు, నిగమేతరములు ఆగమములు వీనినే తంత్రములందురు. పంచాయతనములను గురించి చెప్పునవి వైదికములు, సనాతనములు, వేదవిరుద్ధముగాని పంచాయతన మంత్రములను వేదోక్త ప్రకారముగను, తాంత్రికోక్త ప్రకారముగను, జప, హోమాదుల గావించి సిద్ధిని బడయవచ్చును. వేదవిరుద్ధములైన తాంత్రికోక్తములు ధర్మసాధనములు గాజాలవు. గాని కొందరు తాంత్రికోక్త ప్రకారముగ నుపాసించినగాని ధర్మసాధనమగునని, వేదవిరుద్ద స్మృతులనే పురుషార్ధ సాధనములుగా భావించి సనాతన ధర్మమునకు విరుద్ధములైన ఆచారములను గల్పించిరి. వారి దృష్టిలో వైదికమార్గము కంటెను ఆగమ సిద్ధాంతమే పరమ పురుషార్ధ సాధనమనిభావన.

శ్లో॥ 54. యద్వైదైర్గమ్యతే స్థానం తత్తంత్రైరపిగమ్యతే ।
బ్రహ్మక్షత్రియ విట్ఛూద్రాస్తేన సర్వేధికారిణః॥

తా॥ వైదికమార్గముచే ఏ స్థానము (మోక్షము) లభించునో అదియే స్థానము ఆగమ మార్గాను వర్తనచే లభించును. కావున తాంత్రిక విద్యలందు బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులందరికిని యధికారముగలదు.

2. ఇచ్చట నొకవేళ స్థాన శబ్దమునకు ఆగమోక్త మంత్రమననముచే మోక్షము సాధ్యమని అర్థము చెప్పినచో "యతోవాచో నివర్తంతే" త్యాది శ్రుతులకు విరోధము గలుగుటయేగాక నామరూప రహితమైనచేతన బ్రహ్మను మననము చేయుట సాధ్యముగాజాలదు కావుననే స్మృతి అట్టి శాస్త్రములకు నింద జెప్పినది. ఆ ప్రమాణశ్లోకమిట్లు:—

శ్లో॥ 55. యో వేదబాహ్యా స్మృతయః యాశ్చకాశ్చకు దృష్టయః
సర్వాస్తానిష్ఫలాః ప్రోక్తా స్తమోనిష్ఠాశ్చతాః స్మృతః

తా॥ వేద విరుద్ధములైనవి స్మృతులు గలవో, మరియు నేవేవి కుదృష్టిచే కల్పితములో అవియన్నియు తమోమయములు (అజ్ఞాన నిర్మితములు) కావున నిష్ఫలములైనవి.

మోక్షమును మనన సాధ్యమని జెప్పిన నామోక్షము కృతకమగును. మరియు నపరోక్షుడైన తాను పరోక్షుడైన నుపాస్యుని మననము జేయగ నుపాసకుడు ఉపాస్యుని స్వరూపుడగును. అప్పుడు తనకు గల నపరోక్షత్వమును గోలుపోయి పరోక్షత్వమును జెందవలసి వచ్చును.

శ్లో॥ 56. స్వతోఽఅపరోక్ష జీవస్య బ్రహ్మత్వ మభివాంఛతః ।
నశ్యేత్సిద్ధాఽ పరోక్షత్వమితియుక్తిర్మహత్యహో ।పంచదశి అ. 7. శ్లో 8

శ్లో॥ 57. వృద్ధిమిష్టమతో మూలమపి నష్టమీదృశం
లౌకికంవచనం సార్థం సంపన్నంతత్ప్రసాదతః ।

తా॥ హెచ్చువడ్డి నపేక్షించి బేరము జేయగ మూలధనమునకే ముప్పు వాటిల్లెనను సామెత నీవు జెప్పు యర్థముచే సంభవించుచున్నది.

కావున పైశ్లోకమునందలి స్థానశబ్దమునకు మోక్షేతరములగు లోకములని యర్థము జెప్పవలయిను. ఆగమములన్నియు ఆనందసంధాయకములైనందున ధనార్జనకు సాధనములైన కళలుగా బేర్కొనబడినవి.

3. కావ్యములు :- దృశ్యకావ్యములని, శ్రవణ కావ్యములని రెండు విధములు. శ్రవణ కావ్యములు రఘువంశాదులు. శాకుంతలాదులు దృశ్యకావ్యములు కాంతా సమ్మితములైనందున వానిచే ప్రబోధింపబడు ధర్మాదులను పాఠకులు సులభముగ గ్రహింతురు. కావ్యములను రచించు నేర్పరులు ధనము సంపాదింప సమర్థులగుదురు. అలంకార గ్రంథములు ప్రతాపరుద్రీయాదులు. లక్షణగ్రంథములం దలంకారములు లక్షణములని జెప్పబడును. వీనిని సాహిత్యగ్రంథములనియు నందురు. నాటకములు:- దుష్ప్రవర్తనగల మనుష్యులకు ధర్మమార్గమునందభిరుచిని కల్పించు సద్వివేక దృష్టితో నటులకు ఉపయోగపడు నట్లుత్తమ కవులచే రచింపబడినవి

నాటకములు ఆదర్శ ప్రాయములు. నటీనటులు ఆదర్శప్రాయములై నాటకములనాడుచు ధనము గడింపవచ్చును. జనులకానంద సంధాయకములైనందున కావ్యాలంకార నాటకములు కుశలులకొక కళయగును.

4. గాయకత్వము:- సంగీతమొకకళ. సంగీత జ్ఞానకౌశలము గలవారు (గాయకులు) తమ కంఠమాధుర్యముచే నితరులకు నానందము చేకూర్చెదరు. గానకళ ధనార్జనకు సాధనమగును. గాయకత్వము లక్ష్యతావచ్ఛేదకమని తాత్పర్యము.

5. కవిత్వము :- భాషోపయుక్తముగ ఛందోబద్ధమైన రచనలు గద్యరూపమునను, పద్యరూపమునను లేక నుభయవిధములనుండునవి కవిత్వము. తెలుగుభాషలో పద్యములు, యతిప్రాసగణ ప్రధానములు. పద్యములు వృత్తములు, జాతులు, ఉపజాతులని మూడు విధములు యతి యందనేక భేదములు గలవు. సాధారణముగ మైత్రిగల యక్షరమును, సీసపద్యపాదములందెనిమిదవ యక్షరమును యతియని దెలియవచ్చును. ప్రతి పాదమునందలి రెండవ యక్షరమొకటేయుండు నియమముగలది ప్రాసయగును, గురులఘు సముదాయము గణము. అది మూడు విధములుండును. 1. రెండక్షరములుగలవి 2. మూడక్షరములుగలవి 3. నాల్గక్షరములు గలవి. రెండక్షర గణములందు నాల్గువిధము లేర్పడినవి. వానిలో నొకయక్షరము గురువు రెండవది లఘువున్న హగణము. పైయక్షరము లఘువుక్రింది యక్షరము గురువైన వగణము రెండు గురువులుగాని, రెండు లఘువులుగాని యుండవచ్చును.

శ్లో॥ 58. సానుస్వారచ్చ దీర్ఘశ్చ విసర్గీచగురుర్భవేత్ ।
వర్ణసంయోగ పూర్వశ్చతథా పాదాంతికోపివా ॥

తా॥ అనుస్వారముతో గూడియుండినను, దీర్ఘమును, విసర్గలును గురువులు. సంయుక్తాక్షరమునకు పూర్వమునన్నను, శ్లోకాంతిమ పాదచివరనున్నను ఆయక్షరములు గురువులు.

2. మూడక్షరగణము లెనిమిది విధములివి:—

1. యగణము 2. రగణము 3. తగణము 4. భగణము 5. జగణము 6. సగణము 7. మగణము 8. నగణము.

శ్లో॥ 59. ఆదిమధ్యావసానేషు యరతా యాంతిలాఘవం ।
భజసాగౌరవం యాంతి మనౌతు గురులాఘవం ॥.

తా॥ ఆది లఘువు యగణము. మధ్య లఘువు రగణము, చివర లఘువు తగణము, ఆది గురువు భగణము, మధ్యగురువు జగణము, అంత్య గురువు సగణము, మూడక్షరములు గురువులేయైన మగణము, ఇదే విధమున మూడు లఘువులే గలది నగణము.

3. నాల్గక్షరగణములు మూడు విధములు. ఇవి:- నల, నగ, సలని జెప్పుదురు. అనగా నగణముపైన లఘువుండిన నలము. నగణముపైన గురువుండిన, నగము. సగణముపైన లఘువున్న సలమని దెలిసికొననగును. గణములలోని, నల, నగ, సల, భ, ర, త లీయారు ఇంద్రగణములు. నహము (నగణము, హగణము) లు రెండు సూర్య గణములు మరియు సగల, మగల, భర, భల, భగ, తల, తగ, రల, రగ, నలల, నలగ, సలల, సలగ, నగగ, నగల, నగర లివి పదియారు చంద్రగణములు.

6. కామశాస్త్రము—ఆయుర్వేదమునందు శుక్రునిచే వాజీకరణ మను యోగము జెప్పబడినది, అద్దానిని పురస్కరించుకొని వాత్స్యాయనుడు కామశాస్త్రము రచించెను ఇది కామశాస్త్రము.

7. దురోదరము:- జూదమొక కళగా నేర్పరులకు జెప్పబడినది. రాజులు శత్రు విజయమును కాంక్షించియేగాని, వినోదార్థమునకేగాని జూదమాడుదురు. ఇతరులు సహితము జూదముచే ధనమార్జింపవచ్చును. దుర్వ్యసనమైనందున దీని పరిణామము దుష్ఫలితప్రదమైనది.

8. దేశభాషాలిపి జ్ఞానము :- ఒండొరుల మనోభావములను దెలిసికొనుటకు సాధనరూపమైనదిభాష. అది వాగ్రూపముగును, లిఖితరూపముగును

ఉండును. చెంచు మొదలగు జాతులవారు మాట్లాడునది కేవల వాగూ్రిపమైనది. తెలుగు సంస్కృతాది భాషలు వాగ్లిఖిత రూపములు. ప్రతిదేశమునందుపయోగించుకొను భాష దేశీయము. సమస్త దేశములందుపయోగపడునది కేంద్రభాష. భాషాభేదమునుబట్టి లిపులనేక విధములు. ఇట్టి భాషాలిపి జ్ఞానము నేర్పరులకు కళగా జెప్పనైనది. భాషాలిపిజ్ఞాన కలతో ధనమార్జించవచ్చును.

9-10 లిపికర్మ 2 వాచకము:- వాగ్లిఖిత రూపములైన భాషలందు లిపికర్మ మరల ద్వివిధమైనది. 1. అక్షరరూపము. 2. అంకెలరూపము. అక్షర రూపములైనవి పైజెప్పిన లిపిజ్ఞాన మందంతర్భూతమగును. రెండవది అంకెలరూపమైనది మరల రెండువిధములుండును. 1. గణితమునకుపయోగపడునది రెండవది భాషకుపయోగపడునది. మొదటిదైన గణితమునకుపయోగ పడునదగు లిపికర్మ సర్వసాధారణముగా ప్రతివారు గణితమునకు నేర్పడిన అంకెలను వ్రాయచదువుట నేర్చుకొనియందు నేర్పరులుగావచ్చును. కాని ఇచ్చట వేరుగా లిపికర్మయనుచు జెప్పబడినందున అంకెలను భాషోపయుక్తమగుటకుగాను జెప్పిరని యర్థాత్సి సిద్ధము. అంకెలను భాషాప్రయుక్త మగునట్లు వ్రాయగల నేర్పరికి (కుశలునకు) లిపికర్మజ్ఞుడగుననుచు కళగా జెప్పనైనది ఇట్లు అంకెలిపికర్మ సాంకేతికమైన భాషగా యుపయోగ పడగలదని యర్థము. దీనితోడనే రెండవకళ వాచకముగ వేరుగా నేర్పరచి జెప్పనైనది. సాంకేతిక భాషగా యుపయోగింపబడిన అంకెలిపిని జదువుచు నితరులకర్థము జేయువారలకిది కళగును. ఇట్లుభయవిధములైన (లిపికర్మ వాచకములు) రెండు కళలని నేర్పరులకు జెప్పిరి. ఇవి ధనార్జన సాధనలైనవని అర్థశాస్త్రాంతర్గతము లొనర్చబడినవి. అంకె లిపిభాష రహస్యమైనదిట్లు:-

శ్లో॥ 60. అతాలమేకం కదవ ద్వితీయం జబాసతృతీయం
చపషం చతుర్థీ ఘనాశపంచమం టమహంచషష్ఠి
డయాళ సప్తమం షణర అష్టమీచ

తా॥ సాంకేతికమైన అంకెలిపిభాష జెప్పుటకుగాను శ్లోకమునందు మూడేసి అక్షరములనొక జంటగా నేర్పరచి అందెనమిది జంటల కల్పన జేయబడినది. అంకెలను భాషగా వ్రాయునప్పుడు క్రమముగ మొదటి నుండి యెనిమిది జంటలకగు జంటగుర్తునకుగాను ఆయాజంట సంఖ్యను జూపు అంకెను వ్రాయవలెను. తరువాత ప్రతిజంటయందలి అక్షరముల గుర్తునకుగాను క్రమముగ ఆయాజంటలందలి అక్షర సంఖ్యను దెలుపు నొక గీత జంట అంకె క్రింద వ్రాయవలయును. హ్రస్వము, దీర్ఘము, గుడి, కొమ్ము, అనుస్వారము, విసర్గాదులను అంకెలపై వ్రాయవలయును. ఉదాహరణగా రామశబ్దమంకెలందు వ్రాయదలచినచో రకారాక్షర మెనమిదవ జంటలో జేరిన దగుటతో జంట సంఖ్యను దెలుపు (౮) వ అంకెనుమొదలు వ్రాయవలయును. మకారాక్షరమునకు బదులుగనది (౬) వ జంట నుంటచే (౬) ఆరవసంఖ్య వ్రాయనలయును. రకారాక్షర మెనమిదవ జంటలోని మూడవ అక్షర మగునందున (౮) వ అంకెను వ్రాసిన తరువాత దానిక్రింద (111) మూడుగీతలు (పూర్వకాలమందలి బొల్లైరుసు) గణితలిపిపై యుంచవలయును. దీర్ఘాదులనట్లే అంకెపై నుండునట్లు వ్రాయనగును మకారాక్షర మారవజంటలోని రెండవ యక్షరమగుటతో (౬) ఆరవ అంకెక్రింద (11) రెండుగీతలు పైజెప్పినవి యుంచవలయును. ఇట్లు (౮॥ ౬॥) వ్రాసిన రామశబ్ద మక్షరములలో వ్రాసినట్లగును. ఇదేవిధమున భాషంతయు అక్షరములకు బదులుగా అంకెలతో వ్రాయవచ్చును ఇట్టి లిపికర్మ కౌశలముగల వారు ధనమార్జింతురు. రెండవదగు వాచకమందు కుశలులగువారు. జెప్పిన అంకె లిపికర్మయను భాషను చదువుటందు నేర్పరులనబడుదురు. మరియు సాంకేతికమైన భాష లందు నేర్పరులైనవారికిది కళగా జెప్పుదురు. ఉదాహరణగా రామ చ్చాయ భాషను జెప్పవచ్చును.

శ్లో॥ 61. రామ చ్చాయ ఆజా నాగా టలం తప దశా హనః
షడ బాల సకా వఓ ఇత్యేతే రామభాషయోః

తా॥ సాంకేతికార్థమునకుగాను శ్లోకమందు రెండేసి యక్షరముల నొక జంటగా జెప్పనైనది. భాష మాట్లాడునప్పుడు జంటాక్షరములందొక దానికి బదులింకొకటి బలికిన సాంకేతికమైన నొక విధమగు భాషయగును. ఆ సంకేతము దెలిసిన వారలకు దప్ప నితరులకది బోధపడదు. ఉదాహరణగా రామయను శబ్దోచ్చారణ జేయదలచినప్పుడు జంటలోని మొదటక్షరమైన రా కు బదులు అదేజంటలోని రెండవ అక్షరమైన మ యనుచు బలికి మకారాక్షరమునకు బదులు మొదటిదైన రాకారాక్షరముపయోగించగ భాషగును. ఇట్లు మారయనగ రామయన్నట్లగును. ఇదే విధముగ నంతట భాషగాయక్షరములను శ్లోకమందలి జంటాక్షరములను తలక్రిందుగా బలుకుచున్న భాషయగును. హ్రస్వదీర్ఘాను స్వారాదులను బదులక్షరములకు నుపయోగించవలయును. ఈ విధమగు సాంకేతికమైన భాష వాచకమునందు జేర్పనైనది. కుశలులైన వారలకివి కళలు. వాటితో ధనార్జనగునందున అర్థశాస్త్రమునందు జేర్చిరి.

11. సర్వాణి చావధానాని:- ఆశు కవిత్వమును జెప్ప నేర్పరులు సమయస్ఫూర్తిగా ప్రశ్నలకు సమాధానము జెప్పగలిగిన ధారణాశక్తిచే అవధానముల జేసి సభ్యులకు వినోదము గలిగించి ధనార్జన జేయవచ్చును అవధానములతో అష్టావధాన, శతావధాన, సహస్రావధాన భేదములుండును. అష్టావధానములందు వ్యస్తాక్షరీ, దత్తాక్షరీ, నిషేధాక్షరీ, సమానపూర్ణనము, మొదలగునవి ఎనిమిదియుండును. ఇట్టి యవధానములన్నియును గలిసినదొకే కళయనబడినది.

12. శర్వశాస్త్రాణి:- వ్యాకరణ తర్క మీమాంసాదులేగాక మన్వాది ధర్మశాస్త్రములన్నియు గలిపిన దొకే కళగా సర్వశాస్త్రజ్ఞునకు జెప్పబడినది. ఇవి ధనార్జనందుపయోగింప బడుటతో అర్థశాస్త్రమునందు జేర్పబడినవి.

13. శాకునము:- నిద్రలో గలుగు స్వప్నాదులు భవిష్యత్ఫల సూచకములైనవి శకునశాస్త్రమునందు జేర్చబడినవి. పినిలోనే ప్రశ్న,పంచపక్షి,

కేరళము, బల్లిపాటు, పిల్లి మొదలగు జంతువుల గమనాగమనము లందలి ఫలసూచనలు, పక్షుల ప్రదక్షిణీకరణములు, పశుపక్షులరుతములు మొదలగునవి శుభాశుభములను సూచించునది శాకునము. శకున శాస్త్ర మొక కళగా బేర్కొనబడినది. దీనిచే కుశలులు ధనమార్జింతురు.

14. సాముద్రికము:- హస్త పాదతలములందలి రేఖలు, శరీరావయవములందున్న రేఖలు జూచి వాని శుభాశుభ ఫలముల జెప్పుశాస్త్రము సాముద్రికము.అట్టి సాముద్రిక మొకకళ. నేర్పరులుదీనితో ధనమార్జింతురు.

15. రత్నపరీక్షాశాస్త్రము :- రత్న లక్షణములను జెప్పునది రత్నపరీక్షాశాస్త్రము. రత్నములు తొమ్మిది విధములైనవి గలవు. 1. వజ్రము 2. వైడూర్యము 3. ప్రవాళము 4. పద్మరాగము 5. మరకతము 6. మాణిక్యము 7. గోమేధికము. 8. పుష్పరాగము 9. ముత్యములు. వజ్రపరీక్ష నిట్లు జేయవలయును :-

పద్యము 2. దాకటిమీదబెట్టి బెడిదంబుగు సంపెట వేయభిన్నమై ।
పోకజలంబులో బడిన గుంకక లోహ పత్రికం ।
జేకొని వ్రాయరేఖ విలసిల్లెడు వజ్రము శుద్ధమిద్ధరం ।
బ్రాకటలీల దాల్చనల నార్గవులిత్తురు శుభంబు నిచ్చలున్

ఉత్తమజాతి నవరత్నములు కుబేరుని కోశాధ్యక్షుడైన మణిభద్రుని యాధిపత్యమున కోశాగారమునందుగలవు.

శ్రుతి॥ ౨ా "ఉపైతుమాందేవ సఖః కీర్తిశ్చమణినాసహ ।
ప్రాదుర్భూతోస్మి రాష్ట్రేస్మికీర్తి మృద్ధిందదాతుమే ల. క్ష్మీ. సూ.

తా॥ దేవసఖుడు (కుబేరుడు) కీర్త్యభిమాని దేవతను మణులతో లేక మణిభద్రునితో సహా ఈ రాజ్యమునందీ యూరిలోనుండు నావద్దకు వచ్చి నాకు కీర్తిని, బుద్ధిని (సంపదను) ఇచ్చుగాత నవరత్న సంఖ్యయందలి మాణిక్యమను రత్నము భూలోకమునందెచ్చట గానుపించదు. చింతామణి దేవలోకమునందు, కౌస్తుభమణి విష్ణుదేవుని వద్ద, శమంతకమణి సత్రాజిత్తునకు సూర్యుడిచ్చినట్లు భాగవతాది పురాణములందు జెప్పబడి

నది. పద్మరాగాది రత్నముల లక్షణములు రత్నశాస్త్రమునందు జెప్ప బడినవి. భాస్కరరాయులు లలితాసహస్రనామ భాష్యమునందు జెప్పిరి. ముత్యములు సముద్రమునందు ముత్యపు చిప్పనుండి పుట్టును. స్వాతి కార్తిలో వర్షబిందువులు ముత్యపు చిప్పలో బడగ నవి ముత్యములుగా పరిణమించును. ఇట్టి ముత్యములను శౌక్తికములందురు. ఇందు సుర్టీలు, కరడ మున్నగు భేదములు గలవు. ఉత్తమజాతి యేనుగ కుంభస్థలము నుండి జనించునవి గజమౌక్తికములు. మేఘములనుండి ముత్యములు గలుగునందురు. అవి మనుష్యుల కలభ్యములు.

పద్యము 3. నీరదముల్ద్విగంతముల నిండితటిద్ఘన గర్జితంబులే
పారమహోగ్ర వృష్టి జనియించి నితాంత కాంతితో
నారయకుక్కుటాండ సమమైగను పట్టెడు ముత్యములం
తరిక్ష సంచారులు బట్టుకొందురు వెసన్వసుధంబడకుండ నేర్పునన్.

వృక్షములనుండి ప్రవాళోత్పత్తి యగును. ఇట్టి రత్న పరీక్ష కౌశలము కళయందురు. ధనమార్జించుసాధనము.

16. గజాశ్వరథ కౌశలము :- రథ, గజ, తురగములు వాహనములు సూతుని ధర్మములు. గజాశ్వరథ శిక్షణ చాతుర్యమును కళగా జేర్కొనబడినది. ఇదియు ధనార్జనకు సాధనమైనందున దీనిని అర్థశాస్త్ర ములో జేర్చిరి.

17. మల్లయుద్ధము:- ఆయుధము లేక కేవల భుజశక్తితో నిద్దరుపోరు టను మల్లయుద్ధమందురు. మల్లయుద్ధములు వినోదమునకును, జయము నకును జేతురు. నేడు మన మద్దానిని కుస్తీపట్టుట యందుము, మల్లులను పహల్మానులని యందుము. దేహబలమును బెంచుటకు, ఇతరులను జయించుటకు నుపయోగపడును. కావున దీనిని కళగా జెప్పిరి. దీనిచే ధనార్జన జేయవచ్చును. ఇప్పటి అణుశక్తి కాలమునందిది యుపయోగ పడదు. నామ మాత్రావశిష్టమైనది.

18. సూదకర్మ:- పదార్థములను రసవంతముగను, రుచికరముగను వండుట నేర్పునది సూదకర్మ. కేవల శాస్త్రజ్ఞానమున నిది తెలియు

నదికాదు. నేర్పరులనుజూచి పాకముల జేయుటందు నేర్పరియగును. దీనియందు నైపుణ్యముగల వారికి కళయగును. సూదకర్మ కళలో నలుడు, భీముడు మొదలైన వారు నేర్పరులు.

19. భూరుహోణము:- వనస్పతి విజ్ఞానమున లతావృక్షాదుల నాటుట, పెంచుట, కాపాడుట, వాని గుణంబుల నెరుంగుటను వనస్పతి విజ్ఞాన మందురు ఇట్టి విజ్ఞానమున ఔషధములు సిద్ధము జేసి రోగుల కుప చారములు జేయుటకును, వైద్యులకు వనస్పతులందిచ్చుటకును వనస్పతి జ్ఞానముపకరించును. కావున వనస్పతి విజ్ఞాన మొక కళగా నేర్పరు లకు చేర్కొనబడినది. దీనితో ధనమార్జింపవచ్చును.

20. దోహాదము:- వనస్పతులను పెంపొందించుటకు కావలసిన ఎరువు లను దెలిసికొనుటను దోహాద విజ్ఞానమందురు. ఇదియు నొక కళయే. దీనిచే ధనమార్జింపవచ్చును.

21. గంధవాదము:- భూపరీక్షా విజ్ఞానమును గంధవాదమందురు. ఏ క్షేత్రములు, ఎట్టి పంటలకు నుపయుక్తములగునో వానికుపయుక్తములైన ఎరువులెట్టి వియ్యవలెనో దెలుపునదీ విజ్ఞానము. నేర్వరులకిది కళయగును.

22. ధాతువాదము:- బంగారము, వెండి, రాగి, ఇత్తడి, ఇనుము మొదలైన ధాతువులేవి, ఏ విధముగ, ఏ గనులనుండి తీసి, ఎట్లు శుభ్ర పరుచవలయునని దెలుపునది ధాతువాదము. శాస్త్రీయ విజ్ఞానముతో నేర్పరులైన వారికి ఇది కళ-ధనార్జనకు నుపకరించును.

23. రసవాదము:- పాదరసము, గంధకము, మైలతుత్తము, ఇంగ్లికము మొదలగు వానిని గనులనుండి దీయుటను; శుభ్రపరచుటను, నేర్పునది ధాతువాదము. దీనిలో కౌశల్యముగల వారి కిదొక కళగా జెప్ప నైనది. ధనార్జనకు ఉపకరించును.

24. ఖనివాదము:- అభ్రికము మొదలైన పదార్థములుండు గనులను గుర్తించుటను, తీయుటను, శుభ్రపరుచుటను నేర్పునట్టి విజ్ఞానమ్మును ఖని వాదమందురు. ఇదియు నొకకళ. దీనిచే ధనమార్జింపవచ్చును.

25. జాలవాదము:- చేపల భేదములను, చేపల పట్టుటను, వానిని పట్టుటకు ఉపయోగపడు సాధనములను దెలిసికొనటను నేర్పునది జాల వాదము. ఇదియు నొకకళ, దీనిచే ధనమార్జింపవచ్చును.

26-31. స్తంభనాదులు:- అగ్నిస్తంభనము 2. ఖడ్గ స్తంభనము 3. జల స్తంభనము 4. వాచస్తంభనము 5. వయస్తంభనము లివియైదు. మణి, మంత్ర, ఔషధులచే అగ్న్యాదులశక్తిని ప్రతిబంధించుట స్తంభన యన బడును. వీనిలోని ప్రత్యేక మొక్కొక్క స్తంభన విజ్ఞానమునందు కౌశల్యము కళయగును. నేర్పరులు వీనితో ధనమార్జింతురు. ఇప్పటి కాలమునందు మణియలభ్యము. మంత్రశక్తి తెలుపువారు లేనందున విద్యలుప్తమైనది. ఔషధక్రియచే చెట్ల పసరురాచుకొని అగ్నిలో నడచుట మాత్రమిప్పుడు గానుపించుచున్నది. ఇవినామమాత్రా వశిష్టములు.

32-37. వశీకరణాదులు:- వశీకరణము 2. ఆకర్షణము 3. మోహనము 4. విద్వేషణము 5. ఉచ్చాటనము 6. మారణము లివియారు మంత్రశక్తిచే స్త్రీ, ధన, రాజ, జనులను స్వాధీనముగావించుట కొరకు జెప్పబడినవి. ఇట్టి విజ్ఞానమునందు నేర్పరులకు నివి ప్రత్యేక కళలుగా జేర్కొనబడినవి. వీనితో ధనమార్జింప వచ్చును.

38. కాలవంచనము:- ప్రాణాయామాద్యష్టాంగ యోగసాధనము లచే హఠయోగ సిద్ధిని బడసి మృత్యువును గెల్చిన కాలవంచన యగును. కౌశల్యముగల వానికి కాలవంచన కళయగును. ధనార్జనకు సాధనముగా వచ్చుటచే అర్ధశాస్త్రాంతర్గతము చేయనైనది.

39. పరకాయప్రవేశము:- నాభిరంధ్రమునుండి సూక్ష్మశరీరముతో ఇతర మృత కళేబరములందు బ్రవేశింపుట పరకాయప్రవేశము. ఇదిప్పుడు నామమాత్రా వశిష్టమైనది. కలియుగమునందు విక్రమాదిత్యుడు, శ్రీ శంకారాచార్యులు పరకాయప్రవేశమును జేసిరని కథమాత్రమే గలదు. ఈ విద్య అద్భుతమును గలిగించుటచే కళగా బేర్కొనబడినది. ధనార్జ నకుగూడను సాధనమగుటతో అర్ధశాస్త్రమునందు జేర్చిరి.

40. పాదుకాసిద్ధి:- వనస్పతి విజ్ఞానముచే నొకానొక చెట్టు పసరు పాద తలమునకు రాచుకొనినను, ఆ చెట్టు కఱ్ఱతో జేసిన పాదుకల దొడిగికొనినను, సంకల్పించికొనిన చోటున జేరవచ్చును. ఇట్టి విజ్ఞానము పాదుకాసిద్ధి యనబడును. పాదుకాసిద్ధిని మనుచరిత్రలోని ప్రవరుని కథ దెలుపుచున్నది.

పద్యము 4 అకలంకౌషధ సత్వము న్దెలయ
మాయాద్వారకావంతి గాశి గురు
క్షేత్ర గయాప్రయాగ మున్నగు మాన్య
క్షేత్రముల్దక్కి యుద్దండక వేదండ
వవరాహ వాహరిపు ఖడ్గ వ్యాఘ్రమిమ్మంచు
కొండకు రాజెల్లనే బుద్ధి జాడ్యజనితోన్యాదు
ల్గదాశోత్రియుల్.

పాదుకాసిద్ధి విజ్ఞానమునందు కౌశల్యము గలవానికిది కళ. దీని చేధన మార్జింప వచ్చును.

41-42. వాక్సిద్ధిః, ఘటికాసిద్ధి:- సత్యమెల్లప్పుడు బలుకుచేగాని, నిత్యముగ మౌనాభ్యాసము జేసినగాని, మంత్ర, జపములతోగాని వాక్సిద్ధి గలుగును. సిద్ధునికిది కళయనబడినది 2. ఘటిక నొకానొక విధమైన ఔషధము. సిద్ధుల యనుభవముచే జేయబడినది. ఏ రోగమునకైన నుపయుక్తమగునందురు. ఘటికాసిద్ధి కళగా నేర్పరుచనైనది. ధనార్జన సాధనములు కావున అర్థశాస్త్రమునందు జేర్చిరి.

43. ఇంద్రజాలకము:- హస్తలాఘవముచేతను, రసాయనిక క్రియాదుల చేతను విచిత్రవస్తు ప్రదర్శనాదుల గావించు నేర్పు ఇంద్రజాల విద్యచే గలుగును. దీనిని గారుడీ విద్యయందుము. దీనియందు నైపుణ్యము గల వారికిది కళగా బేర్కొనబడినది. ఇదియు ధనార్జన సాధనమగును.

44. అంజనము:- ఓషధులతో జేయబడు కాటుకను అంజనమందురు. ఇట్టి కాటుక నొక పిల్లవాని హస్తతలమునకురాచి ఆ కాటుకను నిదాన

ముగ జూడుమనగ బాలుడు అంజనమునందు జూచుచు మనమడిగిన ప్రశ్నలకు ఉత్తరమిచ్చును. ఇది ధనసాధనమగును. నేర్పరికిది కళగా జెప్పబడినది.

45. వంచనము పరవంచనము :- తనకును, ఇతరులకును మోసముజేయుట వంచన పర వంచనములు. రాజనీతి దృష్టిచే తన పక్షము న్యాయపక్షమై శత్రువు బలవంతుడైనప్పుడు అతనిని మోసగించియైనను జయించుట న్యాయమే యగుననిరి. ఇదే విధమున తనకు రావలసిన ధనమును రాబట్టుకొనుటకై మోసగించియైనను ఇతరులవద్దనుండి రాబట్టుకొనుట అన్యాయముగాజాలదు. ఇట్టి నేర్పరి కిది కళగా జెప్పబడినది.

46. మణి మంత్రౌషధాదుల సిద్ధులు:- లోకమంద లభ్యమైన మణిని సంపాదింపగలిగెనేని, మంత్రసిద్ధి దుర్లభమైనది సిద్ధించినను, అలభ్యమైన ఓషధి అనగా పాదుకాసిద్ధికి నుపయోగపడు దానివంటిదగు వనస్పతి (వజినిక) లభ్యమైన నీ మూడు సిద్ధులు గలపిన దొక కళగా జెప్పబడినది. వీనితో ధనమార్జింపవచ్చును.

47. చోరకర్మ:- ఇతరుల వస్తువులనపహరించుట చోరకర్మ. ఇది నిందితమైనను ఇట్టి జ్ఞానము దొంగలను బట్టుకొనుట కవసరమైనందున చౌర్యము కళగాభావించి యర్థశాస్త్రములో నుడివిరి. చోరకర్మయందు నిపుణునికిది కళయగును.

48-57 :- 1. చిత్ర 2. లోహ 3. అశ్మ 4. మృత్తు 5. దారు 6. వేణు 7. చర్మ 8. అంబర క్రియలు. ఎనిమిది పారిశ్రామిక వృత్తులు వీనిలోని ప్రత్యేకవృత్తి యొక కళగా నిపుణులకు నేర్పరుచబడినది. చిత్రపదమున వినోదములకగు విచిత్రవస్తు నిర్మాణ కుశలత, లోహ శబ్దమున ఇనుప వస్తు నిర్మాణ కుశలత (కమ్మరిపని) మృత్తు వనగ మంటి వస్తువులు (కుమ్మరి పని) అశ్మ శబ్దమున రాళ్ళతోనగు పనులు (ఉప్పరి పని) దారు పదమున కఱ్ఱతోనగు పనులు (వడ్రింగి పనులు) వేణువనగ కంక పనులు (మేదరి పనులు) చర్మ శబ్దముచే తోలుతో జేయబడు వస్తువులు, అంబరములు—

వస్త్రములు (సాలెపని) ఈ పారిశ్రామిక వృత్తులచె ధనార్జనగుట ప్రత్యక్షము.

58. అదృశ్యకరణము :- తానితరుల కగుపడకుండ నితరులను దాను జూచుట అదృశ్యకరణము. ఇదియు నొక కళయే. దీనితో ధనార్జన గావింపవచ్చును.

59. దండకరణము, మృగయావిధి :- దండన విధాన నైపుణ్యము పరి పాలకులకు నవసరమైనది. ప్రజారక్షణార్థము దుష్ట జంతువుల సంహ రించుటకు వేటాడుట విధియగును. కావున పరిపాలకుల ధర్మము లైన నీ రెండు నొక కళగా నిపుణులగు రాజులకు చెప్పబడినది. ఇవి ధనార్జన సాధనలగుటతో అర్థశాస్త్రమునందు జేర్పనైనవి.

60-62. 1. వాణిజ్యము 2. పశుపాలనము 3. కృషి ఈ మూడును వైశ్యుల ధర్మములు. ''కృషి గోరక్షవాణిజ్యం వైశ్యకర్మ స్వభావజం'' గీత. వీనినే వార్తావృత్తులందురు. న్యాయముగననుష్టించగ ధనా ర్జనకు కొఱతయుండదు. వాణిజ్యాదులు మూడు ప్రత్యేక ప్రత్యేక ముగా నొక్కొక్క కళగా జేర్కొనబడినవి. వీనిచే ధనార్జన జేయు చుండుట ప్రత్యక్ష సిద్ధమైనదియేకదా !

63. రాసక్రీడ:- పలువురు స్త్రీలతో పలురూపములు జేకొని తాను వారితో విలాసముగా క్రీడించుటను రాసక్రీడయందురు. ఇది వినోద మును ఆనందమును గలిగించునందున కళగా జేర్కొనబడినది. ఇప్పటి కాలమునందిది నామమాత్రా వశిష్టమైనది. ధనార్జనకును సాధనమగుటచే అర్థశాస్త్రాంతర్గతమైనది.

64. లావకుక్కుట మేషాది యుద్ధకారక కౌశలము:- దున్నపోతులకు, కోళ్ళకు, మేక మొదలగు వానికి పోట్లాటలు బెట్టించి పందెములందు గెలి

చిన సంతోషింతురు. ఇందు నిపుణులకు మేషాది యుద్ధకారక కౌశలమున నొక కళగా నేర్పరిచిరి. దీనిచే ధన మార్జింపవచ్చును. ఇట్లు చతుష్షష్టి కళలు సంగ్రహముగా వివరింపబడినవి. ఇందు జెప్పని నితర సాధనములన్నియు నిందే యంతర్భూతములగును. కావున ధనమార్జించుట కనేకోపాయములు గలవు.

ఇట్లు

అర్ధకాండము సంపూర్ణము.

ఓం

శ్రీ గ ణే శా య న మః

# ఆర్ష విజ్ఞాన సర్వస్వము

## ప్ర థ మ గు చ్ఛ ము

### 3. కా మ కాం డ ము

65. సదద్వితీయ ఆత్మ (పరబ్రహ్మ) నిర్విశేష ఆనందస్వరూపు డతడే నామ రూప వికారమాత్ర జగత్తునకు అభిన్న నిమిత్తో పాదాన కారణము.

శ్రుతి॥ —— "ఆనందాద్ధ్యే వఖల్విమాని భూతాని
జాయంతే । ఆనందేన జాతానిజీవం
తి । ఆనందం ప్రియ న్త్యభి సంవిశంతీతి. చ్ఛ. వ.

తా॥ ఈ కనుపించు చరాచర భూతములు ఆనంద కారణమున జనించును. ఆనంద కారణమున జీవించును, ఆనందమునందే సాకల్యముగ లయించును.

66. ఆత్మపరిపూర్ణానంద రసస్వరూపమని సముద్రోదాహరణగ శ్రుతి జెప్పినది. సముద్ర స్థానీయమైనట్టి పరిపూర్ణ బ్రహ్మానంద రసమునుండి యొక మాత్ర (లవము-కళ) ఈ కనుపించు విషయప్రపంచమునందు ఆభాసించుచున్నది. కనుపించు సముద్రజలమునుండి యొక జల బిందువు గాలిచే పైకిలేచినప్పుడది సముద్రజలముకంటెను వేరుగ గనుపడునేకాని వాస్తవముగ నా జల బిందువు సముద్రోదకమునకంటెను వేరు గాజాలదు. అట్లే విషయాదులందగు పడుచున్న ఆయా భాసమాత్ర బ్రహ్మానంద లవము పరిపూర్ణ బ్రహ్మానందమున కంటెను వేరుగాజాలదు. పరిపూర్ణానంద మయుడైన బ్రహ్మ ఈ గనుపించు నామరూప వికార బహుభవనమునకు

( చరాచర ప్రపంచ బహు భవనమునకు ) కామించినాడు ( సంక ల్పించినాడు).

శ్రుతి॥ ౩౦ "సోకామయత బహుస్యాం ప్రజాయేయేతి".

తా॥ ఆయానందమయుడు నామరూపవికార జాత బహు భవనమునకు కామించెను. బ్రహ్మకామనచే ప్రజోత్పత్తియైనది కావున విషయాదు లందు బ్రహ్మానంద లవము (కామకళ) ఆభాసించుచున్నది. అదియే భాసించని యెడల నెవ్వరికి విషయాదులందు ప్రవృత్తియే గలుగజాలదు. అనగా సర్వవిషయ వ్యవహారములు లుప్తమై సంసారచక్ర మిపుడగుపడు నట్లు నడువజాలదు. కావుననే జీవుడాత్మ ప్రతిబింబుడైనందున విష యాదులందగుపడు బ్రహ్మానంద లవమునే బొంది యానందించుచున్నా డని శ్రుతి జెప్పుచున్నది.

శ్రుతి॥ ౩౧ "రసో వైసః రసగ్గ్ం హ్యే వాయంలబ్ధ్వాఽఽ
నందీభవతి। కో హ్యేవాన్యాత్కః ప్రాణ్యా
ద్యదేష ఆకాశ ఆనందోనస్యాత్".

శ్రుతి॥ ౩౨ "ఏతస్యైవానందస్యా న్యానిభూతాని
మాత్రముప జీవంతి". బ్రహ్మవల్లి

తా॥ పరబ్రహ్మ నిశ్చయముగ ఆనంద రసస్వరూపుడు. ఆత్మ ఆనంద రసమునే బొంది ఆనందించును. ఆకాశము (బ్రహ్మ) లేకుండినచో నిత రముచే నెవరు ప్రాణచేష్టలు జేతురు? చేయజాలనందున బ్రహ్మానంద లవము తోడనే సమస్తభూతము లుపజీవించుచున్నవి. (స్థితినిబొంది యున్నవి) కామశబ్దమునకు గౌణార్థముచే పుత్రుడు (సంతానము) అర్థ మని, త్రివర్గములలో జేరిన తృతీయ పురుషార్థమని, ధర్మకాండమునందు జెప్పబడినది. పుత్రుడే ఇహలోకమునందు తండ్రి జేయనగు శేషకార్య ములను తండ్రి మరణించిన తరువాత నతని ప్రతినిధి న్యాయముగ నాచ రించును. పరలోక సుఖములు పుత్రుడు గలిగిన వారికే గలుగునని జెప్పనైనది. కావుననే "పున్నామ్నో నరకాత్త్రాయ తీతిపుత్రః"

యనుచు పుత్రశబ్దమునకు నిర్వచన గలదు. మరియు ''అపుత్రిస్యగతి ర్నాస్తి'' యని ప్రమాణమున్నందున, పితౄణ మోచనార్థము సత్సంతానావశ్యకతగలదు. ఇట్లు సత్సంతానార్థము భార్యాసంయోగావసరముగలదు.

శ్రుతి॥ ౩౩ "ఆచార్యాయ ప్రియంధనమాహృ
త్యప్రజాతంతుమావ్యవచ్ఛేత్సీః" శిక్ష.

తా॥ సమావర్తన జేయునప్పు డాచార్యునికి ఇష్టమైన ధనము నొసంగి సంతాన తంతువును విచ్ఛేదము జేయవలదు. అనగా అనురూపవతి యగు దారా పరిగ్రహమును జేసి స్వభార్యాసంయోగమున పుత్రి సంతతిని బడయుమని శ్రుతి ఉపదేశించినది.

శ్రుతి॥ ౩౪ "ప్రజాచస్వాధ్యాయ ప్రవచనేచ ప్రజ
నశ్చస్వాధ్యాయ ప్రవచనేచ ప్రజాతి
శ్చస్వాధ్యాయ ప్రవచనేచ" శిక్ష.

తా॥ ప్రజా:— సత్పుత్ర సంతానము 2. ప్రజననము—రతి (స్వభార్యా సంయోగము) 3. ప్రజాతి—పౌత్రుని జన్మ లివిమూడు స్వాధ్యాయ ప్రవచనములు—తపస్సులు

శ్రుతి॥ ౩౫ "స్వాధ్యాయ ప్రవచన ఏవేతినాకో
మౌద్గల్యః । తద్ధితప స్తద్ధితపః".

తా॥ ముద్గలుని పుత్రుడైన నాకుడనువాడు స్వాధ్యాప్రవచనములనే తపస్సుగా దెలిసికొనెను. శ్రుతియు నదే సత్యమని (స్వాధ్యాయప్రవచనమే తపస్సని) స్వయముగ ఆదరార్థము ద్విరుక్తిచే జెప్పినది. పై శ్రుత్యర్థము వలన తపస్సాధ్యమైన, పుత్రసంతానమే తపః ఫలమని, ప్రజననము (స్వభార్యా సంయోగము) సాధనరూప తపస్సని దెలియుచున్నది కావున కామ శబ్దమున కిచ్చట స్వభార్యా సంయోగరూపమైన రతిని (విషయానందమును) సాధనసాధ్యముల కభేదన్యాయమున అర్థము జెప్పనైనది. ఇదియే గృహస్థునికి స్వధర్మము. ప్రతిమనుజుడు మూడు ఋణములతో జన్మించును.

శ్రుతి॥ ౩౮ "త్రిభిర్వై ఋణీజాయతే । బ్రహ్మ
చర్యేణ ఋషిభ్యో । యజ్ఞేదేవేభ్యః ప్ర
జయాపితృభ్యః"

తా॥ మూడు ఋణములతో జన్మించుచున్నాడు వేదాధ్యయనముచే ఋషి ఋణము యజ్ఞాదులచే దేవతల ఋణము, పుత్ర సంతానముతో పితృఋణము దీర్చవలయును. స్వభార్యా సంయోగమున పుత్రోత్పత్తిని జేయజాలకున్నచో వేరువిధముగ పితౄణమోచన గాజాలదు.

పద్యము. 5. వేయున్జెప్పెడిదేమి మౌనివర సద్వృత్తంబుచేనేమిట
న్జేయన్రాదు పితౄణమోక్షము సుతశ్రీదప్పదత్ప్రాప్తికి
న్ధీయుక్తింగడునొండు త్రోవగలదే నిన్వేడెదన్దేవర
న్యాయంబొప్ప ఘటింపు మాకురుబలం బవ్యాహృతిన్వర్ధిలన్.

రాఘవ పాండవీయ.

67. పై కారణముల వలన సత్సంతానార్ధము కామమావశ్యకమైనది. సాధనార్థము నిచ్చునట్టి కామము స్త్రీ పురుషులందలి ఆనందజన్యమైనది. విషయానందమునం దగుపడుచున్నది. ప్రమాతను తమ వైపు యాకర్షించి బద్ధునిగా జేయుటచే శబ్దాదులే విషయములు. వాని కోరిక (కామము) విషయ కామన యనబడును. విషయాదులందలి ఆనందలము (కామకళ) ప్రమాతల తారతమ్యమున కార్యబ్రహ్మనుండి మనుష్యుని వరకు (సార్వభౌముని వరకు) శతగుణోత్కర్షాప కర్షగయుండునని శ్రుతి జెప్పినది. "బ్రహ్మాద్యా స్తారతమ్యేన భవత్యానంది నోలవః" యనుచు శ్రీశంకరభగవత్పాదులు ఆత్మబోధయను గ్రంథమున నుడివెను, ఈ విధముగ బ్రహ్మానంద లవమే విషయానందమున భాసించుచున్నది. విషయానంద మాభాసమాత్రమైనదైనను వ్యవహార దశయందు దానికి వ్యావహారిక సత్యత్వముగలదు. స్త్రీ పురుషులీ విషయానందమునే గోరిన రతిచే (సంభోగముచే) వారి కీయానందము గలుగును. విషయాదులందలి, శబ్దస్పర్శ, రూపములు శ్రోత్ర, త్వక్కు, చక్షుః, ఘ్రాణములచే గ్రహింపబడినగాని యవి క్షణికములైనందున ఆనంద తృప్తిని గలిగించ

జాలవు. జిహ్వోపస్థలు రసనేంద్రియములందొకటి జిహ్వ, తద్వారా అన్నోదక రసములు గ్రహింపబడగ నదితుద్భృష్ణలని వృత్తిని జేసి యుపశ మించునుగాని అన్నోదకములు శుక్రముగా బరిణమించినందుకు ఆనందము పూర్తిగానందున విశేషతృప్తికై మనస్సు గోరుచుండును.

రెండవ రసనేంద్రియమైన కేవల ఉపస్థేంద్రియము ఆనంద రసలవమును (కామకళను) గ్రహింపజాలినందున పరిపూర్ణతృప్తి గలుగును. (ఆనం దించును)

శ్రుతి॥ ౩౭. 'ఆనంద ఇత్యుపస్థే" బ్రహ్మవల్లి

తా॥ ఉపస్థేంద్రియమునందు బ్రహ్మ ఆనందరూపమున గలడని యుపా సించవలయును.

68. ఉపస్థేంద్రియము (లింగము) స్త్రీ పురుషులందు ప్రతిపక్షముగ నిర్మించ బడినవి. కావున నుభయులవిరుద్ధ లింగముల పరస్పర సంయోగముననే ఉభయులకు పైజెప్పిన యానంద తృప్తిగలుగును. ఇట్టి రతి రహస్యము లను దెలిసికొనుటకు కామశాస్త్రావశ్యకతయున్నది. శాస్త్ర జ్ఞానము ననే స్త్రీ పురుషుల జాత్యాదు దెలియబడును. జాతి, కళాస్థానాదులు దెలిసిన యెడల సంస్కారాదులచే కామకళను స్థానచ్యుతి గావించుటకు శక్యమగును. కామకళాస్ఖలనచే స్త్రీ పురుషులు మోహితులగుచు విషయా నంద తృప్తిని బడయగలుగుదురు.

శ్లో॥ 62. నిస్సారేజగతి ప్రపంచ సదృశే సారంకురంగీదృశా।
మేకంభోగసుఖం పరాత్మ పరయానందేన తుల్యంవిదుః।
తజ్జాత్యాది వివేక మూఢమన సోలబ్ధ్వాద నానాంగనాః।
సంవిందంతిన కామతంత్ర వికలాపశ్వాది వన్మానవాః

తా॥ నిస్సారమైన నీ ప్రపంచమునందు సారభూతమైనదే స్త్రీ. సంభోగ సుఖమది బ్రహ్మానంద తుల్యమైనది. స్త్రీల జాత్యాది విశేష విజ్ఞానములేని మూఢమనస్కులకు నానాజాతి స్త్రీలు లభించినను కామతంత్ర వికలు

లై నందున (కామశాస్త్రజ్ఞానము లేనందున) పశ్వాదితుల్యభోగు లన బడుచు ఆనందమగు తృప్తిని బడయజాలరు.

69. వాచ్యాయనఋషి పంచాధ్యాయాత్మికమైన కామసూత్రము లను రచించెను. దానిపై యనేక వ్యాఖ్యానములుగలవు. పూర్వ రచయితల యభిప్రాయమును సంగ్రహించి కొక్కోకుడు కొక్కోకశాస్త్ర మను కామశాస్త్రము వ్రాసెను. దానికే రతిరహస్యమను నామాం తరము గలదు. (ఆంధ్రమున ఎఱ్ఱాప్రెగ్గడ దాని నాంధ్రీకరించెను). కల్యాణమల్లుడు అనంగరంగమను కామశాస్త్రము వ్రాసెను. ఇట్లనేకులు కామశాస్త్రములను జెప్పిరిగాని యవి విషయ విభాగసందర్భమును సక్రమ పద్ధతితో జూపుటలేదు. హరిహరనాథకవి శృంగార దీపికయను కామ శాస్త్రమును స్వతంత్ర గ్రంథముగా రచియించినాడు. అది విభావాను భావస్ఫూరకముగాగలదు. నానా రసపూరితములైనవి విషయములు. ఆ రసములివి:- 1. శృంగార 2. వీర 3. భీభత్స 4. భయానక 5. హాస్య 6. రౌద్ర 7. కారుణ్య 8. అద్భుత 9. శాంతములు. ఈ నవరసములలో బ్రహ్మా నందమునకు శాంతరసము ప్రధానమైనట్లు విషయానందమందు శృంగార రసము ప్రధానమైనది. విషయానందానుభవమునకై స్త్రీ పురుషులు తమ శరీరములను భోగసాధనములను శృంగారించుకొనెదరు. విషయము లందు నానందాధిక్యము జూపుటకు కవులు కావ్యాదులందు శృంగార రసమునే వర్ణించుచు స్త్రీ పురుషుల శరీర సౌందర్యమునే బొగుడుదురు. శృంగార ప్రియులను రసికులని, రసజ్ఞులని యితరుల నరసికులని బలుకు చుందురు.

పద్యము:- 6. వరసారస్వత పట్టభద్రులు కవుల్వర్ణించి వర్ణించియు
న్నర సావంతయుగాన లేరు తుదియోషా విభ్రమాంభోధికి
న్నిర సాంతః కరణుండవై యెటులుగా నిందించెదో యయ్యద
త్సర సాకార ముదారమన్మథ కళా సర్వస్వ శృంగారము౯
పాండురంగ.

విషయానందము గోరెడి స్త్రీ పురుషులకుగల భావములు. వారి జాతులు, కళలు, వానికగు సంస్కారములు, తంత్రములు, దేశకాలాను రూపమున భోగసాధనములు, బంధనాదులు మున్నగునవి తెలుపబడును. ఈ శాస్త్రమునకు ఆనందమే విషయము, రతి సంబంధము శృంగార ప్రియులు అధికారులు విషయతృప్తి ఫలము. ఇట్లు అనుబంధ చతుష్టయముండుటచే నిది శాస్త్ర మనబడును.

శ్లో॥ 63. యే సంసారసముద్ర పాతవిధురా నిందంతియోగీశ్వరాః ।
మత్కావ్యంన తదర్థముజ్వల తరం మూఢాయనైత తత్కృతం ।
యే శృంగార రసామృతం హిసతతం పీత్వాన తృప్తింగతాః ।
తేషా మేవమయాధునా విరచితం శృంగారకావ్యం మహత్
శృ. దీ. శ్లో. 2.

తా॥ భార్యలేని (విధురులు) సంసారమందు మునుగు వారికిని, యోగుల కును (కామనిందకులు. సన్యాసులు) మూఢులకును నేనీ శాస్త్రము జెప్పుటలేదు. ఎవరు శృంగార ప్రియులగుచు శృంగారరసమనుభవించు చున్నను తృప్తులగుటలేదో వారికే యీ మహత్తరమైన శృంగార (శాస్త్రము) రచించితిని. ఇందధికారి నిర్ణయము జేయబడినదేగాని స్త్రీ పురుషులకు నిందితవ్యభిచారము జెప్పబడలేదు. భార్యాభర్త లిరువురు శృంగార ప్రియులుగావచ్చును. వారి విషయ తృప్తికై విషయానందమును ఈ శాస్త్రవిజ్ఞాన మూలముగ బొందవచ్చును.

శ్లో॥ 64. యఃపుణ్యవాన్స ధాచారోకులీనో విజితేంద్రియః ।
ధర్మాధర్మ వివేకజ్ఞో స్వకాంతాయాంరమేతసః శృ. దీ. 31.

తా॥ ఎవడు పుణ్యాత్ముడో సదాచార సంపత్తిగలవాడో ఉత్తమకుల జనితుడో జితేంద్రియుడో ధర్మాధర్మ వివేకము గలవాడో వాడే ఈ శాస్త్రజ్ఞానముచే స్వభార్యయందే రమించును. స్త్రీ పురుషులు భయులు శాస్త్రజ్ఞులైనచో వారి యానందమునకు మేరయుండదు.

పద్యము 7. నూతనకేళి బాలిక మనోజుని క్రీడలు సలుపుచుండగా
నాతరి తద్విభుండు మదినన్య విచారగుడౌ టెఱంగితా
నీతలిమోముజేసి సగమీనిన సింహము క్రింద నేనుగు
న్నాతిలిఖించి జూపెనిజనాయ కుడాచెలి జూచిమెచ్చగన్

కావున కామశాస్త్రము వ్యభిచార బోధకమనుట నిరాధారము. శృంగార ప్రియులకు స్త్రీ లేని పడక వ్యర్థముగ దోచుచున్నది.

శ్లో॥ 65. నారీవిహీన శయనంనవ పంచబాణ విజ్ఞాన హీనసురతం।
రసహీన వాణీలజ్జా గుణప్రియ వియుక్త వరాంగనాచే
త్యేతా నిషండరత వత్సుతరాం వృథాస్యుః శృ. దీ. 5.

తా॥ స్త్రీలేని పడక, మన్మథ శాస్త్రజ్ఞానములేని రతి, రసహీనమైన మాటలు వినుట కెట్లింపుగనుండవో, అట్లే శ్రేష్ఠురాలగు సుందరాంగికి లజ్జ లేనిచో శోభింపజాలదు.

70. స్త్రీ పురుషులకుగల శారీరిక సహజ సౌందర్యమే శృంగారమౌను గాని ఆభరణాద్యలంకారములు శృంగారములు గానేరవు. కావుననే కావ్యాదులందు కవులు స్త్రీల శరీర సౌందర్యమునే వర్ణింతురు. పురుషులకు వాగ్భూషణమే భూషణమైనట్లు స్త్రీలకు శరీర సహజ సౌందర్యమే యలంకారము.

శ్లో॥ 66. వక్త్రంచంద్ర విడంబి పంకజ పరీహా నక్షమేలోచనే।
వర్ణస్వర్ణమ పాకరిష్ణు రలినీజిష్ణుః కచానాంచయః।
వక్షోజా విభకుంభ విభ్రమహరౌగుర్వీ నితంబస్థలీ।
వాచోహారిచ మార్దవంయువ తిషుస్వాభావికం మండనం భర్తృ.

తా॥ చంద్రునివంటి ముఖము కమలపత్రముల బరిహసించు నేత్రములు, బంగారు వర్ణమున ధీనకించ పరుచు దేహకాంతి తుమ్మెదల ధిక్కరించు కొప్పు, మూంగురులు, ఏనుగ కుంభ స్థలములమించు కుచయుగ్మము, గొప్ప నితంబము మృదుమధురమైన వాక్కులివియే స్త్రీలకు సహజాలంకారములు.

పద్యము 8. శృంగగాత్రి హికజెప్ప వే రెతెరువు ల్సిద్ధింపమింజేసిచి
తాగ్రింగ శ్రీనిధి యవ్వధూమణిని స్థూలారుంధతీ న్యాయమా
ర్గాంగీ కారమునన్వచించితిని చంద్రాద్యోపముల్సూచనా
భంగుల్గానియథ సహస్రగుణ సౌభాగ్యంబులాయంగముల్
ప్ర. భా. ప్ర.

సంగ్రహమున స్త్రీ పురుషుల యంగ సహజ సౌందర్యమున జెప్పనైనది. అవియే పరస్పర కామహేతువులు. వీనియందు జెప్పబోవు కామకల దిన వయస క్రమమున యుండును. సంభోగ సాధనములు వాని హేతువులు దేశ కాలాద్యానుగుణ్యత మున్నగు నన్నియుం గలసి శృంగార రస మగును.

71. కామశాస్త్రమందు స్త్రీ పురుషుల జాత్యాది నిర్ణయమునకే ప్రాధాన్యము నొసంగిదానినే జెప్పిరి. జాత్యాది నిర్ణయమే కళా జ్ఞానకారణమైనందున మొదులుజాతి నిర్ణయమత్యావశ్యము.

శ్లో॥ 67. హస్తినీ చిత్రిణీ చైవశంఖినీ పద్మినీ తథా।
స్త్రీ యశ్చతుర్విధాజ్ఞే యాతాసాం లక్షణ ముచ్యతే

తా॥ 1. హస్తిని 2. చిత్రిణీ 3. శంఖిని 4. పద్మనీయను స్త్రీ లందు నాల్గు జాతులుండును. వాని లక్షణములు జెప్పబడును. పై నాలుగు జాతులలో నొక్కొక్కటి మూడు విధములుగా నుండును. 1. స్వీయా (స్వభార్య) 2. అన్యదీయ (జారిణి) 3. సామాన్య (కులట) మరల అసాధారణ భేదములన్ని జాతులందు సమానమైనవి:- 1. ముగ్ధ 2. మధ్య 3. ప్రగల్భ 4. వృద్ధ. ముగ్ధయనగా నవవధువు. మధ్య లజ్జకును కామమునకు మధ్యస్థురాలు. ప్రగల్భ-ప్రౌఢ (గత వ్రీడ) వృద్ధ సంభోగానర్హ యనబడును.

72. పుష్పఫలములనిచ్చిన బాలవశురాలగును. మధ్య రత్నభూషణముల నిచ్చినచో సంతోషించును. ప్రగల్భ వస్త్రాదులచే సంతసించును. కామభోగ మానంద తృప్తికై జేయబడునుగాన స్త్రీలను సంతోషింప జేసియే రతి యొనర్పదగినది గాని పశుబలముతో నిర్బంధమున సంభోగించరాదు. మరియు సంభోగమునం దుభయులకు దుఃఖము, ఆతురత, వ్యాకులత మున్నగునవి వర్జనీయములైనవి. ఏకాంత స్థలమందు సుఖ శయ్యాదుల కల్పన జేసికొని ప్రశాంత చిత్తులగుచు స్త్రీ పురుషులానందానుభవ తృప్తికై సంభోగము జేయనగును. సంభోగ కాలమునందెట్టి చిత్తవృత్తి

యుండునో సంతానమట్టిదే జనించును గాన సంతానమునందు సద్వృత్తు లుండవలయునన్న సంభోగ సమయమునందు స్త్రీ పురుషులు తమ చిత్త మట్టి నియమాదులతో నుండునట్లు నియమించుకొనదగును. జాత్యా దుల దెలిసికొనుటకు వారు దిను యాహార విహార జ్ఞానమున దెలిసికొన వలయును.

# స్త్రీపురుష జాతి వివేకము

## 1. హస్తినీ జాతి స్త్రీ లక్షణము

శ్లో॥ 68. రక్తాక్షీ ఘనవస్త్రకేశ సహితారక్తాం బరాలంకృతా ।
దీర్ఘాంఘ్రిద్విత యాంగుళ స్తన భరాపిత్త ప్రధానాంగకా ।
ఉష్ణాహార రతాతితీవ్ర సురతానేక ప్రియాశ్యామలా ।
గుహ్య ప్రాంతసునీల కేశసహితా సాహస్తినీతి స్మృతా

శృ. దీ అ. 2. శ్లో 1.

తా॥ ఎఱ్ఱని కన్నులుగలది, విలువగల వస్త్రధారణ జేయునది, గొప్ప వెంట్రుకలుగలది, ఎఱ్ఱని వస్త్రముల ధరించునది. పొడుగు పాదములు గలది, స్తనమధ్య భాగమున రెండంగుళముల విస్తీర్ణముగలది, పిత్తప్రకృతి గలది. ఉష్ణపదార్థముల (కారము మొదలైనవి) సేవించునది రతి యందు తొందరగలది. అనేకులకు ప్రియురాలైనది. శ్యామల (పచ్చని శరీరకాంతిగలది) గుహ్యప్రాంతమున నల్లని వెంట్రుకలు గలది హస్తినీజాతి స్త్రీయగును.

శ్లో॥ 69. ఏవం లక్షణ సంపన్నం హస్తినీ కామినీ భవే
త్తాం ।భద్రజాతి పురుషోయ భేతానంగ వేదవిత్

ఇట్టివే యితర లక్షణములుగలది హస్తినీయగును. మన్మథ శాస్త్రజ్ఞుడగు భద్రజాతి పురుషుడు హస్తినీజాతి స్త్రీతో కూడవలయును. హస్తినీ జాతి స్త్రీలకు స్త్రీ చిహ్నము ద్వాదశాంగుళ ప్రమాణమైన లోతుగ నుండును.

## 2. చిత్రిణీ జాతి లక్షణము

శ్లో॥ 70. కించిత్కుంచితలోచనాతి చపలాచిత్రాన్నభుగ్దివ్యవా ।
గ్స్నిగ్ధానేక విచిత్రకేశ సహితా చిత్రాంబరాలంకృతా ।
కుంభోదారకుచా విచిత్ర సురతా దీర్ఘాధరాల్పప్రియా ।
త్రిస్థాన స్థితరోమరాజ సహితాసాచిత్రిణీ తిన్మృతా

శృం. అ 2. శ్లో. 7.

తా॥ కొంచెము మూయబడుచుండు చంచలనేత్రములు గలది. చిత్రమగు నాహారము తినునది, స్నేహముగ మాటలాడునది, విచిత్రమైన వెంట్రుకలు గలది, చిత్రవస్త్రముల ధరించునది. ఉదారమగు గొప్ప స్తనములు గలది, చిత్రరతియందు ప్రియురాలు, పొడవైన క్రింది పెదవి గలది, అల్ప ప్రియురాలు, త్రిస్థానములందు (పిక్కలందు గుహ్యాప్రదేశమునందు, కక్షములందు) హెచ్చు వెంట్రుకలుండునది చిత్రిణీ స్త్రీ యగును.

శ్లో॥ 71. దమప్రియా మధ్యరతా ప్రమాణంచ దశాంగులం ।
దత్తస్తథా విధగుణః చిత్రిణీంతాంరమే త్ప్రియాం

శృ. అ. 2. శ్లో. 9.

తా॥ బాహ్యేంద్రియ నిగ్రహము గలధి. మధ్యరాత్రియందు రతి గోరునది. పదంగుళముల లోతుగల గుహ్యాప్రమాణము గలది. చిత్రిణీ జాతి స్త్రీ యగును. ఇవే గుణములుగల దత్తజాతి పురుషుడు చిత్రిణీ జాతి ప్రియురాలినిగూడనగును.

## 3. శంఖినీ జాతి లక్షణము

శ్లో॥ 72. హీనోష్ఠిమంబు జాక్షీమతి కఠినకుచాందీర్ఘకంఠీం
సుమధ్యాం । హీనాంగీం రక్తహస్తాం సురచిరవదనాం నీలవ
స్త్రాభిరామాం । నీలోదారోరు భూషాంసు విమలవదనాం
సద్విమాన్యాం కృశాంగీం కాంతాంతాంశంఖినీ మిత్యతి
విమలధియా సంస్తువన్త్యుజ్వలాంగీం

శృ. అ. 2. శ్లో. 10.

తా॥ అల్పాధర, పద్మపత్రములవంటి నేత్రములు గలది, కఠినస్తని, పొడుగు కంఠము గలది, నల్లని వస్త్రధారణ జేయునది, రుచిరమగు ముఖ కమలము గలది, సత్పురుషుల మన్ననగలది, సన్నని శరీరముగలది, కపటము లేనిది, ఉదారమగు నల్లని భూషములు ధరించునది, శంఖినీజాతి స్త్రీయగును.

శ్లో॥ 73. అంగుష్ఠాంగుళ సద్గుహ్యా శంఖినీ పరికీర్తితా ।
ఏవంవిధాం కూచిమారః తాంరమేత తథావిధః

శృ. అ. 2. శ్లో. 11.

తా॥ శంఖినీజాతి స్త్రీకి అంగుష్ఠముపైనొక యంగుళ గుహ్యావయవము లోతు ప్రమాణము గలిగియుండును. ఇట్టి లక్షణములేగల కూచిమారజాతి పురుషుడు శంఖినీజాతి ప్రియురాలితో రతి యొనర్పదగును.

## 4. పద్మినీ జాతి లక్షణము

శ్లో॥ 74. కుముద విమలనేత్రాకుంద దంతాభిరామా ।
వళియుతతను మధ్యావక్రదీర్ఘోరుకేశీ ।
అతి మృదుతర హస్తా రక్తహస్తాంఘ్రియుగ్మా ।
ఘనకుచ సుని తంబా పద్మినీ కామినీస్యాత్

శృ. అ, 2. శ్లో. 12.

తా॥ నల్లకలువల వంటి స్వచ్ఛమగు నేత్రములు గలది, మల్లెమొగ్గల వంటి దంత పంక్తిగలది, శరీర మధ్యమునందు (ఉదరమునందు) మూడు మడతలు బడుచుండునది, పొడువై వంకరగా నుండుతొడలు, ముంగురులు కలది, మెత్తని చేతులు, హస్తతలమునందు, పాదములందెరుపు ఛాయ లుండునది, లావైన స్తనద్వయములుండునది, విశాలమైన నితంబముగలది, పద్మినీజాతి స్త్రీ యగును.

శ్లో॥ 75. వర్జితా సజ్జన సభాసర్వ సద్గుణమండితా ।
తాంతద్గుణ సంపన్నః పాంచాలః పద్మినీంయభేత్

శృ. అ. 2. 13.

తా॥ ధర్మసభ జేరనిది, సమస్త సద్గుణములతో విరాజిల్లున్నది, పద్మినీ జాతి స్త్రీ యగును. అవియే గుణములుగల పాంచాల జాతి పురుషుడు పద్మినీ జాతి స్త్రీతో గూడనగును, పరస్పర విరుద్ధ జాతి స్త్రీ పురుషులు గూడిననే సంకరముల్తైన విజాతు లేర్పడును. మరియు లింగ వ్యత్యాసముచే విజాతి సంయోగమున విషమ రతి యేర్పడును.

శ్లో॥ 76. విజాతి సంయోగ వశాద్విషమైవ రతిర్భవేత్ ।
హస్తిన్యాదిగుణా యత్రవర్తం తేనుకరాభువి

శృ. అ. 2. 15.

తా॥ విజాతి సంయోగమున విషమరతి యగును. కావుననే లోకమునందు హస్తిన్యాదిజాతి గుణములు గల విజాతి స్త్రీ పురుషులు గానుపించుచున్నారు.

శ్లో॥ 77 సాసంకరవ ధూర్జేయా సంకరస్తాంయభేన్నరః ।
భద్రోదత్తః కూచిమారః పాంచాల పురుషాస్సృతః

శృ. అ. 2. శ్లో. 19.

తా॥ హస్తిన్యాదులగు వారికొన్ని గుణములు గల సంకరజాతి స్త్రీ పురుషులు గానుపించుచున్నందున సంకరజాతి స్త్రీలతో సంకరజాతి పురుషులే గూడవలయును. భద్రుడు, దత్తుడు, కూచిమారుడు, పాంచాలుడను నలుగురు పురుషులు క్రమముగ హస్తిన్యాది గుణములు గల్గియున్నవారలగుదురు. సంకరజాతి పురుషులు క్రమ భంగము జేసి సంకరజాతి స్త్రీలతో మరల గూడిన అతిసంకరమైన అనులోమ విలోమ జాతి స్త్రీ పురుషులు బుట్టుదురు. ఇందుకనియే మనవారు వివాహములందు జ్యోతిశ్శాస్త్రీను సారముగ యోనికూటా ద్యష్ట కూటములు వధూవరులకు సరిపడిన వివాహమాడుమనిరి. విషమ రతిలింగ వ్యత్యాసమున మూడు విధములగును. 1. సమ 2. విషయ 3. మధ్యమ వ్యత్యాసముభయలింగ సమానమునందు మధ్యమ రతి అల్పాంగ వ్యత్యాసమునందు సమరతి, దీర్ఘాంగ వ్యత్యాసమునందు రతివిషమ మనబడును.

# కామకళా జ్ఞానము

73. స్త్రీల జాతి విజ్ఞానానంతరము కామకళా జ్ఞాన మావశ్యకమైనది. మనోరూపమైన కామకళ చక్షురింద్రియ గోచరముకాదు. భావనా రూపమైనందున మన్మథ కళాస్థానములను దెలిసికొని వానికి జెప్పబడిన సంస్కారాదులు జేయగా నది సాధ్యమగును. స్త్రీలందు కామకళ చంద్రకళలను బోలి ప్రతిదినము వరుసక్రమమునఅ ంగుష్ఠాదిశీర్ష పర్యంతము పదహారు స్థానములం దారోహణా వరోహణ జేయుచుండును. స్త్రీ జాతి నిర్ణయమైననే కామకళా రోహణ వరోహణా దెలియబడును. ఆరోహణా వరోహణ లుభయపక్షములందు క్రమముగ ప్రతిదినమందు నుండును.

శ్లో॥ 78. అంగుష్ఠే పదగుల్ఫజాను జఘనేనాభౌ చవక్షే స్తనౌ ।
కక్షే కంఠక పోలదంత వదనే నేత్రాళికే మూర్ధని ।
శుక్లాశుక్ల విభాగశో మృగదృశా మంగేష్వనంగస్థితి ।
ఊర్ధ్వాధోభిముఖాః కలాః ప్రతిదినం స్థానేషుగచ్ఛత్యలం

శృ. అ. 2. శ్లో. 42.

తా॥ అంగుష్ఠము (కాలి బొటనవ్రేలు) 2. పాదము 3. గుల్ఫము (పిక్కలు) 4. మోకాలు పైభాగము 5. పిరుదులు 6. నాభి 7. వక్షస్థలము 8. స్తనములు 9. చంకలు 10. కంఠము 11. చంపలు 12. దంతములు అనగ పెదవులు 13. వదనము—నోరు (లక్షణ యానోటునుండు నాలుక) 14. నేత్రములు 15. నొసలు (ముంగురులుండు స్థానము ఫాల మని లక్షణార్థము 16. మూర్ధ (తల పైభాగము—మాడపట్టు) పైకి క్రిందికి శుక్ల కృష్ణపక్షాను క్రమముగ పైజెప్పిన పదహారు స్థానములందు మన్మథ కళారోహణా వారోహణ జరుగుచుండును. వ్యష్టి శరీరము లందు (పిండాండమునందు) స్త్రీ శరీరము భోజ్యము. (భోగయోగ్యము—అన్నము) సమష్టి శరీరమునందు (బ్రహ్మాండమునందు) చంద్రశరీరము భోజ్యము (అన్నము) లాక్షిణికార్థములు. వీనితో భోగించిననే తృప్తి రూపానందము గలుగును. సమష్టి శరీరమునందలి చంద్రమండ

లమునుండి వృష్టి గురియుచు దానితో యన్నోత్పత్తి యగుటతో ప్రాణుల కానందరూప తృప్తి గలుగుచున్నది. "తృప్తి రితివృష్టౌ" యను తైత్తిరీయ శృతి గలదు. కార్యకారణమున కనన్యత్వ న్యాయమున చంద్రకారణమునగలుగు వృష్టిచే జనులు జీవింతురు గాన చంద్రుడన్నము (భోగ్యము) అనుట యొప్పుచున్నది. "లాంగలేన జీవతి" యను న్యాయమున చంద్రుడన్న మనవచ్చును.

శ్రుతి॥ ౩౮. "ఏషసోయో రాజాతద్దేదానా మన్నంతం దేవాభక్ష
యంతి" ఛా. అ. 5. ఖ. 10. మ. 4.

తా॥ వృష్టియందు, స్త్రీ సంభోగమునందు తృప్తి రూపానందము గలుగుననుచు పైన వ్రాయబడినది. "ఆనంద ఇత్యుపస్థే" యను శ్రుతి ప్రమాణము గూడగలదు. కావున చంద్రునందును స్త్రీలయందే భోగసిద్ధిగలదు. పురుషుల కుపభోగములగుటచే స్త్రీలు చంద్రునివలె యన్నము లని లాక్షణికార్థము పొసనగును. ఉభయు లేక స్వభావులగుటతో స్త్రీలందు కామకళలు చంద్ర కళలవలె శుక్ల కృష్ణ భేదమున హెచ్చుతచ్చులగుట (ఆరోహణా వరోహణలగుట) సమంజసమగును. పురుషుడు రసస్వరూపుడు. స్త్రీలందుడు కామ కళ ఆనంద రసోదితము (చంద్రుడు సముద్రమునుండి జనించునట్లు కామకళ స్త్రీలయందు ఆనంద రససముద్రోద్భవము) గావున రసము రసమును బొందియే యానందించునని పైన నుదహరించబడినది.

శ్లో॥ 79. రజోదర్శన మారభ్య చాపంచ దశసాసరం।
శుక్లపక్ష ఇతి జ్ఞేయో కృష్ణపక్ష స్తథోపరి శృ. అ. 2. శ్లో. 44.

తా॥ సమష్టి శరీరమునందు మాసాత్మకుడైన ప్రజాపతికి (చంద్రునకు) శుక్ల పక్షమునందు అమవాస్య మారునాటి పాడ్యమినుండి పూర్ణిమ వరకు చంద్రకళలు హెచ్చగుచు పూర్ణిమనాడు సంపూర్ణ కళలతో గానుపించును. కృష్ణ పక్షమునందు పూర్ణిమ మరునాటి ప్రతిపదనుండి యమావాస్యవరకు చంద్రకళలు తగ్గుచు నమావాస్యనాడు గనుపించవు.

(దర్శయనబడును) అదే విధమున స్త్రీలకు రజో దర్శనమునుండి పదిహేను దినములు (ఆనాటితో పదహారు) శుక్ల పక్షమనబడును. వ్యష్టి శరీరము లగు స్త్రీలందు రజోదర్శనమునుండి క్రమముగ ప్రతిదినము కామకళ ఆరోహణ గలిగియుండుటచే శుక్లపక్షమనబడును. పదహారవనాడు పూర్ణిమ నాటి వలె స్త్రీలకు శిరస్సునందు కామకళ జేరును. పదిహేడవ నాటి నుండి కృష్ణపక్షమునందు వలె కామ కళావరోహణ యగును. మాసాంత మందు రక్తము స్త్రీ యోనిద్వారా స్రవించును. (రజస్వలగును) కావున (చంద్రకళ లమావాస్యనాడు గనుపించునట్లు) కామకళనబడదు.

శ్లో॥ 80. కృష్ణాంతేన యదా రక్తం ప్రసూనాచ్చ బహిర్గతం ।
తావత్స్వస్థానగా మూర్ధ్ని కళాతిష్ఠతి సర్వదా శృ. అ. 2. 45.

తా॥ కృష్ణపక్షాంతమునందు స్త్రీలకెప్పుడు రజోదర్శనమగునో అప్పటినుండి మూడు దినములు ప్రసూనము (యోని) నుండి రక్తస్రావమగును. అంత వరకు (రక్త స్రావదినముల వరకు కామకళ స్త్రీలకు శిరమునందుండును.

74. అదియె కామకళకు స్వస్థానమనిరి, గావుననే రజస్వలా దినములు మూడు రతికి నిషేధించబడినవి కాని ధర్మశాస్త్రమునందు నాల్గు దినములు వర్జనీయములని చెప్పబడెను. చతుర్ధ దినమునందు సాయంకాలము మరల స్నానము జేసిన రతికొరకు మాత్రమే స్త్రీ పరిశుద్ధురాలగును. కామకళారోహణావరోహణలు స్త్రీలజాతి భేదమనుసరించి వామ పార్శ్వమునుండిగాని దక్షిణ పార్శ్వమునుండిగాని జరుగును. ఏజాతి స్త్రీ కేపక్షమునందు ఏ పార్శ్వమునుండి ఆరోహణగాని యవరోహణగాని యగునో యా వివరములు శాస్త్రమునందే జూడనగును. గ్రంథ విస్తర భీతిచే విడిచితిని ఉదాహరణగా పద్మినిజాతి స్త్రీకి రజస్వలయైన చతుర్ధ దినమునందు కామకళ వామ పార్శ్వమునుండి యారోహణారంభ మగును. చతుర్ధ దినమునా డామెకు వామజాను పై భాగము (యెడమ తొడయందు) నందుండును. అచ్చటినుండి ప్రతిదినము వరుస క్రమముగ హెచ్చుచు (ఆరోహణగుచు) పదహారవనాడు (రజస్వలనాటి దినమునుండి) మూర్ధ్ని స్థానమునందు జేరును. ఇదే యామెకు శుక్ల పక్షము, పది

పది యేడవ నాటినుండి యామెకు దక్షిణ పార్శ్వమునుండి యవరోహణ యగుచుండును. (దిగుచుండును) మాసాంతమున యోనినుండి రక్త స్రావము కాగా కామకళ యామెనెత్తినజేరి స్వస్థానమునందుండును. ఇట్లామెకు రజస్వలగునంతవరకు దక్షిణ పార్శ్వమునుండి యంగుష్ఠము వరకు కామకల దిగుచుండునని భావము. మరల రక్త స్రావానంతర మామెకు వామ పార్శ్వమునుండి పై జెప్పినట్లారోహణగును ఇట్లెల్లప్పుడు పద్మినీ జాతి స్త్రీల కగుచుండును. హస్తిన్యాది జాతి స్త్రీలకు శుక్ల కృష్ణాను సారముగ వామ దక్షిణములనుండి యారోహణగాని యవరోహణగాని యగును. గాన ప్రథమమున స్త్రీ జాతి నిశ్చయానంతరము వారి రజో దర్శన దినమును దెలిసికొని యథాప్రకారముగ శాస్త్రోక్త రీత్యాయారో హణా వరోహణ శుక్లాది క్రమముగ వామ దక్షిణ జ్ఞానముచే కామ కలాస్థానము నిర్ణయించయగును. ఇట్లు దెలియకున్న నింద జెప్ప బడినది.

శ్లో॥ 81, స్త్రీ ణాంజాతిం వినిశ్చిత్యయో మూఢోరతి మేష్యతి ।
అజ్ఞాత్వైవ కలాస్థానం స్త్రీణాం భృత్యోభవేదసౌ శృ. అ. 1. శ్లో. 60.

తా॥ స్త్రీజాతి నిర్ణయించక రతి గావించువాడు మూఢుడు కళా స్థాన పరిజ్ఞానములేనివాడు స్త్రీలకు వశ్యుడౌను.

శ్లో॥ 82. కళాజ్ఞానాత్స ఖలత్యే వస్జల నాన్మోహినీ భవేత్ ।
మోహితా యాంప్రియం యాంతి కామసిద్ధిర్భవేత్తదా

శ్లో॥ 83. యదామన్మథ సిద్ధౌతు స్వయమే వస్త్రీయోవశాః ।
గతాసు స్త్రీషువ శతాంకామశాస్త్ర సుఖంభవేత్
శృ. అ. 1. శ్లో. 61. 62.

తా॥ అర్థము సుగమము.

## కామ సంస్కారములు

75. ఈ క్రింద తెలుపబడు దశవిధ సంస్కారములు, పంచ తంత్రములు రతికి పూర్వము గావించ తగినవి. అవి కామ కళా భంగమునకు దోహ దములు.

శ్లో॥ 84. తాడనం ఫేటనం చైవదంతక్ష తనఖక్షతౌ ।
చుంబనం చూషణం చైవచాలనంచవషట్కృతిః ॥
శ్ర. అ. 3. శ్లో. 52.

తా॥ తొడలు, హృదయము పృష్ఠభాగము మొదలగు స్థలములందు జాతి భేదాను సారముగ ఆదినములందుండు కళలను గుర్తెఱింగి తత్తత్సం స్కారములను పురుషుడు గావించవలయును. (తాడనము—తట్టుట. 2. ఫేటనము—గళధ్వని, 3. నఖ 4. దంతక్షతములు 5. పరస్పరము ముఖవాయువుల గ్రహించుట 6. కొప్పుకొననూపుట 7. జిహ్వా మూలమున మూర్ధను ఛేదించుట 8. పంచాంగుళములచే ముక్కుపై దువ్వుట 9. గాఢపరిష్వంగము 10. ముద్దుకొనుట వీనినే దశ సంస్కారములందురు.

## పంచ తంత్రములు

శ్లో॥ 85. ఫేటితం కుట్టితంక్లీతం నామితం ఘట్టితంతధా ।
పతాని పంచతంత్రాణి భాషితాని స్మరస్మృతౌ

1. ఫేటితము:- చెవియందు, కంఠమునందు నాలుకతో చప్పుడు చేయుట.
2. కుట్టితము:- మధ్యమానామికలతో యోనిచాలనము గావించుట.
3. క్లీతము:- అరికాళ్ళను గోళ్ళతో గీకుట.
4. నామితము:- ముంగురులను దువ్వుట.
5. ఘట్టితము:- గాఢా లింగనము.

## రతి భేదములు

76. బాహ్యాభ్యంతర భేదముచే రతి ద్వివిధమగును. దర్శన స్పర్శ నాదులు బాహ్యారతి యనబడును.

శ్లో॥ 86. బాహ్యమభ్యంతరం చేతి సురతం వాద్విధామతం ।
ఆలింగనాది సంస్కారైస్త త్బాహ్యారత ముచ్యతే శ్ర. అ. 3. 54.

శ్లో॥ 87. దర్శనం స్పర్శనం కేళి ప్రేక్షణం గుహ్య భాషణం ।
సంకల్పోధ్య వసాయశ్చక్రియా నిర్వృతిరేవచ ।
ఏతన్మైథున మష్టాంగం ప్రవదన్తి మనీషిణః

తా॥ బాహ్యాభ్యంతర భేదమున రతి రెండు విధములు. 1. దర్శనము 2. స్పర్శ 3. కేళి (ఆట) 4. ప్రేక్షణ బాగుగ జూచుట 5. రహస్యసం భాషణము 6. సంకల్పము 7. నిశ్చయించుట. 8. క్రియ చేతుష్టి నొందుట అని ఎనిమిది విధములు

శ్లో॥ 88. దర్శనేన రతిం కృత్వాస్త్రీయా స్పర్శన మాచరేత్ ।
స్పర్శనైర్ద్రవయిత్వా చధశనై స్సంభోగ మాచరేత్ శృ. అ. 2. 30.

తా॥ దర్శనానంతరమున స్త్రీని స్పర్శ జేయనగును. స్పర్శతో స్త్రీని ద్రవింపజేసి ద్రవించిన తరువాతనే సంభోగము (రతి) జేయనగును. దేశ కాలాను సారముగ కామకళా సిద్ధిచే సంభోగింపవచ్చును. కామ శాస్త్రము నందు సంభోగస్థలమునే దేశమని జెప్పిరి. జాతి భేదము ననుసరించి దేశ భేదము చెప్పబడినది.

శ్లో॥ 89. అభినవగిరి మధ్యేహస్తినీ జాతికాంతాం ।
కిసలయితనికుంజే చిత్రిణీం శంఖినీంతు ।
కుసుమితవన మధ్యే పద్మినీం సౌధభాగే ॥
వ్యతులిత ఘన సంభోగః కామినీం సంయభేతా శృ. అ. 3. 35.

తా॥ నూతనగిరి కందరములందు హస్తినీ జాతిస్త్రీతో, చిగురించిన పొద రిండ్లయందు చిత్రిణీ శంఖినీజాతి స్త్రీలతో, పద్మినీజాతి స్త్రీతో పూలతోట లందు మేడపై భాగమున సంభోగమును గావింపవలెను. కేళికాయత నము (పడకటిల్లు) చిత్రపటాదులతో నలంకరింపబడి భోగ సాధనములన్ని గలిగియుండవలెను.

శ్లో॥ 90. నానాధూపయుతే వితాన సహితే కర్పూరదీపో
జ్వలే । రత్న స్తంభ విరాజితేతి విమలే శ్రీగంధలేపో
చితే సౌధేపల్లవ పుష్పరమ్యశయనేకాంతా ప్రియా
భిస్సమం । సంభోగాయనయేత దివసాన్కందర్ప వేదార్థవిత్
శృ. అ. 3. 37.

తా॥ పడకటింటి యందనేక విధములైన ధూపములు పరుపుదిండ్లు ఉండవలయును. రత్న స్తంభములతో విరాజిల్లవలయును. శ్రీ గంధముచే లేపనజేసి యుండనగును. అట్టి మేడలో చిగురుటాకులు పుష్పములతో నలంకరించబడిన శయ్యాయందు ప్రియురాలగు కామినీస్త్రీతో కామశాస్త్రజ్ఞుడు సంభోగించుచు దినములు గడుపవలయును.

శ్లో॥ 91. హేముతే సౌధమధ్యే పరిమళ సహితే శైశరే సద్వనాంతే ।
వాసంతే గ్రీష్మకాలే జలసహిత గృహేధూపయు
క్తోష్ణ గేహే వర్షాకాలే శరత్సు । ప్రకట విధుకళా
జాల పూర్ణాంతరేషు । కల్యాణీ భిర్వధూభిస్స భవతి
విభవేనాయకస్తాంయభేత శృ. అ. 2. 61.

తా॥ హేమంత ఋతువునందు మేడయందు, శిశిర ఋతువునందు పువ్వుల సువాసనలతో పరిమళించు తోటలోను, వసంత గ్రీష్మ ఋతువులయందు జలయుక్త గృహమునందును, వర్ష ఋతువునందును శరదృతువునందును ధూపములుగల వెచ్చని యిండ్లయందు, వెన్నెల ప్రసరించుటకు గవాక్షములు గలిగియుండు యిండ్లలో, (వర్ష శరత్కాలములందు ధూపములతో యుక్తమగు వెచ్చని యిండ్లుండవలయును. వానికి గల గవాక్షరంధ్రములనుండి చంద్రికలు=వెన్నెల కిరణములు గనుపించునట్లుండ నగును.) అట్టి వైభవముతో ప్రియురాలిని నాయకుడు గూడవలయును. సంభోగార్థము ఋతువులందనుకూలమైన ప్రదేశములనుజెప్పి తరువాత రతి కనుకూలమైన కాలము జెప్పబడుచున్నది.

శ్రుతి॥ ౩౯. "ప్రాణం వాఏతే ప్రస్కందంతి యోదివా
రత్యాత్సం యుజ్యంతే" బ్రహ్మచర్య మేవ
యద్రాత్రౌ రత్యాత్స యుజ్యంతేః
ప్రశ్నోప. ఖ. 1. మ. 13.

తా॥ ఎవడుపగలు స్త్రీతో రతి జేయునో వాడు నిశ్చయముగతను ప్రాణములనే బోగొట్టుకొను వాడగును. రాత్రియందు స్త్రీ సంభోగము

జేయువాడు బ్రహ్మచర్యము జేసిన వాడగును. దీనిచే సంభోగమునకు దగిన కాలము రాత్రియే. బాహ్య రతియందు జేరిన దర్శన రతి కామ సంకల్ప యుత భావనయేగా సదృష్టియందట్టి భావనా విశేషమును జెప్పుటకుగాను దృష్టి భావము స్త్రీలందుండునని జెప్పబడును.

శ్లో॥ 92. దృష్టి భావంత థాపక్ష్యే కాంతానాం భావసమ్మితం ।
హాస్యాని మేషదృష్టి స్యాత్కుపితా క్రోధసంయుత ।
ఊర్ధ్వగా సవిచార స్యాదర్ధ దృష్టిర్జు గుప్సితా ।
విషమా ఖండదృష్టి స్యాత్స కటాక్షా ప్రియప్రదః ।
అత్యంత దుఃఖా నీచాయా సప్తధా దృష్టి రుచ్యతే

తా॥ కామినుల దృష్టి భావమును జెప్పెదను. నిశ్చల దృష్టి హాస్యార్థ మనబడును. క్రోధయుత దృష్టి కోపించుచున్నదని యర్థము. ఊర్ధ్వగా (ఆకసమువంకజూచుట) దృష్టిని విచారముతో గూడియున్నదనుటను సూచించును. ఈ దృష్టి నిందార్థ మనబడుచున్నది. ఖండదృష్టి (చూచి వెంటనే మల్పు దృష్టి) విషమమని దెలియదగును. కటాక్షదృష్టి ప్రియ ప్రదమని యర్థము. ఏడ్చుచు జూచుదృష్టి నీచమైనదని దెలియవలెను. ఇట్లేడు విధములైన దృష్టులు స్త్రీల భావమును దెలియజేయును.

శాస్త్రజ్ఞుడట్టి దృష్టి భావమును గనుపెట్టి వారి భావనల దెలిసికొని సంతోషపెట్టియే రమించవలయును. గాని బలాత్కారముగ సంభోగము గావించుట తగదు.

శ్లో॥ 93. శ్రవణంచక్షుః ప్రీతి మనస్సంగోథసంకల్పః ।
నిద్రాచ్ఛేదస్తనుతా విషయనివృత్తి త్రపానాశః ।
మోహో మూర్ఛామృతి రిత్యేకాదశ అవస్థగాః శృ. అ. 1. 25.

తా॥ 1. శ్రవణము 2. చక్షుఃప్రీతి 3. మనస్సంగమము 4. సంకల్పము 5. నిద్రావిచ్ఛేదము 6. తనుత (కృశించుట) 6. విషయ నివృత్తిః 8. త్రపానాశము (లజ్జ విడుచుట) 9. మోహమును జెందుట 10. మూర్ఛ వచ్చుట 11. మృతి (మరణించుట) ఇవియే పదునొంకడవస్థలు కామినులైన స్త్రీలకుగాని కామాతురులైన పురుషులకుగాని కలుగును.

77. ఆభ్యంతర రతిబంధ నాదులతో జేయబడును. మన్మథ శాస్త్రము నందు బంధనాదుల సంఖ్య యెనుబదినాలుగు గలవు. వానిలోని కొన్ని ఇవి:—

శ్లో॥ 94. సమశ్చోప రతిశ్చైవ భ్రమణం చక్రబంధనం ।
లలితంచైక పాదంచ ధేనుకం మార్కటంతథా శృ. అ. 3 శ్లో. 11.

తా॥ 1. సమరతి 2. ఉపరతి 3. భ్రమణ బంధము 4. చక్రిబంధము 5. లలితము 6. ఏకపాదము 7. ధేనుకబంధము 8. మర్కటబంధము (1) సర్వజన సాధారణమైనది సమరతి. (2) పురుషునిపై స్త్రీ సమ్ముఖమునుండి రమించుట యుపరతి. ఇట్లే మిగత బంధనాదులను గ్రిహించునది. విషయానందమునే గోరు శృంగార ప్రియులకు బంధనాది రతులచే దుఃఖము గలదని వారికిగల శ్రమాయాస కావ్యలైంగికానుమానముచే గ్రహించవచ్చును. కాని వారియానంద మెట్లుండునో జెప్పుట కశక్యము. ఇట్టి యుపరతిని సంస్కృతాంధ్రి కవులు తమ గ్రంధములలో సరసముగ ననువదించిరి.

శ్లో॥ 95. మేఘోవర్షతి మీనకేతు విశిఖాఆభ్రం సముత్కంపతే ।
ధత్తేమౌక్తిక జాలమిందు రజనీ తారశ్యమిందీవరే ।
శంఖశ్చాను కరోతిహంతశకః పారావతః ప్రికిృియాం ।
తారంభ్రామ్యతి నిత్యమే వగగనేచిత్రం విధానం విధేః

తా॥ మేఘము (కొప్పు) మన్మథ బాణములను (పువ్వులను) వర్షించుచున్నది. ఆకాశము (శరీర మధ్యభాగము స్త్రీనడుము) లెస్సగా కంపించుచున్నది. చంద్రునియందు (ముఖమందు) రాత్రివేళ ముత్యముల సమూహమును (చెమట బిందులను) ధత్తే ధరించుచున్నది. నల్లకలువలు (కన్నులు) చుక్కల బోలినవి. (మూసికొని పోవుచున్నవి) శంఖము (గళము) మెల్లగా పావురము ధ్వనివలె అనుకరోతి (అనుకరించును) తారహారములు (పుష్పహారములు) తిరుగులాడు చున్నవి. విధివిధానమతి చిత్రమైనది. ఆంధ్రమున పోతరాజు భాగవతమునం దుపరితిని ఇట్లు వర్ణించెను.

పద్యము 9. నటదుత్తుంగ పయోధరంబు గతమందాక్ష క్రియోదారమ
స్ఫుట వాగంకు రమక్షి కోణనివ సత్పుష్పేషు దర్పంబున
స్ఘటితాలింగన వామనీ కృతకుచాగ్రప్రౌఢరోమాంచయై
విటుఁజొక్కించె ప్రఫుల్ల పద్మనయనా వీరాయితం బెంతయున్

శ్లో॥ 96. స్విన్నంమండల మైందవం విలులితం స్రగ్బారనద్ధంతమః ।
ప్రాగేవ ప్రథమానకైతకశిఖాలీలాయితం సుస్మితం ।
శాంతంకుండల తాండవంకువల యద్వంద్వం తిరోమీలితం
వీతం విద్రుమ సీత్కృతం నహితతో జానేకిమాసీదితి

తా॥ యనుచు కాళిదాసు రత్యంత వర్ణన జేసెను. దీనిచే బంధనాది రతుల వలన దుఃఖము గలుగుచున్నది. దెలియబడుచున్నదేగాని స్త్రీ పురుషులకుగల ఆనంద మెట్టిదో జెప్పశక్యము గాజాలదనెను. కావున విషయానందము క్షణభంగురమైన ఆభాస మాత్రసుఖమేయని తెలియుచున్నను గాని, శృంగార ప్రియులగు వారికి మాత్రమీ శాస్త్రజ్ఞానమున విషయానంద తృప్తి గలుగుననుటలో సంశయములేదు. "ప్రజాతి రమృతం" యను శృతి ప్రమాణమున స్వభార్యా సంయోగముచే రతి సుఖమనుభవించి పుత్ర సంతాన ఫలమును బడసినచో శాస్త్ర ప్రయోజనము సిద్ధించును.

కామకాండము సంపూర్ణము.

ఓం

శ్రీ గణేశాయ నమః

# ఆర్ష విజ్ఞాన సర్వస్వము

## ప్రథమగుచ్ఛము

## 4. నీతి కాండము

78. నీతి=న్యాయము "నయతి:— సన్మార్గమునందుంచునది నీతి యన బడును. నీతిశబ్దమునుకూడ బోధించును. మనుష్యులకు ధర్మమార్గము నుపదేశించి, వారిని సత్ప్రవర్తన యందుచుట నీతి యనబడును. నీతి పరులే ధర్మ మాచరింతురు. నీతి శాస్త్రము సత్ప్రవర్తన నుపదేశించును. మంచి నడతగల వారిని నీతి పరులందురు. సమస్త శాస్త్రజ్ఞు లయ్యును నీతి పరులు గానిచో వారు నిందితులగుదురు.

పద్యము 10. నడవడి మంచిదైన జనంబులు పెద్దగ జూతురాతని।
న్నడవడి జక్కగాని నరునచ్చిన చుట్టములైన జేరనీయకన్
యెడ దొలగంగ దోలుదు రహీనత యున్లఘు వృత్తిమహి
న్నడవడిచేత వచ్చుటిది నైజము దీని నెరుంగ వింతయున్.

తా॥ తాను నీతిపరుడగుచు లోకులకు నీతిమార్గ ముపదేశించు వారినే సత్ప్రవర్తకులు, ఉపదేశికులందురు. వానికి తిర్యగ్జంతువులుగూడ సహా యపడును.

శ్లో॥ 97. యాంతిన్యాయ ప్రవృత్తస్యతిర్యంచోపి సహాయతాం।
అపంథానంతు గచ్ఛంతం సోదరోపి విముచ్యతే

తా॥ నీతి పరునికి పశుపతులు సహితము సహాయమొనర్చును. అవి నీతి పరులను అన్నదమ్ములుకూడ విడుతురు.

ఉదాహరణకు శ్రీరామచంద్రుడు నీతి పరుడగుటచే సుగ్రీవాదులు (కోతులు) జటాయువు (పక్షి) సహాయ మొనరించినవి. అవినీతిపరుడైన రావణాసురుని వాని తమ్ముడగు విభీషణుడు విడిచెను. ఇతరులేవి యొనరించిన తనకప్రియములగునో నవి తానితరులకు జేయకుండుట ధర్మమగును. మహాభారత శాంతి పర్వమునందిట్టి ధర్మమును భీష్ముడు ధర్మరాజున కెరింగించెను.

పద్యము 11. ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము
తనమనంబునకగు తానొరులకునవి జేయ
కునికి పరాయణ పరమధర్మ పథములకెల్లన్

నీతికి, ఓపిక, ప్రయత్నము. శ్రద్ధ, ధర్మాసక్తి, నిష్ట మొదలగు సద్గుణంబులు సాధనములగును. ఇవి లేనిచో నీతి గలుగదు. గాన యత్నాధిక్య సాధ్యమైనది నీతి.

పద్యము 12. ఒడికముతో బ్రయత్నమున నొక్క మహాశిల కొండ మీదికి।
న్గడు పగభార మచ్చడిది గ్రక్కున భూమికి డిగ్గద్రోయగా
గడుసుల భంబయట్లు గుణగణ్యాదనం బొగడొందుటద్భుతం।
బుడుగ గదుర్జనుండనగ నుండుట తాసుకరంబు ధాత్రిలోన్

శ్లో॥ 98. పరిపూర్ణే పితటాకేకాకః కుంభోద కంపిబతి।
అనుకూలేపి కళత్రే నీచః పరదారలం పటోభవతి

తా॥ తటాకము జలపూర్ణమైనను కాకి ఇండ్లయందుండు కుండలోని యుదకమే త్రాగును అదేవిధమున నీచుడు (అవినీతిపరుడు) తనకు భార్యానుకూలవతి యున్నను పరదారాసక్తిగలిగియుండును. సత్యాహింసలతో మెలంగుచు నితరులను మోసగించక న్యాయార్జనతో జీవించువారు నీతి పరులు. తన ప్రవర్తన నితరులు ప్రశంసించినను గర్వించక సత్ప్రవర్తననే కల్గియుండవలయును.

పద్యము 13. తన నడవడి సత్పురుషులు గొనియాడగ నుబ్బక
దియగుణంబుగ తద్వర్తనమున్వదలకయుండిన
మనుజుడు పూజ్యుండు జన సమాజములోనన్

శ్లో॥ 99 సత్యంబ్రూయాత్ప్రియంబ్రూయాన్న బ్రూ
యాత్సత్యమప్రియం ప్రియంచ నృతంబ్రూయా
దేష ధర్మస్సనాతనః

తా॥ సత్యముగను, ప్రియముగను బలుకవలయును. సత్యమైనను అప్రియమును బలుకరాదు. గాని ప్రియమగుననుచు ననృతము బలుకగూడదు. ఇదే సనాతన ధర్మము. ఉద్యోగ పర్వమునందు విదుర నీతి గలదు. అందు ధృతరాష్ట్రునితో విదురుడు నీతి ధర్మోపదేశములు జేయుచు, ఓయి మహారాజా ! ప్రియముబలుకువారెల్లప్పుడు సులభులు. అప్రియమైన సుహితము బలుకువారలరుదు ఒక వేళ చెప్పెడివారున్నను వినువారులేరు. సత్యము, ప్రియము, హితము బలుకుట దుష్కరము. అందువలన మౌనముగగాని మితభాషిగగాని యుండుట మంచిదియని భగవద్గీతలో గలదు. నీతిశాస్త్రములను బృహస్పతి, శుక్రుడు, విదురుడు మున్నగువారు జెప్పిరి కణక నీతి కాపట్యమునే జెప్పినందున దుర్నీతి యనబడును. అందు పరద్రోహము, మోసము రాజనీతి నామమున జెప్పబడినది కూటనీతి యందు రాజులు ధన లోభమున వర్తింతురుగాని యదే జనులందరికి హితముగాజాలదు. ఆంధ్రమున పంచతంత్రమను నీతిశాస్త్రమందు సుహృల్లాభము, మిత్రభేదము మున్నగు ప్రకరణములుగా విభజించి నీతి బోధించబడినది. శుక్రనీతియందు ననత్యము బలికినను దోషము గాదని చెప్పబడినది కాని అసత్యము బలికినచో పరులకు హింస సంభవించు నవకాశముండునేని అట్టి సమయమున మాత్రము అసత్యమాడుట నీతికాదు.

పద్యము 14 వారిజాక్షులందు వైవాహికములందు
ప్రాణ విత్తమాన భంగమందు
చకితగోకులాగ్రి జన్మరక్షణయందు
బొంకవచ్చు నఘము బొందదధిప — అనిరుద్ధనీతి

విద్యా గర్వముచే సద్వర్తన వీడరాదు.

పద్యము 15 విద్యకునుదోడు వినయంబుగలిగి యుంట
పసిడికిని తావి యబ్బినభాతి యగును
విద్య గలిగియు యడకువ వెలయకున్న
యమర తరువును కచ్చబెట్టలమికొనుట.

విద్య మంచివాని వద్దనున్ననే రాణించును. గావున నీతివంతునికిగల విద్య జ్ఞానప్రదానము జేయుటకు నుపకరించును. ఖలునివద్దయున్న విద్య వివాదములకే పనికివచ్చును. నీతిగలవానివద్ద ధనమున్నచో దానాదుల జేసి పరులకుపకరించును. అవినీతిపరుని వద్దగల ధన మతనికి మద హేతు వగును. నీతి పరునకు బలముండిన ఆర్త రక్షణకుపకరించును దుర్జనునికి గల బలము పరపీడ గిగించును.

శ్లో॥ 100 నీతిజ్ఞాః నియతిజ్ఞాః శాస్త్రజ్ఞాస్సంతు లోకేస్మిన్
బ్రహ్మజ్ఞాపి భవంతు వేదజ్ఞాః । స్వాజ్ఞానజ్ఞానినో
విరలాః

తా॥ నీతిశాస్త్రజ్ఞులు, నియతిశాస్త్రజ్ఞులు, ఇతర శాస్త్రజ్ఞులు లోక మందనేకులుగలరు గాని తన యజ్ఞానమును గుర్తెఱుంగువారలరుదు. సమస్త శాస్త్రజ్ఞులయ్యును తమ తప్పులను (దుష్ప్రవర్తనలను) దెలిసికొనక యుండినచో వారు శుకశారికములవలె శాస్త్రములు బలుకు వారలే యగు దురుగాని నీతిపరులుగానేరరు. తమ యవినీతులను దేలసికొనుటెగాక వాని విడుచుటకు ప్రయత్నింపవలయును.

79. శాస్త్రములు విజ్ఞానమును మాత్రమే బోధించునుగాని యవి మనుష్యులకు సత్ప్రవర్తనను గలిగింపజాలవు. సత్ప్రవర్తన నలవరచు కొనుటకు గురుకులవాసమైనను లేక సత్పురుషుల సేవ జేసియైనను నీతి తెలియుట ముఖ్యము. ఇట్టి సత్ప్రవర్తనలనే నీతిశాస్త్రములు బోధించును గాన నవి యాదరణీయములు.

ఇతి శ్రీ అంబాగస్త్యేశ్వర కరుణాపాత్ర శ్రీ శీలప్పవంశ పారా
వారరాకాసుధాకర రామశర్మ సూనుడు సకల విద్వజ్జన
విధేయుడైన రామకృష్ణశాస్త్రి సంగ్రహించిన
ఆర్షవిజ్ఞానసర్వస్వమునందు నీతి కాండముతో
ప్రథమగుచ్ఛము సమాప్తము.

ఓం తత్సత్

ఓం

శ్రీ గణేశాయ నమః

# ఆర్ష విజ్ఞాన సర్వస్వము

## ద్వితీయ గుచ్ఛము

## వేదాంగ కాండము

## 1. శిక్ష

80. వేదమునకు శిక్ష ప్రథమాంగము. వర్ణాదులిందు శిక్షింపబడుటతో నిది శిక్ష. శిక్షయే శీక్షాయనబడును. దీర్ఘము ఛాందసము చిక్షిఙ్ = వ్యక్తాయాం వాచి యను ధాత్వర్థమున వాక్కర్మణో రూపం శిక్ష. శిక్షించుటచేతను, వర్ణాద్యుచ్చారణ లక్షణ మిందు శిక్షింపబడుటచే నైనను దీనిని శిక్ష యనవచ్చును. ప్రియ, హితోపదేశములు గురు, దేవ, ప్రభువు వాక్యముల బోలు శ్రుతి చెప్పిన ఆదేశోపదదేశములిందు గలవు. ఉపనిషత్తులతో సహా సంపూర్ణ వేదాధ్యయనమునందు అర్థ గ్రహణ మాత్రము జాలదాయనుకొని వర్ణోచ్చారణందు స్వరాది నియమములు బాటింపుట అనావశ్యకమని భ్రమపడువారికట్టి భ్రమ యుండరాదని దెలుపుటకును స్వరవర్ణోచ్చారణ సలక్షణముగా చేయుటావశ్యకమైనదని దెలుపుటకును, ఈ శిక్ష శాస్త్రోద్దేశము. వైఖరీయందు వర్ణములను స్వరాది నియమములతో సలక్షణముగా నుచ్చరించుటందు బాహ్యాప్రయత్నము ముఖ్యముగ జేయవలసియున్నది. వైఖరీ యనగా వై = నిశ్చయముగ, ఖం = ఆకాశం (శ్రోత్రేంద్రియము), రాతి = గృహ్ణాతీతి వైఖరీయని దీని వ్యుత్పత్తి, తాత్పర్యమున శ్రోత్రేంద్రియమునకు వినబడునంత పైకి ఉచ్చరించు వాక్కు వైఖరీ యనబడును. వర్ణములు ధ్వని రూపములైనను వానిని ఉత్పత్తి స్థానములనుండి పైకి వెడలించునప్పుడు బాహ్యాభ్యంతర ప్రయ

త్నము లావశ్యకములైనవి. వాక్కునకు స్థానాపేక్షచే పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీ యను నాలుగు నామములు గలిగినవి.

శ్రుతి॥ ౪౦ "చత్వారి వాక్పరిమితపదాని ।
తాని విదుర్బ్రాహ్మణాయే మనీషిణః ।
గుహాత్రీణిని హితానేజ్గయన్తితురీయం
వాచో మనుష్యావదంతి''.

తా॥ నామాఖ్యాతాది ( 1. నామ 2. ఆఖ్యాత 3. నిపాత, 4. ఉపసర్గ) పరిమిత పదములతో నుండువాక్కు మరల చతుర్విధములైనదని బుద్ధిమంతులైన బ్రాహ్మణులే తెలిసికొనగలుగుదురు. వీనిలోని మూడు వాక్కులు శరీర గుహాయందు (మూలాధారమునుండి హృదయమునకు) ఉండును కావున నవి గోచరములు గానేరవు. తుది నాల్గవదైన వాక్కు (వైఖరి) మనుష్యులుచ్చరింతురు.

అనగా మనుష్య శరీరమందలి మూలాధారాది స్థానములందుండి వాక్కు వర్ణరూపమున క్రమముగా ముఖమునుండి వెడలువరకు గోచరించదు. వాగింద్రియమున వైఖరిగా నుచ్చరింపబడగ నదే శ్రోత్రేంద్రియ గోచరమగును గాన దీనినే వైఖరి యందురు.

అకారవర్ణ మే స్థానములనుండి ప్రయత్నముచే పైకి వెడలించువప్పుడు పదక్రమమున వాక్కగును. అకార వర్ణము మూలాధార చక్రమందు పరరూపమున (సదాత్మకమున) నుండి ప్రాణవాయువు (నాదము) చే స్పందమగుచు పైకి లేచునుగాని అప్పుడ గోచరమైనందున పరానామము దానికి గలిగినది.

శ్రుతి॥ ౪౧ "అకారోవై సర్వా వాగ్సైషా స్పర్శాంతస్థోష్మభిర్వ్యజ్య
మానాబహ్వీ, నానా రూపాభవతి"

తా॥ అకారవర్ణమె సమస్త వాక్కులగును. అదియె శరీరములోపలి యుష్ణతచే స్పర్శమగుచు వ్యక్తమై నానా వర్ణములుగా పరిణమించును. ఇచ్ఛా ప్రియత్నములతోనే ప్రాణవాయువు (నాదము) ఉత్పత్తి

స్థానములందు జేరి యచ్చట యాగ్నేయముతో (ఉష్ణముతో) గలసి వివిధ వర్ణముల స్ఫురింప జేయును. నాదముచే వర్ణములు స్ఫుటించునందున, వైయ్యాకరణులు స్ఫోటిని ఉపలక్షకమున జెప్పుదురు. వర్ణ పదవాక్య భేదమున స్ఫోటి త్రివిధము. వానిలో వర్ణస్ఫోటియే ముఖ్యమని ఔప వర్ణణాచారి మతము. స్ఫుటించు వర్ణములు పదక్రమమును జెంది వాక్యైకన దదియే వైఖరి. స్ఫోటనుచిచ్ఛక్తి యందురు.

శృతి ॥ "అకార ప్రధానోంకారో పలక్షిత స్ఫోటాఖ్యేచిచ్ఛక్తి
స్సర్వావాక్"

తా॥ అకారమే ప్రధాన వర్ణముగా గల నోంకారమునకు స్ఫోటచిచ్ఛక్తి స్వరూపముగనదే సమస్తవాక్కు అగుచున్నది.

శ్లో 101 మూలాధారాద కారస్ఫురతి లఘుపథం నాభి రంధ్రాదుకారో
మధ్యస్థానే మకార శ్శశికిరణవశాత్కంఠతో బిందురస్మా
న్నాదో మధ్యాచ్ఛశక్తిశ్శిరసిచ గతిశ్శాంతి మద్వాదశాంతే
ఓంకారోధ్యానరూపో రవిరివ జగతాం నాయకో విశ్వమూర్తిః

తా॥ మూలాధార చక్రమునందు అకారము స్వల్పముగా స్ఫురించును. అచ్చటినుండి నాభివరకును సూక్ష్మముగ లేచి మణిపూరక చక్రమందు దచ్చటి యూష్ణముతోగలిసి ఉకార వర్ణముగ స్ఫుటించును, అచ్చటినుండి ప్రయత్నమున ప్రాణవాయువుతో గలసి హృదయమునందలి అనాహత చక్రమునందు జేరి యచ్చటి యాగ్నేయముతో గలసినచో మకార వర్ణోత్పత్తి యగును. అదియే కంఠస్థానమందలి విశుద్ధచక్రమునందు జేరగ నచ్చటి శశికరణములు (శ్లేష్మము) నంటుచు బిందూత్పత్తి యగును. బిందుముఖమునందు నాదము దాని మధ్యన చిచ్ఛక్తి అగ్రమునందుగతి (చలనము) గలుగగ వాక్కగు నంత ముఖమునండి వైఖరీ రూపమున వెడలుచు బాహ్య వాయువునందు పండ్రెండంగుళముల దూరమువరకు జని యచ్చటలీనమగును. సూర్యునివలె జగత్తునంతటవ్యాపించి నియమించునదగు ధ్యానరూపమైన ఓంకారము విశ్వరూపమైనది. వర్ణములకు మూలాధార చక్రమునం దకారముగోచరమగుటతో పరనామము, మణిపూరకమునందు

కారవర్ణమై యోగి జనదర్శన యోగ్యమగుటతో పశ్యంతీ నామము. అనాహత చక్రమందు (హృదయమునందు) మకార వర్ణమునకు మధ్యమ నామము విశుద్ధచక్రమునందలి శ్లేష్మముతో గలసిన బిందువగుచు మనుష్యుల ముఖమునుండి వాక్కై వెడలగ వైఖరీ నామము గలిగినది. ఇట్లు వాక్కు శ్రోత్రేంద్రియ గోచరమైనందున వైఖరి.

శ్లో 102 అష్టౌస్థానాని వర్ణానా మురఃకంఠ శిరస్తథా
జిహ్వామూలంచ దంతాశ్చ నాసికౌష్ఠౌచ తాలుచ

తా॥ వర్ణోత్పత్తి స్థానము లెనిమిది: 1. ఉరము, 2. కంఠము, 3. శిరము, 4. జిహ్వామూలము, 5. దంతములు, 6. నాసిక, 7. ఓష్ఠములు (పెదివెలు) 8. తాలు (దవడలు).

ఉరమునకు (హృదయమునకు) క్రింది స్థానములైన మణిపూరక, మూలాధార, చక్రములందు వర్ణోత్పత్తియైనను అవి గోచరించజాలవు. దానిని దెలుసుకొనువారికే బ్రాహ్మణత్వముండునని శ్రుతిజెప్పినది.

శ్రుతి ౪౩ "యావాక్పురుషేషు సాఘోషేషు ప్రతిష్ఠితా కశ్చిత్తాం
వేద స్వబ్రాహ్మణః సావాగ్యయా స్వప్నేభిభాషతె"

తా॥ పురుష శరీరమునం దేవాక్కు ప్రతిష్ఠింపబడినదో (ప్రాణమునందు నాదరూపమున నున్నదో) యదియే బాహ్యవాయువునందు గలదు. దానిని దెలియువాడే బ్రాహ్మణుడు. స్వప్నావస్థయం దేవాక్కుచ్చరింపబడుచున్నదో యా వాగుత్పత్తికి కారణము అత్మయగును. వాక్కు నాదరూపమదే ప్రాణవాయువు. దాని కారణమాత్మ (బ్రహ్మ) కావున అత్మజ్ఞానము గలవారలకే బ్రాహ్మణత్వము గలదనుట యొప్పుచున్నది. స్పందశక్తి ప్రాణమదే చిచ్ఛక్తి. ఇది ఇంద్రియాదుల కగోచరమైనది.

81. నాదరూపములైన వర్ణములు స్వరములని (అచ్చులు) వ్యంజనములని (హల్లులు) రెండు విధములు. స్వరములు అకారాది విసర్గపర్యంతములైన పదహారు వర్ణములు. కాదిక్షాంత వర్ణములు హల్లులు.

శ్రుతి ౪౪ "కాదయోమావ సానాస్స్పర్శాః యరలవా అంతస్థాః
శాషసహా ఊష్మాణః తైఃక్రమ విశేషా వచ్ఛిన్నైర్వ్యజ్యమానా
నానా రూపావర్తంతె

తా॥ కకారాది మకారము వఱకు గల హల్లులే స్పర్శలు. య,ర,ల,వ, అంతస్థులు శ,ష,స,హా,లు ఊష్మములు ఇవి అకారాది స్వరములగు ప్రాణములతో గలసి ప్రయత్నమున నుత్పత్తి స్థానాదులనుండి క్రమబద్ధముగ నుత్పన్నములై నానా రూపములుగ వ్యక్తమగును. ఉత్పత్తిస్థానములివి :-

1. అ,క,ఖ,ఘ,ఙ,హా,ః, లివి విసర్జనీయములు వీనికి కంఠముత్పత్తిస్థానము.
2. ఇ,చ,ఛ,జ,ఝ,ఞ,య,శ ,, వీనికి తాలు ,,
3. ఋ,ట,ఠ,డ,ఢ,ణ,ర, ష ,, ,, శిరస్సు ,,
4. ౡ,త,థ,ద,ధ,న,ల,స ,, ,, దంతములు ,,
5. ఉ,ప,ఫ,బ,భ,మ ౢ (అర్ధవిసర్గ) ,, ఓష్ఠములు ,,
6. ఞ,మ,ఙ,ణ,న ,, ,, నాసిక ,,
7, ఏ,ఐ లకు కంఠము, తాలువును స్థానములు.
8. ఓ, ఔ లకు కంఠము మరియు ఓష్ఠములు స్థానములు.
9. వకారమునకు దంతములు మరియు ఓష్ఠములు స్థానములు.
10. విసర్గలకు జిహ్వా మూలము ,,
11. అనుస్వారమునకు నాసిక ,,

82. వర్ణములను వాని స్థానములనుండి ప్రయత్నమున వేరగునట్లుచ్చారణ మొనర్చుటకు గురుముఖమున తెలిసికొని యుచ్చరించనగును. వర్ణములాయాస్థానములందు జేరగ వానికి రూపము (ఆకృతి) యేర్పడుచు వాని కప్పుడే నామము లేర్పడును. అక్షరములకు వివిధ వర్ణములతో రూపము లుండును.

శ్లో॥ 103. అకారాద్యా స్వరాధూమ్రాః సింధూరాభాస్తు కాదయః ।
డాది ఫాంతా గౌరవర్ణాః, అరుణాః పంచబాదయః ।
లకారాద్యాః కాంచనాభాః, హకారాంత్యౌ తటిన్నిభాః

తా॥ అకారాది స్వరవర్ణములు. అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ, ం. ః. పదహారు ధూమ్ర వర్ణములుగలవి,
2. కవర్గము. (క, ఖ, గ, ఘ, ఙ) చ వర్గము (చ, ఛ, జ, ఝ, ఞలు) ట, ఠ, లు, పండ్రెండు సింధూర వర్ణములు గలవి.

3. డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, లు యీ పది యక్షరములు గౌరవర్ణము గలవి.

4. బాదులు, బ, భ, మ, య, ర, లను ఐదున్ను, అరుణ వర్ణము గలవి. (కొందఱు లకారమునుకూడ అరుణ వర్ణములలో జేర్చిరి. పై రెండు పక్షములు సరియే ఏలనన ఋతువులారైనను శ్రుతియందు ఐదుఋతువులే జెప్పబడినవి.

శ్రుతి॥ ఆ.౫. "ద్వాదశమాసాః పంచఋత వస్త్రయ ఇమేలోకాః అసావా
దిత్యో ఏకవిగ్ంశః"

తా॥ పండ్రెండు నెలలు, అయిదు ఋతువులు, మూడు లోకములు ఈ కనుపించు సూర్యునితో గలిసి మొత్త మిరువది యొకటి. శ్రుతియందు శిశిరము హేమంత ఋతువునందు జేర్చి చెప్పబడినది. కాన అయిదు ఋతువులనుచు జెప్పబడెను. ఇట్లే పలుచోట్ల ప్రయోగములున్నవి. ఆదే విధమున బాదు లైదువర్ణములని జెప్పినను లకారము నాఱవదిగ జేర్చి ఆరు వర్ణములు అరుణిమగలవిగ తెలిసికొనవలెను. లింగ స్థానమునందుగల స్వాధిష్ఠాన చక్రమారురేకులు (దళములు) గలది. అచ్చట లకార వర్ణముండునని జెప్పకున్నచో నచ్చటి యొక దళమునందే వర్ణ శూన్యమై నిరర్థకమగును, మరియు దానికిందనే యుండు మూలాధార చక్రము నాల్గురేకులు (దళములు) గలది యున్నది. దానియందుగల వ, శ, ష, స. లు నాల్గు వర్ణములకన్న హెచ్చైనచో, లకారము యుండుననినచో దళమధికమైన దైదవది లేనందున లకారముండుటకు స్థానములేక లవర్ణము నిరర్ధక-

మౌను. గావున లకారమును శాదులతో జేర్చి చెప్పుటే సమంజసమైనది ఇట్లు జెప్పిన శ్లోకవిరుద్ధార్థము గాజాలదు. లకారాద్యాః అనగా లకార ఆదిర్యేషాంతే యను విగ్రహము చెప్పికొని వ, శ, ష, స, లు నాల్గని అర్థము జేయవచ్చును. మరియు అరుణాః పంచశాదయః యన్నప్పు డాదిశబ్దమున లకారమును జేర్చవచ్చును. ఇట్లు లకారాద్యాః కాంచ నాభః యన్నప్పుడు లకారమును విడిచి వ, శ ష, స, యక్షరముల వర్ణము బంగారు రంగుగయుండునని యర్థము హ, క్ష, ల రంగు ఎఱుపు ఇదే యర్థమును దెలుపు శ్లోకమంతర్మాతృకా సరస్వతీ ధ్యానమునందు జెప్పబడినది.

శ్లో॥ 104. ఆధారే లింగనాభౌ హృదయసరసి జేతాలుమూలేలలాటే
ద్వేపత్రేషోడశారే ద్విదళ దశదళే ద్వాదశార్ధే చతుష్కే
వాసాంతే బాలమధ్యేడ పకఠ సహితే కంఠమూలే స్వరాణాం ।
హంక్షంత త్వార్థయుక్తం సకల దళగతం వర్ణరూపంనమామి

తా॥ మూలాధారము, లింగము (స్వాధిష్ఠానము) నాభి (మణిపూరకము), హృదయ సరసిజము (అనాహతము) తాలుమూలము (కంఠదేశమునందలి విశుద్ధ చక్రము) లలాటము (భృకుటి యందలి ఆజ్ఞా చక్రము) లివి షట్చక్రములనబడును. వీనియందు క్రిందినుండి క్రమమున రెండురేకులు, పదునారు దళములు, పండ్రెండు రేకులు, పదిరేకులు, ఆరు రేకులు, నాల్గు రేకులుండును. పైనుండి వాసాంత మన వశ, ష, స, లు బాలమధ్యే, ఫ కారమును విడిచిన బ, భ, మ, య, ర, ల, లు, డాది ఫాంతములైనవి పది. డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, లును, క, ఠ, సహితేకాది ఠాంతమైన కవర్గము, చవర్గము, ట, ఠలు గలిపిన పండ్రెండగును. కంఠమూలమందలి స్వరములన విశుద్ధ చక్రమునందుండు అకారాది విసర్గల పర్యంతములైన స్వరములు పదునారుండును. ఆజ్ఞా చక్రమునందు హకారక్షకారములుండును. షట్చక్రములందలి సకల దళములందున (రేకులందు) గల వర్ణరూపురాలైన సరస్వతికి నమస్కరించెదను.

83. నాదరూపమైన ప్రాణవాయువు షట్చక్రములందుండు ఊష్మముతో గలసి వర్ణాభి వ్యంజకమగుచున్నది. అన్యథా ప్రాణవాయువు సర్వాంత ర్వ్యాపి యగుటతో నది యుత్పత్తి స్థానాదులందు జేరినగాని వర్ణాభి వ్యంజకములు గాజాలక పదవాక్య క్రమమును బొందనియెడల పశ్వాది తుల్యధ్వనియగుచు అర్థవంతము గాజాలదు. గావున గురుముఖమున శిక్ష బడసి వర్ణాభి వ్యంజకమగునట్లు బాహ్యాభ్యంతర ప్రయత్నమును జేయ నగును.

శ్లో॥ 105. దేహేపిమూలా దేస్మిన్సముదేతి సమీరణః ।
వివక్షో రిచ్ఛయోత్థేన ప్రయత్నేన సుసంస్కృతః ।
సవ్యంజతి తత్రైవ శబ్ద బ్రహ్మపి సర్వగః

తా॥ ఈ దేహమందలి మూలాధార చక్రమునందే ప్రాణవాయువు (నాదము) లెస్సగా నుదయించును. అదియే ఇచ్ఛా వివేకములతో గురుముఖమున సంస్కరింపబడన యెడల ప్రయత్నముచే పైకి వెడలించగ శబ్దబ్రహ్మ (నాదము) సర్వగతమైనను ఆయా స్థానములందే వ్యక్తమగును. ప్రయత్నము ఆంతరము బాహ్యమని రెండు విధములు. బాహ్యాప్రియ త్నమును గురు ముఖాధ్యయనమునను, ఇచ్ఛా వివేకాభ్యాసనలచే నాంతర ప్రయత్నమును చక్కగ నెఱింగి యుచ్చరించిన శబ్దము స్వరమగును. అట్టి సస్వరమైన మంత్రోచ్చారణయే ఫలప్రదము. అపస్వరోచ్చారణ మనర్థకారి.

శ్లో॥ 106. మంత్రోహీన స్వరతో వర్ణతోవా । మిథ్యాప్రయుక్తోన
తదర్థమాహా । సవాగ్వ జ్రోయజమానం హినస్తి యథేంద్ర
శత్రుస్స్వరతో పరాధాత్

తా॥ మంత్రములు స్వరముచేగాని, వర్ణముచేగాని లోపించినను లేక యొక వర్ణమునకుబదులుగా నింకొకవర్ణముచ్చరించినను యవియర్థము నివ్వజాలవు. అట్టివాక్కే వజ్రమగుచు యజమాని హింసను జేయకలుగును. ఇందు్రిడు త్వష్ట కుమారుడగు విశ్వరూపుని చంపగా త్వష్ట యింద్రునిపై కోపించి యింద్రుని చంపగల కుమారుని బడయుటకై అభిచారిక హోమము

చేయుచుండ ఋత్విక్కు "ఇంద్రుని చంపగల కుమారుడు గలవాడవై వర్ధిల్లుమని చెప్పదలచి దానిని సస్వరముగ నుచ్చరింపక పోవుటచే నతడు (త్వష్ట) ఇంద్రుని చేతిలో మరణించునట్టి కుమారుని (వృత్రాసురుని) బడ సెను. కాన అపస్వరమగు వాక్కు యజమాని కనర్థము కలుగజేయును. కావున మంత్రోచ్చారణం దుస్వరవర్ణాది వ్యత్యాసమును జేయగూడదు. సాంప్రదాయ వేత్తయగు సద్గురునొద్ద క్రమశిక్షబడసి ప్రయత్నమున సస్వరముగా మంత్రోచ్చారణ జేయనగును.

శ్లో॥ 107. కుతీర్థాదాగతం దగ్ధమపవర్ణంచభక్షితం ।
ఏవముచ్చారణం పాపమన్య థోచ్చారణం శుభం

తా॥ సుశిక్షితుడుగాని గురువు నొద్ద కావించిన అధ్యయనము స్వరవర్ణ లోపముగలదిగను (దగ్ధము) ఒకదానికి బదులు మఱియొక వర్ణముగలది గను (అపవర్ణ) మ్రింగబడిన అక్షరము గలదిగ నుండును. అట్టి అపస్వర భూయిష్ఠమగు నుచ్చారణ మహాపాపము. కాన మంత్రమును సస్వర ముగ నుచ్చరించవలెను.

శ్లో॥ 108. సుతీర్థాదాగతం వ్యక్తం స్వామ్నాయం సువ్యవస్థితం ।
సుస్వరేణ సువక్త్రేణ ప్రయుక్తం బ్రహ్మజాయతే

తా॥ సాంప్రదాయ విదుడగు సుశిక్షితుడైన గురువు నొద్ద నేర్చిన యుచ్చారణ సువ్యక్తముగ (స్పష్టముగ) అర్థయుక్తమైనదిగ సువ్యవస్థితముగ సుస్వరముగనుండి బ్రహ్మ (వేదము) అనబడును.

శ్లో॥ 109. ఏవంవర్ణాః ప్రయోక్తవ్యానావ్యక్తా నచపీడితః ।
సమ్యగ్వర్ణ ప్రయోగేన బ్రహ్మలోకే మహీయతే

పా. శి. ఖ. 3. శ్లో. 31.

తా॥ పై జెప్పినట్లు స్వరవర్ణోచ్చారణందు, వ్యక్తము గాకుండునట్లేగాని, వర్ణమును పీడించినట్లేగాని ప్రయోగముల జేయరాదు. లెస్సగా స్వర వర్ణోచ్చారణ జేసినచో బ్రహ్మ లోకమునందు (పండితులసభలో) పూజ్యు డగును. కావున స్వరవర్ణోచ్చారణను తెలుపుటకు శిక్షాశాస్త్రావసర

మైనది. దీనియందు ఉదాత్తాను దాత్త స్వరవ్యంజనాది విశిష్ట విజ్ఞానము జెప్పబడినది. శిక్షాశాస్త్రము లనేక ఋషి ప్రణీతములు గలవు. అందు పాణినీయ, వ్యాసశిక్షలు జేర్కొనదగినవి. "అధశిక్షాం ప్రవక్ష్యామి పాణినీయమతానుగం" అనుచు పాణినీయ శిక్షారంభమున జెప్పబడినది.

84. వర్ణోచ్చారణయందు సావయవములైన తాలువ మున్నగు స్థానముల నుండి ఊర్ధ్వమునకు (పైకి) బలికిన స్వరముదాత్తము.

2. వర్ణోచ్చారణందు సావయవములైన తాలువ మున్నగు స్థానముల నుండి క్రిందికి బలికిన అచ్చనుదాత్తము.

3. వర్ణోచ్చారణయందు వేగమున కంపన జేయుట స్వరితము.

4. వర్ణము యొక్క ఏక మాత్రోచ్చారణ హ్రస్వము.

5. ద్విమాత్రోచ్చారణ (రెండు మాత్రలకాలము) దీర్ఘమనబడును.

6. వర్ణమును మూడు మాత్రల కాలము వరకు నుచ్చరించుట ప్లుతము.

ఉదాహరణగా ఉ, ఊ, ఊలు క్రమమున హ్రస్వదీర్ఘ ప్లుతములు.

శ్లో॥ 110. ఉదాత్తశ్చాను దాత్తశ్చ స్వరితశ్చ స్వరాస్త్రయః ।
హ్రస్వో దీర్ఘప్లుత ఇతికాలతో నియమాఅచి

పా. శి. ఖ. 3. శ్లో. 10.

తా॥ వర్ణమున కుదాత్తఅను దాత్త స్వరితములనుచు త్రివిధ స్వరములు గలవు. మరియు దానికి హ్రస్వము, దీర్ఘము, ప్లుతమనుచు త్రివిధ మాత్రలు (ఉచ్చారణకు కాలము) నియమముగనుండును.

శ్లో॥ 111. హ్రస్వస్స్యా దేకమాత్రస్య, ద్విమాత్రస్యతుదీర్ఘతా ।
త్రిమాత్రస్య ప్లుతోచాంహి పాదోమాత్రశ్చతుర్ధకః

వ్యా. శి. ఖ. 1. శ్లో. 1.

తా॥ ఒకమాత్రకాల ముచ్చరించు వర్ణము హ్రస్వము, రెండు మాత్రల కాల ముచ్చరింపబడునది దీర్ఘము, మూడు మాత్రల కాలము నుచ్చరించునది ప్లుతము. నాల్గుమాత్రలైన రంజప్లుతము.

| | | |
|---|---|---|
| హ్రస్వోదాత్త | దీర్ఘోదాత్త | ప్లుతోదాత్త |
| హ్రస్వానుదాత్త | దీర్ఘానుదాత్త | ప్లుతానుదాత్త |
| హ్రస్వస్వరిత | దీర్ఘస్వరిత | ప్లుతస్వరిత |

భేదములచే నొక స్వరమే తొమ్మిదివిధములైనది.

మాత్రకాలమును కొందరు తృటి యనిరి. మరికొందరు మోకాలను తన హస్తముతో మూడుసార్లుజుట్టి చిటికెవేయునంత కాలమనిరి.

85 "అథశిక్షాం వ్యాఖ్యాస్యామః, వర్ణః స్వరః, మాత్రా, బలం, సామ, సంతానః" యని తైత్తిరీయ శిక్షలోగలదు. వర్ణస్వర మాత్రాదులు పైన జెప్పబడినవి. బలమనగ ప్రయత్నము. వర్ణములకు విశేషణములేవియు జెప్పనప్పుడు సమముగా నుచ్చరించుట సామము, వర్ణముల సహోచ్చారణ జేయుట (కలిపి యుచ్చరించుట) సంతానమనబడును. రంజప్లుత విశేషణములివి :—

శ్లో॥ 112. రంజవర్ణం ప్రయుంజీరన్నో గ్రసేత్పూర్వమక్షరం ।
దీర్ఘస్వరం ప్రయుంజీ యాత్పశ్చాన్నాసిక్య మాచరేత్

తా॥ రంజ ప్లుతోచ్చారణందు రంజాక్షరమునకు పూర్వాక్షరమును గ్రసించవలదు (స్పష్టోచ్చారణ జేయవలయును) ప్లుతాక్షరమును దీర్ఘస్వరమున బలుకవలెను. స్వరాంతమును నాసికయందుంచనగును.

శ్లో॥ 113. హృదయే చైకమాత్ర స్త్వర్ధమాత్రస్తు మూర్ధని ।
నాసికాయాంతథార్ధంచ రంజస్యైవంద్విమాత్రతాః

తా॥ రంజవర్ణమును హృదయమునందేక మాత్రకాలము అర్ధమాత్ర కాలము శిరస్సునందు తుదియర్ధ మాత్రకాలమును నాసికయందుంచగ రంజ ప్లుతము రెండు మాత్రలదగును.

శ్లో॥ 114. హృదయాదుక్క రేతిష్ఠ న్కాంస్యేవసమనుస్మరన్ ।
మార్దంవంచ ద్విమాత్రం చజఘన్వేతి నిదర్శనం

తా॥ రంజ వర్ణముచ్చరించునప్పుడు హృదయమునుండి కంచు మ్రోగు నట్లు దానిని రెండు మాత్రకాలము వరకు మృదువుగా నుచ్చరించవల యును. ఉదా:- "జఘన్వేతి"

శ్లో॥ 115. మధ్యేతుకం పయేత్కం పముభౌపార్శ్వౌసమౌ భవేత్ ।
సరంజం కంపయేత్కంపంరథేవేతి నిదర్శనం ।

తా॥ మధ్య వర్ణము ప్లుతమైనచో స్వరితవర్ణమును సమముగా నుభయ పార్శ్వములందున్నట్లు కంపించవలెను. ఉదా:- "రథం" ఇదే విధ ముగ వ్యాసశిక్షయందలి రంజ ప్లుతమును గురించి జెప్పిన శ్లోకములు గలవు.

శ్లో॥ 116. అకారాంతః ప్లుతోయశ్చేదను నాసిక్య ఉచ్యతే
అమత్రధ్వని తుల్యశ్చ రంజసంగ ఇతీర్యతే

తా॥ అమత్రమన కంచు అకారమంతః ప్లుతము (లోపలగునప్పుడు) అను నాసికయగును.

శ్లో॥ 117. రంజప్లుతే వ్యాఘ్రశబ్ద. పూర్వభాగే విధీయతే ।
మాత్రాద్వయంతు తత్రైవ తథానిరనునాసికం ।
మూర్ధ్నిస్థానే తృతీయాంశః కాంస్యధ్వని సమస్తథా

శ్లో॥ 118. కంపశ్లిష్ట స్తథాచైవ మాత్రికా సహిత స్తథా ।
చరమాంశస్తు నాసిక్యే బిలద్వయే తథైవచ

శ్లో॥ 119. నిస్సృతాంశస్తు తత్రైవ మాత్రికా సహిత స్తథా ।
ఎంవంరంజాః ప్లుతాశ్చతుర్మాత్రాస్సమీరితా

తా॥ పై జెప్పిన తాత్పర్య మీ శ్లోకములకగును. ఇచ్చట రంజప్లుతము నాల్గు మాత్రల కాలము వరకు గావచ్చునని జెప్పనైనది.

ఉదా:- 1. శుశ్లోకాం (4) 2. సుమంగలాం (4) 3. యశోమమాం (4) ఉపహూతాం (4) యఘ్రాం (4)

శ్లో॥ 120. చత్వారః కాఠకేరంజాః । దీర్ఘాహ్యారణ్యకేవిదుః ।
పంచరంజాః ప్లుతాదీర్ఘా । శ్చత్వారస్తైత్తిరీయకే

తా॥ కాఠకమంత్రోచ్చారణందు రంజ ప్లుతము ౪ మాత్రల కాల దీర్ఘోచ్చారణగును. ఆరణ్యాకములను పంచమాత్రిలకాల దీర్ణోచ్చారణము జేయవలెను. తైత్తిరీయమునందు నాల్గుమాత్రల కాలమువరకే దీర్ఘము స్వరవర్ణోచ్చారణను సుస్వరము గసుకరముగ జేయుటయే, శాస్త్రప్రయోజనము దీనిచే పురుషునియొక్క వాక్కు సంస్కృతమగును. సంస్కృత వాక్కును ప్రయోగించువాడు పండితుల సభలో పూజ్యుడగును. విశేష విజ్ఞానవంతులగు పండితులకు శిక్షాశాస్త్రమహిమ యథార్ధముగ దెలియబడునేగాని యితరులకది తెలియుట అసంభవము. వర్ణములైన స్వర వ్యంజనాదులను ప్రయత్నముగ నప్రమత్తుడగుచు వాని నర్ధయుక్తముగ దెలిసికొని యుచ్చరించునప్పుడు స్వరము లింద్రాత్మకములైనందున వానిని శ్లక్ష్ణ బలయుక్తముగ నుచ్చరించవలయును. శ, ష, స, హాలగు ఊష్మములు ప్రజాపతికి సంబంధించినవి కాన వాని నిరుక్తమనిరి. యనగా స్పష్టములుగా వినబడునట్లు యుచ్చరించవలెను. కాని వానిని గ్రసించక (విడువక) ఉచ్చరించనగును. కాదులు మృత్యుసంబంధములు (అగ్నేయములు) గాన వానిని వినబడునట్లుచ్చారణ చేయవలయును. మరియు వర్ణములను స్పృష్టములని, ఈషత్స్పృష్టములని, వివృతములని. సంవృతములని నాలుగు విధములనందురు. వాని యుచ్చారణకగు ప్రయత్నము నందు విశేషము గలదు. ఊష్మములకు వివృత ప్రయత్నము స్పర్శములకు స్పృష్టప్రయత్నము, య, ర, ల, వ, యను యంతస్థముల కీషత్స్పృష్టత్వము హ్రస్వ వర్ణములకు సంవృత ప్రయత్నము గురుముఖాధ్యమును జేయగ దెలియబడును. ఇట్టి స్వరవర్ణోచ్చారణ జేయగలిగిన వారలె యజ్ఞాది కర్మలందు ఋత్విక్కులగుదురు. ఔద్గాత్రవర్ణియందుండు నుద్గాతలిట్టి స్వరవర్ణోచ్చారణ జ్ఞానముగలిగిన వారలుండవలయును.

శిక్షాశాస్త్రము సమాప్తము.

# 2. వ్యాకరణము

86. వైదిక పదములకు సాధుత్వజ్ఞానము గలుగుటందూహోదికమును జేర్చి రెండవ యంగముగ వ్యాకరణ శాస్త్రము జెప్పబడినది. ఆది కాలము నందు మహేశ్వరుడు నటరాజ రూపమున నాట్యము జేయుచు తన చేతి ఢక్క (వాద్య విశేషము) వాయించగ నందుండి పదునాలుగు నాదము లేర్పడినవి. అవియే పదునాలుగు సూత్రములైనవి వీనినే మాహేశ్వర సూత్రములందురు.

1. అ, ఇ, ఉ, ణ్. 2. ఋ, ఌ, క్. 3. ఏ, ఓ, ఙ్. 4. ఐ, ఔ, చ్. 5. హ, య, వ, ర, ట్. 6. ల, ణ్, 7. ఞ, మ, ఙ, ణ, నమ్. 8. ఝభఞ్. 9. ఘ, ఢ, ధష్, 10. జ, బ, గడ, దశ్. 11. ఖ, ఫ, ఛ, ఠ, థ, చ, ట, త, వ్. 12. క, ప, య్. 13. శ, ష, స, ర్. 14. హ, ల్ వీనిని పురస్కరించుకొని కొన్నివేల సూత్రములతో పాణిని మహర్షి అష్టాధ్యాయి జెప్పిరి.

సూత్ర ౧. "వృద్ధిరాదైచ్" ఇత్యాది సూత్రములతో పాణిని ప్రారంభించి జెప్పిరదే వ్యాకరణమునకు కాత్యాయనుడు వార్తికమును, పతంజలి మహర్షి భాష్యమును వ్రాసిరిట్లు. మునిత్రియ ప్రణీతమైన వ్యాకరణము లోకోపకారమగుచున్నది.

శ్లో॥ 121 యేనాక్షర సమామ్నాయ మధిగమ్య మహేశ్వరాత్ ।
కృత్స్నం వ్యాకరణం ప్రోక్తంతస్మై పాణి నయేనమః

శ్లో॥ 122 వాక్యకారం వరరుచిం భాష్యకారం పతంజలిం ।
పాణినిం సూత్రకారంచ ప్రణతోస్మి మునిత్రియం

87. వర్ణ, స్వర సంధులను సమకూర్చి సలక్షణమైన వ్యాకరణశాస్త్రముచే వేద సంరక్షణ జేయబడినది. ఇంద్రాదిక వ్యాకరణములు వేదాంగములుగ పరిగణింపబడలేదు. అవి లౌకిక భాషా విజ్ఞానమున కుపకరించును. పతంజలి మహాభాష్యమునకు పెక్కు వ్యాఖ్యానములు గలవు.

2. వ్యాఖ్యానములు విజ్ఞాన సౌకర్యమున కుపయుక్తములగును. ఈ శాస్త్రమునందలి సంగ్రహ విషయములివి :- ప్రత్యాహారము 2. సంజ్ఞ 3. పరిభాషా 4. సంధి 5. అజంతమాల 6. హలంతమాల 7. సర్వనామములు 8. స్త్రీ ప్రత్యయములు 9. కారకములు 10. అఖ్యాతములు 11. లకారార్థము 12. సంజ్ఞానియమములు 13. క్రియలు 14. ఆత్మనేపదములు 15. పరస్మైపదములు 16. ఉభయ పదములు 17. సమాసనిరూపణ 18. కృతద్ధిత వృత్తులు 19. అవ్యయజ్ఞానము. వీనిని సవిస్తరముగ దెలియుట సులభసాధ్యముగానందున సంగ్రహించి యిందు కొన్ని జూపించబడును. శబ్దములు సుబంత, తింజంతములనుచు రెండు విధములుండును. లంజ, విభక్తి, వచనములుండునవి సుబంతములు, తింజంతములు క్రియా పదములగును. పై రెండింటియందు జేరనివి అవ్యయములగును.

సుబంతములు నామమును గాని, విశేషణముగాని దెలుపును.

లంజముత్రి విధము :- 1. స్త్రీ 2. పుం 3. నపుంసకములు.

3. ఏక, ద్వి, బహు, వచనములనుపేర త్రివిధమున వచనములుండును.

4. ప్రథమాది సప్తమి వరకు సప్త విభక్తులుండును ప్రథమయందే సంబోధన యను విభక్తి జేరినది. విభక్తిజ్ఞానమునకుగాను నామాంతములందు ప్రత్యయములు (గుర్తులు) జెప్పబడును.

| 5. | ఏక | ద్వి | బహు | వచన సంజ్ఞ్య |
|---|---|---|---|---|
| 1. | సు | ఔ | జస్ | ప్రథమ |
| 2. | అం | ఔట్ | శస్ | ద్వితీయా |
| 3. | టా | భ్యాం | భిస్ | తృతీయా |
| 4. | ఙ్జే | భ్యాం | భ్యస్ | చతుర్థీ |
| 5. | ఙ్గస్ | భ్యాం | భ్యస్ | పంచమి |
| 6. | ఙస్ | ఓస్ | ఆం | షష్ఠీ |
| 7. | ఙి | ఓస్ | సుప్ | సప్తమి |
| 8. | హే రామ | హే కృష్ణ | | సంబోధనలు. |

పై ప్రత్యయములతో నామ విశేషణ పదము లూహాచే గుర్తించబడును. నామమునకు బదులుగ సర్వనామములుపయోగింతురు వానికిని లిఙ వచన విభక్తులు పై జెప్పినవి యుండును.

88. శబ్దములందు వ్యస్త, సమస్తమను భేదముగలదు వానిలో మరల రూఢి, యోగికమను భేదములు గలవు.

ఒక పదము వ్యస్త మనబడును. వాని కంటెను హెచ్చు పదములున్న గాని వ్యస్త పదములొకచోట జేరినగాని సమస్తములేక సమాస పదము లనబడును.

సంజ్ఞయందుగల వర్ణములు (అక్షరములు) పరుషములు, సరళములను రెండు విధములాంధ్రి భాషయందు గలవు.

1. క,చ,ట,త,ప,లు పరుషములు, గ,జ,డ,ద,బ,లు సరళములు.

2. ఖ, ఛ, ఠ, ఫ, ఘ, ఝ, ఢ, ధ, భ ఇవి వర్గయుక్కులు.

పరుషములు సరళములునుగాక మిగిలినవి స్థిరములనబడును.

3. నకారమును ద్రుతమందురు, నకారమంతమునందుగల విభక్తులు ద్రుత ప్రకృతికమందురు.

4. ద్రుతప్రికృతికములుగానివి కళలనబడును.

5. అనుస్వారము రెండువిధములైనవి. 1. అర్ధాను స్వారము 2. పూర్ణా నుస్వారము.

6. అనుస్వార ద్వయాత్మకములైనవి విసర్గలు.

7. పూర్ణానుస్వారము 1. సిద్ధ 2. సాధ్యభేదమున రెండు విధములు.

ఉ:- కొండ మొదలగు పదములందలి అనుప్వారము సిద్ధము. 2. పద సంధియందుండు అనుస్వారము సాధ్యము. ఉదా:— కూసెంగోయిల

8. శబ్దమూలముతోకూడి క్రియావాచకమైన ధాతువు ప్రత్యయముగ జేరనిది ప్రాతిపదికములు. ఉ:— రామః గజః ఇత్యాదులివియే తెనుగు

భాషయందు లింజ విభక్త్యర్థము ననుసరించి సంపూర్ణపదములగును. ఉ:- రాముడు, గజము, ఇత్యాదులు.

9. పదమునందంత్య హల్లునకు పూర్వముండు వర్ణము. ఉపధ యన బడును. ఉ:- నృపాల శబ్దమందలి అంత్యవర్ణము లకార హల్లుపైగల అకారముపోగా మిగిలిన "ల్" ఉపధ.

10. వ్యాకరణముచే విధింపబడు వర్ణములు ఆగమమని, ఆదేశమని రెండు విధములుండును.

(1) ఒక పదమునందలి వర్ణమును దొలగించక దాని ప్రక్కన మిత్రుని వలె జేరు వర్ణము, ఆగమము. ఉ:- బాలెంత + ఆలు = బాలెంత ర్ + ఆలు = బాలెంతరాలు. ఇచ్చట రేఫము ఆగమము.

(2) ఒకపదమునందలి యక్షరమును దొలగించి యదే స్థానమున శత్రుని వలె జేరువర్ణమాదేశము ఉ:- వచ్చెన్ + కాంత = వచ్చెన్గాంత ఇచట సరళమాదేశము.

11. ఒక హల్లున కట్టిదే యింకొక హల్లు గలిగిన ద్విత్వమగును. ఉ:—అక్క, అమ్మ ఇత్యాదులు.

12. ఒక హల్లున కింకొక భిన్నమగు హల్లు చేరిన సంయుక్తాక్షరమన బడును. ఉ:- క్వ, జ్మ, ఇత్యాదులు.

13. సంధిచేగాని, ఆగమాదేశాదులతోగాని తప్పకవచ్చు వర్ణము నిత్య మనబడును. ఉ:- రాముడు + అతడు = రాముడతడు (ఉత్వసంధినిత్యము)

14. ద్రుతము యొక్క నిజస్వరూపమును స్వత్వమందురు.

ఉ:- వచ్చెనుకాంత.

15. క్రియాపద మూలరూపమును ధాతువందురు.

16. లింగ వచన విభక్తి శూన్యములు అవ్యయములు ఇవి రెండువిధములు

1. ప్రతి పదోక్తములు 2. లాక్షణికములు

(1) స్వతసిద్ధములైనవి ప్రతిపదోక్తములు.

(2) వ్యాకరణ వశమున సిద్ధమగునవి లాక్షణికములు. ఇందు మూడు విధములుండును.

1. అవ్యయీభావము 2. కృదంతము 3. తద్ధితాంతములు.

1. అవ్యయీభావములు ఉ:- ఉపకుంభం అపదిశ మిత్యాదులు.

2. కృదంతములకు నాల్గువిధములైన ప్రత్యయము లుండును.

(1) తుముల్ = ఉ:- భవితుం, గంతుం ఇత్యాదులు.

(2) క్త్వా = ఉ:- ఉక్త్వా, గత్వా, ఇత్యాదులు.

(3) ల్యప్ = ఉ:- అధిగమ్య, సంతర్ప్య, ఇత్యాదులు.

(4) ణ్యముల్ ప్రత్యయము = ఉ:- స్మారం, చోరం, కారం, ఇత్యాదులు

3. తద్ధితాంత ప్రత్యయము లనేకములు. ఉ:- అమ్, వతి, తసిల్, ధా, అధునా, ఇత్యాదులు.

17. ఒక ధాతువుపైనగాని నామవాచకముపైనగాని వేరొక ధాతువు చేరి యేకపదమైనట్టి ప్రత్యేకార్థమిచ్చునది శబ్ద పల్లవము. ఉ:- మేలు + కొను = మేల్కొను. బయలు + పడు = బయల్పడు.

18. వాక్యార్థమును బూరించు విశేషణమును విధేయ విశేషణమందురు.
ఉ:- నల్లని గుఱ్ఱము.

18. స్త్రీ తిర్యగ్జడ భిన్నములును, వాని విశేషణములను మహద్వాచకము లందురు. ఉ:- రాముడు, శివుడు ఇత్యాదులు.

19. తిర్యగ్జడములను అమహద్వాచకము లందురు. ఉ:- వృక్షము మొదలైనవి.

20. స్త్రీ వాచకములు వాని విశేషణములను మహతీవాచకము లందురు. ఉ:- సీతా. భామ, ఇత్యాదులు.

21. రెండుసారులుచ్చరింపబడు నొక పదము యొక్క పరరూపము ఆమ్రేడిత మనబడును. ఉ:- ఇంచుక + ఇంచుక = ఇంచించుక ఇందు రెండవపదము ఆమ్రేడితము.

22. సంస్కృత ప్రాతిపదిక శబ్దములపై విభక్తి ప్రత్యయమును మాత్రమే చేర్చగా యేర్పడునది తత్సమ మనబడును. ఉ:- రామః + డు = రాముడు తెనుగు పదము తత్సమము.

23. సంస్కృత ప్రాకృతములనుండి వర్ణ లోపమునగాని వర్ణవ్యత్యయముచేగాని వికారముతో నేర్పడిన పదములు తద్భవములు. ఉ:- ఆకాశం నుండి ఆకసము తెనుగు తద్భవము.

2. ప్రయాణమునుండి = పయనము, తద్భవము.

24. అన్యదేశభాషా పదములు మారి వాడుకయందుండిన నవి దేశీయములనబడును. ఉ:- ఖరీదు, ఇత్యాదులు.

25. లక్షణ విరుద్ధములైన పదములు వాడుకలోయుండిన వానిని గ్రామ్యములందురు. ఉ - వచ్చాడు, పోయాడు, గొడ్రాలు.

26. ప్రసిద్ధమై, రమణీయమై, పోల్చదగినవి ఉపమానమనబడును.
ఉ:- చంద్రుడు, పద్మము, ఇత్యాదులు.

27. అప్రసిద్ధముగాని, ప్రకృతము లేక వర్ణ్యముప మేయమనబడును.
ఉ:- ముఖము, ఇత్యాలు.

28. ఉపమానోపమేయ సంబంధమును దెలుపునది ఉపమా వాచకము.
ఉ:- పోలెన్, కరణిన్, వలెన్, ఇత్యాదులు.

29. రెండు పదములు గలియునప్పుడు మొదటి పదమునకు చివరగల యక్షరమునందలి యచ్చునకు బదులుగా రెండవపదమందలి మొదటి యచ్చును జేర్చుట, లేక పూర్వాపరస్వరంబులకు పరస్వరం బేకాదేశమగుట సంధి యనబడును. ఉ:- కృష్ణుడు + ఇతడు = కృష్ణుడితడు.

సంస్కృతభాషయందుగల సంధులనేకవిధములు. సంగ్రహమిట్లు:-

30. అచ్చునకు సవర్ణంబైన యచ్చుపరమగునప్పుడు దీర్ఘమగును. ఇదే విధమున అ, ఆ, లకు మరల అ, ఆ, లు ఇ, ఈ, లకు ఇ, ఈ, లు ఉ. ఊ

లకు ఉ. ఊలు ఋకారమునకు మరల ఋకారము పరమైన వాటి వాటికి దీర్ఘము వచ్చును. ఉ- రామ+అనుజుడు=రామానుజుడు. ఇత్యాదులు.

31. అకారమునకేగాని, ఆకారమునకుగాని, సవర్ణములు కానివి. అనగా ఇ, ఉ, ఋ, ఌ, పరమైన క్రమమున వానికి ఎ, ఒ, అర్, అల్, అనునవి యాదేశంబులగును. ఉ:- దేవ+ఇంద్రుడు=దేవేంద్రుడు. 2, మహా+ఋషి=మహర్షి దీనిని గుణసంధి యందురు.

32. అ- ఆ, లకు గ్రమమున ఏ, ఐ, లైనగాని, ఓ, ఔ లైనగాని పరమైనప్పుడు వాటి క్రమమున, ఐ, ఔ లాదేశంబులుగ వచ్చును. ఉ:- ఏక+ఏకము=ఏకైకము. మహా+ఓషధి=మహౌషధి ఇత్యాదులు. దీనిని వృద్ధిసంధి యందురు.

33. ఇ, ఉ, ఋ, ఌ, లకు సవర్ణములైన అచ్చులు పరమగునప్పుడు క్రమముగ నవి, య, వ, ర, ల, ను వర్ణములు, సంశ్లేష రూపమున నగును. ఉ:- గతి+అంతరం=గత్యంరము, ఇత్యాదులు. ఇది యణాదేశసంధి.

34. పరుషములైన క, చ, ట, త, ప, లకు అచ్చులుగాని లేక క, ఖ, చ, ఛ, ట, ఠ, త, థ, ప, ఫ, శ, ష, స, అనునవి గాక వీనికి భిన్నమైన హల్లులు బరమైనచో వానికి గ్రమమున గ, జ, డ, ద, బ, లు సంధిచే వచ్చును. ఉ:- వాక్+ఈశుడు=వాగీశుడు.

35. తకారమునకు జ, ఝ, వర్ణము పరమగుచో, జకారము సంధిచే వచ్చును. ఉ:- తత్+జాతి=తజ్జాతి మరియు తకారమునకు లకారము పరమైన మరల లకారమే వచ్చును. ఉ:- తత్+లలితము=తల్లలితము ఇత్యాదులు.

36. గ, జ, డ, ద, బ, లగు సరళములకు, న, మ, లు పరమైనచో ఙ, ఞ, ణ, న, మ, లివి క్రమమున వికల్పముగా వచ్చును.ఉ:- వాక్+వై పుణ్యం=వాఙ్నైపుణ్యము.

37. క, చ, ట, త, ప, లకు పరమైన శ, వర్ణమునకు, 'ఛ' వర్ణము వికల్పముగ వచ్చును. ఉ:- వాక్+శరము=వాక్ఛరము.

38. తకారమునకు చ, ఛ, శ, వర్ణములు బరమైన 'చ' వర్ణము వచ్చును
ఉ:- మరుత్ + చలనము = మరుచ్చలనము.

39. 'స' కారాంతపదములందలి 'న' వర్ణమునకు 'శ' వర్ణము బరమైన మరల 'శ' వర్ణమేగాని విసర్గలుగాని వచ్చును. ఉ:- మనస్ + శాంతి = మనశ్శాంతి, లేక మనఃశాంతి ఇత్యాదులు.

40. హ్రస్వాక్షరమునకు 'ఛ' కారము పరమైన 'చ' కారమంతాగమమున వచ్చును. ఉ - శివ + ఛాయ = శివచ్ఛాయ ఇత్యాదులు. ఇట్టి విజ్ఞానమునకు ప్రత్యేకమైన కృషి జేయుటావశ్యకము.

89. ప్రత్యేకార్థములనిచ్చు యనేక పదంబు లేకపదంబై యొకే యర్థమిచ్చునది సమాసమనబడును.

సమాసము లారువిధములుండును. 1. తత్పురుషము, 2. కర్మధారయ, 3. ద్విగు, 4. బహువ్రీహి, 5. ద్వంద్వము, 6. అవ్యయీభావము.

(1) తత్పురుష మెనిమిది విధములుండును. అవి విభక్తిప్రత్యయములతో నేర్పడినవి. 'నఞ్' ప్రత్యయముతో కూడినది. ఎనమిదవ తత్పురుషమందుత్తర పదార్థమే ముఖ్యము. ఉ,-

ప్రథమావిభక్తి:- (1) రాత్రి + అర్థము = అర్ధరాత్రి. 2. అహన్ + మధ్యము = మధ్యాహ్నము.

ద్వితీయ:- (2) దుఃఖమును + అతీతుడు = దుంఖాతీతుడు.

తృతీయ:- (3) వాక్కుతో + కలహము = వాక్కలహము.

చతుర్థి:- (4) వరునికొఱకు + దక్షిణ = వరదక్షిణ.

పంచమి:- (5) సుఖమునుండి + అపేతుడు = సుఖాపేతుడు

షష్ఠి:- (6) రాజుయొక్క + పుత్రుడు = రాజపుత్రుడు. 2. రాజ్ఞః + పురుషః = రాజపురుషః ఇత్యాదులు.

సప్తమి:— (7) గురువునందు + భక్తి = గురుభక్తి, స్థాల్యాం + పాకః = స్థాలీపాకః.

(2) నఞ్:— + ధీనుడు = అధీనుడు. 2. న + బ్రాహ్మణః = అబ్రాహ్మణః తత్పురుషాంతర్భూతమైనది కర్మధారయము. కర్మధారయము మరి ము ద్విగు సమాసములకు సామానాధికరణ్యముండినందున వీనిని తత్పురుష సమాసమునందే యంతర్భూతమందురు.

కర్మధారయ మెనిమిది విధములైనది.

(1) విశేషణ పూర్వపద కర్మధారయ. ఉ:-నీలానిచ + తాని = ఉత్ప లానిచ = నీలోత్పలాని. 2. నీలమైన ఉత్పలము = నీలోత్పలము. 3. అల్పశ్చ + అసౌ వాతః = అల్పవాతః ఇత్యాదులు.

(2) విశేష్య పూర్వపదము. ఉ:- వ్యంసకాశ్చ + తేమయూరాశ్చ = మయూరవ్యంసకాః. 2. ఖసూచిశ్చాసౌ + వైయ్యాకరణశ్చ = వైయ్యాకరణఖసూచిః. ఇందుపమానములరుదుగనుండును.

(3) విశేషణోభయపద. ఉ:- స్నాతాశ్చ + తే అనులిప్తాశ్చ = స్నాతానులిప్తాః. 2. మృదు + మధురము = మృదుమధురము.

(4) సంభావనా పూర్వపద. ఉ:- వింధ్య + ఇతిపర్వతః = వింధ్యపర్వతః 2. తమాల + ఇతివృక్షః = తమాలవృక్షః. 3. కర్నూలు + అనుపట్ట ణము = కర్నూలు పట్టణము. ఇత్యాదులు.

(5) అవధారణాపూర్వపద లేక రూపకసమాసము. ఉ:- కవిరేవ సాగరః = కవిసాగరః. క్రోధమను + అగ్ని = క్రోధాగ్ని.

(6) ఉపమాన పూర్వపద. ఉ:- రతిరివ + సుందరీ = రతిసుందరీ. 2. మేఘమువలె + శ్యాముడు = మేఘశ్యాముడు.

(7) ఉపమానోత్తరపద. ఉ:- పురుషోవ్యాఘ్ర + ఇవ = పురుష వ్యాఘ్రః. 2. తేనెవలె + మాటలు = మాటతేనెలు.

(8) మధ్యమపదలోపి సమాసము లేక లుప్తమధ్యమ కర్మధారయ భేద మైనది. ఉ:- ఛాయాప్రధానమగు తరువు = ఛాయాతరువు. ఇందు ప్రధానపదములు లుప్తమైనది. అనగా ఛాయాప్రధానమైన తరువు అని చెప్ప

టకు బదులు ఛాయాతరువనుటతో "ప్రధానమైన" అనెడిపదము మధ్య నుండదగినది లోపించినదని అర్థము. 2. పప్పు + రాముడు = పప్పు రాముడు. ఇందు "తినునట్టి" పదము లేనందున మధ్యమలోపి యన బడును.

(3) 1. ఏకవద్భావి. 2. అనేకవద్భావి యనుచు ద్విగుసమాసము ద్వివిధము:

(1) పంచానాంవటానాం సమాహారః పంచవటీ. త్రయాణాంలోకానాంసమాహారః త్రిలోకీ. ఇందు సంఖ్యాపదము మొదట గలదు గాన ఏకవద్భావి ద్విగు.

(2) అష్టసుకపాలేషు సంస్కృతః పురోడాశో = అష్టాకపాలః.

2. షణ్ణాంమాతౄణామపత్యం పుమాన్ = షాణ్మాతురః

3. మూడు + జగములు = ముజ్జగములు ఇత్యాదులు.

(4) ఉభయ పదములు ప్రధానమైనది ద్వంద్వము.

1. ద్విపద. 2. బహుపద. 3. ఇతరేతర, 4. సమాహార భేదములచే ద్వంద్వ సమాసము చతుర్విధము.

(1) ద్విపదము:- ఉ:- రామశ్చ + కృష్ణశ్చ = రామకృష్ణౌ 2. కంసశ్చ + రావణశ్చ = కంసరావణౌ, కూర + కాయలు = కూరగాయలు.

(2) బహుపదము:- ఉ:- ధర్మశ్చ + అర్థశ్చ + కామశ్చ + మోక్షశ్చ = ధర్మార్థకామమోక్షాః, 2. రాముడు + లక్ష్మణుడు + భరతుడు + శత్రుఘ్నుడు = రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు.

(3) ద్విపద సమాహారము:- ఉ:- శీతంచ + ఉష్ణంచ తయోస్సమాహారం = శీతోష్ణం 2. సుఖంచ + దుఃఖంచ తయోస్సమాహారః = సుఖదుఃఖమిత్యాదులు.

(4) బహుపద సమాహారం:- ఉ:- ఢక్కాచ + మృదంగశ్చ + పటహాశ్చ తేషాంసమాహారో = ఢక్కా మృదంగపటహం.

(5) వాక్యమునందన్య పదార్థమే ప్రధానమైనది బహువ్రీహి సమాసము. ఇది యారు విధములుండును.

1. ద్విపద బహువ్రీహి 2. బహుపద 3. సంఖ్యోభయ 4. సంఖ్యోత్తర పద 5. సహపూర్వ 6. దిగంతరాళము.

(1) ద్విపద.— ఉ:— శ్రీమత్ + పీతాంబరంయస్యసః శ్రీమత్పీతాంబరో హరిః ఇందన్య పదార్థమైనది హరి శబ్దము ప్రధానము. శ్రీమత్పీతాంబర మెవ్వరికిగలదో వాడే శ్రీహరి యగును.

(2) బహుపద:- ఉ:- ముక్కంటి. ఇందు మూడు + కన్నులు యెవ్వరికి గలవో వాడు ముక్కంటి యను శివుడు ప్రధానార్థము.

(3) సంఖ్యోభయ:— ఉ:- ద్విత్రాః=ద్వౌవా + త్రయోవాః యెవ్వరో వారు ద్విత్రాః (జనులన్యపదము) 2. పంచషాః ఇందు పంచవా, షడ్వా= పంచషాః (ఏవియోయవి) గుర్తునకై కలవి, కలవాడనుట బహువ్రీహి. అన్యపదార్థము ముఖ్యమైనదని యర్థము.

(4) సంఖ్యోత్తర:- ఉ:- రుద్రులెందరను ప్రశ్నకుత్తరముగా ఉపైకాదశ యనుచు జెప్పు సమాసమునందుత్తరపదమైన సంఖ్య ఉపైకాదశ (పదునొకండు దాదాపగు) వారెవరో వారు రుద్రులు (అన్యపదార్థమైన రుద్రుల పదము ముఖ్యము)

(5 సహపూర్వ.- ఉ- సకలాః=కలాభిస్సహవర్తంత ఇతి సకలాః ఇచ్చట కళలతోగూడినవారెవరో వారు.

(6) దిగంతరాళ:- ఉ:- ఉత్తరపూర్వా ఇందు ఉత్తరస్యాశ్చ + పూర్వస్యాశ్చ దిగంతరాళం, యత్తదుత్తరపూర్వాః పది పూర్వదిశకు నుత్తర దిశకు మధ్యనుండునో యది ఉత్తరపూర్వ యనబడును.

6. అవ్యయీభావ సమాసము రెండు విధములు. 1. అవ్యయము పూర్వమునందుగలది. 2. నామపదము పూర్వమునందుగలది.

6. (1) అవ్యయ పూర్వపదము. ఉ:- ప్రత్యహం = అహన్యహని. ఇందు "ప్రతి" అను ప్రత్యయ మవ్యయము అదే పూర్వమునందుండుటచే అవ్యయ పూర్వపదమను, అవ్యయీభావ సమాసమైనది. ఇదే విధముగ యథా, అధి, సం, ని, ఉప. ఇత్యాది ప్రత్యయము లవ్యయములనబడునవి పూర్వమందున్న యీ సమాస మవ్యయీభావము.

(2) నామపూర్వపదము. సూపప్రతి (సూపలేశః) ఇచ్చట సూపపదము నామము ప్రతి (గుర్తు) ఇది అవ్యయము, దీనికి నామము ముందుగలదు. ఇట్లే శాకలేశః ఇత్యాదులందూహించనగును.

సమాసములందు లుక్సమాసము, గతి సమాసము, నిత్యము, అసమర్థ మనునవి గలవు. మరియు వృత్తిరూప సమాసములందు 1. కృద్వృత్తి 2. తద్ధితవృత్తి 3. సనాద్యంత ధాతువృత్తి 4. ఏకశేషవృత్తి 5. సమాస వృత్తి యనునవి వృత్తిరూపసమాసములు.

## —: ధాతువులు :—

90. ధాతువులందు దశవిధభేదములు గలవు. ధాతువులనుండి క్రియ లుత్పన్నములగును.

1. భ్వాది 2. అదాది 3. జుహోత్యాది 4. దివాది 5. స్వాది 6. తుదాది 7. రుధాది 8. తనాది 9. క్ర్యాది 10. చురాదులు ధాతువుల గుర్తించుటకు వానియందుగల కాలభేదమును (భూతభవిష్యద్వర్తమానము) దెలుపు లకారాది ప్రత్యయములుండును

శ్లో॥ 123. లడ్వర్తమానే లేడ్వేదే భూతే లఙ్ లుఙ్ లిట స్తథా ।
విధ్యాశిషోస్తు లిఙ్ లోటౌ: లృఙ్లృడ్డై చ్చైవ భవిష్యతి

తా॥ వర్తమాన కాలమును దెలుపుటకు (లట్) ప్రత్యయము 2 భూతకాలమును మాత్రమే దెలుపుటకు (లఙ్, లుఙ్, లిట్టులు) ప్రత్యయములు. 3 అనద్యతన భూతకాలమును దెలుపుటకు (లఙ్) 4. అనద్యతన అపరోక్ష భూతకాలమును దెలుపుటకు (లిట్) 5. అనద్యతన భవిష్య

త్కాలమును దెలుపుటకు (లుట్) 6. భవిష్యత్కాల మాత్రమునే దెలుపుటకు (ల్రుట్) 7. హేతు, హేతుమద్భావమును దెలుపుటకు, అధికారార్థమునందును (ల్రుఙ్) 8. విధి, ప్రార్థన, ఆశీర్వాదాదులు దెలుపుటకు (లిఙ్ లోటులు) 9. వేదమునందే (లేట్) ప్రత్యయము వచ్చును.

2. రెండురాత్రు లొక పగలు జేరినకాల మద్యతనము 2. ఈకాలమునకంటెను హెచ్చుకాలమును దెలుపునది అనద్యతనము. ఇది భూత భవిష్యత్తులందు సమానార్థమగును.

91. పనులను దెలుపునవి క్రియలు. వీనియందు 1. కర్మతోగూడియుండునవి సకర్మకములు 2. కర్మలేనివి యకర్మకములు వీనియందవాంతర భేదములు 1. సమాపక 2. అసమాపకములని రెండు విధములు.

1. పూర్తియర్థమును తెలుపుక్రియ సమాపక క్రియ. ఉ:- రాముడు పుస్తకమును జదివెను.

2. అసంపూర్ణార్థము నొసంగుక్రియ అసమాపకక్రియ. ఉ:-కృష్ణుడునిద్రించి అనునప్పుడిచ్చట భావము సంపూర్తిగాలేదు.

92. సంస్కృత ధాతువులపై తెనుగున "ఇంచుక్" ఆగమమగునవి తత్సమ క్రియలు. ఉ:- వర్ణించు, శయనించు, ధరించు మొదలగునవి.

93. 1. క్రియ లుత్తమ 2. మధ్యమ 3. ప్రథమ పురుషములు గలవి. ప్రతి పురుషమునందు త్రివిధవచనములుండును. ఉదా:-

| | | | |
|---|---|---|---|
| 1. భవతి | భవతః | భవంతి | ప్రథమ పురుషము. |
| 2. భవసి | భవథః | భవథ | మధ్యమ పురుషము |
| 3. భవామి | భవావః | భవామః | ఉత్తమ పురుషము. |

94. ధాతువులు భిన్నభిన్న ప్రత్యయములతోజేరి భిన్న భిన్న రూపములగును.

(1) క్రియలు, 1. ఆత్మనేపదులు 2. పరస్మైపదులు 3. ఉభయపదులని త్రివిధములు.

(2) ఏ ధాతువులకు తిప్, తస్, ఝి, సిస్, థస్, థ, మిస్, వస్, మస్, గుర్తులుండునో నవి పరస్మైపదులు. ఉ:- భవతి, అభవత ఇత్యాదులు.

(3) ఏ ధాతువులకు త, ఆతామ్, ఝ, థాస్, ఆథామ్, ధ్వమ్, ఇట్, మహి, మహిఙ్‌లు లకారాదేశముగలవి ఆత్మనేపదులు. ఉ:- ఏధతే.

(4) ఏ ధాతువులకు ద్వివిధాదేశంబులు గలవో అవి యుభయపదులు. ఉ:- రాజతి, రరాజ ఇత్యాదులు.

95. క్రియలు మరల షడ్విధ భేదములుగలవి. 1. కారకములు. 2. కరణార్థములు 3. తుల్యార్థములు 4. సహార్థములు 5. హేత్వర్థములు 6. నిర్ధారణార్థములు వానికి గుర్తులుండును.

(1) క్రియతో సంబంధ మొందిన విభక్తిని కారకమందురు. అనగా 1 కర్తృ 2. కర్మ, 3. కరణ, 4. సంప్రదాన, 5. అపాదాన, 6. సంబంధ, 7. అధికరణములనునవి కారకములు వీనినే తెనుగున విభక్తులని వ్యవహరింతురు. అనగా 1. కర్తృకారకములు 2. సంప్రదాన కారకములు 3 అపాదాన కారకములు 4. కరణకారకములు 5. కర్మకారకములు 6 అధికరణక కారకములని షడ్విధములు ఉ.- రాముడు కృష్ణునికొరకు మైత్రిని బట్టి కత్తితో పండుగోసి పళ్లెరమునందుంచి యిచ్చెను. ఈ సమాసమున పైయారువిధములగు కారకములు క్రియతో సంబంధించినవి చూపబడినవి. రాముడు కర్తృకారకము, కృష్ణునికొరకు సంప్రదాన కారకము మైత్రిని బట్టి (అపాదానము) కత్తితో కరణకారకను పండును కర్మకారకము పళ్లెరమునందు అధికరణక కారకము ఇట్లే ఇతరములూహింపదగినవి.

2. కరణార్థకారక చిహ్నములు. చేత, చే, తోడ, తో వర్ణకములు.

3. తుల్యార్థమునుదెల్పు క్రియల గుర్తు తోడ వర్ణకము.

4. సహార్థమునందు తోడవర్ణకము కూడియుండర్థమును దెలుపును.

5. అపాదానాద్యర్థబోధక ప్రత్యయములు, వలన, పట్టి.

6. నిర్ధారణార్థము దెలుపునవి (సామాన్య ధర్మములనుండి విశేషములను వేరు జేయునవి) అందు, లోపల. పైన సంగ్రహముగ వ్యాకరణశాస్త్రము

చర్చింపబడినది. శబ్దశాస్త్ర విజ్ఞానమాత్రమున వాఙ్మయ బ్రహ్మ, (శబ్ద బ్రహ్మ) వాచ్యార్థముచే శబలిత బ్రహ్మ తెలియబడును. కాని ఇట్టి సాధన జ్ఞానమున ఆత్మ (పరబ్రహ్మ) తెలియబడదు.

శ్లో॥ 124. నశబ్దశాస్త్రాభి రతస్యమోక్షో నచైవరమ్యావసథః ప్రియస్య।
నభోజనాచ్ఛాదన తత్పరస్య నలోకచిత్త గ్రహణేరతస్య।
ఏకాంతశీలస్య దృఢవ్రతస్య మోక్షోభవేత్ప్రీతి నివర్తకస్య।
అధ్యాత్మయోగే నిరతస్యసమ్యఙ్మోక్షోభవేన్నిత్య మహింసకస్య

96. తా॥ శాబ్దికజ్ఞానపరులకును, రమ్యములైన గృహభార్యాదులందు ప్రేమ గలవారికిని, అన్నపానాదులందే తత్పరులగు వారికిని, పరోపకారాదిలోక సంగ్రహచిత్తులకును, మోక్షము (ఆత్మాపరోక్ష సాక్షాత్కారము) గలుగదు. ఎవరు ఏకాంతశీల దృఢవ్రతులో, సర్వభూతమైత్రిగలవారో, వారిలోను, ఎవరధ్యాత్మజ్ఞాన నిరతులో ఎల్లప్పుడు అహింసానిరతులో వారికే మోక్షము (ఆత్యంతికమైనది) లభించును. ఆత్మహేయోపాధేయ రహితుడగుటచే విదితావిదితముల కన్యుడుగావున శబ్దార్థజ్ఞానమున నతడు తెలియబడడు.

శ్లో॥ 125. సర్వార్థానాం వ్యాకరణాద్వైయ్యాకరణ ఉచ్యతే।
తన్మూలతో వ్యాకరణం వ్యాకరోతీతి తత్తథా స. జా. అ. 2. శ్లో. 49.

తా॥ సర్వప్రకారములగు నర్థములను (పదార్థములను) అనగా నామరూపాత్మకమైన సమస్త ప్రపంచమును వివిధముగ వేరుపరచుటతో వైయ్యాకరణులనబడుదురు. కాని కేవల ప్రపంచైకదేశీయమైన శబ్దార్థములనే వేరుపరచి వారు వివిధార్థములు జెప్పినంతనే వైయ్యాకరణులు కాజాలరు. ఆత్మ (పరబ్రహ్మ) వలననే నామరూపాత్మక సకలప్రపంచము వేరుపరుచబడుటతో (వ్యాకరించుటతో) పరమాత్మయే వైయ్యాకరణ మూర్ధన్యుడు.

శ్రుతి॥ ౪౬. "అనేనజీవేనాత్మను ప్రవిశ్యనామరూపే వ్యాకరవాణి"

తా॥ యను శ్రుతిప్రామాణ్యమున పరబ్రహ్మకే సాక్షాద్వ్యాకరణత్వముగలదు. కాని ఈ శబ్దశాస్త్రజ్ఞుడు ఆత్మజ్ఞానికూడ నగుచో పరబ్రహ్మనే వ్యాకరించుటతో (నామరూప ప్రపంచమునుండి ఆత్మను వేరు పరచుటతో) అతనిని లక్షణయా వైయ్యాకరణియందురు. సమస్త లౌకిక వైదిక శబ్దార్థములను వేరు వేరు పరచి యర్థనిర్ణయము జేయుట కుపయుక్తమగుటచే నీ శాస్త్రమునకు వ్యాకరణమను నామము, దానిని పఠించిన వారికి వైయ్యాకరణులను నామములు రూపములగుచున్నవి.

వ్యాకరణ శాస్త్రవిచారము సమాప్తము.

# 3. నిరుక్తము

97. వేదమంత్రములకు, ఆకాంక్షద్వారా అర్థనిర్ణయము జేయుట నిరుక్తము. వ్యాకరణశాస్త్రముచే శబ్దార్థమేర్పడినను వాక్యాన్వయము గాజాలదు. తాత్పర్య నిర్ణయమున కుపకరించు ఆకాంక్షకు నిరుక్తి శాస్త్రమావశ్యకము. ఆకాంక్షరహితమైనయెడల వాక్యమునందలి పదములకు పరస్పరాన్వయముండజాలదు. కావుననే ఆకాంక్షను దెలుపు నిరుక్తము వేదాంగముగ పరిగణింపబడినది. యాస్కమునిచే నిరుక్తశాస్త్రము జెప్పబడినది.

సూత్రం. "సమామ్నాయ స్సమామ్నాతః" ఇత్యాది సూత్రములతో నిరుక్తము పది అధ్యాయములందు జెప్పబడినది. వానిలో (1) నామ 2. ఆఖ్యాత 3. నిపాత 4. ఉపసర్గములను నాల్గు భేదములు. ఆకాంక్షచే అర్థనిర్ణయమైననే వైదికమంత్రానుష్ఠానము సంభవమగును. అన్యథానుష్ఠాన మసంభవము. ఉదాహరణ:- "సృణ్యేవజర్భరీతుర్ఫరీతూణః" యనువాక్యమునందు ఆకాంక్షరహితమైనందున అర్థనిర్ణయము గాజాలదు. అట్లే వేదముల కాకాంక్ష లేనిదే యర్థనిర్ణయము లేకుండిన అనుష్ఠాన మసంభవమగును.

వేదమంత్రములందలి ద్రవ్యదేవతాది పదార్థముల పర్యాయనామములను దెలుపు నిఘంటువులు నిరుక్తమునందంతర్భూతములు. యాస్కునిచే నిఘంటువు రచించబడినది. అమర హేమాద్ర్యాదుల నిఘంటువులు లౌకిక పదార్థముల మాత్రమే బోధించును. ఇప్పటికాలమందన్ని దేశీయభాష లందు నిఘంటువులుగలవు. అవియన్నియు లౌకిక పదార్థ విజ్ఞానమునే గలిగించును. కాని నిరుక్త మాకాంక్షద్వారా పదములకు పరస్పరా న్వయమును దెలిపి వాక్యార్థనిర్ణయమును జేయును.

2. జిజ్ఞాసను ఆకాంక్షయందురు. ఎంతవరకు జిజ్ఞాసయుండునో అంత వరకాకాంక్షయుండి తీరును. వాక్యమునందు కర్తగాని, కర్మగాని, క్రియ గాని, వాని విశేషణములుగాని దెలియబడకున్న యవి దెలియుటకు 'కిం' శబ్దముచే జిజ్ఞాస జేయుటను ఆకాంక్షయందురు. ఉదాహరణము:- "అయోధ్యానగరమునకు వచ్చెను" ఈ వాక్యమునందు కర్త వినబడనందున ఎవరు వచ్చెననుచు యాకాంక్ష జేయగ, రాముడు అనుకర్త దెలియబడుటచే తత్సంబంధాకాంక్ష సమాప్తమగును. రాముడు జంపెనను వాక్యము నందట్లే ఎవరిని జంపెననుచు కర్మ జిజ్ఞాస జేయగ రావణుని జంపెనని దెలియుటతో నర్థనిర్ణయము సుకరము. ఇట్లే ఇతరములందాకాంక్ష జేయ నగును.

ఇది నిరుక్త శాస్త్రవిచార సంగ్రహము.

# 4. ఛందస్సు

98. (1) ఛందోవిజ్ఞాన విశిష్టమగు వైదిక కర్మానుష్ఠానము ప్రశస్తతమము. కాన ఛందశ్శాస్త్రావసర మేర్పడినది. ఛందశ్శబ్దమున కాహ్లాదాచ్ఛాద నార్థములు రెండును గలవు.

(2) దేవతలు మృత్యుభయముచే ఛందస్సులందు అనగా వానిచే బోధింప బడిన కర్మలందు దాగిరని ఛాందోగ్యము పేర్కొనినది. మృత్యువు దేవతల

యునికని గ్రహించుటచే వారు మృత్యుభీతులై ప్రణవమున దాగిరనియు అందే చెప్పబడినది. పైరెంటిలో వేదమంత్రములకు ఛందస్సులను పేరు ఆచ్ఛాదనార్థమును పురస్కరించుకొని వచ్చినది.

శ్లో॥ 126. ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయం।
ఛందాంసియస్యపర్ణాని యస్తంవేద సవేదవిత్ గీత. అ. 15. శ్లో. 1,

తా॥ కనుపించు సంసారమే వృక్షమువంటిది. ప్రాకృతవృక్షమునకు మూలము క్రింద (భూమియందును) శాఖలు పైనను ఉండును. కాని సంసార వృక్షమునకు వేళ్ళుపైనను శాఖలు క్రిందనుగలవు. సంసారవృక్షము (ఊర్ధ్వ) పరబ్రహ్మయే మూలముగగలది ఊర్ధ్వమనగా కాల, కారణముచే నిత్య ముగ. మహత్త్వముగలది. సంసారవృక్షమునకు రాగాదులే పర్ణములు. ఆద్యములగు మూలప్రకృత్యాదుల తరువాత పుట్టినందున నివి యర్వా చీనములు. ఈ శాఖలధోముఖములు. అశ్వత్థమనగా క్షణభంగురము. కాన దీనికి సాధారణ అశ్వత్థవృక్షముతో నామసామ్యమేగాని అర్థ సామ్యములేదు. సంసారవృక్షము అనాద్యనంత కాలమువఱకుండుటచే దీని కవ్యయమను పేరు కలదు. ప్రాకృత వృక్షమునకుగల పర్ణములెట్లు వృక్షమును రక్షించునో అట్లే సంసారవృక్షమును ఛందస్సులు (ఋగాది మంత్రములు) రక్షించును. అనగా సంసారులకు ధర్మాధర్మములనుబోధించి వారు జేయు కర్మలకు ఫలములనుజెప్పి రక్షించుటతో వేదములు పర్ణము లుగ రూపింపబడినవి. ఎవరిట్టి సంసారవృక్షమును సమూలముగ దెలిసి కొందురో వారే వేదవిదులనబడుదురు. కర్మానుష్ఠాన విధానము ఛందస్సు విధించుటతో ఛందశ్శాస్త్రము వేదాంగముగ పరిగణింపబడినది. భగ వంతుడైన పింగళనాగుడు ఛందశ్శాస్త్రమును జెప్పెను. అందెనిమిది అధ్యాయములు కలవు. "ధీం,శ్రీం,స్త్రీం" అను ప్రథమాధ్యాయమునుండి ఐదధ్యాయములవఱకు వైదిక ఛందస్సులు పూర్తిజేయబడినవి. తక్కిన మూడధ్యాయములందు లౌకిక ఛందస్సులు జెప్పబడినవి."అథ లౌకిక" మనుచు ఆరవయధ్యాయము మారంభమగుచున్నందున తుది మూడధ్యాయ ములు లౌకిక ఛందోబోధకములు. వైదిక ఛందస్సులందు సప్తఛందస్సులు

ప్రధానమైనవి. ప్రాజాపత్యాదులైదును కలసి పంద్రెండు ఛందస్సులగును. 1. గాయత్రి 2. ఉష్ణిక్ 3. అనుష్టుబ్ 4. బృహతీ 5. పఙ్క్తి 6. త్రిష్టుబ్ 7. జగతీ ప్రధాన ఛందస్సులేడే. లౌకిక ఛందస్సులు పురాణేతిహాసము లందుపయుక్తములు. ప్రతివేదమునకు ఛందస్సులుగలవు. ఉదాహరణ యజుర్వేదశాఖ ఛందస్సులివి:- 1. ఏకాక్షరాదైవీ గాయత్రి 2. ద్వ్యక్షరా దైవ్యుష్ణిక్ 3. త్ర్యక్షరాః దైవ్యనష్టుబ్ 4. చతురక్షరాః దైవీబృహతీ 5. పంచాక్షరాః దైవీపంక్తిః. 6. షడక్షరాః దైవీత్రిష్టుబ్. యాజుషీవా గాయత్రీ 7. సప్తాక్షరాః దైవీజగతీ, యాజుషీవోష్ణిక్ 8. అష్టాక్షరాః ప్రాజాపత్యాగాయత్రీ యాజుషీవానష్టుబ్ 9 -వాక్షరాః యాజుషీబృహతీ, ఆసురీవాజగతీ 10 దశాక్షరాః యాజుషీపంక్తిః, ఆసురీ వాత్రిష్టుబ్ 11. ఏకాదశాక్షరాః యాజుషీత్రిష్టుప్. ఆసురీవాపంక్తిః 12. ద్వాదశాక్షరాః యాజుషీ జగతీ, ప్రాజాపత్యావోష్ణిక్, ఆసురీవా బృహతీ, సామ్నాంవా గాయత్రీ, ఇత్యాదులు యథాశాస్త్రములు.

99. ఛందస్సులందు గాయత్రి ప్రధానమైనది. ఇందుకు గాయత్రీ ఛందసామహం అను గీతాశాస్త్రము ప్రమాణము గాయత్రీ ప్రాముఖ్యతను దెలుపుకథ ఛాందోగ్యోపనిషత్తునందు కలదు దేవతలొక సమయమునందు సోమవల్లి (సోమతీగె) దెచ్చుటకు 1. గాయత్రి 2. త్రిష్టుబ్ 3. జగతియను మూడు ఛందస్సులను పంపిరి అం మర్ధతచే సోమతీగెను దేలేక త్రిష్టుబ్జగతీ ఛందస్సులు మార్గమధ్యమునుండియే మరలివచ్చినవి. కాని కేవలమొక గాయత్రీ ఛందస్సు సోమవల్లిదగ్గరజేరి యచ్చటి రక్షకుల నోడించి సోమతీగె దేవతలకు దెచ్చి యివ్వగలిగినది. ఈకథ ఐతరేయ బ్రాహ్మణమందు గలదు. "సోమోవై రాజాఽముష్మిన్లోకే ఆసీత్" యను మంత్రమారంభించి యీ కథదెలుపబడినది. త్రిష్టుబ్ జగతీ ఛందస్సులు సోమతీగె దెచ్చుటకు వెళ్ళి మార్గమునందు డస్సి సోమతీగెను దేలేక మరలు నప్పుడు మార్గములోనే తమ యక్షరములను మరచి విడిచిపెట్టివచ్చినవి. అప్పుడు జగతి తన మూడక్షరములను త్రిష్టుబ్ తన యొక అక్షరమును విడిచినది. మార్గమునందున్న యీ యక్షరములను గాయత్రి తాను సోమ

తీగెను దెచ్చునప్పుడు తీసికొనివచ్చి వానివానికిచ్చి పూర్తి జేసినది. (ఛాందోగ్యభాష్య వ్యాఖ్యానం పేజీ 270)

100. (1) గాయత్రి ఛందస్సునందారక్షరములు ప్రతిపాదమందు గలవు. అవి ఇతర ఛందస్సులందు వ్యాప్తములు. ప్రాతస్సవనము గాయత్రీ ఛందస్సు మాధ్యందినసవనమగు త్రిష్టుబ్‌నందు, సాయంసవనమైన జగతీ ఛందస్సునందు వ్యాపకమగుటచే ఛందస్సు లన్నింటిలో గాయత్రి ప్రధాన మనబడినది. సప్తకోటి మహామంత్రము లన్నింటికిని ఋషి (గురువు) ఛందస్సు, దేవతలుగలవు. మంత్రజపములందాయా మంత్రములకగు ఛందోవిశేషజ్ఞాన మావశ్యకమైనది. అట్టి ఛందోవిశేషజ్ఞానములేక చేయు జపాదులు ఫలములనివ్వజాలవు.

శ్లో॥ 127. ఋషిర్గురుత్వాచ్ఛిరసి ధ్యేయత్వాద్దేవతాహృది ।
ఛందోఽక్షరత్వాజ్జిహ్వాయాం న్యస్తవ్యం మంత్రవిత్తమైః

తా॥ ఋషిని శిరమునందును, దేవతను హృదయమునందును, ఛందస్సును జిహ్వాయందు చేర్చవలయును.

ఇది ఛందశ్శాస్త్ర విచార సంగ్రహము.

## 5. జ్యోతిషము

101. వైదికకర్మ లనుష్ఠాన యోగ్యములైనందున వానికి కాలవిజ్ఞాన సాపేక్షగలదు. దర్శాదియాగ కాలజ్ఞానము జ్యోతిశ్శాస్త్రాధ్యయనముచే దెలియబడుచున్నది కావున జ్యోతిషము వేదాంగమైనది. ఈ శాస్త్రమును సూర్యసిద్ధాంతమనియు నందురు. ఈశ్వరుడు కాలస్వరూపుడుగాన నతనికి కాలనామము సామాన్యార్థముచే నేర్పడినది. జ్యోతిశ్శాస్త్రమందు జెప్పిన కాలశబ్దము గణితమునందుపయోగింపబడుటచే దీనిని కాలవిశేషార్థ మందురు కాల స్వరూపము పరమేశ్వరుడని ఈ క్రింది శ్లోకమున దెలియ వచ్చును.

శ్లో॥ 128. వీర్యాణితస్యాఖిల దేహభాజామంతర్బహిః పూరుషకాలరూపైః ।
ప్రయచ్ఛతో మృత్యుముతామృతంచ మాయామనుష్యస్యవదస్వ విద్వాన్.
భాగ. స్క. 10. అ. 1. శ్లో. 7.

తా॥ పరీక్షిద్రాజు శుకమహర్షి నడుగుచున్నాడు బ్రహ్మర్షీ ! సమస్త దేహధారులందంతర్బహిస్సులందు క్రమముగ పురుషరూపము కాల రూపములతోనుండి వారికి తమతమ కర్మానుగుణ్యముగ మృత్యువును గాని (జనన మరణరూప సంసారమునేగాని) అమృతమునుగాని (మోక్ష మునుగాని) ఇచ్చునట్టి మాయామనుష్య దేహధారియొక్క (పరమేశ్వరుని యొక్క) పరాక్రమముల దెలుపుము.

102. గణితమునకుపయోగించు కాలమునందు నిమేషాదిపరాంతములైన కాలభేదములున్నవి. ఇవి:- నిమిషము, కళ, కాష్ఠము, ముహూర్తము, యామము, దినము, వారము, పక్షములు, మాసములు, ఋతువులు, అయనములు, సంవత్సరము, యుగము, మహాయుగము. మన్వంతరము, పరార్ధము, పరాంతములు కాలమానములందురు. భారతీయుల సంవత్సర పరిగణనమునందు చాంద్ర, నాక్షత్ర, సౌర, సావనము. ఈనాలుగే సంవత్సర భేదములని నొకపండితుడు పత్రికలో ప్రకటించెను. కాని యదే సప్రమాణ మనుటకు వీలులేదు. ఋగ్సగ్ంహితందు. 1. ఇద్వత్సర 2. సంవత్సర 3. పరి వత్సర 4. ఇడావత్సర 5. వత్సరను లైదుసంవత్సరములని చెప్పబడినది. జ్యోతిశ్శాస్త్రాంగాధ్యయనముగ స్వాధ్యాయ బ్రాహ్మణము చెప్పునప్పుడు "పంచసంవత్సరమయం'' యనిఅధ్యయనము జేయబడుచున్నది. భాగవతము నందు "వచనము" "అథచయావన్న భోమండలం సహద్యావాపృథి వ్యోర్మండలాభ్యాంకార్త్స్న్యేన సహాభుంజీత తంకాలం 1. సంవత్సరం 2. పరి వత్సరం 3. ఇడావత్సరం 4. అనువత్సరం 5. వత్సరమితి భానోర్మాంద్య శైఘ్ర్యసమగతిభిః సమామనంతి" భాగ. స్క. 5. అ. 23. వ. 7. గలదు. స్పష్టముగ నైదు విధములైన సంవత్సరములు జెప్పబడినవిగాన పండితులీ విషయమున పరిశీలింతురు. భారతదేశమునందు కాలమాన విభాగము

స్థిర చిహ్నములైన పర్వతములతో జేయబడినది. హిమాచల దక్షిణము నుండి వింధ్యపర్వతోత్తరమందు నక్షత్రమానము (బార్హస్పత్యమానము) గలదు. వింధ్యపర్వత దక్షిణమునుండి శేషాచల పర్వతమునకుత్తరము వరకు చాంద్రమానము (ఇడావత్సరము) వ్యవహారమందుగలదు. శేషాచలమునకు దక్షిణమునందే సౌరమానముగలదు. సూర్యుని సంచారము త్రిలోకములందగుటతో తక్కిన రెండు మానములు (దేవపితృమానములు పై లోకములందు గలవనవచ్చును. వేరొకపక్షమునందు మానములు 1. మానవ 2. పితృ 3. దేవ 4. ప్రాజాపత్య 5. బ్రాహ్మ్యభేదములచే చెప్పనైనది. వీనిలో గల మానవమానమునందే నాక్షత్ర, చాంద్ర, సౌరమానము లంతర్భూతములు. తక్కినవి పైలోకములందలివి.

103. చంద్రుడిరువదేడు నక్షత్రములను భుక్తి జేయుటకు (తిరిగివచ్చుటకు) దినక్రమముగ నొక్కొక నక్షత్రభుక్తిచే నిరువదేడు దినములు బట్టును. పండ్రెండు మాసములు భుక్తియగుటకు 324 దినములు (సంవత్సరము) పట్టునది నక్షత్రమానము. శుక్ల కృష్ణపక్ష ప్రతి పదలనుండి పూర్ణిమామావాస్య లందు చంద్రసంచారము ప్రతిదినమగుటతో సంవత్సరమునందు 354 దినము లగుచున్నవి. ఇది చాంద్రమానమగును. సూర్యసంచారము దినక్రమముగ మేషాదిరాసులందు ప్రతినెల కొకరాశి భుక్తితో సంవత్సరమునందు 364 దినములేగాని 365 దినములేగాని జరుగుచున్నవి. దీనినే ఇంగ్లీషువారు కామన్ (Common year=364 దినములది) లీపియర్ (Leep year =365 దినములది) అందురు దీనిని సౌరవత్సరమని జెప్పవచ్చును, సావన సంవత్సరమునందు 360 దినములుండును. ఇదే దేవమాన గణనకుపయోగము. దీనిని సమకాల సంవత్సరమందురు. దినములు సూర్యగతిచే నేర్పడునందున సూర్యోదయమునుండి నిమేషాదులతోనగు ముహూర్త మొక్కంటికి $2\frac{1}{2}$ రెండున్నర ఘడియలు (ఒకగంట) కాలమగును. దిన రాత్రములందుగలసి (60) ఘడియలు 24 (ఘంటలు) కాలమగును. సూర్యోదయమునకే హోరయుండునో ఆయధిపతి నామముతో నాదినము వ్యవహారింపబడుచున్నది. దినమునందిరువదినాల్గు హోరలుగడచును.

శ్లో॥ 129. అర్కశ్శుక్రబుధశ్చంద్రః మందోజీవ కుజాఃపునః।
సార్ధద్విఘటికాహోరా ఇత్యేతద్ధోర లక్షణం॥

తా॥ 1. సూర్యుడు 2. శుక్రుడు 3. బుధుడు 4. చంద్రుడు 5. శని 6. గురుపు 7. కుజుడు వీరిలో క్రమముగ నాల్గవ గ్రహయోగహోర యందు సూర్యోదయమైనచో నాగ్రహమాహోరాధిపతిదగును. హోరాధిపతి నామమే దిననామమనిరి. ఇట్లు $2\frac{1}{2}$ రెండున్నర ఘడియలకొక హోరకాలము జరుగుచున్నది.

104. ఇప్పుడు జరుగుచున్న సృష్ట్యారంభ దినమున నాల్గవ హోరాధిపతి యోగము సూర్యునకు గలుగుటతో ఆదిన మాదివారమనబడినది. మరునాటి సూర్యోదయహోర (నాల్గవహోర) కాధిపత్యము చంద్రునకు గల్గుటతో (శ్లోకమందున్న క్రమముగ సూర్యునినుండి చంద్రుడు నాల్గవ గ్రహము) ఆ దినము సోమవారమైనది. ఆ మరునాడుదయహోర యోగము చంద్రునినుండి నాల్గవవాడైన మంగళునికి ఆధిపత్యముండగా యాదినము మంగళవారము. మరల కుజునినుండి నాల్గవవాడైన బుధునకు హోరాధిపత్యముండుటతో ఆ మరునాటి దినము బుధవారము. బుధునినుండి నాల్గవగ్రహమైన గురునకు హోరాధిపత్యము సూర్యోదయమునకు లభించుటచే ఆ మరునాటి దినము గురువారము, ఆ తరువాత దినమున సూర్యోదయ హోరాధిపత్య యోగముచే నాల్గవ గ్రహము గురువునుండి శుక్రుడగుటతో వాని నామమున శుక్రవారము, శుక్రునుండి నాల్గవవాడు శని యగుటతో మరునాటి సూర్యోదయహోర కధిపతిశని నామమున శని వారము ఇట్లేడు వారనామములు (దిననామములు) శ్లోక క్రమమున గలిగినవి. ఏడు గ్రహము లేడుదినములందు ఒక పర్యాయము తిరుగుట పూర్తి యగుటతోడ నదే వారమనబడియె. మరల నిదేక్రమముగ హోరాధిపతుల నామములతో దిననామములగుచున్నవి. పర్యాయముగ 'వార' హోరాధిపతులైన గ్రహనామములు వరుసక్రమముతో యేర్పడుటచే వార నామములు గలిగినవి.

శ్లో॥ 130. ఆదిత్యాయ చ సోమాయమంగళాయ బుధాయచ ।
గురు శుక్ర శని భ్యశ్చరాహ వే కేత వేనమః ॥

తా॥ ఈ శ్లోకమున జెప్పినట్లు గ్రహనామ క్రమమును వార నామములు గలిగినవి. కావున శ్లోకమునందు వారనామక్రమమును దెలుపుటకు గ్రహములనామ క్రమము దెలుపనైనది. రాహుకేతువులు గ్రహము లగుటచే శ్లోకమునందు పాదపూర్తికిగాను వారి నామగ్రహణ జేయబడి నదేగాని వారు ఛాయాగ్రహములగుటతో వారికి హోరాధిపత్యములేనం దున వారినామముతో వారనామములు జెప్పబడుటలేదు. పై విధ ముగ మాయామయమైన యీ సంసారసృష్టి యనాద్యనంత కాలము వరకు జరుగుచుండును. (ఆభూతసంప్లవము వరకు జరుగును) తిథినామ ములు చంద్రసంచారముచే గలిగినవి. (చంద్రకళలవృద్ధి హ్రాసక్రమ ముగ తిథులేర్పడినవి). సృష్ట్యారంభ దినమునందు చంద్రదర్శనము సూక్ష్మమైనందున ప్రతిపదనాడు గనుపించదు. గతదినము (అదర్శనకళ =అమావాస్య) యైనందున మరునాటిదినము ప్రతిపదయనబడినది. ఆ మరునాడొక కళ హెచ్చుగ రెండుకళలగుటతో ద్వితీయ ఇట్లే దినక్రమ మున చంద్రకళ హెచ్చగుచుండగ తృతీయాది నామములు తిథులకు జెప్ప బడినవి. పదిహేనుదినములైన చంద్రకళలు పూర్తియగుటతో పూర్ణిమ యనబడినది. ఒక పక్షమగుటతో దానిని శుక్లపక్షమనిరి. పూర్ణిమ (పౌర్ణమి) మరునాటినుంచి దినక్రమమున చంద్రకళల హ్రాసము (తగ్గింపు =దిగు) చుండగ పూర్వతిథులనామములు అవే ప్రకారముగ ప్రతిపదేత్యా దులు జెప్పబడినవి. కళలు పూర్తిగ హ్రాసమై చంద్రాదర్శనమైన యీనాడమావాస్యయని తిథినామము. పక్షమునకు కృష్ణపక్షనామము గలిగి నది. ఇట్లు రెండు వారములకొక పక్షము రెండు పక్షములకొక మాస మేర్పడినది. సమకాలమున మాసమందు 30 (ముప్పది) దినములుండును. చంద్రుడేనక్షత్రమునందుగాని యీనక్షత్ర సమీపమునందేగాని పూర్ణిమనా డుండునో యీ నక్షత్రనామమే మాసనామమగును. సృష్ట్యారంభ కాలము నందాది మాసమున చంద్రుడు చిత్తానక్షత్రమునందు పౌర్ణిమ

నాడుండుటచే ఆమాసనామము చైత్రమనబడినది, ఆ యనంతరమాసాదు లందు పౌర్ణిమనాడు చంద్రుడుతప్పని క్రమముగ విశాఖ, జ్యేష్ఠ, ఆషాఢ, (పూర్వోత్తరాషాఢ) శ్రవణ, భాద్రపద (పూర్వోత్తర), అశ్విని, కృత్తిక, మృగశిర, పుష్యమి, మఘ, ఫల్గుని (పూర్వోత్తర) చెప్పిన నక్షత్రాదు లందేగాని వాని సమీపమునందుగాని యుండినందున చైత్రమాసానంతర మాసనామములు క్రమముగ 2. వైశాఖము 3. జ్యేష్ఠము 4. ఆషాఢము 5. శ్రావణము 6. భాద్రపదము 7. ఆశ్వయుజము 8. కార్తీకము 9. మార్గశిరము 10. పుష్యము 11. మాఘము 12. ఫాల్గుణము అనాద్యంతకాలము వరకునుండు సంసారమునందు మాసనామములిట్లే చెప్పుచుందురు. కావున నొక సంవత్సరాంతమైనపిదప మరలమాసము లివియే చెప్పుచుందురు.

105. రెండుమాసములకొకఋతువు. ఋతువులనామములు అయాకాలాను గుణ్యములైనవి గలిగినవి, సృష్ట్యారంభ కాలమున మాసనామము చైత్ర మగుటతో చైత్రవైశాఖములురెండు గలసి నొక వసంతఋతువు. తరువాత క్రమముగ వచ్చునవి 2. గ్రీష్మ 3. వర్ష 4. శరత్ 5. హిమవంతను 6. శిశరము లారుఋతువులు. మూడు ఋతువులైన లేక ఆరు మాసములైననొక అయనము. ఇది సూర్యగతిచే నేర్పడినది. సూర్యుడు ఒకొక రాశిని జేరుటకు నొక మాసకాలముబట్టును. దక్షిణదియందున్న మకర రాశిని జేరిన ఆనాడు ఉత్తరాయణ ప్రవేశమందురు. ఆనాటినుండి సూర్యుదుత్తర దిశయందున్న కర్కటరాశిని జేరుటకు నెలకొక రాశి క్రమముగ పయనముజేయుచు ఆరునెలలకు కర్కట రాశిని జేరును. సూర్యుడు కర్కటరాశియందు బ్రవేశించననాడు దక్షిణాయనము. అనగా కర్కటరాశినుంచి యానాడు మరల దక్షిణదిశయందున్న మకరరాశిని జేరుటకుపయనించునని అర్థము. ఇట్లారు నెలలకు మరల దక్షిణదిశయందు గమనించుచు క్రమముగ మధ్యనున్నవానిని రాశికొక నెలచొప్పున నతిక్రిమించి మకరరాశిని చేరబోవును. ఉత్తర దక్షిణాయనములు గలసిన దొకసంత్సరమది మనుష్యమానమున 360 దినములైన దేవతలకొకదినము

దేవతలకుత్తరాయణమేపగలు, దక్షిణాయనమే రాత్రి, ఇదేవిధమున మనుష్యమానమగు నొకనెల (30 దినములది) పితృదేవతలకొక దినము పితృలకు కృష్ణపక్షాంతమైన అమావాస్య పగలు, శుక్లపక్షాంతమైన పౌర్ణిమ రాత్రి. కావుననే అమావాస్యనాడు పితృలను గురించి ధర్మశ్రార్ధ మొనర్చుటకు జెప్పనైనది.

106. రెండయనములుగాని, పండ్రెండుమాసములుగాని పూర్తియగు నప్పుడు సంవత్సరమనబడును. సంవత్సరనామములు వ్యవహారార్థమేర్ప అచనైనవి. అవి ప్రభవాదిషష్టి సంవత్సరములు. నూరు సంవత్సరము లైన కాలపరిమితి మనుష్యులకాయువు ప్రమాణముగ చెప్పబడినది, ఇదే విధమున బ్రహ్మాదిస్తంబ పర్యంతమైన ప్రాణులకు వాని వానికగుమానము లతో నూరేండ్లాయువు చెప్పబడినది. కొన్ని సంవత్సరములు జేరిన దొక యుగ మనబడును. 1. కృత, 2. త్రేత, 3. ద్వాపర, 4. కలి యని యుగ నామములు నాలుగు. నాలుగు యుగములు గలసిన దొకమహా యుగమగును. పదివేల దివ్యసంవత్సరము లొక మహాయుగమున నీ క్రింది విధమున విభజింపబడినవి.

ఒక మహాయుగము నందలి యుగ సంవత్సర సంఖ్యలు.

| | | | | |
|---|---|---|---|---|
| (1) | కృతయుగ | పరిమాణము | 4 వేల | దివ్య సంవత్సరములు. |
| (2) | త్రేతాయుగ | ,, | 3 వేల | ,, ,, |
| (3) | ద్వాపరయుగ | ,, | 2 వేల | ,, ,, |
| (4) | కలియుగ | ,, | 1 వెయ్యి | ,, ,, |

(మొత్తము నాల్గు యుగముల పరిమాణము పదివేల దివ్య సంవత్సరములు) ఆద్యంతములు గలసిన సంధి సంవత్సరము లాయాయుగములలో నీ క్రింది విధముగ నుండును,

(1) కృతయుగమున 800 దివ్య సంవత్సరములు.
(2) త్రేతాయుగమున 600 దివ్య సంవత్సరములు.

(3) ద్వాపరయుగమున 400 దివ్య సంవత్సరములు.

(4) కలియుగమున 200 దివ్య సంవత్సరములు.

సంధి సంవత్సరములు 2000 లు పై యుగ సంవత్సరములతో గలిపిన మొత్తము 12000ల దివ్య సంవత్సరములొక మహా యుగమునందుండును. ఇట్టి మహాయుగములు వేయ్యి కార్యబ్రహ్మ కొక పగలు (దినము) అంతే కాలము రాత్రియగును. ఈ మానమున నతనికి నూరు సంవత్సరము లైన ఆయువు ప్రమాణమగును. ఇప్పుడతనికి 50 యేబది సంవత్సరము లాయుర్దాయము గడచినందున నొక పరార్ధమైనది. ద్వితీయ పరార్ధ మతనికి నడుచుచున్నది. ద్వితీయ పరార్ధారంభ దినమునందానాటి సంకల్ప సృష్టి వరాహకల్పనామమున వ్యవహారమునందున్నది. ఇంతకు పూర్వమతని జన్మదినము నందారంభమైన సృష్టికి పద్మకల్పమను పేరుండెడిది. ఇట్లు సృష్ట్యాది నుండి నేటివరకు 195 కోట్ల 58 లక్షల 85 వేల (165) సంవత్స రములు జరిగినవనుచు మన భారత దేశమునందలి పంచాంగముల ద్వారా దెలియబడుచున్నది. ఇతర దేశములందీ విధమున కాల ప్రమాణము జెప్పబడుటలేదు. ఇదియే భారతీయుల ప్రాచీన విజ్ఞాన ధనము. మానవ మానమునందలి సావన సంవత్సర దినములైన 360 దినములకొక సంవత్సర ముచే గుణించినచో యుగ మానములు క్రమముగ కృత యుగమునకు 4800 × 360 = 17 లక్షల 28 వేల సంవత్సరములు, త్రేతకు 3600 × 360 = 12 లక్షల 96 వేలు, ద్వాపరమునకు 2400 × 360 = 8 లక్షల 64 వేలు, కలియుగమునకు 1200 × 360 = 4 లక్షల 32 వేల సంవత్సరము లగును. ఇదే విషయమునందు రాజ నారాయణ షట్ శాస్త్రిగారు గుడ్గామ్ (పంజాబు) వాస్తవ్యులు "చెతావని యను గ్రంథమును హిందీ భాషలో ప్రచురించిరి. ఆ గ్రంథమునందు పైన పేర్కొనబడిన యుగా దుల సంవత్సరసంఖ్య లబద్ధమనుచు కుల్లూక భట్టు (మనుస్మృతి వ్యాఖ్యాత) మేధా తిథి మున్నగు వారిని, శ్రీ మద్భాగవత వ్యాఖ్యాన కర్తయగు ప్రఖ్యాత పండితులైన శ్రీధరులను ధిక్కరించి వారలు పండితులైనను వారు జ్యోతిశ్శాస్త్ర వేత్తలు గారనచు నుడివెను. షట్ శాస్త్రిగారు తమ

(చేతావిని) గ్రంధమునందు దేవ మానమున జెప్పబడిన, యుగాదుల సంఖ్యా తలక్రిందుగ జేసి కృతయుగమునకు 1200 ల సంవత్సరములని మనుష్య మాన సంఖ్యయే యగునని ఆ విధముగ త్రేతకు 2400 సంవత్సరములని ద్వాపరమునకు 3600 సంవత్సరములని కలియుగమునకు 4800 సంవత్స రములనుచు జెప్పి సంఖ్య పూర్తియైనందున కలియుగాంతమైనది కృత ప్రారంభమగుచున్నది. కలికియవతారము వచ్చుచున్నదని వ్రాసిరి. ఇట్లు లోకులను భ్రమ పెట్టుచు గ్రంధ విక్రయమున లక్షలాది ధనమును జేకూర్చుకొన గలిగిరే గాని గ్రంధమునందు వారు వ్రాసిన మాట లొకటైనను సత్యముకాలేదు. పండితనిందకే పాల్పడిరి. ఇట్లనేకులు వైదిక సనాతనధర్మమును ధిక్కరించుచు స్వలాభాపేక్షచే లోకులను భ్రమ పెట్టుచుందురుగాన ధర్మపరాయణులు వానిని విశ్వసింపరాదు.

ఒక మహాయుగమునందు 12000 వేలదివ్య సంవత్సరములు. అట్టి మహా యుగములొక్క వెయ్యి గడచిన నదొక్క దినము (పగలు) అంతే ప్రమాణ కాలముగల రాత్రిగడచిన కార్యబ్రహ్మకొక దినము (అహోరాత్రులు) అని వ్రాయబడియె. అందే డెబ్బదియొక మహాయుగమునకొక మన్వంతరము లెక్కతో 14 పదునాల్గు మన్వంతరములొక బ్రహ్మదినమునందు జరిగి పోవును.

శ్లో॥ 131. సహస్రయుగ పర్యంత మ్మహర్యద్బ్రహ్మణోవిదుః ।
రాత్రిం యుగసహస్రాంతాం తేహోరాత్ర విదోజనః ॥

తా॥ మహాయుగములు వెయ్యిపూర్తియైన నెవరికి పగలో అట్టిప్రమాణమే గలకాలమెవ్వనికి రాత్రియగునో గణిత సంఖ్యావిదులే (కాలజ్ఞానముగల వారే) ఆయహోరాత్రములను దెలిసికొనువార లనబడుదురు.

107. చంద్రగతిచే తిథులు, పక్షములు, మాసములు, సూర్యసంచార ముతో అయనసంక్రమణాదులు దెలియుచుండినను ఉభయ సమన్వయము లేకుండినచో కాలపరిగణితమునందు భ్రమచే ప్రమాదమేర్పడును. తిథులు వృద్ధి హ్రాసములగుచుండునందున వృద్ధియగునపుడు నెలకొక దినమున

కంటెను కొంచము తక్కువ ప్రమాణమున పండ్రెడు నెలలలో (సంవత్సర మందు) పది దినములు హెచ్చుచుండును. మూడు సంవత్సరముల కొక మాసము హెచ్చగుటతోనది మలమాస (అధికమాస) మని, ద్విసంక్రమణమాస మని జెప్పబడుచున్నది. ఇదే విధముగ మాసమందొక దినమునకంటెను కొంచము హెచ్చగునప్పుడు కొన్ని సంవత్సరములందొక నెల తగ్గిన క్షయ మాసమగును. అది యసాధారణమగుటతో 140 నూటనలుబదేండ్ల కొక సారి క్షయమాసము వచ్చునందురు. 1963-64 లోని శోభకృతు నామ సంవత్సరమునందే క్షయమాసమగుచు మార్గశిర పుష్యాదులను గలిపిన దొకేమాసమైనది. భారతీయులు తమ గణితశాస్త్ర విజ్ఞానమున చంద్ర సూర్యగతులకు సమన్వయమగునట్లు మూడుసంవత్సరములకొక మల మాసము, 140 నూటనలుబది సంవత్సరములకొక క్షయమాసమును జేర్చి గణితము శాస్త్రానుసారము నిర్దుష్టముగ సమన్వయ పరిచిరి. అన్యథాతిథి సంక్రమణాదులకు భేదము గలిగిన, ఋతువులు, అయనములు గ్రహణ, మూఢాదులు నిశ్చితతిథి మాసములందేర్పడజాలవు. భారతీయ పంచా గములందు అవి ప్రత్యక్షముగ గనుపడుచుండుటతో జ్యోతిశ్శాస్త్రమునందు ప్రామాణ్యమేర్పడుచున్నది.

108. అశ్విని మొదలు రేవతి వఱకు 27 ఇరువదేడు నక్షత్రములు బ్రహ్మ దైవత్యమైన అభిజిన్నక్షత్రముతోగలసి 28 యిరువదెనిమిది నక్షత్రములు.

2. మేషాది మీనపర్యంతముగల 12 పండ్రెండు రాసులలో సూర్య చంద్రులతో సహాగ్రహముల సంచారమగుచున్నది. ఖగోళమునగల, శిశు మారచక్రమునందుండిన గ్రహనక్షత్రతారాదులు తమలోయంతర్భ్రమణ జేయుచు మేరు పర్వత శిఖరాగ్రమునందున్న ధ్రువునకును, మేరువునకును ప్రదక్షిణమును జేయుచుండును. మేరుపర్వత శిఖరాగ్రముపై మేఢీ భూతుడగు ధ్రువునకు సప్తఋషులతో సహాగ్రహ నక్షత్ర తారకాదులు ప్రదక్షిణమును జేయునని పురాణములు చెప్పుచున్నవి. భాగవత పురా ణమునందు ధ్రువచరిత్రగలదు. అందు ఉత్తానపాదునికి కిద్దరు భార్యలు,

సునీతి, సురుచి, యను వారుండిరి ధ్రువుడు సునీతి కుమారుడు. అత డై దేండ్ల బాల్యమున తండ్రితొడపైనుండగ సవతితల్లియగు సురుచి కఠో రములాడి బాలుని తండ్రితొడపై యధిరోహించుట కర్హత్వకై జచ్చి మరల నాగర్భజనితుడవగుదువేని నీకు గలుగునని తొడనుండి డ్రింప ధ్రువు డేడ్చుచు తల్లి కెరంగించె, నంతనామె పరమేశ్వరు నారాధింపుమని కుమారుని బుజ్జ గించెను. ధ్రువుడు పట్టుదలలో పరమేశ్వరు నారాధించుటకు తపోవన మున కేగెను. నారదుడు త్రోవలో ధ్రువునుజేరి యతని నిశ్చల చిత్త మునుగాంచి మంత్రోపదేశమును జేసెను. ధ్రువుడారు నెల లుగ్రతపస్సు జేయగ నారాయణుడు ప్రత్యక్షమై యతనితో నిట్లనియె.

శ్లో॥ 132. వేదాహంతే వ్యవసితం హృదిరాజన్యబాలక ।
తత్ప్రయచ్ఛామి భద్రంతేదురా పమపిసువ్రతః ॥

భాస్క. 4. అ. 9. శ్లో. 19.

తా॥ ఓయి రాజన్యబాలకా ! నీమనస్సంకల్పము నాకు దెలియును. అది తరుల కలభ్యమైనను నీతస్సునకు సంతసించి యాకోరికనిత్తును. దానితో నీకు మంగళమగును.

శ్లో॥ 133. నాన్యైరధిష్ఠితం భద్రయద్భ్రా జిష్ణుధ్రువక్షితి ।
యత్రగ్రహర్క్షతారాణాం జ్యోతిషాం చక్రమాస్థితమ్

భాస్క. 4. అ. 9. శ్లో. 19

తా॥ నీ కివ్వబడుస్థానము ధ్రువమైనదియు నత్యంత ప్రకాశమాన మైన దియు త్వదితరు లధిష్ఠించనిది అగును. ఎచ్చట జ్యోతిశ్చక్రమునందు గ్రహనక్షత్ర తారాదులాశ్రయించియున్నవో ఆస్థానమే నీకివ్వబడును.

శ్లో॥ 134. మేఢ్యాంగోచక్ర వస్థాస్నుః పరస్తాత్కల్పవాసినా ।
ధర్మోగ్నిః కశ్యపశ్శుక్రోమున యోయేవనౌకసః ।
చరంతి తక్షిణీ కృత్యభ్రమంతోయ త్సతారకాః ॥

భాస్క. 4. అ. 9. శ్లో. 21.

తా॥ 1. ధర్ముడు (యముడు) 2. అగ్ని 3. కశ్యపుడు 4. ఇంద్రుడు వీరు నల్గురును సప్తఋషులు. గ్రహతారకలును. మేఢికి, గల వృషభములవలె నీ స్థానమునకు ప్రదక్షిణముగా దిరుగుచుందురు. (మేఢియనగ ఎద్దులనుగట్టు బంతికొయ్య.) ఇట్లు ధ్రువునితో జెప్పి దేహమున్నంతవరకు నన్నారాధింపుచు దేహాంతమునందా ధ్రువస్థానము జేరుదువనుచు వరమిచ్చి యతని నింటికి మరలించెను. అట్లే ధ్రువుడు దేహాంతమునందు మేరుశిఖరాగ్రమునగల శిశుమార పుచ్ఛాగ్రమునందు జేరి నక్షత్రరూపమున నిప్పటికిని విరాజిల్లుచున్నాడు. రెండండ కటాహామధ్యమందు (భూమ్యాకాశముల మధ్యన) సూర్యుడు భూమికి 25 కోట్ల యోజనములందుగలడు.

శ్లో॥ 135. అండమధ్యగత సూర్యోద్యావా భూమ్యోర్యదంతరం ।
సూర్యాండగోళ యోర్మధ్యే కోట్యస్స్యః పంచవింశంతి ॥

తా॥ సూర్యునిపైన శనిగ్రహము వరకు ఒక్కొక్క గ్రహము లక్ష యోజన క్రమముగ పైకిగలదు. ఇట్లు శుక్రగ్రహమునకు రెండులక్షల యోజనములపైన శనిగ్రహము గలదు. శనికి నుత్తరముగ పదునొకండు లక్షల యోజనములపైన సప్తర్షి మండలముండును. సప్త ఋషులు లోక క్షేమమును గోరుచు విష్ణుపద వాచకమైన ధ్రువపదమునకు గ్రహనక్షత్ర తారాదులతో సహప్రదక్షిణమును జేయుదురు. ప్రదక్షిణము సవ్యముగనే యగుటకు భగవదాజ్ఞ గలదని జెప్పుదురు. ఋషులకుపైన 18 లక్షల యోజనముల దూరములో ధ్రువనక్షత్రముగలదు. శిశుమార చక్రము యొక్క స్వరూపము మకరాకృతిగ పుచ్ఛముపైకి, తలక్రిందుగనుండును. పుచ్ఛాగ్రమున నలుదిశలందు దక్షిణమునుండి పూర్వమునకు క్రమముగ ధర్ముడు, అగ్నికశ్యపుడు, శుక్రుడు నుందురు.

శ్లో॥ 136. పుచ్ఛేగ్నిశ్చ మహేంద్రశ్చ మారీచశ్చ యయోధ్రువః ।
ఏషతారామయ స్తంభోనాస్త మేతిన చోదయేత్ ॥

మత్స్యపురాణము. అ. 125. శ్లో. 96.

తా॥ పశ్చిమముననగ్ని, పూర్వమున నింద్రుడు. దక్షిణమున యముడు, ఉత్తరమున కశ్యపుడు నుందురు. పుచ్ఛాగ్రమున ధ్రువుడుగలడని యర్థము.

మకరాకృతిగల శిశుమార పుచ్ఛమును ప్రథమకాండమని, కటిని ద్వితీయ కాండమని, ముఖమును తృతీయమని చెప్పబడినది. మకరమునకువలె దీనికి ముందు వెనకల నాల్గుపాదములుండును. ముందరి కుడి ఎడమపాదము లందు క్రమముగా నాసత్యాసత్యులను అశ్వినీ కుమారులుందురు. వీరే దిన రాత్రముల కభిమాని దేవతలు, వీరికథ ముందు వ్రాయబడును. వెనుక నుండు రెండుపాదములందు గ్రమముగ అత్రి, మిత్రావరుణులుందు రనుచు యజురారణ్యక "భూః ప్రపద్యేభువః ప్రపద్యేసువః ప్రపద్యే" యను మంత్రమున జెప్పబడినది. శిశుమార చక్రమును తైలయంత్రముతో బోల్చిరి. తైలయంత్రయనగ నూనెదీయుగానుగ. రెండవ కాండమునందు సప్తర్షి మండలము, ప్రాగగ్ర శకటాకారమున యున్నదని భాగవతము నందు గలదు. "పాగగ్ర శకటాకారం, తారాసప్తకం సప్తఋషిమండలం"

శ్లో॥ 137. పూర్వభాగే భగవాన్మరీచీ రపరేస్థితో వసిష్ఠోతః।
తస్మోత్తస్యాంగిరస్తతో త్రిస్తత్సాన్నిధ్యాసన్నః పులస్త్యః పులహః క్రతుః

తా॥ పాగగ్రి శకటాకారముగనున్న సప్తఋషి మండలములో ముందర ఎత్తుగ మరీచి యతనికి పశ్చిమమున క్రిందికి వంగియున్నట్లు అరుంధతీ వసిష్ఠులు గలరు. వారికి వెనుక నుత్తరమున నంగిరుడు కలడు. అతనికి పశ్చిమమున నక్షత్ర చతుష్టయ రూపమున అత్రికలడు. అత్రికి దక్షిణము నందు పులస్త్యుడు వానికి వెనుక పులహుడు. పులహున కుత్తరముగ క్రతువు గలరని చెప్పబడినది. ఇప్పటికాలమునందలి కొందరు విజ్ఞాన శాస్త్రజ్ఞులు ఈ ఋషిమండలమును పెద్ద ఎలుగుబంటుగ వర్ణించు చున్నారు. మరొక ఋషిమండలము గలదని, దానిని లఘుఋషిమనిరి.

శ్లో॥ 138 కశ్యపోఽత్రిః భరద్వాజో విశ్వామిత్రోఽథ గౌతమః।
వసిష్ఠో జమదగ్నిశ్చ సప్తైతే ఋషయస్మృతాః

తా॥ పైవారిసంతతియగుటచే వీరిని లఘుఋషమని వ్యవహరించి యుండ వచ్చును. లేదా భగవదాజ్ఞచే గావచ్చును. పండితులీవిషయ మాలోచింతురు గాక.

109. గ్రహసంచారము మంద, తీవ్ర, తీవ్రతర, సమ,ఋజు, వక్ర, అతి చార భేదములతో నుండును. వారి గతి వలన గలుగు శుభాశుభఫలములు జ్యోతిశ్శాస్త్రము నందు విస్తరించబడినవి. గ్రహములకు రాశ్యాధిపత్యము గలదు. గావున మనుష్యులు తమకగు శుభాశుభఫలములను జన్మనక్షత్రము నను, వ్యవహారనామమునను, దెలిసికొనుపద్ధతి శాస్త్రమునందు జూపెట్టనై నది. ప్రతి నక్షత్రము నందు నాల్గుపాదములు కలవు. పాదభేదముగ నొక్కొక యక్షరము జెప్పబడినది. ఇట్లిరువదేడు నక్షత్రములకు 27 × 4=108 పాదములు. వీనిని పండ్రెండు రాశులలో భాగించగ 108 ÷ 12=9 ప్రతి నక్షత్రపాదములందు తొమ్మిదినవాంశము లేర్పడును. అనగా రెండు నక్షత్రముల నాల్గు పాదములెనిమిది మరియు మూడవ నక్షత్ర పాద మొకటి గలిపిన తొమ్మిది నవాంశలతో నొక రాశి యగుచున్నది. **ఉదాహరణ :-** "అశ్విని, భరణి, కృత్తికాః పాదం మేషం" అనుచు జెప్పనైనది. అనగా అశ్విని నాల్గు పాదములు, భరణి నాల్గు పాదములు, కృత్తిక దొక పాదముగలసిన మేష రాశి యని యర్థము. ఇదే విధమున తక్కిన నక్షత్రములకు రాశి దెలియదగును. ఇందు సౌకర్యార్థము నక్షత్ర, పాద, రాశి ఆధిపత్యముల నిట్లు జూపించబడును.

| పాదాక్షరములు | నక్షత్రములు | రాశులు | అధిపతులు |
|---|---|---|---|
| చూ, చే, చో, ల | అశ్విని | మేషము | అంగారకుడు |
| లీ, లూ, లే, లో | భరణి | ,, | ,, |
| అ | కృత్తిక | ,, | ,, |
| ఈ, ఊ, ఏ | ,, | వృషభము | శుక్రుడు |
| ఒ, వా, వీ, ఓ | రోహిణి | ,, | ,, |
| వే, వో | మృగశిర | ,, | ,, |
| కా, కి | ,, | మిథునము | బుధుడు |
| కూ, కం, గ, ఛ | ఆర్ద్ర | ,, | ,, |
| కే, కో, హా | పునర్వసు | ,, | ,, |
| హి | ,, | కర్కాటకము | చంద్రుడు |

| పాదాక్షరములు | నక్షత్రములు | రాశులు | అధిపతులు |
|---|---|---|---|
| హు, హె, హో, ఢ | పుష్యమి | కర్కాటకము | చంద్రుడు |
| డి, డూ, డె, డో | ఆశ్లేష | ,, | ,, |
| మా, మి, ము, మె | మఘ | సింహము | సూర్యుడు |
| మొ, టా. టీ. టు | పుబ్బ | ,, | ,, |
| టే | ఉత్తర | ,, | ,, |
| టో, పా, పి | ,, | కన్య | బుధుడు |
| పూ, షం, ణా, ఢ | హస్త | ,, | ,, |
| పే, పో | చిత్త | ,, | ,, |
| రా, రి | ,, | తుల | శుక్రుడు |
| రూ, రే, రో, తా | స్వాతి | ,, | ,, |
| తి, తూ, తే | విశాఖ | ,, | ,, |
| తో | ,, | వృశ్చికము | అంగారకుడు |
| నా, నీ, నూ, నే | అనూరాధ | ,, | ,, |
| నో, యా, యి, యు | జ్యేష్ఠ | ,, | ,, |
| యే, యో, బా, బి | మూల | ధనస్సు | బృహస్పతి |
| బూ, దా, ఫా, ధా | పూర్వాషాఢ | ,, | ,, |
| బే | ఉత్తరాషాఢ | ,, | ,, |
| బో, జా, జి | ,, | మకరము | శని |
| జూ, జే, జో, ఖా | అభిజిత్ | ,, | ,, |
| ఖి, ఖూ, ఖె, ఖో | శ్రవణం | ,, | ,, |
| గా, గి | ధనిష్ఠ | ,, | ,, |
| గూ, గే | ,, | కుంభం | ,, |
| గో, సా, సీ, సు | శతభిషం | ,, | ,, |
| సే, సో, దా | పూర్వాభాద్ర | ,, | ,, |
| దీ | ,, | మీనం | గురు |
| దూ, శం, ఝా, థ | ఉత్తరాభాద్ర | ,, | ,, |
| దే, దో, చా, చి | రేవతి | ,, | ,, |

110. తిథి, వార, నక్షత్ర, యోగ, కరణము లైదు పంచాంగము లనబడును. ఇవే ప్రధానముగ జెప్పబడిన పుస్తకములను పంచాంగము లందురు. వానియందు గోచార ఫలములు జెప్పబడును. విష్టి, శకుని, చతు, నాగ, కింస్తుఘ్నాదులు దుష్టయోగములు. పంచాంగములందు సంవత్సరాధి పతులను, నవనాయకులను వారితోనగు ఫలములు జెప్పబడును. మౌఢ్య, గ్రహణ, సంక్రాంతులను, జూపింతురు. లగ్న ఫలములు వర్షాది యోగములను జూపుదురు. వివాహాది శుభకార్యముల కుపయోగ్యమైన తిథి, వార, లగ్న ముహూర్తాదులను దెలుపుదురు. వధూవరుల కొంటు, గణకూట, నాడీకూట, గ్రిహమైత్రి, యోనికూట, వర్ణ, వశ్యాదులు శాస్త్రమునందు జూపించబడిన వానిని దెలుపుదురు. లౌకిక, వైదిక శ్రౌత, స్మార్త నిత్య నైమిత్తిక కామ్య కర్మలందుపయోగపడు ననేక ధర్మములు జ్యోతిశ్శాస్త్రమునందు గలవు. జ్యోతిశ్శాస్త్రమును గురించి ప్రత్యేకమైన స్వతంత్రి గ్రింధము లనేకములుగలవు. సాముద్రికము, శాకునము, ప్రశ్న, పంచపక్షి మొదలగునవి జ్యోతిశ్శాస్త్రాంతర్భూతములు. నక్షత్రములందు ప్రిథమోత్పన్నమగు నందున పూర్వము జ్యేష్ఠా నక్షత్రము నుండియే, గణన జేసెడివారలట, కొంతకాలమైన పిదప నదిమారి కృత్తికా నక్షత్రమునుండి గణితారంభమును జేసిరట. అదియును మారి యిప్పు డశ్వినీ నక్షత్రమునుండి గణనయగుచున్నది. సంవత్సరాది మాసము చైత్ర మగుటతో నది బహుళః మేష రాశియుతమైనందున రాశి గణన మేషము నుండియు మాస గణన చైత్రమునుండి యగుచున్నది. మార్పులు కాలానుగుణముగ సహజము గావచ్చును. నక్షత్రములు, అధి దేవతలు వాని రూపములు తెలుపబడును :-

| నక్షత్రములు | అధి దైవతము | రూపము |
|---|---|---|
| కృత్తిక | అగ్నిః | అగ్నిశిఖాకృత్తికాషట్. |

వేదమునందు దీనికి "క్షురాషట్". క్షురనిభషట్ అని కాళిదాసు రూపము (మంగలి కత్తి వంటిది) చెప్పెను.

నక్షత్రములు అధి దైవతము రూపము

రోహిణి బ్రహ్మ వేదమునందు "శకటం పంచ" "శకటా కృతి పంచతారాత్మ" క మని కాళిదాసు జెప్పెను.

మృగశిర చంద్రుడు ఇల్వలా పంచతారకః "వరరుచి" రూపమనెను వేదమునందు "ఇవ్వగా, ఇన్వకా, అంధక" ఇల్వాలా పేర్లు గలవు.

శ్లో 139 కృతికాశ్చాగ్ని దైవత్యం రోహిణ్యో బ్రహ్మణః స్మృతః ।
ఇల్వలా సోమదైవత్యం రౌద్రం చార్ద్రిముదాహృతం.

ఆర్ద్రి రుద్రుడు బాహుః యని రూపం తైత్తిరీయ బ్రాహ్మణమునందు గలదు. "ఆర్ద్రాి ప్రవాళమేకం" వరరుచి. "షద్మా కృత్యుజ్వాలైకతారకం" యనుచు కాళిదాసు.

పునర్వసు అదితి "ధనురాకారు పంచ" వరరుచి. "మధ్యవర్త్మని శరాస నాకృతావంబరస్యసురమాత్రు మేగతా" యని కాళిదాసు "నౌకా కారం పంచయనుచు" కొందఱు నుడివిరి.

పుష్యమి బృహస్పతి తిష్య, సిధ్య యను రెండు పేర్లుగలవు. బాణాకార రూపమని కొందఱి మతము "సగటాత్రీణి" యని వరరుచి రూపము జెప్పెను "బృహస్పతిః ప్రథమంజాయమానాతిష్యే" యని తైత్తిరీయ బ్రాహ్మణము.

ఆశ్లేష సర్పము "సర్ప ఋతుః"
"చక్రాకృతిష్షణ్ణితారిత్మక" మని కాళిదాసు రూపము జెప్పెను.

మఘ ప్రితృ దేవతలు "అఘా" యను నామము ఋగ్వేదము నందుగలదు. "అందోళికాం పంచ" వరరుచి రూప మనెను "లాంగూలాకృతిః పంచ" యని కాళిదాసు.

పుబ్బ అర్యముడు దీనినే పూర్వఫల్గుని యందురు, ఉత్తర ఫల్గునితో గలిపి అర్జున నక్షత్రములందురు. రూపం "ద్వేద్వేఖట్వాం" యని ఋగ్వేదము "ఖట్వాకృతిః తారకాదయం "వరరుచి "దక్షిణోత్తర మిళితా తారకాద్వయం". ఇట్లు కాళిదాసు.

నక్షత్రములు అధి దైవతము రూపము

ఉత్తర భగుడు ఇది యుత్తర ఫల్గుని యనబడును. పూర్వ ఫల్గునికిగల రూపమే దీనికగును.

హస్త సవిత రూపం "ప్రాణానాంపంచ". వరరుచి

చిత్త ఇంద్రుడు లేక త్వష్ట చిత్రి నామము దీనికిగలదు. "మౌక్తికమేకం" వరరుచి రూపము జెప్పెను. "ఏక మౌక్తికసముజ్వల ప్రభా" యని కాళిదాసు.

స్వాతి వాయువు దీనికి నిష్ట్యాయను నామముగలదు. రూపం "ప్రివాళమేకం" వరరుచి "కుంకుమారుణతరమేకతారకా" యనుచు కాళి "రుచిరరుచిరమణి జ్యోతిషాం సన్నివిష్టః" అని త్రివిక్రమాచారి. దీనిని చిత్తతో గలిపి తోరణస్తంభముల బోలునని శ్రీ నాధుడు, కాశీ ఖండమున జెప్పెను. సుందర కాండయందు యిట్లు గలదు.

శ్లో॥ 140 అనుయాస్వంతి మామద్య ప్లవమానం విహాయసా ।
భవిష్యతిచమే పంథా స్వాతేః పంథావిహాయసా ॥

మరియు "వాయుర్నక్షత్రమేతి నిష్ట్యాంతిగ్మ శృంగోరోరు వాణః ॥ సమీరయన్భువనాని మాతరిశ్వా అపద్వేషాగ్ంసి, నుదతా మరాతిన్" మంత్ర పాఠము.

విశాఖ ఇంద్రాగ్నులధి దేవతలు "నక్షత్రాణామధిపత్నీ్వశాఖే" మంత్ర పాఠము. "రాధేవిశాఖే" అధర్వణము "కులాల చక్రం పంచ" యను రూపం 'వరరుచి' అధునిక వైజ్ఞానిక పరిశోధకులీ నక్షత్ర సమీపమున క్రాంతి చక్రము గలదందురు.

అనురాధా మిత్రుడు "ఛత్రకారత్స్త్రయం" రూపం వర "తోరణాకృతి పంచతారకే" కాళిదాసు.

జ్యేష్ఠ ఇంద్రుడు దీనికి "రోహిణి" యను నామము, కృష్ణ యజుర్వేదమునందు గలదు. "ఛత్రాకారంత్రీణి రూపం వరరుచి.

నక్షత్రములు అధి దైవతము రూపము

మూల పితృ దేవతలు వీనికి "విచృ" నామము కృష్ణ యజుర్వేదమునందు గలదు "బర్హిణీ" నామము తైత్తిరీయ బ్రాహ్మణమునందు "కుప్యత్కేసరి పంచ" రూపం వరరుచి. "ప్రజాపతి రకామయత మూలం, ప్రజాంవిందేయమితి" మంత్రపాఠం.

పూర్వాషాఢ జలములు } రెంటిని గలిపి
ఉత్తరాషాఢ విశ్వేదేవతలు } "ద్వేద్వే చౌక" వరరుచి రూపమనెను.

"సూర్పాకృతి తారకాచతుష్టయం" కాశి. "గజదంతా కృతి ద్వితారకం" కొందఱు.

అభిజిత్ బ్రహ్మ "శృంగ మేక నక్షత్రం" రూపం బ్రిహ్మలోక మభిజయేయమతి, తదేతద్బ్రాహ్మణేభిజితే" మంత్రి పాఠం.

శ్రవణం విష్ణుః "శ్రోణ" నామము కృష్ణ యజుర్వేదమునందు "అశ్వథం" కాఠకమునందు "మచ్ఛా కారత్ర్రయం" రూపము "వర"

ధనిష్ఠ వసువులు శ్రవిష్ఠా యని వైదిక నామము "శీర్షస్త్రం" రూపం వరరుచి.

శతభిషం వరుణుడు "శతభిష జే" నామముగలదు "శతతారాః" రూపం వరగుచి "మండలాభ శతతారకాః" కాశి

పూర్వభాద్ర అజైక పాదుడు } ఈ రెండు నక్షత్రములకు తైత్తిరీయ
ఉత్తరభాద్ర అహిర్బుధ్న్యః } బ్రాహ్మణమునందు పూర్వోత్తరప్రోష్ట పది యను నామములు గలవు. ఇందలి నాల్గు నక్షత్రములు రెండేసి గలసి యొకజంటగ నుండునందున శ్రీరామ లక్ష్మణ, భరతశత్రుఘ్ను లిద్దరేసి దిరుగుటతో వారికీ నక్షత్రోపమ జెప్పనైనది "రుచ్యాప్రోష్టపదోపమాః" వాల్మీకి.

రేవతి వరుణుడు "మచ్ఛాకారం" "రూపం వరరుచి" "దంతసంఖ్యాభవతె" యని కాళిదాసు.

నక్షత్రములు అధి దైవతము రూపము

భరణి యముడు "అపభరణీ" వైదిక నామము "ఛుల్లి కాత్రీణీ" రూపం వరరుచి ఇది అశ్వినీ, కృత్తికల మధ్య నుండును.

అశ్విని అశ్వినీ కుమారులు "అశ్వముజౌ" వైదిక నామము "అశ్వ ముఖాత్రీణీ" యనుచు వరరుచి రూపము జెప్పెను.

"పేదఘూశ్వమను నొక నక్షత్రమును కని పెట్టిరట. ఆ నక్షత్రికాంతిబడిన నజగరము నశించునందురు.

111. సేదఘూశ్వ నక్షత్రి మశ్వినీకుమారు లొకానొక రాజునకు జూపిరట. అశ్వినీ కుమారుల పూర్వకథ మహాభారతము నందు గలదు. దాని సంగ్రహ మిచ్చుట సందర్భానుసారమె యనబడును. పూర్వము సూర్యుని భార్యయైన ప్రభ తనపతి కాంతిని భరించలేక తనవలె నుండు ఛాయను తనకు బదులు భర్త యింటనునిచి తాను పుట్టింటికి వెడలిపోయెను. కాని తండ్రి (విశ్వకర్మ) సూర్యుని భీతిచే కూతురు తన యింట నుండుటకు సమ్మతింపక వెడలించెను. అంత ప్రభ బడబారూపమున నుత్తర కురుభూము లందు సంచరించు చుండెను. పతి దగ్గర నున్న ఛాయ, సూర్యుని వలన శని, సావర్ణి, తపతి యను వారి బడసినది. వారి యందలిమమతచే పూర్వము ప్రభ పిల్లలగు యమ, వైవస్వతయమునపై సవతి తల్లి యగుటతో ఈర్ష్య జూపినది. యముడు తండ్రితో నీ రహస్యము దెలిపెను సూర్యుడు కోపముతో విశ్వకర్మను జేరి అడుగక విశ్వకర్మ తన కూతురగు ప్రభ బడబా రూపమున నుత్తరకురుభూములందున్నదని జెప్పెను. అప్పుడు సూర్యుడు తాను బడబమగుచు బడబారూపముననున్న పత్నీ సంయోగము జేయు నప్పుడు వీర్యము ద్విభాగమగుచు అశ్వపై బడినందున ఇద్దరు కుమారులు జనించిరి వారే అశ్వనీ కుమారులు. వారే నాసత్యాసత్యనామములతో దిన రాత్రులకు క్రమముగ అధి దేవతలైరి. వైద్యులగుటతో వీరు యజ్ఞములందు హవిర్భాగానర్హులనబడిరి. అందుకు వీరలు చవనమహర్షి దంపతులను కాయకల్ప వైద్యముచే యౌవ్వన వంతుల జేసిరి. అందుకు

ప్రత్యుపకారముగ చవనుడు తన మామయగు శర్యాతి మహారాజుచే యజ్ఞమును జేయించి తన బలమున నిందుని మెప్పించి వారలకు యజ్ఞ భాగార్హత యిప్పించెను. అశ్వనీ దేవతల మహాత్మ్యమును దెలుపు కథ మహా భారత ఆదిపర్వమునందు గలదు. దానిలో పూర్వకాల మందౌప మన్యుడు గురుకులవాసమును జేయునప్పుడతని దేహస్థౌల్యము హెచ్చగుట గని పెట్టి గురువు అతనికి క్రమమున నాహార నిషేధము జేసెను. గురు భక్తుడైన ఔపమన్యుడు గురుకులవాస నియమములకు బద్ధుడై, నిరశ నుడై గురుసేవ జేయుచుండెను. అతడు గోవుల గాయు నప్పుడడవిలో క్షుద్బాధచే జిల్లెడుపాలు త్రాగినందున నతనికి వెంటనే యంధత్వము గల్గి నది. సాయంకాలమునం దింటికి మరలునప్పుడు త్రోవ గానరాక యడవిలో నొక గుంటలో పడెను. అంత గోవులింటికి జేరినను ఔపమన్యుడు రాకుండినందున గురువతని జాడవెదుకుచు యడవిలో ఔపమన్యా యని పిలువగ అతడు "భోగురోః" యని గర్తమును నుండి మహర్షికి బలికెను. గర్తపతన కారణమడుగ గురువులతో ఔపమన్యుడు తన కాహార నిషేధ మైనందున క్షుద్బాధచే జిల్లెడుపాలు త్రాగిన సంగతి దెలిపెను. దయా మయుడగు గురువతనికి మరల కన్నులగుపడుటకై అశ్వినీ దేవతల స్తుతించు మని మంత్రోపదేశమును జేసెను. ఔపమన్యుడిట్లశ్వనీ దేవతలను స్తుతించినాడు :-

శ్లో॥ 141 ఏకం చక్రం వర్తతే ద్వాదశారం షణ్ణాభి మేకాక్షమృత స్యధారణం ।
యస్మిన్దేవా అధివిశ్వే విషక్తా స్తావశ్వి నౌముంచితం మా విషీదతం ॥

శ్లో॥ 142 స్తోతుం నశక్నోమి గుణైర్భవంతౌ । చక్షుర్విహీనః పథసంప్రమోహః ।
దుర్గేస్మిన్స్మృతితోస్మి కూపేయువాంశరణ్యౌ శరణం ప్రపద్యే ॥

తా॥ పండ్రెండారెలు లేక ఆకులు ఆరు సంధులొక ఛిద్రముగల నొకశే చక్రము (రథము) గలదు. దేనియందు విశ్వేదేవతలంద రధిష్ఠించియుందురో అది మార్తాండుని (సూర్యుని) ధరియించునదియగును. దుఃఖించు నన్ను అయ్యశ్వినీదేతలు నా దుఃఖమును దొలగింతురుగావుత!

2. తమ సద్గుణముల స్తుతిజేయుటయందు నేనసమర్థుడ. దుర్గమమైన నీ కూపమునందు కన్నులు లేక మార్గము తెలియనందున పతితుడనైతి. శరణ్యులగు మీ శరణు వేడెదను.

శ్లోకముల కర్థము పై చెప్పినట్లే యున్నను తాత్వికార్థ మిట్లుండును :- సంవత్సరాత్మకమైన సూర్యుని రథమున కొకే చక్రముగలదు. అందు పండ్రెండు మాసములే పండ్రెండారెల వంటివి. రెండారెల మధ్య నొక సంధిగ నారు ఋతువులు సంధుల వంటివి. చక్రమున కొకచే ఛిద్రము (రథమునకుండు అక్షము) ఛిద్రము శూన్యముగాన లక్షణయా ఆకాశమన బడును. తల్లింగత్వేన పరబ్రహ్మ (ఆత్మ) యగును. అదియే సంసార చక్రమున కధిష్ఠానము. పై యాధారమున నీ సంసార చక్రము నడుచును. మార్తాండుని రథమున కదియే యాధారము విశ్వేదేవత లందరా చక్రాధారము నధిష్ఠించి యున్నారు. మాసావయములు యహోరాత్రు లనబడును, దినములే మాస ఋతువులందు లయములగుచు సంవత్సర మగును. ఇట్లహోరాత్రులే సంవత్సరాత్మక చక్రమును నడుపుచున్నవి. అశ్వినీదేవతలహోరాత్రముల కభిమాని దేవతలుగాన వారే కాలచక్రము నడుపుదురనుట యుక్తము. కాలచక్రము నడిపించునట్టి మాహాత్మ్యము గల మీ సద్గుణముల వర్ణింప (స్తుతించ) నేనసమర్థుడననుట ఉచితమైనది. అజ్ఞానాంధుడనై మోక్షమార్గము తెలియబడక భ్రాంతిచే నీ సంసార కూపమునందు (గర్తమునందు) పతితుడనైతిని శరణ్యులైన తమ శరణు వేడితిని గాన తాము విజ్ఞాన చక్షువులు నా కొసంగి సంసార కూపము నుండి నన్నుద్ధరింపుడనుచు ప్రార్థించెను. ఈ విధముగ దినరాత్రులే వ్యర్థ కాలక్షేపణ జేయు నజ్ఞానాంధులను వంచించి వారి యాయువును క్షీణింపజేయుచున్నావని శ్లోకద్వయ తాత్పర్యము. కావున, మనుష్యులు వ్యర్థముగ కాలక్షేపముచేసి తమ యాయువును క్షీణముజేసికొనక శ్రేయో మార్గావలంబులగుట మంచిదని పై శ్లోకద్వయము బోధించుచున్నది.

112. నవగ్రహము లందలి రాహుకేతు లిద్దరు పూర్వమొకే శరీరము గల సింహికేయు లనబడుదురు. సముద్రమథనచే నుత్పన్నమైన అమృతము సురాసురులకు విష్ణువు మోహినీ రూపమున బంచునప్పుడు రాహు సూర్యచంద్రుల మధ్యజేరి తన హస్తమందు ప్రమాద పతితమైన అమృత పానమును జేయగ విష్ణుచక్రముచే నతని శిరము వేరుజేయబడినది. ఆ శిరమే రాహుః దేహము కేతువు వారమృత పానమును జేసినందున చావక గ్రహములైరి. ఇట్టి గాథ భాగవతాది పురాణములందు గలదు. జ్యోతిశ్శాస్త్రానుసారమున భూమి సవ్యాప సవ్యభ్రమణ జేయుటతో రెండు ఛాయా రూపము లేర్పడినవి. అందొక్కటి రాహువు రెండవది కేతువు పూర్వవైరానుగుణ్యముగ వీరు సూర్యచంద్రుల గ్రహించుటతో గణితమున గ్రహములనబడిరి. గ్రహణకాచ్ఛాదనార్థము లక్షణయా జెప్ప వలెను. అన్యథా ముఖ్యార్థము జేసిన సూర్యచంద్రులు మరల గనుపించ కుందురు. పర్వకాలములంచే పర్వమున సూర్యచంద్రులలో నెవ్వరిని వీరిలో నెవ్వరు గ్రహింతురో జ్యోతిశ్శాస్త్రానుసారమున ప్రతి సంవత్సర పంచాంగ ములందు దెలుపబడుచున్నది.

113. భగణమునందున్న యిరువదేడు నక్షత్రములలో మూడేసి నక్షత్రములొక జంటగా నేర్పడగ నదొక వీధియగును. అట్టి మూడు వీధులు గలసి యొక మార్గమగుననిరి. ఈ విధమైన మూడు మార్గములు గలవని శాస్త్రసమ్మతము గలదు. ఇచ్చట మార్గశబ్దార్థము మరణించిన జీవుడు పునర్దేహారంభక భూత సూక్ష్మయుతుడగుచు పరలోక గమనము నందవలంబించు పథమున కర్థము. వాయుపురాణము నందిట్టి మార్గలక్షణ ములు విశదీకరింపబడినవి. జ్యోతిశ్శాస్త్ర సంబంధము వానికి గలదు గాన సంగ్రహించనైనది.

వచనము 1. సంతిహసవితృ మండలస్య ఉత్తర దక్షిణ మాధ్యమో మార్గా స్త్రయః। అశ్విన్యాదిస్త్రిభిస్త్రి భిర్నక్షత్రైరేకైకా వీధీ. తాదృశత్రి భిస్త్రిభిర్వీధీభిరేకై కోమార్గః :-

తా॥ సూర్యమండలమున నుత్తర దక్షిణ మధ్యనామములుగల మూడు మార్గములంతరిక్షమునందు గలవు. అశ్విన్యాది మూడు నక్షత్రములు (అశ్విని, భరణి, కృత్తిక) గలిసిన యొక వీధియగును. ఇదే విధమున అనంతరము మూడేసి నక్షత్రముల కొక వీధియగుచుండును. మూడు వీధులుగలసిన నొక మార్గమగును. ఆ మార్గములు పైజెప్పినవి మూడు గలవు.

శ్లో॥ 143. అశ్వినీకృత్తికాయామ్యా। నాగవీథీతి శబ్దితా।
రోహిణ్యార్ద్రా మృగశిరా గజవీథ్య భిథీయతేం ॥

శ్లో॥ 144. పుష్యాశ్లే షాతథాదిత్యా వీథీచైరావతీస్మృతాః।
ఏతాస్తు వీథయస్తిస్రో ఉత్తరోమార్గ ఉచ్యతే ॥

తా॥ అశ్విని, భరణి, కృత్తిక గలసిన మూడు నక్షత్రములు నాగవీధి. 1. రోహిణి 2. ఆర్ద్ర 3. మృగశిర గలసినది గజవీధి. పుష్యమి అశ్లేష పునర్వసు మూడు నక్షత్రములు గలసినది ఐరావతి వీధియనబడును. ఇట్టి మూడు వీధులు గలసిన ఉత్తరమార్గము (దేవయాన మార్గము)

శ్లో॥ 145. తథాద్వేచాపి ఫల్గున్యామఘా చైవార్షతీమతా।
హస్తచిత్రా తథాస్వాతీ గోవీథీచేతి శబ్దితా॥

శ్లో॥ 146. జ్యేష్ఠావిశాఖానూరాధా వీథీజారద్గవీమతా।
ఏతాస్తు వీథయస్త్రి స్రోమధ్య మోమార్గఉచ్యతే ॥

తా॥ పుబ్బ, ఉత్తర మఘనక్షత్రముగలది ఆర్షతీ వీధియగును. హస్త, చిత్ర, స్వాతి, గలదానిని గోవీధియందురు. జేష్ఠా విశాఖానూరాధలు గలది జారద్గవీవీధియనబడును. ఇట్టి మూడువీధులు గలిసిన నదే మధ్యమ మార్గము.

శ్లో॥ 147. మూలాషాఢో త్త రాషాఢః అజవీథ్యభిధీయతే।
శ్రవణంచ ధనిష్ఠాచ మార్గీశతభిషస్తథా॥

శ్లో॥ 148. వైశ్వానరీ భాద్రపదేద్వే రేవతీ చైవకీర్తితా।
ఏతాస్తు వీథస్త్రి స్రోదక్షిణో మార్గఉచ్యతే ॥

తా॥ మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, మూడు నక్షత్రములు గలసి అజవీథియగును. శ్రవణము, ధనిష్ఠ, శతభిషములు గలది మృగమార్గ మన బడును. పూర్వాభాద్రోత్తరాభాద్రలు, రేవతి గలసినది వైశ్వానరీ వీధి యగును. ఈ మూడువీధులు గలసిన దానిని దక్షిణమార్గము (పితృయానము) అందురు.

శ్లో॥ 149. ఉత్తరం యదగస్త్యస్య అజవీథ్యాపి దక్షిణం।
పితృయానస్య వైపంథా వైశ్వానర పథాద్బహిః॥

తా॥ అగస్త్యముని నక్షత్రమున కుత్తరముగ అజవీధికి దక్షిణముగాగలది పిత్రుయానము (దక్షిణమార్గము) వైశ్వానరవీధి కావలయుండును.

శ్లో॥ 150. తత్రాసన్తి మహాత్మానో ఋషయోహ్యగ్ని హోత్రిణః।
భూతారంభకృతం బ్రహ్మంశం సంతో ఋత్విగుద్యతాః॥

శ్లో॥ 151. చలితంతే పునర్బ్రహ్మసం స్థాపయతి తాన్పునః।
ప్రారంభంతేతు యేలోకాస్తేషాం పంథాస్తు దక్షిణః॥

శ్లో॥ 152. సంతప్త పయసా చైవమర్యాధాభి శ్రుతేనచ।
జాయమానాశ్చ పూర్వేషాం పశ్చిమానాం గృహేషువై॥

శ్లో॥ 153. పశ్చిమాశ్చైవ పూర్వేషాం నిధనేష్విహ। ఏవమా వర్తమానస్తే
తిష్ఠంతిని యతవ్రితాః। సవితుర్దక్షిణం మార్గంశ్రితాహ్యా చంద్రతారకం.

తా॥ అచ్చట (దక్షిణమార్గమునందు) అగ్ని హోత్రములను జేయు మహాత్ములైన ఋషులు కార్యబ్రహ్మను ఋఙ్మంత్రములతో స్తుతిజేయుచు నుందురు. ఆమార్గమే చలనము (వినాశస్వభావము) గలదగుటచే యుగ యుగమునందు బ్రహ్మ మరల దానిని స్థాపించుచుండును. ఫలాపేక్షచే నెవరు కర్మలారంభింతురో వారికే దక్షిణమార్గమగును. ఉడుకుపాలు పొంగి పొరలునట్లు కర్మలు కర్మఫలము లనుభవించుటకుగాను శ్రుతి మర్యాదలచే మరల తమ సంతికిజెందిన గృహములలో జన్మింతురు. కామ్య కర్మలచేసి మింటికి మంటికి రాకపోకలు చేయువారిదే యీ దక్షిణ మార్గము. అనగా కామ్యకర్మల నాచరించువారు చచ్చుచు పుట్టుచు మరల చర్విత చర్వణులగుదురని భావము.

శ్లో॥ 150. లోకపాలా స్థితాహ్యేతె లోకాలోకే చతుర్దశ ।
తస్యోత్తర మగస్త్యస్య శృంగందేవర్షి పూజితః ॥

శ్లో॥ 155. నాగవీధ్యు త్తరాయస్య, ఋషయస్సప్త దక్షిణాః ।
ఉత్తరస్సవితుః పంథాదేవ యానస్తుసస్మృత ॥

తా॥ ఈ కనుపించు చతుర్దశ లోకములందుండు లోకపాలురకును మరియు దేవఋషి పూజితమైన అగస్త్యశృంగమున కుత్తరముగ మరియు నాగవీది దేనికుత్తరమగునో, సప్త ఋషులు దక్షిణముందురో యదే సూర్యునికి ఉత్తరమార్గము. దానినే దేవయానమార్గమందురు.

శ్లో॥ 156. తత్రతే వశినస్సిద్ధా విమలాబ్రహ్మచారిణః ।
సంతతిం యేజుగుప్సంతి తస్మాన్మృత్యు జితాశ్చతే ॥

తా॥ సిద్ధులు బ్రహ్మచారులే యాదేవయానమార్గమునందు ప్రవేశింతురు. సంతానము నెవరు నిరసింతురో వారే మృత్యువును గెలుతురు.

శ్లో॥ 157. అష్టాశీతి సహస్రాణి మునీనా మూర్ధ్వరేతసాం ।
ఉదక్పంథానమర్యమ్ణః స్థితాశ్చాభూతసంప్లవః॥

శ్లో॥ 158. తేఽ సంప్రయోగాల్లోభస్య మైథునస్యచ వర్జనాత్ ।
పునశ్చా కామసంయోగాధీచ్ఛా దేర్దోషదర్శనాత్ ।
ఇత్యేషాంకరణై శుద్ధాతే ఽ మృతత్వం హిభేజిరే ॥

శ్లో॥ 159. అభూత సంప్లవన్నామ అమృత త్వంచభాష్యతే।
త్రైలోక్యస్థితి కాలోయమ పునర్మార ఉచ్యతే ॥

తా॥ దేవయాన మార్గరక్షకు లెనుబదివేలమంది యూర్ధ్వరేతస్కులైన మునులు. ఆ భూతసంప్లవమువర కచ్చటుందురు. కామలోభోపహతులుగాక మైథున వర్జన జేసినవారు మరల ఇచ్ఛాద్వేష సుఖదుఃఖాదులందు దోషదర్శనము జేయు కారణమున పరిశుద్ధాంతః కరణులైనవారే అమృతత్వము (మోక్షము) నొందుదురు. ఆ భూతసంప్లవమన సాపేక్షికా అమృతత్వము త్రిలోకముల స్థితికాలము (ఉనికిని) అపునర్మారము (మరల మరల జావనిది)అనబడును.

శ్లో॥ 160. ఊర్ధ్వోత్తరం ఋషిభ్యస్తు ధ్రువోయత్రవ్యవస్థితః।
ఏతద్విష్ణుపదం దివ్యం తృతీయం వ్యోమ్నిభాసురం॥

తా॥ సప్తర్షులకు పైకి ఉత్తరముగ ఎచ్చట ధ్రువుడు స్థిరముగనుండునో అది మూడవమార్గము. (మధ్యమమార్గము) ఇది యాకాశమునందు మిక్కిలి ప్రకాశవంతమైనది. దీనినే విష్ణుపదము (మోక్షపదము) అందురు.

శ్లో॥ 161. నిర్ధూతదోష పంకానాం యతీనాం సంయతాత్మనాం।
స్థానంతత్పరమం, విప్ర। పుణ్యపాపపరిక్షయం॥

శ్లో॥ 162. అపుణ్యః పుణ్యోపరమేక్షీణా శేషార్తి హేతవః।
యత్రగత్వానశోచంతి తద్విష్ణోః పరమంపదం॥

శ్లో॥ 163. దివీన చక్షురాతతం యోగీనాంత న్మయాత్మనాం।
వివేకజ్ఞాన దృష్టంచ తద్విష్ణోః పరమంపదం॥

తా॥ ఓయీ బ్రాహ్మణుడా! యా పరమపదము నిర్దోషులైన సంయతాంతః కరణులగు యతులకు (సన్యాసులకు) పుణ్యాపాపనాశనమైనందున కలుగును. అశేషమగు (మిగులని) పుణ్యాపాపము లుడిగిననే అత్యంతిక దుఃఖనివృత్తి యగును. ఎచ్చట దుఃఖముండదో అదియే విష్ణుపదము. అదియే పరమపదము. ఆ పరమపద ముద్యులోకమువలె చక్షుర్వ్యాపన మాత్రమైనది. (కంటికగుపడనిది.) ఎవరు జ్ఞానయోగమునందు తన్మయులో వారి జ్ఞాననేత్రమునకే గోచరించును. వారచ్చట సుఖముగ నుందురు. ఇట్టి యనేకవిషయములతోగూడిన జ్యోతిశ్శాస్త్ర మనంతము ఇది కాలాది పరిజ్ఞానమున కత్యంతోపయుక్తమైనది. "అప్రత్యక్ష మన్య శాస్త్రం ప్రత్యక్షం జ్యోతిషంస్మృతం" యను ప్రమాణము దీనికిచెల్లును.

ఇది జ్యోతిశ్శాస్త్ర విచారము.

# 6. కల్పము

114. ప్రయోగవిధి సౌకర్యార్థమునకు కల్పింపబడిన సూత్రములను కల్ప సూత్రములందురు. కల్పసూత్రములద్వారా కర్మస్వరూపమేర్పడును.

శ్లో॥ 164. రోగైశ్చక్షి యతేదేహః కల్పఇత్య భిధీయతే।
తత్సూచకే నతస్యాపికల్ప సూత్రత్వమిష్యతే.

భవిష్యత్ పురాణము.

తా॥ పాపములవలన బుట్టిన రోగములచే దేహము నశించునందున దేహమును కల్పమందురు. ధర్మాధర్మ కారణములైన కర్మలను సూచించుటతో గ్రంథములను లక్షణయాకల్ప సూత్రములందురు. లేదా జ్వరాదిరోగములతో శరీరము జచ్చినను దేహికి నాశములేదు. జీవించునప్పుడనేకవిధములైన ధర్మాధర్మ కర్మలాచరించి మరణించిన పిదప పునర్దేహారంభక భూతసూక్ష్మయుక్తుడై కర్మఫలభోగార్థము పరలోకము లందు (స్వర్గనరకాదులందు) జేరి యచ్చటి ఫలభోగానంతరమున మరల నీ లోకమునందు తమ తమ పుణ్యాపాపములననుసరించి ఉచ్చనీచ యోనులందు జన్మించును. ధర్మానుష్ఠానము ఫలాసక్తితోగాని ఫలాసక్తి లేకగాని చేయవచ్చును. నిష్కామ ధర్మానుష్ఠానముజేయ జ్ఞానోత్పత్తిద్వారా క్రమేణ మోక్షమొందును కాని కామ్యకర్మ ననుష్ఠించిన యెడల నగ్ని హోత్రాది కర్మలందు వేల్చబడు ఆహుతులు (హోమద్రవ్యములు) ఆదిత్యుని జేరును. మరణించిన జీవులు శ్రద్ధాయుక్తులై (ఆహుతిద్రవ్య వాహకులై) పరలోక భోగానంతరము పునర్జన్మార్థము వర్షముద్వారా యీ లోకమును జేరి మరల నట్టివే ధర్మాధర్మముల నాచరింతురు.

శ్లో॥ 165. అగ్నౌప్రాస్తా ఆహుతిః సమ్య గాదిత్య ముపతిష్ఠతి।
ఆదిత్యా జ్జాయతేవృష్టిః వృష్టేరన్నంతతః ప్రజాః.

గీత. అ. 3. శ్లో. 14. భాష్యం.

తా॥ విధ్యుక్తముగా నగ్నియందాహుతులు వేల్చబడగ యవి యాదిత్యుని జేరియుండును. ఆదిత్యునిచే వృష్టియగును. వృష్టిచే నన్నము అన్నము దినగ రేతోరూపమున స్త్రీగర్భమునుండి ప్రజోత్పత్తియగును.

115. ఇట్లు శ్రౌతస్మార్తాది కర్మలన్నియు అనుష్ఠాన ప్రకారక విజ్ఞానముచే ప్రయోగవిధి నాశ్రయించి జేయబడును. అనుష్ఠాన ప్రకారమును దెలియనిచో కర్మలు క్షీణించును. లేదా యాలస్యాదులతో విధ్యుక్త కర్మలు జేయకున్న అవి నశించును. అప్పుడాకర్మలకు రుగ్మత యేర్పడినదని యర్థము. వాని రుగ్మత బోగొట్టి పునరుజ్జీవన ఈ కల్ప సూత్రములతో జేయబడునందున కల్పసూత్రముల యావశ్యకతగలదు. ఇట్టికారణము లుండినందున కల్పసూత్రములు వేదాంగముగ పరిగణింప బడినవి.

"అథాతోదర్శ పూర్ణమాసౌ వ్యాఖ్యాస్యామః" యను సూత్రముతో కల్ప సూత్రములు జెప్పబడినవి. ఒకశాఖయందు జెప్పబడిన విషయము అది శాఖాంతరములందు జెప్పబడకయున్నను ఆ విషయమునే గ్రహించి ప్రయోగవిధి నడుపుట "శాఖాంతరీయగుణోప సంహారన్యాయ"మనబడును. దానితో వైదిక కర్మానుష్ఠాన క్రమవిశేష జ్ఞానమగును.

"శాఖాంతరీయ గుణోపసంహార న్యాయేన వైదికకర్మానుష్ఠాన విశేష విజ్ఞానాయకల్ప సూత్రాణి" యని ప్రమాణము గలదు. మధుసూదనకృత మహిమ్న భాష్యము.

కల్పసూత్రముల ననుసరించి శ్రౌతయాజ్ఞికమునందు (పౌరోహిత్యము ఋత్విగ్వరణములు:-

1. అధ్వర్యవము 2. హౌత్రము 3. ఔద్గాత్రము 4. బ్రహ్మనామములచే నిర్వబడును. యీ పేరులతోనే ప్రతికాండయందు వేరువేరు సూత్రములు గలవు.

1. అధ్వర్యునిచే ప్రయోగ ప్రతిపాదకములగు సూత్రము లాధ్వర్యవ కాండయందురు. బోధాయన, ఆపస్తంభాదు లాసూత్రములను జెప్పిరి గాన వారి నామములతో సూత్రనామములు కలిగినవి.

2. హోతచే ప్రయోగ ప్రతిపాదకములగు సూత్రములు గలదానిని హౌత్రకాండయందురు. దానినాశ్వలాయన సాంఖ్యాయనాదులు జెప్పిరి. వారినామములతో పిలువబడుచున్నవి.

3. ఉద్గాతృ ప్రయోగ ప్రతిపాదకములగు సూత్రములుగలది ఔద్గాత్రి కాండయగును. ఆ సూత్రము లాట్యాయన ద్రాహ్యాయనాదులు జెప్పిరి. కాన అవి వారినామములతో జెప్పబడుచున్నవి.

4. బ్రహ్మ క్రతునిరీక్షకుడు. అతడు హోమాదులందు ప్రేషల కనుజ్ఞ యిచ్చును. బ్రహ్మ తక్కిన ఋత్విక్కుల లోపములను సవరించును. కావున నాలుగు వేదములందు పారంగతుడైనవానికి బ్రహ్మత్వవర్ణి యివ్వనగు ననిరి. ప్రతివర్ణియందు నలుగురు పురుషులుందురు వివరమిట్లు:—

1 1. అధ్వర్యుడు 2. ప్రతిప్రస్థా 3. నేష్ట 4. ఉన్నేత వీరాధ్వర్యగణము.

2. 1. హోత 2. మైత్రావరుణ 3. అచ్ఛావాక 4. గ్రావస్తుత వీరు హౌత్రుగణము.

3. 1. ఉద్గాత 2. ప్రస్తోత 3. ప్రతిహర్త 4. సుబ్రహ్మణ్యుడు వీరు ఔద్గాత్రగణము.

4. 1. బ్రహ్మ 2. బ్రహ్మణాచ్ఛంసి 3. ఆగ్నీధ్రుడు 4. పోతవీరు బ్రహ్మ గణము. ఇట్లు పదియారుగురు ఋత్విక్కులు పత్నియజమానితో పదు నెనమండ్రుచే సోమయాగమగును. సోమయాగమునందు జెప్పిన ప్రతి గణమునందలి ప్రథము లందరికిని ప్రథమదక్షిణ (పూర్ణదక్షిణ) ప్రతి ద్వితీయులందరికిని అర్ధదక్షిణలిత్తురు. ప్రతి తృతీయులందరికి తృతీయభాగ

దక్షిణ లివ్వబడును. ప్రతి చతుర్థునకును పారదక్షిణ లివ్వబడునని సూత్ర ప్రమాణము గలదు.

116. స్మార్తకర్మలందు యాజ్ఞీకము గర్భాదానాద్యా మరణాంత సంస్కారములు, మరణమునందుత్తరక్రియలు తరువాత శ్రాద్ధాదికర్మలు శాంతిపౌష్టికాదులు స్మార్తసూత్రములతోగాని ధర్మశాస్త్రమునందు జెప్పినట్లుగాగాని జేయబడును. అవియన్నియు కల్పసూత్రాంతర్గతములు. కాని యవి విస్తరభీతిచే విడువబడినవి.

శ్రుతి॥ ౪౮. తస్యై తపోదమః కర్మేతి ప్రతిష్ఠా వేదాః సర్వాంగాని సత్యమాయతనం" కేనోపనిషత్

తా॥ సచ్చిదానంద స్వరూపుడు పరబ్రహ్మ వాచ్యార్థముచే వేదబ్రహ్మ అయతనము. వేదవేదాంగములు అతనియందు 1. తపస్సు 2. ఇంద్రియ నిగ్రహాదులు, 3. కర్మల రూపమున ప్రతిష్ఠింపబడెను.

వేదాంగకాండము సంపూర్ణము.

ఓం

శ్రీ గణేశాయ నమః

# ఆర్ష విజ్ఞాన సర్వస్వము

## ద్వితీయ గుచ్ఛము

## పురాణేతిహాస కాండము

### పురాణేతిహాస లక్షణము

శ్లో॥ 166 నారాయణం నమస్కృత్య । నరం చైవనరోత్తమం
దేవీం సరస్వతీంవ్యాసంతతో జయముదీరయేత్ ॥

తా॥ నారాయణునికి (పరమేశ్వరునకు). నరునికి (జీవునకు) సరస్వతికి (వాగ్రూపమగు వేదమునకు) వ్యాసునకు (వాక్సంకలన జేయు గురునకు) నమస్కరించి యనంతరము జయమును (పురాణములను) జెప్ప వలయును.

117. పురాణం=చిరంతనము=అనాది. సమస్తమునకు కారణమగునది బ్రహ్మ.

పురాణ శబ్దమునకు నిరుక్త్యాదులందు "పురానవం=పురాణం" ఇత్యాద్యనేకార్థములు జెప్పబడినవి. వానిలో పురాఅర్థేషు ఆనయతీతి =పురాణమను నిరుక్త్యర్థము సర్వాంశ సంబంధమగుచు అర్థానుబంధిని యగుటతో సుందరతమమైన అర్థమగును. పురాయనగా వికృతికి పూర్వమే యున్న ప్రకృతి పురుషాత్మికమైన తత్వము ప్రకృతి పురుష పరిణామమే యీ కనిపించు బ్రహ్మాండము, రెంటియొక్క (జడచేతనముల యొక్క) పరిణామ పరంపర విషయక జ్ఞానోపలబ్ధి అందు, అన=(ప్రాణన-జాగ్రత) చేష్టించునది పురాణ శబ్దము. అనగా ప్రకృతి పురుషాత్మక తత్త్వమును ప్రకాశింప జేయునది పురాణము, పద్మ పురాణము నందలి

పురాణ శబ్దమునకు మధుసూదనసరస్వతీ స్వామి "పురాణోత్పత్తి ప్రసంగము" నందు పురాణశబ్ద నిష్కర్షార్థముగ" విశ్వస్య సృష్టేరితి హాసః పురాణం" యనుచు జెప్పెను. వారి యభిప్రాయమున పురాణ మనగా కేవల పురాతనమేగాక, విశ్వసృష్టియే ఇతిహాసార్థమగునని దెలియుచున్నది. ఇట్లు ఇతిహాసమే పురాణమన బడును. మనుష్యాదుల యొక్క ఇతిహాసము సృష్ట్యాది నుండి వర్తమానకాలము వరకు పరంపర పరిపూర్ణ విజ్ఞానము నందు క్రమ బద్ధమును జూపించినచో నదియు నితిహాసమే అగును. అన్యథా ఆ కథ పరి పూర్ణమన బడదు. ఇతిహాసార్థము సంపూర్ణత యీ పురాణములందే గానవచ్చుచున్నది. ఆధునికులు పురాణముల విషయమునందు పైజెప్పిన విశేషణముల నుపేక్షించి వాని నవహేళనపరచు చున్నారు. కాని యీ కాలము నందైనను విదేశీయులగు (ఇంగ్లాండు నందుండు) సుప్రసిద్ధ విచారపరుడైన హెచ్. జి. వెల్సన్(**H.G. Welson**) పండితుడు తానువ్రాసిన ఔట్లైన్ ఆఫ్ హిస్టరీ (**Outline of History**) యను గ్రంథమునందు పురాణశైలిని సమర్ధించి దానిని అనుసరించు టెంత యోముదావహము.

శ్లో॥ 167. తేషాం శశ్వత్స్వణా దేనఘామిర్హ్వా ృష్టతనూరుహా ।
రాజ్ఞీరాజ్యాభిషిక్తేవ పునర్యౌవ్వనమశ్నుతే ॥

తా॥ మేఘములయొక్క నినాదముచే భూమి పులకాంకితమగుచున్నది. అది పట్టాభిషిక్తురాలైన మహిషివలె నూతన యవ్వమును జెందునట్లే పురాణము లాత్మయాదార్థ్యమును దెలుపుటచే నూతన విజ్ఞానదాయకము లగుచున్నవి. శ్రుతి స్మృతులందు జెప్పబడిన సకలధర్మములను పురాణములితిహాసరూపమున వర్ణించినవి. వానిలో ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థములను సందర్భానుసారముగ కథలందు పురాణములు బొందుపరచి సర్వజనులకును సులభార్ధమగునట్లు బోధించినవి కాన శ్రుత్యనధికారులకుకూడ విజ్ఞానమను తత్వమును బోధించుచున్నవి. శ్రుతి స్మృతిన్యాయాదులతో గూడినవగు పురాణాముల నర్థవాదములగుననుచు

నవహేళనజేయుట న్యాయముగాజాలదు. సనాతన ధర్మప్రతిపాదన చేతను శ్రీహరి గుణగణముల గీర్తించుటచేతను అవి యాదరణీయము లగును.

శ్లో॥ 168, పురాణేష్వర్ధవాదత్వం యే వదంతి నరాధమాః
తైరార్జితాని పుణ్యాని తద్వదేవభవంతివై

శ్లో॥ 169. సమస్తకర్మ నైర్మ్యాల్య సాధనాని నరాధిపః।
పురాణాన్యర్ధ వాదాని బ్రువన్న రకమశ్నుతే బృహన్నారదీయం.

తా॥ ఏనరాధములు పురాణములర్ధవాదములేయందురో వారార్జించిన పుణ్యములట్టివే యనబడును. ఓయీరాజా! పురాణము లర్ధవాదములే యగుననుచు బలుకుట సమస్త కర్మనిర్మ్యాలమగుటకు కారణమగును. కావున వానిని నిరర్ధకములనువారికి నరకము సంభవించును.

118. భక్తిశ్రద్ధలతో బురాణముల శ్రవణపఠనాదులుజేయు వారలకందు జెప్పబడిన చతుర్విధ పురుషార్థములు లభించును. యాస్తిక్య బుద్ధిగల వారిప్పటికిని సద్గ్రంధములైన పురాణముల శ్రవణపఠనాదులు జేయు చున్నారు. కాలభేదమున పురాణేతిహాసములందు మార్పులుండవచ్చును. ఇంతమాత్రమునవే వానినజ్ఞాను లవహేళన జేయరాదు. వేదవేదాంగ ములు పురాణములు లేకుండిన సర్వులకు సుబోధకములు కాజాలవు. వేద వాఙ్మయమునందు భూగోళ ఖగోళసంబంధ విజ్ఞానముగలదు గాన పురాణ విజ్ఞానములేకుండిన వాని యదార్థజ్ఞానము కలుగదు. భూగో ళాది విజ్ఞానము పురాణములందు విస్పష్టముగ వివరింపబడినందున యధా ర్థావగతియగును. వేదశాస్త్రములకును, పురాణములకు భేదమేమన కేవల కథారూపవర్ణన పురాణములందుగలదు. అనగా వేదశాస్త్రార్థములనే పురాణములు కథారూపమున వర్ణించినవి. పురాణములద్వారా వేదార్థ మాబాలగోపాలము వరకందరికి నందుబాటగుచున్నది.

శ్లో॥ 170. ఇతిహాసపురాణా నిభిద్యంతే కాలభేదతః ।
తేషామజ్ఞానతోధార్ష్ట్యాన్నావహేలా విధీయతాం ॥

శ్లో॥ 171. ఖగోళమథ భూగోళం లోకవృత్తం యథాతథం ।
పురాణాత్సాధు విజ్ఞాయ వేదార్థం జ్ఞాతుమర్హసి ॥

శ్లో॥ 172. యో ఽ ధీతేచతురో వేదాన్సాంగో పనిషదస్తథా ।
పురాణం యోనజానాతిగతిం వేదేసనాప్నుయాత్ ॥

శ్లో॥ 173 యన్న వేదేషు విజ్ఞాతం యన్నబుద్ధం స్మృతిష్వపి ।
తత్సర్వం గూఢవిజ్ఞానం పురాణే ష్వనుభూయతే ॥

శ్లో॥ 174. వేదేయదుక్తం విజ్ఞానం తదతో్రిక్తం చరిత్రవత్ ।
ద్రిష్టవ్యం వేదదృష్ట్యై తత్పురాణం సర్వతోముఖం ॥

శ్లో॥ 175. ఇతిహాస పురాణాభ్యాం వేదోయం సుదృఢః కృతః ।
తాభ్యాంహి వేదవిజ్ఞానం చారిత్రైణోపదర్శితం ॥

శ్లో॥ 176. యోన వేద పురాణాని తస్యవేదా న భాన్త్యలం ।
బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయం ప్రిహరిష్యతి ॥

119. పూర్వమనేక విషయములతో గూడియుండిన వైదికవిజ్ఞాన మొకే పురాణ సగ్ంహితగానుండెను. దానియందు సర్గేతిహాస శుద్ధికై సృష్ట విజ్ఞాన సంబంధములైన అన్యవిషయములగు నాల్గంశములను భగవానులగు వ్యాసమహర్షి జేర్చిరి.

శ్లో॥ 177. ఆఖ్యానైశ్చాప్యుపాఖ్యానైర్గాథాభిః కల్పశుద్ధిభిః ।
పురాణ సగ్ంహితాంచక్రే భగవాన్బాదరాయణః ॥ ౮.

తా॥ ఆఖ్యానములనగా తమకళయందే గనుపించువృత్తి గలిగినవి. ఉపాఖ్యానములనగా పరోక్షమునందు చిరకాలమునందు జరిగిన వృత్తములు మరియు ఇతివృత్తములు. గాథలనగా పారంపర్యముగ వినబడినను వానికర్త దెలియబడకుండు వృత్తములు. కల్పశుద్ధియనగా నైతిహాసిక సంబంధమైనది. దానిలో పురాణేతిహాసభాగము, ధర్మశాస్త్రములందు ప్రితిపాదింపబడిన విజ్ఞానము, కర్తవ్య వాక్యములును, శ్రౌతస్మార్త సదాచారములు, ధర్మభేదములు, నానావిధోపాసనలు, నీతి, మొదలగు నసేకవిషయములు చేరునవి. పురాణలక్షణమిట్లు:-

శ్లో॥ 178. సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంతరాణిచ ।
వంశానుచరితం చైవ పురాణంపం చలక్షణం॥

తా॥ పురాణములందు సర్గము (సృష్టి) ప్రతిసర్గము (ప్రతిసృష్టి) వంశము లనగా రాజవంశముల కథలు, మన్వంతరములు (పదునాల్గు మన్వంతరములు) వంశానుచరితములు జెప్పబడును.

2. జెప్పిన పంచలక్షణములందొకొక్కక్కటై దైదువిధములు గలవు.

(1) సృష్టి (సర్గము) యందు 1. సృష్టిక్రమము 2. సృష్టివిషయక మత భేదము 3. అవతారములు 4. ఆయతి 5. బ్రహ్మాండలక్షణములుండును.

(2) ప్రతిసృష్టి (ప్రతిసర్గము) యందు 1. శాస్త్రావతరణములు 2. కల్ప శుద్ధి 3. సృష్టిసంహారము 4. జ్యోతిశ్చక్రము 5. భూగోళము.

(3) వంశమందు 1. ఋషివంశము 2. పితృవంశము 3. సూర్యవంశము 4. చంద్రవంశము 5. అగ్నివంశము.

(4) మన్వంతరములందు 1. యుగ 2. దివ్యయుగ 3. నిత్యకల్ప 4. సప్తకల్ప 5. త్రింశత్కల్పమను నైదువిధములుండును.

(5) వంశానుచరితములందు 1. సూర్యచంద్ర వంశచరిత్ర 2. దేవవంశ చరిత్ర 3. అసురవంశ చరిత్ర 4. ఋషిచరిత్ర 5. దేవయోని చరిత్ర లిట్లు పంచపంచక విజ్ఞానము జెప్పబడినది.

శ్లో॥ 179. ఏషాంవిద్యా విభాగానాం పంచానాం వేదవర్తినాం ।
నానాభాగ విభక్తానాం పురాణం నామకల్ప్యతే ॥

120. పూర్వకాలమునందు పురాణసంహిత యొక్కటే పదునెనిమిది పర్వములతో నుండెనందురు. పై జెప్పిన నాల్గంశములనుజేర్చి వ్యాసభగ వానుడు పదునెనిమిది పురాణములుగ వేరుపరచెను. జగత్తంతయు ప్రకృతి రూపముననేగాని పురుషరూపముననేగాని పదునెనిమిది కళలతోనుంటచే పురాణములు పదునెనిమిది పర్వములుగాగాని పదునెనిమిది పురాణము లుగాగాని విభక్తములైనవనుచు మధుసూదన సరస్వతీస్వామి చెప్పెను.

శ్లో॥ 180. జీవానామాయతనాన్యేవ అష్టాదశ విధాన్యథ ।
బ్రహ్మాండానిచ తావంతి ఈశ్వరాయతనాన్యపి ॥

శ్లో॥ 181. బ్రహ్మాండసృష్టి విజ్ఞానం పురాణమితిధార్యతే ।
అష్టాదశ పురాణాని । తస్మాదాహుర్మనీషిణః ॥

శ్లో॥ 182. పురాణశాస్త్రం బ్రహ్మాండ విజ్ఞానాయ ప్రవర్తితం ।
బ్రహ్మాండాధార మాత్మాయ మష్టాదశ నికాయవాన్ ॥

శ్లో॥ 183. అష్టాదశ ప్రకారైశ్చ బ్రహ్మాండం తదసృజత్ ।
అష్టాదశ పురాణాని విద్వాంస్తస్మాదకల్పయత్ ॥

121. ప్రాచీన కాలమునుండియే మనభారతవర్షమునందు పురాణముల నాదరించి శ్రవణ పఠనములు జరుపుచుండిరి. సనాతన ధర్మములు, వేద శాస్త్రార్థములు, వర్ణాశ్రమాచారములు, పునర్జన్మాదులు గలవను నిశ్చ యము, ఆత్మనిత్యత్వము, పరలోకాస్తిక్యత, ఇపుడు మనకుగల దైవము నందలి దృఢవిశ్వాసము, సామాజిక వ్యవస్థ, సంస్కృతి, సభ్యత, సంస్కార ములు, వ్యవహారికనీతి, రీతి, ఉత్తమాదర్శములగు స్త్రీ ధర్మములు ఆచరణ యోగ్య మర్యాదలు మొదలగు ననేక విషయములు వేదశాస్త్రములందు వలె పురాణములందుగలవు. పురాణములందలి హరిలీలాకథలు చరిత్రలు మనమనములందు నెలకొనియుండునట్లుగ జేసినవి.

శ్లో॥ 184. ఋచస్సామాని ఛందాంసి పురాణం యజుషాసహ ।
ఉచ్ఛిష్టాజ్జజ్ఞిరేసర్వేదివి దేవాదివశ్రితాః ॥
పురా పరంపరావక్తి పురాణంతేనవైస్మృతం "వాయుపురాణం"

శ్లో॥ 185. పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతః ॥
అనంతరంచ వక్త్రేభ్యో వేదాస్తస్య వినిర్గతాః

122. భాగవత పురాణమునందు పురాణలక్షణము భంగ్యంతరముగ జెప్ప బడినది.

శ్లో॥ 186. అత్రసర్గో విసర్గశ్చ స్థానం పోషణమూతయః ॥
మన్వంతరే శానకథా నిరోధోముక్తిరాశ్రయః ॥

భాస్క. 2. అ. 10. శ్లో. 1.

శ్లో॥ 187. దశమస్య విశుద్ధ్యర్థం నవానా మిహలక్షణం ।
వర్ణయంతి మహాత్మానః శృతేనార్థేన చాంజసా ॥

భాస్క. 2. అ. 10. శ్లో. 2.

తా॥ ఇందు 1. సర్గము 2. విసర్గము 3. స్థానము 4. పోషణము 5. ఊతి 6. మన్వంతరములు 7. ఈశ్వరకథలు 8. నిరోధము 9. ముక్తి 10. ఆశ్రయములను పదిలక్షణముల జెప్పుట పదవదైన ఆశ్రయ పరిశుద్ధికిగాను తక్కిన తొమ్మిది లక్షణములు చెప్పబడినవని యర్థము. ఇట్లు వేదార్థజ్ఞులైన మహాత్ములు వర్ణింతురు.

శ్లో॥ 188. భూతేంద్రియధియాంజన్మస్సర్గ ఉదాహృతః ।
బ్రహ్మణోగుణ వైషమ్యాద్విసర్గః పౌరుషం స్మృతమ్ ॥

భాస్క. 2. అ. 10. శ్లో. 10.

తా॥ పంచమహాభూతములు, ఇంద్రియములు, అంతఃకరణమనో బుధ్యాదుల జన్మసర్గమనబడును. పరమేశ్వరుని మాయాశక్తియగు మూల ప్రకృతి త్రిగుణాత్మిక యగుటతో యాగుణము లొకదానియందొకటి విషమమునగలయుట (ప్రతిగుణము సార్ధభాగముల విడిచి మిగతార్ధ భాగములు మూడు మూడు లగుట) చే వానితోనగుసృష్టి విసర్గ మనబడును.

శ్లో 189. స్థితిర్వైకుంఠ విజయః పోషణంతదనుగ్రహః ।
మన్వంతరాణి స్సద్ధర్మః ఊతయః కర్మవాసనా ॥

భాస్క. 2. అ, 10. శ్లో. 4.

తా॥ త్రిలోకములుత్పత్తి కాలమునుండి వర్తమానకాలమువరకుండుట స్థితియనబడును. పరమేశ్వరుని యకుంఠిత (నశించని) విజయము (కీర్తి) యనబడును. పరమేశ్వరుని యనుగ్రహమే పోషణయనబడును. కార్య బ్రహ్మకగు నొకదినమునందు పదునాల్గు మన్వంతరములుండును. ఒక మన్వంతర కాలము డెబ్బదొక మహాయుగమగును. ప్రజలకు మనువు

జెప్పునది సనాతన ధర్మమనబడును. మనుష్యులకు గల తమపూర్వజన్మ కృత కర్మవాసనలు "ఊతులు"

శ్లో॥ 190. అవతారానుచరితం హరేశ్చాస్యానువర్తినాం ।
పుంసామీశకథాః ప్రోక్తానా నాఖ్యానోపబృంహితాః

భాస్క. 2. అ. 10. శ్లో. 5.

తా॥ నానావిధములైన హరిలీలా కథలును, హరిభక్తుల చరిత్రలు యీశ్వరకథలనబడును.

శ్లో॥ 191. నిరోధోఽస్యాను శయనమాత్మనః సహశక్తిభిః ।
ముక్తిర్హిత్వాన్యథారూపం స్వరూపేణ వ్యవస్థితిః ॥

భాస్క. 2. అ. 10 శ్లో. 6.

తా॥ పరమేశ్వరుడు తనశక్తిని (మాయను) దానికార్యములను ఉపసంహరించి శక్తితోసహా శయనించిన (నిద్రించిన) నిరోధమందురు. జీవభావమును వదలుచు స్వస్వరూపమైన బ్రహ్మభావమున నునికి ముక్తియనబడును.

శ్లో॥ 192. ఆభాసశ్చ నిరోధశ్చ యతశ్చాధ్య వసీయతే ।
సఆశ్రయః పరంబ్రహ్మః పరమాత్మేతి శబ్ద్యతే ॥

భాస్క. 2. అ. 10. శ్లో. 7.

తా॥ జగత్తునకగు సృష్టిస్థితి లయాదులు యెవరి కారణమున జరుగుచున్నట్లు నిశ్చయించబడుచున్నదో యతడే ఆశ్రయము పరబ్రహ్మ పరమాత్మేత్యాది నామమున బలకబడుచున్నాడు.

123. పదునెనిమిది పురాణములకు ఉపపురాణలన్ని సంఖ్యగలవి గలవు. పురాణముల సంఖ్యను దెలుపు సాంకేతిక శ్లోకము.

శ్లో॥ 193. మద్వయం, భద్వయంచైవ, బత్రయం వచతుష్టయం ।
అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్పృథక్

తా॥ పురాణముల సంఖ్యానామములు వాని మొదటి యక్షరసంజ్ఞ (గుర్తుచే) చెప్పబడినవి. వాని వివరణమిట్లు:-

1. మ:. మత్స్యపురాణము 2. మార్కండేయ పురాణములు రెండు.

2. భ:- భాగవతము 2. భవిష్యత్ పురాణములు రెండు.

3. బ.- 1. బ్రహ్మాండపురాణము 2. బ్రహ్మపురాణము 3. బ్రిహ్మ వైవర్తము.

4. వ:- 1. వరహాపురాణము 2. వామనము 3. వాయుపురాణము 4. విష్ణుపురాణము.

5. అ:- అగ్నిపురాణము 6. న:- నృసింహాపురాణము 7. ప:- పద్మ పురాణము 8. లి:- లింగపురాణము 9. గ:- గరుడ పురాణము 10. కు:- కూర్మపురాణము 11. స్క:- స్కందపురాణము. ఇవి చతుర్దశ విద్యా సంఖ్యకు పదునొకండవది యగును. ఇతిహాసములందు మహాభారత రామాయణములు సుప్రసిద్ధములు. శ్రివనపఠనచే ధర్మపరాయణులగుదురు. ధర్మముల నుపదేశించు టలో వేదతుల్యములైనవి. కావున భారతమును పంచమ వేదమని బలుకుచున్నారు.

ఇట్లు పురాణేతిహాసకాండ సంపూర్ణము

ఓం

శ్రీ గ ణే శా య న మః

# ఆర్ష విజ్ఞాన సర్వస్వము

## ద్వితీయ గుచ్ఛము

### న్యాయ కాండము

## 1. పదార్థాదుల నిర్వచనము

124. కణాద మహర్షి జెప్పిన తర్కమును వైశేషికమని, గౌతమ మహర్షి జెప్పిన తర్కమును అన్వీక్షకీ (న్యాయ) మని, బలుకుచుందురు. అన్వీక్షకి యందు చెప్పబడిన షోడశ పదార్థములివి :-

1. ప్రమాణము 2. ప్రమేయము 3. సంశయము 4. ప్రయోజనము 5. దృష్టాంతము 6. సిద్ధాంతము 7. అవయవము 8. తర్కము 9. నిర్ణయము 10. వాదము 11. జల్పము 12. వితండము 13. హేత్వాభాసము 14. ఛలము 15. జాతి 16. నిగ్రహము.

వైశేషికమునందలి సప్త పదార్థములివి :-

1. ద్రవ్యము 2. గుణము 3. కర్మ 4. సామాన్యము 5. విశేషము 6. సమవాయము 7. అభావము. సప్త పదార్థములందు పై షోడశ పదార్థములంతర్భూతము లగుటతో రెండుగలిసి పండ్రెండధ్యాయములు గల నొకటే న్యాయశాస్త్రమనబడుచున్నది. చతుర్దశ విద్యలందు నిది పండ్రెండవ విద్యగ నేర్పడినది. న్యాయశాస్త్రరీత్యా పరీక్షించినదే ధర్మ శుద్ధి యనబడును. పరిశుద్ధమైన ధర్మము ఆచరణ యోగ్యమైనది. కావున నీ శాస్త్ర మావశ్యకమైనది. అక్షపాదులు తర్క సూత్రములను జెప్పిరి.

దానిపై వ్యాఖ్యానములు గలవు. తర్కమును గురించి సుభోదమగుటకు ఇందు వైశేషికమతానుసారముగ పదార్థాదులు, ప్రమాణములు, లక్షణాదులు సంగ్రహముగ జెప్పుచు కొన్ని యితర మతములందు జెప్పబడిన లక్షణముల నిచ్చట సులభార్థమగుటకు వెనువెంటనే దెలుపనైనది. వైశేషిక మతమందలి సప్త పదార్థముల నిర్వచనమిట్లు:-

1. ద్రవ్యము—ద్రవ్యములు తొమ్మిదియేకలవు. అవి :— 1. పృథివి 2. జలము 3. తేజస్సు 4. వాయువు 5. ఆకాశము 6. కాలము 7. దిక్కు 8. ఆత్మ 9. మనస్సు.

2. గుణము—"సామాన్యత్వేసతి, ప్రత్యేకం ద్రవ్యత్వ, కర్మత్వయోరనాధారోగుణః" ఇతి (తార్కికః) అనగా సర్వసామాన్య మగుచు ప్రత్యేకముగ జాతియందేగాని, కర్మయందేగాని ఆధారపడి యుండనిది గుణము. (2) "కర్మ వ్యతిరేకత్వేసతి జాతిమాత్రాశ్రయోగుణః" ఇతి (వేదాంతినః) అనగా కర్మవ్యతిరేకమగుచు జాతిమాత్రమును నాశ్రయించునది గుణము. పై నిర్వచనములచే ద్రవ్యమును సమవాయ కారణమని తార్కికులందురు. గుణముల కాశ్రయమైనది ద్రవ్యమని వేదాంతులందురు.

గుణములు 24 :- 1. రూపము 2. రసము 3. గంధము 4. స్పర్శ 5. సంఖ్య 6. పరిమాణము 7. పృథక్త్వము 8. సంయోగము 9. విభాగము 10. పరత్వము 11. అపరత్వము 12. గురుత్వము 13. ద్రవత్వము 14. స్నేహము 15. శబ్దము 16. బుద్ధి 17. సుఖము 18. దుఃఖము 19. ఇచ్ఛా 20. ద్వేషము 21. ప్రయత్నము 22. ధర్మము 23. అధర్మము 24. సంస్కారము లిట్లిరువదినాలుగు వైశేషిక గుణములు.

శ్లో॥ 194 రూపం గంధోరసస్పర్శ స్నేహస్సాం సిద్ధికోద్రవః ।
బుద్ధ్యాది భావనాంతాశ్చ శబ్దోవైశేషికా గుణాః ॥

3 కర్మ—"సంయోగవియోగ యోరసమవాయి జాతీయం కర్మ" అనగా సంయోగ వియోగములందు అసమవాయి కారణమైనది కర్మయనబడును.

౪. సామాన్యము—"నిత్యమనేక వృత్తి సమవేతం సామాన్యం" అనగా నిత్యమగుచు ననేక వృత్తులతో గూడియుండునది సామాన్యమనబడును.

౫. విశేషము—"నిత్యద్రవ్య వృత్త యోర్విశేషా స్తే అనంతాః" అనగా నిత్యములైన ద్రవ్యవృత్తుల విశేషములు అనంతములు.

౬. సమవాయము—"నిత్య సంబంధస్సమవాయ స్త్వేక ఏవ" అనగా విడదీయరాక ఎల్లప్పుడుండునది నిత్య సంబంధము దానిని సమవాయ మందురు. అది ఒకటే.

7. అభావము—"భావప్రతి యోగ్యభావః" అనగా భావమునకు వ్యతి రేకి అభావము. భావమనగా ఉనికి దానికి వ్యతిరిక్తమైనది అభావమని అర్థము.

25. జాతి—"నిత్యమనేక వృత్తి సామాన్యం జాతిః" అనగా నిత్య మగుచు ననేక ద్రవ్యములందు సామాన్య వృత్తి రూపముగ నుండునది జాతి యనబడును.

ఉ :- గోత్వము, మనుష్యత్వము లిత్యాదులు జాతి వాచకములు.

1. ద్రవ్యముయొక్క ధర్మము (లేక) భావము ద్రవ్యమునకు లక్షణము.
ఉ :- గంధవత్వము.

2. లక్షణముగలది లక్ష్యము ఉ :— పృథివి.

3. ఏ ధర్మముచే లక్ష్యము కూడుకొని యుండునో అది లక్ష్యతావచ్ఛే దకము ఉ :- పృథివీత్వము. దీనినే ఆశ్రయమని కూడ జెప్పుదురు. అనగా లక్ష్యమునందలి ధర్మము లక్ష్యతావచ్ఛేదకము.

4. లక్ష్యతావచ్ఛేదకావచ్ఛిన్నము (లక్ష్యతావచ్ఛేదక ధర్మముచే గూడిన లక్షణముగలది) లక్ష్యము ఉ :- పృథివి ఇది తార్కిక పరిభాష. ఇట్లే మున్ముందూహించునది.

2. సామానాధికరణ్య నిర్వచనమునందు మత భేదములు కలవు.

(1) ఒకే యధికరణమున (ఆశ్రయమునందు) ఉండు రెండు పదములు సామానాధికరణ్యములని తార్కికులందురు.

(2) ఒకే యర్థమును బోధించు రెండు పదము లొకే విభక్తి గలవియై ఒకే ఆశ్రయమునందుండిన సామానాధికరణ్యమని వైయ్యాకరణులందురు.

(3) వేర్వేరు నిమిత్తములందుపయోగించదగు శబ్దముల నొకే యర్థము నందుపయోగించుట సామానాధికరణ్యమని వేదాంతులనిరి. ఇందు ముఖ్యము, గౌణమని రెండు విధములు.

(1) వాక్యమునందుగల పదములకు తాత్పర్యాంశమున అఖండార్థమును బోధించునది ముఖ్య సామానాధికరణ్యము ఉ :- తత్ త్వం అసి.

(2) వాక్యమునందు కార్యకారణ రహితమగుచు పర్యాయపదములు గాక సంసర్గార్థమును దెలుపు పదములు గౌణీ సామానాధికరణ్యములు ఉ :- నీలం మహత్సుగంధ్యుత్పలమ్.

(3) వైయ్యధికరణ్యము="భిన్నప్రవృత్తి నిమిత్తేషు సమానశబ్దానాం భిన్నేష్వర్థేషు యాప్రవృత్తిస్సా వైయ్యధికరణ్యం" అనగా భిన్న ప్రయోజనకారణమందు సమాన పదములను విభిన్నార్థములందు ప్రయోగింపబడునవి, వైయ్యధికరణ్యము లేక భేద సామానాధికరణ్యములనబడును ఉ :- కడ్యం గృహం, సరసిజోంబుజం.

4. పర్యాయత్వము="స్వరూపతో విభిన్న వాచకానాం ఏక ప్రవృత్తి నిమిత్తేషు అనేక శబ్దప్రయోగః పర్యాయత్వం" అనగా ఒకే యర్థము నిచ్చు ననేక శబ్దముల నొకే ప్రయోజనమందుపయోగించబడినవి పర్యాయ పదములు లేక నామాంతరములు అనబడును. ఉ :- ముఖము వదనము, హస్తము కరము ఇత్యాదులు.

5. లక్షణముల నిర్వచనమిట్లు :—

(1) సామాన్య లక్షణ లక్షణము—"సజాతీయ విజాతీయ వ_స్త్వంతరేభ్యో వ్యావ_ర్తకధీ హేతుః కశ్చిదాకార విశేషోలక్షణః" అనగా సజాతీయములై_న వాని నుండిగాని, విజాతీయములై_న వాని నుండిగాని లక్ష్యవస్తు మాత్ర మును వేరుపరచునట్టి ఒకానొక ఆకార విశేషమును లక్షణమందురు. ఉ :- దండధారి, వనమాలి మొదలగునవి.

(2) స్వరూప లక్షణము—"యత్స్వాక్షాల్లక్ష్య స్వరూపేసతి అముష్య లక్ష్యాంతరాద్భేదకో భవతి తత్స్వరూపలక్షణం" అనగా నేఱుగా లక్ష్య స్వరూపమగుచు, లక్ష్యాంతరములనుండి లక్ష్యమాత్రమును వేరు జేయు నది స్వరూపలక్షణము ఉ :- సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ

(3) విశేషణ లక్షణము—"యత్సకలలక్ష్య సంబంధిత్వేసతి స్వసంబం ధాశ్రయకాలే వ్యావ_ర్తకధీజనకత్వం తద్విశేషణ లక్షణం" అనగా సకల లక్ష్య సంబంధియగుచు సంబంధాశ్రయకాలమందే లక్ష్యేతరముల నుండి లక్ష్యమాత్రమును వేఱు పఱచు బుద్ధిని గలిగించునది విశేషణ లక్షణము. ఉ :— సింహము వంటి దేవదత్తుడు.

(4) తటస్థ లక్షణము—"యత్సకల లక్ష్య సంబంధిత్వేతే సతి స్వసంబంధా నాశ్రయకాలేపి వ్యావ_ర్తకధీజనకత్వం తటస్థ లక్షణం" అనగా సకల లక్ష్య సంబంధియగుచు సంబంధాశ్రయమాత్రకాలమందే గాక ఉపలక్ష్యకముగ లక్ష్యేతరములనుండి వేఱుపఱచు బుద్ధిని గలిగించునది తటస్థలక్షణము. ఉ :— కాకిగల దేవదత్తునిల్లు.

(5) అతివ్యాప్తి లక్షణము—"లక్ష్యతావచ్ఛేదక సామానాధికరణ్యత్వే సతి లక్ష్యతావచ్ఛేదకావచ్ఛిన్న ప్రతియోగితా కభేద సామానాధికరణ్య మతి వ్యాప్తిః" అనగా చెప్పిన లక్షణము నిర్దిష్టమున కంటె తక్కినచోట్ల అదే లక్షణముండుట (అతిక్రమించి వ్యాపించుట) అతివ్యాప్తి లక్షణము

ఉ ,- కొమ్ములుగలదే ఆవు యని గోలక్షణము జెప్పినచో నట్టిలక్షణము బఱ్ఱెలందుగూడ గనుపించుటతో లక్షణమతివ్యాప్తి గలదని తాత్పర్యము.

(6) అవ్యాప్తి లక్షణము—"లక్ష్యతావచ్ఛేదక సామాధికరణ్యత్వేసతి లక్ష్యతావచ్ఛేదక సామానాధికరణ్యా స్యాత్యంతా భావ ప్రతియోగిత్వ మవ్యాప్తిః" అనగా చెప్పినలక్షణము నిర్దిష్టములందే కొన్నిచోట్లలేకుండుట అవ్యాప్తియగును. ఉ :- నీల రూపము ఆవునకు లక్షణమని జెప్పినచో తెల్లని, యెఱ్ఱని, ఆవులందే యా లక్షణము గానుపించుట లేనందున నవి యావులు గాకబోవును. కావున నీల రూపలక్షణము, నియత లక్ష్యము నందంతట వ్యాపించనందున లక్షణమునక వ్యాప్తి యనబడును.

(7) అసంభవ లక్షణము—"లక్ష్యతావచ్ఛేదక వ్యాపకీ భూతలక్ష్యే లక్షణాభావప్రతి యోగిత్వ మసంభవం" అనగా జెప్పిన లక్షణము నిర్దిష్టములందెచ్చటైననుగాని గనుపించకుండు లక్షణమును అసంభవ లక్షణ మందురు. ఉ :- ఒక డెక్క యుండునది గోవుయని గోలక్షణము జెప్పినచో గోవులన్నియు సాధారణముగ రెండు డెక్కలు గలిగినవే యుండు నందున నొక డెక్క లక్షణము ఆవులందుండజాలదు గాన ఈ లక్షణ మసంభవ మనబడును. (అప్రమాణము).

6. ప్రమాణ లక్షణము—"యేన లక్షణేనలక్ష్యే సంభావితేసతి తద వగచ్ఛతి తత్ప్రమాణం" అనగా ఏ లక్షణములచే లక్ష్యము దెలియబడునో అది ప్రమాణ మనబడును. ఇందు "మానాదీనామేయ సిద్ధిర్మాన సిద్ధిస్తు లక్షణా" యని గలదు—అనగా మానలక్షణము తోడనే మేయము దెలి యును. లక్షణము గలది మానము (ప్రమాణము). ఉ :-జోకు, కొలత, సంఖ్య మున్నగునవి మానములు. లక్షణయుక్తములైన ప్రమాణములివి:- 1. ప్రత్యక్షము 2. అనుమానము 3. ఉపమానము 4. శబ్దము 5. అర్థాపత్తి 6. అనుపలబ్ధి. పై వానిలోని నాలుగు ప్రమాణములనే తార్కికు లంగీకరించిరి. తుది రెంటిని గలుపుకొని ఆరు ప్రమాణములను వేదాంతు లంగీకరించిరి.

# 1. ప్రత్యక్షము

126. (1) "ప్రత్యక్ష ప్రమాయాః కరణం ప్రత్యక్షం".

2. "ప్రమాభూత ప్రత్యక్షాది విషయేషు చాక్షుషాధీనాం ప్రత్యక్షాత్మకం యజ్ఞానంజాయతే తత్ప్రత్యక్షమిత్యర్థః" అనగా ప్రత్యక్షజ్ఞానము గలుగుటందేది సత్ప్రమాణ సాధనమగునో అది ప్రత్యక్ష జ్ఞానమగును.

(1) నిర్దిష్టములైన రూపాది విషయములు చక్షురాదులకు నేరుగ గోచరించుటచే ఇంద్రియాదులకు గోచరమైనదే ప్రత్యక్ష జ్ఞానమందురు.

(2) "తత్ప్రతికరణం వ్యాపారవద సాధారణ కారణ మింద్రియం భవతి, తస్మాదింద్రియార్థ సన్నికర్ష జన్య జ్ఞానం ప్రత్యక్షం" అనగా ఇంద్రియాదులు వ్యాపార స్వభావములు గలవగుటచే నవి కరణములనబడును. రూపాది విషయములను గుర్తించుటయందసాధారణకారణములైనందున వానికి పదార్థ సన్నికర్ష గలదు. కావున ఇంద్రియార్థ సన్నికర్ష జన్య జ్ఞానమును ప్రత్యక్ష జ్ఞానమందురు.

(3) "ఆగంతుక భావి కారణాఽ సహకృతజ్ఞాన ప్రయోజక ప్రయోజ్యత్వం ప్రమాకరణత్వం స్వోత్పత్తౌ పరతత్వం, స్వతస్త్వంతు తాదృశ కారణాన్య మనపేక్ష్య జ్ఞాన సామాన్య ప్రయోజక ప్రయోజ్యత్వం" అనగా ప్రమాణములు రాబోవు ఆగంతుక కారణములతో సహకరించనట్టి జ్ఞానమునకు ఉపయుక్తములుగాన నవి లక్షణముల తోడనే దెలియబడును. కాని ప్రమాణములు దెలియబడినపిమ్మట యవి స్వతంత్ర సాధనములగును. ఇట్లు ప్రమాణములు జ్ఞప్తియందుండునని భావము.

127. ఇంద్రియాదులకు కరణత్వమున్నందున ఇంద్రియార్థ సన్నికర్ష జన్య జ్ఞానము ప్రత్యక్షజ్ఞానమని తార్కికు లంగీకరించిరి గాని వేదాంతులు కేవలేంద్రియార్థ సన్నికర్ష జన్య జ్ఞానము ప్రత్యక్ష జ్ఞానముగాజాలదు, ఇంద్రియార్థ సన్నికర్ష జన్యజ్ఞాన జన్యజ్ఞానము ప్రత్యక్షజ్ఞానమగునందురు.

(1) "విషయేంద్రియ సాన్నిధ్యత్వేపి మనస్సంయోగం వినా వ్యాపార వత్వం నసంభవతి । అతః బాహ్యా ప్రత్యక్షజ్ఞాన జననే మనస్సంయుక్త ఇంద్రియ వ్యాపారతఏవ కారణం" అనగా విషయాదులకు ఇంద్రియ సాన్నిధ్యముండినగాని మనస్సులేని ఇంద్రియాదులకు వ్యాపారము సంభవించదు. పూర్వానుభవస్మరణచే మనస్సు పదార్థముల నిర్ణయించును, మనస్సు నిశ్చయించని బాహ్యాపదార్థము లప్రమాణ భూతములగును. కావున మనస్సంయోగములేని కేవలేంద్రియ సన్నికర్ష జన్యజ్ఞానము ప్రత్యక్ష జ్ఞాన మనబడజాలదు.

(2) "బాహ్యావిషయ ప్రత్యక్షజ్ఞానే చక్షురాది ఇంద్రియాణా మేవ కరణత్వం" అనగా బాహ్యా విషయపదార్థ జ్ఞానమందు ఇంద్రియాదులే కరణములు.

(3) "మానస విషయ ప్రత్యక్షే ఆత్మ మనస్సంయోగస్యైవకారణత్వా న్మనస్సంయోగః కరణం" అనగా మానసిక సంకల్పాది విషయములు దెలియుటందు ఆత్మ మనస్సంయోగమే కారణమగుటతో మనస్సంయోగము గరణము.

(4) ఈశ్వర ప్రత్యక్షే అసాధారణ కారణత్వాద్జ్ఞాన కరణకజ్ఞానమేవ కరణం" అనగా ఈశ్వర ప్రత్యక్షమునం దసాధారణకారణమైనందున జ్ఞాన కరణకజ్ఞానవిశేషము కరణము.

5. చైతన్యము సర్వవ్యాపియగుటచే సామాన్యజ్ఞాన మెల్లప్పు డుండును గాన సామాన్య జ్ఞానము విశేషజ్ఞానమునకు కరణ మనబడును.

6. "సర్వమూర్త ద్రవ్య సంయోగిత్వం విభుత్వం" అనగా మూర్త ద్రవ్యము లన్నిటియందు సంయుక్తమై, వ్యాపకమైనది విభువు.

7, "క్రియాశ్రయత్వం మూర్తత్వం" అనగా క్రియకాశ్రయమైనది మూర్తము. పృథివి, జలము, అగ్ని, వాయువు, మనస్సు లివేమూర్తములని తార్కికులందురు.

8. ప్రత్యక్షమునకు విషయమైన దానిని గ్రాహ్యమందురు.

9. ఇతర వ్యావర్తన చేయుచు నిర్ధారణ జేయుటందు "మాత్ర" పదము నుపయోగింతురు. (కేవల పదము వంటిది).

10. ఉపలబ్ధిని సాక్షాత్కారమందురు.

11. పృథివ్యాపస్తేజోవాయురాకాశములు, భూతపంచకములు.

12. బహిరింద్రియగ్రాహ్యములు, భూతోత్పన్నములు, భౌతికములు.

13. సంబంధములు మూడు విధములు :-

(1) సంయోగము—అనగా అవయవ సహితములగు ద్రవ్యములకూడిక. ఉ :- దారములకూడిక (వస్త్రము).

(2) సమవాయము—అనగా నిత్య సంబంధము. ఉ :- వస్త్రమునకు, నందలి రూపమునకు గల సంబంధము.

(3) తాదాత్మ్యము—అనగా విడదీయరాని సంబంధము. ఉ :- అగ్ని యందలి వేడిమి. వేదాంతులంగీకరించిన 4వ సంబంధమిది.

"అధ్యాస" అనగా అదికాని దానియందు అదియను బుద్ధి. ఉ :- శుక్తిక యందు రజితమను బుద్ది ఉ:-2 రజ్జువునందు సర్పమను బుద్ధిఇత్యాదులు.

14. న్యాయసిద్ధమైన బాధ గలిగినప్పుడు నిరూపించ శక్యముగానిది మిథ్య యనబడును.

## ద్రవ్యాదుల లక్షణములు

128. "పృథివ్యాపస్తేజోవాయుర్ద్వివిధం । నిత్యమనిత్యం । నిత్యం పరమాణురూప మనిత్యం కార్యరూపం । శరీరేంద్రియ విషయభేదాత్"

(1) పృథివి—"గంధవతీ పృథివీ, గంధవత్వం పృథివ్యాః లక్షణం । శరీర మస్మదాదీనాం । ఇంద్రియం గంధగ్రాహక ఘ్రాణకరణం । తచ్చనాసాగ్రవర్తి విషయో మృత్పాషాణాదిః" అనగా గంధవత్వము (గంధమును

కల్గియుండుట) పృథివికి లక్షణము. దానిని గ్రహించునది ఘ్రాణేంద్రియము, (నాసిక) గంధ గ్రాహకశక్తి నాసికాగ్రముననుండును. మట్టి, ఱాలు పృథ్వికి విషయములు. శరీరమునకుగల స్థూలదేహము. పృథ్వి పరమాణువులు నిత్యములు. వానికార్యరూపము లనిత్యములు.

(2) ఆపః—"శీతవత్త్వేసతి స్పర్శవత్త్వమపాం లక్షణం శీతవత్వ స్పర్శవత్త్వం లక్షణం । శరీరం వరుణలోకే ఇంద్రియం రసనగ్రాహక రసనేంద్రియం । తచ్చజిహ్వాగ్రవర్తి । విషయో సరిత్సముద్రాః" అనగా చల్లదనముతో కూడినదగుచు స్పర్శకలిగియుండుట జలమునకు లక్షణము. జలశరీరము వరుణలోక మందుండును. రసమును గ్రహించు రసనేంద్రియము కరణము అది నాలుకచివరనుండును. జలమునకు సరోవర సముద్రాదులు విషయములు. జలపరమాణువులు నిత్యములు, కార్యరూపము లనిత్యములు.

(3) అగ్నిః—"ఉష్ణవత్త్వేసతి స్పర్శవత్త్వంతేజసః లక్షణం । శరీరమాదిత్య లోకే । ఇంద్రియం చక్షుః । తచ్చకృష్ణ తారాగ్రవర్తి । విషయశ్చతుర్విధః। భౌమ, దివ్య, ఔదర్య, ఆకరజః । భౌమంవహ్న్యాది । దివ్యమబింధన విద్యుతాది । భుక్తస్యపరిణామ హేతురౌదర్యం । ఆకరజంద్రుత సువర్ణాదినః" అనగా తేజస్సునకు ఉష్ణత, స్పర్శయు, లక్షణములు ఇట్టి లక్షణములుగలది అగ్ని. చక్షురింద్రియము కరణము. శరీరమాదిత్య లోకమునందుండును. విషయములు నాలుగువిధములు—భూమియందు అగ్ని మొదలగునవి. ఆకసమునందు మెఱుపులు మొదలగునవి. ఉదరములందు జాఠరాగ్ని రూపము. సువర్ణాది ధాతువులందు ద్రవరూపముగ నుండునది ఆకరజము. తేజఃపరమాణువులు నిత్యములు. కార్యరూపము లనిత్యములు.

(4) వాయువు—"రూపరహితత్వేసతి స్పర్శవత్త్వం వాయోః లక్షణం । శరీరం వాయులోకే । ఇంద్రియం స్పర్శగ్రాహకత్వక్ । సర్వశరీర వృత్తిః । విషయోర్వృక్షాది కంపన హేతుర్వాయుః । శరీరాంతర సంచారీవాయుః ప్రాణమితి వ్యవహ్రియతే । సచైకోపి కార్యరూప

ఓం

శ్రీ గణేశాయ నమః

# ఆర్ష విజ్ఞాన సర్వస్వము

## ద్వితీయ గుచ్ఛము

## న్యాయ కాండము

## 1. పదార్థాదుల నిర్వచనము

124. కణాద మహర్షి జెప్పిన తర్కమును వైశేషికమని, గౌతమ మహర్షి జెప్పిన తర్కమును అన్వీక్షకీ (న్యాయ) మని, బలుకుచుందురు. అన్వీక్షకి యందు చెప్పబడిన షోడశ పదార్థములివి :-

1. ప్రమాణము 2. ప్రమేయము 3. సంశయము 4. ప్రయోజనము 5. దృష్టాంతము 6. సిద్ధాంతము 7. అవయవము 8. తర్కము 9. నిర్ణయము 10. వాదము 11. జల్పము 12. వితండము 13. హేత్వాభాసము 14. ఛలము 15. జాతి 16. నిగ్రహము.

వైశేషికమునందలి సప్త పదార్థములివి :-

1. ద్రవ్యము 2. గుణము 3. కర్మ 4. సామాన్యము 5. విశేషము 6. సమవాయము 7. అభావము. సప్త పదార్థములందు పై షోడశ పదార్థములంతర్భూతము లగుటతో రెండుగలిసి పందొ్రండధ్యాయములు గల నొకచే న్యాయశాస్త్రమనబడుచున్నది. చతుర్దశ విద్యలందు నిది పంద్రెండవ విద్యగ నేర్పడినది. న్యాయశాస్త్రరీత్యా పరీక్షించినదే ధర్మ శుద్ధి యనబడును. పరిశుద్ధమైన ధర్మము ఆచరణ యోగ్యమైనది. కావున నీ శాస్త్ర మావశ్యకమైనది. అక్షపాదులు తర్క సూత్రములను జెప్పిరి.

కల్గియుండుట) పృథివికి లక్షణము. దానిని గ్రహించునది ఘ్రాణేం ద్రియము, (నాసిక) గంధ గ్రాహకశక్తి నాసికాగ్రముననుండును. మట్టి, ఱాలు పృథ్వికి విషయములు. శరీరమునకుగల స్థూలదేహము. పృథ్వి పరమాణువులు నిత్యములు. వాని కార్యరూపము లనిత్యములు.

(2) ఆపః—"శీతవత్వేసతి స్పర్శవత్వమపాం లక్షణం శీతవత్వ స్పర్శవత్వం లక్షణం। శరీరం వరుణలోకే ఇంద్రియం రసనగ్రాహక రసనేంద్రియం। తచ్చజిహ్వాగ్రవర్తి। విషయో సరిత్సముద్రాః" అనగా చల్లదనముతో కూడినదగుచు స్పర్శకలిగియుండుట జలమునకు లక్షణము. జలశరీరము వరుణలోక మందుండును. రసమును గ్రహించు రసనేంద్రియము కరణము అది నాలుకచివరనుండును. జలమునకు సరోవర సముద్రాదులు విషయములు. జలపరమాణువులు నిత్యములు, కార్యరూపము లనిత్యములు.

(3) అగ్నిః—"ఉష్ణవత్వేసతి స్పర్శవత్వం తేజసః లక్షణం। శరీరమాదిత్య లోకే। ఇంద్రియం చక్షుః। తచ్చకృష్ణ తారాగ్రవర్తి। విషయశ్చతుర్విధః భౌమ, దివ్య, ఔదర్య, ఆకరజః। భౌమంవహ్న్యాది। దివ్యమబింధన విద్యు తాది। భుక్తస్యపరిణామ హేతురౌదర్యం। ఆకరజంద్రుత సువర్ణాదినః" అనగా తేజస్సునకు ఉష్ణత, స్పర్శయు, లక్షణములు ఇట్టి లక్షణములుగలది అగ్ని. చక్షురింద్రియము కరణము. శరీరమాదిత్య లోకమునందుండును. విషయములు నాలుగువిధములు—భూమియందు అగ్ని మొదలగునవి. ఆక సమునందు మెఱుపులు మొదలగునవి. ఉదరములందు జాఠరాగ్ని రూపము. సువర్ణాది ధాతువులందు ద్రవరూపముగ నుండునది ఆకరజము. తేజఃపరమాణువులు నిత్యములు. కార్యరూపము లనిత్యములు.

(4) వాయువు—"రూపరహితత్వేసతి స్పర్శవత్వం వాయోః లక్షణం। శరీరం వాయులోకే। ఇంద్రియం స్పర్శగ్రాహకత్వక్। సర్వశరీర వృత్తిః। విషయోర్వృక్షాది కంపనహేతుర్వాయుః। శరీరాంతర సంచారీవాయుః ప్రాణమితి వ్యవహ్రియతే। సచైకోపి కార్యరూప

భేదేన పంచవిధః । ప్రాణః, అపానః, వ్యానః, ఉదానః, సమానః'' = అనగా రూపరహితమగుచు స్పర్శగుణముగలది వాయువు. రూపరాహిత్యము, స్పర్శగుణము వాయులక్షణములు. సర్వవ్యాపియగు త్వగింద్రియము (చర్మము) స్పర్శను గ్రహించునది కరణము, వాయుతత్వమునకునికి వాయులోకము. శరీరాంతర్భాగమందు సంచరించు వాయువునకు ప్రాణమనిపేరు. కార్యరూపములైన ప్రాణభేదములైదు. ఇవి:— 1. ప్రాణము 2. అపానము 3. వ్యానము 4. ఉదానము 5. సమానము. వాయుకారణమున వృక్షాదులు చలించునందున వృక్షాదులు విషయములు. వాయుపరమాణువులు నిత్యములు. కార్యరూపము లనిత్యములు.

(5) ఆకాశము=''శబ్దగుణక మాకాశం । తచ్చైకో విభుర్నిత్యంచ'' అనగా శబ్దగుణముగలది ఆకసము. అదొక్కటే వ్యాపకము, నిత్యమనబడును.

(6) కాలః=''అతీతాది వ్యవహార హేతుః కాలః, సచైకోవిభుర్నిత్యశ్చ''=అనగా భూత భవిష్యద్వర్తమాన కాల వ్యవహార సాధనమైనది కాలము. అది యొకటి, వ్యాపకము, నిత్యము.

(7) దిక్=''ప్రాచ్యాది వ్యవహార హేతుర్దిక్, సాచైకా, విభ్వీ, నిత్యాచ'' అనగా తూర్పు మున్నగు దిశల వ్యవహార కారణమగునది దిక్కు. అది ఒకటి, వ్యాపకము, నిత్యము.

(8) ఆత్మా=''జ్ఞానాధికరణ మాత్మా । సచ ద్వివిధః । జీవాత్మా, పరమాత్మాచ. ఈశ్వర స్సర్వజ్ఞః పరమాత్మా । సచైకోవిభుర్నిత్యశ్చ । జీవాత్మాతు ప్రతిశరీరేభిన్నో నిత్యః''=అనగా జ్ఞానమున కాధారము. ఆత్మ. అది రెండు విధములు. 1. జీవాత్మ 2. పరమాత్మ. పరమాత్మయొకడే సర్వేశ్వరుడు, సర్వజ్ఞుడు, వ్యాపకుడు, నిత్యుడు. ప్రతి శరీరములందు జీవాత్మ వేరు వేరుగనుండును. కాని నిత్యుడు.

(9) మనః="సుఖదుఃఖాది సాధనమింద్రియం మనః పరమాణురూపం నిత్యంచ"=అనగా సుఖ దుఃఖాది సాధనమగు నింద్రియము మనస్సు. అది ప్రతియాత్మయందు నియతముగ నుండుటచే ననంతమనబడును. పరమాణురూపము గలది.

## 2. గుణముల నిర్వచనము

(1) రూపము="చక్షురింద్రియ గ్రాహ్యగుణోరూపం। చక్షుర్భి న్నేంద్రియాఽవిషత్వేసతి, చక్షుర్మాత్రేంద్రియ విషయత్వం రూపస్య లక్షణం। సచసప్త విధః। శుక్ల, నీల, పీత, రక్త, హరిత, కపిశ, చిత్ర, భేదేన పృథివ్యాం సప్తవిధః। జలేతు అభాస్వర శుక్లం। భాస్వరశుక్లం తేజసి। పృథివ్యప్తే జోవృత్తయః" అనగా చక్షువు కాని ఇతరేంద్రియము లకు అవిషయమగుచు చక్షురింద్రియ మాత్రగోచరమైనది రూపము. అది ఏడు విధములైనవివి:- 1. తెలుపు 2. నలుపు 3. ఎరుపు 4. ఆకుపచ్చ 5. పసుపు 6. బూడిదరంగు 7. చిత్రవర్ణము పృథ్వి యందేడు వర్ణము లుండును. జలమునందు ప్రకాశ రహితవర్ణము. అగ్నియందు ప్రకాశ మాన వర్ణములుండును. రూపవృత్తులు పృథివి జలము, తేజస్సు లందుండును.

(2) రసః="రసనగ్రాహ్య గుణోరసః। సచషడ్విధః। మధు, రామ్ల, లవణ, కటు, కషాయ, తిక్తః। పృథివీ జలవృత్తయః। పృథివ్యాం షడ్విధః। జలేతు మధుర ఏవ"=అనగా జిహ్వేంద్రియముచే గ్రహించు గుణము రసము। అది యారువిధములైనది= :- 1. తీపి 2. పులుపు 3. ఉప్పు 4. చేదు 5. వగరు 6. కారము. పృథ్వియందారు విధములగు గుణములుండును. జలమునందొకటే మధురరసముండును.

(3) గంధః="ఘ్రాణగ్రాహ్య గుణోగంధః। సచద్వివిధః। సురభిర సురభిశ్చేతి. పృథివ్యామేవ గంధగుణః। పృథివీ మాత్రవృత్తిః" అనగా అనగా నాసికచే గ్రహింపనగు గుణము గంధము. అది సువాసన, దుర్వాస

నలని రెండువిధములు. గంధగుణ మొక పృథివియందేగలదు. గంధ వృత్తు లొకపృథివియందే యుండును,

(4) స్పర్శః="త్వగింద్రియమాత్ర గ్రాహ్యోగుణః స్పర్శః। స్పర్శవ త్వంత్వచోలక్షణం। సచత్రివిధః। శీతః, ఉష్ణః, అనుష్ణా శీతః. పృథి వ్యప్తే జోవాయువృత్తయః। శీతంజలే, ఉష్ణంతేజసి। అనుష్ణా శీతంపృథివీ వాయ్వోః. అనగా త్వగింద్రి మాత్రముననే గ్రహించు గుణముస్పర్శ. త్వక్కునకు స్పర్శగుణమే లక్షణము. స్పర్శగుణములు మూడు:- 1. శీతము 2. ఉష్ణము 3. శీతోష్ణరహితము. స్పర్శవృత్తులు పృథివి, వాయువు లందుండును.

129. "రూపాది చతుష్టయం పృథివ్యాం పాకజమనిత్యం। అన్యత్రనిత్య గతంనిత్య, మనిత్యగతమనిత్యం. పాకోనామ విజాతీయ తేజస్సంయోగః। విజాతీయ తేజస్సంయోగ వశాదేవరూప, రస, గంధ, స్పర్శయోర్వి లక్ష ణత యాపూర్వరూనాదీ న్పరిత్యజ్యాన్యతర రూపాదీనా ముత్పత్తిర్భవతి. యథామ్రిఫలం తృణనిక్షిప్తేసతి పూర్వరూప హరితాదీన్పరిత్యజ్య పీతా ద్యన్యతర రూపాదీ నుత్పద్యంతే! తథాగోభుక్త తృణపుంజాన్యా పరమా ణ్వంతం భక్త్వా విజాతీయతేజస్సం యోగాద్దుగ్ధే యాదృశ పరమాణుర్వ ర్తతే తాదృగ్రూప పరమాణుర్భ్యాత్వాద్వ్యణుకాది క్రిమేణ మహాదు గ్ధారంభః ఏవమేవ దధ్యాది నవనీతాంతమూహ్యాం। ఉక్తప్రకారేణ యథా రూపపరివర్తనంతథా విజాతీయ తేజస్సంయోగ వశేనరస, స్పర్శాదిగుణై రపిపూర్వగుణాఽమ్ల కఠినత్వాదీన్ప రిత్యజ్యనవీన మధు, మృదుత్వాది రుత్పద్యంతే" అనగా పృథివినుండి పాకజనితములైన రూప, రస, స్పర్శ గుణములు అనిత్యములేకాని ఇతరనిత్యములనుండి బుట్టునవి నిత్యములగును అనిత్యములచే జనించునవి అనిత్యములు. విజాతీయతేజస్సం యోగమును పాకమందురు. దానిచే రూప, రస, గ్రంథములు విలక్షణగుణములుగా మారును. అనగా వస్తువులందు పూర్వమున్న పులుపు, కాఠిన్యము మొదలైన రసరూపములుమారి క్రొత్తవగుతీపి, మృదుత్వాదిగుణము లేర్ప

డును. ఎట్లన మామిడికాయను గడ్డిలో నుంచినప్పుడు విజాతీయతే జస్సంయోగముచే (గడ్డిగుణముచే) ఆ కాయకుగల పులుపు, కఠినత్వము, ఆకుపచ్చదనములు మారి నూతనములైన తీపి, మృదుత్వము, పసుపురంగులు గనుపడును. ఇదేవిధముగ ఆవు మేసినగడ్డి ఆవు జఠరాగ్నిచే పాకమగుచు అణువగువరకునశించి మరల పాలరూపాణువులై ద్వ్యణుకాది క్రమముగ పాలు, పెరుగు, వెన్న మొదలగునవి యేర్పడును. ఇట్లొక వస్తువు భిన్నవస్తు సంసర్గముచే తన పూర్వరూపాది గుణములనువిడిచి క్రొత్త రసాది వర్ణ్నెలచే నొప్పారుచుండును. దీనినే పాకక్రియయందుము.

(5) సంఖ్య=“ఏకత్వాది వ్యవహార హేతుస్సంఖ్యా। నవద్రవ్యవృత్తిః। ఏకత్వాది పరాంతవర్తతే ద్విత్వాదికంతు సర్వదా అనిత్యం” అనగా వ్యవహార నిర్వర్తన కారణము సంఖ్య। అది యొకటి మొదలుకొని పరాంత పర్యంత ముపయుక్తమైనది. సంఖ్యావృత్తులు నవద్రవ్యములందుండును. సంఖ్యయందలి ఒకటవసంఖ్య నిత్యము. రెండు మొదలుకొని సంఖ్యలన్నియు అనిత్యములు.

(6) పరిమాణము=“మానవ్యవహార కారణం పరిమాణం। నవద్రవ్యవృత్తయః” అనగా వ్యనహారమునందు ప్రమాణ భూతమైనది పరిమాణము. ఉ:- (బోకు, కొలత మొదలగునవి) దీనివృత్తులు నవద్రవ్యము లందుండును.

(7) పృథక్త్వము=పృథక్కరణము అనగా ద్రివ్యాదులను వేరువేరుగ నిరూపించునట్టిది పృథక్త్వ లక్షణము.

(8) సంయోగము=“సంయుక్తవ్యవహార హేతుస్సంయోగః। సర్వద్రివ్యవృత్తయః”. అనగా వ్యవహారమునందు సావయవ ద్రివ్యాదులు కూడుకొనినవని దెలియుటకు కారణమైనది సంయోగమనబడును. సర్వద్రవ్యములందు సంయోగవృత్తులుండును.

(9) విభాగము=సంయోగమును విడదీయు లక్షణము విభాగమన బడును.

(10, 11) పరత్వాపరత్వములు=పరాపర వ్యవహార సాధారణ కారణే పరాపరత్వం। సచదిక్కృతేచ, కాలకృతే నచ, ద్వివిధః। సమీపదిక్కృతే, జేష్ఠ కాలకృతే పరత్వం. దూరస్థదిక్కృతే, కనిష్ఠ కాలకృతే అపరత్వం'' అనగా వ్యవహారమునందు ముందు వెనుకలని సాధారణ కారణము దెలియుట యందు పరాపరము లుపయోగింతురు. అవి రెండు విధములు. సమీప దిశనేగాని, మొదటికాలమునేగాని జెప్పుటకు పరశబ్దముపయోగింతురు. దూరదిశనుగాని, తరువాత కాలమునుగాని, జెప్పుటకు అపరశబ్ద ముపయోగింతురు.

(12) గురుత్వము="ఆద్యపతనసమ వాయకారణం గురుత్వం''. పతనన్నామ అధోదేశ సంయోగానుకూల క్రియ. అనంతర పతనాదిషు వేగస్యైవ కారణం'' అనగా బరవుకారణముచే మొదట పడిపోవుటందు నిత్యసంబంధమున కనుకూలమైన క్రియను (పనిని) గురుత్వమందురు. పల్లమునను సరించుట కనుకూలమై పనిని పతనమందురు. తరువాతనగు పతనములందు వేగమే కారణమనబడును.

(13) ద్రవత్వము="సాంసిద్ధికం, నైమిత్తిక మితి ద్రవత్వం ద్వివిధః పృథివి, జల, తేజోవృత్తయః. సాంసిద్ధికంజలే। నైమిత్తికం పృథివీ తేజసి దృతంసువర్ణాదౌ, పృథివ్యాం ఘృతాదావాగ్నిసంయోగజం నైమిత్తిక ద్రవత్వం'' అనగా ఆర్ద్రగుణముగలది ద్రవము. జలమునందలి ద్రవగుణము స్వతస్సిద్ధమైనది. పృథివీ తేజస్సులందుగల ద్రవగుణము నైమిత్తికము. ఎట్లన సువర్ణాది ధాతువుల కరుగునప్పుడు, పృథివి యందును, నేతిముద్ద మొదలగు వానియందును అగ్ని సంపర్కమున గలిగిన ద్రవత్వము నైమిత్తికమనబడును.

(14) స్నేహము="చూర్ణాది పిండీభావన హేతుర్గుణస్స్నేహః। జల మాత్రవృత్తిః। ధారణకర్షణ హేతుభూత విలక్షణ సంయోగో పిండీ

భావః । తాదృశ సంయోగస్స్నేహస్యైవాఽ సాధారణ కారణం నతు కేవల జలాదిగత ద్రవత్వం వస్తుతస్తు ద్రుతజల సంయోగస్య పిండీభావన హేతుత్వం । నతు కేవలస్నేహస్య" అనగా పిండిమొదలగు చూర్ణద్రవ్యము లను ముద్దగా నొనర్చుటందు స్నేహము కారణముగాన నీగుణము స్నేహమునందసాధారణమైనది. కేవల జలద్రవమునందీ గుణములేదు. కాని చమురు, నీరు గలసిననే పిండీభావనగుట వాస్తవమైనది గాన కేవల స్నేహమునందైనను ఇట్టి గుణముండదు.

(15) శబ్దము—"శ్రోత్రగుణశ్శబ్దః । సచద్వివిధః । ధ్వన్యాత్మకో భేర్యాది । వర్ణాత్మకో సంస్కృతాది భాషారూపః తృతీయభేదో అపివర్తత ఇతి శ్రుతః । యథావంశే పాట్యమానే పటపటశబ్దో జాయతే సవియోగ భోభవతి" అనగా శ్రోత్రేంద్రియముచే గ్రహింపబడునది శబ్దము. అది భేర్యాదులందు ధ్వనిరూపముగ, సంస్కృతాదిభాషలందు వర్ణరూపముగ నుండును. వెదురు చీల్చునప్పుడు పటపటధ్వని గలుగును. అది వియోగజమను మూడవ భేదమనబడును.

(16) బుద్ధిః—"సర్వవ్యవహార హేతుర్జ్ఞానం బుద్ధిః । తచ్చస్మృత్యనుభవరూపేణ ద్వివిధం । జ్ఞానం వినాశబ్దః ప్రయోగాఽసంభవాచ్ఛబ్ద ప్రయోగ రూపవ్యవహారహేతు ర్జ్ఞానంబుద్ధి రిత్యర్థః । తచ్చచతుర్విధః ప్రత్యక్షం, వ్యాప్తిః సాదృశ్యం, పదజ్ఞానమితి తన్నామ్నాకరణమపిచ తుర్విధం । ప్రత్యక్ష, మనుమానోపమానం, శాబ్దమితి" అనగా సమస్త వ్యవహారకారణమైన జ్ఞానమునే బుద్ధియందురు. అది స్మృత్యనుభవము లతో రెండువిధములైనది. జ్ఞానములేనిదే శబ్దప్రయోగముల జేయ జాలము. గావున శబ్ద ప్రయోగరూప వ్యవహార కారణమగు జ్ఞానము బుద్ధియనబడును. అది ప్రత్యక్షము, వ్యాప్తి, సాదృశ్యము, పదజ్ఞానము లని నాల్గువిధములైనది. వాని నామములతోడ కరణములుండును. అవి:— 1. ప్రత్యక్షము 2. అనుమానము 3. ఉపమానము 4. శాబ్దము.

(1) స్మృతిలక్షణము="బహిరింద్రియసన్నికర్ష జన్యత్వే సతి తత్సంస్కార జన్యవిశిష్టజ్ఞానవత్వంస్మృతేర్లక్షణం" అనగా బహిరింద్రియములతో విషయాది సన్నికర్షచే జనించినదగుచు దాని సంస్కారములతో బుట్టిన విశిష్టధర్మము స్మృతికి లక్షణము.

(2) అనుభవము = "బహిరింద్రియ ప్రత్యక్షజ్ఞాన జన్యత్వేన పూర్వ సంస్కారమాత్ర జన్యజ్ఞానమనుభవం" అనగా బహిరింద్రియములతో విషయాది సన్నికర్షచే బుట్టిన ప్రత్యక్షజ్ఞానమే, పూర్వసంస్కార మాత్రమున గలిగినట్టిది అనుభవమగును.

(3) ప్రత్యభిజ్ఞా="బహిరింద్రియ ప్రత్యక్షజ్ఞాన జన్యత్వేసతి తత్సంస్కార మాత్ర జన్యజ్ఞానం ప్రత్యభిజ్ఞా" అనగా చక్షురాదీంద్రియ ప్రత్యక్ష జ్ఞానమున బుట్టినదగుచు దాని సంస్కారములతోడ జనించిన జ్ఞానము ప్రత్యభిజ్ఞ యనబడును.

(4) "అనుభవ జ్ఞానంద్వివిధం । యథార్థోఽయథార్థః । తన్నిష్ఠ విశేష్యతా నిరూపితతన్నిష్ఠ ప్రకారకత్వేసతి అనుభవత్వం యథార్థానుభవస్య లక్షణం" అనగా అనుభవము యథార్థమని అయథార్థమని రెండువిధములు యథార్థానుభవము (జ్ఞానము) ప్రమయనబడును. ఉ:- రజితమునందు రజిత జ్ఞానము యథార్థమైన అనుభవజన్యజ్ఞానము.

(5) "తదభావనిష్ఠ విశేష్యతా నిరూపిత తన్నిష్ఠప్రకార కత్వేసతి అనుభవం అయథార్థాను భవస్యలక్షణం సైవభ్రమా" అనగా శుక్తికయందు రజిత జ్ఞానము గలిగినదానిని అయథార్థానుభవ జ్ఞానమందురు. ఇదే భ్రమయనబడును.

(6) "ప్రత్యక్షాది చతుర్విధ ప్రమాణేషు ప్రమాకరణత్వం, ప్రమాకరణస్య లక్షణః" అనగా పైజెప్పిన ప్రత్యక్షము మొదలగు నాలుగు విధములైన ప్రమాణములందు యథార్థానుభవమును గలిగించునట్టి జ్ఞానమును ప్రమాకరణమందురు.

(7) కరణము="కార్యత్వాతిరిక్త ధర్మావచ్ఛిన్న కార్యతా నిరూపిత కారణత్వం కరణస్య లక్షణం". అనగా కార్యమునకంటెను వేరై కార్యమును మాత్రము నిరూపించు కారణమగునది కరణము. ఉ:- దండము ఘటమునకంటె వేరైనదగుచు చక్రిముదిరిప్పుటకు తోడ్పడు సాధన మాత్రిమై ఘటకార్యసిద్ధికి ప్రకృష్టోపకారకము కావున దండము కరణము.

(8) కార్యము="ప్రాగభావ ప్రితియోగిత్వేసతి కారణజన్యం కార్యస్య లక్షణం" అనగా ప్రాగభావమునకు విరుద్ధమైనదై (కార్యసిద్ధిని గురించి జేయుపూర్వరూపములైన ప్రయత్నాదులు) కారణజన్యము కార్యమనబడును.

(9) కారణము="యస్మాత్కార్యం సముత్పద్య తే సకారణం" అనగా దేనినుండి కార్యముబుట్టునో యది కారణమనబడును.

(10) కారణము రెండువిధములు. 1. సాధారణము 2. అసాధారణము. ఈశ్వరాదులు సాధారణ కారణము. ఆది శబ్దమునకు దిక్కాలాదులర్థము. ప్రయత్నాదుల సాధారణ కారణములు.

(11) "సన్నికర్షలు=సంయోగసన్నికర్ష 2. సంయోగ సమవాయ సన్నికర్ష 3. సంయోగ సమవాయ, సమవాయ సన్నికర్ష 4. అభావ సన్నికర్షలను భేదముచే సన్నికర్షలు నాలుగు విధములు.

(12) "విషయతలు"=1. ఉద్దేశాఖ్యతా 2. సంసర్గతాఖ్యతా 3. ప్రకారకాఖ్యతా 4. శూన్యతా ఖతాయని విషయతలునాలుగు.

(13) చక్షువుతో విషయతా సంబంధముచే సంయోగించునది సంయోగ సన్నికర్షము.

(14) చక్షువుతో విషయతా రూపముచే (ఘటరూపముచే) సంబంధము కలుగునది సంయోగ సమవాయ సన్నికర్షము.

(15) చక్షువుతో విషయతా రూపత్వముచే (ఘటరూపత్వముచే) సంబంధము గలుగునది సంయోగ సమవాయ సమవాయ సన్నికర్షము. అనగా

(1) ద్రవ్యవృత్తులు లౌకిక విషయతా సంబంధముచే చక్షుర్నిరూప్యములు (ద్రవ్యములు వెలుగుననున్నప్పుడే చక్షువు ద్రవ్యమును గుర్తించగల్గును) కావున చక్షువుతో ద్రవ్యమున కగు సంబంధమునందు సంయోగ సన్నికర్ష ఉపయోగించును.

(2) ద్రవ్యరూప వృత్తులు లౌకిక విషయతా సంబంధముచే చక్షుర్నిరూప్యములు (ద్రవ్యరూపములు వెలుగున నున్నప్పుడే చక్షువు ద్రవ్యరూపమును గుర్తించ గలుగును) కావున చక్షువుతో ద్రవ్యరూపమున కగు సంబంధమునందు సంయోగ సమవాయ సన్నికర్ష ఉపయోగించును.

(3) ద్రవ్యరూపత్వము (జాతి) లౌకిక విషయతా సంబంధముచే చక్షుర్నిరూప్యము (ద్రవ్యరూపత్వము వెలుగున నున్నప్పుడే చక్షువునకు దెలియబడును) కావున చక్షువుతో ద్రవ్యరూపత్వమునకగు సంబంధమునందు సంయోగ సమవాయ సమవాయ సన్నికర్ష ఉపయోగించునని తాత్పర్యము.

(16) పైజెప్పిన సన్నికర్షలకు విషయతా సంబంధముండినను మనస్సంయోగము లేకున్న ఇంద్రియాదులకు వ్యాపారత్వము సంభవించదు కావున మనస్సంయోగమే ముఖ్యము. ఇందులకై మానసిక విషయ ప్రత్యక్షము నందు ఆత్మమనస్సంయోగమునకై మొదట సన్నికర్ష ఉపయోగము.

(17) సుఖాది ప్రత్యక్షమునందు రెండవ సన్నికర్ష ఉపయోగించును.

(18) సుఖత్వాది (సుఖదుఃఖ జాతి) ప్రత్యక్షమునందు మూడవ సన్నికర్ష ఉపయోగించును.

(19) చక్షువు, త్వక్కు, మనస్సు ఈ మూడింద్రియములే ద్రవ్యతద్గత రూప, జాత్యాదులను గ్రహింపగల్గినవి తక్కిన విట్లు;—

1. ఘ్రాణేంద్రియము=గంధమును తద్గత జాతిని
2 రసనేంద్రియము=రసమును తద్గత జాతిని
3. శ్రోత్రేంద్రియము=శబ్దమును తద్గత జాతిని

}= మాత్రములనే

గ్రహింపగల్గినవి కావున వీనిచే గుణాదుల గ్రహించు టందు రెండవ సన్నికర్ష తోడ్పడును.

(20) శ్రవణేంద్రియ మాకాశరూపము (అవకాశమిచ్చు రూపముగలది) శబ్దమాకాశ గుణము కావున శబ్దాకాశములు, గుణగుణులు అనగా ఆకాశము గుణి, శబ్దము గుణము. "గుణగుణినోర్సమవాయ" మను న్యాయముచే సమవాయ సన్నికర్ష యను నైదవ సన్నికర్షగలదు దాని నుపయోగింతురు. ఇట్లు శబ్దజాతి గ్రహణమునందు సమవాయ సమవాయ సన్నికర్ష యుపయోగమగును.

(21) శూన్యతాఖ్య విషయతా=దీనికే అభావ సన్నికర్ష విశేషణ విశేష్యతా సన్నికర్షలను నామాంతరములు. దీనిని గ్రహించుటందు సంయుక్త విశేషణ విశేష్యతా 2 సంయుక్త సమవేత విశేషణ విశేష్యతా 3 సంయుక్త సమవేత సమవేత విశేషణ విశేష్యతా యను సన్నికర్షలు ఉపయోగింతురు. వీనికి ఉదాహరణ లిట్లు:—

1. ఘటాభావ ప్రత్యక్షమునందు మొదటిది.

2. ఘటరూపాభావ ప్రత్యక్షమునందు రెండవది.

3. ఘటరూపత్వాభావ ప్రత్యక్షమునందు మూడవది.

(22) ప్రత్యక్షజ్ఞానము సవికల్ప, నిర్వికల్ప భేదములచే రెండు విధములివి:—

1. సవికల్పము=సప్రకారక జ్ఞానము.

2. నిర్వికల్పము=నిష్ప్రకారక ము.

130. విషయతను నిరూపించునది జ్ఞానమగుటచే జ్ఞానము నిరూపకమన బడును. కావునవిషయతా నిరూపణమునందు జ్ఞానకారణమున నే ప్రకారము దెలియబడును ఇట్లు ప్రకారతా జ్ఞానము సవికల్పమనబడును. ఈ విధము న నే విశేష్యప్రకారము, సంసర్గప్రకారముల జ్ఞానము సవికల్పమునందంశ ర్భూతములు. నిర్వికల్పమునందు మొదటి మూడు విషయతలలోనే దొకటియు జేరనందున నిర్వికల్పము నిష్ప్రకారక జ్ఞానమనబడినది. నిర్వి కల్పమునందు శూన్యతాఖ్యమను నాల్గవ విషయతను స్వీకరించరని తాత్పర్యము.

ప్రత్యక్షప్రమాణము సమాప్తము

## 2. అనుమానము

131. "అనుమితికరణ మనుమానం ప్రమాణం। అనుమితౌ వ్యాప్తి జ్ఞానం కరణం। వ్యాప్తిజన్య జ్ఞానమనుమితి లక్షణం। వ్యాప్తిర్నామ పరామర్శః। సచ వ్యాపారరూపః। తస్మాద్వ్యాప్తి విశిష్టపక్ష ధర్మతాజ్ఞానం పరామర్శ ఇత్యర్థః"=అనగా అనుమితియందు కరణము అనుమానము. దీనిని వ్యాప్తి జ్ఞానమనియు నందురు. వ్యాపారరూపమైనది పరామర్శ యనబడును. కావున వ్యాప్తి విశిష్టమైన పక్షధర్మతా జ్ఞానమును పరామర్శ యందురు.

122. సాధ్యము. పక్షము, పక్షధర్మత, హేతువులనునవి న్యాయ శాస్త్రము నందలి పారిభాషిక పదములు. వీనిని గుఱించి సంగ్రహముగ నిట్లు దెలిసికొందుము:—

(1) సాధ్యము=సాధింపదగినది (ఉద్దిష్టము) ఉ=అగ్ని

(2) పక్షము=సాధ్యమునకాశ్రయము (పర్వతమునందగ్ని యున్నదా లేదా యను అనుమానమునందు, సంశయము గలిగినప్పుడు సాధ్యము నకు=అగ్నికి ఆశ్రయము పర్వతము)

(3) పక్షధర్మత=పక్షముయొక్క ధర్మము.

(4) హేతువు=కారణము.

132. "సందిగ్ధ సాధ్యవాన్పక్షః। యథాధూమవత్వ హేతౌపర్వతఃపక్షః" అనగా నిచ్చట పర్వతమున్నదా లేదా యను ప్రశ్న యుదయించుట లేదు. పర్వతమునందగ్ని యున్నదా లేదా యనునదే సంశయముగాన అగ్నినిగుఱించియే పరీక్షయగునుగాపున ఊహోద్దిష్టమున కాశ్రయమైనది పర్వతమైనందున పర్వతము పక్షమనబడును. అందు పొగ గనుపించుట హేతువగును.

(2) "పర్వతోవహ్ని మాన్వానవా ఇత్యాకారక లక్షణం ప్రాచీనై రుపపాదితం। తన్నిరాకృత్య అనుమిత్యుద్దేశ్యకత్యం సాధ్యవాన్పక్షమితి నవీనతార్కికై రంగీకృతం"=అనగా పర్వతము అగ్నికలదియా, కాదా యను లక్షణము ప్రాచీనులచే ప్రతిపాదింపబడినది కానిదానిని నిరాకరించి, నవీన తార్కికులు అనిమిత్యుద్దేశ్యకత్వమునే సాధ్యవాన్పక్షమనుచంగీకరించిరి.

(3) "యత్రప్రకారకవ్యాప్తిజ్ఞానం తత్ప్రకారకత్వేనైవ పక్షధర్మతా జ్ఞానస్య అనుమితిం ప్రతిహేతుః వ్యాప్తిస్తు అశేష సాధనాశ్రయాశ్రిత సాధ్యసామానాధికరణ్యారూపా। సాచఅవ్యభిచార రూపాజ్ఞానసహకృత సాహచర్య దర్శనే నగృహ్యాతే। సాహచర్యదర్శనంతు సకృద్దర్శనంవా భూయోదర్శనం వాయనాదరణీయం". అనగా వ్యాప్తిజ్ఞాన మెట్టిరూపమున కలిగినదో యట్టిదే యగు పక్షధర్మతా జ్ఞానము అనుమితిని గుఱించి కారణమగును. సాధ్యముతో సర్వసాధారణముగ సాహచర్యరూప భావన గలిగినది (సామానాధికరణ్యారూపమైనది) వ్యాప్తియగును. ఆ వ్యాప్తి వ్యభిచరించని (వేరుగా నుండని) జ్ఞానసహకృత సాహచర్య దర్శనముచే గ్రహింపబడును (అగ్నిపొగలు గలిసియుండుట సాహచర్యమనబడును). సాహచర్యము పలుమారు దర్శనమున గలిగిన జ్ఞానమగునా లేక ఒకేసారి జూచిననే గలిగినదా యనునది లెక్కలోనిది కాదు.

శ్లో॥ 195. జ్ఞాతసంబధ నియమస్యైకదేశ స్యదర్శనా ।
దేకదేశాంతరే బుద్ధిరనుమాన మబాధితం.

తా॥ రెండువస్తువులు తప్పక గలిసియుండునవిగా దృఢజ్ఞాన మెప్పుడు గలుగునో అప్పుడు ఎచ్చటనైన ఆ రెండువస్తువులలో నొకటి కనుపించెనేని రెండవదియు నచ్చటనే యుండునను బుద్ధినిర్బాధమైన అనుమానమందురు.

(1) "పక్షస్యధర్మః పక్షధర్మః షష్ఠ్యానిరూపితం, పక్షధర్మతాచాసౌ తజ్ఞానంచేతి కర్మధారయేన ధర్మపదస్య సంబంధార్థ కత్వేనవిశేషణం । తేనవ్యాప్తి ప్రకారకా భిన్నయత్పక్ష సంబంధ విషయం తత్పరామర్శః । తస్మాత్పక్ష విశిష్టం. నామపక్ష విశేష్యతా నిరూపితవ్యాప్తి విశిష్టం తత్ప్రకారక తాజ్ఞానం పరామర్శః" అనగా పక్షముయొక్క ధర్మము పక్ష ధర్మతయని షష్ఠీతత్పురుష సమాసము. పక్షధర్మత యైదియు జ్ఞానమైన దియు అని కర్మధారయ సమాసము జెప్పితిమేని ధర్మపదము సంబం దార్థముగ విశేషణమగును. ఇట్లు అర్థము జేసిననే వ్యాప్తిప్రకార కాభిన్న మైన పక్షసంబంధమైనట్టి ధర్మము పరామర్శయన బడును. పక్షవిశిష్టమన పకవిశే ష్యతా నిరూపితవ్యాప్తి విశిషము. తత్ప్రకారక జ్ఞానమే పరామర్శ.

(2) "ధూమవ్యాప్య వహ్నిర్ధూమవతీ"—అనగా ధూమముచే (పొగచే) వ్యాపించిన అగ్నిధూమవతీ యనబడును.

(3) "యత్రయత్ర ధూమ స్తత్ర తత్ర వహ్నిరితి సాహచర్యనియమో వ్యాప్తిః" అనగా ఎచ్చటెచ్చట ధూమముండునో యచ్చటచ్చట అగ్ని యుండుట సాహచర్యనియమ మనబడును.

1. వ్యాపకము=ధూమము.

2. వ్యాప్యము=అగ్ని.

3. వ్యాపకత్వము సాహచర్య సామానాధికర్ణ్యము ఇట్లు ధూమాగ్నులకు సామానాధికరణ్య సంబంధముచే సాహచర్య నియమముగలదు.

133. "వ్యాప్యోవహ్నిః, వ్యాప్యస్య పర్వతాది వృత్తిత్వం పక్షధర్మతా। వ్యాపకోధూమః। వహ్నౌధూమ వ్యాపకత్వం, ధూమసామానాధి కరణ్యా స్యాత్యంతాఽభావప్రతియోగితాక అనవచ్ఛేదక ధర్మత్వం యథామహాన సాదౌ". అనగా ధూమసామానాధి కరణ్యము అగ్ని। దాని ప్రతియోగి తాకాత్యం తాభావమనగ అగ్నికితరములైనవి కానివి అనగా అగ్నిసత్వమే యగును. అది పర్వతమునందుండునందున వహ్నిత్వమనగ అగ్నియందుండి విడదీయరాని ధర్మము వ్యాప్యము. అదివ్యాపకమగు ధూమముతో సాహచర్య నియమముగ నుండునందున అగ్నిధూమములకు సామానాధికరణ్యము గలదు. ఇందుదాహరణగా వంటియింటియందు ధూమాగ్నులకు సాహచర్యము గలదని తెలిసికొనవచ్చును.

134. "అనుమానం ద్వివిధం. 1. స్వార్థం 2. పరార్థం। స్వానుమితి హేతుస్స్వార్థం। అన్యం ప్రతిప్రియుజ్యమానం పరార్థం. యథాస్వయ మేవమహానసాదౌ భూయోదర్శనేన యత్ర ధూమ స్తత్రాగ్నిరితి వ్యాప్తిం గృహీత్వా, పర్వతసమీపం గతస్యన్త్ర వహ్నింనందిహానః పర్వతేధూమం పశ్యన్యత్ర ధూమ స్తత్రాగ్ని రితిస్వానుభూతవ్యాప్తిం స్మర్యతేసతి వహ్ని ర్వ్యాప్య ధూమవానయం పర్వత ఇతియద్జ్ఞానం జాయతే తత్స్వార్థాను మాన మయమేవ లిఙ్గ పరామర్శః। యథోక్తలిఙ్గ పరామర్శేన స్వయం ధూమాదగ్ని మనుమాయపరం ప్రతి పంచావయవ యుక్తవాక్యం ప్రయుజ్యానుమానం పరార్థానుమానం"

(2) 1. "ప్రతిజ్ఞః 2. హేతుః 3. దృష్టాంతః 4. ఉపనయనం 5. నిగమనమితి పంచావయవం పరార్థాను మానేనంతి. ఉ:— 1. ప్రతిజ్ఞః= పర్వతో వహ్నిమానితి. 2. హేతుః=ధూమాద్ధేతోః 3. యథామహానసః=దృష్టాంతః 4. ఉపనయనం=యత్రియత్ర ధూమ స్తత్రతత్రాగ్నిః 5. తస్మాత్తథా నిగమనం" అనగా అనుమానము రెండువిధములు.

1. స్వార్థము 2. పరార్థము. తన అనుమితికి కారణమైనది స్వార్థానుమానము. ఇతరులనుగురించి పంచావయవయుక్త వాక్యమున జెప్పునది

పరార్థానుమానము. పంచావయవము లివి:- 1. ప్రతిజ్ఞ 2. హేతువు 3. ఉదాహరణము 4. ఉపనయనము 5. నిగమనము.

(2) తాను స్వయముగ పలుసార్లు వంటయింటియందు పొగ అగ్నితో గూడియుండుటనుజూచి ఇట్టి నిశ్చితానుభవమగు వ్యాప్తిజ్ఞానముచే పర్వత సమీపమునకుజని పర్వతమునందు పొగయుండుట మాత్రమునేజూచి పర్వతమునందగ్నిగలదా, లేదా యను సందేహము గలిగినప్పుడు అచ్చటగల వ్యాపకమగు ధూమము, వంటయింటియందుగల అగ్నివ్యాప్యముతో సాహచర్యము వంటిదని వ్యాప్తిజ్ఞానమును స్మరించి అట్లే యిచ్చట వ్యాప్యమైన అగ్ని యున్నదనుకొనుట స్వార్థానుమాన మనబడును. ఇట్టి స్వార్థానుమాన బలమున నితరులను గురించి పైజెప్పిన పంచావయవ యుక్త వాక్యములతో చెప్పినది పరార్థానుమాన మనబడును. ద్వివిధ వ్యాప్తి జ్ఞానములను లిఙ్గపరామర్శయందురు. ఇదే అనమితియందు కరణ మనబడును. ఉదాహరణ వివరమిట్లు:— 1. ప్రతిజ్ఞ=పర్వతమునందగ్ని కలదు. 2. హేతువు=పొగయుండు కారణమువలన 3. ఉదాహరణము= వంటయింటియందుండునట్లు 4. ఉపనయనము=ఎచ్చటెచ్చట పొగ యుండునో అచ్చటచ్చట అగ్నియుండును. 5, నిగమనము=కావున నిచ్చట అగ్నికలదు.

135. "లిఙ్గ పరామర్శస్త్రిధః:— 1. అన్వయి 2. వ్యతిరేకి 3. అన్వయ వ్యతిరేకి. (1) యత్రధూమస్తత్రాగ్నిరితి అన్వయీ 1. సాధ్యేవహ్నా ధూమసాధనేన (వ్యాపకేన) సామానాధికరణ్యం (సాహచర్యం) అన్వయ వ్యాప్తిమత్వేనఅన్వయీ. ఉదా:— మహానసః.

2. వ్యతిరేకమభావం="యత్రాగ్నిర్నాస్తి తత్రధూమోపినాస్తీతి వ్యతిరేకీ. ఉ:— మహాహ్రదః।

3. అన్వయత్వేన వ్యతిరేకత్వేన వ్యాప్తిమత్వమన్వయ వ్యతిరేకీ. ఉ:— ఆత్మా. లిఙ్గపరామర్శ మూడు విధములివి:—

136. కేవలాన్వయి లక్షణము—"అన్వయమాత్రవ్యాప్తిః కేవలాన్వయి" ఉ:— 1. ఘటోభిధేయః ప్రమేయత్వాత్ యథాపటః అనగా అన్వయ మాత్రమే వ్యాప్తిగలది కేవలాన్వయి. ఉ:— ఘటము నామధేయము, ప్రమేయమగుటవలన, దృష్టాంతము పటము. అభిధానము—నామ ధేయము, ప్రమేయము—ప్రమాణ గమ్యము. ఇది ఇంద్రియాదులకు ప్రత్యక్షగోచరము.

2. కేవలవ్యతిరేకీ లక్షణము—"నిశ్చితాన్వయ శూన్యత్వేసతి వ్యతిరేక మాత్ర వ్యాప్తిమత్వం కేవల వ్యతిరేకీ" ఉదాహరణం:— పృథివీతరేభ్యోభి ద్యతే। గంధవత్వాత్। యదితరేభ్యో నభిద్యతే నతద్గంధవత్। యథా జలం। నచేయం పృథివీతథా। తస్మాన్నతథా। ఇదంతు వ్యతిరేక దృష్టాంతః యద్గంధవత్తదితరేభ్యో భిన్న మిత్యన్వయ స్వీకారే దృష్టాంతో నాస్తి" అనగా వ్యతిరేక వాప్తిమాత్రమే కల్గియుండునది కేవలవ్యతిరేకీ. నిశ్చితాన్వయ రహితమగుచు వ్యతిరేకమాత్ర వ్యాప్తిని కల్గియుండుటే కేవలవ్యతిరేకీ లక్షణము. ఉదాహరణ:— పృథివి యితరములకంటెను భిన్నమైనది (ప్రతిజ్ఞ) గంధముగలదగుటచే (హేతువు) జలము (ఉదా హరణ) అది యితరములకంటె భిన్నముకానిచో గంధముగలది కాక పోవును. పృథివి అట్టిదికాదు (జలాదులవంటిదికాదు) కావున నట్టిది కాదు—నిగమనము ఒకవేళ ఏది గంధము కలదియో అది ఇతరములకంటె భిన్నమని అన్వయలక్షణమును స్వీకరించినయెడల వ్యతిరే మునందు దృష్టాంతములేదు. కావున పైదృష్టాతమే కేవల వ్యతిరేకీనిగురించి జెప్ప బడినది. ఇట్లు పృథివి ఇతరములకంటెను భిన్నముకానిది కాదని తాత్పర్యము.

137. స్వపక్షము—"నిశ్చిత సాధ్యాభావద్వృత్తిత్వంస్వపక్షస్య లక్షణం" ఉ:— మహానసః। అనగా సాధ్యముగలదిగ నిశ్చయింపబడు వృత్తిగలిగి యుండు లక్షణముగలది స్వపక్షము. ఉ:— వంటయిల్లు.

2. విపక్షము—"నిశ్చిత సాధ్యాభావ ద్వృత్తిత్వం విపక్షస్య లక్షణం" ఉ:— మహాహ్రదః అనగా సాధ్యము లేనట్టిదగు వృత్తిగలిగి యుండునది

విపక్షము. ఉ:— గొప్పమడుగు. ఇదే స్వపక్షమునకు వ్యతిరిక్తమైనది. ఇందు వంట యింటియందగ్ని యుండునను భావముదయించునట్లు గొప్ప మడుగునందు అగ్నిగలదను భావముదయించదని యర్థము.

3. దీనికే అసద్ధేతువని, హేత్వాభాసయని మారుపేర్లుగలవు. ఇందైదు విధములుండును. (1) సవ్యభిచారము 2. విరుద్ధము 3. సత్ప్రతిపక్షము 4. అసిద్ధము 5. బాధితము.

138. దోషసామాన్య లక్షణము—"యద్విషయే అనుమానస్య (అనుమితింప్రతి) అథవా తత్కరణస్య ప్రతిబంధోజాయతే సదోషసామాన్యం" వాదినిగ్రహార్థం హేతౌదుష్టత్వ నిరూపణం దర్శయతి" అనగా విషయము నందనుమానమునకేగాని అనిమితి కరణమునందేగాని ప్రతిబంధము గలుగునో అదే దోషసామాన్య మనబడును. వాదినోడించుటకు వాది చెప్పిన హేతువులందు దోషములు జూపింపబడును.

(1) సవ్యభిచారము—"అనైకాంతికో సవ్యభిచారః। హేతౌవ్యభిచార లక్షణ సత్వమేవ అనైకాంతికత్వం। సచసాధారణ 2. అసాధారణ 3. అనుపసంహారీతి భేదేనత్రివిధం" అనగా ఇదేయని నిశ్చయించుటకు వీలులేనిది (హేతువునందు వ్యభిచార లక్షణముగలది) అనైకాంతిక మనబడును. ఉ:— పర్వతము అగ్నిగలది ప్రమేయమగుటచే యను హేతువునకు వ్యభిచారముగలదు. ఎట్లన ప్రమేయమైనంతనే (ఇంద్రియాదులకు గోచరమైన వస్తువైనంతనే) అన్నిటియందు అగ్నియుండునని నిశ్చయించ శక్యము గాజాలదు. ఉదాహరణగ గొప్పమడుగు ప్రమేయమైనను అచ్చట అగ్నియుండదని నిశ్చయమగుచున్నది. కావున పైహేతువు అనైకాంతికము. (సాధారణరూపమైన సవ్యభిచార దోషయుక్తము)

2. అసాధారణము—"సర్వపక్ష వ్యావృత్తే రసాధారణః। సాధ్యవద్వృత్తిత్వా వచ్ఛిన్న ప్రతియోగితా కాభావస్సర్వ పక్షవ్యావృత్తస్య లక్షణం" ఉ:— శబ్దోనిత్యః। శాబ్దత్వాదితిహేతుః ప్రదర్శితే సచహేతు

స్సర్వేభ్యో నిత్యేభ్యోవ్యావృత్తం శబ్దమాత్రవృత్తిత్వాత్. అనగా శబ్ద నిత్యత్వహేతువు సకల నిత్యపదార్థములందు లేనిదగుచు నొకనిత్య పదార్థమైన ఆకాశమునకే గుణమగుటచే నిది సర్వపక్షములందు (అన్ని నిత్య ద్రవ్యములందు) వ్యావర్తన (లేని) హేతువగుచున్నందున కేవల శబ్ద నిత్యత్వ మాత్రమునకే సాధన గాజాలదు. కావున ఈ హేతువునంద సాధారణ రూప సవ్యభిచార లక్షణదోషము గలదు.

(3) అనుపసంహారి—"అన్వయ, వ్యతిరేక దృష్టాంత రహితోఽనుపసంహారీ। అన్వయ వ్యాప్తి రూప, వ్యతిరేక వ్యాప్తిరూపోఽభయ జ్ఞాన సామగ్ర్య భావమనుపసంహారీ లక్షణం". ఉ:—సర్వమనిత్యం ప్రమేయత్వాద్, అత్రిహేతౌ సర్వస్యాపి పక్షత్వాద్దృష్టాంతోనాస్తి తస్మాద్ధేతురనుపసంహారి. అనగా అన్వయ వ్యాప్తిరూప సామాగ్రియేగాని, వ్యతిరేక వ్యాప్తిరూప సామగ్రియేగాని ఇట్లుభయ వ్యాప్తి రూప సామగ్రి లేనిది అనుపసంహారీ హేతుపనబడును. సామగ్రి—దృష్టాంతములు. ఉ:-సర్వమనిత్యము ప్రమేయములగుట వలన యను నీ హేతువునందు సర్వము అనిత్య పక్షములో జేరినందున దృష్టాంతరహితమైనది. కాన నీ అనుపసంహారీ హేతువు దోషయుక్తమైనది.

2. విరుద్ధము—"సాధ్యసాధన హేతౌ సాధ్య అసాధకత్వలక్షణవత్వం విరుద్ధః". ఉ:- శబ్దోనిత్యః కార్యత్వాత్ ఘటవదిత్యత్ర హేతౌ నిత్యత్వ సాధక హేతురనితత్యత్వ సాధకో భవితి తస్మాద్విరుద్ధత్వేన హేతుర్విరుద్ధః. అనగా శబ్దమునకు నిత్యత్వము సాధ్యము దీని సాధించుటందు కార్యమును హేతువుగా జెప్పబడినదేకాని నిది సాధ్యమును సాధింపజాలక తద్విరుద్ధ (అనిత్య) సాధకమగుచున్నది. కావున నీ హేతువును విరుద్ధ మందురు.

3. సత్ప్రతి పక్షము:—"సాధ్యాభావా వద్ధేతోర్హేత్వంతరస్యచ విద్యమానత్వం సత్ప్రతి పక్షః". ఉ:- శబ్దోనిత్యః శ్రావణత్వాదితి హేతౌ, శబ్దో అనిత్యః కార్యత్వాద్ఘటవదితి హేత్వంతరంచ విద్యతే తస్మాదుక్త

హేతౌ హేత్వాంతర విద్యమానత్వేన సత్ప్రతిపక్షః" అనగా సాధ్యాభావా భావరూపహేతుద్వయములు గలిగియుండునది సత్ప్రతి పక్షమనబడును. ఉ:- శబ్దము నిత్యము శ్రవణగోచర మగుటవలన యను నీ హేతువునకు ప్రతిపక్షమున మఱొక ఉ:- శబ్దమనిత్యము కార్యమగుటచే ఘటమువలెనను ఉదాహరణ గలదు. కావున నీ హేతువు సత్ప్రతిపక్ష హేతువనబడును.

4. అసిద్ధః "ఆశ్రియాసిద్ధః, స్వరూపాసిద్ధః, వ్యాప్త్యసిద్ధమితి త్రివిధః।

(1) "పక్షేపక్షతావచ్ఛేదక విరహోఽశ్రయాసిద్ధః" ఉ:- గగనారందే సౌరభ్యం। అరవిందత్వాత్సరోజారందవత్। ఇతిహేతౌ ప్రదర్శితే। గగనాందాశ్రయోనాస్త్యేవ। అరవిందేగగనీయత్వ రూపలక్ష్యతావచ్ఛేదక మభావత్వేన అసిద్ధః". అనగా ఆశ్రయాసిద్ధ, స్వరూపాసిద్ధ, వ్యాప్త్యసిద్ధ భేదములచే అసిద్ధహేతువు త్రివిధము.

(1) పక్షమునందు పక్షధర్మము లేకయుండుట ఆశ్రయాసిద్ధమనబడును. ఉ:-గగనారవిందమునందు సౌరభ్యము (సువాసన) గలదు. ప్రతిజ్ఞ, అరవింద మగుటచే, హేతువు. సరోజారవిందమువలె=ఉదాహరణ:-ఈ హేతువునందు సర్వాశ్రియమాకాశమే కావున దానికి మఱియొక ఆశ్రయము లేకుండు టచే ఆశ్రయాసిద్ధమను దోషముకలదు.

(2) "హేత్వాభావో స్వరూపాసిద్ధః" ఉ:-శబ్దోగుణః చాక్షుషత్వాదితి హేతౌచాక్షుషత్వం శబ్దేనాస్త్యేవ శబ్దశ్శ్రావణగుణత్వాదతః హేతౌ స్వరూపమేవాసిద్ధః, అనగా పక్షమునందు హేతువులేకుండుటయే స్వరూపాసిద్ధమనబడును. ఉ:- శబ్దము గుణము (ప్రతిజ్ఞ) చక్షుర్విషయ మగుటవలన (హేతువు) ఇచ్చట శబ్దమునందు చాక్షుషత్వమే లేదు. అది (శబ్దము) శ్రవణగోచరముకాన హేతువు స్వరూపాసిద్ధమైనది.

3. వ్యాప్త్యాసిద్ధము "సోపాధికో వ్యాప్త్యాసిద్ధ। సాధ్యాఽవ్యాప్యత్వేసతి సాధనాఽవ్యాపకత్వం సోపాధికలక్షణం। సాధ్యసామానాధికరణాత్యంతా భావప్రతియోగిత్వం సాధ్యాఽవ్యాప్యత్వం। సాధనవన్నిష్ఠాత్యంతాభావ ప్రతియోగిత్వం సాధనాఽవ్యాపకత్వం.

ఉ:- పర్వతోధూమవాౝ వహ్నిత్వాత్ యథార్ద్రేంధన సంయోగః.

అనగా—సాధ్యము అవ్యాప్యముగా సాధనము అవ్యాపకముగా నుండుట సోపాధిక లక్షణము. కాన ఉపాధికలిగియుండునట్టి గుణము వ్యాప్త్యాసిద్ధ మనబడును. ఉ:- పర్వతమునందు పొగకలదు (ప్రతిజ్ఞ) అగ్నియుండుటచే (హేతువు) ఆర్ద్రేంధన సంయోగమునందుండునట్లు (ఉదాహరణము) ఇచ్చట ఆర్ద్రేంధన సంయోగము ఉపాధియనబడును. ఆర్ద్రేంధన సంయోగ ముపమానమగుటతో సాధ్యావ్యాప్యము, (పొగలేకునికి) అగ్నికి వ్యాపకత్వము అంతట లేకునికియు గలుగును. ఇట్లుతప్తమగునయోగోళము నందు (కాకదీసిన లోహపిండమునందు) అగ్నియుండునేగాని పొగ యుండుట గనుపించదు. కావున ఆర్ద్రేంధన సంయోగ రూప ముపాధిచే ధూమమునకవ్యాప్యత్వము అగ్నికి అవ్యాపకత్వము సంభవించినందున హేతువు వ్యాప్త్యాసిద్ధమను హేత్వాభాసయనబడును.

5, బాధిత హేత్వాభాసము — "యత్సాధ్యాభావం ప్రమాణాంతరేణ నిశ్చితం తద్బాధిత హేత్వాభాసః" ఉ:- వహ్నిరనుష్ణః పదార్థత్వాదితి హేతౌ అనుష్ణం సాధ్యంవహ్నౌ తదాభావత్వేన అసాధ్యంభవతి। వహ్నౌ వౌష్ణ్యంత్వాచ ప్రత్యక్షేణ గృహీతత్వేన ప్రత్యక్షప్రమాణ విరుద్ధంభవతి। తస్మాదగ్నేరనుష్ణహేతోరసంభవం। అనగా ఎచ్చట హేతువునందు ప్రమాణాంతరములచే సాధ్యాభావము నిశ్చయింపబడునో అచ్చట హేతువు బాధిత హేత్వాభాస యనబడును. ఉ:— అగ్ని ఉష్ణములేనిది (ప్రతిజ్ఞ) పదార్థ మగుటచే (హేతువు) ఇచ్చట ఉష్ణాఽభావము సాధ్యము అది అగ్నియంద సాధ్యము. కారణమేమనగ అగ్నియందుష్ణత్వ గుణముండుట త్వగింద్రియ ముచే ప్రత్యక్షముగ గ్రహింపబడుచున్నది. కాన ప్రత్యక్షప్రమాణమునకు విరుద్ధమైనందున నిట్టి హేతువు బాధిత హేత్వాభాస యనబడును.

అనుమానప్రమాణము సమాప్తము

# 3. ఉపమానము

139. "ఉపమితికరణముపమానం". ప్రమాణం. ఉపమితిర్నామ సాదృశ్యం. సమానసదృశత్వంవా.

2. "సంజ్ఞా సంజ్ఞి సంబంధజ్ఞాన ముపమితిః" అనగా పదార్థముల పరస్పర సంబంధమును తెలుపునది సంజ్ఞ అది యుపమానము.

3. ఉపమాన జ్ఞానేఽనాతి దేశవాక్యార్థోజాయతే । అతిదేశ వాక్యార్థ స్మరణం వ్యాపారః । యథాగో సదృశోగవయ ఇతి వాక్యే గవయ పద వాచ్యార్థం గో సాదృశ్యత్వావచ్ఛిన్నం విశేష్యం, గవాకారక విశేషణవదేవం గౌరితి ప్రకారక జ్ఞాన ముత్పద్యతే । తదేవ ఉపమితి కరణస్య లక్షణం" అనగా ఉపమాన జ్ఞానముచే నిర్దిష్టవాక్యార్థ బోధ కలుగును. అతిదేశ వాక్యార్థ స్మరణము వ్యాపారము. ఉ :- గోసదృశము గవయము ఈ వాక్యమునందు గోవువలె నుండునది గవయము (ఆవు రూపమువలె నుండు ఒకానొక జంతువు) విశేష్యము, గో ఆకారము విశేషణము. గో రూపమగు ప్రకార జ్ఞానముచే (గవయజ్ఞానముచే) నిట్లు అర్థము దెలియు చున్నది కాన నిది ఉపమితి కరణము.

శ్లో॥ 196 సంబంధస్య పరిచ్ఛేద స్సంజ్ఞయాసంజ్ఞినాసహ ।
ప్రత్యక్షాదేరసాధ్యత్వా దుపమాన ఫలం విదుః.

తా॥ సంజ్ఞచే సంజ్ఞి (ఉపమేయము) యందలి సంబంధము దెలియబడును. ఇది ప్రత్యక్షాది ప్రమాణాంతరములతో దెలియ శక్యము గాజాలదు. కావున నిది ఉపమాన ప్రమాణముననే తెలియబడును.

140. "సంజ్ఞా సంజ్ఞి సంబంధజ్ఞాన మాత్రేణ ఉపమితి జ్ఞానం నజాయతే కింతు ఉపమినో మీత్యను వ్యవసాయ బలే నతత్సా దృశ్యం యద్జ్ఞానం తదేవోపమితి కరణస్య లక్షణం".

(2) "అను వ్యవసాయమితి తార్కిక పరిభాషా తదేవ వేదాంతమతేసం విత్సామాన్యజ్ఞానం బ్రహ్మ చైతన్యమితి వ్యవహ్రియతే" అనగా వాక్యార్థము దెలియుటందు పోలికతో (సంజ్ఞతో) సంజ్ఞిసంబంధము తెలియబడును. పోలిక ఉపమానార్థమని తెలియుట మానసిక వ్యాపార ధర్మము ఇదే ఉపమితి కరణము. దీనినే అనువ్యవసాయమని తార్కికులందురు. వేదాంతులు అను వ్యవసాయమునే సామాన్య జ్ఞానమని, బ్రహ్మ చైతన్యమని బలుకుదురు.

ఉపమాన ప్రమాణము సమాప్తము

## 4. శాబ్దము

141. "ఆప్తవాక్యం శాబ్దం ప్రమాణం। యదార్థ వక్తారోహ్యాప్తాః। పద సమూహో వాక్యం। తథాచ ఆప్తోచ్చరితే సతి యదార్థ బోధకత్వం వాకస్యలక్షణం। యస్యార్థజ్ఞానం శాబ్దబోధః। యస్యవాకస్య తాత్పర్య విషయీ భూతబోధో జాయతే, మానాంతరేణ న బుధ్యతే తద్వాక్యం శాబ్దం ప్రమాణం.

2. "శబ్దత్వం శాబ్దం। పదజ్ఞానేన పదార్థజ్ఞానం। తాత్పర్యేణ వాక్యార్థ జన్యజ్ఞానం శాబ్దం। ప్రమాణం."

3. "ప్రయోగ హేతుభూత యదార్థ వక్తృత్వం ఆప్తస్యలక్షణం. ఆప్తోచ్చరితేసతి ప్రయోగ హేతుభూత జ్ఞానం శాబ్దమితి" తాత్పర్యం. అనగా ఆప్త వాక్యమే శాబ్దమనబడును. ఇది ప్రమాణము యదార్థమును జెప్పువారు ఆప్తులు. ఇట్లు ఆప్తోచ్చరితమైన దగుచు యదార్థమును బోధించుట వాక్యమునకు లక్షణము. వాక్యము యొక్క అర్థజ్ఞానమే శాబ్దబోధ. ఏ వాక్యమునకు తాత్పర్య విషయక బోధ కలుగునో, ప్రమాణాంతరములచే తెలియబడదో ఆ వాక్యము శాబ్దము. పదజ్ఞానముచే పదార్థజ్ఞానమగుచు తాత్పర్య రూపమున వాక్యార్ధ జన్యజ్ఞానము శాబ్దమని సారాం

శము. 3. ప్రయోగమునకు హేతుభూతమగు యదార్థమును చెప్పుటయే ఆప్తునికి లక్షణము. ఇట్లు ఆప్తోచ్చరిత మగుచు ప్రయోగహేతుభూతమగు యదార్థ జ్ఞానము శాబ్దమని తాత్పర్యము.

4. "ఇంద్రియ వృత్తి సహకృత పదార్థోపస్థితిర్వ్యాపారః కరణం, తజ్జన్య జ్ఞానం పదార్థజ్ఞానం। అస్మత్పదాదయ మర్థోబోద్ధవ్యఇతి ఈశ్వరేచ్ఛా=సాంకేతికం సైవశక్తి పదార్థః". "శక్తిః కార్యానుమేయి ఇతి వేదాంతమతే" అనగా ఇంద్రియవృత్తిచే సహకృతమగు పదార్థోపస్థితి (విషయోలబ్ధి) వ్యాపార రూపము. ఇదియె సాధనము. దీనిచే కలిగిన జ్ఞానము పదార్థ జ్ఞానమందురు. ఈ పదమునుండి యీ యర్థము తెలిసి కొనదగినది అను ఈశ్వరేచ్ఛ సంకేతము. అదియే పదమునకు పదార్థ రూపశక్తి। శక్తి కార్యానుమేయి (కార్య లిఙ్గకానుమానమున దెలియునది) యని వేదాంతులందురు.

శ్లో॥ 197 శక్తయ స్సర్వభావానా మచింత్యజ్ఞాన గోచరాః
శతశో బ్రహ్మణస్తాస్తు సర్గాద్యాభావ శక్తయః.

తా॥ చింతించుటకు శక్యముగాక జ్ఞానమున దెలియబడునవి శక్తులు ఇవి భావ రూపములు. ఉత్పత్తి, స్థితి, లయాది రూపములైన శక్తులనేక విధములైనవి పరబ్రహ్మ వలన గలుగు చుండును.

142. "శక్తి నిరూపిత పదార్థః శక్తం తదవచ్ఛేదకం శక్తత్వం" అనగా శక్తిచే నిరూపితమైనది పదార్థమును శక్త మందురు. దాని ధర్మము శక్తత్వము.

2. "విషయతా సంబంధేన శక్త్యాశ్రయత్వం శక్యత్వం" అనగా శక్తి విషయము శక్యము. కావున శక్తము పదము శక్యము అర్థమని తాత్పర్యము. శక్తి నిరూపితార్థము, ముఖ్యమని గౌణమని (అముఖ్యమని) రెండు విధములు.

(1) సాధారణమగు, శక్తి వృత్తిచే నవగతమగు జ్ఞానము (వాచ్యార్థము) ముఖ్యము.

(2) తనకంటెను వేరయిన ధర్మ జ్ఞానమునపేక్షించుటచే ప్రాప్తించునది గౌణము.

3. శక్య సంబంధము లక్షణము. ముఖ్యార్థమునకు బాధ కలిగినప్పుడు శక్య సంబంధమును తెలుపు శబ్ద వ్యాపారమును లక్షణ యందురు. లక్షణా వృత్తిచే గలిగిన అర్ధజ్ఞానము లాక్షణిక మనబడును. తాత్పర్య అనుప పత్తియే లక్షణకు బీజము (తాత్పర్య బోధ సక్రమముగనగునేని లక్షణతో నిమిత్తములేదు.)

శ్లో॥ 198 మానాంతర విరోధేతు ముఖ్యార్థస్యాపరిగ్రహే ।
ముఖ్యార్థస్యా వినాభూతే ప్రవృత్తిర్లక్షష్యతే.

తా॥ ప్రమాణాంతరములచే ముఖ్యార్థము పొసగనిచో ముఖ్యమునకు సంబంధించిన దానియందు, ఆరోపింపబడిన శబ్ద ప్రవృత్తి లక్షణయనబడును.

శ్లో॥ 199 అభిధేయ వినాభూతే ప్రవృత్తిర్లక్షణేష్యతే ।
లక్ష్యమాణగు ణైర్యోగే వృత్తి రిష్టాతు గౌణతా.

తా॥ అర్థము పొసగనప్పుడు ఆరోపితమగు శబ్దవ్యాపారము లక్షణ యన బడును. లక్షణచే జెప్పబడినదాని గుణ సంబంధము గలిగినది గౌణవృత్తి.

143. లక్షణ మూడు విధములివి :- 1. జహల్లక్షణ 2. అజహల్లక్షణ 3. జహదజహల్లక్షణ.

(1) జహల్లక్షణము= "వాక్యార్థ బాధే లక్ష్యార్థమాత్ర గ్రహణం జహల్లణా" అనగా వాక్యార్థమున కనుప పత్తి యేర్పడినప్పుడు లక్షణచే గ్రహింపబడిన అర్థమును స్వీకరించుట జహల్లక్షణము. ఉ :- గంగయందు గొల్లపల్లెయను వాక్యమునందు గంగా శబ్దమునకు ముఖ్యార్థము ప్రవాహము. ప్రవాహమునందు గొల్లపల్లె యుండ జాలనందున వాక్యా ర్థమునకనుప పత్తి గలదు. కావున గంగా పదమునకు గంగాతీరమని యర్థమును గ్రహించుట జహల్లణము. (జహత్=విడిచి పెట్టుట).

2. అజహల్లక్షణము = "వాక్యార్థ బోధాయ వాచ్యార్థ లక్ష్యార్థ యోరుభయోర్గ్రహణ మజహల్లక్షణా" అనగా వాక్యార్థబోధకై వాచ్య, లక్ష్య అర్థములను రెంటిని గ్రహించదగినది అజహల్లక్షణము. ఉ:- కోదండ పంక్తులు వచ్చెను. యను వాక్యమునందు కేవల కోదండములు వచ్చుట అసంభవము. గాన కోదండములు ధరించిన యోధులు వచ్చిరి యని యర్థము. (వాచ్యార్థము=కోదండములు, లక్ష్యార్థము=కోదండధారులు. వాక్యార్థ బోధకై రెండర్థములు స్వీకరింపబడినవి. అజహత్=విడువక).

3. జహదజహల్లక్షణము="వాక్యార్థ బోధాయ వాచ్యార్థైక దేశ పరిత్యాగేన లక్ష్యమాత్ర గ్రహణం జహదజహల్లక్షణా" అనగా వాక్యార్థ బోధకై వాచ్యార్థము నందలి విరుద్ధైక దేశమును వదలి లక్ష్యమాత్రమును గ్రహించుట జహదజహల్లక్షణము. ఉ :- సోయందేవదత్తః, తత్వమసి ఇత్యాదులు. (ఈ లక్షణమును వేదాంతులు మాత్రమే చెప్పిరి).

144. శబ్ద ప్రమాణే ఆకాంక్షా 2. యోగ్యతా 2. సన్నిధిభేదేన త్రివిధ హేతవః (1) పదస్యపదాంతరేణాన్వయా భావే తాత్పర్యాఽ సంభవత్వేన ఆకాంక్షా. ఆకాంక్షా విరహోన్న శబ్దబోధో జాయతే తస్మాచ్ఛాబ్ద బోదాయహేతురా కాంక్షా" అనగా శబ్దము ప్రమాణమగుటకు, ఆకాంక్షా యోగ్యత, సన్నిధి యను మూడు హేతువులు గలవు. (వాక్యమనగా ఆకాంక్షా యోగ్యతా సహితంబగు నర్థముగల యాసత్తి యుక్త పదసముదాయము).

(1) సమన్వయమునందు పదములకు పరస్పరము ఆపేక్షా రూపమగు ప్రశ్నించుకొను నవకాశము ఆకాంక్షా. ఉ :- గోవు, గుఱ్ఱము అను ఈ వాక్యమునందు ఆపేక్ష లేనందున వాక్యము గాజాలదు. కాని, ఇది గుఱ్ఱము, ఇది గోవు అనునెడ ఏది యను ఆపేక్షకు అవకాశమున్నందున నాకాంక్ష కలుగును కాన ఇది వాక్యము.

2. యోగ్యత యనగా పదములకు గల పరస్పర అన్వయార్హత. పదార్థములకు పరస్పర మన్వయమునందు బాధ యేర్పడినచో యోగ్యత

యుండదు. ఉ :- నిప్పుచే తడుపుచున్నాడు. యను వాక్యమునందు నిప్పుచే తడుపుట ఎల్లప్పుడును అసంభవము. కాన అర్థావగతికి బాధ యున్నందున యోగ్యతలేదు. కాననిది వాక్యము కాజాలదు.

3. సన్నిధి యనగా అవిలంబోచ్చరితము (పదములచేరిక యుండుట) ఇది లేనిచో వాక్యార్థము బోధ పడనందున వాక్యము కాజాలదు. ఉ :- నేడు దేవదత్తుడని చెప్పి మఱియొకనాడు, పోవుచున్నాడని చెప్పిన యెడల నిది వాక్యముకాదు. ఎందుకనగా నిచ్చట పదములయొక్క ఆలస్యములేని చేరికలేదు. కాన ఆలస్యములేక ఉచ్చరించు పదముల చేరిక కలిగియుండుట సన్నిధి. దీనినే వైయ్యాకరణులు సంహిత యనియు ఆంధ్రమున ఆసత్తి యనియు వ్యవహరింతురు.

145. వాక్యార్థమును బోధించుచు వాక్యమునందలి పద పదాంతర సమన్వయముతో నేకార్థమును గలిగియుండునది వాక్యము. ఇది 1. లౌకికము 2. వైదికమను రెండు భేదములు గలది.

(1) ఈశ్వర వాక్యము, వైదికవాక్యము, సర్వము ప్రమాణమే. ఆప్తులచే చెప్పబడినదియే లౌకిక వాక్యము ప్రమాణమగును.

(2) వాక్యార్థజ్ఞానము శబ్దజ్ఞానముచే నేర్పడినది కాన వాక్యార్థ జన్య జ్ఞానమునకు పదార్థ జన్యజ్ఞానము కరణము. ఇట్లు వాక్యార్థజ్ఞానము. శాబ్దము దానికి కరణము శబ్దము. ఇచ్చట శబ్దమనగా వేదములకే కాక వేదమూలకములగు శాస్త్రములకు కూడ ఉపలక్షకము. (శబ్ద రూపములగు వేదములవలె శాస్త్రములు ప్రమాణములగును).

146. "అయదార్థానుభవస్త్రివిధః (1) సంశయ, 2. విపర్యయ 3. తర్కాః". (1) ఏకస్మిన్ధర్మిణి విరుద్ధ నానావైశిష్ట్యజ్ఞాన రూపోఽనుభవః 3. సంశయః ఉ:- స్థాణుర్వా పురుషోవేతి సంశయః" (2) "మిథ్యాజ్ఞానం విపర్యయః" ఉ:- శుక్తి కాయామిదం రజతం. (3) వ్యాపకారోపేణ వ్యాప్యారోపస్తర్కః ఉ:- యది ధూమోనస్యాత్తర్హి అగ్నిరపి నభేదన్యథా ఇష్టాపత్తి దోషేణ తర్కానుపపత్తిః" అనగా ఒకే ధర్మివిరుద్ధ ధర్మములుకలిగియుండుటచే నగునను భవము సంశయము.

ఉ:— స్థాణువా పురుషుడా అనుచోట జడరూపమగు స్థాణుత్వము పురుష రూప చలనత్వము రెండును పరస్పర విరుద్ధములు. కాననిచ్చట అనుభవము సంశయరూపమైనందున అయదార్థము. 2. మిథ్యారూపమున కలిగిన జ్ఞానము విపర్యము. ఉ:— శుక్తియందు రజతము కలదని తెలిసిన జ్ఞానము విపర్యయము. (3) వ్యాపకారోపముచే వ్యాప్యారోపము జేయుట తర్కము. వ్యాపకమునకు బాధ నిశ్చయించుటయే తర్కమునకు హేతువు. ఉ:- ఇచ్చట ధూమమేలేనిచో అగ్నికూడ లేకపోవును. ఈ వాక్యమునందు వ్యాపకమైన ధూమము లేనప్పుడు వ్యాప్యమైన అగ్నికి కూడ బాధసంభవించును. ఇట్లు మూడువిధములైన అయదార్థానుభవ ముండును.

147. "స్మృతిరపి ద్వివిధం. (1) యదార్థం ప్రమాణజన్యం (2) అప్రమాణజన్యమ యధార్థం". అనగా యథార్థమని, అయథార్థమని స్మృతి రెండువిధములు. (1) ప్రమాణముచే కలిగిన స్మృతి యథార్థమైనది. 2. అప్రమాణ జన్యమైనది అయథార్థము.

"సర్వేషా మనుకూల వేదనీయత్వం సుఖం। ఇతరేచ్ఛాయన ధీనత్వ మనుకూల వేదనీయత్వం" అనగా పరేచ్ఛాయధీనముగాక తనకనుకూలమైనదిగ భావింపబడునది సుఖము.

2 "ప్రతికూల వేదనీయత్వం దుఃఖం। ఇతరేచ్ఛాధీనత్వ ద్వేషవిషయత్వం ప్రతికూల వేదనీయత్వం" అనగా పరేచ్ఛాధీనమగుచు తనకు ప్రతికూలమని భావింపబడునది దుఃఖము.

3. "ఇచ్ఛానామకామః ద్వేషఃక్రోధః" అనగా ఇచ్ఛయే కామము ద్వేషమే క్రోధరూపము.

4. "ప్రయత్నంకృతిః। ఫలేచ్ఛా ఉపాయేచ్ఛాం ప్రతికారణం ఫలద్వేషే తదుపాయేపి ద్వేషోవర్తతే" అనగా ప్రయత్నమే కృతియనబడును. ఫలమునందలి కోరికయే ప్రయత్నమునకు కారణము. ఫలమునందు ద్వేషము కలిగినప్పుడు తత్సాధనముపై ద్వేషము కలుగును.

5. "విహితకర్మధర్మః । నిషిద్ధకర్మ మధర్మం ; వేదచోదితం విహితం । వేదనిందితం నిషిద్ధమ కార్యత్వా దవిహితం". అనగా హితకరమగు కర్మ ధర్మము. నిషిద్ధకర్మ అధర్మము. వేదముచే కర్తవ్యముగ బోధింపబడినది హితమగును. వేదముచే నిషేధింపబడునది చేయకూడనందున అహితము.

(5) బుధ్యాదయోహ్యాత్మగుణాః । నిత్యానిత్యరూపాః నిత్యో ఈశ్వర గుణాః । అనిత్యాజీవస్య" అనగా బుద్ధి మొదలగునవి ఆత్మగుణములు నిత్యానిత్య రూపములు, ఈశ్వరగుణములు నిత్యములు. జీవగుణము లనిత్యములు.

148. "సంస్కార స్త్రివిధః 1 వేగః 2. భావనారూపః 3. స్థితస్థాపకః

(1) పృథివ్యాదిభూత చతుష్టయ వృతయోః వేగః.

(2) అనుభవజన్య స్మృతిర్భావనా । అనుభవజన్యత్వేసతి స్మృతి హేతుత్వం భావనాలక్షణం ఆత్మాశ్రయవృత్తిః"

(3) "అన్యథాకృతస్య పునస్తాదవస్థ్యాఽపాదకత్వం స్థితస్థాపకం" పృథివి మాత్రివృత్తిః అనగా సంస్కారములు మూడు విధములు. 1. వేగము 2. భావన 3. స్థితస్థాపకము.

(1) పృథివి మొదలగు నాలుగుభూతముల వృత్తులు వేగము.

(2) అనుభవమున జనించినదగుచు స్మృతిని కలిగించునది భావన. ఇది ఆత్మాశ్రియ మాత్రమగువృత్తి.

(3) ఒకదానికంటె వేఱువిధముగ చేయదలచి మరలనదే విధముగ (పూర్వమువలె) చేయుట స్థితస్థాపకము. ఉః-అప్పిచ్చిన వానినుండి తప్పించుకొనుటకై యత్నించుటకు వెడలిపోవుచు మరల వానియింటి ముందుకే రాగల్గుట. దీనిని ఘటకుట్టి న్యాయమనవచ్చునందురు.

3. చలనాత్మకంకర్మ । తచ్చపంచవిధః ప్రాణవృత్తయః ఊర్ధ్వదేశ సంయోగహేతుః కర్మ ఉత్ క్షేపణం 2. అధోదేశ సంయోగహేతుః కర్మ

అధక్షేపణం 3. శరీరసన్నికృష్టహేతుః కర్మాకుంచనం 4. విప్రకృష్టదేశ హేతుః కర్మప్రసారణం 5. అన్యత్సర్వంగమనాది కర్మాణి". అనగా చలించుట మొదలగునవి కర్మలు. అవి 5 విధములు ఇవే ప్రాణిధర్మము:- (1) పైకిలేచుట 2. క్రిందికి పోవుట 3. ఆకుంచనము (ముడుచుకొనుట) 4. ప్రసారము (చాచుట) 5. తక్కినవి నడుచుట మొదలగునవి.

5, "పరంసత్తా అపరంద్రవ్యాదిః" అనగా సత్తామాత్రము పరము. ద్రవ్యాదు లపరములు.

6. "నిత్యసంబంధస్సమవాయః । అయుతసిద్ధవృత్తిః" అనగా నిత్య సంబంధముగలది అయుత సిద్ధము. నిత్యసంబంధములేనిది యుతసిద్ధమందురు. ఉ:— అవయవ అవయవికిగల సంబంధ మయుత సిద్ధము. తాత్కాలిక సంబంధములు యుతసిద్ధములు.

7. అభావశ్చతుర్విధః (1) ప్రాగభావః 2. ప్రధ్వంసాభావః 3. అత్యంతా భావః 4. అన్యోన్యాభావః" అనాదిసాంతం ప్రాగభావః ఉ:- ఇహఘటో భవిష్యతీతిప్రతీతి".

2. "ఉత్పత్త్యనంతరం కారణేన ధ్వంసజనితకార్యం ప్రధ్వం సాభావః। సచ అనంతకాలావస్థితి". ఉ:— దండేన ఘటభిన్న కార్యజనితం ప్రధ్వం సాభావః.

3. "త్రైకాలిక అసంసర్గోయో అభావస్స అత్యంతాభావః" ఉ:- భూత లేఘటోనాస్తి.

4. "తాదాత్మ్య వచ్ఛిన్న ప్రతియోగితాకాత్యం తాభావో అన్యోన్యా భావః" ఉ:— ఘటోనపటః. అనగా అభావము నాల్గువిధములు. (1) ప్రాగ భావము 2. ప్రధ్వంసాభావము 3. అత్యంతాభావము 4. అన్యోన్యా భావము.

1. ఆదిలేనిదగుచు అంతముగలది ప్రాగభావము. ఉ:— ఇప్పుడేకుండ కాగలదనుకొనుట.

2. పుట్టిన తరువాత పనిచే ధ్వంసమగునప్పుడిది ప్రధ్వంసాభావము. ఉ:– కఱ్ఱతో కుండపగులునప్పుడు కలిగినది.

3. కాలత్రయమునను సదృశ్యాభావమైనది అత్యంతాభావము. ఉ:- ఈ లోకమున నీకుసాటిలేదు.

4. ఒకదానియందొకటి లేకునికి అన్యోన్యాభావము. ఉ:- పటము నందు ఘటభావము, ఘటమునందు పటభావము లేకుండుటయే అన్యోన్యాభావము. పదార్థములన్నియు పై జెప్పిన సప్త పదార్థములలో నంతర్భూతమగుటచే పదార్థములు సప్త సంఖ్యాకములేయని తార్కికుల సిద్ధాంతము. 1. అర్థాపత్తి 2. అనుపలబ్ధిని వేదాంతు లొప్పినవి న్యాయకాండము నందంతర్భూతములు.

శాబ్దప్రమాణము సమాప్తము.

# 5. అర్థాపత్తి

149. ఉపపాద్యజ్ఞానేన తజ్జజ్ఞాన్యనం ఫలభూతార్థాపత్తేర్లక్షణం తత్కరణమర్థాపత్తిః । ప్రమాణం

1. తత్కరణన్నాంతః కరణంకింతు అనుమితౌ వ్యాప్తి జ్ఞానవత్సంస్కారజన్యవ్యాపారత్వేన, అనేన వినాఇదమనుపపన్నమిత్యాకారక ఉపపాద్యజ్ఞానకారణమర్థాపత్తేః ప్రమాణంకరణం. ఉ:- ''దేవదత్తోపీనః దివానభుంక్తే'' ఇతివాక్యేపీనత్వం భోజనంవినా అనుపపన్నంతస్మాద్దృష్టపీనత్వోపపత్తయే రాత్రిభోజనం కల్పనీయం। కల్పనజ్ఞానమేవార్థాపత్తిః కారణం. అనువ్యవసాయబలేన అర్థాపత్తిః జ్ఞానంభవతీత్యన్యే.

అనగా

ఒక లక్షణము కనపడుచుండ దాని కుపపత్తిని కలుగజేయుటకు మఱియొక దానిని ఉపపాదించుట సాధనమనబడును. దానితో సాధ్యమైనది ఉపపాద్యము. ఉపపాద్యము నెఱుంగుటకు సాధనమగు దానినే అర్థాపత్తికి

కరణమందురు. అనుమితియందు వ్యాప్తిజ్ఞానము కరణమైనట్లే సంస్కార జన్య వ్యాపారరూపమై యిదియును అర్థాపత్తికి కరణమగును.

ఎట్లన.

బలిసిన దేవదత్తుడు పగలు భుజింపడు. అను వాక్యమున కనిపించు లక్షణము పుష్టి. అది భోజనము లేనిది (ఉపపన్నము) సంభవముకాదు. కాన పుష్టిసంభవమగుటకు కారణమైన రాత్రిభోజనమనునది కల్పించ బడును. ఈ కల్పనచేతనే ''పుష్టి'' సమర్థింపబడినది. ఇదియే అర్థాపత్తి లక్షణము.

ఇది మఱియొక ప్రమాణము.

అనువ్యవసాయబలముచే అర్థాపత్తి జ్ఞానమగునని కొందఱనిరి.

## 6. అనుపలబ్ధిః

150 జ్ఞానకరణకాజన్య అభావానుభవాసాధారణ కారణమనుపలబ్ధిః

2. జ్ఞానకరణస్య అభావానుభవకరణత్వమనుపలబ్ధేర్లక్షణం. ప్రమాణం

3. తత్కరణనామ వ్యాపారరూపాఽసాధారణ కారణత్వం ప్రతియోగితాకతద్వ్యాప్త్యేతర, యావత్ప్రతియోగ్యుపలంభక సమహితత్వ మనుపలబ్ధేర్యోగ్యత్వం.

4. అధికరణస్యతాదృశ ప్రతియోగ్యుపలంభక సమపధానం యోగ్యతావచ్ఛేదకం.

5. ప్రత్యక్షజ్ఞానమపి ప్రత్యక్షప్రమాణజ్ఞాన జన్యమేవేతినియమోఽస్తి. బ్రహ్మాణిమానంతారా పరివృత్తేర్నిమీలితన యస్యదశమత్వా జ్ఞానాత్తాదృశజ్ఞానస్య పరోక్షజ్ఞానత్వేనైవ ప్రమాణత్వం నత్వపరోక్షం. అపిచ।

అభావస్యేంద్రియ వేద్యత్వేన ఆదిమత్వాత్పునరా మనుపపన్నత్వాత్తస్మాద భావజ్ఞానస్యానుపలబ్ధిః అతః ప్రమాణాంతరమితిసిద్ధం.

తా॥ చక్షురాదిందిరియజ్ఞానముచే గాక అభావమును దెలిసికొనుట యందసాధారణ కారణమగునది అనుపలబ్ధి ఇది ప్రమాణమగును. అంతః కరణమున కభావజ్ఞానము గలిగించుచే యనుపలబ్ధి ప్రమాణలక్షణము. అనుపలబ్ధిని దెలియజేయునది వ్యాపారరూపరహితమైన యసాధారణమై నయోగ్యతయే కారణము. కుందేటికొమ్ములు మొదలగు వాని యభావా నుభవ మనుపలబ్ధి ప్రమాణముననే దెలియబడును. ప్రతియోగి (ప్రతిపక్షం) దాని వ్యాప్తిలేనిది ప్రతిపక్షరహితమైనదే యనుపలబ్ధి యగును.

కాని అభావజ్ఞానము అనుపలబ్ధి గాజాలదు కాన ప్రమాణాంతరమగునని యర్థము.

6. యది తర్కమతానురోధేనాభావం సర్వత్రారోప్యస్థలే ప్రత్యక్షజ్ఞాన రూపమన్యథాఖ్యాతేన వర్తమానత్వాన్నాదోషోభవతీతి చేత్తర్హ్యన్య థాఖ్యాతమ నిర్వచనీయత్వాద్బాధపవ అనారోప్యస్థలేతు ప్రత్యక్షజ్ఞాన మన్యథాఖ్యాతంచేదప సిద్ధాంతాపాతః। వస్తుతస్తు అనుపలబ్ధి ప్రమాణస్య ప్రత్యక్షాది యోగ్యత్వాభావాన్నాభావజ్ఞాన మనుపలబ్ధిర్భవతి తస్మాన్న ప్రత్యక్షం, నానుమానం నోపమానం నశాబ్దం నార్థాపత్తిరతో అనుపలబ్ధిః ప్రమాణాంతరం.

తా॥ ఒకవేళ తర్కమతమునందలి పట్టుదలతో అభావము ఆరోపించ బడు నన్ని స్థలములందు ప్రత్యక్షజ్ఞానమే అన్యథాఖ్యాతమను నామాంతర ముగా జెప్పబడుచున్నదనిన అన్యథాఖ్యాతము అనిర్వచనీయముగాన అది యథార్థజ్ఞానచే బాధింపబడును. ఆరోపించబడని స్థలములందు ప్రత్యక్ష జ్ఞామన్యథాఖ్యాతమగు ననినచో నపసిద్ధాంతమునందు జేరును. యదార్థ

మున ప్రత్యక్షాది ప్రమాణములందనుపలబ్ధి చేరదు కాన, అభావజ్ఞానము నందంతర్భూతముగాజాలదు. ఇట్లు ప్రత్యక్షానుమానోపమానశాబ్దార్థా పత్తివలె అనుపలబ్ధిని వేరుగ నంగీకరించవలయును.

9. ''భేదాతిరిక్త పృథక్త్వాదౌ నిరూపితత్వేన లక్షణాభావాన్నతా వన్యోన్యాభావ విషయా''.

తా॥ పురోడాశాది ద్రవ్యముల పృథక్కరణములు (వేరుగా విభాగించినవి) నిరూపణమాత్రములే యగుటతో నవి యన్యోన్యాభావము నందంతర్భూతములు గాజాలవు.

10. అన్యోన్యాభావస్యాధికరణం సాదిత్వేసాదిరనాదిత్వే సత్యనాదిః.

తా॥ అన్యోన్యాభావములైనవి యాదిమత్తులైనచో అన్యోన్యాభావమాదియగును. నవి యనాదులగుచో నిదియు ననాదియనబడును.

11. జీవబ్రహ్మణోర్భేదే కల్పితేఽపితత్కల్పిత భేదస్యఅన్యోన్యాభావ ఏవ కారణం, తాత్త్విక భేదానభ్యుపగమాద్వియదాదివన్నాద్వైతవ్యాఘాతః।

శ్లో॥ 200. అక్షమాభవతఃకోయం సాధకత్వప్రకల్పనే।
కింనపశ్యసిసంసారం తత్రైవాజ్ఞాన కల్పితం ॥

తా॥ సాధనముల కల్పనయం దెవర సమర్థులగుదురు? కనుపించు సంసారమజ్ఞానకల్పితమగుట గనుపించుట లేదా? యున్నదని యర్థము అట్లే జీవబ్రహ్మలకు గల భేదము కల్పితముగావచ్చును. యదే అన్యోన్యాభావము నందు జేరును.

12. కల్పితభేదోపిద్వివిధః సోపాధికః నిరుపాధికః.

(1) ఉపాధిసత్తావ్యాపక సత్తాసోపాధిః ఉ:- ఆకాశస్యైకస్యాపిఘట, మఠోపాధిభేదేన భేదః.

(2) నిరుపాధిః నిర్ నిర్గతమత్యంతః ఉపాధికం. ఉపాధిసహితరహితమాత్ర భేదః—ఉ—ఘుపటాది విలక్షణ మాయోపాధిక చైతన్యం. శుద్ధచైతన్యం.

13. అర్థజ్ఞాన పరిశుద్ధికిగాను న్యాయశాస్త్ర ముపకరించును. వేదవిరుద్ధ మగు తర్కమే నిందితముగాని, ధర్మశుద్ధిన పేక్షించియవిరుద్ధమైన తర్కము అనుభవాంగముగ నపేక్షితము.

శ్లో॥ 201. ప్రత్యక్షంచాను మానంచ శాస్త్రంచ వివిధాగమం।
తత్త్రియస్సు విదితం కార్యం, ధర్మశుద్ధి మభీచ్ఛతః॥

తా॥ ప్రత్యక్షానుమాన శాబ్దములు మూటిచే పరీక్షింపబడినదే ధర్మమని దెలిసికొని ధర్మశుద్ధి నపేక్షించువారు కర్మలజేయనగును.

ఇది న్యాయశాస్త్ర సంగ్రహము

ఓం

శ్రీ గణేశాయ నమః

# ఆర్ష విజ్ఞాన సర్వస్వము

## ద్వితీయ గుచ్ఛము

### పూర్వమీమాంసాకాండము

### ధర్మలక్షణము

151. చతుర్దశ విద్యలలో పదమూడవది మీమాంసాశాస్త్రము. పూర్వోత్తర భేదముచే యీ మీమాంసాశాస్త్రము ద్వివిధమైనది. పూర్వమీమాంసాశాస్త్రము కేవలకర్మకాండనే ప్రతిపాదించును. ఉపనిషదర్థమును (వేదాంతార్థమును) విచారించునది ఉత్తర మీమాంస లేక శారీరిక మీమాంస. పూర్వమీమాంసాసూత్రములను జైమినిమహర్షి చెప్పెను. అందు పండ్రెండధ్యాయములు గలవు. జైమిని సూత్రములకు కుమారిలభట్టు భాష్యమును రచించెను. దీనికి శబరస్వామి వ్యాఖ్యానముగలదు. స్వతంత్ర గ్రంథములు గలవు. లోగాక్షి భాస్కరుడు విద్యార్థులకును, ఇతరులకును శాస్త్రప్రవేశము గలుగుటకు అర్థసంగ్రహమును వ్రాసెను. పండ్రెండధ్యాయములలో గల సూత్రముల సంఖ్య దాదాపు 2657. వేదాంత విచార మీ శాస్త్రమునం దనావశ్యకమైనందున ధర్మవిచారమునే ఇందు జేయనైనదని కేవల పదముతో సూచింపనైనది.

శ్లో॥ 202. భవ్యాయభూతమితికించ విధి ప్రధానే।
కాండేనయోయమిహ తద్విపరీతమాహుః।
భూతాయ భవ్యమితి భూతపరంహి సర్వం।
వేదావసాపమితి సూత్రకృదాచ చక్షే. సంక్షేప, శా. శ్లో 312

తా॥ అపూర్వముద్వారా స్వర్గాదిరూప ఫలములు గలుగుటకై చేయ బడిన విధ్యుక్తకర్మలు ఉపకరించునని పూర్వకాండయందు ప్రతిపాదించ బడినది. కాని నిష్కామనయా జేయబడిన కర్మలు చిత్తశుద్ధిని కలిగించి జ్ఞానోత్పత్తిద్వారా భూతసిద్ధమగు మోక్షమునకు ఉపకరించునని సూత్ర కారులు (వేదవ్యాసులు) చెప్పిరి. కావున వేదాంతములు భూతసిద్ధ బ్రహ్మపరములైనందున వాని విచారమీ పూర్వ మీమాంసాశాస్త్రమునంద నావశ్యకము. అప్రస్తుతమగుటచే బ్రహ్మవిచార మిందంతర్భవించదు. సాంగ చతుర్వేదాధ్యయనము, శ్రౌతకల్ప సూత్రములు గురుముఖాధ్యయనము జేసిన వారలకే ఈ శాస్త్రమునందు యథార్థజ్ఞానము గలుగును. ఇతరుల కది సాధ్యము గాజాలదు. కాన ఈ శాస్త్రమునందలి కొన్ని విషయము లీ సంగ్రహమునందు విచారించబడును. ద్వాదశాధ్యాయము లందలి సంగ్రహ విషయము లివి:—

152. ప్రథమాధ్యాయమునందు విధ్యాదుల లక్షణ, ప్రామాణ్యాదులు నిరూపింపబడినవి. ద్వితీయమున విధేయములైన కర్మల భేద నిరూపణము: తృతీయమున విహితకర్మలకు శేషశేషిభావ నిరూపణము, చతుర్థమున క్రతుప్రయుక్తానుష్ఠేయ కర్మలకును, పురుషార్థోపయుక్తములైన వానికిని ఉపయుక్తములగు పదార్థముల పరిమాణము విధింపబడినది. పంచమము నందు అనుష్ఠానయోగ్యములైన పదార్థములకు అనుష్ఠానక్రమము జెప్ప నైనది. షష్ఠాధ్యాయమున విహితకర్మ ఫలభోక్తలగు వారికి అధికార లక్షణము జెప్పబడినది. సప్తమమునందు ప్రకృతి యాగములందుపదేశింప బడిన అంగములకు వికృతి యాగములందు సామాన్యాతిదేశము నిరూపింప నైనది. అష్టమమునందు "ఆగ్నేయోఽష్టాకపాలః" ఇత్యాది ప్రకృతి యాగములందును, "సౌర్యంచరుం" ఇత్యాది వికృతి యాగములందును విశేషాతి దేశము గలదు. నవమాధ్యాయమునందు ప్రకృతి యాగము లందు జెప్పిన మంత్ర, సామ, సంస్కార కర్మలు వికృతి యాగములందతి దేశముగ ప్రాప్తింపునప్పుడు ప్రకృతి వికృతులందు అగ్ని సూర్యాదులకు వ్యత్యస్త భేదముచే (ప్రకృతి యందలి దేవతావాచకములను విడిచి వికృతి

యందు వ్యత్యస్త దేవతావాచకముల భేదముతో) అధ్యాహారమును ఊహా క్రమముగ కల్పించుకొనదగునని చెప్పనైనది. ఉ:- ప్రకృతియందు గల దేవతావాచకము "అగ్నయేజుష్టంనిర్వపామి" ఇత్యాదులు వికృతి యం దతిదేశప్రాప్తములగునప్పుడు అగ్ని పదత్యాగమున సూర్యపద మధ్యాహారము.

2. ఉ:- సామమునందలి "గిరాగిరాసదక్షస" అను ప్రకృత గిరాపద పరిత్యాగముచే వికృతియందు ఇరాపదమధ్యాహారము. ఇట్లే అన్ని సామముల యందని ఊహించవలయును.

3. ఉ. ప్రకృతియందు సంస్కారార్థమునకు చెప్పనైన వ్రీహ్యాది ద్రవ్యములకు బదులుగా వికృతియందు నివారాది ద్రవ్యాంతర సంబంధ మగునని అవఘాతాదులందూహగును, దశమాధ్యాయమునందు ప్రాకృ తాంగములు సావకాశములైన వానికి అతిదేశమగునప్పుడు వికృతియందు ఉపదిష్టములైన విశేషాంగములచే బాధకలుగునని చెప్పబడినది. ఉ:-ప్రకృతి యందలి "శరమయంబర్హిః" అను శరమయదర్భలకు వికృతియందు తద్వ్యతిరిక్తదర్భలని యర్థము. ఏకాదశమునం దనేకాంగములతో గూడి యుండు అంగికిగల విధ్యుక్తాంగముల కొకేసారి సంస్కారమును చేసినచో నన్ని యంగముల కట్టి ఉపకార సామ్యముగలదని చెప్పనైనది ఉ:-పౌర్ణ మాస్యయాగములు "ఆగ్నేయోష్టాకపాలః", "ఉపాంశుయాజమంతరా యజతి", "అగ్నిషోమీయ మేకాదశకపాలః" ఇత్యాదులందు కర్మ ప్రయుక్తములైన ప్రయాజాద్యంగముల కొకేసారి సంస్కారానుష్ఠానమును జేసినచో నదే సర్వాంగములకు ఉపకరించుననబడినది.

ద్వాదశాధ్యాయమునందు ఏకాంగి ప్రయుక్తమైనాంగానుష్ఠానముచే ప్రయోజన సామర్థ్యరహితములైన యితర అంగికి ఉపకారముగా వచ్చు నని చెప్పనైనది. ఉ:- "అగ్నిషోమీయం పశుమాలభేత" అను పశు తంత్రమునందు ప్రయోగింపబడు ప్రయాజాద్యంగములకు చెప్పిన సంస్కా రానుష్ఠానము పురోడాశాదులకు ఉపకరించుననిరి.

153. ఈ శాస్త్రమునందనుబంధ చతుష్టయము లివి:-

1. విషయము—ధర్మము (త్యాజ్యరూపమున నధర్మము విచారించబడినది).

2, అధికారి—అధీతవేద వేదాంగుడగు జిజ్ఞాసువు.

3. సంబంధము—బోధ్య, బోధక భావము.

4. ఫలము—స్వర్గాదిరూప సుఖము.

ఇట్టి శాస్త్రముజిజ్ఞాసువులకు విచారణీయమైనది, "స్వాధ్యాయోధ్యేతవ్యః" ఇత్యాది వాక్యములచే అధ్యయనము నియమ విధిగావిధించుటతో అర్థజ్ఞానయుక్తమైన అధ్యయనమే ప్రయోజనకారియగును. "ఫలవదర్థావబోధపర్యంతమాధ్యయనం" అను శ్రుతికి నియమార్థమునందే ప్రామాణ్యతకలదు. కాన కేవలవర్ణోచ్చారణ మాత్రమున అధ్యయనము పూర్తికాదు. "స్థాణురయంభారహారః" ఇత్యాది శ్రుతులు కేవలాధ్యయనము నింద్యమని జెప్పినవి. "యోర్థవిత్సకలంభద్రమశ్నుతే" ఇత్యాది శ్రుతులు అర్థయుక్త అధ్యయనమునకు ఫలము లుపదేశించినవి. కావున కర్మాధికారియగుటకు అర్థజ్ఞానసహితముగనే యధ్యయనముచేసి యుండవలయును. "విద్వాన్యజేత", "విద్వాన్యాజయతి", "విజ్ఞానేనయజ్ఞంతనుతే" ఇత్యాదులు ప్రమాణములు.

154. ఇట్టికారణములున్నందున అర్థయుక్తాధ్యయనముచేసిన యధికారి శ్రుతియందు జెప్పిన ద్రవ్య, దేవత, కర్మల స్వరూపమును దెలియుటకుగాను ఈ శాస్త్రమును విచారింపవలయును కాన విచారమునే జిజ్ఞాసయందురు.

౧. "అథాతోధర్మ జిజ్ఞాసా" ఈ మొదటి సూత్రమునుండి "అన్వాహార్యేచ దర్శనాత్" వఱకు జైమిని జెప్పిన సూత్రములను పూర్వమీమాంసయందురు. ప్రథమ సూత్రమునందలి "అథః" శబ్దమునకు ఆనంతర్యార్థము. అనగా అర్థయుక్తాధ్యయనమును జేసిన తరువాత యని

అర్థము. అధ్యయనమున కర్థజ్ఞానమే దృష్టఫలముకాన గనుపించు దృష్ట ఫల పరిత్యాగమునుజేసి యదృష్టఫల కల్పనజేయుట అన్యాయమగును.

శ్లో॥ 203 లభ్యమానేఫలే దృష్టే నాదృష్టః పరికల్పనా ।
విధేస్తు నియమార్థ త్వాన్నానర్థక్యం భవిష్యతి ॥

తా॥ దృష్టఫలము గనుపించుచుండగ నదృష్టఫలము గలదని కల్పన జేయరాదు. విధులు నియమార్థము లైనందున వ్యర్థములు కాజాలవు. ప్రథమ సూత్రమునగల రెండవపదము ''అతః'' అనునది హేతువు. ఏ కారణముచే నధ్యయనమునకు అర్థజ్ఞానమే దృష్టఫలమని చెప్పనైనదో ఆకారణమున యనుటకు "అత'' శబ్దము ప్రయోగించనైనది. అందే మూడవపదము ''ధర్మః'' అని కలదు. ధర్మశబ్దమున కనేకార్థములున్నను, ఇచ్చట రెండవ సూత్రమున ధర్మలక్షణమును నిశ్చయించుటచే నదే ధర్మశబ్దార్థమగును.

సూత్రమునందలి నాల్గవపదము ''జిజ్ఞాసా'' అనగా జ్ఞాతుమిచ్ఛా జిజ్ఞాసా= తెలిసికొను కోరిక. అధికారికి శ్రుతియందు జెప్పిన ద్రవ్య, దేవత, కర్మల స్వరూపమెట్టిది ? తాజేయుటెట్లు? అను మ తెలిసికొనుటకు ఇచ్ఛ సహజముగనే కలుగును. పూర్వకాలమునందిట్టి కర్మలు జేసిన వారలకు ఫలములు గలిగినవని. విధిచోదిత కర్మలజేయని వారలకు దుఃఖ ఫలానుభవములు గలిగినవని కథలు వినుటచే తనకు అట్టి సుఖఫలమే కలుగవలయును. దుఃఖ ఫలములు కలుగకుండునట్లు తప్పించుకొనవలయుననెడి యాస్తికిని ఇచ్ఛ యందురు. మఱియు తాను దేహాతిరిక్తుడని తెలియుటచే దేహము నశించినను తాను నశించడు. మృతశరీరమునొదలి సుఖదుఃఖాను భవార్థము నకై పరలోకములందు జేరియచ్చట స్వకర్మాను రూపఫల మనుభవించును. కావున ధర్మస్వరూపమును తెలియుటకు ఇచ్ఛగించును. ఇహలోక సుఖేచ్ఛచే తన ప్రయత్నమున భోగసంపత్తిని సమకూర్చుకొనువట్లు తనకు మరణానంతరము పరలోకాదుల గమనము నివార్యమైనందున ఇహలోక సుఖములవలె పరలోకములందును సుఖమే గావలయుననెడి కోరిక (ఇచ్ఛ) కలుగుట సహజము. ఇదియే జ్ఞాతుమిచ్ఛా జిజ్ఞాసార్థము.

155. "ధాతవః ప్రకృతయః । ప్రకృతేః ప్రత్యయార్థం గుణార్థంభవతి" అను న్యాయముగ "జిజ్ఞాసా" వాచకము ప్రకృతి. శబ్దశక్తి (పదార్థము) ప్రత్యయము. ప్రకృతి ప్రత్యయములతో నేర్పడిన యనుష్ఠాన యోగ్య జ్ఞానము "అజహల్లక్షణ" యాసంభవము. ప్రత్యయజ్ఞానము విచారసాధ్య మైనందున ఇచ్ఛాసాధ్యమైన విచారము "జహల్లక్షణ" చే సంభవమగు చున్నది. కావున ధర్మజ్ఞానము విచారణతో దెలియుఁనని తాత్పర్యము. ఇచ్చట కర్తవ్యపదము సూత్రమున లేనందున యధ్యాహారమని తెలియ వల యును. కర్మస్వరూపము వేదమునందు ఉత్పత్త్యాదివిధి వాక్యములతో జెప్పనైనది. అవి:-

శ్లో॥ 204. కుర్యా, త్క్రియేత, కర్తవ్యం, భవే, త్స్యాదితి పంచమం ।
ఏతత్స్యా త్సర్వ వేదేషు నియతం విధిలక్షణం.

తా॥ కుర్యాత్. క్రియేత, కర్తవ్యం, భవేత్, స్యాత్, అను పంచవిధభేద ప్రత్యయములతో శ్రుతులందు జెప్పిన వాక్యములు విధులు. కావున విచారము జేసిన ధర్మజ్ఞానము గలుగును ఇందు.

శ్లో॥ 205. యజ్ఞార్థాత్కర్మ ణోన్యత్ర లోకోయం కర్మబంధనః ।
తదర్థం కర్మ కౌంతేయ ముక్త స్సంగస్సమాచర. గీ. అ. 3. శ్లో. 9.

తా॥ కుంతీకుమారా! "యజ్ఞో వై విష్ణుః" అను ప్రమాణమున యజ్ఞముకొరకు (ఈశ్వర ప్రీత్యర్థమునకై) జేయు కర్మలుదప్ప తక్కినకర్మ లన్నియు బంధకరములు. ఈ లోకము కర్మనియంత్రణచే నిబంధితమైనది కాన నీవు ముక్తసంగుడవై । ఫలాపేక్ష రహితుడవై, కర్మల నాచ రింపుము.

శ్లో॥ 206. సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వమేష వోస్త్విష్ట కామధుక్. గీ. అ. 3. శ్లో. 10.

తా॥ యజ్ఞములతోపాటు, ప్రజలను బుట్టించి వారితో ప్రజాపతి సర్గాది కాలమునందిట్లనెను. మీరి యజ్ఞములతోడనే ప్రసవము (వృద్ధి=ఉత్ప త్తిని) జేసికొనుడు. ఈ యజ్ఞములే మీ కిష్టఫలములనిచ్చు కామధేను వగును.

శ్లో॥ దేవాన్భావయతానేనతేదే వాభావయన్తువః ।
పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథః ।

గీ. అ. 3. శ్లో. 11.

తా॥ మీరీ యజ్ఞములచే నింద్రాది దేవతలను వృద్ధిపఱచుడు. ఇంద్రాది దేవతలు మీచే యజ్ఞములందు పూజింపబడి మిమ్ముల వర్షాదులచే వృద్ధి పఱతురు. ఇట్లు మీ రొకరికొకరు ఉపకరించుచు శ్రేయస్సు పొందుడు.

శ్లో॥ 208. ఇష్టాన్భోగాన్హి వోదేవా దాస్యంతే యజ్ఞభావితాః ।
తైర్దత్తాన ప్రదాయైభ్యో యోభుంక్తే స్తైనఏవసః ॥

గీ. అ. 3. శ్లో. 12.

తా॥ యజ్ఞములచే పూజింపబడిన దేవతలు మీ కిష్టధనములను (అన్నాదులను) ఇత్తురు. వారిచ్చిన భోగాదులను యజ్ఞాదులందు వారికి సమర్పింపకయే స్వార్థమునందే ఉపయోగించుకొనువారు దొంగలగుదురు.

శ్లో॥ 209. యజ్ఞశిష్టా శినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ।
భుజంతే తేత్వఘం పాపాయే పచ్యంత్యాత్మ కారణాత్.

గీ. అ. 3. శ్లో. 13.

తా॥ దేవాది పంచమహా యజ్ఞముల నిర్వర్తించిన తరువాత యజ్ఞ శేషమును భుజించువారు సర్వపాపములనుండి విముక్తులగుదురు. కాని యెవరు స్వాత్మతృప్తి మాత్రమునకే పాకముల జేసికొనెదరో వారు పాప భోజనలగుదురు.

శ్రుతి॥ ఋక్ "మోఘమన్నం విందతేఽప్రచేతాః । నార్యంపుష్యతి నోసఖాయం ।
సత్యంబ్రవీమివధఇత్యతస్య । కేవలాఘోభవతి కేవలాదీ. ఋగ్వేదము.

తా॥ అజ్ఞుడు భుజించునన్నము వ్యర్థమగును. వాడు పూజ్యులను (అతిథులను) మిత్రులను పోషింప సమర్థుడు గాజాలడు. తన పొట్టకే తినువాడు కేవల పాపములనే దినువాడనబడునని శ్రుతి సత్యము నొక్కివక్కాణించినది.

శ్లో॥ 210. అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్న సంభవః ।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః గీ. అ. 3. శ్లో. 14.

తా॥ అన్నముచే ప్రజోత్పత్తి యగుచున్నది. (అన్నసారమే శుక్లశోణిత ముగ బరిణమించి ప్రజోత్పత్తి యగుచున్నది) వర్షముచే నన్నము సంభ వించును. యజ్ఞములచే వర్షము కురియును. కర్మచే యజ్ఞములు నిర్వర్తింపబడును.

శ్లో॥ 211. కర్మబ్రహ్మోద్భవం విద్ధిః బ్రహ్మాక్షర సముద్భవం ।
తస్మాత్సర్వగతం బ్రహ్మనిత్యం యజ్ఞే ప్రతిష్ఠితం.
గీ. అ. 3. శ్లో. 15.

తా॥ వేదోద్భవములు కర్మలు. వేదములు అక్షర బ్రహ్మ నిశ్వాస జని తములు కావున బ్రహ్మ సర్వవ్యాపి యగుటచే యజ్ఞములందు నిత్యరూప ముగ ప్రతిష్ఠించి యున్నాడు.

156. పై కారణములుండబట్టి యిచ్చట యజ్ఞములే ధర్మశబ్దమునకు ముఖ్యార్థముకాని యజ్ఞేతరములు ధర్మశబ్దమునకు ముఖ్యార్థములు గాజాలవు.

సూ॥ ౨. "చోదన లక్షణార్థోధర్మః" అనగా చోదన లక్షణార్థమునిచ్చునదే ధర్మము. వేద ప్రతిపాద్యమగుచు, ప్రయోజ కలదియై అర్థవంతమగు నది (అనర్థముల నివర్తించునది) చోదన లక్షణము. ఈలక్షణమునందలి విశేషణము సార్థకములు. అనర్థ హేతువులగున ధర్మమును గర్హించుటకై అధర్మ విచారణయిందు జేయనైనదని తాత్పర్యము. శాస్త్రము హేయోపాదేయము నుపదేశించి హితమును బోధించునది శాస్త్రమగును. ధర్మాధర్మము లతిసూక్ష్మములైనని కాన వానిని శాస్త్రమునదప్ప వేరు విధముగ తెలిసికొనుటకు శక్యము గాజాలదు.

శ్లో॥ 212. తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ ।
జ్ఞాత్వాశాస్త్ర విధానోక్తం కర్మకర్తు మిహార సి.
గీ. అ. 16. శ్లో. 24.

తా॥ కార్యాకార్య వ్యవస్థయందు (ధర్మాధర్మ నిర్ణయమునందు) నీకు శాస్త్రమే ప్రమాణమగుచు. కాన నీవు శాస్త్రమునందు జెప్పిన ప్రకారముగ తెలిసికొని కర్మ లనుష్ఠింపుము.

157. పై సూత్రమునందు ధర్మలక్షణము, ప్రమాణ లక్షణము రెండును గలవనిన యెడల వాక్యభేదమను దోషము కలుగవచ్చు ననరాదు. సూత్ర ముఖతః (వాచకమున) ప్రమాణ లక్షణము, అర్థతః (వాచ్యార్థమున) ధర్మలక్షణము జెప్పనైనదికాన నిర్దుష్టము. దీనిచే విధ్యాదులన్నియు స్వప్రమాణములగును. వేద పూర్వభాగమునందలి భేదములివి:-

1. విధి 2. మంత్రము 3. నామధేయము 4. నిషేధము 5. అర్థవాదము.

## భావనా విచారము

158. విధిభావనా రూపము. ఇందలి మతభేదములివి:—

(1) భట్టమతమునందు — శబ్దభావనావిధి.

(2) గురుమతమునందు—నియోగమువిధి.

(3) తర్కమతమునందు—ఇష్ట సాధనరూపమైనదివిధి.

భట్టమతమిట్లు:— "వ్యాపార రూపవిశేష శ్శబ్దభావనావిధిః". అనగా విధి శబ్దభావనారూపము. అది వ్యాపారవిశేషమనబడును. "భవితుర్భావనానుకూలభావ యిత్రు వ్యాపార విశేషః భావనాలక్షణం" కలుగబోవు పని కనుకూలముగ భావించువానియొక్క (కర్తయొక్క) వ్యాపార విశేషమును భావనయందురు. అథవా. "అన్యోత్పాదనానుకూలాత్మా భావనా సామాన్యం, సాధ్యరూపిణీ" లేదా ఆర్థీభావనా కలుగుట కనుకూ వ్యాపారరూపమైనది, సాధ్యమగునది భావనా సామాన్య లక్షణము.

శ్లో॥ 213. ధాత్వర్థస్య వ్యతిరేకేణ యద్యప్యేషా నలభ్యతే ।
తథాపిసర్వ సామాన్య రూపేణైవావగమ్యతే.

తా॥ భావన ధాత్వర్థమునకంటె వేఱుగ తెలియబడదు. అయినను సామాన్యముగనే భావనారూపము దెలియవచ్చును. ఉ:- "యజేత స్వర్గకామః" ఈ వాక్యమునందు స్వర్గరూప ఫలము మానసిక విషయ రూపముగ సిద్ధముగ నున్నట్లుచెప్పి తత్సాధనగ యజ్ఞమనుష్ఠేయమని ఫల కామునికి శ్రుతి ఉపదేశించినది. కాన ఫలోద్దేశ్యము స్వేచ్ఛామాత్రము అనగా స్వర్గరూపఫలము తనమానసిక విషయరూపము. "మానస విషయ త్వాకారేణసిద్ధ వన్నిర్దిశ్య తత్సాధనత్వేన అజ్ఞాతస్య యాగాదే రనుష్ఠానం ప్రతిపాద్యతః" ఇట్లు స్వర్గరూపఫల ముద్దేశ్యము. కాని స్వర్గరూపఫలము ప్రమాణాంతరములతో దెలియనందున సాధనగ యాగ మును జేయుమని శ్రుతి చెప్పుటతో విధియగును. పై యుదాహరణ మందలి యజిధాతువు ప్రకృతి, తవ్యప్రత్యయముతోగలసి విధ్యర్థమిచ్చును. ప్రత్యయము రెండంశములుగలది (1) ఆఖ్యాతము. (2) లిఙ్గము. ఆఖ్యాతాంశము భూత భవిష్యద్వర్తమాన కాలమును దెలుపు దశలకార సాధారణము. ఉ:- లట్, లిట్ ఇత్యాదులు. లిఙ్గంశము కేవల లిఙ్ మాత్రము ఇదే విధిని తెలుపును. కాని యనుష్ఠాన క్రియాశూన్యమైన యెడల సార్థకము గాజాలదు. "యాగ క్రియామంతరేణ సిద్ధస్వర్గ స్యాపిన ఫలసాధనత్వం. యథా పాకక్రియా మంతరేణోదనం నసంభ వతి" అనగా లోకమునందు పాకానుకూల ద్రవ్యములుండినను ముఖ్య మగు పచనక్రియ లేనిదే అన్నము ఫలరూపముగ గనుపించుటలేదో అట్లే యాగక్రియ ముఖ్యమైనది. శూన్యమగునప్పుడు (సాధన లేనప్పుడు) సిద్ధమైన (స్వర్గరూపఫలము) గాని సాధ్యము గాజాలదు.

159. "అకరణస్యాపి స్వసాధన నిష్పాదితస్య యాగాదేః స్వతోఽ పూర్వ ద్వారాభావనా భావ్యస్య స్వర్గరూప ఫల నిష్పాదకత్వం భవతి। భావార్థస్య యాగాదేరేక పదోపాత్తత్వేన భావనా" అనగా యాగాదులు సాక్షాత్తుగ స్వర్గరూపఫలమును బుట్టించుటందు సాధనలుగాకున్నను అవి స్వసాధనములతో నిష్పన్నములగుచు అపూర్వమను ఒకానొక ఫలమును

బుట్టించి తద్ద్వారా స్వర్గరూప ఫలముల నిచ్చును. భావనా విషయము లైన యాగాదులను ఒకే శబ్దమున బలుకుటందు సౌకర్యమున "భావనా"[7] యందురు. ఇట్లాఖ్యాత లిఙ్గాంశములతో చెప్పబడిన భావన రెండు విధములివి:-

1. శాబ్దీభావనా 2. ఆర్థీభావనా.

(1) శాబ్దీభావన="పరిస్పంద పరిణామ విలక్షణ, పురుష ప్రవృత్త్యాత్మికా, ఆర్థీభావనోత్ప త్త్యనుకూలో లిఙ్గాది శబ్దవాచ్యస్య వ్యాపార విశేషో శాబ్దీ భావనా। యద్యస్మాచ్ఛబ్దాన్నియమేన ప్రతీయతేత త్తస్య వాచ్యార్థః। యథాగామానయేతి వాక్యే గోశబ్దస్యగోత్వం। తథాలిఙ శ్రవణేప్యయంమాం ప్రవర్త యతీతి నియమేన ప్రతీతేః" అనగా తనంతట పరిణమించని (ప్రాణాది సంచలన విలక్షణమైన) పురుషుని బుద్ధిపూర్వకమున జేయబడినవగుచు ఆర్థీభావనానుకూలమగు లిఙ్గాదిశబ్ద వాచ్యార్థములైన వ్యాపారవిశేషము శాబ్దీభావనయగును. ఏ శబ్దముచే నేది నియమముగ దెలియబడునో యది దానికి వాచ్యార్థమగును. ఉ:- ఆవును తీసికొని రమ్మను వాక్యమునందు గోశబ్దమునకు గోత్వము (జాతి) విశేషార్థ మగు నట్లు లిఙ్ ప్రత్యయ శ్రవణముచే నది నన్ను ప్రవర్తింపుమని జెప్పుచున్న దనుచు దెలియబడును. కాన లిఙ్ ప్రత్యయము తనకనుకూల వ్యాపారమును బోధించు నియమము గలది. ఇట్లు ప్రత్యయానుకూల వ్యాపార త్వమే వ్యాపారవిశేష మనబడును.

(2) "అన్యపురుష విశేషకస్య (ప్రవర్తకస్య) అభిప్రాయ విశేషం అనుకూల వ్యాపారత్వం అనగా లోకమునందు ఆప్తుని వాక్యము (అభిప్రాయ ప్రవర్తకుని వాక్యము) ను వ్యాపార విశేషమందురు. హితబోధకుడే ఆప్తుడగును. శ్రుతులు శ్రోతృహితైషిణులైనందున ఆప్తత్వము వానికి గలదు. కాన వేదవాక్యములు స్వతః ప్రమాణములైనవి. వానికిని అనుకూల వ్యాపారత్వ విశేషణము గలదు.

3. "ప్రతారణాద్యజన్య హితాహితోపదేశ కర్తృత్వేసతి తద్భిన్నోపదేశా కర్తృత్వమాప్త వాక్యస్య లక్షణం" అనగా కర్మకాండయందుపదేశించిన వాక్యములనే ప్రతారణాద్యజన్యము లందురు. వానికే యిచ్చట హితాహితముల జెప్పునధికారముగలదు. హితము గ్రహించుటకు, అహితముత్యజించుటకును ఉపదేశింపబడును.

160. హితోపదేశములు పలువిధములనుండును అవి:-

(1) ప్రైషా, అతిసర్గః, ప్రేరణా, అజ్ఞా, అధ్యేషణా, అనుజ్ఞా, అనుమితిః ఇత్యాద్యనేకములు.

2. "ప్రమాణాంత పరిమిత్తేర్థే పురుపనిష్ఠాప్రైషః" అనగా ప్రమాణితములందలి అర్థమును గలిగించునది ప్రేషా.

2. "అతిసర్గస్తు కామచారః" అనగా స్వేచ్ఛాపరివర్తన అతిసర్గము.

3. "ఉత్కృష్టస్య నికృష్టం ప్రతిప్రవర్తనా ప్రేరణా" అనగా పెద్దవాడు చిన్నవానిని ప్రవర్తింపజేయుట ప్రేరణా.

(4) నికృష్టస్యోత్కృష్టం ప్రతిపరివర్తనా అధ్యేషణా" అనగా చిన్నవాడు పెద్దవానికిజేయు ప్రార్థన (విజ్ఞప్తి) అధ్యేషణా.

(5) సమం ప్రతిసమస్య ప్రవర్తనా ఉత్కర్షా పకర్షా దౌదాసీన్యాదిషు జాతానుమితిః" అనగా సములగువారు (ఉచ్చనీచములు లేనివారు) ఒకరినొకరు ప్రోత్సహించుటను మితి.

(6) సర్వేప్రైషాదయః జ్ఞాన విశేషోవా ఇచ్ఛావిశేషోవా చేతనధర్మాః। వేదేషు తదభావాద్వ్యాపారవిశేషః ప్రవర్తనాఖ్యో లిఙ్గాది వాచ్యార్థః। లోకేవేదేచ పూర్వోక్త ప్రవర్తనా రూపవ్యాపారత్వం శక్యతావచ్ఛేదకం। యథా ఉత్తమవృద్ధస్య విధివాక్యశ్రవణే మధ్యమ వృద్ధస్య ప్రవృత్తిం దృష్ట్వాబాలోపి తత్ప్రయోజక వ్యాపారమనుమిమీతే తదేవశక్యతావచ్ఛేదకం" అనగా పైజెప్పిన ప్రైషాదులుచే తన ధర్మములు కాని వేదములందట్టివి యసంభవములుగ్గాన లిఙ్గాదులే పురుష ప్రవర్తకములని తాత్ప

ర్యము. ఇట్లు లోకమునందేగాని వేదమునందుగాని ప్రవర్తనా రూప వ్యాపారము కలిగియుండుటయే భావన. ఉ:- ఉత్తమ వృద్ధుడు చెప్పు మాటను వినిమధ్యవృద్ధుడు అనుసరించుటను బాలుడుచూచి వానివలెనే తాను వ్యవహరించదలచుట భావన తెలియబడును. దీనినే తార్కికులు శక్యతా వచ్ఛేదకమందురు. బోధించునవి లిఙ్, లేట్ మున్నగునవి.

2. నియోగము - లిఙ్గాదులే పురుష ప్రయత్నరూప వ్యాపారమును నియోగించుట వలన నియోగము విధియగును. "కార్యవ్యుత్పత్యనురోధేన లిఙ్గా నియోగమేవ ప్రతీయతే" అనగా కార్యవ్యుత్పత్తి బలమున లిఙ్గమే వ్యాపారము చేయవలయునని, తెలిపి నియమించునందున నియోగము విధియగును. అన్యథా వేదమునం దప్రామాణ్యమేర్పడును. వేదము ప్రమాణమునగాన నిత్యకర్మలందును, ఉత్పత్యాది విధి వాకమ్ములందును నియోగము సాధనగ (కరణముగ) అన్వయించును.

3, ఇష్టసాధనము:- తర్కమతమునం దిష్టసాధనమే విధియని చెప్పనైనది. ఇది శబ్దభావన యందతర్భూతమగును. కాన మండనమిశ్రి, పార్థ సారథి మున్నగు మీమాంసజ్ఞులు తార్కికమతమును ఖండించి "నిరుక్తస్మ వ్యాపార విశేషస్యైవలిఙ్గాద్యర్థం శబ్దభావనా" అనగా పైజెప్పిన లిఙ్గాద్యర్థమె పురుషప్రయత్న వ్యాపార విశేషరూపమైనదే "శబ్దభావనా" యని సిద్ధాంతము చెప్పిరి.

161. శాబ్దీభావన 3 విధములు. (సాధ్య, సాధన, ఇతికర్తవ్యతా).

దేనిని భావించవలయునుప్రశ్న సాధ్యాకాంక్ష.

దేనిచే భావించవలయుననుట సాధనాకాంక్ష.

ఎట్లు భావించవలయుననుట ఇతికర్తవ్యతాకాంక్ష.

ఇట్టి యంశత్రయాపేక్షయందు, ఆకాంక్ష జేయుటచే ఇట్లు తెలియబడును:—

(1) సాధ్యాకాంక్ష యందార్థీభావన సాధ్యరూపముగా నన్వయించును.

(2) సాధనకాంక్షయందు లిఙ్గాది జ్ఞానము సాధనరూపమున (కరణత్వేన) అన్వయించును.

(3) ఇతికర్తవ్యతా కాంక్షయందు, అర్థవాద వాక్యములందలి ప్రశంసా, నిందాది శ్రవణచే కలిగిన జ్ఞానము (జ్ఞప్తి) ఇతికర్తవ్యముగ నన్వయించును. అనగా ఈ విధముగా ననెడి (ఇతి) ప్రకారమును బోధించున వగు నర్థవాద వాక్యములందలి, ప్రాశస్త్య నిందాది కథలు. వీనినే వేదమునం దర్థవాదములందురు. వీని లక్షణము లివి:—

(1) "విధేయతా వచ్ఛేదక సామానాధి కరణ్యత్వేన, బలవదనిష్టా ననుబంధిత్వేసతి, క్రియాజన్య దుఃఖాపేక్షయాఽధికేష్ట జనకత్వం విధ్యర్థవాద ప్రాశస్త్య స్యలక్షణం" అనగా నుత్కటమగున నిష్టముతో సంబంధించనిదై సాధారణ కర్మలచే కలుగు ప్రయాసాదులకంటెను అధికమగు సుఖము కలుగనని చెప్పునది ప్రాశస్త్య లక్షణము.

2. "నిషేధావచ్ఛేదక సామానాధి కరణ్యత్వేన క్రియాఫలాపేక్షయా అధిక దుఃఖ సాధనత్వ మప్రాశస్త్యస్య (నిందస్య) లక్షణం" అనగా సామాన్య కర్మలవలన కలుగు సుఖమునకంటెను అధికమగు దుఃఖమునే కలిగించునని చెప్పునది నిందాలక్షణము. ఇట్లు దెలిసికొనుటకు వాక్యమునగాని, పద, పద సమూహముచేగాని కలుగు జ్ఞానము కారణము గావచ్చును. ప్రత్యేక మొకటియే కారణమగుననరాదు.

3. "ప్రాశస్త్య లక్షణ మితికర్తవ్యతా సంబంధేన శబ్దభావనా యామన్వేతీతిబహవః। ఆర్థీభావనా యామన్వేతీతికేచన. వస్తుతస్తు ప్రాశస్త్యంస్వ విషయజ్ఞాన జన్యేష్ట విషయకోత్కట రాగజన్యత్వ సంబంధేన ప్రివృత్తావన్వేతి. అప్రాశస్త్యమపి స్వవిషయజ్ఞానజన్యాఽనిష్టవిషయ కోత్కటద్వేష ప్రయోజనాఽభావప్రితియోగిత్వ సంబంధేన నివృత్తావన్వేతి" అనగా ప్రాశస్త్య లక్షణము ఇతికర్తవ్యతా సంబంధముచే శబ్దభావనయందే అన్వయించునని పలువురు చెప్పిరి. ఆర్థీభావనయందు అన్వయించునని కొందఱ

మతము. వాస్తవమునకు, ప్రాశస్త్యము స్వానుకూలమగు, హితమమైన దానియందు పరిగాఢాను రాగమునుకల్గించి దానియందు ప్రవర్తింప జేయును.

నిందస్వానుకూలమగు, దానియందు ప్రగాఢద్వేషమును కలిగించి దాని నుండి నివర్తింపజేయును.

2. ఆర్థీభావనా:- "ప్రయోజనేచ్ఛాజనిత క్రియావిషయః పురుష వ్యాపారః ఆర్థీభావనా. స్వర్గాదిరూప ఫలేచ్ఛారాగాది విషయః ప్రయోజన మితి. ఫలేచ్ఛా సాధనముప సంక్రామతీతి న్యాయేన, రాగాది విషయజనితో యోయాగాది విషయః పురుష వ్యాపారరూప విశేషోసౌ ఆర్థీభావనా" అనగా స్వర్గాదిరూప ఫలములందలి కోరికచే బుట్టిన పురుష వ్యాపార విశేష రూపములగునవి ఆర్థీ భావన.

(2) "యస్మిన్ వ్యాపారేసతి కరణస్య ఫలోత్పాదన సామర్థ్యం భవతి, తాదృశ వ్యాపారమేవ ఆఖ్యాతస్య సామాన్యార్థః, నతుకేవల ప్రయత్నమాత్రం. తస్మాత్సర్వతః ఉత్పాదనానుకూల వ్యాపార సామాన్యమేవ ఆఖ్యాతార్థః, విశేషస్తు పశ్చాదాకాంక్షయా పురుష ప్రయత్నరూపత్వేన ఆఖ్యాతార మవగచ్ఛతి. ఇత్థం పురుషప్రయత్న రూపవిశేషణాదినా వ్యాపారఏవ ఆఖ్యాతాంశేన ఉచ్యతే". అనగా దేనియందు వ్యాపార ప్రవృత్తిచే కరణమునకు (భావనకు) ఫలమును బుట్టించు సామర్థ్యము కలుగునో అట్టివ్యాపారమే ఆఖ్యాతాంశమునకు సామాన్యార్థము. (ఆర్థీభావనయందలి నామ పదాంశమునకు సామాన్యార్థము) కేవల ప్రయత్నమాత్రమే ఆఖ్యాతాంశము కాజాలదు. ఆప్తు లగువారి (ప్రవర్తకుల) యభిప్రాయాను సారముగ నడచుకొను వ్యాపార మునే ఆఖ్యాతమందురు. అనంతర మాకాంక్షచే పురుషప్రయత్నము ఆఖ్యాతాంశమున జేరును. ఇట్లు పురుష ప్రయత్నరూప విశేషణములతో

వ్యాపారమే ఆఖ్యాత మనబడుచున్నది. ఇదే యర్థమును తెలుపు శ్లోకములివి:—

శ్లో॥ 214. భావనా ప్రేరణత్వాచ్చ శాబ్దీసావ్యాపృతిర్లిఙా ।
తస్యాఫలశిరస్కాయాః స్వజ్ఞానం కారణంభవేత్.

శ్లో॥ 215. తస్యాస్తుభావ్యం యత్నాత్మా భావనా భావికోపిలిఙ్ ।
ఇతికర్తవ్య మేతస్యాః ప్రశస్తమతి ధీర్భవేత్.

శ్లో॥ 216. తస్యాస్తు వాచకో లిఙ్లోట్ తవ్యాది ర్విధిరూపతః ।
అథార్థః భావనా కర్తృ ర్వ్యాపారోయత్న ఏవసః.

శ్లో॥ 217. భావార్థః కరణతస్యాం భావ్యంసర్గాది రిష్యతే ।
ప్రయాజాదీతి కర్తవ్యం కర్తాభావుక ఉచ్యతే.

శ్లో॥ 218. లిఙాదిత ల్లిఙ్త్వేన వాచకస్యాపిని త్యవత్ ।
ధాత్వర్థేనాన్వితావాచ్యాసైవ వాక్యార్థ ఇష్యతే.

సంక్షేప. అ. 1. శ్లో. 387.

"ఆర్థీభావనాపి అంశత్రి యపేక్షమతే".

1. సాధ్యాకాంక్షాయాం=స్వర్గాది రూపఫలం సాధ్యత్వేన అన్వితం.

2. సాధనాకాంక్షాయాం=యాగాదీనాం కరణత్వేనాఽన్వయం.

3. ఇతి కర్తవ్యతాకాంక్షాయాం = ప్రయాజాదీ నామంగత్వేనాన్వయః. అనగా ఆర్థీభావనయందు శబ్దభావనయందు వలే త్రివిధాకాంక్ష కలదు ఆకాంక్ష "కిం" శబ్దముచే తెలియబడును. ఇందు:-

(1) సాధ్యాకాంక్షయందు = స్వర్గ రూపఫలము సాధ్యముగ నన్వయించును.

(2) సాధనాకాంక్షయందు=యజ్ఞాదులు కరణత్వముగ నన్వయించును.

(3) ఇతికర్తవ్యతా కాంక్షయందు=ప్రయాజాదు లంగత్వముగ నన్వయించును. "ఇత్థముక్త ప్రకారేణాంశత్రయోపేత భావనా భావ్యమా

కాంక్షద్వారా "యజేత స్వర్గకామః" ఇతి ఉదాహృత వాక్యే యాగేన స్వర్గరూప ఫలంభావయే దితి వాక్యార్థః. తేనయాగం కుర్యాదితి విధి ర్వేదచోది తత్వాచ్చోదన లక్షణార్థోధర్మః ద్వితీయసూత్ర తాత్పర్యం" అనగా పైజెప్పినట్లు త్రివిధాకాంక్షచే భావన సాధ్యమైనది స్వర్గరూప ఫలనుని తెలియబడును. కాన పైన ఉదాహరణగా జెప్పిన "యజేత స్వర్గకామ యను వాక్యమునందు యాగముచే (కర్మచే) స్వర్గరూపఫలము కలుగునని వాక్యర్థమైనందున యాగమును జేయుమనుచు వేదము విధి వాక్యాములతో దెలిపినది. ఇట్లు రెండవ సూత్రమునందు జెప్పబడిన చోదన లక్షణార్థమైనది ధర్మము,

2 "తతోయాగాదేః స్వసాధన నిష్పాది తస్యసతో అపూర్వస్య నిష్పాద కత్వం సంభవతి. తచ్చాపూర్వం ధర్శపూర్ణ మాసాదిరూపేణానేకం". అనగా యాగాదులు స్వసాధనలతో నిష్పన్నముఃగుచునవి యపూర్వమను నొక విశేషఫలమును బుట్టించును. ఆయపూర్వము స్వర్గరూపఫలమును కలిగించును. యాగాదికము దర్శపూర్వమాసాది రూపములైనవి యనేక విదములు.

162. 1. "అపూర్వశ్చతుర్విదః ఫలాపూర్వః 2. సముదాయాపూర్వః 3. ఉత్పత్త్యపూర్వః 4. అంగాపూర్వః ఇతి".

(1) "యేన (యాగసాధనేన) స్వర్గరూపఫలముత్పద్య తేతత్ జన కత్వేన ఫలాపూర్వ మిత్యుచ్యతే. ఉ - దర్శపూర్ణ మాసాదియాగః.

(1) అనగా అపూర్వము నాలుగు విధములివి:—

1 ఫలాపూర్వము 2. సముదాయాపూర్వము 3. ఉత్పత్త్యపూర్వము 4. అంగాపూర్వము,

(1) దేనిచే స్వర్గరూప ఫలముదయించునో అది ఫలాపూర్వమనబడును. ఉ:- దర్శపూర్ణ మాసాదిక యాగములు.

(2) సముదాయశ్చ తాభ్యాంజస్యాపూర్వః సముదాయపూర్వః సచ ।

(1) ద్వివిధం అమావాస్యాయాం యాగత్రియ నామకస్సముదాయః ఉ:- "ఆగ్నేయయాగః యథాగ్నేయో రష్టాకపాల మమావాస్యాయాం".

(2) ఐంద్రపయోయాగః="ఇంద్రంపయ। అమావాస్యాయాం"

(3) ఐంద్రదధియాగః="ఇంద్రందధ్యమావాస్యాయాం" పైమూడు యాగములు గలసిన దర్శేష్టి నామక యాగత్రయ మొక సముదాయము.

2. "పౌర్ణమాస్యాం యాగత్రయ నామకో ద్వితీయస్సముదాయః".

(1) ఉ:- ఆగ్నేయయాగం = "యథా ఆగ్నేయోఽష్టాకపాలోఽమావాస్యాయాంచ పౌర్ణమాస్యాం చాచ్యుతో భవతి".

(2) అగ్నీషోమీయయాగం:- ఉ:- "తాభ్యామేత మగ్నీషోమీయమేకాదశ కపాలం పౌర్ణమాస్యాం ప్రాయచ్ఛతి".

(3) ఉపాంశుయాగం:- ఉ:- ఉపాంశు యాజమంతరాయజతి. "తావబ్రూతా మగ్నీషోమా వాజ్యస్యైవనా తావుపాంశు పౌర్ణమాస్యాం" ఇతి ద్వితీయస్సముదాయః. అనగా పౌర్ణమాస్య యాగత్రియము అమావాస్య యాగసముదాయ త్రికముతోగలసి రెండును సముదాయాపూర్వమనబడును.

3. "ఉక్తసముదాయద్వయే ఏకైక సముదాయ వర్తినాం యాగత్రయాణాం భిన్నక్షణ వర్తినాం సంహత్యసముదాయ జన్యయో రపూర్వయో రేకాపూర్వ జననాయాఽయోగ్యాత్తజ్జన నాయయాగత్రయ ద్విత్వయోర్జన్యాని త్రీణ్యుత్పత్త్య పూర్వాణి కల్పనీయాని తస్మాద్యాగత్రయే కల్పితా పూర్వాణి సముదాయ ద్వయయోరుత్పన్నానుత్పత్త్య పూర్వాణీత్యుచ్యంతే.

4. "యాగత్రికాణాంచ, తేషామంగోపకార మంతరేణానుత్పత్తేః అంగానాంచానేకక్షణవర్తిత్వేన సంహత్యోత్పత్త్య పూర్వారంభాఽయోగ్యత్వాత్తదారంభాయాంగా పూర్వః కల్పనీయః, సఏవాంగాపూర్వః

ఇత్యుచ్యతే". సచద్వివిధః। సన్నిపత్యోపకారాణిఆరాదుపకారాణీతి। తథాచ సర్వాణ్యపూర్వాణి స్వస్వోత్పత్త్యపూర్వాణిద్వారా సంహత్య ప్రథానాపూర్వసాహిత్యంచోపపన్నం భవతి। ఏవంచ ప్రథానోత్పత్త్యపూర్వం సాంగవైశిష్ట్య రూపేణ సంహత్యఫల జనకీ భూత ఫలాపూర్వ నామకః, మహాపూర్వం జాయతే। అపూర్వస్యాత్యంత అదృష్టత్వాదనేకాపూర్వకల్పనాయాం గౌరవత్వేన, సర్వేషాం పదానామేక వాచకత్వే పర్యాయత్వ ప్రసంగా, దేకఏవ అపూర్వః స్వీకర్తవ్యః. తస్యాపూర్వ నామధేయ మాఖ్యాతాంతం నతుకర్మ నామధేయ మితిబోధనం"

163. కర్మ ప్రతిపాదనజేయు వేదభాగము మంత్ర, బ్రాహ్మణ భేద ద్వయముగనుండును. అట్టి వేదము పంచవిధములైనది. ఇవి:- 1. విధిః 2. మంత్రః 3. నామధేయః 4. నిషేధః 5. అర్థవాదః.

విధిభాగమం దవాంతర భేదములు నాలుగు. ఇవి:- 1. ఉత్పత్తివిధి 2. వినియోగవిధి 3. ప్రయోగవిధి 4. అధికారివిధి.

## 1. విధిమీమాంసా

164. "మానాంతరేణాఽజ్ఞాతార్థస్య జ్ఞాపక వేదవాక్యోవిధిః" అనగా ప్రమాణాంతరములచే తెలియబడని యర్థమును దెలియజేయు వేద వాక్యము విధియనబడును. ఉ:- "అగ్నిహోత్రం జుహ్యాత్స్వర్గకామః" అనగా స్వర్గమున్నట్లే ప్రమాణాంతరములతో దెలియబడక శబ్దప్రమాణ మగు వేదవాక్యముననే దెలియబడుటచే పై వేదవాక్యము విధియందురు. విధులందు మూడువిధములైన యవాంతర భేదములు గలవు:-

1. ఉత్పత్తివిధిః 2. గుణవిధిః 3. విశిష్టవిధిః.

(1) ఉత్పత్తివిధిః= "కర్మస్వరూపమాత్ర బోధకో విధి రుత్పత్తివిధిః" ఉ:- "ఆగ్నేయోష్టాక పాలోఽమావాస్యాయాంచ పౌర్ణమాస్యాంచా

చ్యతోభవతి". అనగా కర్మస్వరూపమును మాత్రము బోధించువిధి ఉత్పత్తి విధి. ఉ:- పైనజెప్పినది.

(2) గుణవిధిః—"యత్రకర్మ మానాంతరేణ (ఉత్పత్తి వాక్యేన) ప్రాప్తం తదుద్దేశ్యేన గుణమాత్రం విధత్తే తద్గుణవిధిః". ఉ:- "దధ్నాజుహోతి". అనగా ఉత్పత్తి విధివాక్యముచే ప్రాప్తించిన విధినుద్దేశించి గుణమాత్రమును విధానము జేయునది గుణవిధియగును. పై ఉదాహారణయందు దధిహోమార్థమగుటకు ఉత్పత్తి విధిచే నగ్నిహోత్రము సిద్ధించుటతో దానికిది గుణము. దధిని విధించుటచే నిది గుణవిధి యన బడును.

3. విశిష్టవిధిః—"యత్రోభయ మప్యప్రాప్తం తత్రవిశిష్టవిధిః". అనగా ఉత్పత్తి విధియందుగాని, గుణవిధియందుగాని, జేరనిది విశిష్టవిధి యన బడును. ఉ:- "సోమేనయజేత" అనువాక్యమందు సోమేన యను తృతీయావిభక్తి నిర్దేశింపబడుటతో సోమయాగమగునా, లేక సోమద్రవ్య గుణమా వేరొకచేదైన యాగమగునా యనుసందేహమైనప్పుడు ఉత్పత్తి విధియందు జేర్చు వాక్యము లేనిదే సోమయాగమగుటకు తృతీయా నిర్దేశము గలదుగాన వీలులేదు. (ఉత్పత్తివిధిని దెలిపిన వేరొక వాక్యముండునప్పుడే చెప్పిన తృతీయచే గుణవిధి గావచ్చును) అన్యథా గుణము గాజాలదు. వేదమందు జెప్పిన వాక్యము నిరర్థకమనినచో వేదమ ప్రామాణ్యమనబడును. కాన నిది విశిష్టవిధియందు జేరును. సోమ పదమునకు మత్వర్థ లక్షణభియా సోమ ద్రవ్యార్థముచే గుణమగును. సోమ ద్రవ్యమునకు చెప్పబడిన దేవతను లక్షణయా గ్రహించి తన్నామక యాగమనగ "సోమవతా యాగేనేష్టం భావయేత్" ఇష్టమును (యాగ ఫలమును) భావన జేయునగును. ఇట్లు శేషశేషి లక్షణ జెప్పబడినదని తాత్పర్యము. "శేషవిశిష్ట గుణేన శేషిణం భావయేత్ విధేయస్యచోభయనిమిత్తత్వా భావేన నవాక్యభేదః, విశిష్ట పదార్థేన వ్యాపారభేదాభావాన్న వికల్ప ప్రశక్తిః" అనగా విశిష్ట యాగమునందు సోమద్రవ్య దేవత, లక్షణయా సిద్ధించినందున ఆదేవత ఒకే రూపుడుగాన వాక్యభేద

దోషము కలుగజాలదనగ శేషశేషిలక్షణయందు శేషగుణముచే శేషి భావన గావచ్చునందురు. విధేయమైనయాగ ముభయనిమిత్తములు లేని దగుటతో వాక్యభేదము గలుగదని యర్థము. పదార్థవ్యాపార భేదము లేని దగుటచే నిందు వికల్పదోష ప్రసక్తియుండదని తాత్పర్యము.

శ్లో॥ 219. శ్రౌతవ్యాపార నానాత్వే శబ్దానామతి గౌరవం ।
ఏకోక్త్యవసితానాంతు నార్థాక్షేపో విరుధ్యతే.

తా॥ శ్రౌతప్రయోగవిధి నానావిధ వ్యాపారరూపమైనది. అనేక శబ్ద ప్రయోగము కలుగుటతి గౌరవమనుపించును. (హెచ్చగును) కాని ఒకే శబ్దము నానార్థములనిచ్చునది ప్రయోగించుట దోషముగాజాలదు. వాక్యమునందు వికల్పము, వాక్యభేదములనునవి దోషములనబడును.

165. వికల్పము— "విధేయోభయ రూపనిమిత్తేన విశిష్టపదార్థ వ్యాపారో వికల్పః" అనగా నిమిత్తభేదముచే విధేయ ముభయరూపమగునప్పుడు వానిని గురించి విశిష్ట పదార్థము లనేకము లుపయోగించుట (వ్యాపారము) వికల్పమనబడును. ఇది అష్టదోషములతో దుష్టమైనది. ఉ:— "వ్రీహిభిర్యజేతయవైర్వా" ఈ వికల్పవాక్యమునందు ప్రథమ పర్యాయము నందు వ్రీహీ (వరిధాన్యము) గ్రహణముచేయునప్పుడు ప్రామాణ్యమైన యవలను స్వార్థానుష్ఠాపకములైనను వానిని అప్రమాణముగ పరిత్యజించిన. 2. స్వార్థానుష్ఠాపకత్వాఽప్రమాణముగ వ్రీహీలను పరిగ్రహించిన రెండవ పర్యాయమునందు యవలను గ్రహించినప్పుడు (1) పూర్వపరిత్యక్తమైన యవశాస్త్ర ప్రమాణమును మరల గ్రహించిన దోషము. 2. గ్రహించిన వ్రీహులన ప్రమాణముగ పరిత్యజించిన దోషము, లిట్లు నాల్గు దోషములు వ్రీహీ గ్రహణపక్షమునందు గల్గును. ఇదే విధముగ యవగ్రహణ పక్షమునందు నాల్గుదోషము లుద్భవించును. కాన యన్నియును గలసి యష్టదోష దుష్టమైనది కాని వ్రీహ్యావలు పురోడాశ ద్రవ్యములగుటచే గత్యంతరము లేనందున సంభవమైనవి గ్రహణయగును. వికల్పము త్రివిధములు:—

(1) ఐచ్ఛికవికల్పము. ఉ:— "అతిరాత్రే షోడశినం గృహ్ణాతి నాతిరాత్రే షోడశినంగృహ్ణాతి" అనగా అతిరాత్రి యాగమునందు షోడశియనుపాత్రి విశేషగ్రహణాఽగ్రహణమైచ్ఛిక వికల్పము.

2. సంభవవికల్పము. ఉ:— "వ్రీహిభిర్యజేతయవైర్వా". అనగా దేశకాలానుగుణ్యమున లభించు, వ్రీహియవలందేది లభించునో అదే గ్రహించి దానితో యాగమును జేయవచ్చును. ఇది సంభవవికల్పము.

3. వ్యవస్థిత వికల్పము. ఉ:— "ఉదితే జుహోత్యనుదితే జుహోతి" అనగా ఋగ్యజుశ్శాఖా భేదమున, ఆశ్వలాయనులు ఉదయాత్పూర్వము నందు, ఆపస్తంబులు (యజుర్వేదులు) ఉదయానంతరము హోమమును జేయవచ్చును. ఇది వ్యవస్థచే నేర్పడిన వికల్పము.

166. వాక్యభేదము—"ఆవృత్తి రూపలక్షణో వాక్యభేదః । విధేయస్య వాక్యస్య ప్రత్యేక ముభయథాఽవృత్త్యావ్యాపార రూపభేదేన ఉభయ విధానం వాక్యభేదస్య లక్షణం". ఉ:- "సోమేనయజేత" అనగా వాక్యమునందు సోమయాగమని చెప్పు పక్షమునందు సోమేనయాగం భావ యేద్యాగేనేష్టం భావయేత్తని, ఆవృత్తి జేసినచో ఆవృత్తిరూప మగుటచే వాక్యభేదమను దోషము కలుగును. విశిష్టవిధియందు (పైన జెప్పినదే) యిందుదాహరణగా జెప్పబడినదనుచు నచ్చట విధేయ ముభయరూప మైనను, తద్విధాయక వాక్యముచే వ్యాపారభేద ముండగ, నావిధానము గుణమెట్లు గావచ్చునని శంకించినచో విశిష్టవిధియందు ల్యుదాహార మందు మత్వర్థలక్షణభియా జెప్పబడినది. అనగా విశిష్టమందు విశిష్ట మొకే రూపమైనదిగాన విధేయమున కుభయరూపత్వసిద్ధిలేదు. కేవల పదార్థ వ్యాపారరూప భేదముండినను వాక్యభేద దోషము గాజాలదని పై పరిమాణముగలదు. విశిష్టవిధియందు శేషి (విధేయము) లక్షణయా సిద్ధమగుటతో విధేయమున కుభయరూపముల సిద్ధిలేదు. గుణమునకు పృథగ్విధేయత్వము గలదు. ఒక వేళన ఉత్పత్తి విధిని విశిష్టవిధియందు జేర్చినచో వాక్యభేద దోషము లేకుండినను లక్షణదోషము గల్గుట అనివార్య

మగుననిన యెడల నాదోషము సత్యమేయైనను వాక్యభేద దోషమున కంటెను లక్షణ కల్పన దోషమనబడదు. "గుణేత్వ న్యాయకల్పనః" అను ప్రమాణముచే పదవాక్యదోషములందు పదదోష స్వీకరణే ఉచిత మనబడినది. కావున విశిష్టవిధి నిర్దోషమని యర్థము.

167. యాగరూపము—"యాగస్యద్వే స్వరూపే। ద్రవ్యం, దేవతా చేతి" అనగా విధివాక్యములందు ద్రవ్యమునేగాని, దేవతనుగాని లేక నుభయములగాని జెప్పబడును. ఇట్లు యాగస్వరూపమును ద్రవ్యముచే గాని, దేవత నామముచేగాని దెలియవచ్చును. ఉ:- "అగ్నిహోత్రం జుహ్యాత్స్వర్గకామః" అనగా అగ్నిదేవతాక యాగనామమర్థము. ఒక వేళ అగ్ని శబ్దమునకు తత్ప్రఖ్యాశాస్త్ర న్యాయముచే నామధేయమగు నని శంకించినచో రూపాశ్రవణయున్నంతనిదే యుత్పత్తివిధి కాదని జెప్ప రాదు. 'దధ్నాజుహోతి' యన్నప్పుడు దానినిగూడ రూపమాత్ర శ్రవణయున్నందున ఉత్పత్తివిధి యనవలసివచ్చును. ఒక వేళ ఇచ్చట ద్రవ్యదేవతా రూపములు రెండు వినబడుట లేదనినచో విధ్యనుపపత్త్యా తత్కల్ప్యతే యని శాస్త్రజ్ఞులనిరి. గుణవిధి యందెట్లు మంత్రవర్ణము లతో కర్మస్వరూప మేర్పడునో యట్లే 'అగ్నిహోత్రం జుహ్యాత్'ను వాక్యమునందు ద్రవ్యదేవతారూపములు దెలియబడకున్నను, కర్మస్వరూప మైన హోమమాత్రము దెలియబడినందున నుత్పత్తి విధియగుననుటే యుచితము. అన్యధా అనుపపత్తి రూపబాధయగును. ఎట్లన రూప శ్రవణచే 'దధ్నాజుహోతి' వాక్యమే యుత్పత్తి విధియగుచో "పయసా జుహోతి" అను వాక్యముచే పాలు దానికి గుణము గాజాలదు. హోమము దధిచేయ వరుద్ధమగుచున్నందున పయోగుణముచే హోమము జేయ రాకుండును. అనగా హోమము ఉత్పత్తిశిష్టము గాన నది దధిచేయ వరుద్ధమగుటతో పయోగుణము విధియగుననుట సంభవించదని యర్థము. అప్పుడది కర్మాంతరమనిగాని లేక ననేకా దృష్టకల్పనలేగాని జేయవలసి వచ్చును. కాన 'అగ్నిహోత్రం జుహ్యా' దనునదే యుత్పత్తివిధి యగునని యంగీకరించినచో దధ్నా పయసా ఇత్యాదులన్నియు 'ఖలేకపోత' న్యాయ

మున నన్నింటిని గుణవిధులగు ననవచ్చును. అప్పుడే కల్పనలను కల్పించుట కవసరమేర్పడదు. ఉత్పత్తివిధియందు 1. అపూర్వవిధి 2. నియమ విధి 3. పరిసంఖ్యావిధి అని మూడు అవాంతర భేదములు కలవు.

## 2. వినియోగవిధిః

168. "అంగ సంబంధబోధకో విధిర్వినియోగవిధిః". అనగా ప్రధానమైన యాగమునకును దాని యంగములకు గల సంబంధము దెలుపునది వినియోగ విధి యనబడును. ఉ:— "దధ్నాజుహోతీ" ఇందు తృతీయ శ్రుతిచే అంగభావమైన దధిహోమ సంబంధమును విధించుటతో 'దధ్నా హోమంభావయేత్' అని యర్థము. దధిచే హోమమును భావించవలెను.

2. ఒకవేళ దధ్నాజుహోతి వాక్యము అంగ ప్రధానములకగు పరస్పర సంబంధమునేగాక వాక్యాంతర రూపమున శేషిత్వలక్షణమును దెలుపుటతో గుణవిధి గాదు. ఇందు 'దధ్నా హోమంభావయేద్హోమే నేష్టం భావయే' అనినచో సాధ్యత్వేన కరణత్వేన అన్వయమగుచు వాక్యభేద దోషమగును. మరియు దధ్నాజుహోతి యను సకృదుచ్చారణ మాత్రమున జుహోతి పదమాఖ్యాత మగుననియు దానికి దధిగుణమనిన యెడల అప్పుడు యుగపత్తంత్ర మంగీకరించినట్లగుచు విరుద్ధ త్రికద్వయ దోషమందురని శంకరావచ్చును.

169. విరుద్ధ త్రికద్వయదోషము = 1. 'ఉపాదేయత్వం 2. విధేయత్వం 3. గుణత్వం ఏకత్రికం'=ఫలముద్దిశ్యహోమ ఉపాదీయతే 2. ఫలమనూద్యహోమో విధీయతే 3. ఫలం ప్రధానోహోమః ఉపసర్జనం గుణః ఇత్యేకత్రికః పక్షః.

(2) 'హోమముద్దిశ్యదధ్యుపాదీయతే 2. హోమ మనూద్యదధి విధీయతే హోమం ప్రధానం దధిగుణమితి ద్వితీయత్రికః పక్షః'. అనగా

1. ఫలాపేక్షయా ఉపాదేయత్వవిధేయత్వ ప్రాధాన్యత్వములు.

2. హోమసాపేక్షయా ఉద్దేశ్యత్వ మనువాద్యత్వ గుణత్వములను విరుద్ధ ద్వయ సమాగమ మను దోషమగుటచే తంత్రి సంబంధములేని దగుచు ఆవృత్తి రూపవాక్యభేద సంబంధమగును. కావున దధిగుణము గాజాలదని పూర్వపక్ష తాత్పర్యము. దీనికి సమాధానము సిద్ధాంతమునందిట్లు:-

170. ఎచ్చట (సాధ్యత్వేన సాధనత్వేన) యుగపత్తంత్ర సంబంధము గలదో అచ్చటనే విరుద్ధ త్రికద్వయ దోష ప్రసంగము రావచ్చును. కాని వినియోగ విధి యందు దధిగుణమునకు సాధ్యత్వేన సాధనత్వేన యుగపత్సంబంధ మంగీకరించబడలేదు. సాధనత్వేన మాత్రిమే అన్వయము జెప్పనైనది. ధాత్వర్థమునందు యాగదాన హోమాదులకు ఏవకారము జెప్పబడినందున సాధ్యత్వేనాన్వయము నివారించి కేవల సాధనత్వేన అన్వయమగుననిరి. కాన గుణ విధియందు దధికి సాధనత్వముగలదు. ఉత్పత్తి విధియందు మాత్రమే దధికి సాధ్యత్వేన అన్వయమును జెప్ప వచ్చును. ఉదాహరణగా 'దధ్నేంద్రియ కామోజుహ్యాత్' ఈ వాక్యము నందు దధికి గుణవిధి లేనందున గుణపదమానర్థక్యమగును. ఉభయ రూపాన్వయము జేసిననే పూర్వోక్త విరుద్ధ త్రికద్వయ దోషము కలుగును. ఇట్టి యుత్పత్తి విధియందే దధికరణత్వేన అన్వయించును. యథా 'దధ్నా ఇంద్రియం భావయేత్, కిన్నిష్ఠమిత్యాకాంక్షాయాం సన్నిధి ప్రాప్తహోమాశ్రయత్వేన దధి' అని యన్వయించవచ్చును. ఇట్లుత్పత్తి విధియందే గాని యధికారివిధి యందుగాని దధికి గుణము ఆశ్రమాశ్రయము. ఫల భావనాయందే దధికి ఉభయాన్వయము. (సాధ్య సాధనముగ) జేసినచో దోషములు రావచ్చును.

శ్లో॥ 220 ప్రాప్తేకర్మణినానే కోవిధాతుం శక్యతేగుణః
అప్రాప్తేతు విధీయంతే బహవోప్యేకయత్నతః.

తా॥ విధి ప్రాప్తములగు కర్మలందనేక గుణ విధానముల జేయుట శక్యము గాజాలదు. ఉత్పత్త్యాది విధి ప్రాప్తి లభించని కర్మలందు మాత్రమే ప్రయత్నముచే ననేక గుణ విధానముల జేయువచ్చును. ఉదా

హరణగా 'గ్రహాంసమ్మార్ష్టి' యను వాక్యమునందు సమ్మార్జనవిధి యొకే గ్రహమునకు అని యర్థము జేసి మరల నదే వాక్యముతో నితరగ్రహములకు సమ్మార్జన జెప్పినచో వాక్యభేద ప్రసంగమగును కాని గ్రహైకత్వ సంఖ్యా వివక్షత లేనప్పుడు అన్ని గ్రహములకీ వాక్యముచే సమ్మార్జన గావచ్చును. కావున నుత్పత్తి విధియందే గుణమునకు యాగబంధము ఫల సంబంధము జెప్పినను దోషముండదనిరి. ఇట్లు రేవత్యధికరణమునందు జెప్పబడినది, యిట నుదాహరణ మగును.

శ్రుతి॥ ౪౮, "ఏతస్యైవ రేవతీషు వారవంతీయ మగ్నిష్టోమ
సామం కృత్వా పశుకామోయజేత".

ఇందలి వాక్యార్థ మిచ్చట చరితార్థమగును. పై వాక్యమునందేవ కారమున 'రేవతీర్న సధమాద' యను ప్రమాణమున రేవతీ నక్షత్రమునందు వారవంతీ నామకసామగానమును జేసి, పశుకాముడు యాగమును జేయవలెనని విధియగును. అచ్చట రేవతీ ఋక్కులకును వారవంతీయ నామక సామమునకేది సంబంధము గలదో యది పశుఫలమునకును, అగ్నికిని, స్తుతి రూప గుణమగుననిరి. అది గుణ సంబంధము, ఫలసంబంధము గలదైనను వాక్యభేద దోషము గాజాలదనబడినది. అట్లే యుత్పత్తి విధి యందగును. ఏవకారము పరామర్శయనిగాని, ఇతరాయోగ్య వ్యవచ్ఛేదక మని గాని, యోగ్యవ్యవచ్ఛేదక మని అర్థము చెప్పవచ్చుననిరి.

## —: వినియోగవిధియందల్యంగములు :—

171. వినియోగవిధియందు అంగములు. 1. సిద్ధిరూపములైనవి, 2. క్రియారూపములైనవి రెండు విధములగునవి ఉపయుక్తములు.

1. సిద్ధరూపములివి:— జాతి, ద్రవ్యము, సంఖ్య మొదలగునవి. జాతియనగ పశ్వాదులు, ద్రవ్యములనగ పురోడాశాదులు. సంఖ్య యేకత్వాదులు.

2. క్రియారూపమునందలి భేదములివి:- 1. గుణకర్మ 2. అర్థకర్మ.

1. గుణకర్మ="క్రతుకారకాణ్యా శ్రిత్యగుణకర్మ, కర్మాంగ ద్రవ్య సంస్కారరూపోవా గుణకర్మ". అనగా క్రతుకారకాశ్రయ మగునది గుణకర్మ లేదా కర్మాంగ ద్రవ్య సంస్కారరూపమైనది గుణకర్మయగును. ఇందలి నాలుగు భేదములివి:—

(1) ఉత్పత్తి (ఉత్పాద్యము) 2. ఆప్తిః (ఆప్యము) 3. వికృతిః (వికార్యము) 4. సంస్కృతి (సంస్కార్యము)

(1) సంస్కార విశిష్టకర్మ జన్యమైనది ఉత్పాద్యము. 1. ఉ:- "వసంతే వసంతే బ్రాహ్మణో అగ్నినాదధీతే"2. ఉ:- "యూపంతక్షతీ" ఇందు ఆధానకర్మచే నగ్ని, తక్షణ (అలంకరణ) చే యూపము (పశులగట్టు స్తంభము) సంస్కరింపబడుటచే నీ కర్మ ఉత్పాద్యగుణకర్మ.

2. ఆప్యము='విద్యమాన పదార్థస్య ప్రాప్తిరాప్తిః' అనగా పూర్వ సిద్ధములైన వాని ప్రాప్తించుట ఆప్తి. ఉ:- 'స్వాధ్యాయోఽధ్యేతవ్యః' ఇందు అధ్యయనము సిద్ధముగ పూర్వమేయున్నది. దానినే పొందుట ఆప్తి. ఉ:- 2. 'గాంపయోదోగ్ధి'. పాలు గోదోహనమున విద్యమానములు. అవి లభించుట ఆప్తి.

3. 'వికారకర్మ వికృతిః' అనగా కార్యముల మార్పుచే కలిగినది వికృతి. ఉ:- "సోమమభిషుణోతి, 2. వ్రీహీనవహంతి, 3. ఆజ్యంవిలాపయతీ" ఇత్యాదులందుగల వికారములు (మార్పులు) ఇచ్చట సోమమనగా సోమతీగ (తిప్పతీగె) రసము. అభిషవణమనగా 'షఞ్'ధాత్వర్థముచే పానము (త్రాగుట) ఇదే వికృతి. అవహననమనగా అవఘాతము (దంచుట) ఇది వికృతి. విలాపన అనగా నెయ్యికరుగుట.

4. సంస్కారకర్మ సంస్కృతి అనగా సంస్కారార్థమునకై జేయుకర్మ సంస్కృతి. ఉ:- 'వ్రీహీన్ప్రోక్షతి' ప్రోక్షణ (దర్భలతో నీళ్ళు జల్లుట) ఇట్లే అవేక్షణ (యజమానిభార్య కరిగిన నెయ్యిని జూచుట) సంస్కారకర్మ.

2. అర్థకర్మ='క్రతుకారకాణ్యాశ్రిత్య అర్థకర్మ'. అనగా ఫలాపూర్వమునకై ప్రధానమును గురించి (యాగమును గురించి) జేయు కర్మ అర్థకర్మ. ఇందు రెండువిధములివి:- 1. ముఖ్యము (అంగి) 2. అంగము. (1) అనన్యార్థం ప్రధానం. ఉ:- దర్శపూర్ణమాసాది. అనగా వెరుగ అపూర్వమును బుట్టించుకర్మ ముఖ్యము. (అంగి) 2. ముఖ్యమునకై ఉపయోగించునది అంగకర్మ. ఇది రెండువిధములు.

(1) సన్నిపత్యోపకారకము. (2) ఆరాదుపకారకము.

1. సన్నిపత్యోపకారకము= 'ప్రధాన స్వరూప నిర్వాహకత్వేనోపయుక్త కర్మసన్నిపత్యోపకారకం'. 'తచ్చద్రవ్య దేవతాది సంస్కారద్వారా యాగస్వరూప నిర్వాహకం'. ఉ:- అవహనన ప్రోక్షణాదిః అనగా ద్రవ్యదేవతా సంస్కారరూపమైన కర్మ సన్నిపత్యోపకారకము. ఇది యాగస్వరూపమును నిర్వహించును. దీనినే ఆశ్రియకర్మయందురు. దృష్టార్థ, మదృష్టార్థ, నుభయార్థ భేదముచే ఇందు త్రివిధములు. 1. అవహననాదులు దృష్టార్థములు. 2. ప్రోక్షణాదులు అదృష్టార్థములు 3. పశుపురోడాశాదు లుభయార్థము లిందు ద్వివిధము. 1. త్యాగాంశము దృష్టార్థము 2. మంత్రస్మరణ మదృష్టార్థము.

2. ఆరాదుపకారకములు = దూరమునుండియే యుపకరించునవి. "ద్రవ్యాణ్యనుద్దిశ్య కేవల విధీయమానంకర్మ ఆరాదుపకారకం తచ్చ పరమాఽపూర్వోత్పత్తా వేవ యుపయుజ్యతే". ఉ:- 'ప్రజాయాదయః' అనగా పరోక్షముగ ప్రయాజాదులు ఫలాపూర్వమునకు ఉపకారకములు.

172. సర్వాంగోపదేశములతో గూడుకొనియుండు కర్మను ప్రకృతి యందురు. ఉ:— దర్శాదియాగములు.

2. 'వికలాంగ సంయుక్తవిధిర్వికృతిః'. అనగా సంపూర్ణాంగోపదేశములుగలది ప్రకృతి, సర్వాంగోపదేశములు లేనిది వికృతి. ఉ:- దర్శాది యాగములు ప్రకృతి, సౌర్యాది యాగములు వికృతి.

3. ఉభయవిలక్షణమైనది హోమము. ఉ:- అమనహోమములు.

173. ఐష్టికమునందలి పంచప్రయాజలు ఇవి:- 'ప్రయాజః పంచ ప్రకారః' అనగా ప్రయాజ లైదు విధములు. 1. సమిధోయజతి 2. తనూనపాతం యజతి 3. ఇడోయజతి 4. బర్హిర్యజతి. 5. స్వాహాకారం యజతి. 'అవిశేష యజతి పదాభ్యాసా త్కర్మభేదః' అనగా ప్రతి యాజయందు 'యజతి' పదము అవిశేషమున గలదు గాన ప్రతిప్రయాజ యాగము వేరుకర్మయని యర్థము. ప్రయాజల కధిష్ఠాన దేవతలుందురు. వారిని గురించి ప్రయాజయాగములు దర్శాదియాగములందు జేయుదురు. ఐష్టిక పశుమునందు అనుయాజలు మూడు ఇవి:- 1. దేవంబర్హి 2. దేవోనరాశంసో 3. దేవోఅగ్ని స్విష్టకృత్.

ఆధ్వర్యాది ఋత్విక్కు-లుచ్చరించునవి ప్రేషలు. ప్రేషాక్షరముల సంఖ్య 17. వివరమిది:- 1. 'ఆశ్రావయ' 2. 'అస్తుశ్రౌషట్' 3. 'యజ' 4. 'యెయజామహే' 5. 'వౌషట్'.

మొదట ప్రేషందు 4 అక్షరములు, రెండవదానియందు 4, మూడవ దాని యందు 2 నాల్గవదానియందు 5. అయిదవదానియందు 2 మొత్తం 17 అక్షరములు.

శ్లో॥ 221. చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాం పంచభిరేవచ ।
హూయతే చ పునర్ద్వాభ్యాంసమె విష్ణుః ప్రసీదతు.

తా॥ పై జెప్పిన పదిహేడక్షరముల సంఖ్య విష్ణుః (యజ్ఞుడు) అర్థము.

174. మొదట నధ్వర్యుడు హోతకు వినబడునట్లు 'అగ్నయేను బ్రూహి' అనుచు బలుకును. అనగా నేదేవతకై (అవదానమును దీసికొనునో) యా దేవతనాహ్వానించును. అప్పుడు (బ్రహ్మ అనుమోదించినపిదప) హోత "ఓం అగ్నిర్మూర్ధాదివః కకుత్పతిః పృథివ్యా౭యం । అపాగ్ం రేతాగ్ం సిజిన్వతోం' అనుచు జెప్పిన తరువాత 'ఆశ్రావయ' యను మొదట ప్రేషను అధ్వర్యుడు బలుకును. దీనికుత్తరముగ నాగ్నీధ్రుడు "అస్తు శ్రౌషట్" అను రెండవ ప్రేష ఉచ్చరించును. దీనిచే జేయబోవు కర్మ అవధరింపబడినదని అర్థము. తరువాత నధ్వర్యుడు "యజ" అను మూడవ

ప్రైష బలుకును. దీనికి బ్రిహ్మ (ఓం) అనుచను మోదించును. దీనికే బదులుగా 'యే యజామ హేగ్నింభువో యజ్ఞస్య రజసశ్చనేతా, యత్రాని యుద్భిః సచనేశివాభిః దివి మూర్ధానం దధిషేస్వర్షాం జిహ్వామగ్నేచ కృషేహ వ్యవాహం' యను నాల్గవ ప్రైషను బలికి హోతయే మరల వెంటనే "వౌషట్" అను నైదవ ప్రైష యుచ్చరించుటతోడనే అధ్వర్యుడు తన చేతనున్న అవదానము నగ్నిలో వేల్చును. తరువాత 'దేవంబర్హి' ఇత్యాది అనుయాజల హోమమగును.

1. ఐష్టికము 2. పాశుకము 3. సౌమికమని త్రివిధముగలదు.

(1) ఐష్టికమునందు — పంచప్రయాజలు మూడనుయాజలు.

(2) పాశుకమునందు, సౌమికమునందు ఏకదశయాజలు ఏకాదశ అను యాజలు. పశుభేదములచే యాగములు జేయబడును.

175. యాజలు ద్వివిధములు 1. ప్రయాజ 2. అనుయాజ (1) ప్రయాజలు పదునొకండు ఇవి :-1. 'సమిధః 2. తనూన పాతం 3. ఇళః 4. బర్హిః 5. స్వాహాకారం 6. దురం 7. దైవ్యాహోతారః 8. దైవ్యా త్రిస్రస్త్రిశుః 9. త్వష్టారం 10. వనస్పతిః 11. అగ్నిస్విష్టకృత్.'

2. అనుయాజలు పదునొకండుగలవు. అవి:-1. దేవంబర్హిః 2. దేవీర్ద్వారః 3. దేవీఉపాసానక్తా 4. దేవీజోష్ట్రి 5. దేవీఊర్జాహుతీ 6. దేవీ దైవ్యా హోతారః 7. దేవీత్రిస్రిస్రిః 8. దేవోనరాశంసః 9. దేవఇంద్రో వనస్పతిః 10. దేవం బర్హిర్వారితీనాం 11. దేవోఅగ్నిస్విష్టకృత్.

176. పంచప్రయాజ పశుమునందు 1. సమిధ 2. తనూనపాతం 3. ఇళ 4. బర్హి 5. స్వాహాకారమను పంచప్రియాజయాగములు. వీనికే దేవం బర్హి 2. దేవోనరాశంసోవసువనే 3. దేవో అగ్నిస్విష్ట కృత్తను మూడు అనుయాజలు వచ్చును.

2. నవానుయాజలు నవప్రయాజపశుమున వచ్చును. కావున పై జెప్పిన మూడనుయాజలలో త్వష్టారవనస్పతులు, వర్జితములు.

3. ఏకాదశ ప్రయాజపక్షమునందు పైజెప్పిన ఏకాదశానుయాజలు వచ్చును. 4. చతుర్ప్రయాజ పక్షమునందు=పంచప్రయాజ పక్షము నందలి మూడనుయాజలలో దేవం బర్హిలోపించి తక్కిన రెండు వచ్చును.

5. త్వష్టారం, నరాశంసలు రెండు నొకే పర్యాయపదములుగాన అర్థ భేదములులేనివి. అయినగాని గోత్రభేదమందు యజమాని తన గోత్రప్రకారము రెంటిలో నొకటి యుచ్చరించి జేయుటిట్లు.

శ్లో॥ *222.* వసిష్ఠశునకాత్రీణాం వాధ్రియస్య గణస్యచ
రాజన్యానాంనరాశంసా । అన్యేషాంతు తనూనపాత్.

తా॥ వసిష్ఠశునక, అత్రి, వాధ్రియగోత్ర, యజమానులు, రాజన్యులు నరాశంసయనుచు ప్రయాజానుయాజల యాగము చేయవలయును. ఇతరులు తనూన పాత యాజను జేయనగును.

177. 'యజతిషు యే యజామహంకరోతి నానుయాజేషు' అను నిషేధ శ్రుతిచే అనుయాజయాగములందు యే యజామహేయను ప్రేష జెప్పరాదు.

2. పాశుకమునందు నవయాజలు, సౌమికమునందు ఏకాదశ యాజానుయాజలు, ఇష్టికమునందైదు యాజలు, చాతుర్మాస్యాది వికృతి యాగములందు చతుర్యాజలు తరుచుగావచ్చును.

178. సంస్కారము రెండు విధములు=(1) ఉపయోక్షమాణము (2) ఉపయుక్తమాణము 1 ఉ :— అవఘాతాదులు 2. ఉ :— ప్రతిపత్తికర్మ.

2. ప్రతిపత్తికర్మ='ఉపయుక్తస్యాఽవిశేషస్య ఆకీర్ణకరద్రవ్యాదేః విహిత దేశ ప్రక్షేపణ సంస్కారః కర్మ విశేషో ప్రతిపత్తికర్మః' అనగా యాగము నందుపయుక్తములై మిగిలిన ద్రవ్యాదులను (వ్యర్థము గాకుండుటకై) ఒక విహితదేశమున (చాత్వాలమున) నుంచుట ప్రతిపత్తికర్మ.

(1) చాత్వాలము=గర్త విశేషము. ప్రాసన (వేయుట).

(2) కృష్ణసారంగము యొక్క కొమ్మును కృష్ణవిషాణమందురు.

(3) 'యజమాన కృష్ణ విషాణయాకండూయతి' అనగా దీక్షా కాలము నందు యజమాని కృష్ణ విషాణముతో దురద నివారణ చేసికొనవలయును. ఇట్టి ద్రవ్యములు మిగిలినవి చాత్వాలమునందు వేయుట ప్రతిపత్తి కర్మ యనబడును.

(4) ఇడ=భక్షణ యోగ్యమైన పురోడాశాది శేష ద్రవ్యములను ఇడ యందురు. హోమానంతరము పురోడాశాదుల శేషమును సపత్నీకుడగు యజమానుడు, ఋత్విక్కులు భక్షించుట ప్రతిపత్తికర్మ.

5. వినియోగవిధియందుపయుక్త విధి వాక్య, ప్రమేయములు త్రి విధములు :—క్రత్వర్థ 2. పురుషార్థ 3. ఉభయార్థములనబడును.

(1) ప్రయాజ, ప్రేషాదులు క్రత్వర్థములు 2. ఫలకారణములగు యాగ ములు, వానితో జనించు అపూర్వాదులు, పురుషార్థములు 3. దధ్యాదులు ఉభయార్థములు. దీనికి ఉ :-దధ్నాజుహోతియనునప్పుడు క్రత్వర్థమగును. దధ్నేంద్రియ కామస్యజుహ్యాదన్నప్పుడు పురుషార్థమగును. ఇట్లుభయా ర్థము లగుట సంయోగ పృథక్త్వ మనబడును.

సంయోగపృథక్త్వము = 'ఏకస్యోభయార్థత్వే సంయోగ పృథక్త్వం'

జై. సూ. అ. 4 పా. 3 సూ. 5-9.

ఉ :-'వాజపేయేనేష్ట్వా బృహస్పతిసవేనయజేత' ఉ :-2. బ్రాహ్మణో బ్రహ్మవర్చస్కామో బృహస్పతిసవేనయజేత' ఈ వాక్యములందలి బృహ స్పతి యాగమునకు వాజపేయము అంగముగానందున వాజపేయ యాగ మును జేసిగాని, జేయకయేగాని బృహస్పతి యాగమును జేయవచ్చును.

ఉ :—3. "యాగాదులు సకామనయా జేసిన తాదృశఫలములనిచ్చును యవి నిష్కామనయా జేసిన చిత్తశుద్ధి ద్వారా మోక్షఫల మిచ్చును. ఇట్లుభయార్థములగుట సంయోగ పృథక్త్వ న్యాయమనబడును.

# వినియోగ విధియందు సహకరించు శ్రుత్యాది షట్ప్రమాణములు

179. 1. శ్రుతి 2. లిఙ్గ 3. వాక్య 4 ప్రకరణ 5. స్థాన 6. సమాఖ్యలు షట్ప్రమాణములు. ఈ యాఱు ప్రమాణములు వినియోగవిధియందు సహాయమును జేయుచు విధియందు ప్రామాణ్యాత్వమువహించును.

1. శ్రుతి :—'నిరపేక్షోరవః శ్రుతిః' అనగా అపౌరుషేయవేదవాక్యములు శ్రుతి యనబడును. శ్రుతియందవాంతర భేదములు మూడు. 1. విధాత్రీ 2. అభిధాత్రీ 3. వినియోక్త్రీ యను త్రివిధ భేదముగలది శ్రుతి.

1. 'లిఙాద్యాత్మికా శ్రుతిర్విధాత్రి' అది భూత, భవిష్యద్వర్తమాన కాలాప దేశములగు లడాది గుర్తులుగల వాక్యము. ఉ:— యజతీత్యాది.

2. 'వ్రీహ్యాది ద్రవ్యాత్మికా అభిధాత్రీ'. ఉ :-పశు, పురోడాశాదులు.

3. 'శబ్దమాత్ర శ్రవణేనయ యాసంబంధః ప్రతీయతేసా వినియోక్త్రీసా త్రివిధా' 1. విభక్తిరూపా 2. ఏకాభిధానరూపా 3. ఏకపదరూపా.

(1) విభక్తిరూపాశ్రుత్యుదాహరణం 'వ్రీహిభిర్యజేత' తృతీయా శ్రుత్యా వ్రీహీణాం యాగాంగత్వం, తదపి, పురోడాశ, పశుహ్యాదయరూప, హవిః ప్రకృతికత్వేనయాగాంగస్. ఉ :-2. 'అరుణయా పింగాక్ష్యా ఏకహాయన్యాగవా సోమంక్రీణాతి' ఇచ్చట తృతీయా శ్రుతియున్నను, అరుణిమాదులు మూర్త ద్రవ్యములుగానందున (గుణములేగాన) సోమ ద్రవ్యమునకు, సాక్షాత్తుగ క్రియాంగములు కాజాలవు. అవి గోద్రవ్యము నాశ్రయించి ఆకాంక్షద్వారా పరస్పరాన్వితములగుచు (కారణ విభక్తులతో సహకరించి) క్రియాంగములుగా వచ్చును కాన అరుణిమత్వ, ఏకహాయనత్వ, పింగాక్షిత్వగుణములు సంహతించి గో ద్రవ్యము ద్వార ఆకాంక్షచే నన్వయించును. అనగా "ఏకహాయనీగౌసా పింగాక్షీసా అరుణవర్ణాతయా సోమంక్రీణాతి" యని శ్రుత్యర్థమగును.

(2) ద్వితీయా విభక్తికి ఉ :-'వ్రీహీన్ప్రోక్షతి' ఇచ్చట ద్వితీయా విభక్తిచే ప్రోక్షణ జేయుట వ్రీహి స్వరూప నిష్పత్తి కొఱకు జెప్పబడలేదు. వ్రీహి స్వరూప మిదివఱకే సిద్ధమైనది. ప్రోక్షించని యెడల సంస్కారములేనందున వానితో అపూర్వము బుట్టదుగాన యాగోపయుక్తము కాజాలవు కావున ప్రోక్షణ సంస్కారార్థమగును.

(3) సప్తమీ ఉ :-'యదాహవనీయేజుహోతి' ఇందు ఆహవనీయాగ్ని సప్తమీ శ్రుతిచే హోమాంగమగును.

2. ఏకాభిధాన రూపాశ్రుతిః ఉ :-'పశునాయజేత' ఇందు ఏకత్వ, పశుత్వములు ఏకాభిధానా శ్రుతిచే యాగాంగములు.

(3) ఏకపదరూప శ్రుతిః ఉ :- పై యుదాహరణందలి 'యజేత' పదమున గల ఆఖ్యాతాంశముచే నేకత్వ సంఖ్య దెలియును. ఇదే 'ఆర్థీభావన' యందు జేరును. దీనినే 'సమానాభిధానా' యందురు. సంఖ్యచే నేకపద రూపాశ్రుతిచే యాగాంగము. ఇట్లు సంఖ్యామల మూర్తములైనను యాగాంగములైనవి. 'యాగాంగ పశుః ఏకః, పుమాంశ్చేతి నిశ్చితం। అతః సంఖ్యాయా యాగాంగత్వం' అనగా యాగాంగ పశు వొక్కటి, అదియును మొగ పశువు.

180. 'అనన్యలభ్యశ్శబ్దార్థః । సచకర్తారం వినాఽనుపపత్తేః । కర్తృభావనా ఆకాంక్షాద్భవతి. తద్గతసంఖ్యా ఆఖ్యాతాంశేన ప్రతీతేః । తస్మాత్కర్తృ పరిచ్ఛేదకతయా అమూర్తస్యాపి (సంఖ్యాదీనాం) భావనాంగత్వ సిద్ధం' అనగా ప్రమాణాంతరములచే గాక కేవల శబ్దము చేతనే లభించునది శబ్దార్థము. అది కర్త లేకున్న సిద్ధించదు. కర్త ఆకాంక్షవలన దెలియబడును. కర్తృగత సంఖ్య ఆఖ్యాతాంశమున తెలుపబడును. కాన కర్తృ ద్వారా సంఖ్య తెలియబడుటచే అమూర్తమైనను ఏకపద రూపా వినియోక్త్రీ శ్రుతియందు జేరును.

శ్లో॥ 223. సంఖ్యాయాంకారకేవా, ధీర్విభక్త్యాహి ప్రవర్తతే ।
ఉభయంచాత్ర తత్సిద్ధం భావనాలిఙ్ విభక్తితః

తా॥ సంఖ్యనుగాని కారకములనుగాని గుర్తింప జేయునది విభక్తి. కావున తిఙంతపదములం దుభయములు సిద్ధించును.

181. పై జెప్పిన లక్షణములుగల శ్రుతి లిఙ్గాది ప్రమాణములకంటెను ప్రబల ప్రమాణమైనది. ఉ:— 'ఐంద్రియాగార్హపత్య ముపతిష్ఠతి' యను వాక్యమునందు తృతీయా విభక్తిచే ఇంద్రలిఙ్గమున్నను అది బాధించబడి ప్రబలమైన శ్రుతిఃప్రమాణమున గార్హపత్యాగ్నిః స్తుతి విధించబడినది.

182. ప్రాప్తబాధ 2. అప్రాప్తబాధ యని బాధ రెండువిధములు.

1. 'ప్రాకృతాంగానా మతిదేశేన ప్రాప్తానాం ప్రత్యామ్నానాం. ప్రతిషేధ రూపలోపో ప్రాప్తబాధః'. ఉ:- శరమయం బర్హిరితి ప్రాకృతో పదిశ్య శరమయత్వం వికృతౌ ప్రతిషేధాదులపాదీనాం ప్రత్యామ్నానమర్థలోపో ప్రాప్తిబాధః'. ఉ:- "నహోతారం వృణీథః". అనగా పిత్రేష్టియందు హోత (ఋత్విక్) వర్ణన నిషేధమైనది. ఇట్లు ప్రాప్తబాధ జైమిని సూత్రములందలి పదవ యధ్యాయమందు నిరూపించబడినది.

2. మూడవ యధ్యాయమునం దప్రాప్తబాధ నిరూపించనైనది. 'యో వద్దుర్బల ప్రమాణేన వినియోగ మారభతే తత్పూర్వమేవ ప్రబల ప్రమాణేన వినియోగస్య కర్తురశక్యత్వాత్తేన వాతదో్బధి తత్త్వేన ఇతరస్యబాధో అప్రాప్తబాధః' అనగా శ్రుత్యాది షట్ప్రమాణములలో నుత్తరోత్తరములగు ప్రమాణములు ప్రబలములు కానందున పూర్వాపూర్వములచే నుత్తరోత్తరములకు గలుగు బాధ యప్రాప్తబాధ యందురు. ఇందు సూత్ర ప్రమాణము.

సూత్రం ౯. 'శ్రుతి, లిఙ్గ, వాక్య, ప్రకరణ, స్థాన, సమాఖ్యానాం, సమవాయే పారదౌర్బల్య మర్థ విప్రకర్షాత్' జై. సూ. అ. 3. పా. 3. సూత్రం. 14.

2. లిఙ్గం—'శబ్దసామర్థ్యం లిఙం సామర్థ్యం సర్వశబ్దానాం లిఙమిత్యభిధీయతే' అను ప్రమాణము కలదు. సామర్థ్యము రూఢియన

బడును. 'యౌగిక సమాఖ్యాలిఙ్గా ద్రూఢ్యాత్మిక లిఙ్గోభిన్నః' అనగా రూఢిలిఙము యౌగిక సమాఖ్యాతమునకన్న (నామధేయమునకన్న) భిన్నము. ఉ:– "బర్హిర్దేవ సదనందామీ" యను వాక్యమునందు 'బర్హి లిఙాత్కుశ ల్లవనం, నతూలపాదీనాం' లవనమనగా ప్రకాశమని యర్థము. ఇదంలిఙ్గం వాక్యాత్ప్రబలం. ఉ:–"స్యోనంతే సదనం కృణోమి". ఇందలి కృణోమి యను లిఙము పురోడాశ సదనము (స్థలము) నకు అంగమగును. కాని వాక్యప్రమాణముచే పురోడాశ మును జేయుటందు కరణముగాజాలదు.

(2) సామర్థ్య ద్వివిధం. 1. శబ్దగత సామర్థ్యం 2. అర్థగతసామర్థ్యం.

1. శబ్దగత సామర్థ్యము మంత్రివర్ణములతోనే దెలియబడును.

2. 'లిఙ్శ్రివణే నాపికర్తు మశక్యత్వా దర్థసామర్థ్యం ప్రవర్తతే'. ఉ:- 'స్రువేణావద్యతీ' యను వాక్యమునందు స్రువలిఙముచే ద్రవద్రివ్యాదులనే గ్రహించవచ్చునుగాని మాంసాది ఘన పదార్థములను స్రువయం దుంచుటకు శక్యముగాజాలదు. కావున అర్థసామర్థ్యముచే స్రువేతర పాత్రలందు అవద్యం (ఉంచుట గ్రహించుట) యగును. ఇట్టి లిఙ్గము, ప్రమాణాంతరా నపేక్షితమైనది. 2. ప్రమాణాంతర సాపేక్షగలదియను రెండు విధములు.

(1) 'యద్వినాయన్న సంభవతి తత్తస్యాంగం కేవలలిఙ్గాద్భవతి. ఉ:- 'అర్థజ్ఞానం కర్మాంగత్వం' అనగా ఏదిలేకున్న నేదిసంభవించదో అది దానికి ప్రమాణాంతరా నపేక్షిత లిఙమనబడును. ఉ:- లోకర్మ అర్థ జ్ఞానములేనిదే జేయరానందున అర్థ జ్ఞానము నిరపేక్షిత లిఙము.

2. యద్వినాయత్సం భవతి తత్తస్యాంగం సాపేక్షిక లిఙం. ఉ:- 'అగ్నయేజుష్టం నిర్వపామి' ఇతివాక్యే వినియోగస్య పూర్వత్వాన్నిర్వాపణ ప్రకాశనార్థం నిర్వాపణ లిఙ్గం నతు నిర్వాపణ సిద్ధ్యర్థం'. అనగా దర్శ పూర్ణ మాసాదియాగములందు పురోడాశాదుల జేయుటకు వానికగు ద్రవ్యములను (బియ్యము, యెవలు) పూర్వదినముననే దేవతాది సంఖ్యతో

కొలుచుట నిర్వాపణనబడును. కాన నిర్వాపణ లిఙము నిర్వాపణ సిద్ధించుట కొఱకుగాక నిర్వాపణ పరికాశన (సంఖ్యకొలత దెలియుట) కొరకు సాపేక్షగలదని యర్థము.

3. వాక్యము="సమభి వ్యవహారో వాక్యః । శేష శేషివాచక పద యోస్సహోచ్చారణం సమభి వ్యవహారః" ఉ :- 'యస్యపర్ణమయీ జుహూర్భవతి ననపాపశ్లోకం స్పృణోతి అత్రపర్ణతా యాజుహ్వాంగం సమభి వ్యవహారాద్భవతి । యది పర్ణతాయా జుహూ క్రియతే తదైవ తత్సాధ్య మపూర్వంభవతి, నాన్యథా, తస్మాత్పర్ణతాయా జుహ్వాంగం వాక్యాజ్జాయతే'. అనగా సహోచ్చారణ జేసిన సమభి వ్యవహారమగును. అదియే వాక్యప్రమాణమగును. పై ఉదాహరణమున పర్ణత యనగా పాలాశకఱ్ఱ (మోతుకుకఱ్ఱ) దానితో జేయబడిన జుహు (స్రువ) పాత్రి విశేషము. యాగాదులం దాజ్యాది పదార్థముల గ్రహణ జేయు సాధన. అది గలిగిన యజమానికి పాపములంటవు. కావున పర్ణత జుహ్వాంగ మగుననుచు వాక్యముచే దెలియును.

2. 'ప్రకృతి వద్వికృతిః కర్తవ్యా. ఇతి వచనాత్పర్ణతాయాః అనారభ్యాధీతేపి వికృతౌనాన్వేతి । పౌనరుక్తి ప్రసంగాత్'. అనగా ప్రకృతి యాగములవలె వికృతులగునను ప్రమాణ వాక్యమున్నను వికృతియందు ప్రియాజలకు, ప్రయోగములేనందున పర్ణతాదుల నారభ్యాధీతములైనను అన్వయము గాజాలదు. పునరుక్తి దోషమగునని తాత్పర్యము. ఏ వాక్యమున శ్రుతి ఉత్పత్త్యాది విధులను జెప్పినదో, యావాక్యముల నారభ్యాధీతములనబడును. ఇతర వాక్యములను అరభ్యాధీతములందురు. వాక్యము ప్రకరణమునకంటెను ప్రబల ప్రమాణమగును. ఉ:- "ఇంద్రాగ్నీ రిదంహావిః". ఇది వాక్యప్రమాణముననే దర్శాంగమగును. కాని ప్రకరణ వశమున దర్శపూర్ణ మాసాంగముగాజాలదు. ఉదాహరణ మందలి మంత్రము వాక్యబలముచే ప్రకరణమును బాధించును.

4. ప్రకరణము మహాప్రకరణము; అవాంతర ప్రకరణమని ప్రకరణము రెండు విధములు. (1) ఫలభావనా ప్రకరణము మహాప్రకరణము.

2. అంగభావనాప్రకరణ మవాంతర ప్రకరణము. 'తేన అభిక్రమ ణాదీనాం ప్రయాజాంగత్వం తచ్చసందంశ రూపే రైవజ్ఞాయతే'. అనగా అంగభావనా ప్రకరణమునందే జెప్పబడినవి యభిక్రమణాదులు. వానికే ప్రయాజాదులంగములని సందంశరూపమునసనే తెలియును. ఇవి యన్నియు దెలియజేయునది అవాంతర ప్రకరణము.

(2) సందంశము "ఏకాంగానువాదేన విధీయమాన యోరంగయోరంతరాలే నిహితత్వం సందంశం". "లోహకంటకద్వయ విద్ధలోహ శలాక వద్రూపం సందంశరూపం". అభిక్రామం. 'ప్రయాజాంగాను వాదేన విధీయమాన యోరంగ యోరంతరాలే విహితత్వ సందంశం'. 'యథా సమానయతే జుహ్వాం, ముపభృత స్తేజో వా' ఇతి ప్రయాజాంగానువాదేన (ఉపభృతు = ఘృతపాత్ర విశేషం ప్రయాజాంగం) (1) "యస్యైవం విదుషో, ప్రయాజానుయాజా ఇజ్యంతే, ప్రైభ్యోలోకేభ్యో భ్రాతృవ్యాస్తుదతే" "అభిక్రామంజుహోతి" "యోవై ప్రయాజానాం మిథునం వేద" ఈ రెండు ప్రయాజాంగ వాక్యముల మధ్యనగల 'అభిక్రామం' అను హోమవాక్యమేదిగలదో నది సందంశమనబడును. సందంశ రూపము = ఇనుపత్రిశూలమువలె నుండును. అందు మధ్యనగల మేకువలె నుండునట్లు అభిక్రామముండును. అదియే సందంశరూపమగును. ఆకాంక్షచే నదిదెలియబడును. 'ఆకాంక్షస్యైవ గుణేనాన్వేష్యతి' ప్రమాణము.

శ్లో॥ 224. పరప్రకరణస్థానా మంగేస్వత్యాదిభిస్త్రిభిః ।
జ్ఞాత్వేపునశ్చ తైరేవ సందంశే నతదిష్యతే.

తా॥ శ్రుతిలిఙ్గ వాక్యములు మూడు. అవాంతర ప్రకరణమునందున్నట్లు దెలియబడెనేని మరలనవియే యాకాంక్ష జేయగా సందంశ రూపమని దెలియబడును. ఇట్టి ప్రకరణము స్థానమునకంటెను ప్రబలము.

ఉ:- "అక్షైర్దివ్యతీ రాజన్యం జిహోతీ" ఈ విదేవనాదులు (పాచికలతో జూదము) అభిషేచన సాన్నిధ్యమునందు పరిపఠితములైనను ప్రకరణ బల

మున నీ ధర్మములు రాజసూయ క్రత్వంగములగునుగాని స్థానముచే యభిషేచనీయాంగములు గాజాలవు.

5. స్థానము. 'దేశసామాన్యంస్థానం తచ్చద్వివిధం.' 1. పాఠసాదేశ్యం 2. అనుష్ఠాన సాదేశ్యమితి.

1. యథాసంఖ్య పాఠసన్నిధిః పాఠం పాఠసాదేశ్యం. ఉ:- 'ఐంద్రాగ్న మేకాదశ కపాలంనిర్వపేద్వైశ్వానరం ద్వాదశ కపాలం'. ఇత్యాది, యథాక్రమపాఠమితి, అనగా యాజ్యవాక్యములకు యథా సంఖ్యా క్రమముగ అను వాక్యములు. "ఇంద్రాగ్నీరోచనా" ఇత్యాదిని ప్రథమస్య ప్రథమం ద్వితీయస్య ద్వితీయం క్రమేణపఠనం పాఠసాన్నిధ్యం స్థానమిత్యుచ్యతే. అఫలస్య ఫలవత్ సన్నిధి పాఠస్తు తదంగత్వన్యాయేన ప్రధానేష్వంతర్భూతం.

2. ప్రాకృతాంగాను వాదమున విహితములైన వైకృతాంగము లేవి సందంశ పతితములైనవో యవియును వికృత్యర్థముగ సన్నిధి పాఠముచే స్థానమనబడును. ఉ:- ఆమన హోమాదులు "అమనసేస్వాహాఽరేత స్వినేస్వాహా" ఇత్యాదులు.

"కైమర్థ్యాకాంక్షాయాం వికృత్యపూర్వం భావ్యత్వేన అన్వయం". అనగా ఆమనహోమాదులకువలె నీ వైకృతాంగములందలి సందంశపతితముల కర్థమగునని తాత్పర్యము.

శ్రుతి॥ ఉదా. "వైశ్వదేవీం సాంగ్రహాయణీం నిర్వపేద్గ్రామకామః"

యను కామ్యేష్టి యాగసన్నిధియందివికృతి యాగములైన ఆమన హోమాదులు జెప్పబడినవి.

2. 'పశుధర్మాణా మగ్నీషోమీయార్థ మనుష్ఠాన మనుష్ఠాన సాదేశ్యం'. ఉపాకరణ, పర్యగ్నికరణాదులను పశుధర్మములందురు. "ప్రజాపతేర్జాయమానా" యను మంత్రమున పశుయూప స్పర్శజేయుట ఉపాకరణమగును. దర్భజ్వాలతో వానికి త్రిఃప్రదక్షిణీకరణమును జేయుట

పర్యగ్నికరణమందురు. 'యూపేరజ్వాబంధనం యూపనియోజనం' 'తేషామనుష్ఠానమగ్నీషోమీయ పశుశేషత్వంగతు సవనీయ (ఆగ్నేయ) పశుశేషత్వానుష్ఠాన మనుష్ఠాన సాదేశ్యం' "ఆనర్థక్య ప్రతిహతానాం విపరీతం బాలబలం'' అను న్యాయమున పశుధర్మములను స్థానబలముచే ప్రకరణమును బాధించి స్థానక్రమత్వాతదంగ మగుననిరి. ఇదే న్యాయము సాన్నాయమను వికృతియాగమునం దనువర్తించును.

183. సాన్నాయము='దధిపయసీతి సాన్నాయం' అను నిరుక్త్యాపశుః ప్రకృతిగమగునవైన దధిపయస్సులు వికృతియాగమునందు ప్రాప్తించును. ఇట్టి స్థానము సమాఖ్యకంటెను ప్రబలమైనది. ఉః— "శుద్ధధ్వం దైవ్యాయ కర్మణే'' ఇతివాక్యేస్థాన బలాత్సాన్నాయ పాత్రాంగం నతు సమాఖ్యాత్పురోడాశ పాత్రాంగం.

6. సమాఖ్య="సంబంధస్సమాఖ్యః । సంబంధః ప్రతీతేరేవ వాక్యార్థః ప్రతీతిః''. అనగా సంబంధము దెలియుటతో వాక్యార్థజ్ఞానమగును.

శ్లో॥ 225. సర్వత్రయౌగికే శబ్దే ద్రవ్యమేవాభిధీయతే ।
నహిసంబంధ వాచిత్వం సంభవత్యతి గౌరవాత్.

శ్లో॥ 226. పాకంతు పచిరేవాహ । కర్తారం ప్రత్యయోప్యకః ।
పాకయుక్తం పునఃకర్తా వాచ్యోనైకస్య కస్యచిత్.

తా॥ 2=యౌగిక శబ్దములందు ద్రవ్యమే సమాఖ్య (నామధేయము) కాని సంబందార్ధము గౌరవమైనందున సమాఖ్యయనబడదు. పాకమనగ పక్వపదార్థమైన ద్రవ్యమే యనబడును. (సమాఖ్య) కాని శబ్దార్థముచే పాకమును జేయువాడు, పచనయేదో యొకటి సమాఖ్యయగుననరాదు. పాకకర్త లక్షణయా దెలియబడును. ఉః- పౌరోడాశిక యనుసమాఖ్య పురోడాశ ద్రవ్యమునకగును. తద్ధితయోగమున పౌడాశికమని జెప్పుదురు. ఇదే విధమున పురోడాశ మంత్రము లేకాండయందు జెప్పబడినవో యా కాండను పౌరోడాశిక కాండయందురు. ఇట్లు సమాఖ్య స్థానమునకంటెను దుర్బలమైనది. వైదిక లౌకిక భేదముచే సమాఖ్య ద్వివిధమైనది.

1. హోతృచమస భక్షణాంగమైనందున దానికి హోతృచమసని వైదిక సమాఖ్యగలిగినది (చమస యనునొక కఱ్ఱపాత్ర).

2. ఆధ్వర్యమను సమాఖ్యలౌకికము. అది యధ్వర్యునికి తత్తత్కా ర్యాంగసంబంధముండుటచే గలిగినది.

3. యౌగికశబ్దములు నాలుగు విధములుండును. ఇవి:- 1. యోగ 2. రూఢి 3. యోగరూఢి 4. యౌగికరూఢు లనబడును.

1. ఎచ్చట అవయవార్థమే దెలియబడునో యది యౌగికమనబడును. ఉ:- 1. ఆధ్వర్యవం 2. పాచకమిత్యాదులు.

2. ఎచ్చట అవయవార్థాపేక్ష లేక సముదాయ శక్త్యర్థమే దెలియ బడునో దానిని రూఢియందురు. ఉ:- గవాది శబ్దములు.

3. ఎచ్చట అవయవ శక్త్యర్థములతో సముదాయ శక్త్యర్థము దెలియ బడునో అది యోగరూఢియగును. ఉ:- పంకజాది పదములు.

4. ఎచ్చట అవయవశక్త్యర్థము, సముదాయ శక్త్యర్థము (యోగి కార్థము రూఢ్యర్థము) రెండును స్వతంత్రములుగా దెలియబడునో అవి యౌగిక రూఢులనబడును. ఉ:- "ఉద్భిదాయజేత" ఇందూర్ధ్వ భేదన యోగమున యౌగార్థమైన తరులతాదులు, రూఢ్యర్థమున తన్నామక యాగము యౌగికరూఢి యనబడును.

184. విశేషము='హవిర్ధానే గ్రావాభిరభిషుత్యాఽహవనీయే హుత్వా ప్రత్యంచ పరేత్యసదసి భక్షాన్భక్షయంతి' ఈ వాక్యవివరణమిట్లు సోమ యాగమున కేశాలాదుల (గృహముల) నిర్మాణమునర్తురు. అందు ప్రాగ్వంశమనుశాల పశ్చిమదిశయందు తూర్పుముఖముననుండును. దానికి తూర్పునందు కొంతదూరమున మంటప నిర్మాణమగును. మంటపమునం దెత్తైనగద్దె నిర్మింతు రది యుత్తరవేదియగును. దానిపై ఆహవనీయమను చతురస్రముగ అగ్నిగుండముండును. ప్రాగ్వంశమునందు గార్హపత్య దక్షిణాగ్నుల గుండములు వర్తుల త్రికోణములుగ క్రమముననుండును.

రెండు శాలలమధ్య సదస్యమను శాల దక్షిణోత్తరావరణము లేనిదిగ (పాక) నిర్మింతురు. మంటపమున నుత్తరవేదికి పశ్చిమమునందు సోమ రసపానముగా లేక దానిని దీయుదురు. ఇది అభిషవమను కర్మయగును. సదస్యమునం దిడాభక్షణయను ప్రతిపత్తికర్మ జేతురు. అది యభిషవణ హోమానంతరమే జరుపబడును. ఇడాభక్షణ మపూర్వార్థమగును. గావున నిది వినియోగవిధియందు జేరును. ఇట్లిడాభక్షణ ప్రతిపత్తి కర్మ సమాఖ్యయనబడినది. సమాఖ్య దుర్బల ప్రమాణమనబడినను అదితర శ్రుత్యాది ప్రమాణములవలెనే యారవ ప్రమాణమని పైసూత్రమునందు గలదు.

## 3. ప్రయోగవిధిః

185. 'ప్రయోగ ప్రాశుభావబోధ కోవిధిః ప్రయోగవిధిః అంగా నాంక్రమ బోధకోవా। ప్రాశుభావమంగ ప్రధానకర్మయో రవిలంబం విధత్తే। అంగ ప్రధానయోర్విధ్యైక వాక్యత్వానుపపత్తేరేవ ప్రమాణం, ప్రమాణాంతరానుప పత్తేశ్చ'. అనగా అంగప్రధాన కర్మలందు సాహిత్య మేర్పరచునది, లేదా అంగ ప్రధాన కర్మలనుష్ఠించుక్రమమును బోధించు నది ప్రయోగవిధి యనబడును. దీనిచే కర్మానుష్ఠానమందు అంగప్రధాన ములకు ఏకవాక్యత బోధయగును. అంగప్రధానానుష్ఠానమందు సాహి త్యానుపపత్తి కలిగినందున గాని లేక ప్రమాణాంతరము లనుపపత్తి యగుచోగాని యిచ్చట ప్రమాణమగును. ఉ :-దర్శాది ప్రధానయాగము లకును వాని యంగములైన ప్రయాజాదులకును సాహిత్యము లేకుండిన యెడల అనుపపత్తి దోషమగును. ప్రయాజాదులకు ప్రత్యేక ఫలము లుండినను వానిని అర్థవాదములందురు. కావున వాని ఫలములు ప్రధాన ఫలమునం దంతర్భూతమగును. అంగప్రధాన కర్మానుష్ఠానమునందు సాహి త్యానుపపత్తి యను దోష నివారణార్థము క్రమానుష్ఠాన నియమము కల్పించనైనది. పదార్థముల భోజనార్థము పూర్వాపరాహ్ణ నియమము

లోకమునందు కల్పించుకొని యదే ప్రకారము ననుసరించునట్లు వైదికము నందు నియతి (అవిలంబ క్రమము) కల్పించబడినది. కాన విధ్యైక వాక్యత కల్గుచే నియమమగును. ఇందుదాహరణ ఆగ్నేయ హావిరభిఘారణానంతరము ఐంద్రి దధి అభిఘారము. దీని తరువాత ఆగ్నేయ యాగానుష్ఠానము జేయుట (క్రమము) నియమ విధియగును. ఇట్టి నియమమనుసరించని యెడల (క్రమభంగమైన) అభిఘారయాగాదులకు సాహిత్యమేర్పడజాలదు. ప్రయోగ సౌకర్యార్థమునకు ఇట్లనుష్ఠాన సాహిత్యమును బోధించునది ప్రయోగవిధిః.

2. ప్రయోగవిధియందు వితతి విశేషమును నియతి క్రమమందురు. లేదా పూర్వాపరమనిగాని యనవచ్చును. వితతియనగ విస్తారము. దిగువ నుదహరింపబడు షట్ప్రమాణములతో ప్రయోగవిధి సప్రమాణమైనది. అవి:–

186. శ్రుతిః 2. అర్థః 3. పాఠః 4. స్థానం 5. ముఖ్యః 6. ప్రవృత్తిః ప్రమాణములు.

(1) శ్రుతి="క్రమ పరవచనం శ్రుతిః సచద్వివిధః (1) కేవలక్రమపరం, క్రమ విశిష్ట పదార్థ పరమితి" ఉ :- వేదంకృత్వావేదింకరోతి. అనగా యజమాని హాస్తమునందుండ దర్భముష్టి నివేదమందురు=(ప్రీతినిధ్యార్థమేర్పఱచబడినది). ఆహావనీయ, గార్హపత్యాగ్నిగుండముల మధ్యగ హావిస్సునుంచుటకు కల్పితమైన చతురంగుళ నిఖాతభూమిని వేది యందురు. శ్రుతి వీనిని క్రమముగా జేయుమని చెప్పినందున అట్లే జేయుట క్రమము. కావున వేదమును జేసియే వేది నిర్మించనగును.

(2) ఉ:-2. 'వష్టకర్తుః ప్రథమభక్ష్యః' ఇది క్రమవిశిష్ట పదార్థ పరవచనము. అనగా ప్రతిపత్తి కర్మయందు ఇడాభక్షకు ప్రథమాధికారి హోత యని శ్రుతి జెప్పినందున అట్లే మొదలు హోత ఇడాభక్షణ జేయవలయును. ప్రయోగవిధి యందిట్టి శ్రుతి తక్కిన ప్రమాణములకంటె ప్రబలము. ఉ :- సోమప్రకరణమందు 'ఆశ్వినంగ్రహం గృహ్ణాతి' అని కలదు. పాఠక క్రమానుసారముగ ఈ గ్రహమునకు తృతీయ స్థాన ప్రసక్తికలుగుచున్నది.

కాని 'ఆశ్వినందశమో గృహ్యాత' అను పదార్థ బోధక శ్రుతిచే ప్రయోగ విధి ననుసరించి ఆశ్వినగ్రహము పదవదని యర్థము ఇట్లు శ్రుతి యితర ప్రమాణములకంటెను ప్రబలమైనది.

187. (2) అర్థక్రమము='ప్రయోజనవశాత్క్రమ నిర్ణయమర్థః క్రమః' ఉ :- 'అగ్నిహోత్రంజుహోతి, యవాగుంపచతి' అనగా ప్రయోజనము ననుసరించి క్రమమును దెలుపునది అర్థక్రమము. పై యుదాహరణందు యవాగుపాకము హోమార్థమే కాన ఇచ్చట హోమము ప్రయోజన మగుటందున మొదటనే యవాగుపాక మొనర్చి యనంతరమున హోమ మును జేయుమని ప్రయోగవిధి క్రమమును తెలిపినది. పాఠక్రమాను సారముగ పై యుదాహరణ గలదు అట్లే యనుసరించినచో యవాగు (గంజి) హోమానంతరము వ్యర్థమగును. పాఠక్రమాదర్థ క్రమోబలీయాన్ అను న్యాయముచే మొదట యవాగుపాక మొనర్చి తరువాత హోమ మును జేయుట అర్థక్రమ మనబడును. పై న్యాయ మన్నిచోట్ల గలదని గీతా శ్లోకము జెప్పుచున్నది.

శ్లో॥ 227. శుచౌదేశే ప్రతిష్ఠాప్యస్థిరమాన సమాత్మనః ।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరం. గీ. అ 6. శ్లో. 11.

తా॥ యోగమాచరించునప్పుడు మనస్సు స్థిరపఱచుకొని సమశుచి ప్రదేశమునందు మిక్కిలి యెత్తుగాక, మిక్కిలి క్రిందికిగాక యుండునట్టి స్థలమునందు (గద్దె నిర్మించుకొని దానియందు) చేలాజినకుశోత్తరముగా ఆసనములు వేసికొనవలయును. ఇచ్చట పాఠ క్రమముగ ననుసరించిన అర్థ ప్రయోజనము కలుగ జాలదు. అనగా మనస్థైర్య ముండజాలదు కావున పాఠ వ్యతిరేకముగ కుశాసనమునే మొదటపఱచి దానిపై జింక తోలు పఱచి దానిపై వస్త్రమును పఱచి అందు కూర్చొని యోగమభ్యా సము జేయవలయునని తాత్పర్యము. ఇదే పాఠక్రమాదర్థక్రమోబలీ యాన్ననెడి న్యాయము.

183. పాఠక్రమము='పదార్థబోధక వాక్యానాంయః క్రమస్స పాఠ క్రమః' యథాక్రమేణవాక్యాని పఠితాని తథాక్రమేణానుష్ఠానమితి న్యాయం అనగా శ్రుతి యందెట్లు పాఠక్రమమున వాక్యములుపఠింపబడి నవో యవియట్లే యర్థమిచ్చును. అర్థమిచ్చునట్లనుష్ఠానము జేయుట పాఠ క్రమమగును. "పాఠక్రమోద్వివిధః 1. మంత్రపాఠక్రమః 2 బ్రాహ్మణ పాఠక్రమ ఇతి''.

(1) మంత్రపాఠక్రమః :- 'ఆగ్నేయాగ్నీషోమీయయో ర్యాజ్యాను వాక్యానాం సాహిత్యోప పత్తయేయః క్రమః ఆపియతే సమంత్రి పాఠ క్రమః, సచబ్రాహ్మణ పాఠాద్బలీయాన్. యాజ్యాను వాక్య క్రమ ప్రికారేణ ప్రథమ మాగ్నేయ యాగ స్తదనంతర ముపాంశుయాగః తద నంతర మగ్నీషోమీయ యాగశ్చ యథాక్రమ పాఠాద్భవంతి. అనుష్ఠానం బ్రాహ్మణ పాఠక్రమేణ కర్తవ్యమితి విధిః తథాపి బ్రాహ్మణ పాఠక్రమస్య దుర్బలత్వాత్తదనుష్ఠానాత్ ప్రయోగవిధి మాశ్రిత్య మంత్రపాఠ క్రమేణానుష్ఠానం ప్రబలం.' ఉ :- తైత్తిరీయ బ్రాహ్మణ పంచమప్ర పాఠక ద్వితీయాను వాకమునందు 'తాభ్యామేతమగ్నీషోమీయ మేకాదశ కపాలం పౌర్ణమాస్యే ప్రాయచ్ఛతి' యని ప్రథమముననే అగ్నీషోమీయ యాగమును జెప్పబడినది. తరువాత అందే షష్ఠ ప్రపాఠక తృతీయాను వాకమునందు 'యదాగ్నేయోఽష్టా కపాలోఽమావాస్యాయాంచ పౌర్ణమాస్యాంచాచ్యుతో భవతి' అనుచు ఆగ్నేయ యాగమును రెండవ దిగా జెప్పబడినది. కాని మంత్రపాఠమునందాగ్నేయ యాగమే మొదలు జెప్పబడినది. మంత్రపాఠాను సారముగనే హౌత్రు కాండయందు 'అగ్ని ర్మూర్ధా' యను మంత్రానుగుణ్యమైన ఆజ్యభాగము (అవదానమును) గ్రహ ణానంతరము, ఆగ్నేయ యాగయాజ్యానువాక్యానంతరము 'ప్రజాపతే నత్వదేతా' అనుచు నుపాంశుయాగ యాజ్యాను వాక్యము జెప్పనైనది. తరువాత మూడవదిగ 'అగ్నీషోమాసవేదసే' అను అగ్నీషోమీయ యాజ్యాను వాక్యముగలదు. ఇదే విధమున ఆధ్వర్యవకాండయందు "అగ్నయేజుష్టం నిర్వపామి" అనుచు ప్రథమమున ఆగ్నేయ యాగాను

గుణ్యముగలదు. తరువాత "అగ్నీషోమాభ్యాంజుష్టం నిర్వపామి" అనుచు రెండవ యాగనిర్వాపణ జెప్పబడినది. అదే విధముగ యజమాన కాండ యందు' ప్రథమముననే ఆగ్నేయ యాగాను గుణ్యమైన యాజమాన్యము 'అగ్నేరహందేవ యజ్యయాన్నాదోభూయాసం' అనుచు జెప్పి తరువాత అగ్నీషోమీయ యాజమాన్యమైన వాక్యము 'అగ్నీషోమీయ యోరహం దేవయజ్యయా వృత్రహా భూయాసం' అనుచు గలదు. కావున బ్రాహ్మణ పాఠక్రమముగ జేసినచో జెప్పిన యితర కాండలయందలి క్రమమునకు బాధగును. ఇట్లు మంత్రపాఠ క్రమము ప్రబల మగుచు తదానుగుణ్యముగ ననుష్ఠానము జేయవలయును.

2. ప్రయోగవిధిక్రమము బ్రాహ్మణమందే గలదు కాని "మంత్రై రేవస్మర్తవ్యాః" యనుటతో మంత్రములను స్మరించుచు బ్రహ్మణ పాఠ క్రమముగ యనుష్ఠానము జేయవలయునని తాత్పర్యము.

2. బ్రాహ్మణపాఠః=ప్రయాజాదుల యనుష్ఠానము బ్రాహ్మణ పాఠ క్రమానుసారమున జేయు విధినియమము గలదు. కావున నది బ్రాహ్మణ పాఠక్రమ మనబడును. ప్రయాజ వివరము పైన గలదు. ప్రయాజల వినియోగ క్రమము మంత్ర పాఠమునందు "సమిధస్సమిధోగ్ని రాజ స్వ్యంతూ" ప్రయాజల స్మారకములు మంత్రపాఠము నందున్నప్పటికిని వాని యందితర విధానక్రమము లేవియు జెప్పబడలేదు. మరియు మంత్రములకు దేవతా స్మారకత్వమే గలదు గాని యనుష్ఠాన క్రమ స్మారకత్వములేదు. కావున ప్రయాజాదుల యనుష్ఠానములు బ్రాహ్మణ పాఠక్రమముననే అనుష్ఠానము జరుగును. ఆ మంత్రార్థమును బ్రాహ్మణ మనువదించునే తప్ప మంత్రపాఠమునకు విరోధముచు జేయజాలదు. ఎచ్చట మంత్ర పాఠమునందనుష్ఠాన క్రమము జెప్పబడలేదో లేక తూష్ణీభావమైనదో యచ్చట అనుష్ఠానము బ్రాహ్మణ పాఠక్రమమున నగును. ఒకవేళ ప్రయాజాదులనుదాహరణగా నెందులకు జెప్పిరని శంక కలుగుచో నది కృత్వాచింత యనవచ్చును. ప్రయోగ సమవేత అర్థస్మారకత్వము మంత్రములకే గలదు. 'ప్రయాజాదీన్యర్థం సమర్ప్య, చరితార్థాని

స్వరూప సంస్పర్శే ప్రయోజ్యత్వే సత్య పిన ప్రతిపద్యంతే' యనుచు వార్తికకార మతముగలదు. ప్రయాజాదులర్థమును సమర్పించుటతోనే కృతార్థములగును.

189. 4. స్థానం=స్థానస్మా మోపస్థితిః। యస్యవిహితదేశే యోనుష్టి యతే తత్పూర్వతనే పదార్థేకృతే యోప్రథమ ముపస్థితోభవతి సపహోప స్థితిః ప్రకృతి యాగములందాయా దేశమున నుపదేశించబడిన పదార్థములు వికృతి యందతిదేశ ప్రాప్తములైనవాని నొకే దేశమునం దనుష్ఠాన కర్తవ్య మేర్పడినప్పుడు దాని కనుష్ఠానము ప్రకృతి యందున్నట్లు వికృతి కగును. అది ప్రథమోపస్థితిస్థానమనబడును. ఇతరములను పశ్చాద్యథా న్యాయముగ వాని వాని క్రమమున ఆయా స్థలములందనుష్ఠానము స్థాన మగును. ఉ:- జ్యోతిష్టోమయాగమునందు (సవనీయ 1. ఆగ్నేయ) 2. అగ్నిషోమీయ 3. అనుబంధ రూపములగు 3 తంత్రములు విభిన్న దేశములందనుష్ఠాన యోగ్యములైనవి. వాని యనుష్ఠాన దేశము క్రమ మున సవనీయమును సుత్యకాలమని, 2. అగ్నిషోమీయమునకు ఔపవసథ్యే హ్నిః (ఉపవాస దినము) అవి 3. అనుబంధమునకు యాగ సమాప్తి కాల మని జెప్పనైనది. ప్రకృతి యాగములగు పశుతంత్రములు సాద్యస్క మను వికృతి యాగములం దతిదేశ ప్రాప్తములగును.

190. 2. సాద్యస్కం=దేవతాస్మారకములైన వాక్యము మంత్రము నందు జెప్పబడనిది సాద్యస్కమనబడును. అది సోమయాగమునకగు నొకానొక వికారము అందు "సహపశూనాలభేతే" యని గలదు. అప్పు డొకే స్థానమునందు పై మూడువిధములైన పశువుల నాలంభన జేయ వలసియుండును. 'ప్రకృతి వద్వికృతిః కర్తవ్యా' యను ప్రమాణమున అతిదేశ ప్రాప్తములనబడిన నీ మూడు పశువుల ఆలంభనము సాద్యస్కము నందువలె యొకే దేశమునం దనుష్ఠించినచో మూడింటికిని స్థానా తిక్ర మణ దోషముకల్గును. కావున వికృతియాగ మవ్యక్తమైన (స్వార్థబోధిత దేవతారహితం) యాగానుష్ఠానకాలము సుత్యకాలము. ఇట్లుండుటతో

ప్రథమమున సవనీయ పశ్వాలంభనజేసి, తరువాతనే యగ్నీషోమీయపశువును, పిమ్మట అనుబంధ పశువులను క్రమముగా నాలంభన జేయనగును. అప్పుడే సవనీయ పశువునకు స్థానబలముండును. అగ్నిషోమీయమున కొకదానికే స్థానాతిక్రిమణయగునుగాని ప్రకృతియందాశ్విన గ్రిహమును గ్రిహించుటకు ఔపవస్థ్యేహ్నిః జెప్పబడినది. అది యగ్నిషోమీయ యాగమునకు చెందినదనుశంక రావచ్చును. అట్లే చేసినచో మూడింటికిని కాలాతిక్రమణ మనివార్యమగును. కావున "ఆశ్వినంగ్రహం కృత్వాత్రివృతాయూపం పరితీయాాగ్నేయం సవనీయ ముపాకరోతి" అను ప్రమాణమున సుచ్యకాలమునందే సవనీయ పశువును (ఆగ్నేయపశువును) వికృతియందనుష్ఠించినచో నొక అగ్నీషోమీయమునకుదప్ప యితరములకు స్థానబలములుండును. ఇట్టి క్రమమును జెప్పునది స్థానము.

191. 5. ముఖ్యక్రమము = ప్రధానక్రిమేణ యోఽంగానాంక్రిమః సముఖ్యః క్రిమః. ప్రధాన యాగక్రిమమున వానియంగములను క్రిమమున జేయుట ముఖ్యక్రమమగును. అప్పుడన్ని యంగములకు తమ తమ ప్రిధానములతో తుల్యాంతరమేర్పడును. కాని వ్యతిరేకమున జేసిన కొన్నియంగములకు తమ ప్రిధానములతో తుల్యాంతరము (వ్యవధానము) లేకుండుటో లేక అత్యంతాంతరమగుటో సంభవించును. అది యయుక్తమగుచు ప్రయోగవిధి సాహిత్యమునకు బాధకల్గించును. ఉ:- ప్రియాజ శేషమున ఆగ్నేయ హవిరభిఘారణం పశ్చాదైంద్రిదధ్యభిఘారణంతతః ఆగ్నేయ యాగానుష్ఠానం తదనంతర మైంద్రదధియాగః ఇట్లు జేసిననే అభిఘారములకును యాగములకు తుల్యాంతరములుండును. ఇదియే ముఖ్యక్రమము. వ్యతిరేకమైన అత్యంతాంతరమగును.

192. 3. విశేషము=పౌర్ణమాస్య యాగములలో నుపాంశుయాగము. అగ్నీషోమీయ యాగములు రెండుగలవు. అందుపాంశుయాంగమునకు ద్రివ్యమాజ్యము, దాని ధర్మము లుత్పవన చతుర్గ్రిహేత్వాదులు.

అగ్నిషోమీయ - యాగద్రవ్యము పురోడాశము, దాని ధర్మములు నిర్వాపణావఘాతాదులు. రెండు యాగధర్మములను ప్రధాన క్రిమమున ననుష్ఠానము జేయక వ్యత్యస్తమున జేయవలయుననిరి. ఇందు ప్రిధాన క్రమమున అంగానుష్ఠానమగుననుచు శంకగల్గును. గాని పురోడాశ మౌషధ వికారమగుటతో ఓషధి ధర్మములనే ముందనుష్ఠించవలయును. తరువాతనే యాజ్యధర్మానుష్ఠానము పాఠక్రిమను స్వాధ్యాయముచే దెలియబడుచున్నదిగాని ముఖ్యక్రిమ ముపపత్తిచే కల్పించబడును గాన కల్పిత క్రమము స్వాధ్యాయపాఠ సాపేక్షగలది. అదే దుర్బలమైనది. యిట్లగ్నిషోమీయ యాగార్థములైన నౌషధి ధర్మములను ముందనుష్ఠించ వలయునని తాత్పర్యము.

193. 6. ప్రివృత్తిః క్రిమః—సహప్రియుజ్యమానేషు ప్రధానేషు సన్నిపాతినామంగానా మావృత్త్యానుష్ఠానె కర్తవ్యేసతి, ద్వితీయాది పదార్థానాం ప్రథమానుష్ఠిత క్రమేణయోక్రిమ ఆశ్రియతే సప్రవృత్తిక్రమః తా॥ సమానమున కూడి జేయబడు ప్రధానయాగములయందు అంగానుష్ఠాన మావృత్తి క్రమమున జేయవలసినప్పుడు మొదటి పదార్థానుష్ఠాన క్రమముననే ద్వితీయాది పదార్థానుష్ఠాన క్రిమమున బడినది. ఇదియే ప్రవృత్తిక్రిమము. ఉః- 'వైశ్వదేవీంకృత్వా ప్రాజా పత్యైశ్చరంతి' ఇతి వాక్యే ఇతికర్తవ్యతా కాంక్షాయా మేకకాలత్వేన విహితత్వాత్తేషాం తదంగానాంచ ఉపకరణ ప్రభృతీనాం (పశురూప స్పర్శనం) సాహిత్యం సంపాద్యం తస్మాత్ప్రాజాపత్య పశూనాంసంప్రితిపన్న దేవతా కత్వేన యుగపదనుష్ఠానం సంభవం। తదంగానాం యుగపదనుష్ఠానా సంభవేతే షామ వ్యవహితానుష్ఠాన సాహిత్యం సంపాద్యం। తథాసత ప్రాజాపత్యేషు కస్మాచ్చిత్పశోరారభ్యైకైకమంగం సర్వత్రి పశూనామనుష్ఠాయ పునర్ద్వితీయాద్యంగ పదార్థానాం ప్రథమారభిత పశు క్రమేణ సర్వత్రి ద్వితీయాదీనా మనుష్ఠానం. ఏవమేవ తృతీయాదీనాం సంపూర్ణతయా సర్వత్రానుష్ఠానం క్రమప్రితిపత్తిః. "సప్తదశాః ప్రాజాపత్యా భవంతి సప్తదశ। ప్రాజాపత్యాన్పశూనాలభేతా".

తా॥ ప్రాజాపత్య యాగమునందు పదిహేడు పశువులుండును. వాని యంగ పదార్థానుష్ఠానములందు మొదటయే పశ్వంగము ననుష్ఠానమునకై దీసికొనునో అట్టి యంగమే ద్వితీయాది సంపూర్ణ పశువులందరివిగ్రహించి యనుష్ఠింపవలయును. తరువాత ద్వితీయావర్తనందు మరల మొదటి పశువునుండియే రెండవ యంగపదార్థ శ్రవణజేసి యట్టివే యన్ని పశువులందరివి జేకొనుచు ననుష్ఠింపవలయును. మరల తృతీయాద్యావర్తనలందు మొదటి పశువునుండి తృతీయాది పదార్థముల జేకొనుచు సంపూర్ణ సప్తదశ పశ్వంగముల ననుష్ఠించవలయును. ఇట్టి క్రమమునే ప్రవృత్తిక్రమయందురు. ఈ విధమైనది ప్రయోగవిధి.

## 4. అధికారివిధిః

194. కర్మజన్యస్వామ్యత్వ బోధకవిధి రధికారివిధిః 'కర్మజన్య ఫలస్వామ్యం నామకర్మజన్య ఫలభోక్తృత్వం' ఉ=‘యజేతస్వర్గః కామః’ ఫలకామనా హేతుత్వేన అధికారి నిర్ణయః స్వర్గరూప సుఖకామనగలవాడే తన కర్మజన్య ఫలకామనచే యాగాధికారి యగును. వానిగురించి జెప్పువిధి. అధికారివిధి మరియు నిమిత్త హేతువున వాక్య నిరూపణతోనిది యధికారివిధి యనబడును. "యస్యాహితాగ్నే రగ్నిర్గృహాన్దహేత్యో అగ్నయే క్షామవతే పురోడాశ మష్టాకపాలం నిర్వపతి". ఇందు పాపక్షయ నిమిత్తహేతువున యాగకర్త యధికారి యనబడును. అగ్ని తనదాహ విశిష్టగుణమున గృహముల నెట్లుదహించునో గృహదాహాదిలక్షణ క్షామవత్వ విశిష్టగుణముగల అగ్నికి పురోడాశ మష్టాకపాలమగును. అట్లే యా యాగమునుజేయు యజమానికి పాపక్షయరూప ఫలముగలుగును. ఇదేవిధ మన్యనిమిత్తములం దనువర్తించును. నిత్యకర్మలందు 'అహరహస్సంధ్యా ముపాసీత' ఇందు విహితకాల శుచిజీవన జేయగోరినవారు అహరహస్సంధ్యావందన మాచరించగ ప్రత్యవాయపరిహారమగుటతో ప్రత్యవాయ పరిహార రూపఫలమతనికి జెందుచుండుట సంధ్యావందనకర్త యధికారి యగును. ఇట్లు ఫలమెప్పుడును

విశిష్టాధికారికి జెందుటవలన విధివాక్యము లెవ్వరికి పురుష విశేషత్వమును జెప్పునో వారధికారులగుదురు. కామ్యకర్మలందు ఫలాపేక్ష గలవారు. అధికారులు నైమిత్తిక కర్మలందు నిమిత్త నిశ్చయమున, నిత్యకర్మలైన సంధ్యావందనాదులను నిశ్చితకాలమున నాచరించి పవిత్రజీవనము గడుపగోరు వారధికారులు.

సూత్రం ౧౦. 'అర్థీ, సమర్థీ విద్వాన్కృష్ణకేశీజాతపుత్రః' ఇత్యాది లక్షణ విశేషణము లధికారి నిర్ణయమునకు జెప్పబడినవి. గాని "రాజా రాజసూయేన స్వరాజ్యకామోయజేత" యను వాక్యమునందు కేవల స్వరాజ్య కామనచేగాని, రాజ్యసంబంధమాత్ర కామనకలవాడు కాని రాజసూయ యాగాధికారి గాజాలడు., క్షత్రియునకే తనస్వరాజ్య కామన యుండినచో రాజసూయ యాగాధికారముండును. కొన్ని స్థలములందు పురుషవిశేషమున యధికారినిర్ణయమును జేయబడినది. ఉః- "అధ్యయన సిద్ధావిద్యా" అధ్యయనమున కర్థసాపేక్షగలదుగాన అర్థజ్ఞానముగలవారు విద్యాధికారులు "ఆధానసిద్ధాగ్నిమత్తా" ఆధానకర్మచే యగ్నిసిద్ధినిబడసిన వారు సోమయాగమున కధికారులు. మరియు సామర్థ్యమధికారి నిర్ణయమునందు నిమిత్తమగును. 'ఆఖ్యాతానామర్థం బ్రువతాశక్తి స్సహకారిణీ' యను న్యాయముచే పంగుర్బధిరోమూకః షండోంగ వికల మూగ, చెవిటి, గుడ్డిషండ, వికటరనిధికారులు. అట్టి పశువులును యాగమునకు తగవు. స్త్రీ శూద్ర పశ్వాదులు యాగానధికారులు వారికి నిషేధించుటందలి హేతులచే యాగములందలి కర్మలు, యజమాన మనోవాక్కాయ నిర్వర్తితములనిరి. ఇట్టి సంగ్రహమున విధిమీమాంసా పూర్తియగును.

## 2. మంత్రమీమాంసా

195. ప్రయోగసవేత పదార్థస్మారకామంత్రాః। తేషాంచతాదృశ అర్థస్మారకత్వేనైవ అర్థవత్త్వం, నతూచ్చారణ మదృష్టార్థం। మంత్రైరేవ స్మర్తమితి నియమోవిధిః। ప్రయోగ సమవేతములైన పదార్థములను స్మరించునవి మంత్రములు. మంత్రములకే శబ్దార్థ స్మారకత్వము

గలదు. వానినుచ్చరించునప్పుడవి స్మృతికి యర్థగోచరమును జేయు చుండును. మంత్రములను స్మరించుచునే యనుష్ఠానమును జేయవలయునను నియమము విధియగును. కావున మంత్రోచ్చారణ యదృష్టార్థమున కన రాదు. విధిమీమాంసయం దుత్పత్తివిధి మూడువిధములుండునని జెప్ప నైనది. వాని విశేషము లిచ్చట వివరించబడును. ఇవి 1. అపూర్వము 2. నియమము 3. పరిపరిసంఖ్యలు.

1. అప్రాప్తస్య ప్రాపకోవిధి రపూర్వం=ప్రమాణాంతరములతో దెలియబడనిది. శాబ్ద ప్రమాణముననే దెలియబడునది యపూర్వవిధి. ఉ:- "యజేత స్వర్గ కామః" స్వర్గరూపఫలమున్నట్లుగా నితరప్రమాణముల వలన దెలియబడదు. ఒక వేదవాక్య ప్రమాణముననే దెలియబడుటతో నిది యపూర్వవిధియగును. దీనినే ఉత్పత్తివిధియందురు.

2. అనేక సాధన సాధ్యమైన కర్మలందితర సాధనల నివర్తింపజేసి యొకే సాధనమునే జెప్పునది నియమవిధి.

శ్లో॥ 228, విధిరత్యంతమప్రాప్తౌ నియమః పాక్షికేసతి ।
తత్రచాన్య త్రచప్రాప్తౌ పరిసంఖ్యేతి గీయతే.

తా॥ మానాంతరములచే ప్రాప్తించనది యపూర్వవిధి. ప్రాప్తము లలో నొకదానిని నియమించువిధి నియమవిధి. ఒకేచోటగాక పక్కన చోట్ల ప్రవర్తించునది. పరిసంఖ్యావిధి అపూర్వవిధిని యుదాహరణతో పైన వివరించనైనది. నియమవిధినిగురించి ఉ:- 'వ్రీహీనవహంతి' యను ఉదాహరణందు శబ్ద ప్రమాణముననే వ్రీహ్యాదుల కుతుషా విమోకముకొఱకై యవఘాతాదుల సంస్కారములు జేయుట అపూర్వము కొఱకుగాన నిది నియమయగును. తుషావిమోకమును వేరొక పక్షమున జేయవచ్చును. ఉదాహరణగా గోళ్ళచే గిల్లిగాని లేక గిరిణి మొదలగు యంత్రసహాయముననేగాని జేయవచ్చును. ఇట్లు పక్షాంతర సాధన సాధ్య మైనను అదృష్టమైన అపూర్వఫలము బుట్టుట అనిపనికిరావని వ్రీహ్యాదులకు సంస్కారార్థము అవఘాతముచే ('కుటరిరసి కుక్కుటోసి' యను మంత్ర

మున) తుషా విమోకము నియమించునది నియమవిధి. రెండవ యుదాహారణందు 'స్వాధ్యాయోధ్యేతవ్యః' ఇందధ్యయనము గురుముఖమునగాని పుస్తకమును జూచిగాని జేయవచ్చును. కాని వేదాధ్యయనము గురువు వలన జేసినదే యపూర్వార్థమగుచు ఫలమిచ్చును గాన నిది నియమ విధియందు జేరును. పుస్తకమునుజూచి నేర్చిన దపూర్వము నీయజాలదు.

3. పరిసంఖ్యావిధిః ఉభయోశ్చయుగపత్ప్రాప్తౌ ఇతరవ్యావృత్తిపరో పరిసంఖ్యావిధిః రెండు విధు లేకకాలమునందే ప్రాప్తించునప్పుడొక విధిని పరిత్యజించి వేరొక విధిగ్రహణయందు (సంఖ్యా) నియమము గల్పించుట పరిసంఖ్యా విధి. ఇందు రెండు భేదములు కలవు. 1 శ్రౌతీ—లాక్షణికీ. వేదవాక్యములందు వచ్చునది శ్రౌతిపరిసంఖ్య 2 లౌకిక వాక్యములందు వచ్చునది లాక్షణికీ పరిసంఖ్య. శ్రౌతీపరిసంఖ్యోదాహరణ "అత్రహ్యేవావపయంతీ" సూక్తముతోనే స్తుతినియమింపబడినది. ఇది పరిసంఖ్యావిధి. ఇతర స్తోతవ్యావృత్తిని తెల్పుచు నొకపావమాన లౌకిక పరిసంఖ్యోదాహరణ వాల్మీకి రామాయణము నందలి.

శ్లో॥ 229 పంచపంచనఖాభక్ష్యా బ్రహ్మక్షత్రేణ రాఘవ।
శశక, శ్శల్లకీ, గోధీ, ఖంగి కూర్మశ్చపంచమః॥

తా॥ ఓయి రాఘవా! బ్రాహ్మణ క్షత్రియులచే దినదగినవి పంచనఖములు లేని యైదు జంతువులే యగును. వానియందు జేరునవి. (1) శశకము (కుందే.) 2 శల్లకము (ముళ్లపంది) 3 [illegible] 4 గోధ (ఉడుము) ఖడ్గి (ఖడ్గమృగము) 5 కూర్మము (తాబేలు) యనుచు వాలి శ్రీరాముతో ననెను. ఇట్టి పరిసంఖ్యావిధి త్రిదోషగ్రస్తమైనది.

శ్లో॥ 230 శ్రుతార్థస్య పరిత్యాగా దశ్రుతార్థ ప్రకల్పనాత్।
ప్రాప్తస్యబాధాదిత్యేవం పరిసంఖ్యాత్రిదూషితా॥

తా॥ శ్రుతార్థమైన పంచనఖ భక్షణకు హాని, అశ్రుతార్థమైన అపంచనఖ భక్షణ పరిత్యాగము, ప్రాప్తమగు నపంచనఖ భక్షణయందు సంఖ్యా నియమము ఇట్లు పరిసంఖ్యావిధి దూషణత్రయగ్రస్తమైనది. పంచాపంచనఖ

జంతువు లన్నిటిని దినుట నిషేధమగుచు పై జెప్పిన అపంచనఖము లై దింటినే దినుటను నియమించునది పరిసంఖ్యా విధియని తాత్పర్యము. ఇట్టి దోషత్రయములతో మొదటి రెండు దోషములు శబ్దనిష్ఠములు ప్రాప్త బాధయగు మూడవ దోషము అర్థనిష్టమగును. మాంసభక్షణ రాగతః ప్రాప్త మైనందున దానికి చోదనలేదు (వేదము విధించుటలేదు) నిత్యమైనవానినే వేదము నిషేధించును.

శ్లో॥ 231 లోకేవ్యవాయామిషమద్య సేవానిత్యాస్తిజంతోర్నహితత్రచోదనా।
వ్యవస్థితిస్తేషు వివాహయజ్ఞస్సురాగ్ర హైరాసు నివృత్తిరిష్టా॥
భాగ, స. 5. అ. శ్లో. 11.

తా॥ మైథునము — మాంసభక్షణ, సురాపానము ఇవి లోకమునందు నిత్యములైనవి. (రాగతఃప్రాప్తములు) గావున వానిని వేదము చోదన జేయుటలేదు (యవి సేవించుమని వేదము విధించుటలేదు) గాని వేదమున కట్టి యలవాట్లను విరుపించుటందే యిష్టమున్నందున నియమ విధిచే వానికి వ్యవస్థయేర్పరచినది.

శ్లో॥ 232 యద్ఘ్రాణభక్షో విహితస్సురాయా పశోరాలభనం నహింసా।
ఏవంవ్యవాయః ప్రజయానరత్యాఇమం విశుద్ధం నవిదుఃస్వధర్మం॥
స్క. 5 అ. శ్లో. 12.

తా॥ సూరాపాన, మాంసభక్షణ, మైథునములకు క్రమముగా సౌత్రామణి, యజ్ఞము, వివాహములు వ్యవస్థలగుననుచు నిషేధార్థమున కల్పించనైనది (విడుపించుటకై వేదము చెప్పినది) సౌత్రామణి యను నొక విధమైన ఇష్టిగలదు అందు సుర (కల్లు) హోమద్రవ్యమగును. హోమశేషమును భక్షించుట ప్రతిపత్తి కర్మయందు జేరును. అది వినియోగవిధియందు జెప్పనైనది గావున నిచ్చట సురాపాన నిషేధము ధర్మశాస్త్రములందు జెప్పబడుటతో భక్షణార్థమైన పానార్థమును ముఖ్యార్థ బాధచే విడిచి లాక్షణికార్థమైన అఘ్రాణార్థమునే (వాసనజూచుట) యేర్పర్చనైనది. మాంసభక్షణవ్యవస్థయందు పశుహింసదోషమగుటచే

యజ్ఞములందే చేయవలెను హింస దోషముగానందున మాంసభక్షణ గోరిన వారు యజ్ఞములందే చేయవలయునని నియమించినది (బహ్వాయాస సాధ్యమైన యజ్ఞమునందు "వపా" మాత్ర భక్షణ లభించుటచే మాంస నిషేధమునకే యత్నము) మైథునాపేక్షయందు పాణిగ్రహణ (వివాహము) విధానమును భార్యాసంగమును ఋతుకాలమునందు జేయుట నియమించినది అది సంతానార్థమే యగును గాని కేవలరతికే యనబడలేదు (దీనిచే పరస్త్రీ సంగమాదులు నిషేధించనైనది) ఇట్టి పరిశుద్ధమైన స్వధర్మ మెరుగజాలక భ్రాంతులు వ్యామోహితులగుదురు. సనాతనధర్మము దీనినే బోధించుచున్నది. మంత్రమీమాంసయందు నియమవిధి జెప్పబడుటతో నిచ్చట నియమాది విధి భేదములు జూపనైనది.

## 3. నామధేయ మీమాంసా

183. విధేయార్థపరిచ్ఛేదక తయార్థవత్వం నామధేయత్వం. ఉ:-'ఉద్భిదాయజేత పశుకామః' యౌగికవృత్తిచే యిది నామధేయమగును. విజాతీయార్థవ్యావృత్తిని యగును యోగార్థమగు పశురూపఫలము నుద్దేశించి యాగమును బోధించునది నామధేయము. సాధన విశేషము లుపదేశింపబడనందున యాగమునకు ఫలమైనద్రవ్యము గలుగుట కుపపత్తియుండదు. పై వాక్యమునకు యాగసామర్థ్యమునకు దెలియబడదు. శ్రుతి చోదితమగుటలో పై యర్థమని జెప్పరాదు. గావున యాగ విశేషమగునని నామధేయము దెలియబడును. యాగవిశేషమాకాంక్ష జేయగ దెలియబడును. ధాత్వర్థ సామానాధికరణ్యమును ఉద్దేశ్యయోగముచే యుద్భిచ్ఛబ్దార్థ మేర్పడును. ఒకవేళ నీలముత్పలము వాక్యమునందు నీలగుణమెట్లుత్పల సామానాధికరణ్యమగునో యట్లే యిచ్చట ఉద్భిచ్ఛబ్దము యజిధాతువునకే సామానాధికరణ్య మగుచుండగ ధాత్వర్థమునందేల సామానాధికరణ్య మనబడవలెనని ప్రశ్నించినచో యుదాహరణ వైషమ్యమైనందున నట్లే యిచ్చట యజిధాతువునకు సామానాధికరణ్య మగుటలేదు నీల పద ముత్పల పదమునకతిరిక్త మైనందున లక్షణయా నీలగుణ ముత్పలమునకు

సామానాధికరణ్యముగా వచ్చును. గాని యుద్భిచ్ఛబ్దము యాగసమ వేత ద్రవ్యవిశేషమే యనబడినందున యజిధాతువునకు విశేషణము గాజాలదు. అర్థాంతర భోకవాచక పదములు లేనందున ఉద్భిద్విశేషక ద్రవ్యమే యాగోప యుక్తమైనది గావున ధాత్వర్థమునకే సామానాధి కరణ్యా మగుచు ఉద్భిన్నామక యాగనామధేయమగును. ఉ :- 'వైశ్వ దేవ్యామామిక్షః' ఈ వాక్యమునందెట్లు వైశ్వదేవపదమున కామిక్షా పద సామానాధికరణ్యా మర్థమందేయగునో యట్లే యిచ్చట ఉద్భిచ్ఛబ్దార్థము నకును యజిధాత్వర్థమునకు సామానాధికరణ్యామగును. వైశ్వదేవ శబ్దార్థమున తద్ధిత వృత్త్యాతన్నామక దేవతలు దెలియాబడుదురు. 'సాస్య దేవతా' యను సమానార్థము స్మరణగును. సర్వనామములకు లభ్యమాన పదార్థములందు విశేషణ వాచిత్వముగలదు. అవి విశేష్య పరత్వ లక్షణ ములు గలవనబడును. విశేష్యమేది? అను ప్రశ్నతో ఆమిక్షాపద సన్నిధిలో వైశ్వదేవపద ముండుటతో ఆమిక్షార్థమునకు వైశ్వ దేవార్థరూప విశేష్య మైన దేవతలనుచు దెలియబడును.

శ్లో॥ 233. ఆమిక్షాం దేవతాయుక్తాం వదత్యే వైషతద్ధితః।
ఆమిక్షాపద సాన్నిధ్యాద్యస్యైవ విషయార్పణీ.

తా॥ తద్ధిత సమాసవృత్తియే ఆమిక్షను దేవతతో కూడ తెలుపును. తద్ధితము విషయముల నర్పించు (దెలుపు) చే లక్షణములుగలది గావున ఆమిక్షా పద సమీపమునందున్న వైశ్వదేవార్థములైన దేవతల విశేష్యమును దెలుపగలదు.

సూ. ౧౧. 'తదధీనత్వాద్విశేష సిద్ధేః' యను ప్రమాణము. గావున ధాత్వర్థ సామానాధికరణ్యమున ఉద్భిన్నామక యాగ విశేషము వైశ్వ దేవ యాగనామము వలె సిద్ధించును. నామధేయమునందు నిమిత్త చతుష్టయముండును. 1. మత్వర్థ లక్షణ భయము (భియా) 2. వాక్యభేద భయము (భియా) 3. తత్ప్రఖ్యశాస్త్రము 4. తద్వ్యపదేశము. అను నాలుగు నిమిత్తములు గలవు.

1. మత్వర్థోదాహరణ—'ఉద్భిదాయజేత పశుకామః' ! ఉద్భిద్యతే అనేనేతి వ్యుత్పత్త్యా ఖనిత్రార్థములైన యన్ని పదార్థముల కర్థము. గాన ఉద్భిదాపశుం భావయేత్ యాగం ఖనిత్రేణ భావయేదను యన్వయము జేసిన ఆవృత్తి రూపమైన వాక్యభేద దోషమగును గావున పశు కామోయజేత్తని పశురూపఫలం యాగేనభావయేదనునంచు నన్వయించగ ఏ యాగముతో నను ప్రశ్నరాగా ఉద్భిదాయను శబ్దమునందలి తృతీయాంత విభక్తిచే యజిధాత్వర్థమునం దన్వయించనగును. అప్పుడు పశురూప ఫలం ఉద్భిన్త్యతఇతి నిరుక్త్యాయాగ నామధేయము సిద్ధమగును. అనగా యాగద్రవ్యములైన ఉద్భిత్తులు (తరులతలు) యెట్లు తమనిరుక్త్యర్థ ముగ భూమిని పెల్లగించుకొని పైకిలేచునో అట్లే యాగకర్తకు పశురూప ఫలము ఉద్భిన్నామక యాగము జేసిన వెంటనే ఉత్పాదింగును. (ప్రాప్తిం చును) యనుచు తాత్పర్యము. ఇదే విధము "సోమేనయజేత" యను యుదాహరణమందు నామధేయమగుటకు నిమిత్తము మత్వర్థ లక్షణ భయమే యగునసబడినది.

2. వాక్యభేద నిమిత్తోదాహరణ—"చిత్రియా యజేత పశుకామః" చిత్రాపదేన కర్మ నామధేయత్వం వాక్యభేద భయాద్భవతి. చిత్రా పదము గుణార్థమున చిత్రాగుణ విశిష్ట యాగమని యనరాదు. ఏలనన "దధిమధుపయో ఘృతం ధానాయుదకంతండులా తత్సం సృష్టం ప్రాజా పత్యం" యను ప్రమాణమున ఆరు పదార్థములే యాగోప యుక్త ద్రవ్య ములు (గుణములు) అగును. యుదకము మాత్రము ప్రమాదపతితమైన దందురు. "దధ్యా దీని విచిత్రాణిదేయ ద్రవ్యాణి షడామ్నాతాని" యనుచు మాధవాచార్యులు జెప్పిరి. దేయ ద్రవ్యములందు జేరని దగు టతో చిత్రియా పదము గుణము గాజాలదు. యాగమునకు గుణ సంబంధము, ఫల సంబంధము రెండును గల్పించిన వాక్యభేదమను దోషము కలుగును. అనగా చిత్రియాగుణేనయాగం, భావయేత్ తాదృశయాగేన పశురూప ఫలం భావయేత్తని అన్వయించుట ఆవృత్తి యగును. ఆ వృత్తి రూపమైనదే వాక్యభేద దోషము. ఈ భయ నిమిత్తమున యజి

ధాత్వర్థ సామానాధికరణ్యమునకే నామధేయార్థము. ఉ:— చిత్రా నామక యాగేన పశురూప ఫలం భావయేదని తాత్పర్యము. చిత్రయనెడు యాగముచే పశురూప ఫలమును భావించవలయునని అర్థము.

3. తత్ప్రఖ్యశాస్త్రోదాహరణము అగ్నిహోత్రం జుహ్యాత్స్వర్గకామః నామధేయ గుణత్వ ప్రఖ్యాతిని దెలుపుశాస్త్ర మిదివరకే యుండుటచే తత్ప్రఖ్యశాస్త్రమనబడును.

సూత్రం ౧౩. "తత్ప్రఖ్యం చాన్యశాస్త్రం" ఇచ్చట శాస్త్రమనగా వేద వాక్య ప్రమాణములు, "యదగ్నాహోత్రం తదగ్నిహోత్రం" అను సప్తమీ సమాశ్రయణమున అగ్నికి గుణవిధి యగుననుచు జెప్పిన యెడల నప్పుడగ్నికి హోమాధారకత్వ రూపగుణము విధేయమగును. కాని "యదాహవ నీయేజుహోతి" యను నితరశాస్త్రముచే నగ్నికి రూపగుణ మిదివరకే సిద్ధమైనది. మరల తద్విధాన మగుననుట నిరర్థకమగును. యదగ్నయే హోత్రమనుచు చతుర్థీ గ్రహణమునందగ్నికి దేవతారూప గుణ మింతకుపూర్వమే యితర శాస్త్రముచే ప్రాప్తించియున్నది. ఉ:- (1) 'యదగ్నయేచ ప్రజాపతయేచ సాయంజుహోతి' యను వాక్యము. ఉ:—(2) 'అగ్నిర్జ్యోతిర్జ్యోతి రగ్నిస్స్వాహా' యనుచు మంత్ర వర్ణకమునందు గలదు. ఇట్లగ్నికి దేవతారూప ప్రాప్తియున్నందున చతుర్థ్యర్థమున అగ్నికి రూపగుణము సిద్ధించదు. ఒకవేళ.

శ్లో॥ 234. తద్ధితేన చతుర్థ్యావా మంత్రవర్ణేన వాపునః ।
దేవతాయా విధిస్తత్ర దుర్బలంతు పరంపరం.

తా॥ తద్ధితమునగాని, చతుర్థీ విభక్తిచేగాని, మంత్రవర్ణకమునచేగాని దేవతకు రూపసిద్ధియగునను విధిగలదు. కాని మొదటి తరువాతగా జెప్పినవి క్రమముగ నొకదానికంటె నింకొకటి దుర్బలములు. ఈ శ్లోకప్రమాణ మున మంత్రవర్ణకముచే అగ్నిదేవతాసిద్ధి యైనదనినచో ప్రజాపతి దేవతకు బాధయగునని శంకించిన యెడల పై వాక్యమునందు ప్రజాపతి దేవతా విధానము చేయబడలేదు. మరేమన మంత్రవర్ణకమున ప్రాప్తించిన

అగ్నిననువదించి తత్సముచితప్రజాపతి నామగ్రహణమైనది గాన బాధగలుగజాలదు. ఉభయవిధానము జెప్పబడనందున అన్య ప్రమాణాంతర ప్రాప్తాగ్ని ననువదించి తత్సముచ్చిత ప్రజాపతి విధానము జేయుట లాఘవార్థము. అగ్నిహోత్రం జుహ్యోదనునది తత్ప్రఖ్యా శాస్త్రమున కర్మనామధేయమగుట సిద్ధించును ఇదే న్యాయము సమిదాది యాగము లనబడిన ప్రయాజలం దనువర్తించును. "సమిధస్సమిదో అగ్నిరాజ్యస్య వ్యన్తు" యను మంత్రవర్ణక ప్రమాణముననే పంచవిధ ప్రయాజల యాగములు కర్మనామధేయములగును. ప్రయాజలు పైన పేర్కొనబడినవి.

4. తద్వ్యపదేశము = తేన వ్యపదేశో తద్వ్యపదేశః । దానివలెననుట. ఉపమానముగా చెప్పనైనది. ఉ:- "శ్యేనేనాభి చారన్యజేత్" అన్యథానుపపత్యా శ్యేనోపమానేన అభిచారంయజే దనుట కర్మనామధేయము. 'యద్విధేయంతత్ స్తూయతే' యను న్యాయమున 'శ్యేనము' అభిచారిక యాగనామధేయము. ఇది (శ్యేనయాగము) శత్రువధకై జేయబడును. ఒకవేళ శ్యేనపదమునకు ముఖ్యార్థమున పక్షి విశేషమగును. గాన తన్నామక ద్రవ్యముతో యాగము గావచ్చునని ప్రశ్నించినచో శ్యేనపక్షి యాగనిషిద్ధ ద్రవ్యమగుటచే గుణము గాజాలదు. మరియు నర్థవాదములందు శ్యేనస్తుతి చేయబడుట సంభవించదు. "యథావై శ్యేనో నిపత్యాదత్తే ఏవమయం ద్విషన్తం భ్రాతృవ్యం నిపత్యాదత్తే" అను నర్థవాద వాక్యములందు శ్యేనస్తుతి గలదు. ఇదే వాక్యమున శ్యేనపక్షిస్తుతి, మరియు కర్మ విధాన గుణము రెండును సంభవించవు. అగుచో వాక్యభేద దోషమగును. కావున శ్యేనమెట్లు తాను మత్స్యాదులను దుంకి పట్టుకొనునో యట్లే శ్యేనయాగమును జేయు యజమాని, యాగ ఫలముచే తన శత్రువులనుబట్టి వధించునని యర్థమున యాగస్తుతి జేయనైనది. ఇట్లు తద్వ్యపదేశమున కర్మనామధేయము.

5. కొందరు ఉత్పత్తివిశిష్టగుణ ప్రాబల్యమునునొక నిమిత్తాంతరమందురు. ఉ:- "వైశ్వదేవేన యజేత" ఇందుత్పత్తి విశిష్టములగు అగ్న్యాదులకు బలీయస్త్వ గుణమున్నందున వైశ్వదేవ శబ్దముచే విశ్వేదేవతల నామము

సిద్ధించనందున ఉత్పవిశిష్ట గుణనిమిత్తమున కర్మనామధేయమనిరి. కాని ఈ నిమిత్తము తత్ప్రఖ్యాశాస్త్రము నందంతర్భూతమగుటచే వేరగు నిమిత్తముగాజాలదు. విశ్వేదేవతా నామక సంప్రతిపన్న దేవతల గుణము లర్థవాద వాక్యములందుండుటచే వారి కానామ మిదివరలోగానే తత్ప్రఖ్యా శాస్త్రన్యాయమున ప్రాప్తించినది. ఉ:- 'యద్విశ్వే దేవాస్సమ ఇజ్యంత స్త ద్వైశ్వదేవస్య వైశ్వదైవత్వం' అని ప్రమాణము.

197. విశేషము = చాతుర్మాస్య యను యాగమునందు నాలుగు పర్వములుగలవు. 1. వైశ్వదేవపర్వము 2. వరుణ ప్రఘాసపర్వము 3. సాకమేధ పర్వము 4. సునాశీర పర్వము.

1. వైశ్వదేవపర్వము = ఎనమిది యాగములతో గలసియుండునది వైశ్వదేవపర్వము. అన్వారంభణీయను ఇష్టి ప్రథమ దినమునందొనర్చిన తరువాత నీ వైశ్వదేవ పర్వమునందలి యాగములను క్రమముగా జేయవలయును. యాగనామములు.

1. ఆగ్నేయ మష్టాకపాలం నిర్వపతి 2. సౌమ్యంచరుం 3. సావిత్రం ద్వాదశకపాలం 4. సారస్వతంచరుం 5. పౌష్ణంచరుం 6. మారుతంచరుం 7. వైశ్వదైవ్యామామిక్షః 8. ద్యావాపృథివ్యోరేక కపాలం। ఈ యెనమిది యాగములకే "వైశ్వదేవేన యజేత" యను పై యుదాహరణందేక వాక్యము కలదు. ఆగ్నేయాది యాగములకు 'యజేత' పదము ననువాదమునుజేసి వైశ్వదేవ పదమున దేవతారూప గుణముచే నామధేయ విధానము జేయబడినది. 'వైశ్వదేవ్యామామిక్ష' యను వాక్యమున విశ్వేదేవతలు ప్రాప్తించినను అగ్న్యాదీతర దేవతా సప్తకము ప్రాప్తమగును. గాన కర్మనామధేయము గాజాలదు. కాన ఉత్పత్తి విధివాక్యముతో విహితమైన ఆగ్నేయాద్యష్ట యాగములను ధాత్వర్థమున 'యజేత' పదముచే ననువదించి అష్టసంఖ్యాక యాగములకొకే వైశ్వదేవ శబ్దముతో యాగనామధేయమని జెప్పబడినది. విధి లేనందున నామోపదేశము వ్యర్థమనరాదు. 'ప్రాచీన ప్రవణే వైశ్వదేవేనయజేత'

అను వాక్యముదాహరణ జెప్పవచ్చును. దీనిచే నెనిమిది సంఖ్యలు గల అగ్న్యాద్యగ్ని దేవతలు వైశ్వదేవ శబ్దముచే వ్యవహరింపబడిరి. వైశ్వదేవ యాగముల పాచీన ప్రమాణమునందు అనగా గృహమునకు తూర్పున నుండు ముంగిటియందలి మంటపమునందు జేయవలయునని యర్థము. వైశ్వదేవ నామనిరుక్తి రెండువిధములగును.

1. ఆమిక్షాయాం విశ్వేషాం దేవానా మిజ్యమానతయా తత్సహచరితానాం సర్వేషా మపిఛత్రి న్యాయేన విశ్వేదేవత్వ నామధేయం.

ఉ:- "ఛత్రిణోగచ్ఛంతీ" యను వాక్యమునందు రాజు సపరివారముగ ప్రయాణమును జేయునప్పుడు వెంబడిగల పరివారము రాజులుగాకుండినను లోకోక్తిచే రాజుల ప్రయాణమని జెప్పుదురు. అదే న్యాయమును ఛత్రిన్యాయమందురు. అదే యిచ్చటనువర్తించును.

2. "విశ్వేదేవాః అష్టానాంకర్తారః" యను ప్రమాణము రెండవది. ఇట్లు జెప్పినను వికల్పము సమాసబలము లేనిదగుటతో నామధేయ యోజన కుదురదందురు. కావున పై జెప్పబడిన 'యద్విశ్వే దేవాస్సమ ఇజ్యంతే తద్వైశ్వదేవస్య వైశ్వదేవత్వం' యను బ్రాహ్మణ వాక్యప్రమాణమున అగ్న్యాద్యములుత్పత్తి శిష్టులు ప్రబలులు, విశ్వేదేవతలుత్పన్న శిష్టులగుటతో దుర్బలులు. కాన విశ్వేదేవశబ్దమునకు కర్మనామధేయత్వమే యుచితమగును. విశ్వేదేవతా నామమున వ్యవహరింపబడు వారైన యెనమండ్రగు ఆగ్నేయాది దేవతా సంఘాతాత్మక యాగనామధేయ మగునని తాత్పర్యము.

1. ఆమిక్షాయాగము—"తప్తేపయసి దధ్యానయతిసా వైశ్వదేవ్యామిక్షావాజిభ్యో వాజనం" ఇందామిక్షా యనగా ఉడుకు పాలయందు పులుపువేయగా పగిలి ఘనీభూతమైన జున్ను అందుండు నీరు వాజిన మనబడును. ఆమిక్షా ద్రవ్యభాజులు విశ్వేదేవతలు ఆమిక్షా ద్రవ్యమున యాగనామమగును. గాని వాజిన ద్రవ్యమునకు దేవతల నామగ్రహణ మంత్రములందు లేనందున తన్నామక దేవతలను సాంపాదిక లక్షణచే దేవతాంతర (వాజిదేవతల) కల్పన యాకర్మాంతరమనబడినది. ఆమిక్షా

ద్రవ్య ముత్పత్తిశిష్టమైనందున విధి వాక్యమున విశ్వేదేవతా యాగము ప్రబలము (ముఖ్యము). వాజి ద్రవ్యముత్పన్న శిష్టముగాన దుర్బల మైనందున విశ్వేదేవతా యాగమునందు దానికి ప్రవేశము లేదు. ఒకే ద్రవ్యము వికారముతో నుత్పన్నమైనందున నది నిరర్థకము కాజాలదు. కావున దేవతాంతర సంపాదకమున వినియోగపరుచుట కర్మాంతర మనబడును.

2. వరుణ ప్రఘాసపర్వము=చాతుర్మాస్య యాగమునం దాచరించబడు నది వరుణ ప్రఘాసము. ప్రథమ దివసమునందువలె అన్వారంభణీ ఇష్టి జరిపి యీ పర్వమునందలి యాగము ననుష్ఠింపవలయును. వైశ్వదేవ పర్వమునందలి మొదటి యైదు యాగములను పంచసంచరములందురు. అవి ప్రతి పర్వమునందు తప్పక వచ్చుచుండును. పంచసంచరములు.

1. ఆగ్నేయమష్టాకపాలం నిర్వపతి 2. సౌమ్యంచరుం 3. సావిత్రం ద్వాదశకపాలం 4. సారస్వతంచరుం 5. పౌష్ణంచరుం. ఈ పంచసంచర యాగానంతరమున వరుణ ప్రఘాసయందు జేయనగు విశేషయాగములు.

1. ఐంద్రాగ్న మేకాదశకపాలం 2. మారుతీమామిక్షాం 3. వారుణీ మామిక్షాం 4. కాయమేక కపాలం ఇవియు పంచసంచర యాగము కలిపిన మొత్తము తొమ్మిది యాగములుగలది వరుణ ప్రఘాసపర్వము.

3. సాకమేధపర్వము=రెండుదినములందీ పర్వమునవచ్చు యాగము లనుష్ఠింపబడునందురు. మూడవనాడుదయమున అనీకవతేష్టిని జేసియే పంచసంచర యాగానుష్ఠానము చేయవలయును.

1. 'అగ్నయే నీకవతే పురోడాశ మష్టాకపాలం నిర్వపతి సాకగ్ం సూర్యేణోద్యతా' అను ప్రమాణమున అనీకవతేష్టి ఉదయమునందగును. తరువాతనే పంచసంచర యాగములతో పూర్తియగును.

2. 'మరుద్భ్యస్సాంతపనేభ్యో మధ్యందినేచరుం'. ఈ ప్రమాణమున ఆదినమునందే మధ్యాహ్నమున చరుతో మరుద్దేవతా యాగమును జేయవలయును.

3. 'మరుద్భ్యో గృహమేధిభ్యస్సర్వా సాందుగ్ధే సాయంచరుం' అను ప్రమాణముతో నీయాగము సాయంకాలమునం దదేదినమున జేయవగును.

4. 'పూర్ణాదర్వి పరాపత సుపూర్ణా పునరాపత । వస్నేవ విక్రీణావహా ఇషమూర్జగ్ం శతః క్రతోస్వాహా' ఈ యాగముతో యాదిన హోమము పూర్తియగును. మరునాడు (నాల్గవ దినమునందు) పంచసంచరముల ననుష్ఠించిన తరువాత సాకమేధ పర్వమునందు జెప్పబడిన శేషయాగము లనుష్ఠింపదగినవి. యివి:—

1. 'మరుద్భ్యః క్రీడద్భ్యః పురోడాశగ్ం సప్తకపాలం సాగ్ం సూర్యే ణోద్యతా' యను ప్రమాణమున సూర్యోదయమునందే జేయవగును.

2. మహాహవిః ఇందు పంచసంచరములుగాక వచ్చుయాగములు.

(1) 1. ఐంద్రాగ్న మేకాదశకపాలం 2 ఐంద్రంచరుం 3. వైశ్వకర్మణ మేకకపాలం.

(2) పిత్రీయేష్టి—'సోమాయ పితృమతే పురోడాశగ్ం షట్కపాలం నిర్వపతి'.

(3) పితృభ్యో బర్హిషద్భ్యోధానాః.

(4) పితృభ్యోగ్నిష్వాత్తేభ్యోభివాన్యై దుగ్ధేమంథం, అభివాన్యమన తల్లిలేని ఆవుపాలతోనుండి తియ్యబడిననెయ్యి.

(5) త్రియంబకేష్టిః 'ప్రతిపురుష మేక కపాలం' అనగా యజమాని గృహమునందు బుట్టిన పుత్రులు కన్యాపుత్రికల సంఖ్యాక్రమమున ప్రతి వారి కొక్కొక కపాలమగునని యర్థము.

(6) అదిత్యేష్టిః "ఆదిత్యం చరుం పునరేత్య నిర్వపతి" ఇవి పై యాగము లతో గలసినది సాక మేధ పర్వము పూర్తియగును.

4. సునాసీరపర్వము—పంచసంచరములుగాక నిందువచ్చునవి 8 యాగ ములు. 1. ఐంద్రాగ్నం ద్వాదశకపాలం 2. వైశ్వదేవంచరుం 3. ఇంద్రా యసునాసీరాయ పురోడాశం ద్వాదశకపాలం 4. వాయవ్యంపయః

5. సౌర్యమేక కపాలం వీనితో సునాసీరపర్వము పూర్తియగుచు నాలుగు పర్వముల చాతుర్మాస్యనామక యాగము పూర్తియగును. పునః చాతుర్మాస్యాని యనుచు జెప్పి శ్రుతి యాగస్తుతి జేసినది. "అక్ష య్యగ్ంహి చాతుర్మాస్య యాజినః సుకృతంభవతి" యనుచు ఫలస్తుతి జెప్ప నైనది.

198. నామధేయమీమాంసయందే జేసు వేరొక విశేషము జెప్పబడును. "ఉపసద్భిశ్చరిత్వా మాసమగ్నిహోత్రం జుహోతి" ఈ వాక్యమున కర్మ నామధేయము జెప్పబడినదా లేదా యను సంశయమునందు మాసపర్యంత కాలము జరుపబడు నిత్యాగ్నిహోత్రమే యగునను పూర్వపక్ష శంక నిరాకరించి కర్మాంతరమగుటతో మాసాగ్నిహోత్ర నామక యాగమని సిద్ధాంతమునుజెప్పిరి. ఉపసత్తులను అనగా పయోవ్రతాదులను ఆచ రించుటతో కర్మాంతర సూచనగుచున్నది. అది కొండపాయిలను వారి సత్రమునందు (యాగమునందు) జేయబడును. నిత్యాగ్నిహోత్రాను వాదమున మాసాగ్నిహోత్రనామక కర్మాంతరమగును. గావున నిది యాగనామధేయ మగును.

# 4. నిషేధ మీమాంసా

199. పురుష నివర్తకం వాక్యం నిషేధః। ఉ॥ "నకలంజంభక్షయేత్" ఇత్యాది వాక్యములు నిషేధములు. పురుషుని యనర్థములనుండి నివారించునవి నిషేధవాక్యములు. అవి అనర్థహేతుభూతములగు క్రియల నివారించుటతో యర్థవంతములగునెగాని యవే కొంచమైన వేరొక విధమగు కర్తవ్యాము లను బోధించవు. విధివాక్యము లెట్లు స్వప్రవర్తకత్వాన్యథా నుపపత్యా స్వర్గాదిరూప ఫలేష్ట సాధనములైన యాగాదులను బోధించునో అట్లే నిషేధవాక్యములు స్వనివర్తకత్వాన్యథా నుపపత్యా పరిహరించదగిన క్రియలను బోధించును. పై యుదాహరణమునందలి కలంజ (మాంస) భక్షణ నిషేధమని (కూడదని) దెలియబరుచుచున్న దేగాని పురుషుడు జేయ

దగిన దేదైవ పనిగలదని బోధించుటలేదు. దృష్టాంత దార్ష్టాంతలికములు సరివగుటచే పాపహేతువగు మాంసభక్షణ నిషేధమాత్రమగును. ధాత్వర్థ మునందలి లిజంశము కర్తృత్వమునే బోధించున దెట్లు విధియనబడునో అట్లే ప్రత్యయార్థమునందలి లిఙ్ నిషేధము జెప్పును. నఞ్ స్వభావమున ధాత్వ ర్థమునం దవ్యవధానముగలదైనను ప్రత్యయార్థమునకే యన్వయించును. నఞ్ ప్రత్యయార్థమునందే, యుపసర్జనగా యుండుటతో ధాత్వర్థమునం దన్వయము గాజాలదు. ఒకచోటున, ఉపసర్జనగా యన్వయించుదానికి వేరొకచోట అన్వయించుట కుపపత్తియుండదు. అట్లన్వయించినను యే దోషము గాజాలదని పట్టుదల యగుచో యొకచోటు నుండదగిన విశేష ణము పరొకచోట విశేషణమైనచో ''రాజపురుష మానయ'' యను వాక్యమునందున్న పురుషోపసర్జనగా జెప్పిన విశేషణము క్రియోపసర్జన విశేషణముగా నన్వయమగుచు సేవకుని దెచ్చుటకు బదులు రాజును దేవలసి వచ్చును ఇది యనర్థదోషమగును. కావున ప్రత్యయార్థకమగు నఞ్ ధాత్వర్థమునం దన్వయించదు. ఈ విధమున కలంజాది పదములు కారకోప సర్జనత్వములగుచున్నను వానితో నఞ్ అన్వయించుటలేదు. ప్రత్యయార్థ మునందు రెండంశములుండును. ఆఖ్యాతాంశము, లిజంశము. ఆఖ్యాతాం శము వాచ్యార్థమైనది ఆర్థీభావన. లిఙ్గంశము లిఙ్మాత్రమైనందున శాబ్దీభావన. వాచ్యార్థమైన ఆర్థీభావనాతో నఞ్ సమన్వయమగుచు ప్రవర్త నోపసర్జన హేతువున లిజంశ శబ్దభావనాయం దన్వయమగును. ఇట్లు లిజంశ ధర్మమున కన్వయమగుట లిఙ్ స్వరూపధర్మమే వాచ్యార్థమగును గావున నఞ్ సర్వాపేక్ష యాతనయందే ముఖ్యార్థమిచ్చును. ఇట్లర్థమును జేసిననే శబ్దభావనయందు బాధయుండదు. నఞ్ స్వభావముననే ప్రవర్త నకు విరోధియగు నివర్తన విశేషమును బోధించును. నఞ్నకు తన సమభి వ్యాహృత పదార్థముల విరోధి బోధకత్వమో లేదా స్వాన్విత పదార్థ విరోధ బోధకత్వమో స్వభావమగును ఉ॥ "భూతలే ఘటో నాస్తి"యను వాక్యమునందు నాస్తిక్రియచే, కస్యాస్తిత్వం నాస్తీయనుచు ప్రశ్నింప అస్తిశబ్ద వాచ్యార్థమైన ఘటరూపమున కన్వయమగుచు భూతలమునందు

ఘటాభావమును నఞ్ బోధించును. ఇట్లస్తి పదార్థమగు ఘట సత్వరూప మునకు విరోధ్యర్థమైన ఘటరూపాభావమని బోధయగును. విధి వాక్య ములు విన్నప్పుడవి తన్ను ప్రవర్తింపజేయుచున్నవని యెట్లు బోధ యగునో అట్లే నిషేధ వాక్యములు విన్నప్పుడవి తనను నివర్తింపజేయు చున్నవని బోధయగునుగాని యే కర్తవ్యమును బోధించుటలేదు. ఈ విధ మున నన్వయించక నిషేధములు కర్తవ్యమునే బోధించునవగునని జెప్పి నచో విధి నిషేధముల కేభేదము లేక యొకే విధములగు విధులుండునని యర్థమగును.

235. శ్లో॥ అంతరం యాదృశే లోకే బ్రహ్మ హత్యాశ్వమేధయోః ।
దృశ్యతే తాదృశే వేహ విధాన ప్రతిషేధయోః ॥

తా॥ లోకమునందు బ్రాహ్మణహత్య అశ్వమేధయాగములలో నెట్టి భేదము గనుపించుచున్నదో యట్టి వ్యత్యాసమే విధి నిషేధములందుండును. అనగా విధి, నిషేధములకు చాలా భేదముకలదు. ఈ ప్రమాణమున నిషేధ వాక్యములు విధులందు జేరక కేవల నివర్తనపరమైన యర్థమిచ్చునని తాత్పర్యము.

200. ప్రత్యయార్థమునకు బాధయున్నప్పుడే నఞ్ ధాత్వర్థమునం దన్వ యించును. బాధ ద్వివిధమైనది. (1) వ్రతమిత్యుపక్రమము. (2) వికల్పము. 1 మొదటి యుదాహరణ: "నేక్షేదుద్యంత మాదిత్యం నాస్తం యంతం కదాచన" ఈ వాక్యముచే నైష్ఠిక, స్నాతక బ్రహ్మచారులకు సూర్యాదర్శనము నిషిద్ధమైనది. ఇచ్చట నఞ్ ప్రత్యయార్థమున కన్వయిం చక ధాత్వర్థమునం దన్వయించును. అనగా ఈక్షణసంకల్ప విరోధి యగు ననీక్షణసంకల్పమునుజేయు టర్థమైనందున విధియందుజేరుసు. కింభావయే దను యాకాంక్ష జేయగ "ఏతావతేనైవ హైనసావియుక్తో భవతి" యను విశేష వాక్యగత ఫలభావముచే నన్వయమగుచు యనీక్షణ సంకల్పము జేయుటం దన్వయించును. ఇట్టి నఞ్ ప్రసక్త పరిషేధమన బడును. రెండవదాని కుదాహరణ "యజతిషు యే యజామహంకరోతి

నాను యాజేషు'' ఇత్యాదులగును. వికల్ప లక్షణముపైన జెప్పబడినది. శాస్త్రమున ప్రసక్తమైనదానికి శాస్త్రాంతర బాధయగునప్పుడు వికల్ప మగును. గావున యాజలందే ''యే యజమహే'' యను చుపేరిషోచ్చా రణ యగునుగాని అనుయాజలందు ''యే యజామహే'' యను చుపేరి షోచ్చారణ శాస్త్ర నిషిద్ధము.

236. శ్లో॥ నామధాత్వర్థయోగేతు నైవనఞ్ ప్రతిషేధకః ।
వదతో௨బ్రాహ్మణా௨ధర్మాః అన్యమాత్ర విరోధినః ॥

తా॥ నామముతోనేగాని, ధాత్వర్థముతోనేగాని, నఞ్ గలసియుండినప్పుడు ప్రతిషేదార్థము (ప్రసక్తః పరిషేధార్థ)ము గాజాలదు. కాని అబ్రాహ్మ ణః అధార్మికః (అధర్మాః) యనప్పుడు నఞ్ నామధాత్వర్థములకు విరోధి యగు వానిని మాత్రమే బోధించును. అనగా బ్రాహ్మణుడు గానివారిని, ధర్మములు లేనివారిని (యెవరో వారిని) మాత్రమే బోధించును. ఇదియే పర్యుదాస యనబడును.

237. శ్లో॥ ప్రసజ్య । ప్రతిషేధోయం క్రియయా సహయత్ర నఞ్ ।
పర్యుదాస స్సవిజ్ఞేయో యత్రోత్తరపదేన నఞ్ ॥

తా॥ క్రియతో నన్వయించు నఞ్ ప్రసక్త ప్రతిషేధ మనబడునుగాని నఞ్ ఉత్తరముతో నన్వయించిన పర్యుదాస మనబడును.

201. పర్యుదాసయం దనన్యగతిచే నైచ్ఛికవికల్పము జేరును. ఉ॥ "అతి రాత్రేషోడశినం గృహ్ణాతి, నాతిరాత్రే షోడశినం గృహ్ణాతి'' అను వాక్యము నం దతిరాత్రియను న దొకానొక యాగము. దానియందు షోడశి యను నొకపాత్ర విశేష గ్రహణాగ్రహణ మైచ్ఛికకల్ప మనబడినది. గత్యంత రము లేనందున నేదేని యొక పక్షమును గ్రహించవచ్చునుగాని ఈ విక ల్పము అనుపసంహారికంటె భిన్నము.

2. అనుపసంహారిలక్షణము—తన్మాత్ర సంకోచార్థో௨నుపసంహారీ ఉ॥ "పురో డాశం చతుర్ధాకరోతి''యనువాక్యను సామాన్యశాస్త్రముచేప్రసక్తమగును. దీనితో పురోడాశములన్నియు చతుర్భాగములు గావచ్చును. కాని

"ఆగ్నేయం చతుర్ధాకరోతి" యను విశేషశాస్త్ర ప్రమాణముచే సంకోచింపబడి, కేవలాగ్నేయ పురోడాశమే చతుర్భాగమగును. ఇట్లు పురోడాశ చతుర్ధాకరణ మనుపసంహారమైనది. కొన్ని స్థలములందు నఞ్ పర్యుదాసాశ్రయణ మశక్యమగునప్పు డది ప్రసక్త ప్రతిషేధమగును. ఉ॥ "నదీక్షితో దదాతిజోహోతి" అను వాక్యమునందు స్వతః పురుషార్థ హేతువులైన హోమదానాదులు అనిషిద్ధములైనను యాగకాలమునందే నిషేధము లగుచున్నవి. వానిని నఞర్థమున నిషేధించిననే యాగఫలములు గలుగును. అప్పుడు నఞ్ పురుషార్థమగును. ఇట్లే స్వస్త్రీసంగమము నిషేధమైనను దీక్షాకాలమునందు నిషేధమగుచు పురుషార్థ హేతువగును. కావున నిషేధవాక్యముల కనర్థ హేతుభూతములైన క్రియలను మాత్రమే మాన్పించి పురుషునికి పురుషార్థమును గలిగించుటే ఫలము.

ఇట్లు నిషేధమీమాంసా విచారము పూర్తియగుచున్నది.

## 5. అర్థవాదమీమాంసా

202. ప్రాశస్త్యనిందాన్యతరపర వాక్య మర్థవాదః । ప్రయోజనముగల అర్థపరమైన వాక్యములు ప్రశంసానిందలలో దేనినైన జెప్పినచో నది యర్థవాదవాక్య మగును. అర్థవాదములకు తమ స్వార్థః ప్రతిపాదనయందే తాత్పర్యము లేనందున నవి విధివాక్యముతోనేగాని, నిషేధవాక్యముతోనే గాని గూడి యవి ప్రశంసనో లేదా నిందనో దెలుపుచు స్వార్థకము లగును. అన్యథా నిరర్థకములు.

సూత్రం ౧౩. "ఆమ్నాయస్య క్రియార్థత్వా దానర్థక్యమత దర్థానాం తస్మాదనిత్య మిత్యుచ్యతే" (జైమిని సూ. అ 1, పాదం 2, సూత్రం 1,) అను సూత్ర ప్రమాణమున వేదములు కర్మ ప్రతిపాదనజేసిదే యర్థవంతము లైనందున వేదమునందే యంతర్భూతములైన అర్థవాద వాక్యములు విధి నిషేధవాక్యములతో కలియుచునే అర్థవంతము లగును. లేనిచో ననర్థకము లగుటచే ననిత్యము లనబడును. దీనినిబట్టి అవి నిరర్థకములే యని

నిరాకరించుట న్యాయముగాజాలదు. అన్యథా "స్వాధ్యాయో ధేతవ్యః" యను శ్రుతి ప్రమాణ విరోధమగును. స్వాధ్యాయము కృత్స్న వేద పఠ మగుటతో అర్థవాదములు వానియం దంతర్భూతములైనందున వాని యధ్యయనమును జేయుట విధియగును. అర్థబోధ పర్యంత మధ్యయన లక్షణముగాన అర్థవాదజ్ఞాన మావశ్యకమైనది. అర్థవాదములందు రెండు భేదములు గలవు. 1. విధి శేషములు, 2. నిషేధ శేషములు.

1. విధివాక్యములతో గూడి యర్థవంతము లగునవి విధిశేషములు. ఉదా : "వాయుర్వై క్షేపిష్ఠా దేవతా" అను యర్థవాద వాక్యము. "వాయ వ్యం శ్వేతమా లభేత భూతికామః" యను విధి వాక్యమునకు శేషము. పై వాక్యము దీనితోగూడి సార్థకమగుచున్నది. వాయువు శీఘ్రగామి యనుచు దెలిసినంతనే ప్రయోజనము గలుగదుగాని, భూతి (ఐశ్వర్యము) కామనయున్నచో వాయుదేవతాకమైన యాగము శ్వేత పశుద్రవ్యముతో (తెల్లని మేకతో) జేసిన వాయువెట్లు శీఘ్రగామి దేవతయో అట్లే యాగ ఫలము శీఘ్రమున యజమానికి జెందును. ఇట్లు విధి వాక్యముతో గలసి యర్థవాదవాక్య మర్థవంతమగును.

2. నిషేధ వాక్యములతో గూడి యర్థవంతము లగునవి నిషేధ శేషములు. ఉ : "సోఽరోదీత్య ద్యదరోదీత్త ద్రుద్రస్య రుద్రత్వం" యను వాక్య మర్థవాదము. "బర్హిషి రజతం నదేయం" అనునది నిషేధవాక్యము. దీనితో పై యర్థవాద వాక్యము గలసిననే యర్థవంతమగును.

అనగా అతడు రోదనజేసెను గాన రోదనతో నతనికి (రుద్రునకు) రుద్రత్వ నామము గలిగినది యనుచు దెలిసినంతనే ప్రయోజనము గాజాలదు గాని బర్హిషి (యజ్ఞమునందు) రజితం - వెండిదానము నదేయం జేయగూడ దను నిషేధ వాక్యమున పైయర్థ వాద వాక్యము గలసినచో యర్థవంత మగును. రుద్రుని రోద నోదకమున వెండి జనించుటతో నది యజ్ఞములందు దానయోగ్యము గాజాలనందున దానమున కర్హతలేని ద్రవ్యమని దెలిపి రజత దానమును నిషేధించుటచే నిది సార్థకమగును. మరియు నీ యర్థ

వాదములు ఆలస్యాదులచే వేదోక్త కర్మలందు ప్రవర్తించని పురుషునికి ప్రాశస్త్య నిందాదులను జెప్పి, వానికి ప్రవృత్తియో నివృత్తియో గలిగించుచు సఫలములగును. అర్ధవాదముయొక్క అవాంతర భేదములు 3.

238. శ్లో॥ విరోధే గుణవాదస్స్యా దనువాదోఽవధారణే ।
భూతార్థవాద స్తద్ధా నా దర్థవాదో త్రిధామతః॥

తా॥ ప్రమాణాంతర విరోధమగుచున్నప్పు డర్ధవాదములు గుణవాదములనబడును. అవధారణ (అవధరించుట - తెలిసికొనుట) మాత్రి బోధయందు అనువాదములు. రెండుగా నివి భూతార్ధ వాదములు.

1. మొదటి యుదాహరణ : "ఆదిత్యోయూపః" అను యర్ధవాదమున సూర్యుడు యూపము (యజ్ఞమునందు పశువులను బంధించుట కేర్పరచిన స్తంభము) ఇట్లు దెలిసినది చక్షురాది ప్రమాణాంతరములకు విరోధ మగుచున్నది. గావున ఆదిత్యునివంటి ప్రకాశముగల యూపమని లాక్షణికార్థమున దెలియబడుటచే యీ యర్ధవాదము గుణవాదమగును.

2. రెండవ యుదాహరణ : "అగ్నిర్హిమస్య భేషజం" ఇందగ్నికి హిమ (చలి) నివారణగుణము ప్రమాణాంతరములచే దెలియబడినదే కాన యిది యవధరించుట మాత్రిమే గావున నీ వాక్య మనువాద మనబడును.

3. మూడవ యుదాహరణ : "ఇంద్రో వృత్రాయ వజ్ర ముదయచ్ఛత్" ఇందలి అర్ధవాదము ప్రమాణాంతరములకు విరోధముగాని, అనుకూలముగాని యగుటలేదు. అనగా ఇంద్రుడు వృత్రాసురుని జంపుటకై వజ్రి ప్రయోగము జేసినా డనుచుగాని, జేయులే దనుచుగాని ప్రమాణాంతరములతో దెలియుట లేనందున నీ యర్ధవాదముతోనే దెలియబడుటతో నిది భూతార్ధ వాదమగును. అర్ధవాదములు మతాంతరమున నాల్గు విధములు. 1. ప్రశంసా 2. నిందా 3. పరకృతి 4. పురాకల్పము.

(1) ఉ॥ "శోభతేఽస్యముఖం య ఏవంవేద" ఇందు అతని ముఖమెంతో శోభగలది యను అర్ధవాదము ప్రశంసాపరమైనది.

(2) ఉ॥ "అస్త్రతంవా ఏతద్య దచ్ఛందోమయం" ఇది వేదమంత్రముల విని యోగములు లేని యజ్ఞ నింద గావించినది.

(3) పరకృతోదాహరణ: "అగ్నిర్వాఽకామయత । అన్నాదో దేవానాగ్ం స్యామితి । సఏత మగ్నయే కృత్తికాభ్యః పురోడాశ మష్టాకపాలం నిర్వపతి । తతో వై సోన్నాదో దేవానామ భవత్" పూర్వకల్పమునం దగ్నిత్వము గోరిన బ్రాహ్మణుడు కర్మజ్ఞానములతో యీశ్వరారాధన జేసినందున నతడే యీ కల్పమునం దగ్నిగా జన్మించెను. గాన దేవతల కన్నాదుడైనట్టి అగ్నికి కృత్తికాది నక్షత్రయుతమున పురోడాశ మష్టాకపాలముగ నిర్వాపణ జేయవలెను. అగ్ని పూర్వము జేసినట్లు జేయువారు దేవాదుల కన్నమిచ్చునట్టి యగ్నులుగ జన్మింతురు.

(4) పురాకల్పోదాహరణ: "తమశయద్ధియా ధియాత్వావధ్యాసుః" ఇందు పరవత్కృతార్థతా ప్రతిపాదకోఽర్థ వాదః పురాకల్పమనిరి. బుద్ధికి గోచరించినది గ్రాహ్యమైననే బుద్ధిమంతుడగును, గాని బుద్ధిమత్త్వము లేనప్పుడు తత్సిద్ధికై ప్రయత్నించుటతో నత డధ్యాసు డగును.

239. శ్లో॥ తత్రతం బుద్ధి యోగేన లభతే పౌర్వదైహికం ।
యతతే చతతో భూయాత్సం సిద్ధౌ కురునందన॥ గీత అ. 6 శ్లో. 43

తా॥ పూర్వకల్పమునందలి (పూర్వజన్మమునందలి) బుద్ధియోగమున కర్మవాసనతో బుట్టిన అధ్యాసచే ఈ జన్మమునందు బుద్ధి సిద్ధించుటకై ప్రయత్నమును మరల జేయునని శ్రీకృష్ణు డర్జునునితో జెప్పెను. ఇట్లే గోచరమగుచున్నది. గాని, "పురాకల్పోదాహరణందలి శ్రుత్యర్థ మతి గంభీరమగుటతో సులభార్థము గానందున అభిప్రాయ భేదముల కవకాశము కలదు". కొందఱు ఈ యర్థమునందే వేరొక శ్రుతి గలదందురు. అది "తమ శపద్ధియా, ధియావధ్యా సూర్యోమాప్రావోచత్త స్మాన్మ చ్ఛంధియా ధియాఘ్నంతి శప్తం"పూర్వ మగ్ని దేవతల కదృశ్యుడగుచు సముద్రమునందు దాగియుండగ మత్స్యము లతని జూడ దేవతల కెరింగించిన అగ్ని మత్స్యములను శపించినందుననే మనుష్యులు మత్స్యములను బుద్ధిపూర్వకముగ

వధించుచున్నారనుట దీని యర్థమనిరి. కాని పురాకల్పోదాహరణం దీ శ్రుతియును తదర్థము, సమీచీనముగ గోచరించుటలేదు. యదార్థము బృహదారణ్యకమునందలి సప్తాన్న సృష్టి. తత్కారణము దెలిసినచో తెలియవచ్చును.

శ్రుతి ౫౦ "యత్సప్తాన్నా నిమేధయా తపసాఽజనయత్పితేతి
మేధయా హితపసాఽజసయత్పితా ఏకమస్య సాధారణమితీ ।
దమేవాస్య తత్సాధారణమన్నం యదిత మద్యతే
సయఏత దుపాస్తేన సపాప్మనో వ్యావర్తతే మిశ్రగ్ం హ్యేతత్ ।
ద్వే దేవానభా జయదితి హుతంచ ప్రహుతంచ తస్మాద్దేవేభ్యో జుహ్వతిచ
ప్రజుహ్వత్యథో అహుర్దర్శ పూర్ణమాసావితి తస్మాన్నేష్టియాజు కస్యాత్ ।
పశుభ్య ఏకం ప్రాయచ్ఛదితి తత్పయః పయోహ్యే వాగ్రే మనుష్యాశ్చ
పశవశ్చోప జీవంతి తస్మాత్కుమారం జాతం ఘృతం వైవాగ్రే
ప్రతిలేహయంతి స్తనం వానుధాపయన్త్య థవత్సం ।
జాతమాహురతృణాద ఇతి తస్మిత్సర్వం ప్రతిష్ఠితం యచ్చప్రాణతి యచ్చన
తద్యదిదమామాహుః సంవత్సరం పయసాజు హ్వదప పునర్మృత్యుంజయతీతి
నతథా విద్యాద్యద హరేవజుహోతి తదహః పునర్మృత్యు మపజయత్యేవం
విద్వాన్త్సర్వగ్ం హి దేవేభ్యోన్నాదం ప్రయచ్ఛతి ।
కస్మాత్తానిన క్షీయంతేఽద్యమానాని సర్వదేతి పురుషోవాక్షితః
సహీదమన్నం పునః పునర్జనయతే యోవై తామక్షితిం వేదేతి ।
పురుషోవాఽక్షితిః సహీదమన్నం ధియాధియా
జనయతేకర్మ భిర్యద్దైతన్నకుర్యా త్క్షయేతహ ।
సోన్నమత్తి ప్రతీకేనేతి ముఖం ప్రతీకం ముఖేనేత్యేతత్
సదేవానామపి గచ్ఛతి సఊర్జ ముపజీవతీతి ప్రశంసగ్ం ॥
బృ-దా అ. 1 బ్రా. 5 మ. 2 పుట 323

తా॥ ఈమంత్రమునందు సప్తాన్నోపాసన గలదు. "కస్మాత్తాని నక్షీయంతే ద్యమానాని సర్వదా" అనునది మొదలుకొని "పురుషోవాక్షితః" అను మంత్రమువఱకు గల శ్రుత్యర్థ తాత్పర్యముచే ఇచ్చ టర్థవంత మగును. మంత్రార్థ తాత్పర్యమున నది పూర్వకల్పమునందు యే ప్రకారమున తండ్రి

(ప్రజాపతిః) స్త్రియాదిపాంక్త విజ్ఞానమున (బుద్ధిచే) అన్న రచనజేసికొని భోక్త యయ్యెనో అదే ప్రకార మధ్యాసచే సృష్టికర్తయగుచు ఈ కల్పాది యందు సప్తాన్న సృష్టిని జేసి మనుష్యులకు, దేవతలకు, పశువులకు, అన్న విభాగము కల్పించి యిచ్చెనో నదే ప్రకారమున వా రన్నభోక్తులగుచు మరల మరల నూతనాన్నములను సృజించు చుండుటచే తండ్రు లగు చున్నారు. ప్రజాపతివలెనే వీరు జ్ఞానకర్మలచే నూతనాన్నముల జేయుటతో పురుషుడే అక్షితి అక్షయాన్న కారణుడును, భోక్తయు నగుచున్నాడు. వాని యక్షయ్యత్వము మరల మరల కార్యకారణ రూపములయిన సప్తాన్న ములను పూర్వవాసనలతో (బుద్ధిచే) జనియించుచు వృద్ధిచేయుటచే దెలి యును. జెప్పిన ప్రకారము పురుషుడు తన పూర్వవాసనలచే బుద్ధి పూర్వ కమున ప్రయత్నించి యొక క్షణమైనను అన్నముల బుట్టించకుండిన నిరం తరము భోక్తలచే భుజింపబడు యీ సప్తాన్నములు క్షీణించిపోవును. కావున పురుషు డే విధముగ నన్నభోక్తయో అదే ప్రకార మన్నముల బుట్టించు తండ్రి యగుచు నిరంతరకర్త యగుటతో వాడే అక్షితి యన బడును. ఇందువలననే నిరంతరము భుజింపబడినను యన్నములు క్షీణించుట లేదు. ఇట్లు ఉపాసన జేయువాడు సార్వాత్మభావము నొంది మరలాన్న రూపుడుగాక ప్రజాపతివలె తాను కృతార్థుడగును. కావున నిదియే పురా కల్పోదాహరణ మగునని తాత్పర్యము.

విశేషము—సందిగ్ధార్థ నిర్ణయమునం దర్థవాద వాక్యములు కొన్నిచోట్ల ప్రమాణము లగుచున్నవి. ఉ:- "అక్తాశర్కరా ఉపదధాతి" ఇం దక్తా పదమునకు ద్రవ పదార్థ మని యర్థము. ఆ ద్రవపదార్థ మేదియను సంశ యమునందు "తేజోవై ఘృతం" యను అర్థవాద వాక్యముచే నది దెలియ బడును. తేజః పదార్థము ఘృత మగుటతో ద్రవపదార్థ మనబడునని తాత్ప ర్యము. కర్మః ప్రతిపాద్య వేదమునందలి భేదములయిన విధి, మంత్రి, నామధేయ, నిషేధార్థవాదములగు పంచ విధములను దెలుపు పూర్వ మీమాంసాశాస్త్రము. యాగాది ధర్మ ప్రతిపాదన జేసినది యాగాది ధర్మ ములను సకామనయాయనుష్ఠించిన స్వర్గాదిరూపఫలములువానివానియందు

జెప్పబడినవి గలుగును. యవియే నిష్కామనయాగాని యీశ్వరార్పణ బుద్ధిచేగాని జేసిన చిత్తశుద్ధిని గలిగించి జ్ఞానముద్వార మోక్షము నిచ్చును.

240. శ్లో॥ యత్కరోషి యదశ్నాసి, యజ్జుహోషి యదాసియత్ ।
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం ॥

తా॥ ఓ యర్జునా నీ వేవేవి కర్మల జేయుదువో, భుజించెదవో, హోమములు జేయుదువో, తపస్సు జేయుదువో యవన్నియు నా కర్పితముల జేయుమని శ్రీకృష్ణభగవాను డనెను. సంయోగ పృథక్త్వ న్యాయమున కర్మలకు యథాభిసంధి స్వర్గ మోక్షాది ఫలము లుండును. కావున ధర్మాచరణయే ముఖ్యము.

పూర్వమీమాంసాకాండ సంగ్రహము సమాప్తము.

ఓం

శ్రీ గణేశాయ నమః

# ఆర్ష విజ్ఞాన సర్వస్వము

## ద్వితీయ గుచ్ఛము

## 9. ధర్మశాస్త్ర కాండము

## అనుష్ఠేయ ధర్మములు

203. చతుర్దశ విద్యలలో ధర్మశాస్త్రము పదునాలగవది. ధర్మశాస్త్రము లనేకములుగలవు. అవి యనేక మహర్షి ప్రణీతములు. మను, విష్ణు, యమ, అంగిర, వశిష్ఠ, దక్ష, సంవర్తన, శాతాతప, పరాశర, గౌతమ, శంఖలిత, హారీత, ఆపస్తంబ, ఉశన, వ్యాస, యాజ్ఞవల్క్య, కాత్యాయన, బృహస్పతి, దేవల, నారద, పైఠీనస మున్నగు మహర్షులుచెప్పిన ధర్మశాస్త్రము లాయా ఋషుల పేర్లచే ప్రసిద్ధిబడసినవి. వానిలో చతుర్విధ పురుషార్థములు, వర్ణాశ్రమాచార సనాతన ధర్మము లుపదేశింపబడినవి. ఇచ్చట ధర్మ శబ్దమునకు నానార్థము లివి :-

శ్లో॥ 241. ధృతిః క్షమోదమోస్తేయం శౌచ మింద్రియ నిగ్రహః ।
ధీ ర్విద్యాసత్య మక్రోధో దశకం ధర్మలక్షణం ॥

తా॥ 1. ధైర్యము 2. ఓర్పు 3. దొంగతనము చేయకునికి 4. పరిశుభ్రత 5. ఇంద్రియ నిగ్రహము 6. బుద్ధి 7. విద్య 8. సత్యము 9. దమము 10. అక్రోధము లీ పది ధర్మలక్షణములు.

శ్లో॥ 242. అహింసా శౌచ మక్రోధః అనృశం స్యందమశ్శమః ।
ఆర్జవం చైవ రాజేంద్ర నిశ్చితం ధర్మలక్షణం ॥

తా॥ 1. అహింసనము 2. పరిశుభ్రత 3. అక్రోధము 4. దయ 5. దమము 6. శమము 7. అకౌటిల్యము లివి ధర్మ లక్షణములని నిశ్చయించనైనది.

204. ధర్మలక్షణములలో అహింసాదులంత స్సాధనములు, శౌచాచారములు బాహ్యాసాధనములు. పై లక్షణములకు విరుద్ధములయినవి యధర్మములు.

శ్లో॥ 243. మత్తః ప్రమత్తోన్మత్తః శాంతః కృద్ధో బుభుక్షితః ।
త్వరమాణశ్చ భీరుశ్చ లుబ్ధః కామీచతే దశః ॥

తా॥ మత్తత గల్గినవాడు, మదోన్మాదము గలవాడు, డస్సినవాడు, క్రోధము గలవాడు, ఆకలి గలవాడు, తొందరపడువాడు, పిరికితనము కల్గినవాడు, లోభి, కామి ఈ పదుగు రధర్మపరలు. వీ రాచరించునవి యధర్మములు. ఇవే పాపములుగాన నాచరించవలదని ధర్మశాస్త్రములు నిషేధించుచున్నవి. పై ధర్మశాస్త్రముల సంగ్రహించి వానికి సమన్వయ మగు సూత్రములను జెప్పిన వవి గౌతమ ధర్మసూత్రము లనబడు చున్నవి. అందలి సూత్రసంఖ్య దాదాపు 987. దీనికి మస్కరీ వ్యాఖ్యా నము గలదు. "వేదో ధర్మమూలం" అను సూత్రము మొదలు "ఇతి ధర్మోధర్మః" అను సూత్రమువరకు వర్ణాశ్రమాచార రూప ధర్మోపదేశ ములు గలవు. అందు కాండములు మూడు. ఇవి :-

1. ఆచారకాండయందు వర్ణాశ్రమాచార రూప సంస్కార ధర్మములు.

2. ప్రాయశ్చిత్తకాండయందు పాపక్షయ నిమిత్తములగు దండనలు.

3. వ్యవహారకాండయందు దాయ విభాగాది సకల ధర్మములు గలవు.

యాజ్ఞవల్క్య స్మృతికి మితాక్షరియను వ్యాఖ్యానము గలదు. అందలి వ్యవహారకాండను ధర్మశాస్త్రముగ మ్లేచ్ఛ ప్రభుత్వ పరిపాలన కాలమందు మన భారతదేశమునం దంగీకరించిరి. ఆ కాలమున భారతదేశమును నాల్గు ప్రాంతములందు విభాగించి హైందవుల వ్యవహారముల పరిష్కరించెడివారు. ప్రాంతముల నుపదేశ స్థానము లనెడివారు. (Schools) అవి :-

1. ఉత్తరమున ఉత్తరహిందూస్థానము 2. తూర్పున బంగాళము 3. దక్షిణ మందు మద్రాసు (ఆంధ్ర, కర్ణాట, తమిళ, కేరళములనుగలిపి) 4. పశ్చిమ

మున మహారాష్ట్రము ప్రాంతములందురు. దాయ విభాగ, వ్యవహార మయూఖము లను గ్రంథముల (శాస్త్రముల) బంగాళమునందు. ఇతర ప్రాంతములందు మితాక్షరీ (యాజ్ఞవల్క్య స్మృతి వ్యాఖ్యానము—విజ్ఞానేశ్వరి) ధర్మశాస్త్రముగ నంగీకరించిరి. తరువాత శాసనసభలద్వారా చట్టము లేర్పఱచిరి. ఇప్పుడు స్వతంత్ర భారతమునందు ధర్మశాస్త్రము నందు మార్పులు గలిగినవి. న్యాయస్థానములందు చట్టముల (Law) ద్వార వ్యవహార పరిష్కారములగుచున్నవి. చట్టములచే వర్ణాశ్రమాచార రూపధర్మము విచ్ఛిన్నమైనది. కాని కాలానుగుణ్యముగ ధర్మము వ్యష్టి గతమైనందున నెవరైన ధర్మజిజ్ఞాసు లుండవచ్చును. వారి కీ ధర్మశాస్త్ర విజ్ఞానావశ్యకతయుండును. "యతోధర్మ స్తతో జయః" యను న్యాయము గలదు. గౌతమ సూత్రముల ననుసరించి యితర ధర్మశాస్త్రముల కాను గుణ్యముగ నిచ్చట సంగ్రహముచేయనైనది.

205. ధర్మము పంచవిధములు. ఇవి :- (1) వర్ణధర్మము (2) ఆశ్రమ ధర్మము (3) వర్ణాశ్రమ ధర్మము (4) గుణధర్మము (5) నిమిత్త ధర్మము లివియే సనాతన ధర్మములనబడుచున్నవి. ధర్మమునకు మూలకారణము వేదము. మఱియు వేదార్థ విస్పష్టజ్ఞులగు మహర్షుల ప్రతిపత్తి జ్ఞానము దేశ కాలాది నిమిత్తములచే విపర్యాసము గానందున వారి యాచారశీలములు ఆచరణీయ ధర్మములు.

సూత్రము ౧—"వేదోధర్మమూలం" ఈ మొదటి సూత్రమునందు ధర్మమునకు కారణము వేదము. ఇందు వేదచోదిత కర్మలు, వేదార్థజ్ఞుల శీలాచారములు వేదార్థమునందు తత్తుల్యములు. అనగా మన్వాదుల శ్రౌత జ్ఞాన మప్రతిహతము గాన వారి శీలాచారములందు మిథ్యాత్వముగలదని ఉత్ప్రేక్షజేయ శక్యముగాదు. మన్వాదులు తమ శీలాచారములను ధర్మ శాస్త్రములం దుపదేశించిరి. అవి సప్రమాణములు.

శ్లో॥ 244. వేదోఽఖిలం ధర్మమూలం స్మృతిశీలే చ తద్విదాం ।
ఆచార శ్చైవ సాధూనామాత్మన స్తుష్టిరేవచ ॥

తా॥ వేదమంతయు, వేదార్థజ్ఞులు జెప్పిన స్మృతులు, సత్పురుషుల సదాచారములు, తన మనస్సంతుష్టి ఇవి ధర్మమూలములు.

206. (1) శత్రువధార్థమునకై యుపయోగించునవి శ్యేనాది యాగములు వేదచోదితములయినను యవి అధర్మములేకాని శరీర రక్షణకొఱకు ఉపయుక్తములయినందున లక్షణయా ధర్మశబ్దమునం దంతర్భూతములగును, మఱియు నహింసారహితమైన యన్నృతము ఆపద్ధర్మాదులు ధర్మశబ్దమునందు జేరును. ఇట్లే రాజనీతులు, కూటనీతులు, ధర్మాభాస మాత్రములే యైనను లక్షణయా ధర్మములనబడుచున్నవి.

(2) సంధ్యావందనానంతరము ఆత్మప్రదక్షిణ కరణము ఆచారము.

(3) "యచ్చాత్మవంతో వృద్ధాః" అను ప్రమాణమున సకాలమునం ధనుష్ఠానము చేయువారలకు నిర్దోషముగ కలిగిన జ్ఞాన మాత్మ తుష్టి కరము.

సూత్రం 2 :- "సాహసంచ మహాత్మాం" అనగా మహాత్ముల యాచరణ సాహస మగును. "సాహసోబలమిహోచ్యతే" యనగ సాహసమును బల మందురు. ఇతరుల కట్టి బలము లేనందున వారు ధర్మాతిక్రమణ జేసిన యెడల దోష మగును. (కోరికలతో చేసినవి ధర్మ వ్యతిక్రమణలు, సాహసమున జేసినవి బలములు)

సూత్రం 3 :- "అవరదౌర్బల్యాత్" అనగా మహాత్ములగువారి సాహస చర్యలు దృష్టాంతములుగ గైకొని అవరులు (శ్రేష్ఠులుకానివారు) అవియే శిష్టాచారము లనుకొనుచు దుర్బలులైనందు జేయరాదు. ఒకవేళ మహాత్ములకు దేహ మున్నందున వారికిని ప్రియాప్రియములుగలవని శంకగుచో నట్టియెడల మహాత్ముల యాచరణలు అధర్మము లనబడును. కావున దుర్బలత్వ కారణమున నితరుల ట్లాచరించవలదని సూత్రార్థము.

2. స్మృత్యాచారములందు విరోధ మేర్పడునప్పుడు స్మృతికి ప్రాబల్యము. శ్రుతి స్మృతులందు విరోధ మున్నప్పుడు శ్రుతి ప్రబల మగును.

స్మృతులందు పరస్పర విరోధ మేర్పడినప్పుడు శ్రుత్యనుకూల స్మృతి సప్రమాణము. తుల్య విరోధమందు యైచ్ఛిక వికల్పముననే దొక స్మృతి ప్రమాణము ననుసరించవలయును.

207. ఉపనయన సంస్కారము స్మృతులందే కనుపించుచున్నదికాని శ్రుతియందు జెప్పబడలేదని శంకగుచో, ఉపనయన సంస్కారము లేని వారికి అధ్యయనమునం దధికారము లేదుకాన స్మృతులు శ్రుత్యర్థాను కూల్యమున ద్విజులకు ఉపనయన సంస్కారముల జెప్పినవి. ఇట్లే స్మృతి నిషేధించిన గోవధ శ్రుతియందు గనుపించుట (గవాలంభన) విరోధము గాజాలదు. "మాగాః ప్రమాపయ । మాశ్వాన్ప్రమాపయ" అను శ్రుతి ప్రమాణముగ స్మృతి శ్రుత్యర్థానుకూల్యముగ నిషేధముజేయుట విరోధ మనరాదు.

208. వర్ణధర్మము లధ్యయనాదులు 2. ఆశ్రమ ధర్మములు=సమిధాదానా దులు 3. వర్ణాశ్రమ ధర్మములు=బ్రాహ్మణులకు పాలాశదండము ఇత రుల కితరములు 4. పట్టాభిషేకాదులు గుణధర్మములు. 5. ప్రాయశ్చిత్తా దులు నిమిత్త ధర్మములు. ఇట్లు సమస్త ధర్మములను ధర్మశాస్త్రములు విధించుచున్నవి. మఱియు వైదికమైననీ సనాతన ధర్మమాచరించువార లకు చతుర్విధ పురుషార్థములు కలుగునని బోధించి వానిసాధనములను ధర్మశాస్త్రము లుపదేశించినవి. ద్విజులకు ధర్మాచరణ ఉపనయన సంస్కా రము జరిగిన తరువాత విధించబడినది. కాని సంస్కారము లారంభమగుట తల్లి గర్భాదానమునుండియే జేయువిధికలదు. అనగా తండ్రి పుత్ర ప్రతి నిధి న్యాయమున ఉపనయనమువర కగు గర్భాదానాది సంస్కారముల నాచరించును గాన విరోధమగుటలేదు. తండ్రి సంస్కారియేగాన ఉప నయనాత్పూర్వ సంస్కారములజేయుట యొప్పును. ఎవరికి ఉపనయనా త్పూర్వ సంస్కారములు జరుపబడలేదో వారికి ఉపనయన కాలమునందైనను పూర్వ సంస్కారములనుజేసి తరువాత ఉపనయన సంస్కారమును జేయవల యును. ఇట్లు ఉపనయన సంస్కారమునుండి శాస్త్రారంభమును జేయుట ఉచితమగుచున్నది.

# 1. వర్ణధర్మములు

సూత్రము ౭:—"ఉపనయనం బ్రాహ్మణస్యాష్టమే" అనగా ద్విజాతులకు వయస్సును పురస్కరించుకొని ఆ యా కాలములం దుపనయనము చేయు విధి వర్ణధర్మము. ఇందు బ్రాహ్మణున కెనిమిది సంవత్సరముల వయస్సు వరకు ఉపనయనము చేయవలయును. వయోగణన గర్భప్రవేశమునుండి గాని లేక జన్మదినమునుండిగాని చేయవచ్చును. "గర్భసహచరిత దశమసా గర్భేత్యుచ్యతే" అను ప్రమాణము గలదు. ఇది ఉపనయనమునకు బ్రాహ్మణునికి సాధారణ కాలనిర్ణయము. "నవమే", "పంచమే" యను సూత్రములం దసాధారణ కాలము కామ్యమందు బ్రాహ్మణునికి జెప్పనైనది. క్షత్రియులకు సాధారణకాలము 11 వ సంవత్సరము. వైశ్యులకు 12 వ సంవత్సరము సాధారణ వయోనిర్ణయము. వారికిని కామ్యమందు క్షత్రియునకు 6 వ సంవత్సరము, వైశ్యునకు 8వ సంవత్సరము జెప్పనైనది. బ్రాహ్మణునికి చివరకాలము 16 వ సంవత్సర వయస్సు. ఈ లోపల ఉపనయనము జేసితీరవలయును. అన్యథా వారికి బ్రాహ్మణత్వ ముండజాలదు. క్షత్రియ, వైశ్యులకు చివరకాలము క్రమముగ 22-24 వత్సరములు కాన వారికి ఉపనయనము ఈ లోపలనే జేయవలయును.

సూత్రం ౮ :- "ద్వితీయం జన్మ" అనగా త్రైవర్ణ్యులకు ఉపనయన సంస్కారముచే రెండవజన్మ యగును. ఇట్లు ద్విజాతులకే వేదాధ్యయనాధికారము గలదు.

సూత్రం ౯:- "ద్విజాతీనామధ్యయనం" అనగా ఉపనయన సంస్కారముచే ద్విజాతు లనబడు వారలకు అధ్యయనము జెప్పవలయును. కావుననే ద్విజాతులుగాని వారలకు, స్త్రీలకు, ఉపనయన సంస్కారము జరుగని త్రైవర్ణ్యులకు అధ్యయనాధికారము లేదని ధర్మశాస్త్రము నిషేధించినది.

శ్లో॥ 245. నైవకన్యాన యువతినాల్ప విద్యోన బాలిశః ।
హోతాస్యా దగ్నిహోత్రస్యనార్తోనా సంస్కృత స్తథా ॥

తా॥ కన్యలు, స్త్రీలు, అల్పవిద్య గలవారలు, మూర్ఖులు, ఆర్తులు, ఉపనయ సంస్కారము లేనివారు అగ్నిహోత్రాది పవిత్ర కర్మల చేయరాదు. చేయించరాదు.

209. ఉపనయనము = అనగా సమీపమునందు జేరుట కర్థము తాత్పర్యమున అధ్యయనార్థము గురు సమీపమునకు జేరుట. ఇది సంస్కార కర్మ. ఈ సంస్కారమునందు వేదమాత యగు గాయత్రీ మంత్రోపదేశము వటునకు జేయబడును. దీనిని బ్రహ్మోపదేశ మందురు. సప్తకోటి మహా మంత్రములందు గాయత్రి ప్రధానమైనందున వేదమాత యగును. ఈ సంస్కారము మంగళ కర్మలయందు జేరును. ఉత్తరాయణ, శిశిర వసంతాది ఋతువులందు శుభ తిథి వార నక్షత్రములలో లగ్న ముహూర్తాది శుభకాలములందు ఆచార్యవటులకు తారా చంద్ర బలము లున్నప్పుడు ఉపనయనము జేయవలయును. జ్యోతిశ్శాస్త్రానుసారముగ తిథ్యాదినిర్ణయ మగును. స్మార్తకల్ప సూత్రముల ననుసరించి యాజ్ఞికము జరుగును. ఉపనయనమందు వటు గురువుతో "సావిత్రి" నుపదేశింపుమని ప్రార్థించును. "భోగురో సావిత్రీం మేనుబ్రూహి" యనుచు బలుకవలెను. ఇచ్చట సావిత్రిని జెప్పుమని వటు ప్రశ్నించగ గాయత్ర్యుపదేశ మెట్లు గురువు జేయునని ప్రశ్న రావచ్చును. కాని సావిత్రి నామముననే గాయత్రి ఉపదేశింపవలయునని సిద్ధాంతము గలదు. కారణ మిది :-

గాయత్రి మంత్ర లక్ష్యార్థము పరబ్రహ్మ. వాచ్యార్థము మాయాశబలిత బ్రహ్మ. ఇతడు చిచ్ఛక్తియుతుడగు ఆదిత్యమండలాంతర్వర్తియగు హిరణ్మయ పురుషుడు. త్రిగుణాత్మికమైన చిచ్ఛక్తి త్రివిధనామములతో నతనియందుండును. చిచ్ఛక్తికి కాలభేదములతో వేరువేరు నామములు గలవు. ఉషః కాలమందు బ్రాహ్మీ ముహూర్తము సంధికాలము.

(1) ఈ సంధికాలమునందు ఇచ్ఛాశక్తి, రక్తాంగి, హంసవాహిని, దండహస్త, బాల, అకారవర్ణాత్మిక, బ్రాహ్మీ, గాయత్రి నామమున చిచ్ఛక్తి యుండును.

2. మధ్యాహ్న కాలమునందు, క్రియాశక్తి, శ్వేతాంగి, తార్క్ష్యవాహిని, యువతి, రౌద్రి, ఉకారవర్ణాత్మిక, సావిత్రి నామమున నదె చిచ్ఛక్తి యుండును.

3. సాయం సంధియందు, జ్ఞానశక్తి, కృష్ణాంగి, వృషభవాహిని, వృద్ధ, వైష్ణవి, త్రిశూలధారిణి, మకారవర్ణాత్మిక, సరస్వతి నామమున చిచ్ఛక్తి యుండును. ఇట్లు త్రికాలములందు చిచ్ఛక్తి యైన గాయత్రియె కాలానురూపనామమున వ్యవహరింపబడుచున్నది. గాయత్రి అనగా గాయతి = త్రాయతి లేదా గాయంతం త్రాయతీతి గాయత్రి యను వ్యుత్పత్త్యర్థము. (జపముల జేయువారిని రక్షించునది). సావిత్రి యనగా, సూతే సకల కర్మ ఫలానీతి వ్యుత్పత్త్యాసవిత (సూర్యుడు) అతని శక్తిని సావిత్రి యందురు. 3 సరస్వతి యనగా రసము=పర బ్రహ్మ "రసోవైసః" అను శ్రుతి గలదు. అతని శక్తి సరస్వతి. ఈ మూడు నామములతో కాలభేదమున చిచ్ఛక్తి వ్యవహరింపబడినది. కాన గాయత్రి ఉపదేశమగుట విరుద్ధము గాజాలదు. ఎట్లన ఉదయానంతరము ఉపనయన సంస్కారము జరుగును. కాలాతీతమైనందున నప్పుడు గాయత్రినామ వ్యవహారములేదు. సావిత్రి నామమే అప్పుడు వ్యవహారమునందు గలదు. కావున సావిత్రినామక గాయత్రి యుపదేశమగుచున్నది.

2. ఉపనయన కాలమునందు మాతృభోజనము వటుడు జేయవలయును. భోజనానంతర ముపదేశమగును. కాన ప్రథమమైన ప్రాతఃకాల సంధ్యా వందనము కాలాతిక్రమణచే జేయరాకుండును. సాయంసంధిలో సంధ్యా వందనము వటువునకు చెప్పబడును. మరునాటి ప్రాతఃకాలమునుండి క్రమ ముగ త్రిసంధ్యలందు వటు సంధ్యావందనము లాచరింపవలయును. సంధ్యా కర్మయందు మూడు ముఖ్య కర్మ లివి :- (1) అర్ఘ్యప్రధానము (2) గాయత్రి జపము (3) ఉపస్థానము. ఇతరమంతయు అంగముగా జేయ వలయును.

3. వటునకు ఉపనయనకాలమునందు గాయత్రి మంత్రము "పచ్ఛోర్ధర్చ"గ నుపదేశింతురు. పచ్ఛోర్ధర్చ యనగా పదశః, అర్ధశః, క్రమశః ఇట్లు వటునకు

సులభ గ్రహణార్థ ముపదేశమగును. గాయత్రి మంత్రమునందు మూడు పాదము లుండుటచే త్రిపాద్గాయత్రి యందురు. వటున కుచ్చారణ యల వాటైన పిదప మంత్రము సాంత మొకేసారి యుచ్చరించవలయును. మంత్రావర్తన జేయుట జప మనబడును.

4. ఉపనయన సంస్కారమందు, గాయత్రి మంత్రోపదేశము వటునకు తండ్రి, అతడు లేని పక్షమున గురువు, పురోహితుడు వీరు లేనప్పుడు ఉపనయన సంస్కారమును జేయు నితరు లెవరైనగాని మంత్రోపదేశమును జేయవచ్చును. గాయత్రి మంత్రోపదేశము చేయువారు వటునకు గురువు లగుదురు. వేదమునం దేకదేశాధ్యాపకులు ఉపాధ్యాయు లగుదురు. సాంగ కృత్స్న వేదాధ్యాపకులు ఆచార్యు లగుదురు. ఆచార్య శబ్దమునకు "ఆచారానాచినోతి, అర్థానాచినోతి, బుద్ధింవాచినోతి" యను నిర్వచనము కలదు.

246. శ్లో॥ ఉపనీయతు యచ్ఛిష్యం వేద మధ్యాపయేద్ద్విజః ।
స కల్పం స రహస్యం చ త మాచార్యం ప్రచక్షతే॥

తా॥ ఏ బ్రాహ్మణుడు వటున కుపనయన మొనర్చి సాంగ వేదముల నుప నిషత్తులతో కూడ వానికి అధ్యాపకము జేయునో నత డాచార్యు డన బడును.

247. శ్లో॥ ఆచినోతిచ శాస్త్రార్థ మాచారే స్థాపయత్యపి ।
స్వయ మాచరతే యస్మా దాచార్యస్తేన కథ్యతే॥

తా॥ శాస్త్రార్థములను జెప్పి, ఆచారములం దితరులనునిచి, తాను స్వయ మాచరించువారిని ఆచార్యులందురు.

248. శ్లో॥ అల్పం వా బహూవా యస్య శ్రుతస్యోపకరోతి యః ।
తదపీహ గురుం విద్యాచ్ఛ్రుతోపక్రియ యాతయా॥

తా॥ కొంచమెగాని గొప్పగాగాని యెవరివలన వినుటచే తన కుపకరించి నదో వారిని గురువులని దెలిసికొననగును.

249. శ్లో॥ అన్నదాతా భయత్రాతా విద్యాదాతా తథైవ చ ।
జనక శ్చోపనేతా చ పంచైతే పితరస్స్మృతాః॥

తా॥ అన్నదానమును జేయువారు, భయసంరక్షకులు, విద్యజెప్పినవారు, కన్నతండ్రి, ఉపనయనము చేయువారు వీరలైదుగురు తండ్రులనబడుదురు.

## వర్ణాశ్రమ ధర్మములు

210. వర్ణాశ్రమ ధర్మములు సంస్కార రూపములవి 40 ది. ఆత్మగుణములు 8 ది. కలిసి మొత్తం సంస్కారములు 48 ది.

I గర్భాధానాద్యుపనయనాంత సంస్కారము లెనిమిదివి :—
(1) గర్భాదానము (2) పుంసవనము (3) సీమంతము (4) జాతకర్మ (5) నామకరణము (6) అన్నప్రాశనము (7) చౌలము (8) ఉపనయనము.

II వేదవ్రతములు నాలు గివి :— (1) ఉపాకర్మ (2) ప్రాజాపత్యము (3) సౌమ్యము (4) ఆగ్నేయము.

III స్నాతక వ్రత మొకటి, వివాహ మొకటి కలిపి రెండు వైవాహిక వ్రతములు.

IV పంచ మహాయజ్ఞము లివి :— (1) దేవయజ్ఞము (2) పితృయజ్ఞము (3) మనుష్యయజ్ఞము (4) భూతయజ్ఞము (5) బ్రహ్మయజ్ఞము.

V సప్తపాక యజ్ఞము లివి : (1) అష్టకాః (2) పార్వణి (3) శ్రావణి (4) మాసశ్రాద్ధము (5) ఆగ్రహాయణి (6) చైత్రి (7) ఆశ్వయుజి.

VI సప్తహావిర్యాగము లివి :— (1) అగ్న్యాధేయము (2) అగ్నిహోత్రము (3) దర్శపూర్ణమాసలు (4) ఆగ్రహాయణి (5) చాతుర్మాస్య యాగము (6) నిరూఢ పశుబంధయాగము (7) సౌత్రామణీష్టి.

VII సప్తసోమ సంస్థలు ఇవి:— (1) అగ్నిష్టోమము (2) అత్యగ్నిష్టోమము (3) ఉక్థ (4) షోడశి (5) వాజపేయము (6) అతిరాత్రియాగము (7) అప్తోరియాగము. మొత్తము నలుబది సంస్కారములు.

1. పాకయజ్ఞము లందల్యష్టకము లనగా ఆశ్వయుజ పున్నమ నాడాగ్రహాయణీష్టి జేసిన తరువాత ఆనాటినుండి ముందు వచ్చు ప్రతినెల కృష్ణ

పక్షములు మూటియందు క్రమముగ నొక్కొక్క పక్షమునం దొక్కొక్క అష్టకముల జేసిన నది అష్టకము లనబడును.

2. హవిర్యాగములందలి ఆగ్రిహాయణి యనగా అశ్వయుజ, కార్తీక మాసములందెందేని వచ్చు పౌర్ణిమనాడయిన, లేక నమావాస్యనాడయిన జేయదగిన ఇష్టి యనబడును. "శరదమావాస్యాయాం పౌర్ణమాస్యాంవా".

3. నిరూఢ పశుబంధమనగా వర్ష ఋతువునందు జేయదగిన పశుయాగము. దీనినే శ్రావణ పశుయాగ మనియు నందురు.

4. సౌత్రామణి యనగా, సురాపానకామన గలవారు జేయు ఇష్టి వివరము పూర్వమీమాంసాకాండయందు గలదు.

VIII ఆత్మాష్టగుణము లివి :— (1) దయ (సర్వభూతమైత్రి) (2) క్షాంతి (ఓర్పు) (3) అనసూయ (అసూయలేకునికి) (4) శౌచము (పారిశుద్ధ్యత) (5) అనాయాసము (శాంతి) (6) మంగళకర్మలు (వివాహాదులు) (7) అకార్పణ్యము (లోభములేకునికి) (8) అస్పృహ(పరద్రవ్యాపేక్షలేకునికి) మొత్తమెనిమిది పై సంస్కారములతో గలసిన 48 అగును.

ఆత్మాష్ట గుణములను తెలుపు శ్లోకము లివి :—

250. శ్లో॥ ఆత్మవ త్సర్వభూతేషు య శివాయ హితా య చ ।
వర్తతే సతతం హృష్టః కృత్స్నా హ్యేషా దయా స్మృతా॥

251. శ్లో॥ ఆకృష్టోభిహతోవాపి నాక్రోశేన్నాపి తాడయేత్ ।
అదుష్టో వాఙ్మనః కాయైః సాతితిక్షా క్షమా స్మృతా॥

252. శ్లో॥ యో ధర్మమర్థంకామం వా లభతే మోక్షమేవ వా ।
న ద్విష్యాత్తం సదా ప్రాజ్ఞః అనసూయేతి సా స్మృతా॥

253. శ్లో॥ దృవ్యశౌచం మనశ్శౌచం వాక్చౌచం కాయికం తథా ।
శౌచం చతుర్విధప్రోక్తం ఋషిభి స్తత్త్వదర్శిభిః॥

254. శ్లో॥ యదారంభో భవేత్పీడా నిత్య మత్యంత మాత్మనః ।
తద్వర్జయే ద్ధర్మ్యమపి అనాయాసస్స ఉచ్యతే॥

255. శ్లో॥ ప్రశస్తా చరణం నిత్య మప్రశ స్త వివర్జనం ।
ఏతద్ధి మంగళం ప్రోక్తం మునిభి స్తత్త్వ దర్శిభిః॥

256. శ్లో॥ ఆపద్యపిచ కష్టేషు భవేద్దీనో నకస్యచిత్ ।
సంవిభాగ రుచిశ్చస్యా దకార్పణ్యం తదుచ్యతే॥

257. శ్లో॥ వివర్జయే దసంతోషం విషయేషు సదానరః ।
పరద్రవ్యాభిలాషం చ సాఽస్పృహా కథ్యతే బుధైః॥

తాత్పర్యం సులభము.

ఆత్మాష్ట గుణములకు ప్రత్యేక ఫలములను జెప్పు శ్లోకము లివి :—

258. శ్లో॥ క్షమావాన్జయతే భూమిం దయావాన్సుఖమశ్నుతే ।
అనసూయుర్లభేత్స్వర్గం శౌచేనాధ్యాత్మ మేవచ॥

తా॥ క్షమాగుణము గలవారికి భూమి ప్రాప్తించును. దయాగుణమున్న సుఖించును. అసూయ లేనివారలకు స్వర్గ ప్రాప్తియగును. శౌచగుణము గల్గిన ఆత్మజ్ఞానోదయము గల్గుట కవకాశ మేర్పడును.

259. శ్లో॥ మంగళాదపి సంపూజ్య ఇహలోకే పరత్రచ ।
సురసామ్యమనాయాసా దకార్పణ్యా చ్ఛ తల్లయః॥

తా॥ మంగళ కర్మ లాచరించువా రిహపర లోకములందు పూజ్యు లగుదురు. అనాయాస గుణముచే దేవత లనబడుదురు. కృపణత్వము లేకున్న ప్రకృతియందు లయమగుదురు.

260. శ్లో॥ అస్పృహో లభతే నిత్య మనంతం సుఖమేవ చ।
సర్వైస్తు బ్రహ్మణ సానం సంస్కారైసు తదైవచ॥

తా॥ అస్పృహాగుణముండిన నెప్పుడు సుఖింతురు. ఇ ట్లొక్కొక్క గుణము గలవా రొక్కొక్క ఫలమును పొందుదురు. అన్ని గుణము లున్న వారికిగాని, పై జెప్పిన నలుబది సంస్కారములు గలవారికిగాని బ్రహ్మ సాయుజ్య ఫలము గలుగును.

ఆత్మగుణములు లేనిచో తక్కిన సంస్కారము లన్ని యుండినను, వారలకు బ్రహ్మ సాయుజ్యము గలుగజాలదు. ఆత్మగుణములు గల్గి యొకలే యుపనయన సంస్కారమాత్రి మున్నచో బ్రహ్మ ప్రాప్తి గలుగును. కావున ఆత్మగుణములే ప్రాముఖ్యములయినవి.

211. ఆశ్రమ ధర్మములు—త్రైవర్ణ్య వటువులకు క్రమముగ మేఖలలు (మొలదారము) 1. మౌంజీ 2. జ్యామౌర్వీ 3. శణసూత్రములు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యుల కగును. మౌంజీ మూడు వరుసలు గలది. జ్యామౌర్వీ (ధనుష్యమునకుగల నల్లెత్రాడు) ఒక వరుసది. శణ సూత్రము (జనుముతో జేసిన త్రా డొక వరుసది) యుండవలె.

261. శ్లో॥ మౌంజీత్రివృతత్సమాస్లష్ణా కార్యావిప్రస్య మేఖలా ।
క్షత్రియస్యతు మౌర్వీజ్యా వైశ్యస్య శణతాంతవీ॥

తా॥ దర్భ మొదలగు మృదువైన గడ్డితో పేనిన మూడు వరుసల మౌంజీ, మౌర్వీ నరముతో జేయబడిన దొకవరుసగల అల్లెత్రాడు మౌర్వీజ్యా యనబడును, జనుప త్రాడొక వరుసది వైశ్యునకు ఇట్లు ముప్వారుకు మొలత్రాడులు చెప్పబడినవి.

262. శ్లో॥ మౌంజాభావేతుకర్తవ్యం కుశాశమంతక బిల్వజైః ।
త్రివృతాగ్రంధి నైకేన త్రిభిః పంచభిరేవ వా॥

తా॥ ముంజాగడ్డి దొరకని పక్షమునందు దర్భలతోనయిన, శ్యమంతక, బిల్వనారలదయినగాని త్రాడు పేనుటకు, మూడు లేక నైదు నారపోచలు గలిపి పేనిన త్రాడును మొలకు మూడు వరుసల జుట్టి యొక ముడివేయవలయును.

2. వటువులకు నుత్తరీయములు, అజిన, కృష్ణరురు, బస్తిచర్మములవి క్రమముగ త్రైవర్ణ్యులకగును. క్రిందికి ధరించుటకు, ప్రత్తితో జేసినవిగాని, పట్టువేగాని, పర్వత ప్రాంతీయ పశురోమములతో జేసినవిగాని, అందరికుపయోగము లగును. దండములు పాలాశ బిల్వములలో నేదైన బ్రాహ్మణునికి; క్షత్రియునకు రావికట్ట, వైశ్యునకు పీలుకట్ట అవి దొరకనప్పు డేదైన యజ్ఞోపయుక్తమైన వృక్షముల కట్ట నుపయోగించవచ్చును.

263. శ్లో॥ ఋజువ స్తేతు సర్వేస్యు రవ్రణా స్సౌమ్యదర్శనాః ।
అనుద్వేగకరా నృణాం సతుషోగ్నిరదూషితః॥

తా॥ దండముల లక్షణములు. అవి చక్కనుండి వ్రణములు లేనివి, (కాట్లు దగలనివి) చూచుటకు సుందరమైనవి, మనుష్యులకు భయమును గలిగించనివి, పొట్టుతో గూడియుండునవి, అగ్నిస్పర్శ గానివి యుండ వలెను.

264. శ్లో॥ కేశాంతికో బ్రాహ్మణస్య దండః కార్యః ప్రమాణతః ।
లలాటసమ్మితో రాజ్ఞః స్యాత్తు నాసాంతికో విశః॥

తా॥ దండ ప్రమాణములు, ఎత్తునందు తలవెంట్రుక కొనదనుక బ్రాహ్మ ణునికి, నుదుట దనుక క్షత్రియునకు, వైశ్యునకు ముక్కువరకు వచ్చునట్టివి దండము లుండవలయును.

21.2 సాధారణ ధర్మములయిన శౌచాదులందరికిని సమానము. స్థలము నకు, వస్త్రములకు శౌచము యోగ్యతానుసారముగ వానివానికి జేయు విధులు శాస్త్రమునందు చెప్పినట్లనువర్తించును. మృజ్జలాదులతో శౌచ మాచరించనగును. అపవిత్రముల పరిత్యజించవలెను. ద్వాదశామేధ్యముల పవిత్రములు ఇవి :

265. శ్లో॥ వసాశుక్లమసృఙ్మజ్జా మూత్రవిడ్ఘ్రాణవిట్ ।
శ్లేష్మాశ్రు దూషికాస్వేదో ద్వాదశైతే నృణాంమలాః॥

తా॥ 1. క్రొవ్వు 2. రేతస్సు 3. నెత్తురు 4. మజ్జ 5. కడుపులోపేగులు 6. మూత్రము 7. మలము 8. చీమిడి 9. కఫము 10. కన్నీరు 11. కక్కు, చెమట 12. పై వానితోదూషింపబడినవి పండ్రెండు మనుష్య మలములు.

2. మృజ్జలాదులతో మల పరిశుద్ధి యగును. అశుచి ద్రవ్యస్పర్శచే నశుచి యగును. జలస్పర్శ జేయగ శుచి యగును. అశుచి స్పర్శచే దోషమగును కాని యశుచి స్పర్శ జేసినవారిని స్పృశించిన వారికి దోషము గలుగ జాలదు.

266. శ్లో॥ అశుచిం స్పృశతేయస్తు ఏక ఏవహి దుష్యతే ।
తం స్పృష్ట్వాన్యో నదుష్యేత సర్వదర్వ్యేష్వయం విధిః॥

267. శ్లో॥ ఉచ్ఛిష్టేనతు సంస్పృష్టో ద్రవ్యహస్తః కదాచన ।
అనిధాయైవ ద్రవ్యస్యాఽచామాచ్ఛుచితామియాత్॥

తా॥ హస్తమునందు ద్రవ్య మున్నప్పు డుచ్ఛిష్టమును స్పృశించరాదు. చేతనున్న ద్రవ్యమును క్రింద నునిచి స్పృశించవలె. అచమానముతోడ శుచి యగును.

3. ఇదే విధి పక్వ ఫలాదుల కనువర్తించును. ఇతరములకు మృజ్జలాదులచే మార్జన, తక్షణ, దహనాదుల విధి యగును.

268. శ్లో॥ మద్యమూత్ర పురీషైశ్చ శ్లేష్మపూయాశ్రుశోణితైః ।
సంస్పృష్టం నైవశుద్ధ్యేత పునః పాకేన మృణ్మయం॥

తా. మృణ్మయ భాండములు కల్లు, మూత్రపురీషము, కఫ్ఫు, చీమిడి మొదలగు వానితోనేగాని, దుర్గంధము, కన్నీరు మొదలగువానితోడగాని స్పృశించబడినవి పరిశుద్ధములు గానేరవు. అవి మరల అగ్నిపాకముననే శుద్ధి యగును.

269. శ్లో॥ నిర్లేపం కాంచనం భాండం అద్భిరేవ విశుధ్యతి ।
అబ్జమశ్మమయం చైవ రాజతంచానుపస్కృతం ।
శంఖశుక్తిమణీనాంచ గోమూత్రేణోదకేన తు॥

తా. బంగారు మొదలయిన ధాతుపాత్ర లశుచిచే లిప్తములుగానివి నీటితోడ పరిశుద్ధియగును. రత్నములు, రాళ్ళు, వెండి మొదలగునవి, శంఖము ముత్యపుచిప్ప, మణులకశుచి స్పర్శయైన గో మూత్రముచేగాని, నీళ్ళచేగాని శుద్ధి జేయనవి పవిత్రములగును.

270. శ్లో॥ ఖననాద్దహనాద్ధర్షణా ద్గోభిరాక్రమణాదపి ।
చతుర్భిశ్శుధ్యతే భూమిః పంచమ శ్చోపసేచనాత్॥

271. శ్లో॥ సమ్మార్జనేన సేకేన దాహేనోల్లేఖనేనచ ।
గవాంచ పరివాసేన భూమి శ్శుధ్యతి పంచభిః॥

తా॥ త్రివ్వగ, గాల్చగ, చెక్కగ, ఊడ్చగ, నీళ్లుజల్లగ, దున్నగ, గోవుల త్రిప్పగనైన గాని భూమి యైదు విధముల పరిశుద్ధియగును.

4. శరీర శుచికై స్నానాదులు రజ్వాది చేలాంతములు మృజ్జలాదులతో శుద్ధియగును. ఇతర శాస్త్రములందలి శౌచవిధి యోగ్యములైన విచ్చటను వర్తించును. స్నానానంతరము పవిత్ర స్థలమున కూర్చుండి రెండుసార్లాచమన జేయగ పరిశుద్ధుడగును. శౌచాచమ నానంతరము కర్మాంగాచమనము. రెండుసార్లు జేసిన కర్మాధికారి యగును.

5. ఆచమనము త్రివిధములైనవి. (1) పురాణోక్తము (2) స్మృత్యుక్తము (3) శృత్యుక్తము. వీని వివర మాచారకాండయందు గలదు. పై జెప్పిన సాధారణాశ్రమ ధర్మములన్ని యాశ్రమముల వారల కను వర్తించును.

6. ప్రతిదినము శౌచవిధి నాచరించియే గురువునకు వందన మాచరించ వలెను. ఆచార్యాదులకు వందనము జేయునప్పు డంగుష్ఠములు కలయని రెండు చేతులెత్తి నమస్కరించవలెను. ఆచార్యోప సంగ్రహణమందు కుడి యెడమ చేతులను వ్యతిరేకముగ బట్టి తన చూపుడు వ్రేళ్ళతో గురుపాదముల వ్యతిరేకముగ జుట్టవలెను. (తన కుడిచేత గురువుల కుడిపాదమును తన యెడమచేత గురువుల యెడమపాదము బట్టవలయును.)

272. శ్లో॥ వ్యత్యస్త పాణినా కార్య ముపసంగ్రహణం గురోః ।
సవ్యేన సవ్యః స్ప్రష్టవ్యో దక్షిణేనతు దక్షిణః॥

7. అధ్యయనమందే ఈ నియమము తప్పక జేయవలెను. ఉపసంగ్రహణమునం దంతరాయమైనప్పు డోంకా రోచ్చారణ జేయవలయును.

8. ఉపనయనమునకు పూర్వ మాచరించ దగిన కామచారాదులకు జెప్పిన ప్రాయశ్చిత్తాదులు రెండవ అధ్యాయమందలివి ఇచ్చ టనువర్తించును. బ్రహ్మచర్య నియమములు, రక్షణవిధులు యథా సంభవముగ బ్రహ్మచారులు నడచుకొనవలెను.

213. స్నానవిధిః=స్నానవిధి రెండు విధములు. (1) కాయికము (2) మానసికము. కాయిక మైదు విధములు. స్నానవిధి సర్వాశ్రమ సాధారణము.

273. శ్లో॥ స్నానం పంచ పుణ్యానికీర్తి తాని మహర్షిభిః ।
ఆగ్నేయం వారుణం బ్రాహ్మ్యం వాయవ్యం దివ్యమేవచ॥

274. శ్లో॥ ఆగ్నేయం భస్మనా స్నాన మవగాహంతు వారుణీ ।
ఆపోహిష్ఠేతి చ బ్రాహ్మ్యం వాయవ్యం గోరజః స్మృతం॥

275. శ్లో॥ యత్తుస్యాత్స్వ తపం వర్షం, దివ్యం స్నానం తదుచ్యతే ।
ఆశక్తో వారుణే స్నానే ఆగ్నేయాదప్య మాచరేత్॥

తా॥ 1. ఆగ్నేయము 2. బ్రాహ్మ్యము 3. వాయవ్యము 4. వారుణము 5. దివ్యము లను స్నానము లైదు విధములు. భస్మలేపన జేసికొనుట ఆగ్నేయము. ఆపోహిష్ఠాదిమంత్రములతో నీళ్ళు జల్లుకొనుట బ్రాహ్మ్యము. గో ధూళి సోకిన వాయవ్యము. జలస్నానము వారుణి. ఎండలోగాని వర్షమందుగాని నిలుచుండిన దివ్యము. జలస్నానమం దశక్తులకు ఆగ్నేయాదులు, శక్తునికే జలస్నానము.

276. శ్లో॥ నస్నాన మాచరే ద్భుంక్త్వా నాతురోన మహానిశి ।
నావాసోద్బి స్సహాజస్రం నా విజ్ఞాతే జలాశయే॥

తా॥ 1. భోజనోత్తరము స్నానము జేయరాదు. ఆతురుడైనప్పుడు, మధ్య రాత్రియందు స్నానము నిషిద్ధము. నీళ్ళయం దెల్లప్పు డుండటగాని, తెలియక లోతునీళ్ళలో జొచ్చుటగాని పనికిరాదు.

2. స్నానమందు మౌనముగా నుండవలెను. ఇది విధి. మౌనముగ స్నానము జేయకున్న హానియగు. హోమము జేయునప్పుడు మౌనముగ జేయకున్న సంపదకు హానిగల్గును. భుజించునప్పుడు మౌనము లేకున్న మృత్యువగును. స్నానాచరణ విశేషములు, మానసిక స్నానవిధి యాచారకాండ యందు విస్తరించిగలవు. స్నానానంతరము రెండు ధౌతవస్త్రముల ధరించి పురాణోక్త స్మృత్యుక్తాచమనలు రెండుజేసిన కర్మాచరణ కధి

కారి యగును. పిదప శుచి ప్రదేశమం దాసన పరికల్పన జేసికొని సంధ్యా వందనము గూర్చుండి జేయవలయును.

**214.** సంధ్యావందన విధిః—స్నాన సంధ్య లన్నియాశ్రమములవారికి సాధారణ విధియగుటచే నందరి కన్వయించును. బ్రహ్మచారి గృహస్థుల సంధ్యావందన విధి యిట్లు.

277. శ్లో॥ పూర్వాం సంధ్యాం జప న్తిష్ఠే న్నైశమేనో వ్యపోహతి ।
పశ్చిమాం తు సమాసీనో మలం హంతి దివాకృతం॥

తా॥ ప్రాతఃకాల సంధ్యయందు నిలుచుకొని గాయత్రి జపించవలెను. ఇట్లు జేయగా రాత్రికృత పాపములునశించును. సాయంకాల సంధ్యయందు గూర్చుండి జపము జేసిన దినమందలి పాపములు బోవును. మధ్యాహ్నకాలమం దైచ్ఛిక వికల్పమని యర్థము.

సూత్రము ౧౦—"తిష్ఠేతూర్వ మాసీనో త్తరాం స జ్యోతిషా జ్యోతిషో దర్శనాద్వాగ్యతః" తా॥ ఉదయ సంధ్యయందు పూర్వదిశగలేచి నిలబడి మౌనముగ చుక్కలు గనుపించునప్పటినుండి అవి గనుపించనంతవరకు గాయత్రిమంత్రి జపము జేయవలెను. "బహిస్సంధ్యత్వంచ" అను సూత్ర మన్యమతమైనది కాని గౌతమాభిప్రాయము గాదు. కాన గృహమునకు బహిర్దేశమునందే సంధ్యయగు నియమము లేదు.

278. శ్లో॥ పూర్వాం సంధ్యాం జపం తిష్ఠే త్సావిత్రి మార్కదర్శనాత్ ।
పశ్చిమాంతు సమాసీతసమ్య గృక్ష విభావనాత్॥

తా॥ పైజెప్పిన సూత్ర తాత్పర్య మనువదించబడినది. విశేష మిచ్చట ఉదయసంధ్యయందు నక్షత్ర దర్శనమునుంచి సూర్యోదయమువరకు, సాయంసంధ్య యర్ధాస్తమయమునుంచి నక్షత్రి దర్శనమువరకు జెప్పబడినది.

279. శ్లో॥ ఋషయోదీర్ఘ సంధ్యత్వాద భవన్దీర్ఘ జీవినః ।
ప్రజ్ఞాం యశశ్చ కీర్తించ లేభిరే బ్రహ్మవర్చసం॥

తా॥ ఋషులు దీర్ఘకాలమువరకు సంధ్యయందు జపముల జేసిరి. వారిట్లు జేసియే దీర్ఘాయుష్యము, ప్రజ్ఞాకీర్తి, బ్రహ్మవర్చస్సుల పొందిరి.

కారిక (1) సాయముదక సమీపం గత్వా పూతోభూత్వా, పవిత్రేణోద కేనా పోహిష్ఠాదిభిః, తిస్రుభిరబ్లింగాభిః, వామదైవ్యేనచ కుశాగ్రేణ మార్జయిత్వా. తతః శుచౌదేశే దర్భేష్వాసీనో దర్భాన్ధారయమాణః, ప్రత్యఙ్ముఖో, ప్రాఙ్ముఖోవా, వాగ్యతః, ఆత్మానంధ్యాత్వా, తతఃసరేచక పూరకాదీ స్త్రీ ప్రాణాయామాన్ధారయిత్వా, ఋషిచ్ఛందో దేవతా ధ్యాన పూర్వకం, భూర్భువస్సువ రిత్యాదికాం సావిత్రీం సహస్రకృత్వా వర్తయేచ్ఛత కృత్వోవా, దశవా రమథో త్తిష్ఠన్నగ్నియమ, బ్రహ్మభ్యః ప్రత్యగ్దక్షిణో దీచ్యాసు నమస్కుర్యా దేవమేవ ప్రాతర్న మస్కుర్యాత్.

తా॥ సాయంకాలమందు పవిత్రుడై యుదక సమీపమునజేరి, "ఆపోహిష్ఠా" అను మూడు జలమంత్రములతోడ, "వామదేవాయ నమః" మొదలగు మంత్రములతోడ దర్భాగ్రములచే, తనపై నీళ్ళు ప్రోక్షించుకొని, తరువాత శుచి ప్రదేశమందు దర్భాద్యాసనముల వేసికొని అందు దర్భపవిత్రయుతుడై దర్భలు నాల్గు ధరించి, పశ్చిమోత్తర ముఖముగ, తూర్పు ఉత్తర ముఖముగనేగాని గూర్చుండి, మౌనముచే పరమాత్మను స్మరించిన తరువాత రేచక, పూరక, కుంభకములతో డగు మూడు ప్రాణాయామముల జేయుచు క్రమముగ ఋషిచ్ఛందో దేవతలను తన శిరోముఖ హృదయములందు జేర్చి ధ్యాన పూర్వకముగ వ్యాహృతులతో సహ గాయత్రి మంత్రజపమును వేయిసార్లుగాని, నూరుసార్లుగాని, పదిసార్లైన గాని ఆవర్తన జేయవలయును. అనంతరము లేచి యగ్నికి బ్రహ్మకు క్రమముగ పశ్చిమదక్షిణోత్తర పూర్వదిశలకు నమస్కరించవలయును. ఇట్లే ఉదయమునను చేయవలయును.

215. ఉదితానుదుత పక్షద్వయ శ్రుతి చెప్పిన హోమమునకు దీర్ఘకాల జపాదులతో విరోధము లేదు. ఆ శ్రుతి వాక్యము లివి :-

శ్రుతి ౩౧ "ప్రాతః ప్రాత రనృతం దేవదం తి పురోదయాజ్జుహ్వాతి యేగ్ని హోత్రం । దివాకీర్త్యామ దివాకీర్తయంతః సూర్యోజ్యోతిర్న తథా జ్యోతిరేషాం"

తా॥ సూర్యోదయమునకు పూర్వ మెవ్వ రగ్నిహోత్ర హోమములను జేతురో వారు ప్రతిదిన మనృతమాడుచున్నారు. ప్రసిద్ధమగు దినమునే రాత్రియని కీర్తించువారలకు జ్యోతి స్వరూపు డగు సూర్యుడు జ్యోతి అట్లు గాడేమో ? (కాకపోవును) ఇట ఉదయాత్పూర్వము జేయబడు హోమనింద జెప్పబడినది.

శ్రుతి ౩-౨— "యథాఽతిధయే ప్రదుత్రాయాన్నం హారే యస్తా దృగుదుదితే జుహ్వాతి"

తా॥ పరుగిడుచుండు నతిథికి యన్న మిడుట యసంభవ మగునట్లు ఉదయానంతరమందు-జేయువారి హోమము లనబడును. ఇట్లు ఉదయానంతర హోమనింద—

ఉభయపక్షనిం దగుచో—హోమము అగ్నిహోత్రమునందు జేయుటే అసంభవమగును. హోమవిధికి విరోధము గలుగకుండుటకై వ్యవస్థిత వికల్పమున జేర్చిరి. ఇట్లు వ్యవస్థితి యేర్పరచినందున శాఖాభేదమున హోమములు జేయవచ్చును. కావున గాయత్రి జపము సంఖ్యానియమముచే జేయవచ్చును.

216. రెండవ అధ్యాయమందు బ్రహ్మచర్య నియమములు, వాని రక్షణ, ఇంద్రియ నిగ్రహాదులు, అవకీర్ణి యగునప్పుడు వారికి తగు ప్రాయశ్చిత్తాదులు జెప్పబడినవి. సంభవించునవి ఇత రాశ్రమములవారు జేయవచ్చును. గురూప సంగ్రహణము జేసి, పూర్వోత్తరాభిముఖుడై ప్రాణాయామ, ప్రణవోచ్చారణ జేసి, బ్రహ్మచారి వేదాధ్యయనమును జేయవలెనని విధించనయినది. ఇదే నియమ మధ్యయన పరిసమాప్తివరకు యనబడినది.

280. శ్లో॥ ఓంకార పూర్వికా స్తిస్రో మహావ్యాహృతయో వ్యయః ।
త్రిపదాచైవ గాయత్రీ విజ్ఞేయో బ్రహ్మణోముఖం॥

తా॥ ఓంకారమే పూర్వమునందుగల వ్యాహృతులతో సహితమయిన మూడు పాదముల గాయత్రి వేదముఖము. ప్రతిదినముం దధ్యయనము

జేయుచు విద్యా సమాప్తియైన తరువాత స్వాధ్యాయమును విడువక ప్రతి దినమందభ్యాసము జేయవలెను.

281. శ్లో॥ పశు మండూక మార్జారశ్వ సర్పనకులేషు చ ।
అంతరాగమనే విద్యా దనధ్యాయ మహర్నిశం॥

తా॥ జంతువులు, కప్ప, పిల్లి, కుక్క, సర్పము, ముంగిస మొదలగువానిలో నేదయిన అధ్యయనము జేయునప్పుడు మధ్యనుండి వెడలిపోయెనేని అనాడనధ్యాయ మగును. (అధ్యయన మానాడు జేయరాదు) "ప్రాణాయామ ఘృతః ప్రాశనం చేత రేషాం" పై వానికంటెను ఇతరములయిన విఘ్నము లందు ప్రాణాయామము జేసిన నెయ్యి ద్రాగిన దోష ప్రాయశ్చిత్త మగును.

217. గురువు లందరిలో ఆచార్యులు శ్రేష్ఠుడు. మాతా పిత్రాదులు గురువులు, మాతా పితృలు గోరి యుభయులు సంగమించిన సంతానముగ పుత్రు డుత్పత్తి యగును.

282. శ్లో॥ కామా న్మాతా పితా చైనం యదుత్పాదయతో మిథః ।
సంభూతిం తస్యతాం విద్యాద్య ద్యోనావభి జాయతే॥

అనెడి ప్రమాణ మున్నది. కావున మాతా పితృలు గురువులు.

283 శ్లో॥ ఆచార్య స్త్వస్య యాం జాతిం విధి వద్వేద పారంగః ।
ఉత్పాదయతి సావిత్ర్యాసా సత్యాసాఽజ రామరః॥

తా॥ వేదవేదాంగపారంగతుడయిన నాచార్యు లుపదేశముగ గాయత్రీ మంత్రముచే నిచ్చు జన్మ సత్యమైనది. అది జరా మరణములు లేనిది.

284. శ్లో॥ ఉపాధ్యాయ దశాచార్యః ఆచార్యాణాం శతంపితా ।
సహస్రంతు పితుర్మాతా గౌరవేణాతి రిచ్యతే॥

తా॥ గౌరవార్థమున పదిమందియుపాధ్యాయులకంటె నొక ఆచార్యుడు శ్రేష్ఠుడని, నూరుమంది యాచార్యులకంటె నొక తండ్రి శ్రేష్ఠుడని యన దగుదురు. తండ్రికంటెను వేయిరెట్లు తల్లి గౌరవనీయురాలు.

సూత్రము ౧౧ "మాతే త్యేకే మాతే త్యేకే" యను సూత్రమును గౌతములు మాత్ర గౌరవము ఏకదేశీయ మత మనెను.

218. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణముల నాదికాలమున ఈశ్వర సృష్టములు. అదేవిధమైనవి నాల్గాశ్రమములు. (1) బ్రహ్మచర్య (2) గార్హస్థ్య (3) వానప్రస్థ (4) సన్యాసము లనాది సిద్ధములు. ప్రతి యాశ్రమమందు నాల్గేసి భేదములు గలవు.

1. బ్రహ్మచర్యాశ్రమ భేదములు :- (1) ఉపకుర్వాణ (2) నైష్ఠిక (3) ప్రాజాపత్య (4) బృహద్బ్రహ్మచర్యము (ఆమరణాంతము).

2. గార్హస్థ్యభేదములు :- (1) వార్తావృత్తిః (2) శాలీనవృత్తిః (3) యాయవారవృత్తిః (4) ఘోర సన్యాసవృత్తిః.

3. వానప్రస్థభేదములు :- (1) వైఖానస, (2) ఔదుంబర (3) వాలఖిల్య (4) ఫేనప.

4. సన్యాస భేదములు :- (1) కుటీచక (2) బహూదక (3) హంస (4) పరమహంస.

219. నాల్గాశ్రమము లైచ్ఛిక వికల్పముచే నేర్పడినవా, బాధ పక్షమందు జేరినవా, లేక సముచ్చయపక్షములా యను విచారము గలుగును. సముచ్చయపక్షమందు జేరినవని గౌతమసిద్ధాంతము. కాని బ్రహ్మచర్యమొకటే యాశ్రమము విధి విహితమైనదనియు నితరాశ్రమములు బాధ పక్షమునం జేరినవని యనావశ్యకములయినవని ఏకదేశీయ మతము. కాని యేకదేశీయమతము శ్రుతి స్మృతులకు వ్యతిరేకము. మన్వాది శిష్టుల కసమ్మతమైనందున నిది గర్హ్యము. వికల్పపక్షము "తుల్య బలత్వా ద్వికల్పః" యను ప్రమాణముగ ఆపస్తంబ ఋషి అభ్యుదయ నిశ్శ్రేయసపాధన కారణమైనందున వికల్ప పక్షము సమీచీన మనిరి. బ్రహ్మచర్య సమావర్తన జేసినపిదప తన కిష్టమగు నాశ్రమమునందు జేరవచ్చును. "యమిచ్ఛేత్తా మావ సేత్" అను వాక్య ప్రమాణముగ వికల్పపక్షమే మంచిదని శంకర

భగవత్పాదుల మతము. ఇందు "యదహరేవ విరజేత్తదైవ ప్రవ్రజేద్బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్తను" శ్రుతి ప్రమాణము జెప్పబడినది. గౌతమ మతమున "ప్రాగుత్తమాత్త్రయాశ్రమిణః" అను సూత్రముచే ఋణత్రయ సంబంధము ప్రబల మనెను. "బ్రహ్మచర్యేణ ఋషిభ్యః। యజ్ఞేన దేవేభ్యో ప్రజయా పితృభ్యః" అను శ్రుతి ప్రమాణ మగును. కాన ఆశ్రమా దాశ్రమం గచ్ఛేదత్తనునది న్యాయము.

285. శ్లో॥ యజ్ఞేన దేవానా ప్నోతి వైరాజం తపసా పునః ।
సన్యాసా ద్బ్రహ్మణ స్థానం వైరాగ్యా త్ప్రకృతోలయః॥

తా॥ యజ్ఞములచే దేవత్వము, తపస్సుచే వైరాజపదము, సన్యాసముచే బ్రహ్మప్రాప్తి, వైరాగ్యముచే ప్రకృతియందు లయము గలుగును.

1. ప్రకృతి శాస్త్రానుగుణ్యమైనది గౌతమ మతము. ఇందు "చతుర్థ మాయుషోభాగం। యది గృహ మేవకామ్యేత। తదా యావజ్జీవ మగ్నిహోత్రం జుహ్యాత్" అనుచు మనుస్మృతి ప్రమాణము. కావున గృహ కామనగలవారికి "సముచ్చయ పక్షమైన గౌతమమతము శ్రేయస్కరము. వికల్ప పక్షమాచార్యులు సమర్థులగువారికి జెప్పనయినది. అది సుదృఢ వైరాగ్యముగల ఆత్మజ్ఞానులకే జెల్లును. గృహస్థునకే యోని సంయోగము (ప్రజన నాధికారము) గలదు కాని ఇత రాశ్రమిణులు ఊర్ధ్వరేతస్కులగుచు బ్రహ్మచర్య మకలంకముగ గాపాడుకొనవలయును. వారికి విషయకామన యున్నచో పతితులగుదురు. కావున జితేంద్రియులై యుండవలయును. ఇట్లు సముచ్చయపక్ష మందరికిని శ్రేయోదాయకము.

286. శ్లో॥ శ్రుత్వా స్పృష్ట్వా చ దృష్ట్వా చ భుంక్త్వాఘ్రాత్వా చ యోనరః ।
నహృష్యతి గ్లాయతివాస విజ్ఞేయో జితేంద్రియః॥

తా॥ మనుష్యుడు విషయాదుల వినగ, నంటుకొనగ, జూడగ, అనుభవించగ, వాసన జూడగ నెప్పుడయినను హర్ష విషాదముల నొందడో నతడే జితేంద్రియు డనబడును.

2. రెండవ, మూడవ అధ్యాయములందు బ్రహ్మచర్య ధర్మముల జెప్పి బ్రహ్మచర్యాశ్రమానంతరము గృహస్థ ధర్మముల నుపక్రమించక భిక్షు,

వానప్రస్థాశ్రిమముల ధర్మములు జెప్పబడినవి. "అభిసమావృత్త్య కుటుంబే" అను ఛాందోగ్యశ్రుతి అ. 3 పా. 4 మ. 48 ప్రమాణముచే గృహస్థాశ్రమమం దుపసంహారము జేయుటతో గౌతముడు గృహస్థ ధర్మముల తుదిని జెప్పెనని యర్థము.

సూత్రం ౧౨—"కృత్స్న భావాత్తు గృహిణోప సంహారః" అని శారీరిక మీమాంసయందు వ్యాసుడు సహితము గృహస్థాశ్రిమోప సంహారము జేయుట న్యాయమనెను. సర్వాశ్రమములకు ఆశ్రయమైనది గార్హస్థ్యము. ఈ యాశ్రిమ మాశ్రియించి యితరు లుపజీవన జేతురు. సమస్త ప్రాణుల కాశ్రయమైనదే గృహస్థాశ్రమము. కాన గౌతముడు విశేషము జెప్ప దలంచి, భిక్షు, వానప్రస్థాశ్రి మానంతరమే గార్హస్థ్యమును విచారించుట కుపపత్తి గలదు.

II. సన్యాసాశ్రిమము — వివిదుషాసన్యాసము, విద్వత్సన్యాసమని సన్యాసము రెండు విధములు. "సన్యస్తః శ్రవణం కుర్యాత్" అను న్యాయముచే వైరాగ్యాతిశయమున సన్యాస గ్రహణ జేసియే శ్రివణాదుల జేయుటకు వివిదుషాసన్యాసము, "సన్యాసం జ్ఞాన లిఙ్గం" అను ప్రమాణముచే ఆత్మజ్ఞానము గలవా రిహాపరలోక విషయ భోగములం దాత్యంతిక హేయ బుద్ధిచే బ్రహ్మచర్యమునుండియే గాని, ఏ యాశ్రమమునుండి గాని, సర్వకర్మ పరిత్యాగ లక్షణమైన సన్యాసము స్వీకరింతురు. ఇది విద్వత్సన్యాసము. "నాయమాత్మా బలహీనే నలభ్యో, నచ ప్రమాదాత్త పసో, వాప్య లిఙ్గాత్" అను కాఠక శ్రుతి ప్రమాణముగ సన్యాసము జ్ఞాన లిఙ్గ మనబడినది. "బ్రహ్మ సంస్థోఽమృతత్వమేతి" అను ఛాందోగ్య శ్రుతి విద్వత్సన్యాసమును బ్రహ్మసంస్థ యని బొగిడినది. సన్యాసమునందు కుటీచక, బహూదక, హంస, పరమహంసభేదములు. 1. కుటీచకము వార్థిక్యముచేనైనను, శరీరాస్వాస్థ్యముచేనైనను నొకచోటున (మఠమందు) ఆశ్రియించి యుండునది. 2. బహూదకము అనగా తీర్థయాత్రలందు గ్రామైకదినముగ, నగరమం దైదుదినములవరకు నివసించుచు పుణ్యతీర్థ స్నాన పానాదుల జేయునది. 3. హంస—జ్ఞాన వైరాగ్యాదులతో

యుక్తము. 4. పరమహంస=జ్ఞాన వైరాగ్య పరిపాక దశయందు జేకొనునది. ఇట్లు విషయాదులందు ప్రవర్తించినను నిర్లేపుడు పరమహంస.

220. వానప్రస్థాశ్రమము=వానప్రస్థాశ్రమ భేదములలో వైఖానసు లరణ్యమందే యుండుచు, మేధ్యములైన ఫలమూలాశనులై తపస్సు జేయవలయును. వైఖానస శాస్త్రానుసారముగ వారి కగ్నిహోత్ర ముండుటచే ఫలమూలములతోడనే పంచమహాయజ్ఞముల వారు నిర్వర్తించవలయును. గ్రామ్యముల భుజించరాదు. గ్రామములం దుండరాదు.

287. శ్లో॥ ఆరణ్యైర్వివిధై ర్మేధ్యైశ్శాక మూల ఫలేన వా ।
ఏతా నేవ మహాయజ్ఞా న్నిర్వపే ద్విధిపూర్వకం॥

2. వానప్రస్థులకంద రతిథు లనబడుదురు. కావున తన యాశ్రమమునకు వచ్చిన వారలకు వన్యములతోడనే ఆతిథ్య మీయవలయును. ప్రాతిలోమ్య జాతులు మాత్ర మతిథులు గాజాలరు. ఆపత్కాలమందే వ్యాఘ్రాది హింసిత మేధ్య మాంసభక్షణ జేయవచ్చును కాని యది నిందితము. అరణ్యమందలి కృషి భూములను వా రాక్రమించుకొనరాదు. జటాధారు లగుదురు శ్మశ్రుకేశ నికృంతనము గావించుకొనరాదు. త్రిషవణ స్నానము జేయుచు చీరవస్త్ర ధారణలు గావలయును. గత సంవత్సర సంచయము జేసికొనరాదు. ''త్యజే దాశ్వయుజే మాసి'' అను ప్రమాణముగ ఆశ్వీజమాసముననే క్రొత్త వన్యముల దినవలయును. సత్యాశమదమ బ్రహ్మచర్యాదుల విడువరాదు. ఔదుంబరులకు వైఖానసుల నియమము లన్నియును వర్తించును. కాని భోజనమం దొక మేడి ఫలములే తినవలయును. ఇతర వన్యములు వారికి నిషిద్ధములు. వాలఖిల్యులకు ఉదయ సూర్యకిరణ భక్షణ మాత్రమే విధి. తక్కిన నియమములు వీరికి వైఖానసులకు జెప్పిన వను వర్తించును. ఫేనపులకు వత్స చోషణానంతరము వెడలు నురుగు (గోక్షీరము) ఫేనమునే ఆహారముగ గ్రహించవలెను. కాని వీరు వన్యముల దినరాదు.

221. స్నాతక వ్రతము=గృహస్థాశ్రమము స్వీకరించగోరు ఉపకుర్వాణ బ్రహ్మచారులు విద్యా నిష్క్రియార్థము గురుదక్షిణ నిచ్చిగాని లేక గురు

వనుమతించిన నివ్వకరయే వారిని సంతోషపెట్టి స్నాతక మను వ్రతమాచరించవలయును. స్నాతక సంస్కారము స్మార్తయాజ్ఞికల్ప సూత్ర ప్రకారము జరుగవలయును, ఇట్లు వివాహార్థము కన్యా ప్రతీక్షుఁడు స్నాతక మనబడును.

## 4. గార్హస్థ్య ధర్మములు

సూత్రము ౧౩. 4. వివాహము=“గృహస్థస్సదృశీం భార్యాం విందేతానన్య పూర్వాం యవీయసీం” అను సూత్రమునుండి గృహస్థాశ్రమ ధర్మములు. అందు గృహస్థునకు అగ్నిహోత్రాది కర్మల కధికారము విధించుటకు వివాహము సంస్కార మగునని జెప్పబడినది. “ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః” అను శ్రుతి ప్రమాణము. 1. సదృశీం=దారాపరిగ్రహణమందు సదృశీం పదమును సూత్రమున జెప్పుటచే దీనికి సమానజాతి (వర్ణము) అర్థము. జాతియనగ ననాదినుండి వచ్చు బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యముల కర్థము. కాని కామశాస్త్రమందలి స్త్రీ పురుషులందలి జాతుల కిచ్చ టన్వయముగాదు. కావున వివాహము సమాన జాతియందే జేయవలెనని విధించుటకై సదృశీం పదముతో దెలుపనైనది. వ్యత్యస్తమందు సంకర జాతు లుత్పత్తి యగుదురు. దానిచే సర్వనాశము గలుగును.

288. శ్లో॥ విద్యాప్రణష్టా పునరభ్యుపైతి జాతిః ప్రణాశేత్విహ సర్వనాశః ।
కులాపదేశేన యథాభి పూజ్యాతస్మా త్కులీనాం స్త్రియముద్వహేత॥

తా॥ విద్య నష్టమైన మరల నేర్వవచ్చును గాని జాతి నశించిన సర్వనాశ మగును. కులీనుడగుటచే పూజ్యుడగును. కావున సమాన జాతియందు వివాహము జేసికొనవలయును.

222. భార్య యనగా “భరించదగినది” తన కనురూపవతి కర్థము. ఇట్లు సమాన వర్ణమందు రూపలావణ్యవతియైన కన్య, తన మనస్సున కింపగు దానిని వివాహము జేసికొనుమని జెప్పబడినది. కావుననే కామశాస్త్రమును

గుణ్యముగ లింగ వ్యత్యాసము గలుగకుండుటకును, యోని కూటాదుల జ్యోతిశ్శాస్త్రానుసారముగ కనుగొని రతి సుఖము గలుగుటకే కామశాస్త్ర మందు జెప్పిన పద్మిన్యాది జాతులలో తనకు తగు జాతి స్త్రీని పాణిగ్రహ ణము జేసికొనిన ధర్మశాస్త్రమునకు, కామశాస్త్రమునకు విరోధము గలుగనేరదు.

289. శ్లో॥ విద్యా శౌర్య వివేక ధైర్యసహితే శుద్ధే స్వధర్మస్థితే ।
విఖ్యాతే ధనధాన్య వైభవయుతే॥ జాతా సమానే కులే
కన్యాదోష వివర్జితా గుణవతీ సభ్రాతృకా సుందరీ ।
సద్భిః శాస్త్రవిధానతః స్మరకలా యోగ్యా వివాహ్యాసదా॥

తా॥ విద్య, శౌర్యము, జ్ఞానము, ధైర్యము, పారిశుద్ధ్యము, స్వధర్మనిర తత్వము, ఖ్యాతి, ధనధాన్య సమృద్ధిగల పురుషుడు, తనసమానవర్ణమందు బుట్టిన దోషవర్జితురాలగు గుణవతి, సౌందర్యముగలది, తోబుట్టువు లుండు కన్యను మన్మథ కళయందు (రతియందు) యోగ్యమగు దానిని వివాహము జేసికొనవలయును.

౩. అనన్యపూర్వాం== ఈ విశేషణము కన్యకుండవలయును. ప్రస్తుత వివాహోత్పూర్వము – కన్య యవివాహిత యని యర్థము. కన్యాదానము మనోవాక్కాయములతో జేయవచ్చును. కావున పై విధములందే విధము చేతను, వివాహోత్పూర్వము మెవ్వరికినిగాని కన్యాదానము జేసియుండరాదు. ఉ॥ సావిత్ర్యుపాఖ్యానమందు మనోదత్తమునే ముఖ్య మనబడినది.

పద్యం 15="వినుము మనోవాక్కాయము
లను మూడు తెరంగులందు, నంతః కరణం
బనఘా ప్రధానము గావున
మనసున గైకొన్న భర్త మానం దగునే.
(ఆంధ్రమహాభారతము)

మనోదత్తము ముఖ్యమే గాని మనోవాగ్దత్తానంతరము వరుడు మృతుడైన కన్యకు మరొక వివాహము కావచ్చును. శాస్త్రీయ విధానముగ కాయిక దత్తమైన (కన్యాదాన విధానము జరిగిన) యెడల వరుడు మృతుడైనచో మరల పునర్వివాహము కన్య జేసికొన రాదని ధర్మశాస్త్ర నిషేధము.

290. శ్లో॥ నష్టే, మృతే, ప్రవ్రజతే, క్లీబే, చ పతితేపతౌ ।
పంచత్స్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే॥

తా॥ జాడ దెలియక పతి నష్టమైనను, మృతిజెందినను, సన్యసించినను, నపుంసకుడైనను, పతితుడైనను కన్య మరల వివాహము జేసికొనవచ్చును. ఇచ్చట పతౌ శబ్దమునకు పతివత్పతౌ యని అర్థము. కాన మనోవాగ్దత్త వివాహములందే శ్లోకార్థ మన్వయించును. ఇందుదాహరణకు మహాభారత కర్ణ పర్వమందలి యులూప్యుపాఖ్యానము గలదు. ఉలూపిని అర్జునుడు వివాహము జేసికొనక పూర్వము తండ్రి యొకానొక నాగునికి వాగ్దత్తమాత్రము జేసెను. కాని గరుడునిచే వరుడు జంపబడినందున నులూపి వితంతువైనది. అది తీర్థయాత్రల జరుపుచుండు నర్జును మోహించి తన మాయచే స్నాన మాడు నర్జునుని నాగలోకమునందు జేర్చి యచ్చట తండ్రి యాజ్ఞతో వివాహమాడినది. ఉలూపి పుత్రుడు యుద్ధమందు పాండవ పక్షమున వచ్చినందున కర్ణునిచే జచ్చెను. అందు పైశ్లోకము గలదు. పతౌ పదమునకు పతివత్పతౌయని అచ్చట సమాసార్థము జేయనైనది. కాన నులూపి కాయికదత్తముగ నాగుని వివాహము కానందున వితంతువు కాదనబడినది. పునర్వివాహము పై కారణముచే నిర్దోషము. కాయికదత్తమందు వివాహము మరల జేయరాదని నిషేధము గలదు.

223. "యవీయసీం"— ఈ విశేషణముచే కన్య పురుషునికంటె చిన్న వయస్కగా నుండవలయును. వివాహార్థము కన్యా వయోనిర్ణయమందు అభిప్రాయ భేదములు గలవు. పూర్వకాలమునందు యెనమిది సంవత్సరముల వయస్సుగల స్త్రీని కన్య యనిరి. తొమ్మిదేండ్ల వయస్క రోహిణి పదేండ్ల వయస్కను గౌరియందురు. ఈ వయస్సు మించిన రజస్వలయనిరి. రజస్వలగాక పూర్వము వివాహము జేసిన కన్యాదాన ఫలము దాతకు జెప్పబడినది.

291. శ్లో॥ అష్టవర్షా భవే త్కన్యా నవ వర్షాతు రోహిణీ ।
దశవర్షా భవే ద్గౌరీ అత ఊర్ధ్వం రజస్వలా ॥

2. స్త్రీకి పదహారు సంవత్సరముల వయస్సుదనక బాలాయందురని కామ శాస్త్రమందు గలదు. కావున బాలా వివాహ యోగ్య యనిరి. కాని

రజస్వలానంతర వివాహమునందు దాతకు కన్యాదాన ఫలము లేదనబడినది. రజస్వలానంతరము మూడు ఋతువులు గడచినగాని వివాహము పిత్రాదులు జేయకున్నయెడల కన్య తా గోరినవరుని వివాహ మాడవచ్చును. అప్పుడు కన్య పిత్రాదు లిచ్చిన యాభరణములను వారికి మరల్చి తాను వివాహము చేసికొనవలయును.

224. కొంతకాలము పై విధముగ కన్యా వివాహములే భారతదేశమున జరుగుచుండెడివి కాని ఇంతకు పూర్వము బాల్య వివాహ నిషేధ ప్రచారములుజరిగినవి. భారతదేశమునకుస్వాతంత్ర్యము వచ్చినపిదప చట్టముద్వారా బాల్య వివాహ నిషేధ మేర్పడినది. ఇప్పుడు చట్టప్రకారముగ స్త్రీకి పదహారేండ్లు దాటిన తరువాత, పురుషునికి పదునెనమిదేండ్లు దాటిన తరువాతనే వివాహములు గావచ్చును. కాని నిర్ణీత వయస్సులోపల వివాహము జరిగినయెడల శిక్షాపాత్రు లగుదురు. సూత్రమునందలి "విందేత" యను క్రియాపదమునకు పై జెప్పిన లక్షణములు గల సమాన జాతి స్త్రీ పురుషులందు వివాహము జరుగవలెనని యర్థము.

సూత్రము ౧౪ "అసమాన ప్రవరై ర్వివాహః" అనగా వధూవరుల గోత్రి మొకటి గాకూడదు. (వధూ తండ్రి గోత్రము వరుని గోత్ర మొకటి గాకూడదు) ప్రవర యనగా నేక ఋషి సంతతి. ఇందు త్రియార్షేయమని, పంచార్షేయమని, సప్తార్షేయమని మూడు భేదములు గలవు. దీనినే గోత్రి మందురుకాన సమాన గోత్రమందు వివాహము నిషేధము. ఇదే విధమున వధూవరులు సపిండులు గాకూడదు. యనగా వరునిపక్షమం దేడుతరములు, వధూపక్షమం దైదుతరములం దేక ప్రవరజనితు లుండరాదని నిషేధార్థము. వివాహమున స్త్రీ పురుషునికి సపిండురా లగుటతో స్త్రీ పురుషుల తలిదండ్రు లుభయపక్షములవారు సంపిండులందు జేరరాదని తాత్పర్యము.

కాని యిప్పటి వివాహ చట్టమం దీ నియమ మేర్పరుచబడలేదు. కన్య రహస్యజనితురాలయిన వివాహమున కయోగ్య యగును. అనగా యెవరి బీజ జనితురాలో తెలిసియుండవలెనని యర్థము.

225. వివాహముల స్మార్తయాజ్ఞికకల్పసూత్రము ననుసరించి విధిగా చేయవలయును. వివాహములం దెనిమిది భేదములివి :- (1) బ్రాహ్మ (2) ప్రాజాపత్యము (3) ఆర్షము (4) దైవము (5) గాంధర్వము (6) ఆసురము (7) రాక్షసము (8) పైశాచికము.

సూత్రము ౧౫ "బ్రాహ్మో శ్రుత విద్యా చారిత్ర బంధుశీల సంపన్నాయ దద్యా దాచ్ఛాదనా ద్యలంకృతాం" ఇదే ముఖ్య వివాహము బ్రాహ్మ వివాహము. యీ వివాహమందు వేద విద్యావిదుడయిన ఆచారశీలుడైన, తో బుట్టు బంధువర్గముగలవాడయిన, ధర్మశీలుఁడైన, సద్గుణ సంపన్నుడయిన బ్రాహ్మణ వరున కాభరణ సహితమైన కన్యను రెండువస్త్రములచే నాచ్ఛాదించి కన్యాదానము జేయవలెను. ఇందుకు దాత స్వయముగ వరు నాహ్వానించి కన్యాదానము చేయనగు. బ్రాహ్మ వివాహమందు వధూవరు లగ్ని ప్రదక్షిణము జేయుట సప్తపది యనబడును. దానితో వివాహసిద్ధి యగును.

2. ప్రాజాపత్య వివాహము :- "సధర్మ శ్చరతాం" అను నీ మంత్రముచ్చారణ జేసి యివ్వబడిన కన్యాదానము ప్రాజాపత్యము.

3. ఆర్ష వివాహము=కన్యాదానమునకు పూర్వముననే వరునివద్దనుండి రెం డావులను తీసికొని దాత జేయు వివాహ మార్ష వివాహము. ఈ వివాహవిధి బ్రాహ్మ వివాహమందు జెప్పినట్లు జేయవలయును.

4. దైవ వివాహము=యజ్ఞసమాప్తియైన తరువాత అంతర్వేదియందు ఋత్విజుడగు వరునికి కన్యాదానము జేసినచో దైవము.

5. గాంధర్వ వివాహము=పిత్రాదు లిచ్చిన యాభరణముల వారల కిచ్చి కన్య తాను వరించిన వరున కాత్మదానము జేసిన నీ వివాహము గాంధర్వము.

6. ఆసుర వివాహము=కన్యాదాత వరుని నుండి తనకు గావలసిన ధనము బుచ్చుకొని పిదప వానికి కన్యాదానము జేయునిది ఆసుర వివాహము.

7. రాక్షస వివాహము=తన పౌరుషముచే స్వయంవరమందేగాని యితర సమయములందేగాని బలాత్కారముగ నెత్తుకొనిపోయి కన్యను వరుడు వివాహ మాడిన నిది రాక్షస వివాహమందురు.

8. పైశాచికవివాహము=కన్యకు దెలియకుండగగాని, నిద్రించునప్పుడు గాని, మత్తప్రమత్తనేగాని వరుడు దానితో సంగమించినచో నది వానికి భార్య యగును. కాన నిది పైశాచిక మనబడును. పై వివాహములలో మొదటి నాలుగు నుత్తమములు, గాంధర్వ రాక్షసములు రెండు మధ్యమములు, తుది రాక్షస, పైశాచికములు రెండు నింద్యములు. ఇప్పటి కాలమందు బ్రాహ్మ్య, రాక్షసములు రెండు వివాహములు మాత్రము జరుగుచున్నవి. పైవిధముగ సమాన వర్ణములందు వివాహము జరుగక, వ్యత్యస్తముగ వివాహములు జరిగి వధూవరులు గూడగ సంకరజాతి లుత్పన్నము లగును. దీనితో ననులోమ విలోమజాతు లుత్పన్నములయినవి. వ్యత్యస్తమందాంతర ఏకాంతరాది భేదము లుండును. ఉ॥ బ్రాహ్మణుని కాంతరా క్షత్రియకన్య, బ్రాహ్మణునకే కాంతరా వైశ్యకన్య, ద్వ్యంతర శూద్ర యగును. క్షత్రియున కాంతరా వైశ్యకన్య, ఏకాంతరా శూద్రి వీనికి ద్వ్యంతరలేదు. వైశ్యునికాంతర శూద్రి వీనికేకాంతర యుండదు. శూద్రు లందరు సమానజాతీయు లగుటచే వాని కాంతరా యుండదు. కాన సమానవర్ణమందే వివాహములయినచో బుట్టిన సంతతి సమానవర్ణు లనబడుదురు. బ్రాహ్మణునకు క్షత్రియకన్యవలన బుట్టిన వారలకు దాయమందు విశేషము గలదుకాని వారు క్షత్రియు లగుదురు. క్షత్రియున కాంతర యగు వైశ్యా జనితులం బష్ఠు లనబడుదురు. వైశ్యున కాంతరయగు శూద్రయందు బుట్టినవార లుగ్రులు. శూద్రునకు శూద్రాజనితులు సవర్ణులైన సచ్ఛూద్రులగ దురు. బ్రాహ్మణున కేకాంత రాజనితులు పారశువు లగుదురు. క్షత్రియున కేకాంత రాజనితులు దౌష్యంతులనబడుదురు. బ్రాహ్మణున కుద్ద్వంతర జనితులను నిషాదులందురు. ఇవి రామే యనులోమ జాతులగును. 2. విలోమమందు స్త్రీ యున్నతవర్ణ పురుషుడు తక్కువ వర్ణుడైన నప్పుడు విలోమజాతు లుత్పన్నమగును. ఉ॥ బ్రాహ్మణికి క్షత్రియునిచే జనించినవారు సూతులు, క్షత్రియకు వైశ్యజనితులు మాగధులు,

శూద్రునకు వైశ్యాజనితు లయోగవు లనబడుదురు. బ్రాహ్మణి కేక
డైన వైశ్యునకు బుట్టిన వారు క్షత్తా యనబడుదురు. క్షత్రియకు ఏక
డైన శూద్రునికి బుట్టినవారు వైదేహికు లగుదురు. బ్రాహ్మణికి ద
తరుడైన శూద్రునకు బుట్టిన ప్రజ చండాలు రనబడుదురు. ఇవే :
జాతులు. గౌతమ మతానుసార మనులోమ విలోమజాతులు. ఈ
లోమ విలోమజాతులవారు తమతమ యనులోమ విలోమజాతులు :
వర్ణములందు వివాహము జేసికొనక మరల వ్యత్యస్తములు జేయ
లోమజాతు లుత్పత్తియగును. పూర్వకాలమున పదివిధములై నాను
విలోమజాతులు నాలుగు శుద్ధజాతులతో గలసి పదునాల్గే జాతులుం
ఇప్పు డవి వ్యత్యస్తము జేసినందున యనేక ప్రతిలోమజాతు ల
చున్నవి. పదునాలుగు జాతు లున్నట్లు "పదునాలుగు జాతు
కాంతల మీరు పద్మినీజాతి సౌభాగ్యవతుల" యను పద్యమందు శ్రీ
దేవరాయలు నుడివెను. (ఆముక్తమాల్యద)

292. శ్లో॥ శూద్రాయాం బ్రాహ్మణాజ్జాతః శ్రేయసాచే త్ప్రజాయతే ।
ఆశ్రేయా చ్ఛ్రేయసీ జాతాం ప్రాప్నోత్యా సప్తమాద్యుగాత్॥

తా॥ బ్రాహ్మణునకు శూద్ర స్త్రీయందు బుట్టిన ప్రజ శ్రేష్ఠు
యెడల శ్రేష్ఠులనబడిన బ్రాహ్మణాది స్త్రీలందు శ్రేష్ఠులుగాని శూ
పురుషులకు బుట్టిన ప్రజ సప్తమ మన్వంతరాదులందు శ్రేష్ఠులనబడు

293. శ్లో॥ శూద్రో బ్రాహ్మణతా మేతి బ్రాహ్మ శ్చైతి శూద్రతాం ।
క్షత్రియాజ్జాత మేవం చ విద్యా ద్వైశ్యా త్తథైవచ॥

తా॥ సప్తమమన్వంతరా ద్యుగములందు శూద్రులే బ్రాహ్మణులనబడ
బ్రాహ్మణులే శూద్రులనబడుదురు. ఇదే విధముగ క్షత్రియ వైశ
వ్యత్యాస పరివర్తన జరుగును.

228. పై జెప్పిన సంస్కారములు సవర్ణులందే గలవు. కాని యన
విలోమజాతులం దొక వివాహ మాత్ర సంస్కారము జరుగును.
లోమ్యులందు సంస్కారములు జెప్పబడలేదు. వారు తమతమ య

ములనే ధర్మముగ గ్రహించి వివాహ మాత్ర సంస్కారమును జేసికొన వలయును.

293. గర్భాదానము—వివాహ సంస్కారానంతరమందు స్త్రీ రజస్వలానంతర పదహారు దినములలోగాని, లేక జ్యోతిశ్శాస్త్రానుసారముగ శుభ తిథి ముహూర్తాదులందే గాని స్మార్త యాజ్ఞిక కల్ప సూత్రానుగుణ్యమున గర్భాదాన సంస్కారము జరుగవలయును. ఈ సంస్కారము పుట్టబోవు సంతానార్థము జేయదగినది. స్త్రీ దుష్ట నక్షత్రాదులందు రజస్వల యగుచో శాంతి సంస్కారముల జేసికొనియే గర్భాదాన సంస్కారమును జేసికొనదగును.

సూత్రము ౧౬—''ఋతౌ భార్యా ముపేయాత్'' ఈ సూత్రముచే ఋతు దినములందే స్త్రీ సంభోగము (భార్యా సంయోగము) జేయవలయును.

294. శ్లో॥ ఋతుః స్వాభావికః స్త్రీణాం రాత్రయః షోడశ స్మృతాః ।
చతుర్భి రితరై స్సార్థం న అహోభిః సద్వి గర్హితైః॥

తా॥ స్త్రీలు రజస్వలలగుట (రక్తస్రావమగుట) స్వాభావికము. అనగా స్త్రీలు ప్రతినెలకు ఋతుమతులగుదురు. ఇది వారికి ప్రకృతి స్వభావము. మొదటి నాలుగు రక్తస్రావ దినముల గలుపుకొని పదహారు దినములు ఋతుదినము లనబడును. కాని మొదటి నాలుగు రక్తస్రావదినములను విడిచి తక్కిన పండ్రెండు దినములందు (రాత్రులందే) భార్యాసంయోగము (రతి) యొనర్చవలయును. సత్పురుషుల నింద కలదు కావున మొదటి నాలుగుదినములందేగాని, పగళ్ళందేగాని (దినమానమందుగాని) స్త్రీ సంభోగము జేయరాదు. (నిషేధము)

శ్రుతి ౫-౨. ''ప్రాణం వా ఏతే ప్రస్కందంతి । యోదివా రత్యాత్సంయుజ్యంతే । బ్రహ్మచర్య మేవ యద్రాత్రౌ రత్యా త్సంయుజ్యంతే''

తా॥ దినమందు (పగలు) యెవరు రతి జేయుదురో వారు తమ ప్రాణములనే పోగొట్టుకొనువా రగుదురు. రాత్రియందు రతి జేయువారు బ్రహ్మచర్యమును జేసినవార లనబడుదురు.

230. కామకాండమందు జెప్పినట్లు స్త్రీలకు ఋతు దినములందు కామకళ స్వస్థానమునందుండదు కావున రక్తస్రావ దినముల విడచి తక్కిన దినములందు (ఋతుదినములందు) కామకళ స్వస్థానము జేరుటచే రతి యొనర్చదగును. ఈ విధముగ నడచినచో కామశాస్త్ర ధర్మశాస్త్రములకు విరోధము కలుగజాలదు.

295. శ్లో॥ ప్రథమేహని చాండాలీ ద్వితీయే బ్రహ్మ ఘాతినీ ।
తృతీయే రజకీ ప్రోక్తా చతుర్థేహని శుధ్యతి ॥

తా॥ స్త్రీ రక్తస్రావదినములలోని మొదటి దినము చాండాలీ యనబడును. రెండవదినమున బ్రహ్మహత్యా దోషురాలగును. మూడవదినమందు రజకీ (చాకలి) యనబడును. నాల్గవ దినమందు పరిశుద్ధురాలగును. నాల్గవ దినమందు రక్తస్రావములేనియెడల సాయంకాలమునందు మరల స్నానము జేసినచో రాత్రి రతికిమాత్రముపయోగించునుకాని, ఆమె నాల్గవనాడు ధర్మకార్యములందు పాల్గొనరాదు (నిషేధము). ఇట్టి విధిని పరిసంఖ్యా విధి యందురని పూర్వమీమాంసా కాండయందు పైన పేర్కొనబడినది.

231. ఋతుదినములందే భార్యా సంయోగము (రతి) జేయుమను విధి సత్సంతానార్ధమునకు చెప్పబడినదేగాని కేవల సంభోగమాత్రమునకే యని యర్థము జేయరాదు. కావున ఋతుదినములందు భార్యా సంయోగము త్యజించరాదు. ఇట్టి విధి యనుసరించనియెడల పురుషునకు భ్రూణహత్యా దోషము గలుగును.

296. శ్లో॥ ఋతు స్నాతాంతు యో భార్యాం సన్నిధౌనోప గచ్ఛతి ।
ఘోరాయాం భ్రూణ హత్యాయాం యుజ్యతేనాత్ర సంశయః ॥

తా॥ ఋతు స్నాతయైన భార్య సన్నిధానమందుండగ నెవడు భార్యా సంయోగము జేయడో వానికి ఘోరమగు భ్రూణహత్యా దోషము గలుగును.

232. సత్సంతానార్థమునకగు భార్యా సంయోగము కేవల మొకే పుత్ర సంతానార్థ మనుకొనరాదు. రతి యొకే పుత్రార్థమనుకొనిన పక్షమందు

దురదృష్టముచే నొక పుత్రుడే కలిగి వాడు మరణించినప్పుడు సంతాన విచ్ఛేదము కలుగును. అప్పుడు పితౄణమోకము జేయజాలడు. కావున ననేక సంతానార్థము భార్యా సంయోగమని తాత్పర్యము.

శ్రుతి ౫౩. "పుత్రైః పౌత్రైః ప్రతిష్ఠస్య బహ్వా పత్యస్య జీవితం"

శ్రుతి ౫౪. "దశాస్యాం పుత్రా నాధేహిపతి మేకాదశం కృధి" యను ప్రమాణములు గలవు. ఇదే విషయమందు చాందోగ్య శ్రుతి జెప్పిన కథ యుదాహరణ యగును. ఆ కథ ఇట్లు గలదు :— "నే నొక పుత్రార్థియే యగుచు నాదిత్యు డొకనిగా భావించి ఉపాసించినందున నీ వొకడవే పుత్రుడవు నాకు గలిగితివి. నీవు ఆదిత్యుని యనేక రశ్మిత్వ గుణములు గలవాడని యుపాసింపుము. దానితో నీ కనేకమంది పుత్రులు గలుగుదురని యుపదేశించెను". కావున రతి యనేక పుత్రార్థమని తాత్పర్యము. అనేక పుత్రపౌత్రుల గలుగుటచే స్త్రీలకు వంధ్యత్వ నివారణగును. ఇందు మూడు భేదములు.

1. కేవల వంధ్య యనగా గర్భధారణ సామర్థ్యము లేనిది.

2. మృతవంధ్య యనగా సంతానమగుచు వెనువెంటనే నష్టమగుచుండునది.

3. కాకవంధ్య యనగా ఇద్దరు పిల్లలు మాత్రమే గలది.

233. ఋతుదినములుగాని దినములందును, నిషిద్ధదివసములందును భార్యా సంయోగము జేయరాదు.

సూత్రము ౧౭—"సర్వత్ర ప్రతిషిద్ధ వర్జనంచ" ఈ సూత్రముచే ప్రతిషిద్ధ దినములందు రతి జేయరాదు.

297. శ్లో॥ అమావాస్యాఽష్టమీచ పౌర్ణమాసీ చతుర్దశీ ।
బ్రహ్మచారీ భవేన్నిత్యమ ఋతౌ స్నాతకో ద్విజః॥

తా॥ స్నాతక వ్రత మాచరించిన బ్రాహ్మణుడు అమావాస్య, అష్టమీ, పౌర్ణిమ, చతుర్దశీ దినములందును, ఋతుదినములుగాని దినములందును నిత్యముగ బ్రహ్మచర్యము జేయవలెను. రతి నిషేధమని తాత్పర్యము.

సూత్రము ౧౮=="ద్విరేకతో వా" యనగా రతి ఏకవారమనుకొనరాదు. (ఒకేసారి యనుట గాదు) సూత్రమైచ్ఛిక వికల్పమున జెప్పినందున తన క్లిష్ట ప్రకారముగ ననేక సార్లని యర్థము.

234. గృహస్థుడు ప్రతినిత్య మౌపాసనాగ్ని కార్యములను, పంచమహా యజ్ఞములను విడువక నాచరించుచుండవలయును.

సూత్రము ౧౯==''దేవ పితృ మనుష్య, ఋషి, భూతపంచకః'' యను సూత్రము విధిగా జెప్పబడినది. వివరము పైన జెప్పబడినది.

235. వేదవ్రతము లాచరించదగినవి. ఇందలి ఉపాకర్మ (శ్రావణి) బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థుల కందరి కనువర్తించును. సార్వజనికమైనందున నందరితో గలసి జేసికొనుట ఉత్తమము. యజుశ్శాఖీయులు శ్రావణశుద్ధ పౌర్ణమినాడు, ఆశ్వలాయన శాఖీయులు శ్రవణా నక్షత్రమందు (శ్రావణమాస మందేగాని భాద్రపదమాసమందేగాని) ఉపాకర్మ జేసికొనదగును. ఈ మాసములందు వచ్చు పౌర్ణమినాడు శ్రవణా నక్షత్ర యుతమైన ముఖ్యమనబడును.

236. పితృలను గురించి శ్రాద్ధాదు లాచరించుట గృహస్థునకు ధర్మము.

298. శ్లో॥ ఏకమప్యాశయే ద్విప్రం పిత్రర్థం పాంచయజ్ఞికే ।
న చైవాత్రాశయే త్కించి ద్వైశ్వ దేవం ప్రతిద్విజః॥

తా॥ పంచమహాయజ్ఞములందలి పితృ యజ్ఞార్థమునకై ప్రతినిత్య మొక బ్రాహ్మణునకైనగాని అన్నమిడవలయును. శక్తి లేకున్నచో వైశ్వదేవమును జేయు బ్రాహ్మణునికే కొంచమైన పదార్థమునైనగాని పితరుల నిమిత్త మియ్యదగును.

299. శ్లో॥ దద్యాదహ రహశ్శ్రాద్ధ మన్నాద్యోదకేన వా ।
పయోమూల ఫలైర్వాపి పితృభ్యః ప్రీతిమావహన్॥

తా॥ గృహస్థుడు ప్రతిదినమందు అన్నముచేగాని,యుదకముతోగాని, పాలు కందమూలములతోడ నైనగాని పితరుల ప్రీతికై నిత్య శ్రాద్ధముల జేయవలయును.

237. గృహస్థు డతిథిసత్కారముల జేయవలయును. అన్నాదులతోనతిథిని సత్కరించ శక్తిలేనప్పు డుదక, భూమి, అగ్ని, సత్యవాక్కులే బలుకుచు గాని సత్కరించవలయును. కాని విడువరాదు,

సూత్రము ౨౦="తృణ, భూమ్యగ్ని యుదక వాక్సూ నృతాస్యః" యనగా కూర్చుండుట కాసనము, ఉండుటకు స్థలము, అగ్ని, ఉదకము లిచ్చి యతిథిని సత్యవాక్యములతో నాదరించి సత్కరించవలయును.

300. శ్లో॥ తృణాని భూమి రుదకం సూనృతా వాక్తు రీయకా ।
సతాం గేహేషు సతతం నో ఛిద్యంతే కదాచన॥

తా॥ గృహస్థుడు తన యింటికి వచ్చిన నతిథికి గొడ్లమేతకై గడ్డి, ఉండుటకు స్థలము, పానీయాదులకు నీళ్లు, నాల్గవది సత్యవాక్యములతోడ నాదరించవలెను. ఇవి సత్పురుషుల యిండ్లలో తప్పక యుండును.

238. గృహస్థుడు దేవఋషి పితృతర్పణములు ప్రతిదినమందు విడువక జేయవలయును,

301. శ్లో॥ దేవతానాం ఋషీణాం చ తర్పయిత్వా సమాహితః ।
దద్యా త్పితౄణాం చ స్వధా పూర్వం తిలైః సహ ॥

తా॥ దేవతలగురించి, ఋషులనుగురించి తర్పణలు జేసినపిదప పితరులను గురించి తిలలతో గలసిన నుదక తర్పణల స్వధాకారముతో జేయనగును.

302. శ్లో॥ నోదకేషు న పాత్రేషు న కృద్ధో నైక పాణినా ।
నో పతిష్ఠతి తత్తోయం యద్భూమ్యాన్న ప్రదీయతే ॥

303. శ్లో॥ నోదకే నోదకందద్యా త్పితృభ్యస్తు కదాచన ।
ఉత్తీర్యతు శుచౌదేశే కుర్యా దుదక తర్పణం ॥

తా॥ ఈ రెండు శ్లోకములు కొందఱి మతమున జెప్పినవి. భూమియందు నీళ్ళతో నుదక తర్పణము జేయవలయునుగాని, తర్పణోదకమును నీళ్ళందుగాని, పాత్రయందుగాని జేసిన, క్రోధముగల్గినప్పుడుగాని, ఒకే హస్తముచే గాని జేయు తర్పణలు ప్రతిష్ఠింపబడజాలవు. ఉదకములందు నిలబడి పితృ

తర్పణల జేయరాదు. నీళ్ళనుండి లేచి శుచి ప్రదేశమునందే యుదకతర్పణ జేయవలయును. కాని సిద్ధాంత మత మిట్లు.

239. తర్పణలు ద్వివిధములు :- 1. స్నానాంగ తర్పణ 2. బ్రహ్మ యజ్ఞాంగ తర్పణ. స్నానాంగతర్పణలు నదీ స్నానమం దుదకములతో నుదకములందే జేయవలయును, 2. బ్రహ్మ యజ్ఞాంగతర్పణలకు నుదకములు (నద్యాదుకములు) సంభవించనప్పుడు పాత్రయందు జేయవలయును. ఇట్లు సిద్ధాంతములను దెలుపు క్రింది శ్లోకములు గలవు.

304. శ్లో॥ ఆపో దేవగణా స్సర్వే ఆపః పితృగణా స్స్మృతాః ।
తస్మా దప్సుజలం దేయం పితౄణాం దత్తమక్షయం ॥

305. శ్లో॥ దేవానాం చ పితౄణాం చ జలే దద్యా జ్జలాంజలిం ।
అసంస్కృత ప్రమీతానాం స్థలే దద్యా జ్జలాంజలిం ॥

తా॥ స్నానాంగ తర్పణలు దేవతలకేగాని పితృలకేగాని చకారమున ఋషులకుగాని నీళ్ళందు నీళ్ళతో నంజలిచే తర్పణ జేయనగును. సంస్కార రహితముగా జచ్చిన వారికి మాత్రము నీళ్ళనుండి లేచి శుచి ప్రదేశమున నీళ్ళతో తర్పణ జేయవలయును. దేవతలు పితృలు జలస్వరూపులుకాన వారికి నీళ్ళందే జలతర్పణల జేసిన అక్షయ ఫలము గలుగును.

2. ఒకే హస్తముచే తర్పణ జేయవలెనని కేచిన్మతము క్రింది శ్లోకముచే దెలియును.

306. శ్లో॥ ఉభాభ్యామపి హస్తాభ్యా ముదకం తర్పయతియః ।
సమూఢో నరకం యాతికాల సూత్రమవా క్శిరః॥

తా॥ రెండు హస్తములు గలసిన అంజలిచే నెవ డుదకతర్పణ చేయునో వాడు (మూఢుడు) కాలసూత్రమను నరకమందు తలక్రిందుగా బడును.

గౌతము డీ మతము నిరాకరించి సర్వసమ్మతమైన సిద్ధాంత మీ శ్లోకముల దెలిపెను.

307. శ్లో॥ నాభి మాత్రేజలే స్థిత్వా చిన్తయన్నూర్ధ్వ మానసః ।
ఆగచ్ఛంతు మేపి తరః ఇమం గృహ్ణాం త్వపోంజలిం॥

308. శ్లో॥ పితౄణాం స్థాన మాకాశం దక్షిణాదిక్త దైవచ ।
తస్మాత్తథా సదాదత్తం పితౄణాం స్యాత్త దక్షయం॥

తా॥ నాభిదఘ్న జలములందు నిలుచుండి పైకి జూచుచు మనమునందు తన పితృల దలచి నా దోసిలి యుదకమును గ్రహింతురుగాక యని అంజలితో నుదకము లియ్యవలయును. ఆకసమునందే పితృదేవత లుందురు. వారికి దక్షిణ దిక్కు (దిశ) స్థానముగాన నా దిశయం దర్పణ జేయు నుదక మక్షయ మగును.

3. బ్రహ్మ యజ్ఞాంగతర్పణమందు పితృలకు తిలలతో యుక్తముగ నుదకముతో జేయవలయును.

309. శ్లో॥ తిల దర్భ యుతైర్వారి శ్రద్ధయాయ త్ప్రదీయతే ।
తత్సర్వ మమృతం భూత్వా పిత్రూణా మక్షయం భవేత్ ॥

తా॥ తిల దర్భలు గలసిన నీళ్ళతో తర్పణ జేసిన నది యమృత మగుచు పితృల కక్షయమగును. కాని ఆదివారము శుక్రవారము తిల తర్పణ చేయరాదు.

310. శ్లో॥ దర్భహీనం క్రియాసంధ్యా తిల హీనం తు తర్పణం ।
అనాచ్ఛాదే తథా శ్రాద్ధం వృథా భోజనా దక్షిణః ॥

తా॥ దర్భల గ్రహించని సంధ్యావందనము, తిలలులేని పితృతర్పణాలు, ఆచ్ఛాదన (వస్త్రము) లేని శ్రాద్ధము, దక్షిణయివ్వని భోజనము లివి వ్యర్థములు.

240. గృహస్థుడు వివాహ చతుర్థ దినమునుండియే గార్హస్థ్య ధర్మము లాచరించవలయును. స్మార్తాగ్నిహోత్రము గాపాడుకొనుచు స్మార్తాగ్ని యందే ఔపాసనాది నిత్యకర్మల విడువక జేయవలయును. కారణాంతరముచే నొకవేళ నౌపాసనాగ్ని విచ్ఛిత్తియైనచో ప్రాయశ్చిత్త పూర్వకమున పునస్సంధానము జేసికొని సాయంప్రాత ర్నిత్యాగ్ని హోత్రముల నిర్వర్తించవలయును. ఔపాసనాగ్నియందే సంస్కార కర్మలు, పంచమహా యజ్ఞములు, వైశ్వదేవము, అగ్నౌకరణాదుల జేయవలయును. ఔపాస

నాగ్ని లేనప్పుడు అగ్నౌకరణము లౌకికాగ్నియందు జేసిన దోషము గలుగదు. దేవతామూర్తి పూజనల జేసి వైశ్వదేవానంతరము దేవతలకు మహానివేదన గావించవలయును. బలిహరణమైన పిదప యతి బ్రహ్మచారులకును, అతిథుల కభ్యాగతుల కన్నమిడి పోష్యవర్గమునకు తృప్తిపఱచి తాను భుజించవలయును. బలిహరణ భిక్షాదులు తనయాజ్ఞచే భార్యగాని నితరులుగాని జేయవచ్చును. అన్నార్థులుగాని యతిథులకు తన శక్తికొలది బ్రహ్మణాది వర్ణ విశేషమందు ద్రవ్యాదుల నివ్వవచ్చును.

311. శ్లో॥ గురు నివేశౌషధార్థం స్వాధ్యా యార్థం చ భారత ।
అధ్వన్యపి ప్రవృత్తస్య యాగార్థం చ తథైవచ॥

312. శ్లో॥ కృత వైశ్వ జితస్యాపి వృత్తి క్షీణస్య పార్థివ ।
దత్వా విద్యా విశేషేణ స్వర్గలోకే మహీయతే॥

తా॥ గురువులకు, ఔషధములకు, సంతతిగలవారికిని, యజ్ఞములు జేయుటకొఱకు, బాటసారికి, సర్వస్వ దక్షిణలిచ్చిన వారికిని, పితృ శ్రాద్ధ నిమిత్తమునకును, విద్యార్థులకు, విశ్వజి ద్యాగమును జేసినవారికి, వృత్తిలేని వారికిని, వారివారి యధికారమును గుర్తెఱింగి ధనదానముల జేసిన స్వర్గలోకమందు పూజ్యుడగునని ధర్మరాజుతో భీష్ముడు బలికినట్లు శాంతిపర్వమందు గలదు. బ్రాహ్మణేతరులకు భోజనమాత్ర సహాయము జేయవలయును. స్వాధ్యాయము జేయని బ్రాహ్మణునకైనగాని ద్రవ్యము యివ్వరాదు.

313. శ్లో॥ అవ్రతా హ్యనధీయానా యత్ర భైక్షచరా ద్విజాః ।
తం గ్రామం దండయే ద్రాజా చోర భక్త ప్రదోహినః॥

తా॥ ఆగ్నేయాది వ్రతహీనులు, అనధ్యయన పరులైన బ్రాహ్మణు లే గ్రామమందు భిక్షాటన జేయుచుందురో ఆ గ్రామవాసులు దొంగల కన్నమిడువా రనబడుదురు గాన రాజు వారిని శిక్షించవలయును. మఱియు నధర్మపరులకును, అనృతమాడువారికిని దానము లియ్యరాదు. వారికి భోజన మాత్ర మిచ్చిన యానృశంస్య మనబడును. పోష్యవర్గమందు జేరిన వారు 1. అతిథులు 2. కుమారకుమార్తెలు 3. వృద్ధులు 4. గురువులు

5. మాతాపితృలు 6. భార్య 7. పరిచారకులు 8. దీనాంధకృపణులు. అతిథులందు యతి, బ్రహ్మచారులు జేరుదురు. వీరు స్వామి భోజనమునకు పూర్వమే భుజించుట కర్హులగుదురు. యతి భిక్ష యిట్లు జేయవలయును.

314. శ్లో॥ యతిహస్తే జలందద్యా ద్భైక్షం దద్యా త్పునర్జలం ।
భైక్షం పర్వత మాత్రి స్యాత్తజ్జలం సాగరోపమం॥

తా॥ సన్యాసికి భిక్ష యిడుటకు పూర్వమే యతని హస్తమందు జలము నుంచి తరువాత భిక్ష యివ్వవలయును. అతడు భుజించిన పిదప మరల హస్తమందు జలము నివ్వవలయును. ఇట్లిచ్చిన భిక్షాన్నము పర్వతము సమానము, జలము సముద్రోపమ మగును.

241. పై జెప్పిన విధముగ నాచరించు గృహస్థుడు ధార్మికుడనబడును. ధార్మిక గృహస్థుడు భార్య గర్భవతియైనచో నప్పుడే పుంసవనమను సంస్కార కర్మ జేయవలయును. మూడు మాసములు గడచిన పిదప సీమంత సంస్కార కర్మ జేయనగును. ఇప్పటి కాలమునం దీ సంస్కార కర్మలు నామమాత్రావశిష్టములు. భార్య ప్రసూతియైనచో పుత్రి జన్మ శ్రవణమైనంత శిశుకర్ణమం "దంగాదంగాత్సం భవసి" యను మంత్రిము చెప్పవలయును. అప్పుడు జాతకర్మ సంస్కారమును జేయవలయును. ఇప్పుడిది పుత్రాయణ నామమున శర్కర బంచబడుచున్నది. శిశువున కారు మాసములైన యన్నప్రాశనమను సంస్కారము జేయనగును. మూడు సంవత్సరముల లోపల చౌలమను సంస్కార కర్మ జేయవలయును. ఇప్పటి కాలమం దిది పుట్టి వెంట్రుకలనబడుచున్నది. ఇట్టి సంస్కారముల నెథాసంభవముగ గృహస్థు డాచరించదగినవి. కాలానురూపముగ లుప్తమైనవి. గృహస్థుని విశేష ధర్మములం దాచార్య ఋత్విక్పితృవ్యాది శ్రేష్ఠుల తొలిసారి సమాగమమందు, సంవత్సరాంతమైన పునర్దర్శనమందు వారికి మధుపర్కముతో సత్కరించవలయును. తనయింట మంగళకార్యములు జరుగునప్పుడు పైవారికిని, రాజునకును, శ్రోత్రియ బ్రాహ్మణులకును యథాశక్తిగ మధుపర్కముతో సత్కరించవలయును. 2. సత్కారము జేయునప్పుడు బ్రాహ్మణునకు కుశలము, క్షత్రియున కనామయము, వైశ్యునకు క్షేమము, శూద్రున కారోగ్యము లనుచు ప్రశ్నించవలయును.

315. శ్లో॥ బ్రాహ్మణం కుశలం పృచ్ఛే త్క్షత్రబంధు మనామయం ।
వైశ్యం క్షేమ మనాయాసం శూద్ర మారోగ్య మేవచ॥

4. గృహస్థుడు యజ్ఞకర్మల జేయునప్పు డతని కందరు అతిథు లనబడు దురు. బ్రాహ్మణాతిథుల సత్కారానంతర మందరికిని అన్నమిచ్చి సత్క రించదగును. ఇది యానృశంసమనబడినది.

5. ఆచార్యాది గురువులందఱికిని తానే పూర్వమున నుపసంగ్రహణ అభి వాదనాదులతో సత్కరించుట గృహస్థుని ధర్మము. అభివాదనందు "భో గురో దేవదత్త నామకోహ మభివాదయే" యనవలయును. వారు ప్రత్యుత్తరమందు "ఆయుష్మాన్భవ సౌమ్య" యనవలయును. ఇది బ్రాహ్మణాభివాద ప్రత్యుత్తరములు.

316. శ్లో॥ ఆయుష్మాన్భవ సౌమ్యేతి వాచో విప్రోభివాదయే ।
ఆకారశ్చాస్య నామాంతే వాచ్యః పూర్వాక్షరం ప్లుతం॥

తా॥ సౌమ్యేయను పదమం దల్యాకారాక్షరమునకు పూర్వాక్షర మేకారము నకు మూడుమాత్రల కాలదీర్ఘ మనగా ప్లుతముగా నుచ్చరించదగును.

6. గుర్వాదులందు చేరిన స్త్రీలు మాత, పితృవ్యపత్ని, భగినీ, ఆచార్యపత్ని, రాజ్ఞి మున్నగు వృద్ధ స్త్రీలకు తానే ముందుగ నుపసంగ్రహణాద్యభి వాదముల జేయవలయును. ఇతరులగు (స్త్రీ పురుషులగు) వారికి యథా యోగ్యముగ నమస్కారాదులే గాని ఆలింగనాదుల గాని జేయుట గృహస్థుని ధర్మము.

7. ఇట్టి విద్యాశీలాచార సంపన్నుడైన ధార్మికుడగు శ్రోత్రియ బ్రాహ్మణ గృహస్థు డితరులకు గురువగును. కాని "పూర్వః పూర్వో గురుః" యను సూత్రమున గృహస్థులందు విద్యాశీలాచార విశేషములు యెవరికి హెచ్చు గలవో వారు తమతమ తారతమ్యముగ గురువులనబడుదురు.

8. ఆపత్కాలమందు వృత్తి లభించనప్పుడు ఇతర వర్ణముల వృత్తుల నెథా యోగ్యములైనవి గృహస్థు డాశ్రయించి జీవిక నడుపుకొనవచ్చును. జీవనోపాయమందు ప్రతిగ్రహాదులు దోషములు గాజాలవు.

317. శ్లో॥ నాధ్యాప నాద్యా జనాద్వా గర్హితాద్వా పరిగ్రహాత్ ।
దోషో భవతి విప్రాణాం జ్వలనాంబు సమాహితే॥

తా॥ విద్య చెప్పిన, యాగముల జేయించిన, నిందిత ప్రతిగ్రహాదుల జేకొనినగాని విప్రులకు దోషము లంటవు. వారుదుకు నీరువంటి వార లనబడుదురు.

9. జీవిక లేనప్పుడు అతిథి పోష్యవర్గ పాలనార్ధమునకై యే యోగ్య వృత్తిచేనైనగాని అన్న సంచయము జేసికొనవచ్చును. ఇట్లన్న సంచయము జేయనేరకున్న వానికి దోషము గలుగును.

318. శ్లో॥ దేవతా తిథి భృత్యానాం పితౄణా మాత్మనశ్చయః ।
న నిర్వపతి పంచానా ముచ్ఛ్వ సన్నస జీవతి॥

తా॥ దేవత నివేదనకు, భృత్యాది పోష్యవర్గమునకు, మాతా పితృలకు తనకు నిక్లైదుగురిº అన్నాదు లిచ్చి పోషించినవాడు శ్వాసోచ్ఛ్వాసలు జేయు చుండినగాని వాడు జీవించిన వా డనబడడు.

319. శ్లో॥ ధర్మార్థ కామ మోక్షాణి ప్రాణ సంస్థితి హేతవః ।
తాన్నిఘ్నతా కిన్న హతం రక్షితా కిన్న రక్షితం॥

తా॥ ప్రాణ కారణముననే ధర్మార్థకామ మోక్షములకు స్థితి కలుగును. కావున ప్రాణహింసే యగునప్పు డేది హింస గాకుండును? ప్రాణ రక్షణచే నేది రక్షింపబడదు? అనగా ప్రాణమందే సర్వము ప్రతిష్ఠించబడినది.

10. బ్రాహ్మణుడు తన జీవనార్థ మితర వర్ణముల వృత్తులందు క్రమముగ సన్నిహిత వర్ణ వృత్తిచే జీవించవచ్చును. కాని శూద్రవృత్తి శ్రేయోదా యకము గాజాలదు. ఆపద తొలంగిన వెంటనే నుత్తమ ధర్మమైన తన వర్ణాశ్రమ వృత్తి గైకొని జీవించవలయును.

320. శ్లో॥ ఆ పదం బ్రాహ్మణ స్తీ ర్త్వా క్షత్ర భృత్యా భృతే జనే ।
ఉత్సృజే త్తత్ర వృత్తిం తాం కృత్వా పావన మాత్మనః॥

తా॥ క్షత్రియాదుల వృత్తిచే జీవించు బ్రాహ్మణుడు తన యాపద తొలిగి నంతనే యావృత్తిని విడిచి తన ఆత్మను పావనము గావించుకొనవలయును.

11. క్షత్రియ వైశ్యాదులు సహిత మిదే న్యాయముగ వర్తించదగును. నిందిత హింసాది కర్మ లన్నివర్ణముల వారికి వర్జనీయములు. ప్రాణత్యాగావసర మేర్పడినప్పుడు మాత్రమే శూద్ర వృత్తిచేగాని శూద్రు నాశ్రయించిగాని ప్రతి గ్రహాదులచేగాని వృత్తిని కల్పించుకొనదగును. ఇదియు లభించనప్పుడు మద్య, మాంస, లశునాది వర్జితాన్నములను వర్ణహీనులనుండిగాని, వారి యుచ్ఛిష్టాన్నములనేగాని తీసికొని ప్రాణరక్షణ జేసికొనవచ్చును. ఇది యాపద్ధర్మ మనబడును.

12. స్వధర్మ నిరతుడగు గృహస్థ బ్రాహ్మణుడు పై జెప్పిన 48 సంస్కారము లన్నియేగాని, కొన్నిగాని యథాశక్తిగ జేసినవాడు నిత్య నైమిత్తిక కామ్యకర్మల జేసినవా డనబడును. గార్హస్థ్య ధర్మము లాచరించువాడు బ్రహ్మసాయుజ్య ఫలమును బెందునని తొమ్మిదధ్యాయములందు సూత్రరూపమున గౌతముడు స్త్రీ పురుషుల ధర్మములు నుడివిన సంగ్రహము.

242. బ్రాహ్మణ గృహస్థుడు త్రైవర్ణ్యులకు విద్యా దానము శేయవలయును.

సూత్రము ౨౧—"ద్విజాతీనాం విద్యా దానం" ద్విజాతులకు బ్రాహ్మణ గృహస్థుడు వేదవిద్యల జెప్పవలయును. యజన, యాజన, దాన, ప్రతిగ్రహ, అధ్యయనాధ్యాపకము లివి షట్కర్మలు. బ్రాహ్మణ గృహస్థున కీ యారిటియం దధికారము గలదు. స్వాధ్యాయ ప్రవచనములం దప్రమత్తుడు గావలయును. సాధారణ ధర్మములైన సత్యాహింసల గృహస్థుడు విడువరాదు. పితరులను గురించి గృహస్థుడు నిత్యాది శ్రాద్ధముల నాచరించవలయును.

321. శ్లో॥ నిత్యం నైమిత్తికం కామ్యం వృద్ధి శ్రాద్ధ మథాపరం।
పార్వణం చేతి విజ్ఞేయం శ్రాద్ధం పంచవిధం స్మృతం॥

తా॥ 1. నిత్యము 2. నైమిత్తికము 3. కామ్యము 4. వృద్ధి 5. పార్వణము లను నైదు విధముల శ్రాద్ధములు. వివరమిట్లు :-

1. నిత్యములు షణ్ణవత్యాదులు 2. దర్శాదులు నైమిత్తకములు 3. వృద్ధి శ్రాద్ధములు మంగళకర్మలం దాచరించదగిన నాందీ శ్రాద్ధములు 4. కామ్యములు తీర్థశ్రాద్ధాదులు 5. పార్వణములు మృత తిథియందు ప్రతి సంవత్సర మాచరించదగినవి. మృత తిథియందు తప్పనిసరిగా పితృ శ్రాద్ధ మాచరించవలయును. విడిచిన దోషమగును.

322. శ్లో॥ పత్నీ రజస్వలా చైవ కుర్యా చ్ఛ్రాద్ధం మృతే హని ।
క్షయాహంతు పరిత్యజ్య రౌరవం నరకం వ్రజేత్॥

తా॥ పితరులు జచ్చినదినము మృత తిథి. ఆనాడు భార్య రజస్వలయైనగాని తప్పనిసరిగా పితృశ్రాద్ధము జేయవలయును. విడిచిన రౌరవమను నరకమును గురించి బోవును.

243. శ్రాద్ధమంత్రి విధానముగ శ్రాద్ధము జేయనగును. తిలలు, దర్భ, యవలు (తండులములు) పాలు, మధు, ఘృతము, గంగ (నీళ్లు) శ్రాద్ధమున కుపయోగించు ద్రవ్యములు. మఱియు భోజన పదార్థము లెథాశక్తి యెథా సంభవములైనవి దేశకాలానుగుణ్యముగ నుపయోగమగును. పక్వాన్నములలో పాయసము పితరులకు ప్రీతికరము.

323. శ్లో॥ ద్వౌ గావౌ యత్ర దుహ్యేతా మాతా వత్సా చ కన్యకా ।
తయోర్ఘృతం మధు ప్రోక్తం న మధుర్మక్షికా మధు॥

తా॥ తల్లిబిడ్డలై రెండావుల పాలనొక చోటున జేర్చి దానిలో దీసిన నేతిని మధువందురు. కాని తేనె మధువనబడదు.

2. శ్రాద్ధ విధి ననుసరించి తొలినాడే భోక్తల నిమంత్రణ జేయవలయును. శ్రాద్ధ భోక్తల ముగ్గురిని, దొరుకని పక్షమం దొకనినైన నిమంత్రణచేసి శ్రాద్ధమాచరించదగును. దేశకాలానుగుణ్యముగ విద్యా వినయశీలురైన బ్రాహ్మణుల నిమంత్రిణ జేయదగును. దేవ, పితృ, విష్ణు లనుక్షణములు వారికి ప్రతినిధులు బ్రాహ్మణులు ముప్పురు.

3. మృత తిథినాడు కర్త స్నానసంధ్యాదులచే శుచియై శ్రాద్ధమాచరించ నగును. కర్మ పరిసమాప్తివరకు నిరాహారుడు గావలయును. అపరాహ్ణ

కాలమందు శ్రాద్ధకర్మ యాచరించవలయును సంకల్ప పూర్వకముగ బ్రాహ్మణ పాదప్రక్షాళనాదుల జేయవలయును. దేవ పితృ ఋణములు గైకొనిన బ్రాహ్మణ పాదప్రక్షాళనోదకములు గలియరాదు. ఇందులకు ఖాతముల (గుంటల) కల్పించుకొనదగును.

324. శ్లో॥ దేవపాదోదకం యత్ర స్పృశ్యతే పితృ మండలైః ।
శ్వాన మూత్ర సమం తోయం పునశ్శ్రాద్ధం పరేఽహని॥

తా॥ విశ్వేదేవ, పితృఋణ బ్రాహ్మణ పాదోదకము లొకచోటున గలిసిన నా యుదకము శ్వాన మూత్ర సమమగును. దోషముగాన నా దిన ముపవసించి మరునాడు మరల శ్రాద్ధ మాచరించవలయును. శ్రాద్ధభోజన పదార్థముల పాకము యోగ్యులు జేయదగును.

325. శ్లో॥ న కన్యా క్రియతే పాకం న పాకం చాన్య గోత్రయోః ।
విధవా చ తథా వంధ్యా గర్భస్థావతి దుర్గతిః॥

326. శ్లో॥ బాలరండం చ పక్వం చే ద్వ్యభిచారీ చ పక్వతః ।
భోజనం చాద్భవేదన్నం భుంక్త్వా చాంద్రాయణం చరేత్॥

తా॥ కన్య, అన్యగోత్రులు, విధవ, వంధ్యాస్త్రీ, గర్భిణి శ్రాద్ధపాకముల జేయరాదు. జేసిన పితరులకు దుర్గతి కల్గును. బాలవిధవ, పుంశ్చలి, వండిన (పాకము జేసిన) నాపదార్థ భోక్తలు ప్రాయశ్చిత్తమునకై చాంద్రాయణ వ్రత మాచరించవలయును.

5. విధి పూర్వకముగ శ్రాద్ధభోక్తల పాత్రలం దన్నాదు లుంచనలయును.

327. శ్లో॥ అన్నం చ పాయసం భక్ష్యం ఘృతం చ వ్యంజనాదికం ।
అంతే సూపం ప్రదాతవ్యం సర్వం స్యా ద్దేవపూర్వకం॥

328. శ్లో॥ మధ్యమన్నం ప్రతిష్ఠాప్య దక్షిణే ఘృత పాయసం ।
శాకాదీన్పూర్వతస్థాప్య భక్ష్యం భోజ్యం చ వామతః॥

తా॥ అన్నము, పాయసము, భక్ష్యములు, నెయ్యి, వ్యంజనాదులు (శాకములు) కడపట పప్పు ఇవి క్రమముగా దేవపాత్ర నారంభించి వడ్డించ నగును. పాత్రలందు మధ్యనన్నము, దీనికి దక్షిణముగ నెయ్యి, పాయ

సము, పూర్వమునకు శాకాది వ్యంజనములు పశ్చిమమునకు భక్ష్యాదులు, లేహ్యాదు లుత్తరమున కుంచవలయును.

6. బ్రాహ్మణ భోజనాత్పూర్వము అగ్నౌకరణమను హోమకర్మ జేయ వలయును. దీనికొఱకై బ్రాహ్మణ పాత్రలం దన్న విభాగము జేయక పూర్వమే కేవలాన్నము దీసికొని అగ్నౌకరణము ఔపాసనాగ్ని యందే గాని లేనప్పుడు లౌకికాగ్ని యందేగాని జేయవలయును. పితృదేవత లే లోకమందున్నది తెలియబడనందున అగ్నౌకరణాన్న విభాగమును జేసి వానిలోని నొకొక భాగము విధ్యుక్తముగ వినియోగపఱచవలయును.

329. శ్లో॥ అగ్నౌకరణం తు దేవస్థా స్వర్గస్థా బ్రాహ్మణ భోజనే ।
పితృస్థః పిండదానేషు యమస్థా వికిరేణతు ।
దక్షిణేన మనుష్యేషు ఆసురాం భూరి భోజనే॥

తా॥ అగ్నౌకరణార్థము దీసికొనిన అన్నము నాలుగు భాగములుగ విభజించి ఈశాన్యమునుండి క్రమముగ మొదటిభాగము అగ్నియం దగ్నౌకరణ హోమము జేయగ నది పితరులు దేవలోకమందుండిన వారికి జెందును. రెండవ భాగాన్నము పితృఋణము గైకొనిన బ్రాహ్మణ పాత్ర యందుంచగ నది పితరులు స్వర్గలోకమందున్న వారికి జెందును. మూడవ భాగము పిండ దానాన్నమందు గలిపిన నది పితరులు పితృలోకమందున్న వారికి జెందును. నాల్గవభాగము వికిరమను పిండదానము (దేవ పితృలమధ్య భూమిపై పెట్టిన పిండము) చే పితరులు యమలోకమందున్న వారికి జెందును. భోక్తలకు దక్షిణ లిచ్చినచో పితరులు మనుష్య లోకమందున్న వారికి జెందును. భూరిభోజనము (శ్రాద్ధ పాకేతర పాకము జేసి యొకరికైన భుజింపజేయుట) చే పితరు లసురలోకమందున్న వారికి జెందును. పితరు లే లోకమందుండునది తెలియబడుటలేదు గాన నన్నివిధము లాచరించవల యునని తాత్పర్యము.

7. "సోమః పితృమాన్య మోంగిరః అగ్నిష్వాత్తాగ్నిః కవ్యవాహానాద యః పితరః" అనగా 1. సోముడు 2. పితృమాన్నామ్నుడు 3. యముడు 4. అంగిరుడు 5. అగ్ని 6. ష్వాత్తాగ్ని 7. కవ్యవాహానుడు. వీ రేడ్గురు

పితృదేవతలు. మొదటి నల్గురు పితృలోకమం దెల్లప్పు డుందురు. తక్కిన, అగ్ని, స్వాత్తాగ్ని, కవ్యవాహనుడు ముగ్గురు శ్రాద్ధములం దాహ్వానింప బడుదురు. వీరిద్వారా కర్తపితృల కిచ్చినవి జెందును. వీరి వెంబడి మార్గ దర్శనార్ధ మిద్దరు విశ్వే దేవతలు వచ్చెదరు గాన వారి నాహ్వానించవల యును. శ్రాద్ధకర్మ సంరక్షణార్థము విష్ణు వాహ్వానింపబడును. కావున వీరి ప్రతినిధిగా ముగ్గురు బ్రాహ్మణులకు నిమంత్రణ చేయనగును. శ్రాద్ధకర్త స్మార్తయగుచో వైశ్వదేవ మానాడు శాఖా భేదముగ స్వశాఖోక్త విధమున జేయవలయును.

330. శ్లో॥ యజుషా స్సామగాః పూర్వే । మధ్యే జుహ్యా త్వథర్వణః ।
బహ్వృచా శ్శ్రాద్ధ శేషేణ వైశ్వదేవం చతుర్విధం॥

తా॥ యజుర్వేదులు, సామశాఖవారు శ్రాద్ధ కర్మారంభమునకు పూర్వము వైశ్వదేవ హోమము (వేరు పాకమందు) జేయవలయును. కర్మ మధ్యన అథర్వణ శాఖీయులు హోమము జేయనగును. ఋగ్వేద శాఖవారు శ్రాద్ధ కర్మాంతమైన పిదప వైశ్వదేవ మాచరించవలయును. ఇట్లు వైశ్వ దేవము శాఖాభేదముచే నాల్గు విధములైనది.

8. బ్రాహ్మణ భోజనానంతరము పితరుల నుద్దేశించి (కర్త తన పితృ పితామహ ప్రపితామహ నామోచ్చారణ జేసి) దక్షిణదిశ గాదర్భలు శుచి భూమిపై పరచి దర్భలపై మూడు పిండముల నెథావిధిగ నుంచవల యును. ఇది పిండ ప్రధానమనబడును.

9. వరాహదేవుడు కల్పాదియందు హిరణ్యాక్ష వధానంతరము భూమి నుద్ధరించునప్పుడు తన శరీరమునకు దగిలిన మట్టిచే మూడు పిండముల జేసి వానిని తన రోమములపై పితృ పితామహ ప్రపితామహులను తన నాత్మ నామగ్రహణచేసి నుంచెను. ఆ రోమములు దర్భలైనవి. అతని యాజ్ఞ ప్రజల కిట్లే పితృలను గురించి శ్రాద్ధములందు పిండ ప్రదానముల జేయు మని కలదు. ఈ కథ మహాభారతమునందు గలదు. భగవదాజ్ఞ కలదుగాన ప్రతివారు శ్రాద్ధములందు పిండ ప్రదానముల జేయవలయును. మహాల యాది శ్రాద్ధములు నైమిత్తికములు. ఇది సూర్యుడు కన్యారాసిని జేరు

నప్పుడు, ఆషాఢాది యైదవ కృష్ణపక్షమందు (భాద్రపద కృష్ణమందు) జేయ వలయును. శ్రాద్ధ కర్మచే పితరులు సంతోషింతురు. వారి ప్రసాదమున కర్తకు సర్వసంపదలు గలుగును. పిండదానములు దర్భలందే జేయవలయు నని భీష్ముడు ధర్మరాజున కుపదేశించినట్లు శాంతి పర్వమున గలదు. శ్రాద్ధ దినమందు పిండ ప్రదాన సమయమున భీష్ముని తండ్రివచ్చి హస్తముజూచి పిండముగోరిన తానివ్వక దర్భలందే యుంచెను. దీనితో తండ్రి సంతసించి వరప్రదానము జేసినట్లు కథ దెలిపెను.

10. పితృదేవతల మహాత్మ్యము చాలా గొప్పది వర్ణించ శక్యముగాదు. గోవధ జేసి పితరుల నుద్దేశించి శ్రాద్ధ మొనర్చిన నేడుగురు బ్రాహ్మణులు పితృ ప్రసాదముచే తొందర తొందరగా జెన్మల మార్చుచు మఱల బ్రాహ్మణులై మోక్షమొందినట్లు అరణ్యపర్వమునందు గలదు. కావున మృతవిధి యుల్లంఘించక శ్రద్ధచే శ్రాద్ధముల జేయనగును.

331. శ్లో॥ సప్త వ్యాధా దశారణ్యే మృగాః కాలాం జనే గిరౌ ।
చక్రవాకా శర ద్వీపే హంసా స్సరసి మానసే ।
తేపి జాతా కురుక్షేత్రే బ్రాహ్మణాః వేదపారగాః ।
ప్రస్థితా దీర్ఘ మధ్వానం యూయం యస్తు ప్రసీదత॥

తా॥ గురుకులవాసము జేయు, నేడుగురు బ్రాహ్మణులు శ్రాద్ధతిథినాడర్ణ్యమందేదియు లభించనందున గురువు గోవును జంపి దానితో పితృ శ్రాద్ధము జేసిరి. కాని గురువుతో ఆవు పెద్దపులిచే హతమైనదని అబద్ధమాడినందున వారు జన్మాంతరమం దేడుగురు వ్యాధులై బుట్టిరి. వారికి పితృ ప్రసాదమున జాతి స్మరణ గలిగినందున వారు మఱల నెట్టి యపరాధముల జేయకయే ఆ జన్మ గడిపి వెంటవెంట నితర జన్మలైన మృగములు, చక్రవాకపక్షులు హంసలైరి. హంసజన్మయందు వారిలో మొదటి నలుగురు ధైర్యమవలంబించి నిర్దోషముగనుండిరి. కాని తక్కిన ముువ్వురు నిమిత్తాంతరమున విషయలోలుపులైనందున వారు బ్రహ్మదత్తుడను రాజు, మంత్రి పురోహితుడుగా జన్మించిరి. మొదటి నలుగురు కురుక్షేత్రమునందు బ్రాహ్మణులైరి. ఈ నలుగురికే పూర్వజన్మల స్మరణ గలదు. కాని

తక్కిన ముగ్గురికి అట్టి జ్ఞానము లుప్తమైనది. కారణాంతరమందు బ్రహ్మదత్తునికి వైరాగ్యము గలిగి యాత్మహత్య గావించుకొన గోరినప్పుడా నలుగురు బ్రాహ్మణులు పై శ్లోకముతో నతనికి పూర్వజన్మ స్మరణ గల్గించినందున బ్రహ్మదత్తుడు తన మంత్రి పురోహిత సహితము జ్ఞానులై తపస్సు జేసి కృతకృత్యులైరి. ఇట్టి కథవలన పితృదేవతల మహాత్మ్యము దెలిసికొనవచ్చును.

11. ధార్మికుడైన గృహస్థుడు శ్రద్ధచే శ్రాద్ధకర్మయం దప్రమత్తుడగుచు కర్మ పూర్తి జేయవలయును. శ్రద్ధలేకున్న శ్రాద్ధభంగము గావచ్చును.

332. శ్లో॥ పిండే భిన్నేన, తేనష్టే, పితా చ వమనే యది ।
తద్దినే చోప వాసం చ పునః శ్రాద్ధం పరేహని॥

తా॥ పిండదానమందు, పిండములు పగిలిన, నష్టమైన పితృఋణము గ్రహించిన బ్రాహ్మణుడు కక్కినయెడల శ్రాద్ధభంగమగును. అనా డుపవసించి మరునాడు కర్త మరల శ్రాద్ధము గావించవలయును.

12. శ్రాద్ధకర్మ విధ్యుక్తముగా నిర్వర్తించిన పిదప బ్రాహ్మణాశీర్వాదముల గ్రహించి పితృ ప్రసాదముగ శేషాన్నము తాను ఇష్టులైన వారితో గలసి భుజించవలయును. ఇది విధిగాన పితృప్రసాదము దినకున్న దోషము గలుగును.

333. శ్లో॥ శ్రాద్ధం కృత్వాతు యో మర్త్యోన భుంక్తే థ కదాచన ।
దేవా హవ్యం న గృహ్ణంతి కవ్యాని పితర స్తథా॥

తా॥ శ్రాద్ధము జేసి యే కారణముచే నైనగాని పితృశేషము కర్త భుజించని యెడల దేవతలు హవ్యమును, పితరులు కవ్యమును గైకొనరు.

334. శ్లో॥ అహన్యే వతు భోక్తవ్యం కృతే శ్రాద్ధం ద్విజన్మభిః ।
అన్యథాహ్యా సురం శ్రాద్ధం పరపాకే చ సేవితే॥

తా॥ దినమునందే త్రైవర్ణులైన శ్రాద్ధ కర్తలు పితృ ప్రసాదము భుజింపవలయును. ఇట్లు జేయక నితర పాకమందు భుజించినయెడల నా శ్రాద్ధ మాసుర శ్రాద్ధ మనబడును.

244. పై విధముగ నాచరించు ధార్మిక గృహస్థునికి వృత్తిని కల్పించుట రాజులకును, ధర్మపరాయణులైన ధనికులకును విధి యగును.

2. మంగళ కర్మలందు జేరిన సాల గ్రామాది మూర్తులందు పంచాయతన దేవతా కల్పన జేసికొని ప్రతినిత్యము అర్చనాదుల గృహస్థ ధార్మికుడు జేయవలయును. ఇది స్వస్త్యమనబడును.

3. పై విధముగ నాచరించు బ్రాహ్మణులు, దండనీతి ననుసరించి ప్రజా రక్షణ జేయు క్షత్రియులు, న్యాయముగ కృషి గో రక్షాదుల జేయు వైశ్యులు, ధార్మిక త్రైవర్ణ్యుల సేవించు శూద్రులు, నీతిపరులగు నితరులు వర్ణాశ్రమాచార రూపధర్మము లాచరించుచు యథా యోగ్యమైన శ్రేయస్సును ప్రాప్తింతురు. ఇందు సందేహించు నవకాశములేదు. ఇది గౌతమ సూత్రములం దల్యాచారకాండ సంగ్రహము.

## 2. ప్రాయశ్చిత్తములు

245. గౌతమ సూత్రములందు ప్రాయశ్చిత్తములను కాండయందు ప్రాయశ్చిత్తముల వివరముగలదు. దుర్మార్గులను దండించుట ప్రాయశ్చిత్తమనబడును.

సూత్రము ౨౨. "రాజాసర్వస్యేష్టే బ్రాహ్మణవర్జనం" అనగా రాజు తన పరిపాలనందుండు ప్రజల నిగ్రహానుగ్రహమందు స్వేచ్ఛచే సమర్థుడు. ప్రజల తమ తమ మర్యాదలందు ప్రవర్తింపజేయుట, వర్ణాశ్రమాచార రూప ధర్మాచరణందు ప్రజల ప్రవర్తింప సమర్థుడగుట, తాను ధర్మ మాచరించి ధార్మికుడగుట, ప్రజారక్షణార్థము, ఉపయోగార్థము, క్షేమార్థ ములకై ప్రజలనుండి పన్నులు గైకొనుట, తానుపభోగించుట, పురుషు లను వారి యోగ్యతానుసారముగ పనులందు నియోగించుట మున్నగు వానియందు రాజునకు స్వాతంత్ర్యముగలదు. బ్రాహ్మణుల మాత్రము దండించరాదు. వారిని సాంత్వనచే నియమించవలయును. పట్టాభిషిక్తు డగు రాజు జితేంద్రియుడై యందరియందు సమముగా వర్తించవలయును

వ్యవహార పరిష్కారముల జేయునప్పుడే పక్షపాతమును జేయక మర్యాద నవలంబించి ధర్మశాస్త్రానుసారము పరిష్కారముల జేయవలయును. ప్రజా హితుడగు రాజు నందరు మన్నించుదురు. ప్రజలనుండి ఆదాయ షడ్భాగ మునే పన్నుగా దీసికొనవలయును. వేదవేదాంగ పారంగతుడై ధర్మ శాస్త్ర రహస్యముల నెఱింగిన ధార్మిక గృహస్థ బ్రాహ్మణుని పురోహి తునిగా నియమించుకొనవలయును. పురోహితుని మతమున ధర్మసభ (పరిషద్) యనుమతి ప్రకారముగ వ్యవహార పరిష్కారముల జేయవల యును. ఇందు ప్రమాణాదుల గైకొనిగాని, సాక్ష్యము దీసికొనిగాని పరిష్కారము జేయవచ్చును. ధర్మాతిక్రమణ లందపరాధుల నపరాధాను సారముగ దండించి (శిక్షించి) వారిని ధర్మమార్గమునందుంచవలయును. దండనలు (ప్రాయశ్చిత్తములు) గుణధర్మము లనబడును. ప్రజారక్షణార్థ మపరాధుల దండించుట రాజగుణమగును. దండమనగా దమయత్యా దాంతాన్దమ్యంతే వాస్మిన్నితి దండః యను నిర్వచనముగలదు. దండన నాల్గు విధములు.

శ్లో॥ 335. దిగ్దండం ప్రథమంకుర్యాద్వాగ్దండం తదనంతరం ।
తృతీయంధన దండంతు వధ దండమతః పరం.

తా. శిక్షించునప్పు డపరాధులను హెచ్చరించుట (ఇకముందీలాటి పనుల జేయకుమని తెలుపుట) మొదటి దండన, అపరాధుల నిందించుట (తిట్టుట) వాగ్దాండన రెండవది. అపరాధులనుండి వారి ధనము లాగుకొనుట **(Fine)** ధన థండవ మూడవది. మరణాంత దండన నాల్గవది.

246. పైదండనలు క్రమముననేగాని, అపరాధానుగుణ్యముగ వ్యతిరేకము ననేగాని, కొన్నిగాని, యన్నియునుగాని జేయవచ్చును. అపరాధులను నిషిద్ధాచరణలనుండి తప్పించుటకై వారిని దండించిన నిది వారి రక్షణార్థ మనబడును. కాన దండనవిధి యగును.

2. దొంగతనములు, వ్యభిచారములు, అధిక్షేపణలు, (ఇతరులదిట్టుట) దౌర్జన్యాదులు, స్త్రీల మానభంగము లొనర్చుటలు, బలాత్కారముగ స్త్రీ

సంయోగములు, అసవర్ణ స్త్రీ పురుష సంయోగములు, అభక్ష్య సేవనలు, మద్యపానాదులు మొదలగునవి పాతకములు, మఱియు మహా పాతకోపపాతకములు నిందతములివి యాచరించువారు దుర్మార్గులనబడుదురు. వీరికి ప్రాయశ్చిత్తార్థము దండనలు, జాతి, శక్తి, గురు, లాఘవానుసారముగ వినియోగించవలయును.

3. రాజసమక్షమందేగాని, పరిషత్తుయెదుటగాని, ధర్మాధికారి ముందటగాని దండనలు జరుగవలయును. పరిషత్తును ధర్మసభ యందురు.

శ్లో॥ 336. చత్వారోవాత్రి యోవాపియం బ్రూయుర్వేదపారగాః ।
సధర్మ ఇతివిజ్ఞేయో నేతరేషాం సహస్రశః.

శ్లో॥ 337. దశావరా పరిషద్యంధర్మం పరికల్పయేత్ ।
త్ర్యవరావాపి వృత్తిస్థాః తంధర్మం న విచాలయేత్,

శ్లో॥ 338. చత్వారోవాత్రి యోవాపి పరిషత్త్రై వర్ణ్యమేవవా ।
సాబ్రూతేయం సధర్మస్యాదేకోవాఽధ్యాత్మవిత్తమః.

తా. వేదవేదాంగ పారంగతులైన బ్రాహ్మణులు నలుగురేగాని ముగ్గురేగాని జేరు సభ పరిషత్తనబడును. పదిమంది శ్రేష్ఠులుగాని వారేగాని, ముగ్గురు శ్రేష్ఠులు వృత్తిగలిగినవారు గాని జేరునదిసభ పరిషత్తు లేక త్రైవర్ణ్యులు నలుగురుగాని, ముగ్గురుగానియుండుసభ పరిషత్తగును. వారేది చెప్పుదురో యదియే ధర్మమనబడును. లేదా ఒకడాత్మజ్ఞాని చెప్పినది ధర్మమే యగును.

247. శపథము (ఒట్టు) రాజుముందరగాని, పరిషత్తెదుటగాని, దేవాలయమందేగాని జరుగవచ్చును. ఇట్టి శపథమునగాని, సాక్ష్యముగైకొనిగాని యపరాధ నిర్ణయము గావించవలయును.

2. అల్పపాపములందల్ప ప్రాయశ్చిత్తముల వెనువెంటనే జేసికొనగ నిర్లేపుడగును.

3. ప్రాడ్వివాకి (సాక్ష్యమిచ్చువాడు) వ్యవహారములందు సత్యమునే బలుకవలయును. వేదశాస్త్రాధ్యయనాదుల కంటెను, ఉపదేశాదులకంటెను సత్యవచన మొకటియే గొప్పది. కావున సాక్షి సత్య వచనముల బలుకవలయును.

248. పంచ మహాపాతకములివి :- 1. బ్రహ్మహత్య 2. సురాపానము 3. గురుతల్పగమనము 4. సువర్ణ స్తేయము 5. తత్సంసర్గము.

1. బ్రహ్మహత్యయనగా=బ్రాహ్మణుని జంపుట. ఇందితర శ్రేష్ఠుల జంపుటయు బ్రహ్మహత్యతో సమానమనబడును.

2. కల్లు ద్రాగుట సురాపానము. ఇది మూడు విధములైనది.

శ్లో॥ 339. గౌడీ మాధ్వీచ పౌష్టీచ విజ్ఞేయాత్రి విధా సురా ।
యథైవైకో న పాతవ్యః తథా సర్వా ద్విజోత్తమ

తా. బెల్లము మొదలగు తీపి వస్తువులనుండిగాని, తాటి మొదలగు చెట్లనుండిగాని జేయబడు కల్లు గౌడీ, ఇప్పపూలనుండి దీయబడు కల్లు మాధ్వీ, ద్రాక్షాది పుష్టికర పండ్లనుండి దీయబడుకల్లు పౌష్టి యనబడును. మూడు విధముల కల్లులం దే దొకటైనగాని ద్రాగగూడనప్పుడు యన్నియు నిషిద్ధములని యర్థము. ఇందు సురాపాన సమానములైనవి జేరును, ఉ॥ రాగిపాత్రములందలి పాలు మొదలగునవి.

3. గురుతల్పగమనము=ఆచార్యాదుల భార్యతో సంగమించుట. ఇందు శ్రోత్రియ బ్రాహ్మణి, రాజపత్ని, తల్లి, భగినీ మొదలగువారితో సంగమించిన గురుతల్పగమనపాపము. ఈ పాతకముల తెలిసిగాని దెలియకయేగాని జేసిన మహాపాతకములనబడును.

4. సువర్ణ స్తేయము=బంగారము, దానితో జేయబడిన నాణెములు ముద్రలు నితరులవి దొంగిలించిన సువర్ణ స్తేయ మనబడును. ఇందితర వస్తువులు సహితము నితరులవి దొంగిలించిన వానితో సమానములైనవి సువర్ణ స్తేయ పాతకమునందు జేరును.

5. పై నాలుగు పాతకముల జేయువారితో సహవాసము జేయువారికి తత్సంసర్గమను మహా పాతకము గలుగును.

శ్లో॥ 340. సంవత్సరేణ పతతి పతితేన సమాచరన్ ।
యానాసన శయ్యాభిర్నిత్య మాహు ర్మనీషిణః

తా. పై జెప్పిన నాలుగు మహాపాతకులతో గలసి యొక సంవత్సరము వరకే కళయ్యాధి రూఢులైన, వారితో గలసి ప్రయాణములు జేసిన ఏకాస నస్థులైన వారు పతితులగుదురు.

శ్లో॥ 341. యాజనం యోనిసంబంధం స్వాధ్యాయం సహభోజనం ।
కృత్వా సద్యః పతత్యేవ పతితేన సహాచరన్.

తా. మహాపాతకులతో గలసి వారిచే యజ్ఞముల జేయించిన, వారితో గలసి విద్యాభ్యాసము జేసిన, వారితో వివాహ సంబంధములు జేసికొనిన, భోజనాదుల వారితోగలసి జేసిన వారు వెనువెంటనే వారి వలె పతితులగుదురు. (తత్సంసర్గపాతకమును జెందుదురు).

249. ఉపపాతకము లనేకవిధములు. వానికనేకవిధ దండనలు జెప్పబడినవి.

2. గర్భఘాతకములు, గర్భిణీ స్త్రీఘాతకములు, స్త్రీహత్యలు, శిశుహత్యలు, జేసినవారికి వర్ణానుక్రమముగగురు, లఘు శిక్షలు వివిధములైనవి విధింపబడినవి.

3. వివిధ జంతువుల జంపువారికి వివిధ శిక్షలు జెప్పబడినవి.

4. వర్ణాదిక్రమముగ స్త్రీల బలాత్కారముల, మానభంగముల, సంభోగముల జేసినవారికి కఠిన శిక్షలు వివిధమున బేర్కొనబడినవి.

5. ఆతతాయుల వెంటనే జంపవచ్చునని యనుజ్ఞ కలదు.

6. రహస్య కృతపాతకములకు వివిధ ప్రాయశ్చిత్తములు జెప్పబడినవి.

7. అభక్ష్యభక్షణల, వర్ణ సంకరాన్న భక్షణలందు వివిధ ప్రాయశ్చిత్తములు గురులఘువులైనవి జెప్పబడినవి.

8. రాతః ప్రాప్తములైన మాంసాది భక్షణల విడిపించుటకు నిషేధము జేసినందు శాస్త్రోల్లంఘన జేయువారికి శిక్షలు జెప్పబడినవి.

శ్లో॥ 342. మద్యం మాంసం చ లశునం, పలాండం శిగ్రుమేవచ ।
శ్లేష్మాతకం వి డ్వరాహ మభక్ష్యం వర్జయేన్నరః.

తా. కల్లు, మాంసము, వెల్లిగడ్డ, ఉల్లిగడ్డ, చేదు మునిగెకాయ, త్రాటి గడ్డ, గిరిక్కాయ, లివి తినకూడదని నిషేధము గలదు.

శ్లో॥ 343. న మాంస భక్షణే దోషో న మద్యేనచ మైథునే ।
ప్రివృత్తిరేషా భూతానాం నివృత్తిస్తు మహాఫలా.

తా. మాంసభక్షణ, కల్లు త్రాగుట, మైథునముజేయుట లివి రాగత ప్రాప్తములగునందున దోషములేకుండినను, నివి వర్జించిన మహాఫలము గలుగును కావున నిషేధించబడినవి. శాస్త్రనిషిద్ధముల సేవించిన వారలు శాస్త్రోల్లంఘనమను పాపమునందు శిక్షించబడుదురు.

9. పై జెప్పిన పాతకముల స్త్రీలుగాని, బాలురుగాని జేసినయెడల వారికి తగు శిక్షలు జెప్పబడినవి.

10. వర్ణాశ్రమాచార రూప ధర్మముల పండ్రెండు సంవత్సరములకు తక్కువ వయస్సుగల బాలురు నడువకున్నను వారికి శిక్షలుండవు. కాని నితర పాతకముల జేసినవారికి తగు శిక్షలు జెప్పబడినవి.

శ్లో॥ 344. దేశం కాలం వయశ్శక్తిం జ్ఞాత్వానిష్క్రియణం వదేత్ ।
అబుద్ధి కృతమభ్యాసం జ్ఞానం బుద్ధికృతం తథా.

తా. పాపముల దెలియకజేసిరా, అభ్యాసముగ మరల మరల జేసిరా, లేక బుద్ధి పూర్వకమున జేసిరా యనునది దెలిసికొని దేశకాలముల నను సరించి పాపుల వయస్సు, శక్తిని గనిపెట్టి శిక్ష లివ్వవలయును.

250. బ్రాహ్మణుడు శూద్రుడిచ్చిన ఆమద్రవ్యముల గైకొనవచ్చునుగాని యాపత్కాలమందే దప్ప యితర సమయములందు శూద్రి పక్వాన్నముల దినినచో అభక్ష్య భక్షణ మను దోషము గలుగును.

శ్లో॥ 345. నాద్యాచ్ఛూద్రస్య పక్వాన్నం విద్వానశ్రౌచి నోపివా ।
ఆమమేవాదదీతాస్మా ద్వవృత్తా వేకరాత్రకం.

తా. విద్వాంసుడేగాని యవిద్వాంసుడేగాని శూద్రపక్వాన్నములదిన రాదు వృత్తిలేనప్పుడొక రాత్రికి సరిపడునంత ఆమద్రవ్యముల గైకొన వచ్చును.

శ్లో॥ 346. జీవితాపత్సమ మాపత్తౌ యెన్నమత్తి త స్తతః ।
లిప్యతే న సపాపేన పద్మపత్రమివాంభసా.

తా. ప్రాణోత్క్రమణ సమయమేర్పడి నప్పుడు యేలాటి దూషితాన్నములదినినగాని తామరాకును నీళ్లంటనట్లు దోషములంటవు.

2. దూషితాన్నముల దినవలసినప్పుడు వానికి ప్రోక్షణాదులచే శౌచవిధి యొనర్చి దినవలయును. అన్యథా దోషముగలుగును.

శ్లో॥ 347, దేశం కాలం తథామానం ద్రవ్యం ద్రవ్య ప్రయోజనం ।
ఉపపత్తి మవస్థాం చ జ్ఞాత్వా శౌచం ప్రకల్పయేత్,

తా. దేశము, కాలము, ప్రమాణము, ద్రవ్యలక్షణము, దాని ప్రయోజనము, తగురీతి, అవస్థ లిట్లన్నింటిని గనిపెట్టి శౌచ కల్పన జేయవలెను.

3. దూషితాన్నములు దినబడినచో దానికై వెంటనే పుణ్యానదీ స్నాన జప, హోమాదులతో ప్రాయశ్చిత్తముల జేసికొనవలయును.

251. శిష్టుల బూజించునప్పుడు వారి వారికి తగినట్లు పూజించవలయును లేనిచో దోషము గలుగును.

సూత్రము ౨౩. "సమాసమే విషసమో పూజాతః" సముని కసమపూజ, అసమునకు సమపూజ జేసినయెడల పాపముగలుగును. సమత్వమనగా అర్హత, అసమత్వమనగా ననర్హత యనబడును. ఉ॥ చతుర్వేద పారంగతుడు సముడు వీని కల్పదక్షిణ యిచ్చినచో విషమపూజ యగును. వీడుండగ నేకవేద మభ్యసించువాడు, లేక ననధ్యాయియసముడు వీనికి విశేషదక్షిణ యిచ్చిన సమపూజ యనబడును గాననిది యయుక్తమైనది.

కాని చతుర్వేదవిదునకు విశేషముగ పూజించి, ఏకవేదవిదులకు సామాన్యముగ పూజించినయెడలననిర్దోష మనబడును.

2. స్త్రీలకు స్వాతంత్ర్యము నిషిద్ధముగాన వారు స్వాతంత్ర్యమునకై ధర్మశాస్త్ర మతిక్రమించినయెడల వారికి దోషముగలుగును.

శ్లో॥ 348. నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో న వ్రతం నాప్యుపోషితం ।
పతిం శుశ్రూషతే యేన తేన స్వర్గే మహీయతే.

తా. స్త్రీలు స్వతంత్రించి యజ్ఞముల జేయరాదు. వ్రతములగాని యుపవాసములగాని వారు స్వతంత్రించి జేయరాదు. వారు పతిని సేవించిననే గొప్పయగుదురు.

శ్లో॥ 349. స్త్రీకృత్యాన్య ప్రమాణాని కార్యాణ్యాహురనాపది,
విశేషతో గృహ, క్షేత్ర, దానాదమన విక్రియాః.

తా. ఆపత్కాలము గానప్పుడు స్త్రీలు జేయు పనుల ప్రమాణములు. యిండ్లు, భూముల విక్రియమందు, దానముల జేయుటందు, శిక్ష లిచ్చుటందు, అమ్మకముల జేయుటందు విశేషించి యప్రమాణములగును. శాస్త్రమతిక్రమించి జేసినచో నవి మన్నింపబడజాలవు.

శ్లో॥ 350. బాల్యే పితృవశే తిష్ఠేత్పాణిగ్రాహస్య యవ్వనే ।
పుత్రస్యస్థ విరీభావే న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి.

తా. బాల్యమందు తండ్రి యధీనురాలై, యవ్వనమందు భర్త్రధీనముగ, వార్ధక్యమందు పుత్రుని యధీనమందు స్త్రీ యుండవలయును.

సూత్రము ౨౪. "నాతిచరేద్భర్తారం" అనగా స్త్రీలు భర్త్రాజ్ఞోల్లంఘన జేయరాదు. జేసిన దోషమగును కావున ధర్మహాని గలుగునప్పుడు అర్థకామముల త్యజించవలయును.

శ్లో॥ 351. పరిత్యజే దర్థకామౌ, యౌస్యాతాం ధర్మవర్జితౌ ।
ధర్మం చాప్యసు ఖోదర్కం లోక సంకృష్టమేవచ.

తా. ధర్మ హానికరములగు నర్థకామముల విడువ వలయును. భవిష్యత్తు నందు సుఖము కలిగించజాలని ధర్మమైనను వర్జితము. ఇట్లే ధర్మ మాభాస మాత్రమైనదై లోకహాని యగునప్పుడు విడువ వలెను.

252. పాపముల జేసియు శిక్షల దప్పించుకొనువారికి పాప పరిహారము గానేరదు గాన పాప పరిహారమునకై ప్రాయశ్చిత్తములైన జేసికొన దగును. మహాపాప పరిహారార్థ మశ్వమేధ యాగాదులు, ఇతర సర్వ పాపపరిహారార్థమునకై కృచ్ఛ్రాదులు ప్రాయశ్చిత్తములనబడినవి.

శ్రుతి॥ xx. "తరతి తరతి బ్రహ్మహత్యాం యోశ్వమేధేన యజతి ।
యవుచైనమేవం వేద" యను ప్రమాణము గలదు.

1. కృచ్ఛ్రము, 2. అతికృచ్ఛ్రము, 3. చాంద్రాయణము ప్రాయశ్చిత్త భేదములు.

శ్లో॥ 352. యతాత్మనోఽప్రమత్తశ్చ ద్వాదశాహామ భోజనం ।
పరాకోనామకృచ్ఛ్రోఽయం సర్వపాప ప్రణాశనం.

తా. ఇంద్రియ నిగ్రహుడగుచు నప్రమత్తుడై పండ్రెండు దినములు పవాసములు జేసిన పరాకమలు కృచ్ఛ్ర ప్రాయశ్చిత్తము.

2. అతికృచ్ఛ్రమును ప్రాజాపత్యమనియు నందురు ఇది ద్రవ్యదానముతో నిర్వహింపవచ్చును.

శ్లో॥ 353. త్రియత్రింశ త్పణానాంతు ప్రాజాపత్యస్య దాపయేత్।
శతం సపాదం దాప్యం స్యా త్తథా సాంతపనస్యతు.

శ్లో॥ 354. అతికృచ్ఛ్రస్యతు తథాస ప్తషష్టిశ్చతుశ్శతం ।
కృచ్ఛ్రాతి కృచ్ఛ్రయోశ్చైవ పణం పంచ శతంతథా.

శ్లో॥ 355. దాపయెచ్చ పరాకస్యపణం పంచశతం తథా ।
త్రియత్రింశాధికం దండమిత్యాహుర్బ్రహ్మ వాదినః.

తా. పణములనగా సువర్ణ తూకము (పూర్వకాలమందుగుంజలచే జోకు) ఒక పణసమాన మొక గుంజెత్తు బంగారము. ఇట్టి 33 పణముల బంగారు

దానము ప్రాజాపత్యమునకును, సాంతపనమను కృచ్ఛ్రమున కగును. అతి కృచ్ఛ్రమునకు 467 లపణములు, కృచ్ఛ్రాతి కృచ్ఛ్రమునకు 500 లవపణ ములు, పరాకమునకు 533 పణముల దానము ప్రాయశ్చిత్తము.

356. శ్లో॥ ప్రాయోనామ తపః ప్రోక్తం చిత్తం సంయమ ఉచ్యతే ।
తపస్సంయమ సంయుక్తం ప్రాయశ్చిత్తం విదు ర్బుధాః॥

తా॥ ప్రాయశ్శబ్దార్థము తపస్సు. చిత్త శబ్దార్థము నిగ్రహము. రెంటి సంయోగముచే ప్రాయశ్చిత్త నిర్వచన జేయబడినది.

253. మహాపాతకాదులందు హంతకులకు మరణాంత దండనలు, ఇతరము లందు బంధనలు (ఖైదు) మొదలగు శిక్షలు జెప్పబడినవి. మహాపాతకులు ఉరిశిక్షచే మరణించిన పూతులగుదురు.

2. తత్సం సర్గమను పాతకమునకు, ఉపపాతకములకు కృచ్ఛ్రాదులుగాని, చాంద్రాయణముగాని ప్రాయశ్చిత్త మనబడినది.

సూత్రము ౨౫—"అథాతః కృచ్ఛ్రాన్వ్యాఖ్యాస్యామః" మొదలుకొని "అథైతాన్త్రీన్ కృచ్ఛ్రాన్ చరిత్వా సర్వేషు వేదేషు స్నాతో భవతి । సర్వైర్దేవైర్జ్ఞాతో భవతి । యశ్చైవంవేద, యశ్చైవంవేద" అనగా మొదటి సూత్రమునుండి తుది సూత్రమువరకు వివరింపబడిన కృచ్ఛ్రాదు లాచరించు వారు సర్వవేదస్నాతులు, సర్వదేవతలచే జ్ఞాతులగుదురు. ఆదరార్థమునకు ద్వివారము జెప్పబడినది. వాని యాచరణ మిట్లు :-

357. శ్లో॥ అహః ప్రాత రహర్నక్త మహరేక మయాచితం ।
అహః పరాకంత త్రైవ ఏవం చతురహౌ పరౌ॥

తా॥ పరాకమను కృచ్ఛ్రమందు 12 దినము లుపవసించవలయును. వీని లోని మొదటి నాలుగుదినము లుభయములం దుపవాసము సాయంత్రము లేదు. ఐదవ దినమునుండి నాలుగుదినములు సాయంత్రమే యుపవాసము పగలులేదు. తుది నాలుగు దినములం దహర్నిశము లుపవాసము జేసిన పరాక ప్రాయశ్చిత్తమగును. ఇట్లుపవాసములు జేయునప్పుడు ప్రతి నాలు గుపవాసములమధ్యన నేదైననొకదినమం దయాచితాన్నభిక్ష జేకొనవచ్చును.

358 శ్లో॥ అనుగ్రహార్థం విప్రాణాం మనుధర్మ భృతాం వరః ।
బాల వృద్ధా తురాణాం చ శశికృచ్ఛ్ర మువాచహ॥

తా॥ ధర్మాత్ములలో శ్రేష్ఠుడైన మనువు విప్రులందలి దయచే బాలురకును, వృద్ధులకును, రోగాద్యాతురలకును ఉపయోగించు శశికృచ్ఛ్ర ముపదేశించెను.

359. శ్లో॥ ప్రాజాపత్యం చరన్విప్రో యద్యశక్తో దినేదినే ।
విప్రాన్సంచాన్వరాన్బుద్ధా న్భోజయేత్సమ్య గర్చితాన్॥

తా॥ ప్రాజాపత్యమను పైజెప్పిన కృచ్ఛ్రములం దుపవాసము జేయనసమర్థులైన యెడల వారు ప్రతియుపవాసమునకు బదులుగా నైదైదుగురు శ్రేష్ఠులగు బ్రాహ్మణులను పూజించి వారికి భోజనము పెట్టవలెను.

360. శ్లో॥ అథచే త్వరతే కర్తుం దివసం మారుతాశనః ।
రాత్రౌ స్థితో జలే వ్యుష్టః ప్రాజాపత్యేన తత్సమం॥
సావిత్ర్యష్ట సహస్రం చ జప్యం కృత్వోత్థితే రవౌ ।
ముచ్యతే పాతకై స్సర్వై ర్యది న భ్రూణహా భవేత్॥

తా॥ తొందరగా పాపపరిహారము గోరిన నొక దినమంతయు వాయుభక్షమాత్రముగ నుపవసించి రాత్రియందు జలపాన మాత్రమే జేసిన నిది ప్రాజాపత్యముతో సమాన మనబడును. ఉదయము లేచి 8000 ల గాయత్రీ జపము జేసిన యెడల భ్రూణహత్య దోషముగాని నితర పాపపరిహారమగును.

361. శ్లో॥ అనాశ్రమీ నతిష్ఠేత దినమేక మపి ద్విజః ।
సంవత్సర మనాశ్రమ్య కృచ్ఛ్రమేకం చరే ద్వ్రతః॥

తా॥ ఒక దినమైనగాని యనాశ్రమిగ నుండరాదు. ఒక సంవత్సర మనాశ్రమిగ నుండినవాడు ఒక కృచ్ఛ్ర ప్రాయశ్చిత్తము జేసికొనవలయును.

362. శ్లో॥ గోమూత్రం గోమయం క్షీరం, దధి సర్పి కుశోదకం ।
ఏకరాత్రోపవాసశ్చ కృచ్ఛ్రం సాన్తపనం స్మృతం॥

తా॥ పంచగవ్యము లివి :- 1. ఆవుపాలు 2. పెరుగు 3. నెయ్యి 4. మూత్రము 5. పేడ. వీనిని కుశోదకములతో గలిపి త్రాగినగాని, లేక

నొకటొకటి క్రమముగ శరీరమందు రాచుకొని స్నానమునుజేసి యానాడు దినరాత్రిము లుపవాసము జేసిన సాంతపనమను కృచ్ఛ ప్రాయశ్చిత్తము.

363. శ్లో॥ ఏకైకం గ్రాసమశ్నీయా త్ర్యహాణి త్రీణి పూర్వవత్ ।
త్ర్యహంచోపవసేదన్త్య మతికృచ్ఛ్ర స్స ఉచ్యతే॥

తా॥ పైన కృచ్ఛ్రమందు జెప్పినట్లు మొదటి మూడు దినములందు ప్రతిదిన మొక్కొక్క కబళాన్నమే దినుచు, తరువాత నగు మూడుదినములందుపవసించి, రెండవ పర్యాయమునం దిట్లే జేసిన నిది అతికృచ్ఛ్ర ప్రాయశ్చిత్త మనబడును. ప్రాయశ్చిత్తముల నెధా ప్రకారము జేయుట ముఖ్య మనబడినదే గాని కేవల మంత్రావర్తనే యుపకరించదు.

364. శ్లో॥ ఫలం కతక వృక్షస్య యద్యప్యంబు ప్రసాదకం ।
న నామగ్రహణాదేవ తస్య వారి ప్రసీదతి॥

తా॥ కతకమనగ చిల్లజంజపండు ఇది నూరి నీళ్ళందు వేసినచో నీళ్ళు స్వచ్ఛపడునుగాని కతకమను పేరు జెప్పినంతనే నీళ్లు స్వచ్ఛపడుట లేదు.

254. చాంద్రాయణ మిట్లాచరించవలయును.

365. శ్లో॥ అష్టావష్టౌ నమశ్నీయా త్పిండాన్మధ్యం దినే స్థితే ।
నియతాత్మా హవిష్యస్య యతి చాంద్రాయణం చరేత్॥

366. శ్లో॥ చతురః ప్రాతరశ్నీయా ద్విజః పిండాన్కృతాహ్నికః ।
చతురో స్తమితే సూర్యే శిశు చాంద్రాయణం చరేత్॥

367. శ్లో॥ యథా కథంచి త్పిండానాం త్రిస్రోశ్నీత సమాహితః ।
మా సేనాశ్నన్హ విష్యస్య చంద్రస్యైతి సలోకతాం॥

తా॥ చాంద్రాయణ మాచరించ గోరినవాడు అమావాస్యనా డుపవాసము జేసి (సాంతపన కృచ్ఛ్రమునందు జెప్పినట్లాచరించి) పాడ్యమినుండి యెనిమిది దినములవరకు నిత్యానుష్ఠానమైన తరువాత మధ్యాహ్న కాలమునందే ప్రతిదినమునం దొకొక ముద్ద (పిండము) చొప్పున కేవల హవిష్యము (అన్నము) దినవలయును. తొమ్మిదవనాటినుంచి నాలుగుదినములవరకు ప్రాతరాహ్నికానుషానానంతర ముదయమునందే ప్రతిదిన మొకొక ముద్ద

దినవలయును. తుదినాల్గుదినములందు ప్రతిదిన మొకొొక ముద్ద చొప్పున కేవల సాయంకాలములందే దినవలయును. ఇట్లాచరించునప్పుడు మధ్యలో నెపుడైనగాని మూడు పిండముల మూడుదినములం దయాచిత భిక్ష యిచ్చినవి దినవచ్చును. వీటికి కాలనియమము లేదు. ఈ విధముగ నొక నెలవర కాచరించువారు సర్వపాప విముక్తులై చంద్రసాలోక్యము నొందుదురు.

సూత్రము ౨౮—"ఏతైర్ద్వి జాత యశ్శోధ్యా, వ్రతైరావిష్కృతై ననః" యనగా, ఇట్టి చాంద్రాయణ వ్రతమాచరించు ద్విజుడు పరిశుద్ధుడగును.

2. చాంద్రాయణ వ్రతమాచరించు దినములందు ప్రతిదినము "ఆప్యాయస్వసమేతు తే" 2. "సంతే పయాంసి సముయన్తు రాజా" 3. "నవోనవో భవతి" యను మూడు మంత్రములతో చంద్రునికి తర్పణల జేయవలయును. తరువాత చంద్రోపస్థాన మంత్రమున స్తుతించవలెను. కాని యుపలబ్ధ లేనందున "సుషుమ్నా సూర్యస్య రశ్మిభిః" యను మంత్రముచే నుపస్థానము జేయవలయును. తరువాత "దేవకృతస్య" యను మంత్రముచే యెనిమిది హోమముల చేయవలయును.

సూత్రము ౨౭—"ఓంకారపూర్వకవ్యాహృతిస్స్వహాతపః, సత్యం, యశః, శ్రీ, రూ, గ్గిడౌజ స్తేజః పురుషో ధర్మశ్శివః" యను మంత్రములతో నొకొక మంత్రముచే నొక్కొక హోమము నిట్లు పదిహేను హోమముల జేయవలయును. మంత్రాంతమునందు "నమఃస్వాహా"యని హోమము జేయవలయును. హోమద్రవ్యముల గ్రాసమాత్రము జేకొని హోమము జేయదగును. గ్రాసమనగా నోటియం దనాయాసముగ బట్టునంత ముద్ద. హోమద్రవ్యము లివి :-

1. చరు (స్వయం నిర్మితము) 2. భైక్షం (తగువారి యిండ్లనుండి తానే గాని బ్రహ్మచారి దెచ్చి యిచ్చినదిగాని) 3. సక్తు 4. కణములు (నూకలు) 5. యావకం (గంజి) 6. శాకము 7. పాలు 8. పెరుగు 9.

ఘృతము 10. కందములు 11. మూలికలు (తినునట్టివి) 12. ఫలములు 13. ఉదకము 14. మధువు 15. కేవల హావిష్యము (లవణ వర్జితమైనది) వీనిలో నుత్తరోత్తరము ఉత్తమోత్తమములు. ఇట్లాచరించు టొక చాంద్రాయణ మగును. రెండవనెలం దిట్లే యాచరించినచో తనతో సహా ఇరువదితరములవారిని పాపములనుండి ఉద్ధరించును. ఇదే విధముగ సంవత్సరమువరకు పండ్రెండు చాంద్రాయణ వ్రతము లాచరించువాడు చంద్ర సాయుజ్యమొందును.

255. పుణ్యనదీతీర్థ స్నానాదులు, జపోపవాసములు, యజ్ఞయాగ దానాదులు, హోమాదులు, తర్పణాదులు. ప్రాయశ్చిత్తమునం దంతర్గతములు వీనిచే నల్పదోషములు బోవును. ఇతర శాస్త్రములందు జెప్పినట్లాచరించిన గాని, హరినామ స్మరణచేగాని పాపపరిహారమగును. అజామిళోపాఖ్యాన ముదాహరణ గలదు.

368. శ్లో॥ సాంకేత్యం పరిహాస్యం వాస్తోభం హేళన మేవవా ।
వైకుంఠ నామగ్రహణ మశేషా ఘహరం విదుః॥

తా॥ ఇతరులకు జూపుటకైనగాని, నవ్వులాటలకైనగాని, దుఃఖముగనైనగాని, పరిహాసమునకైనగాని, దెప్పుటకైనగాని నారాయణుని నామ స్మరణచే సర్వపాపములు బోవునని తెలియుచున్నది.

## ఆశౌచము

256. జాతాశౌచము, మృతాశౌచమను రెండు విధము లశౌచము. ద్వివిధాశౌచము సపిండులకు దశరాత్రములుండును. పదునొకండవనాడు పరిశుద్ధులగుదురు. వివాహ సంబంధముచే స్త్రీలు సపిండులగుదురు. కాని మాతామహులకును, మేనమామలకును, వారి భార్యలకు త్రిరాత్ర మృతాశౌచమనబడినది. సపిండుల పై తరములవారికి త్రిరాత్రాశౌచము వంశ సంబంధముచే నుండును. సమానోదకులకు స్నానమాత్రాశౌచమగును. ద్వివిధాశౌచములం దేకర్మలనుష్టించరాదు.

369. శ్లో॥ నైష్ఠికానాం వనస్థానాం యతీనాం బ్రహ్మచారిణాం ।
నాశౌచం సూతకే ప్రోక్తం శావేచాపి తథైవచ॥

తా॥ వ్రతస్థునికిని, వానప్రస్థాశ్రమికిని, యతికి, బ్రహ్మచారి కాశౌచ ముండదు.

2. ద్వివిధాశౌచ విశేషములు సూత్రములందు జెప్పబడనందున నితర ధర్మ శాస్త్రములందు జెప్పినట్లు నడచుకొనవలయును. ఇది గౌతమ సూత్రము లందలి ప్రాయశ్చిత్తకాండ సంగ్రహము.

## 3. వ్యవహారములు

257. దాయ విభాగము—మృతుని ఋణధనాదులను దాయాదులు విభాగించుకొనెదరు.

సూత్రము ౨౮. "ఊర్ధ్వంపితుః పుత్రారిక్థంభజేరన్" అనగా తండ్రి జచ్చిన తరువాతనే వాని స్వార్జిత విత్తమును పుత్రాదులు విభాగించుకొన గలుగుదురు.

శ్లో॥ 370. ఊర్ధ్వం పితుశ్చ మాతుశ్చ సమేత్య భ్రాతరస్సహ।
భజేరన్పైతృకం రిక్థమనీశాస్తే హి జీవతః.

తా. తల్లి దండ్రుల ధనము వారు జచ్చిన పిదపనే అన్నదమ్ములందరు గలిసి బంచుకొనగలరు. కాని వారి జీవితమందు విభాగించుకొన జాలరు.

2. పుత్రులందరు సమాన భాగార్హులు. పుత్రులందు దత్తుడు, క్షేత్రజుడు జేరుదురు కాని క్షేత్రజునికి పుత్రులుండగ భాగముండజాలదు, దత్తుని తండ్రికౌరసులు గల్గిన యెడల ఔరసునకు వచ్చువంతులో నాల్గవ భాగము దత్తున కివ్వబడును. విభాగార్హతలేనందున క్షేత్రజునకు జీవికార్థ ధన మీయవలయును.

3. విభాగము ధర్మాధికారి యెదుటగాని, పరిషత్తు సమక్షమునగాని సాక్షులముందరగాని గావచ్చును.

4. తండ్రి విరాగుడైన నతని ధనము వాని యనుమతితో బంచుకొన వచ్చును. తండ్రి సన్యసించిన ధన విభాగము జేసికొనవచ్చును. తల్లి

బ్రతికియుండినగాని విభాగమునందాటంకము గాజాలదు. ఆమె యనుజ్ఞ యనవసరమగును.

5. విభాగము జేసికొనునంతవరకు జ్యేష్ఠుడు తండ్రి ధనము కాపాడుచు నందరిని సమదృష్టితో పోషించవలయును.

6. విభాగమందు జ్యేష్ఠపాలు పైతృక ధనమందలి యిరువది యవ భాగము నియ్యవలయును. లేదా రెండావులేగాని, రెండు గుఱ్ఱములో, రెండెద్దులో, ఒక బండి లేక రథయుక్తముగ జ్యేష్ఠ పాలివ్వవలయును. ఇది జ్యేష్ఠునకు వచ్చు భాగముగాక జెప్పబడినది.

7. కనిష్ఠునకు వానికి వచ్చు భాగముగాక పైతృక ధనమునుండి ఒక మేకనో, గొఱ్ఱెనో యిచ్చి ఒక బండినిండ ధాన్యము, మఱియు వాడు కోరిన యిల్లు నివ్వవలయును.

8. సంపద లేకుండినగాని, భ్రాతృల సమ్మతి లేకుండినగాని జ్యేష్ఠ, కనిష్ఠ పాళ్లు దీయక రేయే యందరు సమముగా బంచుకొనవచ్చును. ఎక్కువ ఆస్తి యుండినచో పై జెప్పిన దానికి రెండంతలు వారలకియ్యవచ్చును.

9. పుత్రిక జ్యేష్ఠురాలైన నామెకు రెండెడ్ల నివ్వవలయును.

10. తండ్రికనేక భార్యలుండునప్పుడేభార్యకు మొదలు పుత్రుడు గలుగునో వాడే జ్యేష్ఠుడనబడును. అనేక తల్లుల కనేక పుత్రులుండుటచే విభాగము కుదురునప్పుడు తల్లుల సంఖ్యగా విభాగ మగును. అప్పుడు జ్యేష్ఠ భాగము పెద్ద భార్యకు సంక్రమంచును. ఇట్టి విభాగమందు తల్లుల కెంత భాగమువచ్చునో యాభాగ మందామె పుత్రులందరుజేరి మరల విభాగించుకొన వచ్చును.

11. పుత్రులు లేనివాడు తనపుత్రిక వివాహమందు కన్యాదానమునకు పూర్వము "ప్రాజాపత్యేష్టిగాని, స్థాలీపాక హోమమే" గాని జేసి కన్యాదాన సమయమున జామాతతో "నాకన్యకు నీవలన బుట్టిన కుమారుడు నా కుమారుడు కావలయు" నని కోరగ జామాత యొప్పుకొనిన

యెడల ఆ కన్యకు జనించు పుత్రుడు మాతామహునికి "పుత్రికాపుత్రుడు" అనబడును. వాడే దశవిధ పుత్రులందు జేరును. కానదాయ విభాగమందా పుత్రికాపుత్రుడు పుత్రులు లేనప్పుడు దాయాధికారియగును. ఇట్లు జరుగని పక్షమందు వాడు దౌహిత్ర డనబడును. మృతుని భార్య, పుత్రికలు లేనియెడల దౌహిత్రుడు దాయాధికారి యగును.

12. పుత్ర సంతానములేని మృతుని ధనమున కధికారి వాని భార్య యగును. ఆమెలేని పక్షమందు పుత్రికలు ధన విభాగము జేసికొనవచ్చును. భార్య, పుత్రికలులేని మృతుని ధనమునకు దౌహిత్ర డధికారి యగును. వీరెవరు లేని మృతుని ధనమునకు సపిండులు సన్నిహిత సంబంధ క్రమముగ విభాగార్హులగుదురు. సపిండులు లేకున్న సమానోదకులు, వారు లేనప్పుడు సగోత్రు లెథాసన్నిహిత సంబంధమున అధికారులగుదురు. వీరును లేనప్పుడు క్షేత్రజున కాధనము సంక్రమించును.

258. స్త్రీలకు స్వంత ద్రవ్యముండిన నది స్త్రీ ధనమనబడును. ఇదారు విధములు.

శ్లో॥ 371. అధ్యగ్న్యధ్య వాహనికం దత్తం చ ప్రీతి కర్మణి ।
మాతృ భాతృ పితృ ప్రాప్తం షడ్విధం స్త్రీ ధనం స్మృతం.

తా. 1. అధ్యగ్ని 2. అధ్యవాహనికము 3. దత్తము (మంగళ కర్మలందిచ్చినవి) 4. తల్లి 5. తండ్రి 6. తోబుట్టువులు యిచ్చినవి ఇట్లారు విధములైన స్త్రీ ధనము.

2. మృతురాలి స్త్రీధనమునకు పుత్రికలు ప్రథమాధికారులు. వారందరు సమ భాగినులు. కొందరి మతమున కన్యలు, వితంతువులు, నిర్ధన పుత్రికలే స్త్రీ ధనాధికారు లనబడినది కాని ఇది సర్వసమ్మతముకాదు.

3. పుత్రిక లెవరులేని పక్షమందు మృతురాలి స్త్రీ ధనమునకు పుత్రు లధికారులు, పుత్రులు లేనప్పుడామె భర్త యధికారియగును. భర్త లేకున్నచో నామె మాతృబంధువులు, వారును లేని యెడల మృతురా

భర్తృ వంశజులు సపిండాది క్రమముగ పురుషుని ధనమువలె విభాగించు కొనవచ్చును.

4. మాతాపితృల ధన విభాగమం దే పుత్రుడైన తన భాగము దీసికొనని పక్షమున వాని పుత్రుడు (పౌత్రుడు) ఆ భాగము దీసికొనవచ్చును.

259. మృతుని స్వార్జిత ధనమందు పై జెప్పిన విభాగ క్రమ మను వర్తించును. గాని వాని పితురార్జితమందు, సమష్టి కుటుంబ ద్రవ్య మందు బంగాళ దేశమున దప్ప యితర ప్రదేశములన్నిటియందు "మితా క్షర" ప్రకారమున సమష్టి ఆస్తి న్యాయ మనువర్తించును. అనగా మృతుడు విభాగము జెసికొనక పూర్వము జచ్చిన యెడల వాని భాగము పుత్రులేకున్న లుప్తమగును. ఇతర దాయాదులకు జెందునుగాని వాని భార్యకుగాని, పుత్రికలకుగాని యా భాగము లభించదు. బంగాళమందు మాత్రము వాని భాగము స్వార్జిత ధనమువలె పై జెప్పినట్లు విభాగ మగును. విభాగానంతరము మృతుడైనచో వాని భాగము పై విధముగ వాని భార్యాదులు బంచుకొనవచ్చును. భారతమునకు స్వాతంత్ర్యము వచ్చిన తరువాత 1956 వ సంవత్సరమున హైందవ వారసత్వ చట్టముచే మార్పు గలిగినది. అనగా మృతుని ధనమున కందరు వారసలగుదురని నిర్ణయించ బడినది. వారి వివరమందే జూడవచ్చును. మృతుడు తన స్వార్జిత ధన మెవ్వరికైన నివ్వజాలును.

శ్లో॥ 372. అనుపఘ్నం పితృద్రవ్యం శ్రమేణ య దుపార్జితం ।
స్వయ మీహతలబ్ధం త న్నాకామో దాతు మర్హతి.

తా. మృతుడు పితురార్జిత ధనము వెచ్చించక తన కష్టముతోనేది సంపా దించిన నది వాని స్వార్జిత మనబడును. అట్టి ధనము వానికిష్టులైన వారికే లభించును వాని కిష్టములేని వారలకు బంచరాదు.

2. కష్టార్జితమనగా విద్యచేగాని, యుక్తిచిగాని సంపాదించిన ధనమగునే గాని కృష్యాదులచే విద్యలేనివాడు సంపాదించిన ధన మనబడదు.

శ్లో॥ 373. అవైద్యానాంతు సర్వేషా మీహతశ్చే ద్ధనం భవేత్।
సమస్తత్ర విభాగస్యాత్త పిత్రియేతి ధారణా.

తా. విద్యలేనివాని కష్టార్జిత మందరు సమ్మతించిననే స్వార్జిత ధన మన బడును. లేనియెడల నందరది పితురార్జిత ధన భావనగా బంచుకొన వచ్చును.

260. పుత్రులందు పది భేదములివి :- 1. ఔరసుడు 2. దత్తుడు 3. క్షేత్రజుడు 4. కృత్రిముడు 5. గూఢజుడు 6. అపవిద్ధుడు 7. పుత్రికా పుత్రుడు 8. కానీనుడు 9, సహోఢుడు 10. పౌనర్భవుడు. వీరిలో నౌరసుడు, దత్తుడు. పుత్రికాపుత్రుడు ముగ్గురే ఈ కాలమందు ప్రసిద్ధులు. తక్కిన వారు నామమాత్రులు పూర్వకాలమందు వ్యవహరింపబడెడివారలు.

శ్లో॥ 374. స్వక్షేత్రే సంస్కృతాయాంతు స్వయ ముత్పాదయేత్తుయః।
తమౌరసం విజానీయా త్పుత్రః ప్రథమ కల్పితః.

తా. వివాహ సంస్కార పూర్వకముగ భార్య యగు నట్టిదానియందు తానుత్పత్తి జేసినవాడౌరసుడు. పుత్రులందు వీడు ప్రథముడు.

శ్లో॥ 375. యస్తల్పజః ప్రమీతస్య క్లీబస్యవ్యాధితస్యవా।
స్వధర్మేణ నియక్తాయాం స పుత్రః క్షేత్రజ స్మృతః,

తా. మృతుడైన, నపుంసకుడైన, రోగియైన వాని భార్యయందు ధర్మ నియోగముచే నితరులకు బుట్టినవాడు క్షేత్రజుడు.

శ్లో॥ 376. మాతా పితా వాదద్యాత్తాం యమద్భిః పుత్రమాపధి।
సదృశం ప్రీతి సంయుక్తం సంజ్ఞేయోదత్తి మస్సుతః.

తా. తల్లి దండ్రు లెవరైనగాని తమ ఆపత్కాలమందు సంతోషముగ పుత్రునివలె నుండుటకుగాను మంత్రియుక్తమున నీళ్లు విడిచి దానమియ్య బడినవాడు దత్తుడు.

2. తక్కిన పుత్రు లీకాలమునందప్రసిద్ధులైనందున తాత్పర్యము విడువనైనది.

శ్లో॥ 377. సదృశం తు ప్రకుర్యాద్యం గుణదోష వివర్జితం ।
పుత్రం పుత్ర గుణై ర్యుక్తం సవిజ్ఞేయోస్తు కృత్రిమః.

శ్లో॥ 378. ఉత్పద్యతే గృహే యస్య న విజ్ఞాయేత కస్య సః।
స్వగృహే గూఢ ముత్పన్నః తస్యస్యా ద్యస్య తల్పజః.

శ్లో॥ 379. మాతా పితృభ్యాముత్సృష్టం తయోరన్యతరేణవా ।
యం పుత్రం ప్రతిగృహ్ణీయా దప విద్ధ స్స ఉచ్యతే.

శ్లో॥ 380. పితృవేశ్మని కన్యాతు యం పుత్రం జనయె ద్రహః ।
కానీనం తం వదేన్నామ్నా గూఢం కన్యాసముద్భవం.

శ్లో॥ 381. యాగర్భిణీ సంక్రియతే జ్ఞాతాజ్ఞా తాపివా సతీ ।
వోఢస్స గర్భో భవతి సహోఢ ఇహముచ్యతే,

శ్లో॥ 382. యాపత్యా పరిత్యాక్త్వా విధవాస్వేచ్ఛయాపివా ।
ఉత్పాద యేత్పునర్భూత్వా స పౌనర్భవ ఉచ్యతే.

శ్లో॥ 383. సాచేదక్షత యోనిస్యాద్గతః ప్రత్యాగతాపివా ।
పౌనర్భవేన భర్తాసా పునస్సంస్కార మర్హతి.

శ్లో॥ 384. మాతాపితృ విహీనోయః త్యక్తోవా స్యా దకారణాత్ ।
ఆత్మానం స్పర్శయే ద్యస్మై స్వయం దత్తస్తు సస్మృతః.

శ్లో॥ 385. క్రీణీయాద్య స్త్వపత్యార్థం మాతాపిత్రో ర్యమంతికాత్ ।
సక్రీతక సుత స్తస్య సదృశోఽసదృశోపివా.

261. ఔరసుడు లేనప్పుడు తక్కిన పుత్రులు కర్మాధికారులగుదురు కాని దాయ విభాగాధికార మార్గురికే ధర్మశాస్త్రము జెప్పినది.

శ్లో॥ 386. ఔరస క్షేత్రజశ్చైవదత్తః కృత్రిమ ఏవచ ।
వోఢోత్పన్నాప విద్ధశ్చదాయాదా బాంధవాశ్చషట్.

తా. ఔరసుడు, క్షేత్రజుడు, దత్తుడు, కృత్రిముడు, సహోఢుడు, అపవిద్ధుడు, వీరార్గురొకరు లేనప్పు డొకడు దాయాదులగుదురు.

శ్లో॥ 387. సర్వేషామపి తు న్యాయం దాతుం శక్త్యా మనీషిణః ।
గ్రాసాచ్ఛాదన మాత్రంతు పతితోహ్యదేయాచ్ఛసః.

తా. భాగార్హత లేనివారలందరకు కూటికి గుడ్డకు తగినంత శక్త్యను సారముగ బుద్ధిమంతు డియ్యదగును. యివ్వని యెడల పతితుడగును.

శ్లో॥ 388, క్షేత్రజాదీన్సుతానేతా నైకాదశ యధోదితాః ।
పుత్ర ప్రతినిధీనాహుః క్రియాలోపా న్మనీషిణః.

తా. క్షేత్రజాది పదునొకండు పుత్ర ప్రతినిధు లనబడుదురు. వీరు లేకుండిన మృతుని కంత్యక్రియలు జేయు పుత్రులుండరని బుద్ధిమంతు లందురు.

262. ఔరసుడు, దత్తుడు, లేనప్పుడు పుత్రికాపుత్రు డధికారి యగును. పుత్రికా పుత్రులందు జ్యేష్ఠ భాగము సంక్రమించదు.

శ్లో॥ 389. పుత్రికాయాం కృతాయాంతు యది పుత్రో నజాయతే ।
సమ స్తః ప్రవిభాగ స్యాజ్జేష్ఠతా నా స్తి హిస్త్రియః.

తా. పుత్రులు లేనప్పుడు పుత్రికలు విభాగించుకొనగ నందరు సమాన ముగ భాగార్హులగుదురు వారి యందు జ్యేష్ఠ భాగ కల్పన యుండదు.

2. దాసీ పుత్రుడు=త్రైవర్ణ్యులందు దాసీ పుత్రునకు దాయాధికారము లేదు. జీవన మాత్రమున కధికారియగును.

శ్లో॥ 390. బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రా పుత్రో న రిక్థభాక్ ।
యదేవాస్యపితా దద్యా త్తదేవాస్య ధనం భవేత్,

తా. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు బుట్టిన దాసీ పుత్రుడు దాయాధి కారి కాజాలడు. వాని కేది తండ్రి యిచ్చునో అదే వాని ధనమగును.

2. మృతునికి పైజెప్పిన పుత్రాది సపిండాంత మెవ్వరులేని పక్షమందు బ్రాహ్మణుని ద్రవ్యమునకు వాని గురువు, శిష్యుడు, శ్రోత్రియ బ్రాహ్మణులు దాయాదులగుదురు. వీరులేనప్పుడు బ్రాహ్మణుని ద్రవ్యా మునకును, ఇతరుల ద్రవ్యమునకును రాజు దాయాదుడు.

3. అంగ వికలాదులకును, షండులకును, దుర్మార్గులకును మృతుని ధనమం దధికారములేదు. భార్య యాచనపై యివ్వవచ్చును.

4. అనులోమ విలోమ జాతులకు దాసీ పుత్రుని విధమగును.

శ్లో॥ 391. క్షేమం పూర్తం యోగమిష్ట మిత్యాహు స్తత్వదర్శినః।
అవిభాజ్యే తు తే ప్రోక్తా శయ నంత్వన్న మేవచ.

తా. క్షేమమనగ పూర్తము ఇష్టమనగ యోగము, ఈ యోగ క్షేమము లవి భాజ్యములని బుద్ధిమంతులందురు. మఱియు నన్నము (వండినది) మంచము లివికూడను విభాగించుకొన దగని వందురు.

5. మృతుని ధనమునుండి వాడు భోగించిన స్త్రీలందరికిని పరలోకభీతిచే నన్న వస్త్రములకు తగినంత ఇవ్వవలయును కాని ప్రాతి లోమ్య స్త్రీల కేదియు నివ్వరాదు. వారితో సంగమించుటే మహాపాతకము. వధార్హ ప్రాయశ్చిత్త మనిరి.

సూత్రము ౨౯. "యతోయమః ప్రభవో భూతానాం" అనగా లక్షణయాయమ శబ్దమునకు జ్ఞానార్థము, ప్రభవ శబ్దమునకు జన్మల గ్రహణ (సంసారమందు తిరిగి పుట్టుట) ఇవే శ్రేయః ప్రేయస్సు లనబడుచున్నవి. ఉభయధ ఫలములు ధర్మముచే గలుగునని వేదములు జెప్పుచున్నవి.

శ్లో॥ 392. చాతుర్వర్ణ్యం త్రయో లోకా శ్చత్వార శ్చాశ్రమాః పృథక్ ।
భూతం భవ్యం భవిష్యంచ సర్వం వేదాత్ప్రసిద్ధ్యతి.

తా. నాలుగు వర్ణములు, మూడు లోకములు, నాల్గాశ్రమములు గలవని భూత, వర్తమాన, భవిష్యత్తులం దుండునని వేదములే తెలుపుచున్నవి. అనగా హింసానుగ్రహాదులు దెలిపిననే దెలియబడుగాని యన్యథా తెలిసికొను టశక్యము.

సూత్రము ౩౦. "ధర్మిణాం విశేషేణ స్వర్గం లోకం, ధర్మ విదాప్నోతి జ్ఞానాభినివేశాభ్యాం" అనగా ఆజన్మాంతము ధర్మాచరణ జేసినచో

ధర్మజ్ఞుడు, లోకమాన్యుడనబడును. ధర్మజ్ఞుడు స్వర్గ రూప ఫలమునే గాని, మోక్షమునుగాని యథాభిసంధి పొందును.

సూత్రము ౩౧. "ఇతి ధర్మోధర్మః" అనగా ఇతి శబ్దము ప్రకారవాచిగాన పై విధమున జెప్పినట్లు నడుచుకొనగనది ధర్మమనబడును. శాస్త్ర పరిసమాప్తికి ద్వారము జెప్పబడినది ఇట్లు వ్యవహార కాండ గౌతమ సూత్రము లందలిది పూర్తి యగుటతో గౌతమ సూత్రముల సంగ్రహమైనది.

ధర్మశాస్త్ర కాండము సమాప్తము.

ఓం

శ్రీ గణేశాయనమః

# ఆర్ష విజ్ఞాన సర్వస్వము

## ద్వితీయ గుచ్ఛము

## 9. ఆచార కాండము

## దైనిక చర్య

262. గౌతమఋషి క్రియాకాండ యందాచరముల సంగ్రహించెను కాని యవి మిక్కిలి సంగ్రహములై నందున వానికి యనుకూలమైన నితర శాస్త్రములందలి ఆచారధర్మముల సంగ్రహించి యాచారకాండయందు ధర్మశాస్త్రకాండమున కనుబంధముగ ననువదింప బడినది. ఇవియాచరణ యోగ్యములై నందున విధులనబడినవి. వర్ణాశ్రమాచార రూపధర్మముల నాచరించిననే యవియర్థ వంతములగును.

శ్లో॥ 393. శర్వాగమానా మాచారః ప్రథమం పరికల్ప్యతే ।
ఆచారః ప్రభవోధర్మః ధర్మస్య ప్రభురచ్యుతః.

తా. సమస్తాగమములందు (తంత్రములందు) ఆచారమే ముఖ్యధర్మ మని జెప్పబడినది. ఆచారములతో ధర్మము జనించును. ధర్మమున కీశ్వరుడు ప్రభువు (నియామకుడు).

శ్లో॥ 394. ఆచారాల్లభతే ధర్మమ్మాచారాల్లభతే ధనం।
ఆచారాల్లభతే సౌఖ్యమాచా రాన్మోక్ష మశ్నుతే ।

తా. ఆచారమునుండి ధర్మము, దానితో ధనము గలుగును. ఆచారము ననే సౌఖ్యము, మోక్షము గలుగును.

శ్లో॥ 395. నకులంకులమిత్యాహు రాచారః కులముచ్యతే ।
అచార రహితో రాజన్నేహనా ముత్రనందతే.

తా. ఆచారమే కులమనబడును. ఆచారములేని వంశములు వంశములనబడజాలవు. ఆచార రహితు డిహపరములందు సుఖింపజాలడు. ఇట్లు భీష్ముడు ధర్మరాజుతో జెప్పెను.

263. దైనిక నిత్య విధుల నాచరించుట ఆచారమనబడును. ఇదే వర్ణాశ్రమాచార రూప ధర్మము. దైనిక నిత్య చర్యలనగా ఉషః కాలమందు నిద్ర మేల్కొని మరల రాత్రి నిద్రించువరకాచరింపదగిన విధులు.

శ్లో॥ 396. పంచ పంచ ఉషః కాలః సప్తం చారుణోదయమ్ ।
అష్ట పంచ భవేత్ప్రాతః శేషస్సూర్యోదయ స్మృతః.

తా. ఒకదిన మందరువది ఘడియలలో (24 ఘంటలలో) 55 వ ఘడియ (శేష రాత్రి)ఉషఃకాలము, 57 వ ఘడియ అరుణోదయ కాలము, 58 వ ఘడియ ప్రాతఃకాలము, శేష కాలము సూర్యోదయ మనబడును.

2. ప్రతి మనుజు డుషఃకాలమునందే నిద్ర మేల్కొని లేచి లఘు శంక దీర్చుకొనవలెను. అప్పుడు ప్రశాంతముగ తన హృదయ కమలమునందే యున్న అంగుష్ఠ మాత్ర పురుషుని (పరమేశ్వరుని) ధ్యానించ వలయును.

3. ధ్యానము జేయనేరకున్నవారు పరమేశ్వరుని సగుణ నిర్గుణముల దెలుపు పద్య, గద్య, పాటలచే స్తుతి జేయవలయును. ఉదాహరణగా.

## ప్రాతస్స్మరణము

397. శ్లో॥ ప్రాతఃస్మరామి హృది సంస్థిత మాత్మ తత్త్వం ।
సచ్చిత్సుఖం పరమహంస గతిం తురీయం ।
యత్స్వప్న జాగర సుషుప్తిమ వైతినిత్యం ।
తద్బ్రహ్మ నిష్కలమహం ప్రణతోస్మి నిత్యం॥

398. శ్లో॥ ప్రాతర్భజామి మనసా వచ సామగమ్యం ।
వాచో విభాంతి నిఖిలాయ దనుగ్రహేణ ।
యన్నేతి నేతి వచనై ర్నిగమా అవోచం ।
తం దేవదేవ మజ మచ్యుత మాహు రగ్ర్యం॥

399. శ్లో॥ ప్రాతర్నమామి తమసః పరమర్క వర్ణం ।
పూర్ణం సనాతనపదం పురుషోత్తమాఖ్యం ।
యస్మి న్నిదం జగ దశేష మఖండ మూర్తౌ ।
రజ్వాం భుజంగమ ఇవ ప్రతిభాతి సద్య॥

400. శ్లో॥ శ్లోకత్రయ మిదం పుణ్యం లోకత్రయ విభూషణం ।
ప్రాతఃకాలే పఠేద్యస్తు సగచ్ఛే పరమాంగతిం॥

ఇట్లు నిర్విశేష పరమాత్మ స్తుతి చేయవచ్చును.

401. శ్లో॥ ప్రాతఃస్మరామి లలితా వదనారవిందం ।
బింబాధరం పృథుల మౌక్తిక శోభినాసం ।
ఆకర్ణ పూర్ణ నయనం మణికుండ లాఢ్యం ।
మందస్మితం మృగమదోజ్వల ఫాలదేశం॥

402. శ్లో॥ ప్రాతర్భజామి లలితాభుజ కల్పవల్లీం ।
రత్నాంగుళీయ లసదంగుళ పల్లవాఢ్యాం ।
మాణిక్య హేమవలయాంగ దశోభమానాం ।
పుండ్రేక్షుచాప కుసుమేషు సృణీర్దధానాం॥

403. శ్లో॥ ప్రాతర్నమామి లలితా చరణారవిందం ।
భక్తేష్ట దాననిపుణం భవ సింధుపోతం ।
పద్మాసనాది సురనాయక పూజనీయం ।
పద్మాంకుశ ధ్వజ సుదర్శన లాంఛనాఢ్యం॥

404. శ్లో॥ ప్రాతస్తువేపరశివే లలితా భవానీం ।
త్రయంత వేద్య విదితాం కరుణానవద్యాం ।
విశ్వస్య సృష్టి విలయస్థితి హేతుభూతాం ।
విశ్వేశ్వరీం నిగమ వాఙ్మన సోతిదూరాం॥

405. శ్లో॥ ప్రాతర్వదామి లలితే తవపుణ్యనామ ।
కామేశ్వరీతి కమలేతి మహేశ్వరీతి ।
శ్రీ శాంభవీతి జగతాం జననీ పరేతి ।
వాగ్దేవతేతివచసా త్రిపురేశ్వరీతి॥

406. శ్లో॥ యశ్లోకపంచక మిదం లలితాంబికాయాః ।
సౌభాగ్య భోగ లలితం పఠతి ప్రభాతే ।
తస్మైదదాతి లలితా ఝటితిః ప్రసన్నా ।
విద్యాశ్రియం విపులసౌఖ్య మనంత కీర్తిం॥

ఇట్లు సవిశేష పరమాత్మ స్తుతి జేయవచ్చును. లేదా తనకు వచ్చినట్లు పద్య, గద్య, పాటలనేగాని జదువవచ్చును. ఏదియురానివారు పరమాత్మను గురించి నమస్కారమును జేయవలయును.

4. ఓపికయున్నవారు దేవతలను, అశ్వినీ కుమారులను, సప్తఋషులను, మన్వాది పుణ్యరాజన్యులను, ప్రహ్లాదాది భక్తులను, మహానదులను, కుల పర్వతములను, సముద్ర, గో, భూ, హిరణ్యములను దలచి వారికి నమస్కరించవలయును.

## శౌచ విధి

264. బహిర్దేశమందు శౌచమాచరింప జనునప్పుడు కాళ్ళకు పాదుకలు (చెప్పులు) దొడిగి, తలపై గుడ్డచుట్టి, జన్నిదము కుడిచెవుపై జుట్టి వీపున నివీతముగనుంచి కమండలోదకము జేకొని వెళ్ళవలయును. త్రోవయందలి మలమూత్రాదుల దప్పించుకొనుచు నడువవలయును. భూమిపై తృణాదులవేసి దానిపై మలవిసర్జన జేయవలయును. ఇంటియందు శౌచమాచరించునప్పుడు నియమిత మరుగు స్థలమందు (దొడ్డియందలి గుంటలో) మొదట పిరికెడు మన్నువైచి దానిపై మలవిసర్జన జేయవలయును. శౌచమందు మౌనము విధియగును. విసర్జన జేయునప్పుడు భూమివంక జూచుచుండవలెనేగాని దిక్కుల, నాకసము వంక జూడరాదు. కమండలోదకము దూరముగనుంచి మలవిసర్జన చేయవలయును. విసర్జన పూర్తియైన పిమ్మట మెత్తని మన్ను గుదమునకు రాచుకొనుచు కమండలోదకముచే మలము బోవువరకు ప్రక్షాళన గావించుకొనవలయును. శిశ్నము వామహస్తమున ధరించి కమండలోదకముచే గుద, శిశ్న ప్రక్షాళన గావించవలయును. పిదప జలాశయముజేరి శుద్ధోదకముచే హస్త పాద ప్రక్షాళన గావించవలయును.

2. మలమూత్రాదుల విసర్జన జలాశయ సమీపమందేగాని, జలంలో, త్రోవ లందు, దేవాలయావర్ణమందు, వృక్షచ్ఛాయలందు, పుట్టలందు, గోష్ఠము లందు జేయరాదు.

3. మలవిసర్జన దినమానమం దుత్తరాభిముఖముగ, రాత్రి దక్షిణాభి ముఖుడై జేయవలయును. అప్పుడు తన హస్తముల తలపై నుంచుకొన రాదు. రోగాతురుడైన మహావాతాది భయాదులందు దిఙ్నియములేదు. భూమిని ప్రార్థించి మలవిసర్జన జేయవలయును.

407, శ్లో॥ కేశవస్యార్ఘ్య భూదేవీ జగద్ధాత్రి వసుంధరా ।
విశ్వంభరా, క్షమాయస్మాత్త స్మాచ్ఛాద్యమలం త్యజేత్॥

తా॥ భూదేవీ నీవు కేశవున కర్ఘ్యారాలవు. జగత్తును పోషించు వసుంధరవు. విశ్వమును భరించెదవు, క్షమగల్గినదానవు యని స్తుతినిచేసి గడ్డిపరచి మలవిసర్జన జేయవలయును.

5. ప్రక్షాళనందు గుదమైదుసార్లు, లింగమును మూడుసార్లు, వామహస్త మొకసారి, మఱల రెండు హస్తముల రెండుమార్లు కడుగుకొనవలయును. ఈ శౌచవిధి స్త్రీ పురుషులకును, సమస్త వర్ణాశ్రమముల వారికిని సమా నము. రాత్రిపూట శౌచమం దీ విధి సగము గావచ్చును. ఆతురునికి, బాటసారికి దీనిలో సగమునందు సగమగును. యతి, బ్రహ్మచారులకు రెండంతలు. శౌచమందు శ్వాన, వరాహాది నికృష్ట జంతువులను, రజస్వలా దులను జూడరాదు. ఇట్టి శౌచవిధి తెలియకున్నచో జేసిన కర్మలు నిష్ఫ లములగును.

## దం త ధా వ న వి ధి

265. శౌచాంగము దంతధావనము. పూర్వోత్తర దిశలం దెందేని గూర్చుండియే దంతధావన మొనరించవలయును. నిలుచుండి, తిరుగుచునే గాని దంతధావన జేసికొనరాదు. దంతకాష్ఠము జేనెడు పొడుగు, పొట్టుతో నుండవలయును. పులుపు, వొగరు, చేదు, సుగంధముగల నేదైన భక్ష్యయోగ్యమగు వనస్పతిని దంతకాష్ఠముగ గైకొనవచ్చును. తాలహిం

తాదులు వర్జితములు, కుకుభామ్రాశోక కపిత్థాదులు దంతకాష్టములుగ జేకొనవచ్చును. సూర్యోదయాత్పూర్వమే దంతధావన గావించవలయును. తూర్పువైపు దంతధావనచేసిన ఆరోగ్యము, దక్షిణమందు రోగము, పశ్చిమ మందు దారిద్ర్యము, ఉత్తరమున భోగము గలుగును.

408. శ్లో॥ ఆయుర్బలం యశోవర్చః ప్రజాపశు వసూనిచ ।
బ్రహ్మ ప్రజ్ఞాం చ మేధాం చ త్వన్నో దేహి వనస్పతేః॥

తా॥ ఆయుష్యమును, బలమును, కీర్తిని, కాంతిని, సంతానమును, పశువు లను, ధనమును, బ్రహ్మజ్ఞానమును, బుద్ధిని మా కిమ్మని చెట్టును ప్రార్థించి దంతకాష్ఠమును దీసికొనవలయును.

2. అష్టమి, ద్వాదశి, చతుర్దశి, పర్వదినములు, పాడ్యమి, నవమి, జన్మ నక్షత్రములందు దంతకాష్ఠతో దంతధావన జేసికొనరాదు. నిషిద్ధదినములం దామ్రపత్రిముతో దంతధావన మొనరించవలయును. తర్జనీ (చూపుడు వేలు)చే దంతచాలన జేయరాదు. జేసిన పితృలకు హాని జేసిన వారగుదురు.

3. మధ్యమవ్రేలుచే దంతధావన జేసికొననలయును. దంతకాష్ఠమును ధావ నానంతరము చీల్చి పడవేయవలయును. పిదప పరిశుద్ధ జలముచే దంత ధావన పూర్తిచేయవలయును. గండూషముచే పూర్తియగును. ఇట్లే ప్రతిదిన మాచరించుట విధి యనబడినది. దీనితో శుచియగును. ఈ శౌచము స్నానాంగము. ధర్మశాస్త్ర కాండయందు స్నానము లైదు విధములని జెప్పబడినవి. వారుణీ స్నానము శక్తుని గురించి తక్కిన వశ క్తుని గురించి యందే వివరము గలదు. కాని వారుణీ స్నానవిధి వివర మచ్చుట జెప్పనందుల కిచ్చుట యీ స్నానవిధి వివరించనగుచున్నది.

## 1. స్నానసంధ్యా విధి

266. ఉదకమందు స్నానము జేయుట వారుణీ స్నానము. స్నానము, సంధ్యావందనము గలసిన దొక నిత్యకర్మయగును. స్నానసంధ్యల జేసిననే నిత్యకర్మలం దధికారియగును. నిత్యకర్మ లారువిధములు. ఇవి ప్రతిదినమం

దాచరించవలయునను విధిగలదు. ఉదయాత్పూర్వమే స్నానము జేయ వలయును.

409. శ్లో॥ స్నానం సంధ్యా, జపో, హోమో, దేవతానా చ పూజనం ।
ఆతిథ్యం, వైశ్వదేవం చ షట్కర్మాణి దినేదినే ।
షట్కర్మ నిరతో రాజ న్బ్రాహ్మణో నావసీదతి॥

తా॥ 1. స్నానసంధ్య 2. జపము 3. హోమము 4. దేవపూజ 5. అతిథి సత్కారము 6. వైశ్వదేవము ఇవి షట్కర్మలు. ఈ షట్కర్మల ప్రతిదిన మందాచరించుట విధి. అట్టి బ్రాహ్మణుడు దుఃఖపడడని భీష్ముడు ధర్మ రాజునకు జెప్పెను.

2. శ్లోకమందు క్రమవివక్షత లేదుగాన తగిన క్రమముగ షట్కర్మల సంగ్రహ వివరమిది :-

(1) స్నానవిధి=సముద్ర, నదీ, తటాక, కూప, భాండోదకములతో స్నానము జేయవచ్చును. ప్రతియుదక స్నానవిధులు వేరువేరు గలవు. సముద్ర స్నానమందు,

410. శ్లో॥ ఓం నమో విశ్వగుప్తాయ నమో విశ్వపరాయ తే ।
సాన్నిధ్యం కురు దేవేశ సాగరే లవణాంభసి॥

411. శ్లో॥ అగ్నిశ్చ తే యోని రిడా చ దేహో ।
రేతోఽథ విష్ణు రమృతస్య నాభిః॥

తా॥ విశ్వమును పాలించు విశ్వమున కుపకరించు ఉప్పునీళ్ళ రూపుడవైన సముద్రుడా నీకు ఓంకారపూర్వక నా నమస్కారము. నా సన్నిధి గైకొనుము. నీవు విశ్వమునకు కారణుడవు. నీవలన అగ్ని యుత్పత్తి యైనది. నీ శరీరమే చంద్రుడు. నీ రేతస్సు విష్ణువు. అమృతము నీయందే బుట్టినది.

2. ఇట్లు ప్రార్థించి ఒక నారళము, జన్నిదము, ఒకకాని (నయాపైస) సముద్రున కర్పించి స్నానము జేయవలయును.

3. సర్వత్ర నీళ్ళతో స్నానము జేయునప్పుడు రాత్రి ధరించిన వస్త్ర మొదలి రెండువస్త్రముల ధరించి (ఒకటి క్రిందికి, మఱొకటి ఉత్తరీయము)

స్నానము జేయవలయును. భాగీరథీ, గోదావరి మొదలగునవి మహా నదులు.

4. మహానదీ స్నానమందు నదికి నమస్కరించి, నదీ సమ్ముఖముగ, ఇతరత్రి తూర్పుముఖముగ స్నానము జేయవలయును. స్నానమునకు పూర్వము భైరవాజ్ఞ, తరువాత నదీ ప్రార్థనల జేయుటిట్లు :-

412. శ్లో॥ తీక్ష్ణ దంష్ట్ర మహాకాయ కల్పాంత దహనోపమ ।
భైరవాయ నమస్తుభ్య మనుజ్ఞాం దాతు మర్హసి॥

413. శ్లో॥ యోసౌ సర్వగతో విష్ణుః చిత్స్వరూపీ నిరంజనః ।
స ఏవ ద్రవరూపేణ గంగాంభో నాత్ర సంశయః॥

5. యనుచు, నమస్కరించి యజ్ఞోపవీతముగ (సవ్యముగ) జన్నిదముంచుకొని జుట్టు ముడివిప్పి నాభిదఘ్న జలమందు మునిగి స్నానమాచరించవలెను.

414. శ్లో॥ గంగా గంగేతి యోబ్రూయాద్యోజనానాం శతైరపి ।
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోక స గచ్ఛతి॥

యని గంగా స్నానమందు,

415. శ్లో॥ త్రియంబక జటోద్భూతే గౌతమస్యాఘ నాశిని ।
సప్తధా సాగరం యాతే గోదావరి నమోస్తుతే ॥

యని గోదావరి స్నానము.

6. ఇతర నదులందును, తటాక, కూపోదకాదుల స్నానమందు "యోసౌ" యను శ్లోకమాత్రమును జెప్పుచు స్నానము జేయవచ్చును.

7. భాండోదక స్నానమందైదు ఘటములందు దర్భమిశ్రజలము నింపి దానితో స్నానము జేయవచ్చును.

416. శ్లో॥ బ్రహ్మణో ముఖసాహస్రం శివలింగ శతాని చ ।
విష్ణోర్నామ సహస్రాణి శిఖాయాగ్రంధికే సదా ॥

(యనుచు మరల జుట్టు ముడికి వేసికొనవలయును.)

8. నదీజల మాచమనముజేసి తీర్థరాజైన వరుణునకు నమస్కరించి మూడర్ఘ్యముల నదీజలముతో నతని కర్పించవలయును. పిదప

417. శ్లో॥ త్వం రాజా సర్వతీర్థానాం త్వమేవ జగతః పితా ।
యాచితం దేహి మే తీర్థం సర్వపాపాపనుత్తయే॥

9. అనుచు మరల స్నానాచమనల జేసి దేశకాది సంకీర్తనతో నిత్య సంకల్ప మిట్లు జేయవలయును.

267. నిత్య సంకల్పము=శ్రీగోవింద గోవింద శ్రీమహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య, అత్రపృథివ్యాం, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోర్దక్షిణ దిగ్భాగే (ఎచ్చట నుండువా రచ్చట దేశసంకీర్తన) జెప్ప వలెను. ఉ॥ (శ్రీశైల స్యోత్తరేదేశే కృష్ణావైన్యాం కృష్ణా గోదావర్యో ర్మధ్యే దేశే) గంగాదినదీ గర్భే ఇతరనదీ తటాకాదులందు (తన్మధ్యే) యన వలయును. సమస్త దేవతా, బ్రాహ్మణ, హరి, హరసన్నిధౌ, బ్రహ్మణ ద్వితీయపరార్థే ప్రథమపాదే ప్రథమదినే అస్మిన్వ్యావహారిక (చాంద్రాది మానే) అప్పటికాల సంవత్సరే (ప్రభవాది)....అయనే....మాసే....పక్షే, తిథౌ, వారే, నక్షత్రే, యోగే, కరణే, ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ మమోపాత్త దురిత క్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం సర్వేషాం పాపానాం ప్రాయశ్చిత్తార్థం గంగాది నామములతో స్నాన మహంకరిష్యే అనుచు స్నానముజేసి నదికిని, సూర్యునకును అర్ఘ్యమియ్య వలయును.

418. శ్లో॥ బ్రహ్మకమండలుసంభూతే పూర్ణచంద్రనిభాననే ।
త్రైలోక్య వందితే దేవీ గృహాణార్ఘ్యం నమోస్తుతే॥ (గంగకు)

419. శ్లో॥ బ్రహ్మాద్రి శిఖరోత్పన్నే త్రికంటకవిరాజితే ।
గౌతమప్రార్థితే దేవి గృహాణార్ఘ్యం నమోస్తుతే॥ (గోదావరికి)

420. శ్లో॥ నమస్తే కమలనాభాయ నమస్తే జలశాయినే ।
నమస్తేస్తు హృషీకేశ గృహాణార్ఘ్యం మయా హృతం (సూర్యునకు)

10. మఱల స్నానముజేసి వారుణీ మంత్రముల నిట్లు జెప్పుకొనవచ్చును.

శ్రుతి ౨౬. "ఓం హిరణ్య శృంగం వరుణం ప్రపద్యే తీర్థమ్మే దేహి యాచితః ।
యన్మయాభుక్త మసాధూనాం పాపేభ్యశ్చ ప్రతిగ్రహః ।
యన్మే మనసా వాచా కర్మణావా దుష్కృతం కృతం ।

తన్న ఇంద్రో వరుణో బృహస్పతి స్సవితాచ వునంతు పునః పునః ।
నమోగ్నయేప్సు మతయే నమ ఇంద్రాయ నమో వరుణాయ ।
నమ వారుణ్యై నమోద్భ్యః యదపాం క్రూరం యదమేధ్యం।
యదశాంతం తదపగచ్ఛతాత్ అత్యాశనాదతీపానా ।
ద్యచ్చ ఉగ్రాత్ప్రతిగ్రహాత్ తన్నోవరుణో రాజా పాణినాహ్యవమర్శతు ।
సోహమ పాపో విరజో నిర్మక్తో ము_క్తకిల్బిషః ।
నాకస్య పృష్ఠ మారుహ్య గచ్ఛేద్బ్రహ్మ సలోకతాం ।
యస్యాప్సు వరుణః పునా త్వఘుమర్షణః పునాత్వఘుమర్షణః"

ఇట్లనుచు మునిగి స్నానము జేయవలయును. లేచి మరల నిట్లు.

శ్రుతి ౫౭. "ఇమమ్మే గంగేయమునేసరస్వతి స్తుతుద్రి స్తోమగ్ం ।
సచతాపరుష్ణియాఽసిక్ని యామృద్వృధేవిత_స్త యార్జికీయే ।
శృణుహ్యాగ్ంషోమయా"

అనుచు తర్జనీతో జలము జూపవలెను.

శ్రుతి ౫౮. "ఋతంచ సత్యంచాభీద్ధాత్తపసోధ్య జాయత ।
తతోరాత్రి రజాయత తతస్సముద్రోర్ణవః ।
సముద్రాదర్ణవః అధిసంవత్సరోజాయత ।
అహోరాత్రాణి విదధద్విశ్వస్య మిషతోవశీ ।
సూర్యాచంద్రమసౌ ధాతాయథాపూర్వ మకల్పయత్ ।
దివంచ పృథ్వీం చాంతరిక్ష మథస్సువః"

యనుచు నదీజలమం దంగుష్ఠముచే ప్రదక్షిణగా మూడుసార్లు జుట్టవలయును. మరల స్నానముజేసి "ఆపోహిష్ఠా"ది వారుణ మంత్రములను, "శుచీవోహ వ్యాది"పావమాన మంత్రములను జెప్పుకొనుచు స్నానము జేయవలయును.

శ్రుతి ౫౯. "అద్భ్రిం జ్వలతి జ్యోతిరహమస్మి ।
జ్యోతిర్జ్వలతి బ్రహ్మాహమస్మి ।
యోఽహమస్మి బ్రహ్మాహమస్మి ।
అహమస్మి బ్రహ్మాహమస్మి ।
అహమేవాహం జుహోమిస్వాహా"

యనుచు చేతిలో నీరుదీసికొని మ్రింగవలయును. స్వాహాంతమందని యర్థము.

శ్రుతి ఒం. "అకార్యకార్యవకీర్ణి స్తేనోభ్రూణ హాగురుతల్పగః ।
వరుణోపా మఘమర్షణః తస్మా త్పాపాత్ప్ర ముచ్యతే ।
రజోభూమి స్త్వమాగ్ం రోధయస్వః ప్రవదంతిధీరాః ।
ఆక్రా న్త్సముద్రః ప్రథమేతి ధర్మం జనయన్ప్రజా ।
భువనస్యరాజావృషాపవిత్రే అధిసానోస్యే బృహత్సో మెవావృధే
సువాన ఇందుః"

ఈ మంత్రము జెప్పుచు స్నానముజేసి దేవర్షి పితృతర్పణ స్నానాంగముగ జేయవలయును.

268. దేవతర్పణ పూర్వాభిముఖముగ సవ్యమున దోసిలితో నాల్గుసార్లు. (1) భూః (2) భువః (3) సువః (4) భూర్భువస్సువః దేవాగ్ స్తర్పయామి యనవలెను.

2. ఋషుల కు త్తరాభి ముఖముగ నివీతితో నంజలి తనవంక ద్రిప్పి పై జెప్పినట్లు నాలుగుసార్లు జేయవలెకాని అంతమందు భూఋషీగ్ స్తర్పయామి యనవలెను.

3. పితరులకు అపసవ్యముగ దక్షిణాభి ముఖుడై పై జెప్పినట్లే నాల్గంజలి కుడికి ద్రిప్పిన తర్పణలగును. కాని అంతమందు భూః పితౄగ్ం స్వధాన మ స్తర్పయామ్యనవలెను. పిదప నదే దిశవంక పైకి జూచుచు తన పితృ పితామహ ప్రపితామహుల నామ గోత్ర శర్మ శబ్దము, మాతృ, పితామహి, ప్రపితామహి నామగోత్ర పదశబ్దముచే, ఇట్లే మాతామహ మాతుః పితామహ మాతుః ప్రపితామహుల నామగోత్ర శర్మ శబ్దము, వారి భార్యలు మాతామహి, మాతుః పితామహి, మాతుః ప్రపితామహి నామ గోత్ర పదశబ్దముల జేర్చి యుచ్చారము జేయవలయును.

2. అపసవ్యముగనే స్నానము జేసి మరల సవ్యమగుచు స్నానమాడి ఆచమన క్రింది మంత్రమున జేయవలెను.

421. శ్లో॥ శరీరే జర్ఝరీ భూతే వ్యాధి గ్రస్తే కళేబరే ।
ఔషధం జాహ్నవీ (గౌతమీ) తోయం
వైద్యో నారాయణోహరిః.

౭౧. శ్రుతి॥ "ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వాభూతాన్యాపః ।
ప్రాణోవాఽపః పశవోన్నమాపోఽమృతమాపః ।
సం బ్రాడా పోవిరాడాపః స్వరాడాపో ఛందాగ్ం స్యాపః ।
యజూగ్ష్యాపో జ్యోతీగ్ ష్యాపోసత్యమాపో సర్వాదేవతా
భూర్భు వస్సువరాప ఓం" యనుచు స్నానము జేసినది నుండిలేచి.

422. శ్లో॥ యన్మయా దూషితం తోయ శారీర మల సంభవం।
తస్యపాప విశుద్ధ్యర్థం యక్షణాంతర్ప యామ్యహం.

తా॥ ఇట్లు చెప్పి దోసిలి యుదకము నదీయొడ్డుపై బడవేయ వలయును.

423. శ్లో॥ యేషు వృక్షేషు గుల్మేషు వర్తంతే పితరోమమ ।
తేషా మాప్యాయ నార్థాయ ఇదమస్తి శిఖోదకం.

తా. ఇట్లనుచు జుట్టి పిండిననీ ళ్లపసవ్యముగ నదీ యొడ్డుపై వేయ వలెను.

424. శ్లో॥ యేకేచాస్మత్కు లేజాతాఽ పుత్రాగోత్రిణో మృతాః ।
తే గృహ్ణంతు మయాదత్తం వస్త్ర నిష్పీడ నోదకం.

తా. ఇట్లనుచు నపసవ్యముగనే బట్ట పిండిన నీళ్ల నదీ యొడ్డుపై వేయ వలయును.

2. తరువాత మఱల నదీ స్నానము మౌనముగ జేసి ఆచమనము జేయ వలెను. ఉత్తీర్ణుడై తుడుచుకొని యంచులగల, ఖండింప బడనివి యగు రెండు శుభ్ర వస్త్రములు ధరించి శుచి ప్రదేశమందు సవ్యయజ్ఞోపవీతుడై గూర్చుండి ఉండాచమనముల (పూరాణోక్తస్మృత్యుక్త) జేసిన పరి శుద్ధుడు కర్మాధికారి.

## ఆ చ మ న వి ధి

269, ఆచమన భేదములు మూడివి:— 1. పురాణోక్తము 2. స్మృత్యుక్తము 3. శ్రుత్యుక్తము. వీనిలో పురాణోక్తము శౌచాంగము, స్మృత్యుక్తము కర్మాంగము, గాయత్రీ మంత్ర జప,బ్రహ్మయజ్ఞాంగ మైనది శ్రుత్యుక్తము.

1. పురాణోక్తమనగా = గోకర్ణాకృతిగ దక్షిణహస్త సంహతాంగుళి యగుచు (కుడిచేతి వేళ్లను గలిపి అంగుష్టమును మధ్య వ్రేలు మధ్యరేఖ కంటించ గనిది గోకర్ణాకారమగును) సవ్యముగ (జన్నిదమును యెడమ భుజము పైనుండి కుడిచేతికి క్రిందుగ వ్రేలాడగ) మినుపగించి మునుగు ప్రమాణమున జలము గైకొని చప్పుడు గాకుండునట్లు కేశవాది మూడు నామములతో మూడు మార్లు పానముజేసిన నిది పురాణోక్తాచమన మగును.

2. కేశవాయ స్వాహా, నారాయణస్వాహా, మాధవాయస్వాహా, ఇట్లు స్వాహాంతమున నీళ్లు పానము జేయునప్పుడు బ్రాహ్మణు డానీరు నాభి నంటుదనుక నాగి రెండవ, మూడవ సారి పానమట్లే జేయవలయును. క్షత్రియుడాచమన జలము హృదయము జేరువరకు, వైశ్యుడట్టి జలము కంఠగతమగు వరకు, శూద్రుడు పెదవుల స్పర్శయగువరకు ఆగుచు పానము జేయవలయును. పిదప గోవింద, మాధవ నామములచే నమః యనుచు క్రమముగ రుండు హస్తముల నొకదానిచే నొకటిని కడుగవలెను. మధు సూదన, త్రివిక్రమ నామాంతములందు నమః యనుచు దక్షిణహస్త అంగుష్ఠ మూలములచే పెదవులు మూసి దానిపై రెండు సార్లు దుడుచ వలయును. ఇదే హస్తముచే రెండుసార్లు శిరముపై నీళ్లు వామన శ్రీధర నామములతో జల్లుకొన వలయును. ఇట్లే హృషీకేశ నామముతో నొక సారి యెడమహస్త తలమందు కుడిచేత నీళ్లు జల్లవలెను. యట్లే నీళ్లు దీసికొని పద్మనాభాయనమః యనుచు రెండు పాదములపై చల్లవలయును. దామోదర నామముతో నట్లే శిరముపై యొకసారి జల్లవలెను. సంకర్షణ నామముతో పిడికిలివంచి పృష్ఠ భాగముచే మూసిన పెదవుల నంటవలయును. వాసుదేవ, ప్రద్యుమ్న నామములతో క్రమముగ కుడి యెడమ ముక్కు తిమ్మెల తర్జన్యంగుష్ఠముల గలిపి నంటవలయును. అనిరుద్ధ, పురుషోత్తమ నామములతో క్రమముగ కుడి యెడమ కన్నుల మధ్య మాంగుష్ఠముల గలిపి నంటవలయును. అధోక్షజ, నారసింహ నామములతో క్రమముగ కుడి యెడమ చెవుల బిలమున నంగుష్ఠ అనామి

కల గలిపి యంటవలెను. అచ్యుతాయనమః యనుచు కనిష్ఠికాంగుష్ఠముల గలిపి నాభి నొకేసారి స్పృశించవలెను. ఇట్లే జనార్దనాయనమః యని హస్తతలముతో నొకేసారి హృదయమును, ఉపేంద్రాయ, హరయే నమః యనుచు క్రమముగ కుడి యెడమ భుజములపై యన్ని వ్రేళ్లచే నంటవలయును. శ్రీ కృష్ణాయనమః యనుచు శిరముపై హస్తతలముచే నంటవలెను, ఇదే పురాణోక్తాచ మనము సర్వత్ర శౌచాంగముగ ననువర్తించును.

2. స్మృత్యుక్తాచమనము— పై జెప్పినట్లు గోకర్ణాకృతిగా నీళ్లు దీసికొని మౌనముగా మూడు సార్లాచమనము జేయవలయును. గోకర్ణాకృతిగ చమనము జేయుట విధిః జేయకున్న యానీటి పానము సురాపాన సమ మనబడినది. ఇట్లే కర్మయందు రెండు చేతుల మోకాళ్ల మధ్య మంచుట విధి యనబడినది.

సూత్రము ౩౨. "త్రిరాచామేద్విః పరిమృజ్య సకృదుప స్పృశ్యయత్సవ్యం పాణిం పాదౌ ప్రోక్షతి। శిరః, చక్షుషి, నాసికే, శ్రోత్రే, హృదయమాలభ్య అనగా పై జెప్పినట్లు మూడాచమనల చేసి అంగుష్ఠము గలియెని యన్ని వ్రేళ్ల గలపి నొకేసారి మూసిన పెదవులంటుట సకృదుప స్పృశ్య యగును. యెడమ హస్త తలమందు, రెండు పాదములపై నీళ్లను చల్లుట సవ్యం పాణిం పాదౌ ప్రోక్ష్య యనబడును. శిరః యనుచు నీళ్ల నెత్తిపై చల్లుకొనవలెను. చక్షుషి యనుచు మధ్య మాంగుష్ఠముల గలిపి కుడి యెడమ కన్నుల నంటుట, నాసికే యనుచు తర్జన్యంగుష్ఠములతో కుడి యెడమ ముక్కు తిమ్మెలంటుట, "శ్రోత్రే" యనుచు ననామికాంగుష్ఠముల గలిపి కుడి యెడమ చెవుల బిలములంటుట, హస్తతలముతో హృదయము నంట హృదయ మాలభ్య యనబడును. ఇదే యర్థము నీ క్రింది శ్లోకము దెలుపును.

**425. శ్లో॥ త్రిరాచామేదపః పూర్వం ద్విరు న్మృజ్యాత్తతో ముఖం ।**
**ఖానిచోప స్పృశే దద్భిరాత్మానం హృదయం శిరః.**

3. శుద్ధ్యాచమనము=మొదట గాయత్రీ మంత్ర పాదములందొక్కొక్క పాదముచే నొక్కొక ఉచమనము జేయవలయును. స్నానాంతమందు పైజెప్పినట్లు పానమగును. తరువాత నాపోహిష్ఠాది మంత్రములంద లొక్కొక్క పాదముచే పురాణోక్త విధానముగ చేతుల కడుగుట మున్నగునవి జేయవలయును. ఓం భూ యనుచు ముష్టినిపంచి పృష్ఠ భాగముతో నొకేసారి మూసిన పెదవుల స్పృశించవలెను. ఓంభువ, ఓగ్ం సువ యనుచు క్రమముగ కుడి యెడమ నాసికా బిలముల తర్జ న్యంగుష్ఠముల గలిపిన వ్రేళ్లతో నంటుట, ఓంమహః, ఓంజనః యనుచు మధ్య మాంగుష్ఠముల గలిపి కుడి యెడమ కన్నుల క్రమముగ నంటుట, ఓం తపః, ఓగ్ం సత్యమనుచు ననామి కాంగుష్ఠముల గలిపి కుడి యెడమ చెవుల బిలముల క్రమముగ నంటుట, ఓంతత్స వితుర్వరేణ్యా మనుచు కనిష్ఠి కాంగుష్ఠములగలిపి నాభి నొకేసారి యంటుట, ఓం భర్గోదేవ స్యధీ మహి యనుచు హస్తతలమున హృదయమంటవలెను. ఓంధీయో యోనః ప్రచోదయాత్, ఓమాపోజ్యోతీ రసో యనుచు కుడిచేతి యన్ని యంగుళములతో క్రమముగ కుడి యెడమ భుజములపై నంటుట, "అమృ తం బ్రహ్మ భూర్భు వస్సువరోం" యనుచు దక్షిణ హస్తతలముతో శిరపై నంటవలెను. ఈ శుద్ధ్యాచమనతో త్రివిధాచమనలు పూర్తి యగును.

2. త్రివిధాచమనల జేయువాడు పరిశుద్ధుడు కర్మాధికారి యగును. వామహస్తముచే నాచమనల జేయరాదు. కటి సూత్రము (మొల దారం) ఇతరులు ఉంచుకొనరాదు. (బ్రహ్మచారికి మాత్రముండ దగినది) గృహస్థాదులుంచుకొన న శ్రౌతస్మార్తాది కర్మలు వారు జేసినవి నిష్ఫలము లగును. ఈ యాచమన విధి త్రైవర్ణ్యులందరికిని, అన్ని యాశ్రమముల వారికిని, అనువర్తించును. స్నానానంతరమాచమనములు రెండు జేసి భస్మధారణ జేయవలెను.

270. భస్మధారణ విధము=భస్మమనగా గోమయ పిడకల గాల్చగ వెడలు తెల్లని శుభ్రమైన పొడి భస్మము. ఇది యగ్నిసంభూత మనబడును.

426. శ్లో॥ త్రైవర్ణికానాం సర్వేషా మగ్నిహోత్రి సముద్భవం ।
ఇదం ముఖ్యం గృహస్థానాం విరజానఽలజం భవేత్.

తా. త్రైవర్ణ్యులందరికిని అగ్నిహోత్రిమున బుట్టిన భస్మమగును కాని, గృహస్థునికి మాత్రము విరజా హోమముచే గాల్చబడిన భస్మము ముఖ్యమగును.

427. శ్లో॥ విరజానలజంచైవ ధార్యం ప్రోక్తం మహర్షిభిః ।
ఔపాసన సముత్పన్నం గృహస్థానాం విశేషతః.

తా. విరజాహోమాగ్నిచే బుట్టిన భస్మమునే ధరించుట ముఖ్యమని మహర్షులందురు. గృహస్థున కౌపాసనాగ్ని సముత్పన్నమైన భస్మ ధారణ విశేషమనిరి.

428. శ్లో॥ సమిదగ్ని సముత్పన్నం ధార్యం వై బ్రిహ్మచారిణః ।
శూద్రాణాం శ్రోత్రియాగార పచనాగ్ని సముద్భవం.

తా. సమిద్ధోమాగ్నిచే బుట్టిన భస్మధారణ బ్రహ్మచారులకగును. శ్రోత్రియ బ్రాహ్మణుని వంటాగ్ని నుద్భవించిన భస్మము శూద్రుడు ధరించ వలయును.

429. శ్లో॥ యతీనాం జ్ఞానదం ప్రోక్తం వనస్థానాం విరక్తకం ।
అతివర్ణాశ్రమీణాంతు శ్మశానాగ్ని సముద్భవం.

తా. భస్మధారణచే యతులకు జ్ఞానము, వానప్రస్థులకు వైరాగ్యము గలుగును. అవధూతలు శ్మశానాగ్ని ధరించవలయును.

271. "సద్యోజాతాది" పంచవేద మంత్రములచే వామహస్తతల మందు భస్మము గ్రహించి "అగ్నిరితి భస్మ, వాయురితి భస్మ, జలమితిభస్మ, స్థల మితి భస్మ, వ్యోమేతిభస్మ" అని చెప్పినదానియందు కొంచ ముదకము గలిపి "మానోమహాంతం మానోరుద్రరీరిషః" వరకు మంత్రించి "మాన స్తోకే... నమసా విధేమ" వరకైన మంత్రములతో రెండు హస్తములచే దుడిచి "త్రియంబకం యజామహే" యను మంత్రముచే దక్షిణ

హస్తాంగుష్ఠముచే లలాటమందు మధ్యరేఖ కుడి భ్రూనుండి యెడమ భ్రూ (కంటిబొమ్మ) వరకు గీతపడునట్లు గీయవలెను. ఈ గీత పైకి, క్రిందికి రెండు గీతలు పడునట్లు మధ్యమ, అనామిక రెండు వ్రేళ్లచే క్రమముగ యెడమనుండి కుడికి గీయవలయును. ఇట్లు మూడు రేఖలు లలాటమందు గనుపించవలయును. తరువాత భుజములందు, వక్షస్థలమందు, నాభి, పృష్ఠ భాగము, పాదాదులందల్లే భస్మరేఖలు గనుపించునట్లు గీయవలయును. గోపీ చందనము, తిరుమణి ధరించు వారూర్ధ్వ పుండ్రములు మూడు రేఖలు నుంచవలయును. శూన్యకపాల ముండరాదు.

2. స్త్రీలు స్నానమునకు పూర్వమే శౌచవిధి పై జెప్పి నట్లాచరించి సూర్యోదయాత్పూర్వము మంగళ స్నానము (నూనెరాచుకొని యుడుకు నీటితో) పసుపురాచుకొని జేయవలయును. శుభ్ర వస్త్రముల (చీర రవికె) ధరించి కుంకుమతో నలంకరించుకొన వలయును.

272. శుచి ప్రదేశమందు (అలికిన భూమిపై) చేలాజిన కుశోత్తరముగ నాసనముల పరచి దానిపై గూర్చుండి సంధ్యావందనము జేయ వలయును. దేవాలయ, నదీపులిన, పర్వతారణ్యాది ప్రదేశములు స్వతశ్శుద్ధ ప్రదేశములు, గృహాద్యితరములందు భూశుద్ధి మంత్రములతో జేసికొనవలయును.

## భూ శు ద్ధి

273. మనశ్శాంతిని భంగపరచు నానావిధ భూతములు భూమి నాశ్రయించి యుండును కావున విరోధికర భూతములను వెడలించుట భూశుద్ధి యందురు. భూశుద్ధిని గావింపకున్న కర్మలదంతరాయ మేర్పడవచ్చును.

430. శ్లో॥ ఉత్పతం త్విహభూతాని పృథివ్యాంతర వాసినః ।
ఆసనాదౌ నమస్కృత్య బ్రహ్మకర్మ సమారభే.

431. శ్లో॥ అపసర్పంతు తే భూతాయె భూతాభూమి సంస్థితాః ।
యే భూతా విఘ్నకర్తారస్తే గచ్ఛంతు శివాజ్ఞయా.

432. శ్లో॥ అపక్రామంతు భూతాని పిశాచాస్సర్వతో దిశం ।
సర్వేషామ విరోధేన బ్రిహ్మ కర్మ సమారభే.

433. శ్లో॥ తీక్ష దంష్ట్ర మహాకాయ కల్పాంత దహనోపమ ।
భైరవాయ నమస్తుభ్య మనుజ్ఞాందాతు మర్హసి.

2. పై శ్లోకములనుచు వామపాదగుదిచే (మడిమచే) కూర్చుండు స్థల మందు మూడుసార్లు తన్నవలయును. పిదప భూమిని నిట్లు ప్రార్థించ వలయును.

434. శ్లో॥ సముద్రివసనా దేవి పర్వత స్తన మండితే ।
విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే.

435. శ్లో॥ పృథ్వీత్వ యాధృతా లోకాదేవిత్వం విష్ణునాధృతా ।
త్వంచధారయ మాందేవి పవిత్రిం కురుచాసనం.

3. భూమి నిట్లు ప్రార్ధించి దానిపై ఆసనముల బరచి అందు గూర్చుండ వలయును. "దివ్యాసనాయనమః, అనంతాసనాయనమః, విమలాసయ నమః, యోగాసనాయనమః, కూర్మాసనాయనమః, అధారేశక్త్యైనమః, దుష్ట విద్రావిణే నృసింహాయనమః, మధ్యే పరమసుఖాయనమః" అనుచు నాది శేషునకు నమస్కరించ వలయును.

436. శ్లో॥ అపవిత్రిః పవిత్రోవా సర్వావస్థాంగ తోపివా ।
యస్మరేత్పుండరీకాక్షం సబాహ్యాభ్యం తరశ్శుచిః.

ఇట్లనుచు పరమాత్మను దలంచి నీళ్లల నంతట, ఆసనము క్రింద, తనపై చల్లుకొనగ పరిశుద్ధుడగుచు నిత్య కర్మాధికారి యగును.

2. నిత్య కర్మానుష్ఠాన మందుదర్భ పవిత్రి, సాగ్రదర్భల ధరించ వల యును. (బ్రాహ్మణుడు నాలుగు, క్షత్రియుడు మూడు, వైశ్యుడు రెండు, శూద్రు డొకటి) త్రైవర్ణ్యుల కుపనయనాధికారము గలదు. కాన వారు ప్రతిదినము సంధ్యావందనము జేయవలయును. శూద్రుడు ఉప నయ సంస్కారము లేనందున జేయరాదు. ద్విజులు త్రికాలములందు క్రమముగ మూడు సంధ్యలు సకాలమందే జేయుట ముఖ్యము. సకాల

మందు సంధ్యావందనముల జేయకుండిన ద్విజునకు ప్రాయశ్చిత్త మగును. సంధ్యావందనము నద్యాది జలాశయములందు జేయజాలనప్పుడు జల పాత్రలు మూడు. అవి సువర్ణ రజిత, తామ్రము లందేవైన గావచ్చును. (చంబు, గిలాసు, సురువలి మూడు).

## సంధ్యావందనము

274. ఆసనమందు గూర్చుండి రెండాచమనముల (పురాణోక్త స్మృత్యుక్త ముల) పై జెప్పినట్లు జేసి సంకల్ప మిట్లు జేయవలయును.

"పృథివ్యాః, మేరోపృష్ఠ ఋషిః, కూర్మోదేవతా, సుతలంఛందః, ఆసనే వినియోగః, అనంతాసనాయనమః ప్రణవస్య, పరబ్రహ్మ ఋషిః, పరమాత్మా దేవతా, దైవీగాయత్రీచ్ఛందః, ప్రాణాయామే వినియోగః, ఓంభూః, ఓంభువః, ఓగ్ంసువః, ఓంమహః, ఓంజనః, ఓంతపః, ఓగ్ంసత్యం, ఓంతత్స వితుర్వరేణ్యం, భర్గోదేవస్యధీమహి ధియోయోనః ప్రచో దయాత్, ఓమాపో జ్యోతీరసోఽమృతం, బ్రహ్మభూర్భువస్సువరోం" అను సశిరస్క, సవ్యాహృతిక, గాయత్రీ మంత్రముచే పూరక కుంభక, రేచక భేద త్రయయుత ప్రాణాయామ మొకటైనగాని జేయవలయును. (ప్రాణాయామ లక్షణము యోగ విచారమందు జెప్పబడినది).

2. దేశకాలాది సంకీర్తన పై జెప్పినట్లు జేయుట సంకల్పమనబడును, సంకల్పాంతమందు మమోపాత్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం కాలానుగుణ్య (ప్రాతర్మధ్యాహ్న, సాయం) "సంధ్యావందనం కరిష్యే" యనుచు దకము విడువలయును.

3. పిదప ద్విజులు వర్ణక్రమముగ ధర్భాగ్రములతో "ఆపోహిష్ఠా"ది మంత్రముచే తన పాద, ఉదర, శిరములందు మంత్ర పాదాంతమున జల్లు కొనవలెను. పిమ్మట గోకర్ణాకృతి గల్గిన హస్తతల మందు మాషమాత్ర జలము గైకొని ప్రాతస్సంధ్యయందు "సూర్యశ్చ" మంత్రమున మధ్యాహ్నిక సంధ్యయందు "ఆపఃపునంతు" సాయ సంధ్యయందు "అగ్నిశ్చమా

మన్యుశ్చ" యను మంత్రముల సకాలమందు జెప్పి మంత్రాంత మందా జలము నాచమన జేయవలయును.

4. మఱలనట్లే దర్భాగ్రములతో "దధిక్రావుణ్ణోఽకారిషం" ఇత్యాది "శివేనమాచక్షుషా" యను మంత్రాంతమువరకు ప్రతి మంత్ర పాదాంతము లందట్లే శిరోదర పాదమందు చల్లుకొనవలయును. పిదప పై జెప్పినట్లు ఉదకము దీసికొని "ద్రుపదాదివముంచతు, ద్రుపదాదివేన్ముముచానః, స్విన్నాత్స్వామలాదివ, పూతం పవిత్రేణై వాజ్యం, ఆపశ్శుంధంతు మైనసః" యని యా నీళ్లంబెడమ ముక్కునుండి దీసిన గాలిని విడిచి యా నీరు నైరుతి దిశయందు భూమిపై బడవేయవలయును. దీనిచే పాప పురుషు డుతనలో నుండి వెడలిపోయినాడను భావన. అనగా పై మంత్రమందు మూడుదాహరణలు పాప పురుష పరిశోధనార్థము జెప్పబడినవి. ద్రుపద మనగా నొకానొక కట్ట (మొట్టు) ఇది పూర్వకాలమందు శిక్షితుల బంధించుట కేర్పడినది. ప్రతి గ్రామమందు ధర్మాధికారి స్వాధీనములో నుంచుదురు. శిక్షితు కాళ్లు జొప్పించుటకు ద్రుపదమందు ఛిద్రము లుండును. దానిపై వేరు కట్టనుంచి ఛిద్రములందు చీలలు (మేకులు). బిగించుచుండిరి. హస్తములందట్టిదే బంధన యుండెడిది. శిక్ష పూర్తి యైన లేక రాజు మన్నించిన నాదు్రపదమునుండి శిక్షితుల విడుతురు. దు్రపదాదులనుండి వెడలించువారు ద్రుపదములనుండి వెడలినట్లు నా మనస్సు నందుండు పాప పురుషుడు దూరమగును గాత ఇది యొక ఉదాహరణ.

2. మలాపకర్షణకు జేయు స్నానము చేమలము దూరమగునట్లు పాప పురుషుడు వెడలిననే పరిశుద్ధుడనగుదును. ఇది రెండవ యుదాహరణ.

3. హోమార్థమాజ్య సంస్కారమందు ధర్భ పవిత్రతో నాజ్యము ప్రవిత్ర మైనట్లు (ఇది చతుష్పాత్ర ప్రయోగమందు గలదు) పాప పురుషుని పోకడచే నేను పవిత్రుడను ఇది మూడవ యుదాహరణ. ఇదే పై మంత్రార్థము.

275. పునరాచమన ప్రాణాయామము జేసి సూర్యునకు మూడర్ఘ్య ప్రదానముల జేయవలయును. ఉదయమందు నిలుచుండి, సాయంత్ర మందు గూర్చొని, మధ్యాహ్నమందైచ్ఛికముగ కాలానుసార మర్ఘ్యము లివ్వవలయును. ఉదయసంధ్య యందర్ఘ్యములు మూడు, గాయత్రీ మూడు పాదములతో గలిపి ఇదే విధముగా సాయం సంధ్య యందర్ఘ్యములు. మూడొక్కొక మంత్రముతో మధ్యాహ్న సంధ్యార్ఘ్య మొకటి "హగ్ స్స శ్శుచిషద్" అను మంత్రముతో పై రెండు గాయత్రి మంత్రములతో నిట్లు మూడర్ఘ్యముల జేయువలయును. సాయంకాలార్ఘ్యముల నీళ్లయందు విడువ రాదు. పరిశుద్ధ స్థలమందగును. సంధ్య అర్ఘ్య ప్రదానమువరకు నిత్యముగాన నాశౌచాదులందైనను విడువక విధిగా నాచరించవలయును. ఉద యార్ఘ్యము సూర్యోదయమైన యెడల, సాయమర్ఘ్యము తారకోదయ మైన యెడల ప్రాయశ్చిత్తము సంభవించును. అప్పుడు కాలాతిక్రమణ ప్రాయశ్చిత్తమునకై ఒక అర్ఘ్యము వేరుగ జేయవలయును. ఇది పై జెప్పిన నిత్యార్ఘ్యముల కంటెను పూర్వమే జేసి తర్వాత నిత్యార్ఘ్యముల నివ్వవలయును. కాలాతిక్రమణ దోషము త్రిసంధ్యలందు సమానము. పూర్వమే జేయు ప్రాయశ్చిత్తార్ఘ్యమును సంకల్ప పూరకమున జేయ వలయును (ఏకాలాతిక్రమణ యగునో నాకాల నామోచ్చారణ జేసి అర్ఘ్య పూర్వక అర్ఘ్య ప్రదానం కరిష్యే, లేదా ప్రాణాయ పూర్వక అర్ఘ్యప్రదానం కరిష్యే) యనుచు నుడువ వలయును.

2. కాలాత్రికమణ పక్షమం దేకాల సంధ్యకు కాలాతిక్రమణగాను లేదో యదే సంధ్య పూర్వమాచరించి పిదప కాలాతిక్రమణ సంధ్య జేయ వలయును. త్రికాలాతిక్రమణ యగునప్పుడు మొదటనుండి మూడు సంధ్యల క్రమముగ జేయవచ్చును. "రాత్రి ప్రహార పర్యంతం దివా సమాచరేత్" యను ప్రమాణము. దినద్వయాతి క్రమణ యందు ధర్మ శాస్త్రోక్త ప్రాయశ్చిత్త మగును. పదు దినము లతిక్రమించినచో మరల నుపనయ సంస్కారమే ప్రాయశ్చిత్తమగునని జెప్పబడినది. ప్రాయశ్చిత్త విధాన మాచరించని యెడల వానికి బ్రాహ్మణత్వముండజాలదు. కాన సకాలమందు సంధ్యావందన మాచరించుటే ముఖ్యధర్మము. సకాల

మందు బ్రాహ్మణుడు సూర్యునకర్ఘ్య ప్రదానముల జేయకున్న వానికి సూర్యహత్యా దోషమగును. సూర్యోదయమునుండి అస్తమయమువరకు మందేహులను రాక్షసులు సూర్యునితో యుద్ధము జేతురని బ్రాహ్మణము నందు కథగలదు. బ్రాహ్మణుడిచ్చు అర్ఘ్యము లుదక రూపబ్రహ్మాస్త్రము లనబడినవి. వానితో రాక్షసుల నోడించుటందవి సూర్యున కుపకరించును. అర్ఘ్య ప్రదానానంతరము మఱల దోసిలితో నుదకము గైకొని "ఉద్యంత మస్తం యంతమా దిత్యమభిధ్యాయన్" నిలబడి ఈ మంత్రమును జెప్పి ఆత్మ ప్రదక్షిణము జేసి యానీళ్లు దుకమందేగాని పరిశుద్ధ స్థలమందేగాని, పశ్చి మందుగాని విడువ వలయును. ఇట్టి మంత్రార్థజ్ఞునిక సమస్త మంగళములు గలుగును.

276. అర్ఘ్యములనిచ్చి ఆచమనము జేసి గాయత్రికి తర్పణలిట్లు :-

1. సంధ్యాం 2. గాయత్రీం 3. బ్రాహ్మీం 4. నిమృజీం "తర్పయామి" యనుచు నుదయ సంధ్యయందు తర్పణ జేయవలయును.

2. సంధ్యాం, సావిత్రీం, రౌద్రీం, నిమృజీం. యని మధ్యాహ్నమందు.

3. సంధ్యాం, సరస్వతీం, వైష్ణవీం, నిమృజీం. సాయం సంధ్యయందు.

2. తర్పణానంతరము మఱల నాచమన, ప్రాణాయామముల జేసి గాయత్రి హృదయము "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" యనుచు పఠించ వలయును. మంత్రాంతమందు ప్రాణాయామ పూర్వక శ్రుత్యా చమనము పైె జెప్పినట్లు జేయవలయును. ఋషిచ్ఛందో దేవతను క్రమముగ శిరము పై జిహ్వాయందు, హృదయమందు జేర్చుట హస్తముతో స్పృశించుటన బడును. పిదప గాయత్రీ మంత్రపాదములతోడ నంగన్యాస కరన్యాసము వానిచే హృదయాదిన్యాసము జేయవలయును. అనగా అంగుష్ఠమూల ముతో తర్జని గలిసిన అంగుష్ఠాభ్యాం నమః యని కరన్యాసము జేయ వలెను. అంగుష్ఠముచే తర్జని మూలమంటుట, తర్జనీభ్యాంనమః, ఇట్లంత టగును. అంగుష్ఠమును మధ్య వ్రేలును, అనామికను, కనిష్ఠికను గలుపు చనుచుండ వలెను. రెండు హస్తతలముల, వానితో పృష్ఠ భాగముల నంటుట కరతల కరపృష్ఠాభ్యాం నమఃయగును. రెండు హస్తములను

వ్యత్యస్తముగ బట్టి భుజముల నంటుట హృదయన్యాస మందలి హృదయాయనమః, అంగుష్ఠముగలయని నన్ని ప్రేళ్లను గలపి శిరమునంటిన శిరసేస్వాహా. దక్షిణ హస్తముష్టిచే తలకు ప్రదక్షిణగా జుట్టి వామహస్తతలమందు గొట్టుట శిఖాయై వౌషట్, అంజలి తలక్రిందుగ తనవంక ద్రిప్పిన కవచాయహుం, తర్జని, మధ్య, అనామికలతో క్రమముగ కుడికన్ను, లలాటము, యెడమ కన్నుల నంటుట నేత్రత్రయాయ వౌషట్, మూడు వేళ్లచే నొకేసారి (యుగపద్) స్పృశించ వలయును. దక్షిణవామ తల ప్రదక్షిణగా జుట్టి వామహస్తతలమందు చప్పుడగునట్లు గొట్టిన నిది హస్త్రాయఫట్. ఇదే లక్షణము మున్ముందూహించ వలయును. (అంతట అంగన్యాసాదులిట్లే యనబడును) పిదప జపము జేయుటకు పూర్వము మంత్రాధిష్ఠాన దేవతాధ్యాన మిట్లు :-

437. శ్లో॥ ముక్తా, విద్రుమ, హేమ, నీల, ధవళచ్ఛాయై ర్ముఖై స్త్ర్యక్షణై ।
ర్యుక్తాం ఇందునిబద్ధ రత్నమకుటాం తత్వార్థ వర్ణాత్మికాం ।
గాయత్రీం వరదాభయాంకుశ కశాం శుభ్రం కపాలంగదాం ।
శంఖం చక్రమథారవింద యుగళం హస్తైర్వహంతీం భజే,

2. సంధ్యాంగముగ జేయు గాయత్రిజపము వైదికము. దీనికి ముద్రలనవసర మందురు. కాని ఉపాసనాంగముగనైన, పురశ్చరణాదులందేగాని ముద్రలావశ్యకములు. ధ్యానముజేసి యిష్టమైనచో ముద్రల జేయవచ్చును. ముద్రలు 24. ఇవి :—

438. శ్లో॥ సుముఖం సంపుటం చైవ వితతం విస్తృతంతథా ।
ద్విముఖం త్రిముఖం చైవ చతుః పంచముఖం తథా ।
షణ్ముఖో౽ధోముఖం చైవ వ్యాపికాంజలికం తథా ।
శకటం యమపాశం చ గ్రథితం చోల్ముకోల్ముకం ।
ప్రలంబం ముష్టికం చైవ మత్స్య కూర్మవరాహకం ।
సింహాక్రాంత మహాక్రాంత ముద్గరం పల్లవం తథా.

277. ప్రాతస్సంధ్య జపము నిలబడి, సాయంగూర్చుండి, మధ్యాహ్నమైచ్ఛికముగ గాయత్రీ మంత్రావర్తన జపమనబడును. సహస్ర, శత, దశవారములైనగాని ప్రతిదినము గాయత్రిజపము విడువక జేయవలయును.

2. ఉదయమున పూర్వాభిముఖమున ఈశాన్యదిశ జూచుచు, నాభి క్రిందికి హస్తముంచి పర్వములందైన, మాలచేనైన గాయత్రీజపము లావర్తన జేయవలయును. సాయముత్తరాభిముఖుడై వాయవ్యదిశ జూచుచు హస్తము ముఖమువరకెత్తి గూర్చుండి జపించవలయును. మధ్యాహ్నమం దైచ్ఛికముగ హస్తము హృదయమందు జేర్చి జపించవలయును.

439. శ్లో॥ ప్రాతర్నాభిసమం కుర్యా న్మధ్యాహ్నే హృదయే తథా ।
సాయాహ్నే నాసికా గ్రైవ గాయత్రీ జపలక్షణం॥

3. ముముక్షుశ్రమిణులకు త్రిపాదాయత్రీజపమును విధించుటతో సంధ్యాంగమునగాని, ఉపాసనాదులందుగాని మూడు పాదములనే ఆవర్తన జేయవలయును. చతుర్థపాదము తురీయాశ్రమిణుల కుపాస్యము. బ్రహ్మయజ్ఞాంగముగ నితరులు జెప్పవచ్చును. ఆ పాదము బ్రహ్మయజ్ఞమందు చెప్పబడినది. వివర ముపాసనందుగలదు. మంత్రజపములం దర్థజ్ఞానయుక్తమైనది ముఖ్యము.

## గాయత్రి మంత్రార్థము

440. శ్లో॥ తదిత్య వాఙ్మనోగమ్యం ధ్యేయో య త్సూర్యమండలే ।
సవితు స్సకలోత్పత్తిః స్థితిసంహారకారిణః ।
వరేణ్య మాశ్రియణీయం యదాధారమిదం జగత్ ।
భర్గః స్వసాక్షాత్కారేణాఽ విద్యా తత్కార్యదాహకం ।
దేవస్య ద్యోతమానస్య స్వానందాత్క్రీడతోపివా ।
ధీమహ్య హంసఏవేతి తేనైవాఽభేద సిద్ధయే ।
ధియోంతఃకరణవృత్తిశ్చ ప్రత్యక్ప్రవరచారిణీ ।
ప్రచోదయాత్ప్రేరయేచ్ఛ ప్రార్థనే యం విశిష్యతే॥

తా॥ దేవస్య=ప్రకాశించునట్టి, సవితః=సూర్యునియొక్క, వరేణ్యం=పొగడదగిన, తత్=వాఙ్మనోతీతమైన, భర్గః=తేజస్సును, యః=ఎవడు, నః=మాయొక్క, దియః=బుద్ధులను, ప్రచోదయాత్=ప్రేరేపించునో వానిని, ధీమహి ధ్యానించుచున్నాము. అనగా నెవడు మా బుద్ధులను

ప్రేరేపించుచున్నాడో యా ఉత్పత్తి స్థితి లయ కారణుడైనట్టి, ప్రకాశించునట్టి, పొగడదగినటి, వాఙ్మనోతీతమైనట్టి, తేజస్సును ధ్యానింపుదుమని ప్రార్థన.

278. జపానంతరమందు ప్రాతఃకాలమున "మిత్రస్య" సాయంకాలమందు "ఇమం మేవరుణ" మధ్యాహ్నమందు "ఆసత్యేనరజసా" యను మంత్రములతో నుపస్థానము, తెలిసి యోపికయున్నవారు క్రమముగ "యోసౌత పన్నుదేతి", "భూఃప్రపద్యే", "ఆదిత్యోవా" యను మంత్రములనుకూడ నుపస్థానములుగ త్రిసంధ్యలందు పఠించవచ్చును.

2. అనంతరమందు "ఓంనమః ప్రాచ్యైదిశే" యను మంత్రములతో దిక్కులకు నమస్కరించవలయును. మఱియు నాత్మ ప్రదక్షిణముజేసి "నమో గంగాయమునయోర్మధ్యే" యను పాఠము "చతుస్సాగర పర్యంతం" యనువరకు జెప్పుట గ్రాయత్రీ వీడ్కోలనబడును. పిదప దక్షిణ హస్తము కుడిచెవిపై జేర్చి స్వశాఖాంతర్గత గోత్ర, స్వనామోచ్చారణతో "అహంభోఽభివాదయే" అనవలయును. అప్పుడక్కడనుండు పెద్దలకు గురువులకు నమస్కరించవలయును. ఇది యాజుషశాఖవారి సంధ్యావందన విధి. ఇతర శాఖీయులు స్వశాఖోక్త ప్రకారముగ నవే మంత్రములతో ఇదే విధముగ త్రికాలములందు సంధ్యావందనము సకాలముననే జేయవలయును. ధర్మశాస్త్రకాండయందు కాలనిర్ణయము జెప్పబడినది. అట్లే యాచరించవలయును. నిత్యకర్మలం దనగ జప, హోమ, దేవతపూజలందు, అతిథి సత్కారములందు, వైశ్వదేవమందు, స్నానసంధ్యాదులందు యజ్ఞోపవీతము సవ్యముగా నుంచుకొనవలయును. జుట్టుముడికి, గోచియుంచుకొనుట, మోకాళ్ళ మధ్యగ రెండుహస్తములుండుట నిత్యాదికర్మలందు విధి యనబడినది.

## యజ్ఞోపవీత లక్షణము

279. పరిశుద్ధదేశమందు (స్థలమందు) ద్భవించిన పత్తిచెట్టు పత్తితో జీవభర్తృకయగు బ్రాహ్మణి దీసిన దారము మూడువరుసల కలిపి మూడింటి

గుణించి తాల్చిన (పేనిన) నొక సూత్రమును మఱల మూడువరుసల జుట్టిదాని కొకముడివేసిన దిన యొక యజ్ఞోపవీతము (జన్నిదము) ముడిని బ్రహ్మగ్రంధి యందురు. ఇట్టి దొక జన్నిదము బ్రహ్మచారికి. గృహస్థునకు, వానప్రస్థునకు రెండు కర్మాంగముగ నొకటిట్లు మూడు యజ్ఞోపవీతములు (జన్నిదములు) జన్నిదము పొడుగు, పొట్టిగాక వామభుజముపైనుండి దక్షిణకటినంటువరకు వ్రేలాడుటకు తగినదిగ నుండవలయును. యజ్ఞోపవీతముల "ఆపోహిష్ఠాది" "పావమాన" సూక్తమంత్రములతో దడిపి యవి మోకాళ్ళకు చుట్టి ఇట్లు "ఓమితిబ్రహ్మ" యను మంత్రములతో అంగుష్ఠముచే ద్రిప్పుచు, పవిత్రమొనర్పవలయును. ప్రథమతంతునం దోంకారము, రెండవదానియం దగ్ని, మూడవదానియందు నాగము (సర్పము), నాల్గవదానియందు వాయువు, ఐదవదానియందు పితృదేవతలు, ఆరవదానియందు ప్రజాపతి, ఏడవదానియందు విష్ణువు, ఏనిమిదవదానియందు సూర్యుడు, తొమ్మిదవదానియందు విశ్వదేవతలుందురని నెఱుంగవలయును. తెలియకున్న ధరించినను బ్రాహ్మణత్వ ముండజాలదు.

2. దైనిక షట్కర్మలందు సవ్యముగ, పైతృక కర్మలం దపసవ్యముగ, మనుష్య ధర్మలందు నివీతముగ నుంచుకొనవలయును. జన్నిదముల నొకొకటిగా వేసుకొనవలయును. వేసికొనుటకు పూర్వము ఆచమన ప్రాణాయామ పూర్వకముగ సంకల్ప మొదలి "ఉదిత్యం జాత వేదసం" యను మంత్రముతో మోకాళ్ళకు జుట్టిన జన్నిదములు సూర్యునికి జూపించి మఱల మోకాళ్ళకు జుట్టియుంచి క్రిందిమంత్రముతో వేసికొనవలెను. "యజ్ఞోపవీతం పరమం పవిత్రం, ప్రజాపతేర్య త్సహజం పురస్తాదాయుష్య మగ్రియం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః" యనుచు ధరించి మరల నాచమన ప్రాణాయామ పూర్వకముగ నన్ని జన్నిదముల నిదే మంత్రముతో నొకొకటి ధరించవలయును.

3. సన్న్యాసికి యజ్ఞోపవీతములేదు. కాని కొందరు త్రిదండి సన్న్యాసులొక జన్నిదము ధరింతురు. యజ్ఞోపవీతము లేనివారి కే కర్మలం దధికారముండ జాలదు. ఉపనయన సంస్కారము లేని శూద్రులకు యజ్ఞోపవీతముండ

రాదు. దంభమానవర్జితుడై ధర్భపత్త్రిధారి యగుచు, యజ్ఞోపవీతము సవ్యముగ నుంచుకొని కచ్ఛ, కటివస్త్రము, పైకి యుపవస్త్రము, జుట్టు ముడి నెప్పుడుంచుకొను బ్రాహ్మణుడు భూదేవు డనఁబడును.

441. శ్లో॥ కర్మణ్యాధిక్ర తాయేతు వైదికే లౌకికేపివా ।
బ్రాహ్మణా భాసమాత్రేణ జీవంతే కుక్షిపూరగాః.

442. శ్లో॥ వామాం న దక్ష కట్యం తం బ్రహ్మ సూత్రం చ తద్విదః ।
అంతర్బహి రివాత్యంతం తత్వతంతు సమన్వితం.

443. శ్లో॥ నాభ్యాది బ్రహ్మరంధ్రాంతం ప్రమాణం ధారయే త్సుధీః ।
తేభిర్ధార్యమిదం సూత్రం క్రియాంగం తంతు నిర్మితం.

444. శ్లో॥ శిఖాజ్ఞానమయీ యస్య ఉపవీతం చ తన్మయం ।
బ్రాహ్మణ్యం సకలం తస్య నేతరేషాం తు కించన.

445. శ్లో॥ సూచనా త్సూత్రమిత్యాహు సూత్రం నామపరంపదం ।
తత్సూత్రం విదితం యేన స విప్రో వేదపారగః.

446. శ్లో॥ కర్మ ణ్యధికృతా యే తు వైదికే బ్రాహ్మణాదయః ।
తైశ్చ ధార్యమిదం సూత్రం క్రియాంగం తద్ధివైస్మృతం.

తా. సన్యాసులకు జ్ఞానమే సూత్రము. గృహస్థాదులు వైదిక కర్మాధి కారులగుటకు తంతు నిర్మితసూత్రము ధరించవలయును. సూత్రమనగ పరబ్రహ్మ అట్టిబ్రహ్మ జ్ఞానముగల వారికే బ్రాహ్మణత్వము, సకలము, గలదు గాని నితరులకదిగలు గజాలదు.

## భూ త శు ద్ధి

280. జపమునకు పూర్వాంగములైనవి, భూతశుద్ధి, పాప పురుష శోధన, ప్రాణప్రతిష్ఠ, అంతర్మాతృక, బహిర్మాతృకల న్యాసాదులతో తనయందు దేవతాన్యాసము లగును. మనస్సు నిష్కల్మషమై ప్రశాంతి యగునప్పుడే జపముల జేయనర్హుడగును. కావున భూతశుద్ధ్యాదులు జేసికొనవలయును.

1. క్రింది శ్లోకము నందలి ఒకొొక నామముతో పై జెప్పినట్లు కరన్యాస ముల జేయవలయును.

447. శ్లో॥ అంగుష్ఠాగ్రేతు గోవిందం తర్జన్యాంతు మహీధరం ।
మధ్యమాయాం హృషీకేశం అనామికాయాం త్రివిక్రమం ।
కనిష్ఠికాం న్యసేద్విష్ణుం కరమధ్యేతు మాధవం ।
ఏవం చ కర విన్యాసం సర్వపాప ప్రణాశనం.

2. ఓంభూః పాదాభ్యాంనమః, భువః జానుభ్యాంనమః, సువః కటిభ్యాం నమః, మహః నాభ్యైనమః, జనః హృదయాయనమః, తపః కంఠాయ నమః, సత్యం లలాటాయనమః, పరబ్రహ్మశిరసేస్వాహాః, ఓంకారస్సర్వతో యనుచు నంగన్యాసము గావించుకొన వలయును.

3. ఓం గుంగురుభ్యోనమః, పం పరమగురుభ్యోనమః, పం పరాత్పరగురుభ్యో నమః, పం పరమేష్ఠిగురుభ్యోనమః, యని గురువులకు నమస్కరించ వలయును.

4. దక్షిణ భుజే, గం గణపతయేనమః, వామభుజే, దుం దుర్గాయైనమః, దక్షిణ జానుని క్షం క్షేత్రపాలకాయనమః, వామజానుని, సం సరస్వత్యై నమః, హృదయే, అం ఆత్మనేనమః, పం పరమాత్మనేనమః, సం సత్వాత్మ నేనమః, రం రజాత్మనేనమః, తం తమాత్మనేనమః. ఇది శరీరమందు దేవతాదిన్యాసము దీనికై హస్తముతో జెప్పిన స్థానముల స్పృశించ వలయును.

448. శ్లో॥ నమోస్త్వనంతాయ నమోస్తు వేధసే ।
నమో వసిష్ఠాయ చ నమోస్తుశక్త్యై ।
పరాశరాయాథ నమోస్తు సాత్వతే ।
నమస్తేస్తు తే సత్యవతీ సుతాయ.

449. శ్లో॥ నమోగురుభ్యో గురుపాదుకేభ్యో ।
నమః పరేభ్యః పరపాదుకేభ్యః ।
ఆచార్యసిద్ధేశ్వరపాదుకేభ్యో ।
నమోస్తు లక్ష్మీపతిపాదుకేభ్యః.

281. పై శ్లోకములతో గురుధ్యానమును జేసి జుట్టు ముడి నీ క్రింది మంత్రముచే.

ఉ౨. శ్రుతి॥ "ఓంనమో మహాద్భ్యో నమోర్భకేభ్యో
నమో యువభ్యో నమ ఆశినే భ్యః
యజామ దేవాన్యది శక్నవామ మాజ్యాయసః ।
శం సమావృక్ష దేవాః.

"సర్వభూత నివారణాయ, సశరాయ[ప్రాః, సశార్ఙ్గాయ సుదర్శనాయాస్త్ర రాజాయ హుం ఫట్ స్వాహా'' యనుచు వేసికొనవలయును. పవిత్రతకై నీళ్ల నంటవలయును.

450. శ్లో॥ ధర్మకంద సముద్భూతం జ్ఞానా నాలేన శోభితం ।
ఐశ్వర్యాష్ట దళోపేతం పరం వైరాగ్య కర్ణికం ।
అధోముఖంతు హృత్పద్మం ప్రణవే నోర్ధ్వమున్నయేత్.

తా. ధర్మమూలము (కారణము) గాగలది, జ్ఞాననాళముచే శోభిల్లునది. అష్టైశ్వర్యములే దళములుగాగలది, వైరాగ్యమను కర్ణిక గాగలది, క్రింది ముఖముగనుండు నది హృదయ కమలము. దాని నోంకారమున ప్రాణాయామము జేసి పైకి వికసింప జేయవలయును. తరువాత :-

2. "ఏవం జీవాత్మానం సుషుమ్న నాడీమార్గేణకుళ ముద్రయాహంస ఇతి మంత్రేణ బ్రహ్మ రంధ్రం నీత్వాతత్ర పరమాత్మనా సహాసోహం భావేన సహైక్యం భావయేత్" అనగా కుంభక ప్రాణాయా మాభ్యాసముచే సుషుమ్నాయను నాడీ ద్వారమునుండి హృదయ కమలమందుండు జీవాత్మను దర్భ కట్టుముద్రతో (పొడుగుగా పైకిలేపి) బ్రహ్మ రంధ్రమందు జేర్చి యచ్చటి పరమాత్మను హంసస్సోహ మనుచు భావింపవలెను. ఇట్లు జీవాత్మ పరమాత్మల కైక్యమగును,

## పాపపురుష శోధన

457. శ్లో॥ బ్రహ్మ హత్యా శిరస్కం చ స్వర్ణస్తేయభుజద్వయం ।
సురాపానహృదాయుక్తం గురుతల్పకటిద్వయం ।
తత్సంసర్గ పదద్వంద్వమంగ ప్రత్యంగ పాతకం ।
ఉపపాతక రోమాణం రక్తశ్మశ్రు విలోచనం ।
అధోముఖం కృష్ణవర్ణ మంగుష్ఠ పరిమాణకం ।
ఖడ్గచర్మధరం పాపం వామకుక్షౌ విచింతయేత్.

తా. పాపపురుషునికి బ్రహ్మహత్య శిరస్సు, సువర్ణస్తేయము రెండు చేతులు, సురాపానముహృదయము, గురుతల్పగమన మనునది కటి (నడుము) ఉపపాతకములే రోమములు, మీసములు, కన్నులు, రక్తవర్ణములుగానుండును. వాని ముఖము క్రిందికి కాళ్లు పైకి యుండును. శరీర కాంతి నలుపురంగు, ఖడ్గ చర్మము శరీరము. వాడు వామకుక్షి యందు గలడని భావించి క్రింద జెప్పునట్లు వెడలించవలయును.

282. "యం" ఇతివాయు బీజేన షోడశవారం (16 సార్లు) వామ నాసాపుటేన సంశోష్య "రం" ఇత్యగ్నిబీజేన చతుఃషష్టివారం (64 సార్లు) కుంభకేన సందహ్యా పునర్ద్వాత్రింశద్వారం (32 సార్లు) "యం" ఇతిబీజేన దక్షిణ నాసాపుటేన తద్భస్మ బహిర్నిస్సార్య "వం" ఇతిబీజేన షోడశవారం (16 సార్లు) అమృతీ కుర్యాత్. అనగా ప్రాణాయామమందు "యం" అక్షరముతోనా పాపపురుషునిగాలిచే పీల్చి శోషించుటకు పదహారు సార్లా యక్షర మనవలెను. పిదప రెండు ముక్కులుమూసి కుంభకమందు "రం" అక్షరమును 64 సార్లనవలెను. దానితో వాడు భస్మమగును. మరల నా భస్మమును 32 సార్లు యం బీజముతో కుడి ముక్కునుండి గాలితో బయట విడువ వలెను. పిదప కుడిముక్కుచే మరల గాలి పీల్చునప్పుడు 16 సార్లు "వం" అక్షరమన వలయును. ఇట్లుభయ పార్శ్వములందు జేయుట యోగశాస్త్ర సమ్మతము దీనితో పాపపురుష శోధన యగును,

## ధా ర ణ వి ధి

283. 1. "పాదాది జాను పర్యంతం పృథివీ స్థానం చతురస్రం చతుర్దిక్షు లాంఛితంతన్మధ్యే పీతవర్ణం "లం" బీజయుక్తేన ధ్యేయాత్" అనగా పాదములనుండి మోకాళ్లవరకు పృథ్వీతత్వమది చతుష్కోణములుగ నాల్గు దిశలందుండును. ఆ పద్మము పీత వర్ణముగ నుండునందు మధ్యన "లం" బీజముగలదు. క్రింద జెప్పబడిన మంత్రముతో "లం" యను ధ్యానము జేయవలయును.

ఉ౩. శృతి॥ "ఓం స్యోనా పృథివి భవాన్వృక్ష రానివే శనీ యచ్ఛానః శర్మ సప్రథాః"
"లం" భూమ్యైనమః

2. "జాన్వాదినాభిపర్యంతమపాంస్థానం ధనురాకారముభయోః కట్యోః శ్వేత పద్మలాంఛితం తన్మధ్యే శ్వేత వర్ణం వం బీజయుక్తంధ్యేయాత్" అనగా మోకాళ్లనుండి నడుమువరకు జలస్థానము అది ధనురాకారముగ నుండును. ఉభయ పార్శ్వములందు తెల్ల వర్ణ పద్మముగల దందు క్రింది శ్రుతిచే వం బీజధ్యానము జేయనగును.

ఉ౪. శ్రుతి॥ "ఓం అప్సుమే సోమో అబ్రవీదం తర్విశ్వా నిభేషజా ।
అగ్నించ విశ్వశంభువ మాపశ్చ విశ్వభేషజీః" వం అద్భ్యోనమః.

3. "నాభ్యాది హృదయ పర్యంత మగ్నిస్థానం త్రికోణం స్వస్తికలాంఛితం తన్మధ్యేరక్తవర్ణం రం బీజయుక్తం ధ్యాయేత్" అనగా నాభినుండి హృదయమువరకు అగ్నిస్థానము. అది త్రికోణాకార పద్మము. స్వస్తికము వలె (卐) రక్తవర్ణముగ నుండునందు రం బీజమున క్రింది మంత్రో ధ్యానము జేయవలయును.

ఉ౫. శ్రుతి॥ ఓం అగ్నిం దూతం వృణీమహే హోతారం విశ్వవేదసం ।
అస్య యజ్ఞస్య సుక్రతుం" రం అగ్నయేనమః.

4. "హృదయాది భ్రూమధ్య పర్యంతం వాయుస్థానం షట్కోణం షడ్బిందు లాంచితం. తన్మధ్యే ధూమ్ర వర్ణం యం బీజయుక్తం ధ్యాయేత్"

అనగా హృదయమునుండి భ్రూమధ్యమువరకు వాయువు స్థానము అదియా రుకోణములు ఆరు దళములుగల పద్మము అది పొగరంగుగ నుండును అందు యం బీజముగలదు. కాన యం బీజముతో ధ్యానము జేయవలయును. మంత్రము క్రిందిది.

౬౬. శ్రుతి॥ "ఓం వాయోశ్శతంహరీణాం యువస్వ పోష్యాణాం ఉతవాతే సహస్రిణోరథ ఆయాతు పాజసా" యం వాయవేనమః.

5. భ్రూమధ్యాది బ్రహ్మరంధ్ర పర్యంత మాకాశ స్థానం వృత్తాకారం ధ్వజలాంఛితం నీలవర్ణం హం బీజయుక్తం ధ్యాయేత్ హం ఆకాశా యనమః. అనగా భ్రూమధ్యనుండి బ్రహ్మరంధ్ర పర్యంతము ఆకాశ స్థానము. ఆ పద్మము గుండ్రముగ ధ్వజము వలె నీలి వర్ణముగా నుండును. అందు "హం" బీజముగలదు. హం బీజమున ధ్యానము క్రింది మంత్రముతో జేయవలయును.

౬౭. శ్రుతి॥ "ఓం ఆదిత్ప్రత్న స్యరేత సో జ్యోతిష్పశ్యంతి వాసరం, పరోయదిధ్య తేదివి"

6. ధారణకై ప్రాణాయమమున క్రింది విధముగ బీజము లావర్త జేయవలయును.

(1) "పృథివీం పంచగుణం లం బీజేన షడుద్ధాత ప్రయోగేనాప్సు ప్రవిలాపయామి" లం, లం, లం, లం, లం, లం, యనుచు ఆరు సార్లనగ పృథివీ జయము.

(2) "చతుర్గుణాపః వం బీజేన పంచోద్ధాత ప్రయోగే ణాగ్నౌ ప్రవిలాపయామి" వం, వం, వం, వం, వం యను చైదుసార్లనగ జల జయమగును.

(3) "త్రిగుణం వహ్నిం రం బీజేన చతురుద్ధాత ప్రయోగేన వాయౌ ప్రవిలాపయామి" రం, రం, రం, రం యనుచు నాల్గుసార్లనగ. నగ్ని జయము.

(4) "ద్విగుణం వాయుం యం బీజేన త్రిరుద్ధాత ప్రయోగేణాకాశే ప్రవిలాపయామి" యం, యం, యం యనుచు మూడుసార్లనగ వాయు జయను.

5. "ఏకగుణమాకాశం హం బీజేన ద్విరుద్ధాత ప్రయోగేణా హంకారే ప్రవిలాపయామి" హం, హం, యని రెండుసార్లనగ నాకాశ జయము గలుగును. మఱల నన్నింటి జయమునకై "లం, వం, రం, యం, హం యనుచు 6 సార్లు కలిపి ఆవర్తన జేసిన యన్నింటి జయము గలుగును. (పంచ భూతము లొకదాని యందొకటి లయమై భూమినుండ్యాకసము వరకు విలయమగుచు నహంకార మాత్ర శేషమగును).

7. "తమ హంకారం మహత్తత్వే ప్రవిలాపయామి, తన్మమహత్తత్వం ప్రకృతౌ ప్రవిలాపయామి, తాం ప్రకృతిం పరబ్రహ్మణి ప్రవిలాపయామీత్యేవం ప్రవిలాప్య, నిత్యోహం, శుద్ధోహం, బుద్ధోహం, ముక్తోహం, సచ్చిదానంద స్వరూపోహం, బ్రహ్మై వాహమస్మి, అహం బ్రహ్మాస్మీతిచిరం భావయేత్" మూడుసార్లిట్లను కొనవలయును. మఱల.

8. "తస్మాత్సర్వజ్ఞాత్సర్వశక్తేఃపరబ్రహ్మణః సకాశాత్ప్రకృతిః, ప్రకృతేర్మహాన్మహతోఽహంకారః, అహంకారాదాకాశః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషదీభ్యోన్నం, అన్నాద్రేతః, రేతసః పురుషః, సవాఏష పురుషోన్న రసమయః", "ఇతిదేహోత్పత్తిం విభావ్య పునర్జీవాత్మానం హంస ఇతి మంత్రేణ సుషుమ్నానాడీ మార్గ ద్వారా బ్రహ్మరంధ్రాదానీయ, హృది ప్రతిష్ఠాపయేత్" ఈ విధముగ దలచుచు మఱల జీవాత్మను సుమ్నా నాడీ మార్గమున బ్రహ్మరంధ్రము నుండి దీసికొని వచ్చి హృదయమందు జేర్చియుంచవలయును.

"హంససోహం" యనుచు మూడుసార్లన వలయును.

## ప్రాణ ప్రతిష్ఠ

284. ప్రతివారు రాత్రినిద్రయందు (సుషుప్తియందు)అజ్ఞానమున లయమై (మరణించి) మఱల జాగ్రద్దశయందు (లేచినప్పుడు) బుట్టును. ఇట్లుప్రతి

దినము జనన మరణములు గలుగు చుండును. కావున జాగ్రిద్దశయందు నిత్యము పాణప్రతిష్ఠ జేసికొనగ నతడు కర్మాధికారియగును.

2. ''అస్యశ్రీ ప్రాణప్రతిష్ఠామహామంత్రస్య, బ్రిహ్మ, విష్ణు, మహేశ్వరాః, ఋషయః, ఋగ్యజు స్సామాధర్వాణి ఛందాంసి, పరప్రాణ శక్తిర్దేవతా, ఆంబీజం, హ్రీంశక్తిః, క్రోంకీలకం, స్వశరీరే ప్రాణప్రతిష్ఠాపనేవినియోగః, బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, ఋషిభ్యోనమః. శిరసి, ఋగ్యజు స్సామాధర్వణ ఛందోభ్యోనమః, ముఖే, పరప్రాణశక్తి ర్దేవతాయైనమః, హృదయే, ప్రాణప్రతిష్ఠాపనేవినియోగః, ఆంబీజమితిగుహ్యే, హ్రీంశక్త్యైనమః, పాదయో, క్రోంకీలకాయైనమః, సర్వాంగే "యనుచు క్రింది బీజములతోన్యాసాదుల జేసికొనవలయును.

(1) "ఓం, ఆం, హ్రీం, క్రోం=అం, కం, ఖం, గం, ఘం, ఙం, క్రోం, హ్రీం, ఆం, పృథివ్యప్తేజోవాయ్వాకాశాత్మనే. అంగుష్ఠాభ్యాంనమః". (హృదయే)

(2) ఓం, ఆం, హ్రీం, క్రోం=ఇం, చం, ఛం, జం, ఝం, ఞం, ఈం, క్రోం, హ్రీం, ఆం, శబ్దస్పర్శ, రూప, రస, గంధాత్మనే, తర్జనీభ్యాంనమః (శిరసే స్వాహా)

(3) ఓం, ఆం, హ్రీం, క్రోం= ఉం, టం, ఠం, డం, ఢం, ణం, ఊం, క్రోం, హ్రీం, ఆం, శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణాత్మనే. మధ్యమాభ్యాం నమః (శిఖాయైవౌషట్)

(4) ఓం, ఆం, హ్రీం, క్రోం=ఏం, తం, థం, దం, ధం, నం, ఐం, క్రోం, హ్రీం,ఆం, వాక్పాద, పాణి, పాయూపస్థానాత్మనే అనామికాభ్యాంనమః (కవచాయహుం).

(5) ఓం, ఆం, హ్రీం, క్రోం=ఓం, పం, ఫం, బం, భం, మం, ఔం, క్రోం, హ్రీం, ఆం, వక్తవ్యాదాన, గమన విసర్గానందాత్మనే, కనిష్ఠికాభ్యాం నమః (నేత్రత్రయాయ వౌషట్).

(6) ఓం, ఆం, హ్రీం, క్రోం=అం, యం, రం, లం, వం, శం. షం, సం, హం, క్షం, అః. క్రోం, హ్రీం, ఆం, మనోబుద్ధి, చిత్తాహంకారాత్మనే కరతలకరపృష్ఠాభ్యాం (అస్త్రాయ ఫట్) ఇది కరన్యాసము. ఇవే బీజములతో నైక్రమముగా హృదయాదిన్యాస మనబడినది. హృదయాది న్యాసానంత రము మఱల నీ క్రింది విధముగ బీజముల జెప్పవలయును.

(7) ఓం, ఆం, హ్రీం, క్రోం, యం, రం, లం, వం, శం, షం, సం, హం క్షం, అః=మమప్రాణ ఇహ ప్రాణాః. యనుచు హృదయమును హస్త ముచే స్పర్శ జేయనగును.

(8) ఓం, ఆం, హ్రీం, క్రోం, యం, రం, లం, వం, శం, షం, సం, హం క్షం, అః=మమ జీవ ఇహస్థితః.

(9) ఓం, ఆం, హ్రీం, క్రోం, యం, రం, లం, వం, శం, షం, సం, హం, క్షం, అః మమ ప్రాణ ఇహ ప్రాణాః మమ జీవ ఇహస్థితః మమసర్వేంద్రి యాణి, వాఙ్మనత్వక్చక్షుః శ్రోత్ర, జిహ్వాఘ్రాణ, వాక్పాదపాణి పాయూపస్థానాని స్వస్థానే ఇహైవాగత్య స్వస్వస్థానే చరం తిష్ఠంతు స్వాహా. యనుచు హస్తముచే శరీరావయవముల స్పర్శ జేయవలయును.

౬౮. శ్రుతి॥ "అమృతం వై ప్రాణా అమృతమాపః ప్రాణా ఏవ యథాస్థాన ముపాహ్వయే".

౬౯. శ్రుతి॥ "ఓమసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణమిహనో దేహి భోగం జ్యోక్పశ్యేమ సూర్య ముచ్చరంత మనుమతే । మృళయానః స్వస్తి" గర్భాదానాది పంచదశ సంస్కార సిద్ధ్యర్థం పంచదశ ప్రణ వావృత్తికరిష్యే.

452. శ్లో॥ రక్తాంభోధి స్థ పోతోల్లస దురు సరోజాధి రూఢాకరాబ్జైః ।
పాశం కోదండ మిక్షూద్భవ మథ గుణ మప్యం కుశం పంచబాణా ।
న్బిభ్రాణాఽసృక్కపాలంస్త్రినయనలసితా పీనవక్షోరుహాఢ్యా ।
దేవీ బాలార్క వర్ణా భవతు సుఖకరీ ప్రాణశక్తిః పరావః.

## అంతర్మాతృకాన్యాసము

285. (1) "అస్యశ్రీ అంతర్మాతృకా సరస్వతీ మహామంత్రస్య, బ్రహ్మ ఋషిః, గాయత్రీచ్ఛందః, అంతర్మాతృకా సరస్వతీదేవతా, హలోబీజం, స్వరశ్శక్తయః బిందవః కీలకం, మాతృకాన్యాసే వినియోగః. బ్రహ్మ ఋషయేనమః శిరసి, గాయత్రీచ్ఛందసేన మోముఖే, అంతర్మాతృక సరస్వతీ దేవతాయైనమో హృదయే, హలోబీజ మితిగుహ్యే, స్వరశ్శక్తయః పాదయోబిందవః కీలకాణి సర్వాంగే మాతృకాన్యాసే వినియోగః".

(1) "ఓం, అం, కం, ఖం, గం, ఘం, ఙం, ఆం. అంగుష్ఠాభ్యాం నమః (హృదయాయ)

(2) "ఓం, ఇం, చం, ఛం, జం, ఝం, ఞం, ఈం. తర్జనీభ్యాం నమః (శిరసేస్వాహా)

(3) ఓం, ఉం, టం, ఠం, డం, ఢం, ణం, ఊం. మధ్యమాభ్యాం నమః (శిఖాయవౌషట్)

(4) ఓం, ఏం, తం, థం, దం, ధం, నం, ఐం. అనామికాభ్యాం నమః (కవచాయహుం)

(5) ఓం, ఓం, పం, ఫం, బం, భం, మం, ఔం. కనిష్ఠికాభ్యాం నమః (నేత్రత్రయాయ వౌషట్)

(6) ఓం, అం, యం, రం, లం, వం, శం, షం, సం, హం, ళం, అః కరతలకరపృష్ఠాభ్యాం నమః" (అస్త్రాయఫట్) ఈ బీజములతో నిట్లే హృదయాదిన్యాసమైన పిదప.

(7) "ఓం, అం, ఆం, ఇం, ఈం, ఉం, ఊం, ఋం, ౠం, ఌం, ౡం, ఏం, ఐం, ఓం, ఔం, అం, అః. ఏతాన్షోడశ వర్ణాన్కంఠస్థానే షోడశ దళ పద్మేన్యాసయామి" యనుచు కంఠమందు స్పృశించవలయును. మఱల.

(8) ఓం, కం, ఖం, గం, ఘం, ఙం, చం, ఛం, జం, ఝం, ఞం, టం, ఠం. ఏతాన్ద్వాదశ వర్ణానహృదయస్థానే ద్వాదశదళపద్మేన్యాసయామి. అని హృదయ స్పర్శ.

(9) ఓం, డం, ఢం, ణం, తం, థం, దం, ధం, నం, పం, ఫం. ఏతాన్దశ వర్ణానాభిస్థానే దశదళ పద్మేన్యాసయామి, యని నాభిని స్పృశించ వలయును.

(10) ఓం, బం, భం, మం, యం, రం, లం ఏతాన్షడ్వర్ణాన్లిఙ్గ స్థానే షడ్దళ పద్మేన్యాసయామి. యనుచు లిఙ్గము స్పృశించవలయును.

(11) ఓం, వం, శం, షం, సం. ఏతాంశ్చతుర్వర్ణానాధారస్థానే చతుర్దళ పద్మేన్యాసయామి. యనుచు గుద స్పర్శ జేయవలయును.

(12) ఓం, హం, క్షం, ఏతద్వర్ణద్వయం భ్రూమధ్యగతే ద్విదళపద్మే న్యాసయామి. యనుచు బొమ్మల నడుమ స్పర్శ జేయవలయును. పిమ్మట ధ్యానమిట్లు.

453. శ్లో॥ ఆధారే లిఙ్గనాభౌ ప్రకటిత హృదయే తాలు మూలే లలాటే ।
దేవపత్రేషోడ శారేద్విదళ దశదళే ద్వాదశార్ధే చతుష్కే ।
వాసాంతే బాలమధ్యే డఫకఠ సహితే కంఠ దేశేస్వరాణాం ।
హంక్షంత త్వార్థయుక్తం సకల దళగతం వర్ణరూపంనమామి.

454. శ్లో॥ ఓం బంధూకాభాంత్రి నేత్రాం పృథు జఘనల సత్కుక్షి ముద్ర క్తవస్త్రాం
పీనోత్తుంగ ప్రవృద్ధస్త న జఘ న భరాం యవ్వనారం భరూఢాం ।
సర్వాలంకారయుక్తాం సరసిజవద నామిందు సంకాశంతమౌలి ।
మంబాం పాశాం కు శేష్టా భయ వరదకరా మం బికాంతాం నమామి.

## బహిర్మాతృకాన్యాసము

286. "అస్యశ్రీ బహిర్మాతృకా సరస్వతీ మహామంత్రస్య, బ్రహ్మఋషి, గాయత్రీచ్ఛందః, బహిర్మాతృకా సరస్వతీ దేవతా, హలోబీజాని, స్వరాశ్శక్తయః, బిందుః కీలకం, బహిర్మాతృకాన్యాసే వినియోగః. బ్రహ్మర్షయేనమః శిరసి, గాయత్రీ ఛందసే నమోముఖే, బహిర్మాతృకా దేవతా

ధ్యైనమో హృదయే, హలోబీజ మితిగుహ్యే, స్వరశ్శక్తయః పాదయో, బిందవః కీలకాణి సర్వాంగే మాతృకాన్యాసే వినియోగః".

2. "అంనమఃమూర్ధ్ని । ఆంనమఃముఖే । ఇంనమో దక్షిణనేత్రే । ఈంనమో వామనేత్రే । ఉంనమో దక్షిణకర్ణే । ఊంనమో వామకర్ణే । ఋంనమో దక్షిణనాసాపుటే । ౠంనమో వామనాసాపుటే । ఌంనమో దక్షిణగండే। ౡంనమో వామగండే । ఏంనమోఽర్ధ్వోష్టే । ఐంనమోధరోష్టే । ఓం నమోఽర్ధ్వదంతపంక్త్యౌ । ఔంనమోధోదంతపంక్త్యౌ । అంనమఃమూర్ధ్ని । ఆఃనమోజిహ్వాయాం । కం, ఖం, గం, ఘం, ఙం, ఏతాన్పంచ వర్ణాన్దక్షిణ హస్తే సంధ్యగ్రేషువిన్యాసామి । చం, ఛం, జం, ఝం, ఞం ఏతాన్పంచ వర్ణాన్వామహస్తే సంధ్యగ్రేషువిన్యాసామి । టం, ఠం, డం, ఢం, ణం ఏతాన్పంచ వర్ణాన్దక్షిణపాదే సంధ్యగ్రేషువిన్యాసామి । తం, థం, దం, ధం, నం ఏతాన్పంచ వర్ణాన్వామపాదే సంధ్యగ్రేషువిన్యాసామి । పంనమో దక్షిణపార్శ్వే । ఫంనమో వామపార్శ్వే । బంనమః పృష్ఠే । భంనమో నాభౌ । మంనమః ఉదరే । యం నమస్త్వగాత్మనే హృదయే । రంనమోఽ స్వగాత్మనేదోర్మూలే విన్యాసామి।లంనమో మాంసాత్మనే కకుదిన్యాసామి। వంనమో మేదాత్మనే కక్షుద్వయేన్యాసామి । శంనమః అస్థ్యాత్మనే హృదయాదిహస్తగుల్ఫేవిన్యాసామి । షంనమో మజ్జాత్మనే హృదయాదిపాద యుగళేన్యాసయామి । సంనమః శుక్రాత్మనేజఠరేవిన్యాసామి । హంనమః ప్రాణాత్మనే ముఖేవిన్యాసామి । క్షంనమో జీవాత్మనే సర్వశరీరేవిన్యాసామి" "ఓం భూర్భువస్సురోమితిదిగ్బంధః" ఇది న్యాసములన్నింటి కను వర్తించును గావున జెప్పవలయును. ధ్యానమిట్లు :-

455. శ్లో॥ పంచాశద్వర్ణభేదైర్విహితవదనాందోః పాదహృత్కుక్షివక్షో ।
దేశాం భాస్వత్కపర్దాకలిత శశికలా మిందుకుందా వదాతాం ।
అక్షస్రక్కుంభ చింతా లిఖిత వరకరాం త్ర్యక్షణాం పద్మహస్తాం ।
మచ్ఛాకల్పా మతుచ్ఛ స్తనజ ఘనభరాం భారతీం తాం నమామి॥

శ్రుతి ౬౯. "ఓం చత్వారి వాక్పరిమితాపదాని । తానివిదుర్బ్రాహ్మణాయే మనీషిణః । గుహాత్రీణి నిహితానేంగ యంతి తురీయం వాచో మనుష్యా

వదంతీ" యనుచు జెప్పుకొని యుదకప్రోక్షణదర్భలతో జేసికొనవలయును. ఇట్లు ప్రతిదిన మాచరించువాడు నిత్యాదిసకల కర్మల కధికారియగును.

2. "దేవోభూత్వా దేవాన్యజేత్" యను ప్రమాణముగ భూత శుద్ధ్యాదులచే శరీరము పవిత్రమై దేవుడనబడును. అర్థజ్ఞానపూర్వకముగ కర్మలాచరించుట ముఖ్యము. కావున పై జెప్పినట్లాచరించి పరిశుద్ధుడై జపాదిదైనిక షట్కర్మల నాచరించవలయును. అప్పుడే జపాదులు జెప్పిన ఫలముల నియ్యనవర్ధములగును.

## 2. జ ప ము

287. జప, జల్ప - వ్యక్తాయాంవాచి యనగా ధాత్వర్ధమున జప, జల్ప శబ్దములకు వాక్కు వ్యక్తమగునట్లుగ (వినబడునట్లుగ) పలుకుట కర్థము. ఒకే శబ్దము పలుసార్లుచ్చరించుట జపమనబడును. జపము వాఙ్మానస భేదమున రెండు విధములు. మానసవాచికములు మఱల రెండేసి విధములైనవి. 1. ఉపాంశువు 2. వైఖరి, వాచికభేదములు. మనన, ధ్యానములు మానసభేదములు.

456. శ్లో॥ జపస్తు ద్వివిధః ప్రోక్తో వాచికోమానస స్తథా ।
మానసో మననధ్యాన భేదా ద్వైవిధ్య మాశ్రితః॥

457. శ్లో॥ వాచికో పాంశు రుచ్చైశ్చ ద్వివిధః పరికీర్తితా ।
ఉచ్చైర్జపాదు పాంశుశ్చ సహస్రగుణ ముచ్యతే॥

458. శ్లో॥ ఉచ్చైర్జపశ్చ సర్వేషాం యథోక్త ఫలదోభవేత్ ।
నీచైః శ్రోత్రేణ చేన్మంత్రః శ్రుతశ్చే న్నిష్ఫలోభవేత్॥

తా॥ వాచిక మానసిక జపభేదములు రెంటిలో బిగ్గరగా నుచ్చరించుట కంటెను పెదవులపై మెల్లగ నుచ్చరించు జపములు వేయిరెట్లు గుణాధిక్యములగును. బిగ్గరగా నుచ్చరించు జపములకు జెప్పిన ఫలములు గలుగును. గాని యా మంత్రముల నీచులు వినిరేని యవి నిష్ఫలములగును.

459. శ్లో॥ మకారో మననశ్చైవ తకారస్త్రాణ ఉచ్యతే॥
మననత్రాణ యోగేన మంత్ర మిత్యభిధీయతే॥

తా॥ జపము లన్నివిధములైనవి మంత్రరూపములు. "మ" కారార్థము మంత్రము, "త" కారార్థము త్రాణము రెంటి యోగముచే (కూడికచే) మంత్రశబ్దము గలిగినది. మొత్తముమీద మననము జేయువారిని రక్షించునది మంత్రమని యర్థము.

2. ధ్యాన శబ్ద నిర్వచనము ఉపాసనారూపమైనందున దేవతాకాండయందు జెప్పబడినది. ఇచ్చట మననరూపమైన మంత్రజపముల వివరమగుచున్నది. మంత్రములొక యక్షరముగలది మొదలు అనేకాక్షరములుగలవి యుండును. ఇట్టి మంత్రములు సప్తకోటి మహామంత్రములు. ఇతరము లసంఖ్యాకములు. అన్నింటిని వివరించుట కశక్యముగాన నిచ్చట వైదిక పంచాయతన మంత్రముల మాత్రము జేర్కొనబడును.

460. శ్లో॥ మంత్రోహ్యేకాక్షరః పిండః కర్తర్యోద్వ్యక్షరామతా ।
వర్ణత్రయం సమారభ్య నవార్ణావధి బీజకః ।
తతో దశార్ణమారభ్య యావద్వింశతి మంత్రకాః ।
తతః ఊర్ధ్వం గతామాలాస్తా సుభేదోన విద్యతే॥

తా॥ ఒక అక్షరమేగలది పిండము, రెండక్షరములున్నది కర్తరి, మూడక్షరములనుండి తొమ్మిదక్షరములుగలది బీజకమంత్ర మందురు. పది మొదలుకొని యిరువదివరకు అక్షరములుగలది మంత్రకములందురు. ఆపైన నక్షరము లెన్నియుండినగాని యది మాలామంత్ర మనబడును.

288. ఇష్టదైవ స్వరూపధ్యానజపము నామాక్షరములు, ఆ యక్షరములే మంత్రములగును. వాని యావర్తన (పలుమార్లుచ్చరించుట) జపము. జపమునకు పూర్వము, మంత్రాక్షరములతో అంగన్యాసాదులు, దేవతా స్వరూపమును దెలుపు ధ్యానశ్లోకము జెప్పబడుచుండునందున వానిని ఆచరించియే జపముల జేయవలయును. ప్రతిమంత్రమునకు ఋషిచ్ఛందస్సు, దేవతానామరూపములుండును. అట్టి మంత్రముల నర్థజ్ఞాన సహితముగ గురువనుగ్రహముచే దెలిసికొని పైజెప్పిన విధముగ పరిశుద్ధుడై జపించగ యథోక్త ఫలములు గలుగును.

2. ప్రతి మంత్రాధి దేవత షడంగయుతుడు కావున అంగన్యాసాదులు జెప్ప బడినవి. షడంగములుగల దేవతా మంత్రములే వైదికములవి మహామం త్రములనబడును. ఇవే ఆత్మతత్వార్థమును బోధించగలవు.

461. శ్లో॥ సర్వజ్ఞతా, తృప్తి, రనాదిబోధః స్వతంత్రతా నిత్యమలుప్తశక్తిః ।
అనంతతా శక్తిర్విధే విధి జ్ఞాఃషడాహురంగాని మహేశ్వరస్య॥

తా॥ మంత్రాధిదైవతయైన మహేశ్వరునకు, 1. సర్వజ్ఞత 2. తృప్తి 3. అనాదిబోధ 4. స్వతంత్రత 5. అక్షీణమగుశక్తి 6. అనంతశక్తి. ఇట్లారు శక్తులే అతనికి అంగములు. కావున అంగన్యాసాదులు జెప్పబడినవి.

2. సంధ్యాంగమునగాక వేరుగ నుపాసనాదులందు జేయు గాయత్ర్యాది మహామంత్రముల కనేక శాపములు గల్గినవి. మహర్షులచే శాపవిమోచన మంత్రము జెప్పబడినది. కావున నుపాసనాదులందు శాపవిమోచనమంత్రి జపముజేసియే మూలమంత్ర జపాదుల జేయవలయును. అన్యధా యవి ఫలమియ్యజాలవు. ఉదాహరణ కిచ్చట గాయత్రి శాపవిమోచన మంత్ర మిట్లు :—

## గాయత్రీ శాపవిమోచన మంత్రము

289. "అస్యశ్రీ గాయత్రీ సర్వశాపవిమోచన మహామంత్రస్య । బ్రహ్మ, విష్ణు, మహేశ్వరా ఋషయః । గాయత్రీచ్ఛందః । గాయత్రీదేవతా । అకారంబీజం ఉకారంశక్తిః । మకారం కీలకం । బ్రహ్మ విష్ణు మహేశ్వర ఋషిభ్యోనమః శిరసి । ఋగ్యజుస్సామాథర్వణఛందాంసిముఖే । గాయత్రీ దేవతాహృదయే।అకారం బీజమితిగుహ్యే ॥ ఉకారంశక్తైనమఃపాదయోః। మకారం కీలకమితిసర్వాంగే । గాయత్ర్యా సర్వశాపవిమోచనార్థే విని యోగః॥

1. "సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయవై నమోనమః—అంగు ష్ఠాభ్యాం (హృదయాయ) నమః"

2. "వామదేవాయ నమోజ్యేష్ఠాయ నమశ్రేష్ఠాయ నమోరుద్రాయ నమః కాలాయనమః కలవికరణాయ నమోబలవికరణాయ నమోబలాయ

నమో బలప్రమథనాయ నమస్సర్వభూతదమనాయ నమోమనోన్మనాయ నమః"=తర్జనీభ్యాంనమః (శిరసేస్వాహా).

3. "అఘోరేభ్యోథ ఘోరేభ్యో ఘోరఘోర తరేభ్యస్స ర్వేభ్య స్సర్వశ్శ రేభ్యో నమ స్తే అస్తు రుద్రరూపేభ్యః"=మధ్యమాభ్యాంనమః (శిఖాయైవౌషట్)

4. తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి తన్నోరుద్రః ప్రచోదయాత్"=అనామికాభ్యాంనమః (కవచాయహుం)

5. "భవేభవే నాతిభవే భవస్వమాం భవోద్భవాయనమః"=కనిష్ఠికాభ్యాం నమః (నేత్రత్రయాయవౌషట్)

6. ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వభూతానాం బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మాశివోమేస్తు సదాశివోం" = కరతలకరపృష్ఠాభ్యాంనమః (అస్త్రాయఫట్). ఇట్లంగన్యాసాది హృదయాదిన్యాసాంతములజేసి క్రింది శ్లోకమున ధ్యానము జేయవలయును.

462. శ్లో॥ మహాసరస్వతీదేవీ మహాఫల ప్రదాయినీ ।
మహాశాపక్షయకరీ మహామంత్ర స్వరూపిణీ ।
శాపమోక్షకరీ శుభ్రే మంత్ర స్సిద్ధిరనుమతే॥

శ్రుతి ౨౦. "అదితిర్దేవా గంధర్వా మనుష్యాః పితరోఽసురాః । తేషాగ్ం సర్వభూతానాం మాతా మేదినీ మహతామహీ సావిత్రీ గాయత్రీ జగచ్ఛుర్వీ పృథివీ బహులా, విశ్వాభూతా, కతమాకాయా, సాసత్యేత్యమృతేతి వశిష్ఠః."

290. వైదిక సమ్మతములైన ఆగమోక్త పంచాయతన మహామంత్రము లివి :- 1. గణపతి 2. బాలా 3. విష్ణు 4. సూర్యుడు 5. దేవీ 6. శివుడు (గురువు) వీరే షట్చక్రాధిష్ఠాన దేవతలు, షట్చక్రముల కర్ణికలం దుందురు. ఇతర మంత్రములు శాస్త్రవిరుద్ధములు గాకుండునవి జపించవచ్చును. భానామతీత్యాదిహింసానృత్యప్రాధాన్యములైనవి నింద్యములుగాన నిషిద్ధములు. (జపించరాదు) జపించినచో నిహాపరలోక నిందితులగుదురు.

2. జపముల సంఖ్యానియమముచే లేక కాలనియమముగనైన జేయ వచ్చును. పురశ్చరణాదులందు సంకల్ప పూర్వక ఘటాదిస్థాపనానంతరము జపించవలయును. మంత్రి కవచాదుల గురు ముఖమున దెలిసికొన వచ్చును. నిష్కామనందు మూలమంత్ర మాత్రి జపముల జేయవచ్చును. మంత్ర జపసిద్ధియైన సకాముకుడైనచో ప్రతిబంధకము లేనప్పుడు కామనలు పూర్తియగును.

3. మంత్రజపములచే నాభిచారిక ప్రియోగాదుల జేయవచ్చును. కాని యవి అధర్మమైనందున నరక ప్రాప్తిని గలిగించును.

4. ఇతరులు తనపై ఆభిచారిక ప్రయోగము జేసినప్పుడు తన్నివారణార్థము ప్రితిక్రియా శూలిని (ప్రత్యంగిరా) జపము జేయవచ్చును. దీనితో అభిచారికములు దొలంగును. దీనిని నిష్కామనచే జేసిన సర్వసంకట నివారణగుచు జ్ఞానము గలిగించి మోక్ష మొసంగును. జపసంఖ్య దెలియుటకు మాలచే నైన, వేళ్ల పర్వసంఖ్యచే నైన జపించవచ్చును. వేళ్ల సంఖ్య కంటెను పర్వసంఖ్య (వ్రేళ్ల పై గల గీతల సంఖ్య) ఉత్తమము.

5. జపసిద్ధి గోరినచో లక్ష్యము కుదురునందాక ధ్యానశ్లోక ప్రికారముగ నిర్మించిన మూర్తుల జూచుచు జపించవలయును. మూర్తులు ధాతు నిర్మితములేగాని, పటములేగాని కావచ్చును.

463. శ్లో॥ అనామికాద్వయారభ్య ప్రిదక్షిణ్య క్రమేషుచ ।
తర్జనీమూల పర్యంతం గాయత్రిజప లక్షణం॥

తా. కుడిచేతి అనామిక వేళ్లు మధ్య పర్వమునుంచి క్రింది గీతల (రెండు క్రింది పర్వముల) కనిష్ఠికా క్రిందిగీతలపై లెక్కించు గలిపికొని మధ్యమ పై గీతకు అనామికా పై గీతనుండి అంగుష్ఠమును ద్రిప్పుచు తర్జనీ పై గీతల నుండి క్రిందికి దిగిననిది ప్రిదక్షిణ యగును. ఈ పది గీతలు సంఖ్యకు జెప్ప బడినవి. మఱల నావర్త జేయునప్పుడు అంగుష్ఠమును తర్జనీ క్రింది గీత నుండి విడిచియే అనామిక మధ్యగీతపై అంగుష్ఠము జేర్చవలయును. ఇదే పర్వసంఖ్య.

291. మాలసంఖ్య నూటెనమిది, మాలయందు నూటెనమిది పూసలుండ వలయును. అకారాదిక్షకారాంత వర్ణసంఖ్య 54. దీనికి రెట్టింపు 108. కావున మాలందు నూటెనమిది రుద్రాక్షలేగాని, ఇతర పూసలేగాని గూర్చ వలయును. మాలను గలుపుట కొకటి వేరు పూసను మేరువు అందురు. దానిచే జప సంఖ్యారంభమగును. కాని మేరువును దాటరాదు. అనగా మాలతో జపావర్తన జేయునప్పుడు మేరువు వరకే మాల ద్రిప్పి పిదప మేరువు వ్యతిరేకమైన క్రింది పూసనుండియే యవరోహణ జేయవలయును. (దిగవలయును) దీనినే ఆరోహణా వరోహణ పద్ధతి యందురు. ఇట్లు సంఖ్యావర్తన పూర్తి జేయవలయును. మాల ననామిక పైబెట్టి మధ్యమాంగుష్ఠములతో మాల పూసల లాగవలయును. తర్జని నంటించరాదు. గోముఖి (గుడ్డతో జేసిన గోముఖాకారము) అందు మాలనుంచుచు జపము జేయవలయును. లేదా వస్త్రాచ్ఛాదనగా నైన జేయవచ్చును. ఇట్టి మాలను అక్షమాలందురు.

464. శ్లో॥ అకారః ప్రథమోదేవీ క్షకారోన్త్యస్తు తత్పరః ।
అక్షమాలేతి విఖ్యాతో మాతృకావర్ణ రూపిణీ॥

తా. అకారమునుండి క్షకారమువరకు గలాక్షరములను మాలయందలి పూసలు బోలును. ఇట్లెంచియే మాతృకావర్ణరూపము అక్షమాల యని యందురు.

2. రుద్రాక్షల, తులసీకాష్ఠ నిర్మితముల, బంగారు నిర్మితముల, రత్న, స్ఫటిక, మౌక్తిక, ప్రవాళ, శంఖముల పూసలతో మాల జేసికొనవచ్చును. రుద్రాక్షలు జ్ఞాన ప్రదములు. ఇతరములు కామ్యమందు జేకొందురు. ఇష్టదేవత ప్రీతికరము లనబడినవి, ఆయా దేవతా మంత్రములందుపయోగించుటకు వాని వానితో మాల గూర్చుకొనవలయును.

3. రుద్రాక్షలు రుద్రాక్ష చెట్టు ఫలము లవి రుద్ర నేత్రముల బోలును. రుద్ర ముఖములవలె వానికి రేఖలుండును. వానియందు భేదములు 14 ఒక ఫలమునందొకే ముఖమునుండిన నది ఏకముఖి యనబడును. ఇది దుర్లభ

మందురు. నేపాల రాజ్యమున ఖట్మాండూ నగరమందు పశుపతి దేవాలయములో ఈశ్వరుని రుద్రాక్షమాలందీ యేకముఖి రుద్రాక్ష ఒక టేగలదు. దాని మహాత్మ్య మచ్చటివారు జెప్పుచుందురు.

465. శ్లో॥ ఏకవక్త్రంతు రుద్రాక్షం పరతత్వ స్వరూపకం ।
తద్ధారణా త్పరేతత్వేలీయతే విజితేంద్రియః॥

తా. ఏకముఖి రుద్రాక్ష పరతత్వ స్వరూపమది ధరించిన జితేంద్రియుడు పరతత్వమందే లీనమగును. ఇట్లితర ముఖముల రుద్రాక్షల ఫలములు జెప్పబడినవి.

466. శ్లో॥ చతుర్దశ ముఖం చాక్షం రుద్రనేత్ర సముద్భవం ।
సర్వవ్యాధి హరంచైవ సర్వదాఽరోగ్యమశ్నుతే॥

తా. పదునాల్గు ముఖములు గల రుద్రాక్ష రుద్రుని నేత్రమునుండి బుట్టినది. దాని ధరించిన సమస్త వ్యాధులు నశించును. ఎల్లప్పుడారోగ్య మనుభవించును. కావున రుద్రాక్ష మాలతో నేమంత్రములనైన జపించవచ్చును.

292. మూలాధార చక్రమునుండి పైకియుండు షట్చక్రములందు క్రమముగ గణపతి మొదలగు పంచాయతన దేవతలుందురు. వారి వారికి జెప్పబడిన మంత్రముల నారోహణ క్రమముగ జపముల కుపయోగించుటకై న్యాసాదులతో క్రింది విధముగ వివరింపబడును.

## 1. సిద్ధలక్ష్మీ సహిత మహాగణాధిపతి మంత్రము

(1) పృథివితత్వాధిపతి సిద్ధలక్ష్మీసహిత మహాగణపతి మూలాధారచక్ర కర్ణిక యందుండును. ఈ చక్రము రక్తవర్ణముగ నాల్గు దళములతో (రేకులతో) నుండును. నల్దిశలందుండు నాల్గు దళములలో తూర్పునుండి క్రమముగ వ, శ, ష, స వర్ణములొక్కొక రేకునందు గలవు. మధ్య కర్ణికయందు "గం" వర్ణముండును. ఇది గణపతి నామమును తెలుపును.

మూలమంత్రము = "ఓం, శ్రీం, హ్రీం, క్లీం, గ్లౌం 'గం' గణపతయే వర వరద సర్వజనం మేవశమానయ స్వాహా" ఇది మూలమంత్రము. సంపుటీ యుక్తమందురు. సంపుటీ, సంకలనమను రెండు భేదములు. బీజాక్షరములతో గలసియుండనది సంపుటీ, కేవల మంత్రము సంకలన మంత్రము. ఉః- ఈ మంత్రమందు "ఓం, శ్రీం, హ్రీం, క్లీం, గ్లౌం బీజాక్షరములుండుటచే నిది సంపుటీ మంత్రమనబడును. "స్వాహా" శబ్దము నామధేయార్థము. "గం గణపతయే వరవరద సర్వజనం మేవశమానయ" యను ఈ అక్షరములు సంకలన మాత్రములు. ఇందిరువదొక్క యక్షరము లుండుటచే నిది మాలా మంత్రమగును. ఇట్లే ముందుముందూహించ నగును.

2. గణపతి కనేక నామములుండునని సహస్ర నామాదులతో దెలియ వచ్చును. అందిదిసిద్ధలక్ష్మీసహిత శ్రీమన్మహాగణపతి మహామంత్రమందురు. మంగళార్థమున నోంకారమన్ని విధములైన మంత్రములకు జెప్పవచ్చును. ఇట్టి మంత్రమునకు గణకఋషిః, నిచృద్గాయత్రీ ఛందస్సు, సిద్ధలక్ష్మీ సహిత శ్రీమన్మహా గణపతి దేవత. గాం, గీం, గూం, గైం, గౌం, గః క్రమముగ నీ బీజములతో అంగన్యాస కరన్యాసాది హృదయాదాన్యాసాంతమగును. పైజెప్పి గం బీజమితి గుహ్యే, గీం శక్త్యైనమః పాదయోః, గూంకీలకాయనమః సర్వాంగే సిద్ధలక్ష్మీ సహిత గణపతి ప్రసాద సిద్ధ్యర్థే వినియోగః. ఇట్లు జెప్పి క్రింది శ్లోకమును ధ్యానార్థము పఠించవలయును.

467. శ్లో॥ బీజాపూరగ దేక్షుకార్ముక భుజాచక్రాబ్జ పాశోజ్వలాః ।
ప్రీహ్యగ్రస్వ విషాణరత్నకలశా ప్రోజ్యత్కరాం భోరుహా ।
ధ్యేయోవల్లభయాన పద్మకర యాశ్లిష్టోల్ల సద్భూషయా ।
విశ్వోత్పత్తి విపత్తి సంస్థితకరో విఘ్నేశ ఇష్టార్థదః.

ముద్రలివి :- దంత, పాశ, అంకుశ, అవిఘ్న, లడుక బీజాపూరగము.

3. లం పృథివీతత్వాత్మనే గంధం, హం ఆకాశతత్వాత్మనే పుష్పం, యం వాయుతత్వాత్మనే ధూపం, రం తేజస్తత్వాత్మనే దీపం, వం అమృత తత్వా

త్మనే నైవేద్యం, సం సర్వతత్వాత్మనే తాంబూలాదీన్సమర్పయామి యని పై జెప్పిన లమిత్యాదులిందు జెప్పవలయును. ఇది పంచోపచార పూజ యనబడును. మున్ముందన్ని జపలములందిట్లే యూహించు కొనవలయును.

4. గురు ముఖమున మంత్రమర్థయుక్తముగ తెలిసికొని జపించవలయును. అక్షర లక్ష జపముతో మంత్ర సిద్ధియగును. కలియుగమునందు నాల్గంతలు జపించిన సిద్ధియనిరి. జపసిద్ధికై దశాంశమున తర్పణ హోమాదుల జేయ వలయును. విఘ్నములు నశించి సర్వ సౌఖ్యములు జపమున కలుగును. ఈ నియమ మన్ని మంత్రములకు గలదని తెలిసికొనవలయును.

## 2. కుమార కామేశ్వరసహిత బాలా మంత్రము

293. సూత్రాత్ముడైన ప్రజాపతి కుమార కామేశ్వరుడు. శ్రీదేవి కుమారి బాల. వీరు మిశ్రితత్వాధిష్ఠాన దేవతలు (పృథివీ జలమిశ్ర) కేళీ లోలులు అనగా విశ్వోత్పత్తి స్థితిలయాదుల జేయుటే వీరికి యాటలు.

2. వీరు లిఙ్గస్థానమందుగల స్వాధిష్ఠాన చక్రమందుందురు. ఈ చక్రి మారు రేకులది. వానియందు బ, భ, మ, య, ర, ల ఆరు వర్ణములు క్రమముగ నుండును. తూర్పు, పడమర, ఉత్తర, దక్షిణములు నాల్గు పై దిశ, క్రింది దిశలతో నారగును. ఈ చక్రము పీతవర్ణము. పై వర్ణములు మంత్రాక్షరమునకు ప్రతినిధులు (బదులుగా జెప్పబడినవి) మూల మంత్రము మూడక్షరముల దైనను వ్యతీహారమున (క్రిందినుండి మఱల పైకి నుచ్చ రించగ) నారక్షరములగును. ఇట్లే జపము జేయవలయును.

మూ. "ఐం, క్లీం, సౌః, సౌః, క్లీం, ఐం. (వ్యతీహారావర్తన)

3. మంత్రాక్షరములతో అంగన్యాసాదులు పై జెప్పినట్లు జేయవల యును. ఐం బీజమితి గుహ్యే, క్లీం శక్త్యైనమః పాదయోః, సౌః కీల కాయైనమః సర్వాంగే కుమార కామేశ్వర సహితబాలత్రిపురసుందరీ ప్రసాద సిద్ధ్యర్థేజపే వినియోగః. యని లమిత్యాదులతో పూజించవలెను. ధ్యానమిట్లు.

468. శ్లో॥ మాలాశృణీ పుస్తక పాశహస్తాం ।
కాలాంబికాం శ్రీ లలితాకుమారీం ।
కుమార కామేశ్వర కేళిలోలాం ।
నమామి గౌరీం నవవర్గవేషాం.

ముద్రలు=మాల, శృణీ (తంబూర) పుస్తకము, పాశము, వరద, అభయము పై జెప్పినట్లు జపించిన జ్ఞాన వైరాగ్యాది, సకల సంపదలు గల్గును. గురుముఖమున మంత్ర మర్థయుక్తముగ దెలిసికొని జపించవలయును.

## 3. శ్రీరామ షడక్షరీ మంత్రము

294. శుద్ధజలతత్త్వాధిష్ఠాన దేవత విష్ణువు. అతని కనంత నామములు గలవు. ప్రతి నామ మంత్ర మిందు జేరును. శ్రీరామనామ మహాత్మ్యము చాలా గొప్పది. గాన నిందుదహరించబడినది. నాభియందు మణిపూరక చక్రముగలదది, నీలవర్ణముగ నుండును. ఆ చక్రమునకు పది రేకులుండును. డాదిఫాంత వర్ణము లా రేకులందు క్రమముగ నొక్కొక రేకు నందొక్కొక యక్షరముగలదు. కర్ణికయందు శ్రీరాముడుండును. (లక్ష్మీసహిత విష్ణువు) గురూపదేశముగ మంత్రము మంత్రార్థము దెలిసికొని పైవిధముగ జపించిన వారికి విష్ణుసాయుజ్యాది ఫలములు గలుగును. విష్ణు భక్తులకు బొంద రానిదేదియులేదు. అహింసా సత్యశమాదులు గలవారికే మంత్ర సిద్ధి యగును. రామనామము సర్వపాపహరము. మనశ్శాంతి యగును. రామ నామ మహాత్మ్యము బొగడశక్యముగా కుండును.

469. శ్లో॥ రకారోఽ నలబీజం స్యాద్యేనసర్వే బాడబాదయః ।
కృత్వామనోమలం సర్వం భస్మకర్మ శుభాశుభం.

470. శ్లో॥ అకారోభాను బీజస్స్యా ద్వేదశాస్త్రప్రకాశకః ।
నాశయత్యేవసాదీప్త్యా యాఽవిద్యా హృదయే తమః.

471. శ్లో॥ మకారశ్చంద్రబీజస్స్యాద్యద పాం పరిపూరణం ।
త్రైతాపం హరతేనిత్యం శీతలత్వం కరోతి యః.

తా. రకారవర్ణమనల బీజము. అదివాసనామయయములగు సమస్త శుభా శుభ కర్మల తత్కార్య సహితముగ భస్మము జేయును.

అకార వర్ణము భాను బీజము అది హృదయాంధకారమును బోగొట్టి శాస్త్రజ్ఞాన జ్యోతిని వెలిగించును. మకారాక్షరము చంద్ర బీజమైనందున నది తాపత్రయముల నడంచి శీతలత్వము (మనశ్శాంతిని) కలిగించును.

472. శ్లో॥ యథైవ వటబీజస్థం ప్రాకృతస్య మహాద్రుమః ।
తథై వరామబీజస్థం జగదేత చ్చరాచరం.
అగ్నిషోమాత్మకం రూపం రామబీజే ప్రతిష్ఠితం.

తా. గనుపించు వట వృక్షము దాని బీజమందెట్లు సూక్ష్మముగ నుండునో యట్లే "రామ" అక్షర బీజములం దీచరాచర జగత్తు గలదు.

473. శ్లో॥ బీజోక్త ముభయార్థత్వం రామనామ నిదృశ్యతే ।
ముక్తిదం సాధకానాం చ రకారో ముక్తిదో మతః.

474. శ్లో॥ మకారో భుక్తిదః ప్రోక్తః మారూపత్వాచ్చ సర్వదా ।
వదంత్యత స్తం సర్వేరామోఽయం భుక్తిముక్తిదః.

తా. రామ నామమం దుభయార్థములు గలవు. రకారము ముక్తిప్రద మైనందున రా యనగనే ముక్తిగలుగును. మ కారము మాయార్థముచే లక్ష్మి (సంపద) కావున భుక్తిఫలము గలుగును. ఇట్టి యర్థముననే యందరు రాముని భుక్తిముక్తిఫలప్రదాత యందురు.

475. శ్లో॥ ఆద్యోరా త్తత్పదార్థం స్యా న్మకార స్త్వం పదార్థవాన్ ।
తయో స్సంయోజనసీతి చతుర్థ్యర్థంతు యుజ్యతే.
తత్వమస్యాదివాక్యం తు కేవలం ముక్తిదం మతం.

తా. తత్వమసి వాక్యార్థము రామశబ్దార్థము. వీనిలో "రా", "తత్" పదమునకు బదులు వాచకము-వాచ్యార్థ లక్ష్యార్థములు రెంటికి సమానము "మ", "త్వం" పదమునకు బదులు వాచకముభయార్థములు సమానము. అసి పదమునకు బదులు చతుర్థ్యర్థమనగా "రామాయనః" అను వాక్యము

నందలి (య) అక్షరము "కొఱకని" యర్థమిచ్చును గాన "రా", "మ" లను గలుపునది, (నియమించునది) "య", "అసి"కి బదులని తాత్పర్యము.

476. శ్లో॥ అకారాక్షరసంభూతో సౌమిత్రి ర్విశ్వభావనా ।
ఉకారాక్షరసంభూత శ్శత్రుఘ్న స్తైజసాత్మకః.

477. శ్లో॥ ప్రాజ్ఞాత్మకస్తు భరతః మకారాక్షరసంభవః ।
అర్థమాత్రాత్మకో రామో బ్రహ్మానందైకవిగ్రహః.

తా. ఓంకారాక్షరమందలి అ, ఉ, మ, అక్షరములతో లక్ష్మణ, శత్రుఘ్న, భరతులు క్రమముగ బుట్టిరి. వీరికే క్రమముగ విశ్వ, తైజస, ప్రాజ్ఞులని, స్థూల, సూక్ష్మ కారణ శరీరాభిమానులని యర్థము. ఓంకారము పై గల నర్ధమాత్రానుస్వార స్వరూపుడు శ్రీరాముడు, బ్రహ్మానంద స్వరూపుడు. ఓంకారాక్షరములకు బదులై ర, అ, మ అక్షరములగును. వీని కలయిక (సంయోగము) రామ శబ్దము. గాన పరబ్రహ్మానంద స్వరూపుడు శ్రీరాముడని తాత్పర్యము.

478. శ్లో॥ శ్రీరామసాన్నిధ్య వశాజ్జగ దాధారకారిణీ ।
సా సీతా భవతి జ్ఞేయా మూలప్రకృతిసంజ్ఞితా ।
ప్రణవత్వా త్ప్రకృతిరితి వదంతి బ్రహ్మవాదినః.

తా. శ్రీ యనగా సీతాదేవి మూలప్రకృతియగును. ఇదే రాముని సన్నిధాన మందుండుటచే జగత్తునకాధారమైనది. ఉత్పత్తి స్థితి లయాదుల జేయుచున్నది. పరబ్రహ్మ "ఈక్షణ" మాత్రకారణుడని తాత్పర్యము.

2. పరబ్రహ్మార్థమునిచ్చు శ్రీరామనామమంత్ర మితర విష్ణునామ మంత్రములలో శ్రేష్ఠమగుచున్నది. సర్వవర్ణాశ్రమిణుల కాదరణీయ మైనది.

మూ. "ఓం శ్రీరామాయనమః" ఈ మూలమంత్రమునకు బ్రహ్మా ఋషి, గాయత్రీ చ్ఛందస్సు, శ్రీరామోదేవత, రాం బీజం, శ్రీం శక్తిః, నమః కీలకం శ్రీరామచంద్ర ప్రసాదసిద్ధ్యర్థేజపే వినియోగః. న్యాసాదులు పూర్వోక్తగ మంత్రాక్షరములతో చేయవలయును.

3. పై జెప్పిన విధముగ నీమంత్రము నర్థయుక్తముగ గురువుతో దెలిసి కొని జపము జేయవలయును. పాపాతి పాపులైనగాని రామ నామ స్మరణచే శుద్ధులైనటు వాల్మీకికథయే సాక్షి. ధ్యానశ్లోకమిట్లు జేయ వలెను.

479. శ్లో॥ కాలాంబోధరకాంతికాంతమతులం వీరాసనాధ్యాసితం ।
ముద్రాం జ్ఞానమయీం దధాన మపరం హస్తాంబుజం జానునీ ।
సీతాం పార్శ్వగతాం సరోరుహకారాం విద్యున్నిభం రాఘవం ।
పశ్యంతీం మకుటాంగదాదివివిధాకల్పోజ్జ్వలాంగం భజే.

ముద్రలు = శ్లో॥ శంఖం చక్రం గదా పద్మం యోనిగారుడకౌస్తుభం ।
శ్రీవత్సవనమాలం చ నవముద్రాః ప్రకీర్తితః.

తా. శంఖము, చక్రము, గద, పద్మము, యోనిముద్ర, గరుడముద్ర, కౌస్తుభము, శ్రీవత్సముద్ర, వనమాల లివి నవముద్రలు.

4. ఈ మంత్ర మక్షర లక్ష, ఇప్పటి కాలమందు నాల్గింతలు జేసి దశాంశ హోమ తర్పణాదుల జేసిన నహింసాసత్యాశమదమాదులు గలవారికి సిద్ధి యగును.

## 4. సూర్యఅష్టాక్షరీ మహామంత్రము

295. అగ్నితత్వాధిష్ఠానదేవత సూర్యుడు. హృదయ కమలమునం దనాహత చక్రము గలదది పండ్రెండు రేకులది. దాని వర్ణము రక్త వర్ణము. ఆ రేకులందు కాదిఠాంత వర్ణములుండును. సూర్యుని ప్రకాశము త్రి లోకములందు సమానముగాన దశ దిశలతో పై గల నంతరిక్షముతో (ద్యులోకము) భూమి క్రిందికి పాతాళము (అధోదిశ) గలిపిన 12 దిశ లగును. వానికి బదులుగ 12 రేకులందు క్రమముగ 12 అక్షరములు గల వని యర్థము జేయవచ్చును. గురుముఖమున మంత్రమర్థయుక్తముగ దెలిసికొని పై జెప్పిన విధముగ జపించవలయును.

మూ. "ఓం ఘృణిస్సూర్యాదిత్యాయనమః".

ఈ మంత్రమునకు దేవభాగఋషిః, త్రిష్టుప్ఛందస్సు, సవితా దేవత. సవితా సూర్యనారాయణ ప్రసాధసిద్ధ్యర్థే జపే వినియోగః. మంత్రమందలి ఘృణిః, సూర్యః, ఆదిత్యః ఈ మూడు శబ్దములు, బీజములు వీనితోడనే అంగ న్యాసాదులు పైజెప్పినట్లు జేయవలయును.

480. శ్లో॥ రక్తాబ్జయుగ్మాభయదానహస్తం ।
కేయూరహారాంగదకుండలాఢ్యం ।
మాణిక్యమౌళిం దిననాథ మీడే ।
బంధూకకాంతిం విలస త్రినేత్రం.

ముద్రలు—వ్యోమ, రతి, పద్మ, మహాశ్వేత, అస్త్రము. ధ్యాన శ్లోకము పఠించి జపించవలయును. పై జెప్పినట్టి సంఖ్యగ జపమగును, ఆరోగ్యాది ఫలములు గలుగును.

# 5. శ్రీ విద్యాపంచ దశాక్షరీ మహామంత్రము

296. ప్రాణవాయుతత్వము శక్తి, కంఠమందు పదహారు దళములతో విశుద్ధ చక్రముగలదు అందధిష్ఠాన దేవతాశక్తి యందురు. ఆ చక్రదళము లందు క్రమముగ నొక్కొక రేకునం దొక్కొక యక్షరముండును. ఆ యక్షరములు స్వర వర్ణములు (అచ్చులు) విశుద్ధచక్రవర్ణము ధూమ్రముగాన స్వర వర్ణములు ధూమ్రవర్ణముగానుండును. శక్తులనంతములై నందున శక్తినామరూపము లనంతములు. వేద విరుద్ధము లేని తాంత్రికపంచాయ తనములందు దేవి యొకాయతనము. శ్రీ విద్యలందు పంచ దశాక్షరీవిద్య వేదవిరుద్ధము కానిది, వైదిక పద్ధతిచే దేవీయుపాసనార్థము పంచదశా క్షరీజపము జేయవలయును.

481. శ్లో॥ సామాన్యం పరమం చేతి ద్వేరూపేవిద్ధి మే నఘ ।
పాణ్యాదియుక్తం సామాన్యం యస్తుమూఢా ఉపాసతే.

482. శ్లో॥ పరంరూపమనాద్యంతం యన్మమైవ మనామయం ।
బ్రహ్మాత్మా పరమాత్మేతి శబ్దైనైవ యదీర్యతే.

తా. సామాన్యము, పరమను భేదముచే రెండు రూపములు నాకగునని దెలిసికొనము. చేతులు కాళ్లున్నట్లు కల్పించు రూపము సామాన్యమన బడును. అది మూఢులకుపాస్యము కాని అనాద్యనంతమైన నాపర రూపము అనామయము. (దుఃఖములేనిది=ఆనందమైనది) దానిని పర బ్రహ్మ, పరమాత్మ నామములతో బలుకుదురు.

483-a శ్లో॥ పుం రూపం వా స్మరే ద్దేవీం స్త్రీరూపం వా విచింతయ ।
అథవా నిష్కలం ధ్యాయే త్సచ్చిదానందలక్షణం.

తా. నన్ను పురుష రూపమని లేక స్త్రీ రూపమే యని ధ్యానించవచ్చును. లేదా నిష్కళమైన సచ్చిదానంద స్వరూపమని ధ్యానించవచ్చును.

2. పై కారణముల వలన వైదిక పద్ధతిగా దేవీ జపముల జేయవలయు ననుట నిర్వివాదము.

483-b. శ్లో॥ యశ్చనోపశ్చిమం జన్మ యదివా శంకరస్స్వయం ।
తేనైవలభ్యతే విద్యా శ్రీమత్పంచదశాక్షరీ.

తా. సాక్షాచ్ఛంకరునికిని, మఱల జన్మలేని వారికిని మాత్రమే శ్రీ విద్య లభించును.

484. శ్లో॥ దశాపంచకభేదేన ప్రపంచస్యఖిలానినీ ।
సాక్షిణీచాక్షరీయస్మా తస్మాత్పంచదశాక్షరీ. "మానసోల్లాసము"

తా. పంచ మహాభూతములైదు త్రివృత్కరణముచే పంచదశసంఖ్య యగును. మంత్రాక్షరములన్నియే గలవు కావున పంచదశాక్షరీ యని మంత్రనామము గలిగినది.

3. మనుష్యులేగాక దేవతలు, ఋషులు సహితము శ్రీదేవ్యుపాసకులైరి.

485. శ్లో॥ మనుశ్చంద్రః కుబేరశ్చ లోపాముద్రా చ మన్మథా ।
అగస్త్యోగ్నిశ్చ సూర్యశ్చఇంద్రస్కందశ్శివ స్తథా ।
క్రోధ భట్టారకోదేవీ ద్వాదశామీ యుపాసకాః.

తా. మనువు, చంద్రుడు, కుబేరుడు, లోపాముద్రా, (అగస్త్యుని భార్య) మన్మథుడు, అగస్త్యుడు, అగ్నిదేవుడు, సూర్యుడు, ఇంద్రుడు, కుమార

490. శ్లో॥ శాంతం పద్మాసనస్థం శశిధరమకుటం పంచవక్త్రంత్రినేత్రం ।
శూలం వజ్రం చ ఖడ్గం పరశుమభయదం దక్షభాగేవహంతం ।
నాగం పాశం చ ఘంటాం ప్రళయహుత వ హంసాంకుశం వామభాగే ।
నానాలంకారయుక్తం స్ఫటికమణి నిభం పార్వతీశం నమామి.

491. శ్లో॥ లిఙ్గయోని త్రిశూలంచ మాలాభయ వరోమృగీ ।
ఖట్వాంగం చ కపాలం చ డమరుశ్శివతోషదః, ఇవి ముద్రలు

# 7. గాయత్రీ మహామంత్రము

298. సహస్ర దళములతో సహస్రారచక్రము బ్రహ్మరంధ్రమున గలదు. అది శుభ్రవర్ణమైనది. అందు "హం" బీజమొకటియేగలదు. పరబ్రహ్మ చిచ్ఛక్తియుతుడా చక్రాధిష్ఠానదేవత. సంధ్యాంగముగ జెప్పిన త్రిపాద్గాయత్రి మంత్ర మిచ్చట ఉపాన, పురశ్చరణాదులందదే మంత్రమగును. సంకల్పమాత్రము వేరుగ జేయవలయును. న్యాసాదులు, ధ్యానము పై జెప్పినట్లు సంధ్యాంగమందు జెప్పినవి జేయవలయును. ముద్రలవే యిచ్చటగును.

మూ. "ఓం తత్సవితుర్వరేణ్యం, భర్గోదేవస్యధీమహి, ధియోయోనః ప్రచోదయాత్". దీనికి విశ్వామిత్రఋషిః, గాయత్రీఛంధః, గ్రాయత్రీ దేవత, శ్రీ గాయత్రీ దేవతా ప్రసాదసిద్ధ్యర్థే జపేవినియోగః.

2. మోక్షేతరములైన త్రైలోక్య సంపదలు మంత్రపాదైక తుల్యములే గాజాలవు. కావున మోక్షార్థియగుచు జపము జేయవలయును.

# 8. ప్రతిక్రియా శూలనీ మహామంత్రము

299. ఆభిచారికమందేగాని, సంకట నివారణకుగాని ఈ మంత్రమును స్తోత్రమందలి ప్రతిశ్లోకమునకు సంపుటిజేసి పఠించవలయును. నిష్కామనగా జేసిన మోక్షము గలుగును.

మూలమంత్రము—"ఓం హ్రైం స్వాహోజ్వల దుష్టగ్రహాశూలనీ ఘట్జ్వలహుం, హ్రాం మామరిదురితాన్మోచయ, హ్రీం మామరిదురితాన్మోచ రూపిణి జ్వల జ్వల ప్రతిక్రియాశూలనీ గ్రాసయా సుప్రయోక్త్రీస్త్రం ఫట్ స్వాహా"

2. ఈ మంత్రమునకు దీర్ఘతమఋషిః, కకుబ్ఛందః, ప్రతిక్రియా శూలనీ దేవతా, హ్రైం బీజం, స్వాహాశక్తిః, శూలనీ కీలకం, ప్రతిక్రియాశూలనీ ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః. బీజాదిన్యాసము పై విధము. 1, హ్రైం అంగుష్ఠాభ్యాంనమః (హృదయాయనమః) 2. స్వాహాతర్జనీభ్యాంనమః (శిరసేస్వాహా) 3. జ్వలదుష్టగ్రహాయై మధ్యమాభ్యాంనమః (శిఖాయైవౌషట్) 4. శూలన్యై అనామికాభ్యాంనమః (కవచాయహుం) 5. ఫట్ కనిష్ఠికాభ్యాంనమః (నేత్రత్రయాయవౌషట్) 6. జ్వలహుం కరతల కరపృష్ఠాభ్యాంనమః (అస్త్రాయఫట్) ధ్యానము.

492. శ్లో॥ సంవర్తానల కోటి కోటి విలస త్తేజోమయీం భీషణాం ।
వీరాభిః పరిచారికాభిరభితో వీరైర్గ్రహైర్దిగ్వృతాం ।
నానామూర్తి మహాప్రయోగ నిపుణైర్విధి ప్రియుక్తైపున ।
స్తానేవాశు వినాశినీం భయహరాం ధ్యాయేన్మహాశూలనీం.

300. గ్రహచార మనుకూలముగ నుండనప్పుడు, నిమిత్తాంతరమందును, నిష్కామనచేగాని నవగ్రహజపము జేయవచ్చును. నవగ్రహ జపము జేయ గోరినవారు అధిదేవత ప్రత్యధిదేవతలతో సూర్యాదిగ్రహ జపముల జేయ వలయును. న్యాసాదులు, ధ్యానశ్లోకములు వేరుగ దెలిసికొనవలయును. ఇచ్చట మూలమంత్రముల జేర్కొనబడును. గ్రంథ విస్తరభీతిచే విడువ బడినది.

## 1. సూర్యగ్రహమంత్రము

301. మూ. (1) "ఓమాసత్యేన రజసావర్తమానోనివేశ యన్నమృతం మర్త్యంచ హిరణ్యయేన సవితారథే నాదేవోయాతి భువనాని పశ్యన్" ముఖ్య మంత్రము.

స్వామి, శివుడు, దుర్వాసుడు వీరు పండ్రెండుగురు దేవీముఖ్యోపాసకులు (శ్రీ విద్యా ప్రవర్తకులు).

3. పంచదశాక్షరీమంత్రమందు త్రికూటములు (మూడుపాదములు) గాయత్రి మంత్రము మూడుపాదము లిట్లుభయమంత్రము లొకే విధ ముండుటతో పంచదశాక్షరిని తుల్య గాయత్రి యందురు.

మూలమంత్రము=''క, ఏ, ఈ, ల, హ్రీం, హ, స, క, హ, ల, హ్రీం. స, క, ల, హ్రీం.'' శ్రీం బీజముతో గలసి షోడశాక్షరీ యనబడును. సంపుటకి ఇతర బీజములను మూలమంత్రమున గురువనుగ్రహముచే బడసి పై విధముగ జపించవలయును. ఆనందభైరవ, దక్షిణామూర్తి ఋషయో:, పజ్క్తించ్ఛందః, శ్రీ కామేశ్వర సహిత లలితాపరమేశ్వరీ దేవతా, క, ఏ, ఈ, ల, హ్రీం బీజం, స, క, ల, హ్రీం శక్తిః హ,స,క,హ,ల,హ్రీం కీలకం, శ్రీకామేశ్వర సహితలలితాపరమేశ్వరీ ప్రసాదసిద్ధ్యర్థే జపేవిని యోగః. మంత్రమందలి త్రికూటములతో నన్వయ వ్యతిరేకములచే న్యాసాదులు జేయ వలయును. సాంప్రదాయవేత్తయైన గురువు స్వపాదుకనిచ్చి పూర్ణాభి షిక్తుని జేసిన దీక్షితుడగును. ధ్యాన శ్లోకమిది.

486-a. శ్లో॥ ధ్యాయేత్కామేశ్వరాం కస్థాం కురువిందమణిప్రభాం ।
శ్రోణాంబరస్రగాలేపాం సర్వాంగే న విభూషితాం ।
సౌందర్య సేవధించేక్షు చాపపాశాంకుశోజ్జ్వలాం ।
సఖాభిరణి మాద్యాభి స్సేవ్యాం సర్వనియామికాం ।
సచ్చిదానంద వపుషాం సదయాపాంగ విభ్రమాం ।
సర్వలోకైక జననీం స్మేరస్యాం లలితాంబికాం.

ముద్రలు 486-b. శ్లో॥ శంఖం చక్రం గదాం ఖడ్గం పద్మం యోనింత్రిశూలకం ।
తార్క్ష్యం శక్తిం ధేనుశార్జ్గం నారాచం కౌస్తుభం తథా.

2. తర్పణాదుల నెథాక్రమముగ గురువనుగ్రహమున తెలిసికొని జేయ వలయును. మంత్రసిద్ధిచే చతుర్విధ పురుషార్థములు గలుగును.

# 6. శ్రీ శివపంచాక్షరీ మహామంత్రము

297. ఆజ్ఞాచక్రము భ్రూమధ్యయందు రెండు దళములతో నుండును. దాని వర్ణము మెఱుపులరంగు. ఈ చక్రమందున్న చిదాకాశమందు గురుమూర్తి (శ్రీ సదాశివుడు) అధిష్ఠానదేవత. ఆజ్ఞాచక్రరేకులందు క్రమముగ "హం, క్షం" వర్ణములు దక్షిణోత్తరములందు గలవు. గురుమూర్తి కర్ణిక మధ్యనుండునని భావించవలయును.

2. సకల విద్యాధిదైవత పరమగురుడైన సదాశివుడు కారణగురువు. కార్యగురువులను త్రిమూర్తుల స్వరూపమందుము కావున పరమకారణ గురుడై పరమశివుని మాహాత్మ్యము వర్ణింపజాలము.

487. శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః.

488. శ్లో॥ సర్వజ్ఞాః శ్రుతయోపియాః పరశివః త్వత్ప్రాణ రూపాప్రియాః ।
శృంగగ్రాహిక యాతపాభృత ఇవత్వాన్న ప్రజల్పంతితాః ।
అన్యానైవతు నేతినేతి బహుశోవాచానిషిధ్యంతిచే ।
తోఽన్యస్త్వామిద మిత్థమిత్యనువదేత్తత్రాపి మాదృగ్జనాః.

489. శ్లో॥ నమేశక్తి శ్శ్రీమన్మహిమపరమాణో రపినుతౌ ।
తథాపిత్వద్భక్తిం వ్యతనమవష్టభ్య కిమపిచ ।
న మంచాక్రోశంతీ ప్రవచనమథాపి ప్రవవృతే ।
యథాలోకేభక్త్యా పరశివన శక్త్యా స్వగతయే.

మూలమంత్రము—"ఓంనమః శివాయ".

వామదేవఋషిః, పంక్తిచ్ఛందః, సాంబసదాశివసద్గురుదేవత, శ్రీంబీజం, నమః శక్తిః శివాయకీలకం. సాంబసదాశివదేవతా ప్రసాదసిద్ధ్యర్థే జపేవినియోగః మంత్రాక్షరములతో పైజెప్పినట్లు న్యాసాదుల జేయవలయును. గురువనుగ్రహమున మంత్రమర్థయుక్తముగ బడసి పైజెప్పిన విధముగ జపించవలయును. రుద్రాక్షమాలచే జపమావర్తన జేయవలయును. మంత్రసిద్ధిచే సమస్తఫలములు గలుగును. ధ్యానమిట్లు :-

490. శ్లో॥ శాంతం పద్మాసనస్థం శశిధరమకుటం పంచవక్త్రం త్రినేత్రం ।
శూలం వజ్రం చ ఖడ్గం పరశుమభయదం దక్షభాగేవహంతం ।
నాగం పాశం చ ఘంటాం ప్రళయహుత వ హంసాంకుశం వామభాగే ।
నానాలంకారయుక్తం స్ఫటికమణి నిభం పార్వతీశం నమామి.

491. శ్లో॥ లిఙ్గయోని త్రిశూలంచ మాలాభయ వరోమృగీ ।
ఖట్వాంగం చ కపాలం చ డమరుశ్శివతోషదః, ఇవి ముద్రలు

# 7. గాయత్రీ మహామంత్రము

298. సహస్ర దళములతో సహస్రారచక్రము బ్రహ్మరంధ్రమున గలదు. అది శుభ్రవర్ణమైనది. అందు "హం" బీజమొకటియేగలదు. పరబ్రహ్మ చిచ్ఛక్తియుతుడా చక్రాధిష్ఠానదేవత. సంధ్యాంగముగ జెప్పిన త్రిపాద్గాయత్రి మంత్ర మిచ్చట ఉపాన, పురశ్చరణాదులందదే మంత్రమగును. సంకల్పమాత్రము వేరుగ జేయవలయును. న్యాసాదులు, ధ్యానము పై జెప్పినట్లు సంధ్యాంగమందు జెప్పినవి జేయవలయును. ముద్రలవే యిచ్చటగును.

మూ. "ఓం తత్సవితుర్వరేణ్యం, భర్గోదేవస్యధీమహి, ధియోయోనః ప్రచోదయాత్". దీనికి విశ్వామిత్రఋషిః, గాయత్రీఛంధః, గ్రాయత్రీ దేవత, శ్రీ గాయత్రీ దేవతా ప్రసాదసిద్ధ్యర్థే జపేవినియోగః.

2. మోక్షేతరములైన త్రైలోక్య సంపదలు మంత్రపాదైక తుల్యములే గాజాలవు. కావున మోక్షార్థియగుచు జపము జేయవలయును.

# 8. ప్రతిక్రియా శూలనీ మహామంత్రము

299. అభిచారికమందేగాని, సంకట నివారణకుగాని ఈ మంత్రమును స్తోత్రమందలి ప్రతిశ్లోకమునకు సంపుటిజేసి పఠించవలయును. నిష్కామనగా జేసిన మోక్షము గలుగును.

మూలమంత్రము="ఓం హ్రీం స్వాహోజ్వల దుష్టగ్రహాశూలనీ ఫట్జ్వలహుం, హ్రీం మామరిదురితాన్మోచయ, హ్రీం మామరిదురితాన్మోచ రూపిణి జ్వల జ్వల ప్రతిక్రియాశూలనీ గ్రాసయా సుప్రయోక్త్రీన్హుం ఫట్ స్వాహా"

2. ఈ మంత్రమునకు దీర్ఘతమఋషిః, కకుబ్ఛందః, ప్రతిక్రియా శూలనీ దేవతా, హ్రీం బీజం, స్వాహాశక్తిః, శూలనీ కీలకం, ప్రతిక్రియాశూలనీ ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః. బీజాదిన్యాసము పై విధము. 1, హ్రీం అంగుష్ఠాభ్యాంనమః (హృదయాయనమః) 2. స్వాహాతర్జనీభ్యాంనమః (శిరసేస్వాహా) 3. జ్వలదుష్టగ్రహాయై మధ్యమాభ్యాంనమః (శిఖాయైవౌషట్) 4. శూలన్యై అనామికాభ్యాంనమః (కవచాయహుం) 5. ఫట్ కనిష్ఠికాభ్యాంనమః (నేత్రత్రయాయవౌషట్) 6. జ్వలహుం కరతల కరపృష్ఠాభ్యాంనమః (అస్త్రాయఫట్) ధ్యానము.

492. శ్లో॥ సంవర్తానల కోటి కోటి విలస త్తేజోమయీం భీషణాం।
వీరాభిః వరిచారికాభిరభితో వీరైర్గ్రహైర్దిగ్వృతాం।
నానామూర్తి మహాప్రయోగ నిపుణైర్విధి ప్రయుక్తైపున।
స్తానేవాశు వినాశినీం భయహరాం ధ్యాయేన్మహాశూలనీం.

300. గ్రహచార మనుకూలముగ నుండనప్పుడు, నిమిత్తాంతరమందును, నిష్కామనచేగాని నవగ్రహజపము జేయవచ్చును. నవగ్రహ జపము జేయ గోరినవారు అధిదేవత ప్రత్యధిదేవతలతో సూర్యాదిగ్రహ జపముల జేయ వలయును. న్యాసాదులు, ధ్యానశ్లోకములు వేరుగ దెలిసికొనవలయును. ఇచ్చట మూలమంత్రముల జేర్కొనబడును. గ్రంధ విస్తరభీతిచే విడువ బడినది.

## 1. సూర్యగ్రహమంత్రము

301. మూ. (1) "ఓమాసత్యేన రజసావర్తమానోనివేశ యన్నమృతం మర్త్యంచ హిరణ్యయేన సవితారథే నాదేవోయాతి భువనాని పశ్యన్" ముఖ్య మంత్రము.

(2) "ఓమగ్నిం దూతం వృణీమహేహోతారం విశ్వవేధసం, అస్యయజ్ఞస్య సుకృతుం" ఇది అధిదేవత మంత్రము.

(3) "కద్రుద్రాయప్రచేతసే మీఢుష్టమాయతవ్యసే, వోచేమశంతమగ్ంహృదే" ఇది ప్రత్యధిదేవత మంత్రము. వీని కలపి ముఖ్యదేవత మంత్రజపము జేయవలయును. అరిష్టములు దూరమై ఆత్మశాంతి గలుగును.

493. శ్లో॥ సూర్యారిష్టేతు సంప్రాప్తే సూర్య పూజాంచకారయేత్ ।
సూర్యధ్యానం ప్రవక్ష్యామి ఆత్మ పీడోపశాంతయే.

## 2. చంద్ర గ్రహ మంత్రము

మూ. (1) "ఓమాప్యాయస్వసమేతుతే విశ్వతస్సోమవృష్ణియం, భవా వాజస్యసంగథే" ఇది ముఖ్యమంత్రము.

(2) "అప్సుమేసోమో అబ్రవీదంతర్విశ్వాని భేషజా, అగ్నించవిశ్వశంభువమపాంశ్చ విశ్వభేషజీ". ఇది అధిదేవత మంత్రము.

(3) "గౌరీమిమాయ సలిలానితక్షత్యే కపదీద్విపదీ సాచతుష్పదీ, అష్టాపదీనవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమేవ్యోమన్" ప్రత్యధిదేవత మంత్రము. వీనితో గలిపి ముఖ్యమంత్ర జపముచే నరిష్టములుబోయి మనశ్శాంతి గలుగును.

494. శ్లో॥ చంద్రారిష్టేతు సంప్రాప్తే చంద్రపూజాంచకారయేత్ ।
చంద్రధ్యానం ప్రవక్ష్యామి మనఃపీడోపశాంతయే.

## 3. కుజ (మంగళుని) గ్రహ జపము

మూ. (1) "ఓమగ్నిర్మూర్ధాదివః కకుత్పతిః పృథివ్యాఅయం, అపాగ్ంరేతాగ్ంజిన్వతి" ఇది ముఖ్యదేవత మంత్రము.

(2) "స్యోనాపృథివీ భవాన్రృక్షరా నివేశనీయచ్ఛానశ్శర్మసప్రథా". అధిదేవత.

(3) "క్షేత్రస్యపతి నావయగ్ం హితేనేవ జయామసిగామశ్వం పోష యిత్వాసనోమృడాతీదృశే". ఇది ప్రత్యధిదేవతము. వీనికిగల ముఖ్యమంత్ర జపము చేయవలెను.

495. శ్లో॥ కుజారిష్టేతు సంప్రాప్తే కుజపూజాంచకారయేత్ ।
కుజధ్యానం ప్రవక్ష్యామి రోగపీడోపశాంతయే.

## 4. బుధ గ్రహ జపము

మూ. (1) "ఉద్బుధ్యస్వాగ్నే ప్రతిజాగృహే నమిష్టాపూర్తేసగ్ం సృజేథా మయంచ, పునః కృణ్వగ్ స్త్వాపితరం యువానమన్వాతాగ్ం సీత్వయితంతు మేతం" ఇది ముఖ్యమంత్రము.

(2) "ఇదంవిష్ణు ర్విచక్రమేత్రేధా నిధదేపదం, సమూఢమస్యపాగ్ం సురే". అధిదేవత మంత్రము.

(3) సహస్రశీరుషాపురుషః సహస్రాక్షసహస్రపాద్, సభూమి విశ్వతో వృత్వాత్యతిష్ఠద్దశాంగులం" ప్రత్యధిదేవత మంత్రము వీనిగలిపి జపించ వలెను. బుద్ధి ప్రశాంతమగును.

496. శ్లో॥ బుధారిష్టేతు సంప్రాప్తే బుధ పూజాంచకారయేత్ ।
బుధధ్యానం ప్రవక్ష్యామి బుద్ధిపీడోపశాంతయే.

## 5. బృహస్పతి గ్రహ జపము

మూ. (1) బృహస్పతేఅతియదర్యోఅర్హా ద్యుమద్విభాతిక్రతుమజ్జనేషు యద్దీదయచ్ఛవప్రవర్త ప్రజా తతదస్మాసుద్రవిణంధేహిచిత్రం" ముఖ్య మంత్రము.

(2) బ్రహ్మజజ్ఞానంప్రథమంపురస్తా ద్విసీమతస్సురుచోవేన ఆవః సబుధ్న్యా ఉపమాస్య నిష్ఠాస్సతశ్చయోనిమసతశ్చవివః" అధిదేవత మంత్రము.

(3) "ఇద్రంవోవిశ్వతస్పరి హవామహేజనేభ్యః అస్మాకమస్తు కేవలః" ప్రత్యధిదేవత మంత్రము. వీనితో జపించిన పుత్రాదుల పీడలు నశించును.

497–a. శ్లో॥ గుర్వరిష్టేతు సంప్రాప్తె గురుపూజాంచకారయేత్ ।
గురుధ్యానం ప్రవక్ష్యామి పుత్రపీడోపశాంతయే,

## 6. శుక్రగ్రహ జపము

మూ. (1) "ఓంశుక్రంతేఅన్యద్యజంతేఅన్యద్విషురూపే అహనీద్యౌరివాసీ విశ్వాహిమాయా అవసస్విధాపో భద్రాతేపూషన్నిహరాతిరస్తు". ముఖ్య మంత్రము.

(2) ఇంద్రాణీమాసునారిషుసుపత్నీ మహామశ్రివం సహ్యాస్యాఅపరంచ నజరసామరతేపతిః" ఇది అధిదేవతా మంత్రము.

(3) "ఇంద్రమరుత్వంత ఇహాపాహిసోమం యథాశార్యాతేఅపిబసుతస్య తవ ప్రణీతీతవశూరశర్మ న్నావివాసంతికవయస్సుయజ్ఞాః" ఇది ప్రత్యధిదేవత మంత్రము. వీనితో గలిపి ముఖ్యమంత్ర జపముచే పత్నీపీడ శాంతియగును.

497–b. శ్లో॥ శుక్రారిష్టేతు సంప్రాప్తే శుక్రపూజాంచకారయేత్ ।
శుక్రధ్యానం ప్రవక్ష్యామి పత్నీపీడోపశాంతయే.

## 7. శనిగ్రహ జపము

మూ. (1) "ఓంశమగ్నిరగ్నిభి స్కరశ్చన్న స్తపతుసూర్యః శంవాతో వాత్వరసా అపస్రిధః" ఇది ముఖ్యమంత్రము.

(2) "యమాయసోమగ్ంసునుత యమాయజుహుతాహవిః యమగ్ం హయజ్ఞోగచ్ఛత్య గ్నిదూతోఅరంకృతః" అధిదేవత మంత్రము.

(3) ప్రజాపతేనత్వదేతాన్యన్యో విశ్వాజాతానిపరితాబభూవ యత్కా మాస్తేజుహుమ స్తన్నో అస్తువయగ్గ్ స్యామపతయోరయీణాం" ఇది ప్రత్యధి దేవతమంత్రము. వీనితో గలపి మంత్రజపము జేయవలెను. ప్రాణపీడ దొలంగును.

498. శ్లో॥ శన్యరిష్టేతు సంప్రాప్తే శనిపూజాంచకారయేత్ ।
శనిధ్యానం ప్రవక్ష్యామి ప్రాణపీడోపశాంతయే.

## 8. రాహుగ్రహ జపము

మూ. (1) "ఓంకయానశ్చిత్ర ఆభువదూతీసదావృధస్సఖా కయాశచిష్ట యావృతా" ఇది ముఖ్యగ్రహమంత్రము.

(2) "ఆయంగౌఃపృశ్నిరక్రమీదసదన్మాతరంపునః పితరంచ ప్రియం ఛ్సువః" అధిదేవత మంత్రము.

(3) నమోఅస్తుసర్పేభ్యోయేకేచపృథివీమను యేఅంతరిక్షే యేదివి తేభ్య స్సర్పేభ్యోనమః" ప్రత్యధిదేవత మంత్రముకలిపి జపించగ గండ్లపీడ వొదులును.

4?9. శ్లో॥ రాహ్వారిష్టేతు సంప్రాప్తే రాహుపూజాంచకారయేత్ ।
రాహుధ్యానం ప్రవక్ష్యామి చక్షుఃపీడోపశాంతయే.

## 9. కేతుగ్రహ జపము

మూ. (1) "ఓంకేతుంకృణ్వన్న కేతవే పేశోమర్యాఅపేశసే సముషద్భిర జాయథా" ఇది కేతుగ్రహమంత్రము.

(2) "సచిత్రచిత్రంచితయంతమస్మే చిత్రక్షత్రంచిత్రతమంవయోధాం చంద్రంరయింపురువీరంబృహంతం చంద్రచంద్రాభిర్గృణతేదువస్వ" ఇది అధిదేవతమంత్రము.

(3) "బ్రహ్మాదేవానాంపదవీఃకవీనా మృషిర్విప్రాణాం మహిషో మృగాణాం శ్యేనోగృధ్రాణాగ్ స్వధితిర్వనానాగ్ం సోమఃపవిత్రమత్యేతి రేభన్". ఇది ప్రత్యధిదేవతా మంత్రము. వీనితో ముఖ్యమంత్రజపము జేయవలయును. ఇట్లు జపవిధి సమాప్తము.

# 3. హోమము

302. హోమము దైనిక షట్కర్మలందు మూడవది. ప్రతినిత్య ముదయ మందు స్నానసంధ్యల, జపముల జేసి హోమము జేయవలయును. హు= దాన, ఆదరములు ధాత్వర్థములు. దానమనగా ప్రక్షేపణ (ఉంచుట) అగ్ని

హోత్రమందు హవ్యా కవ్యాదుల హోమము జేయుట తాత్పర్యార్థము మూడాశ్రమిణులకు ఔపాసనాగ్నియందుదయాస్తమములందు హోమము జేయుటనిత్య కర్మవిధి. దేవతలను గురించి జేయు హోమము హవ్యముతో, పితరులను గురించి జేయు హోమము కవ్యతో జేయవలయును. హవ్యముచే స్వాహాకారమున, కవ్యముచే స్వధాకారమున జేయబడును. వషట్కారము యజ్ఞములందుపయోగింతురు. స్వాహాకార, స్వధాకార, వషట్కార, ఓంకార, నమస్కారాః పంచబ్రహ్మణోనామాని'' యనగా స్వాహాకారాదులైదు బ్రహ్మకు నామధేయములు. మొదటిమూడు అగ్నిహోత్రమందు హోమార్థముపయోగములు. ఉపనయనాది సంస్కారముల, నవగ్రహ హోమాదుల, ఔపాసనాగ్నియందు నిత్యాగ్ని హోత్రముల, భాగవత, రుద్రయాగలములందును స్వాహాకారమున హోమముల జేయవలయును. పైతృక కర్మలందే స్వధాకారముపయోగము. శ్రౌతాగ్నిహోత్రమందు వషట్కారమున హోమమగును. ఉపనయనానంతరము బ్రహ్మచారి నిత్యాగ్నిహోత్రి హోమములు జేయవలయును. బ్రహ్మచారి జేయు హోమవిధి ఇట్లు.

## బ్రహ్మచర్యాశ్రమ నిత్యాగ్నిహోత్ర హోమము

303. బ్రహ్మచారి స్నానసంధ్యల జేసి పై జెప్పినట్లు పవిత్రుడై జపానంతరము మమ బ్రహ్మచర్య సిద్ధ్యర్థం ప్రాతః లేక కాలానుసారమున సాయం అగ్నికార్యం కరిష్యేయని ఉదకము ఆచమన ప్రాణాయామ సంకల్ప పూర్వకమున విడిచి చెప్పబోవు (గృహస్థునికి జెప్పబోవు) మంత్రముతో పరిశుద్ధస్థలమునందలకి దానిపై స్థండిలోల్లేఖనము (పిండి ముగ్గువేసి) జేసి అగ్ని ప్రతిష్ఠాపనాది చతుష్పాత్రప్రయోగము వరకట్లేజేసి ఆ యగ్నిహోత్రమందు పాలాశసమిధలతో క్రింది మంత్రములచే నొక్కొక్క సమిధతో నొక్కొక్క హోమము జేయవలయును. మొదట క్రింది మంత్రముతో అగ్నికి చుట్టు నల్దిశలందు నీళ్లతో జుట్టవలయును. (ఈవిధి గృహస్థాగ్ని హోత్రవిధియందు జెప్పునట్లగును).

౩౧. శ్రుతి॥ 'పరిత్వాగ్నే పరిమృజా మ్యాయుషా చ ధనేనచ సుప్రజాః ప్రజయా భూయాసగ్ం సువీరో వీరై స్సువర్చావర్చసా సు పోషః పోషై సు గృహో గృహై సు పతిః పత్యా సు మేధోమేధయా సు బ్రహ్మ బ్రహ్మచారిభిః'. అగ్నింపరిత్వేతి యను నీ మంత్రముతో అగ్ని స్థాపన జేయవలయును.

నీళ్లగ్నికి జుట్టునప్పు డీశాన్యమున కాగ్నేయమునుండి, నైఋతినుండి ఆగ్నేయమునకు మఱల నైఋతినుండి వాయవ్యమునకు, వాయవ్యము నుండీశాన్యమునకు గీతలు పడ జుట్టవలయును.

2. పిదప "అగ్నిమిధ్వా అగ్నిమలంకృత్యా" యని రెండు సమిధెలనగ్ని యందుంచవలయును. తరువాత నీళ్లతో పైవిధమున "ఓంభూర్భువస్సువః" తో నొకటిట్లు గాయత్రిమంత్రము మూడుపాదములతో మూడుగీతలు బడ జుట్టవలయును. పిమ్మట "చత్వారిశృంగా" యను జెప్పబోవు మంత్రముతో నట్లు అగ్నిస్తుతి జేయవలయును. తరువాత "అదితేనుమస్వ" యను జెప్ప బోవు మంత్రముతో మరల నీళ్లగ్నికి జుట్టవలయును. (ఇది ముందు జెప్ప బడును అదేవిధ మిచ్చటగును) అనంతరము పదహారు హోమముల సమిధె లతో ఈ క్రింది మంత్రములతో.

1. "అగ్నయే సమిధమహారిషంబృహతే జాతవేదసె, యథాత్వమగ్నే స మిధా స మిధ్య స ఏవం మా మాయుషా వర్చసా సన్యా మే ధయా, ప్రజయా పశుభిర్బ్రహ్మ వర్చసే నా న్నా ద్యేన మేధయసి స్వాహా" యని అగ్నయందొక సమిధనుంచి "అగ్నయఇదం" యని త్యాగము "నమమ" అనవలయును. ఇట్లు త్యాగమంతటగలదు. మున్ముం దూహించుకొని జేయ వలయును.

2. "ఏధో స్యేధి షీ మహిస్వాహా" యని అగ్నయఇదం యనుచు త్యాగము.

3. "సమిదసి సమేధిషీ మహిస్వాహా" అగ్నయఇదం పూర్వవత్తుగ

4. "తేజోసి తేజో మయిధేహిస్వాహా" పూర్వవత్తు.

5. "అపో అద్యాన్వచారిషగ్ం రసేన సమ సృక్ష్మహి, పయస్వాగ్ంఅగ్న ఆగమం తంమా సగ్ం స్వజ వర్చసా స్వాహా" పూర్వవత్తు.

6. "సంమాగ్నే వర్చసా సృజ ప్రజయాచ స్వాహా" పూర్వవత్తు.

7. "విమృన్మే అస్యదేవాఇంద్రో విద్యాథ్సహ ఋషిభి స్వాహా" పూర్వవత్తు.

8. "అగ్నయే బృహతే నాకా య స్వాహా" యని అగ్నయేబృహతే నాకాయేదంనమమ అనవలయును.

9. "ద్యావా పృథివీ భ్యాగ్ స్వాహా" యని ద్యావాపృథివీభ్యామిదం నమమ.

10. ఏష తే అగ్నే సమిత్తయావర్ధస్వ చాప్యాయస్వచ తయా హం వర్ధమానోభూయా సమా ప్యాయమానశ్చ స్వాహా" యని అగ్నయఇదం పూర్వవత్తు.

11. యోమాగ్నే భాగినగ్ంసంతమథాభాగం చికీర్షత్య భాగమగ్నేతం కురు మామగ్నే భాగినం కురు స్వాహా" పూర్వమువలె అగ్నయఇదం త్యాగము.

12. "సమిధ మాదాయాగ్నే సర్వవ్రతో భూయాసగ్గ్ స్వాహా" అగ్నయఇదం.

13. "భూస్స్వాహా" అగ్నయఇదం.

14. "భువస్స్వాహా" వాయవేదం నమమ అంతట.

15. "సువస్స్వాహా" సూర్యాయేదం.

16. "భూర్భువస్స్వాహా" ప్రజాపతయఇదం నమమ. పిదప నీళ్లతో పూర్వమువలె అగ్నికి జుట్టవలెను మంత్రమిది :-

"అదితేన్వమగ్గ్‌స్థాః అనుమతేన్వమగ్గ్‌స్థా సరస్వతేన్వమగ్గ్‌స్థాః దేవసవితః ప్రాసావీః" యని అదితేన్వమన్యస్వవలె జుట్టవలయును. ప్రార్థనిట్లు :-

ఉ.౨. శ్రుతి॥ "యత్తే అగ్నే తేజస్తేనాహం తేజస్వీ భూయాసం।
యత్తే అగ్నే వర్చస్తేనాహం వర్చస్వీ భూయాసం।
యత్తే అగ్నే హరస్తేనాహం హరస్వీ భూయాసం।
మయిమేధాం మయిప్రజాం మయ్యగ్నిస్తేజోదధాతు।
మయిమేధాం మయిప్రజాం మయిసూర్యో భ్రాజోదధాతు". ప్రార్థించి.

౭౩. శ్రుతి॥ "మానస్తోకేతన యే మన ఆయుషి మానోగోషు మానోఅశ్వేషురీరిషః।
వీరాన్మానో రుద్రభామితో వ ధీర్హవిష్మంతో నమసావిధేమ".

ఇతి జపిత్వాయనగా నీ మంత్రి జపమును జేసి.

౭౪. శ్రుతి॥ మేధావీ భూయాసం। తేజస్వీ భూయాసం। యశస్వీ భూయాసం।
వర్చస్వీ భూయాసం। బ్రహ్మవర్చస్వీ భూయాసం। ఆయుష్మాన్భూ
యాసం। అన్నాదో భూయాసం। సర్వసమృద్ధో భూయాసం''.

ఇట్లు జెప్పి భస్మము జేకొని తిలకము ధరించవలయును. మఱల నిట్లు.

౭౫. శ్రుతి॥ ''పునస్త్వాదిత్యా రుద్రావ సవ స్సమింధతాం పునర్బ్రహ్మణో
వసునీథయజ్ఞైః ఘృతేనత్వం తనువోవర్ధయస్వ సత్యాస్సంతు
యజమానస్య కామాః స్వాహా". అగ్నియందు సమిధ నుంచవలెను.

అగ్నయే వసునీథాయేదం నమమ.

౭౬. శ్రుతి॥ స్వస్తిశ్రిద్ధాం మేధాం యశః ప్రజ్ఞాం విద్యాం బుద్ధిగ్ శ్రియం
బలమాయుష్యం తేజ ఆరోగ్యం దేహిమేహవ్యవాహన।
అయందేహిమే హవ్యవాహనోన్నమ ఇతి.

ఇట్లు హోమము బ్రహ్మచారి సమిధలతో జేసి
"భవతిభిక్షాందేహి। భవాన్భిక్షాందదాతు"

అనుచు భిక్షాటన జేయవలయును. భిక్షాన్నము గురువనుజ్ఞతో దినవలెను.

## గృహస్థుని అగ్నిహోత్రి హోమము

304. గృహస్థుడు వివాహ చతుర్ద దినమునుండి సన్యాసము స్వీకరించు వరకు, స్వీకరించని పక్షమునం దామరణాంత మౌపాసనాగ్ని నొకగుండ మందుంచుకొని కాపాడుచు అందు నిత్యమౌపాసనాగ్ని కార్యముల సాయం ప్రాతః కాలములందు కాలానుగుణ్యముగ విడువక జేయవలెను. కార ణాంతరమున స్మార్త ఔపాసనాగ్ని విచ్ఛిత్తియైనప్పుడు పునః సంధానము మంత్రపూర్వకముగ జేసికొని నిత్యాగ్నిహోత్రిముల జేయవలయును. అన్యథా ప్రాయశ్చిత్తమగును. వానప్రస్థుడు వైఖానసులకు జెప్పిన

ధర్మశాస్త్రానుసారముగ అగ్నిహోత్రముంచుకొని దానియందు గృహస్థుని వలె నిత్యాగ్నిహోత్రముల కాలానుగుణ్యముగ జేయవలయును. ధర్మ శాస్త్రకాండయందు శాఖాభేదమున అగ్నిహోత్ర కాలనిర్ణయము జెప్ప బడినది. అట్లే స్వశాఖానుసారము జేయవలయును.

## విచ్ఛిన్నాగ్నిపునః సంధానవిధి

305. పై జెప్పినవిధముగ ఆచమన ప్రాణాయామపూర్వకముగ దేశకాల సంకీర్తనజేసి మమ ధర్మపత్నీ సమేతస్య ఉపాత్తదురితక్షయద్వారా శ్రీ పర మేశ్వరముద్ధిశ్య శ్రీ పరమేశ్వరప్రీత్యర్థ "మౌపాసనాగ్ని మాధాస్యే విచ్ఛిన్న సంధానార్థంతేన పరమేశ్వరం ప్రీణయానీ" అనుచుదకము విడిచి స్మార్తాగ్నిగుండ మందేగాని అది లేనియెడల నెచ్చట అగ్నిస్థాపన జేయునో యచ్చట అలికిన పరిశుద్ధస్థలమునందు స్థండిలోల్లేఖన ఇట్లు జేయ వలెను.

2. "యత్రాగ్నిస్థాప్యతే తత్ర ప్రాదేశమాత్రం స్థండిలం కల్పయిత్వా, ప్రాచీరుదగ్సగ్గుంస్థాః, ఉదీచీః ప్రాగ్సగ్స్థాః, తిస్రస్రిస్రో రేఖాలిఖిత్వా, అద్భిరవోక్ష్య, శకలమాగ్నేయాన్నిరస్య, ఉత్తరేణ పూర్వేణ వాన్యత్తోయ ముపదధ్యాదే తద్ధారేణవిద్యతే" అనగా నెచ్చట అగ్నిస్థాపన జేయునో యచ్చట పిండిబరచి (జిట్టెటు పొడుగు వెడల్పు) దానిపై జిట్టెడు సమి ధతో మూడు మూడు గీతలు పొడుగు, వెడల్పుగ (మొదట మూడుగీయు నప్పుడు పడమరనుంచి తూర్పుకు నొకటి తరువాత నొకటి దక్షిణమునుండి మొదలుకొని నుత్తరముసమాప్తి రెండవసారి మూడుగీతలప్పుడు దక్షిణము నుండి ఉత్తరమునకై పొడుగు గీతలపై నంటునట్లు గీయవలెను. అడ్డగీతలు తూర్పుదిశకు ఆరంభించి పడమరనుండి సమాప్తమగును). గీచిన సమిధ గీతలపైనుంచి దానిపై నీళ్లతో ప్రోక్షించి శకలముదీసి వెంటనే నీళ్ల స్పర్శ జేసి "భూర్భువస్సువరోం" యనుచు పిండిపై అగ్నిఉంచవలయును. (అగ్ని భార్యగాని సువాసినీ స్త్రీగాని తెచ్చియివ్వవచ్చును) ఉపపాత్రలోని నీళ్లు పారవేసి వేరొక పాత్రలో నీళ్లగ్నికి పూర్వదిశయందుగాని ఉత్తరమందు

గాని యుంచవలయును. ఇది ధారణ పాత్రయగును. అగ్ని శేషము నైరుతి దిశయందుంచవలెను. పిదప క్రింది మంత్రము జెప్పవలయును.

౭౭. శ్రుతి॥ ఉపావరోహజాత వేదః । పున స్త్వం దేవేభ్యోహవ్యం వహనః
పృజానన్ । ఆయుః పృజాగ్ం రయిమస్మాసుదేహ్య జ్గస్రోదీదిహి
నోదురోణే",

ఈ మంత్రముతో రెండు సమిధల "అగ్నిమిధ్యా అగ్నిమలంకృత్వా" యనుచు బెట్టవలెను. తరువాత నీళ్లగ్నికి క్రిందివిధమున జుట్టవలెను. "ఓంభూర్భువస్సువః" యనుచు నాగ్నేయమునుండీశాన్యమువరకు, "తత్స వితుర్వరేణ్యం" యని నైరుతినుండి ఆగ్నేయమువరకు, "భర్గోదేవస్య ధీమహి" యని నైరుతినుండి వాయవ్యమునకు, "ధియోయోనః ప్రచో దయాత్" యని వాయవ్యమునుండి ఈశాన్యమునకు పూర్తి జేయవలెను. భూమిపై నీళ్లగీతలు బడునట్లు జుట్టవలెను. పిమ్మట నీ గీతలపై మధ్యన బడునట్లు నీళ్లుగాని, అక్షతలేగాని జేకొని యష్టదిశలందీ క్రిందివిధముగ బెట్టవలెను. తూర్పునుండి మొదలు "అగ్నయేనమః, హుతవహాయనమః, హుతాశనేనమః, కృష్ణవర్త్మనేనమః, దేవముఖాయనమః, సప్తజిహ్వాయ నమః, వైశ్వానరాయనమః, జాతవేదసేనమః" యని ఒక్కొకటి బెట్ట వలయును.

## చతుష్పాత్ర ప్రయోగవిధి

౭౮. శ్రుతి॥ "దక్షిణోత్తరైరుత్తరాధరైః పాగుదగగ్రైర్దర్భైరగ్నిం పరిస్తృణాతి".

ఉత్తరేణాగ్నిం దర్భాన్సగ్గుస్తీర్య, ద్వంద్వంచపాత్రాణి పృయునక్తి, దర్వ్యాజ్యస్థాల్యౌ, ప్రోక్షణస్రువావితి, సమౌసాగ్రాద్వౌ దర్భౌపాదేశ మాత్రేపవిత్రేకృత్వా, ప్రోక్షణపాత్రేనిధాయ, ప్రోక్ష్య, అపరేణాగ్ని మంతర్హితాయ ప్రోక్షణపాత్రే అపఆనీయ హస్తయోరంగుష్ఠోప కనిష్ఠి కాభ్యాముదగగ్రే గృహీత్వా ప్రాచీంత్రిరుత్పూయ సపవిత్రపాణినా, పాత్రాణ్యుత్తానానికృత్వాత్రిః ప్రోక్ష్యశేషోదకం దక్షిణతో నిక్షిపేత్. తే పవిత్రే ఆజ్యపాత్రేనిధాయ ఆజ్యంవిలాప్య, విలీనమప్యగ్నావధిశ్రిత్య, అపరే

ణాగ్నిం పవిత్రిమంతర్హితాయా మాజ్యస్థాల్యామాజ్యం నిరూప్య, ఉదీచోం గారాన్నిరూహ్య తేష్వంగారేష్వాజ్య పాత్రమధిశ్రిత్య, జ్వలతాదర్భేణా వద్యుత్య, ఉదగుద్వాస్య, అంగారాన్ప్రత్యూహ్య, సమౌసాగ్రౌ ద్వౌదర్భౌ ప్రచ్ఛిద్య ప్రక్షాళ్య, ఆజ్యే ప్రత్యస్య, అపఉపస్పృశ్య, త్రిః పర్యగ్నికృత్వా అపరేణాగ్నిం పవిత్రాంతర్హితేన ఆజ్యపాత్రమాదాయ, ఉదగగాభ్యా పవితాభ్యాం పునరాహారమాజ్యం త్రిరుత్పూయ, (పూర్వవత్) ప్రాగారభ్య పశ్చాన్నీత్వా ప్రాగేవపరిసమాప్తిః, పవిత్రగ్రంథిం విస్రస్య ప్రక్షాళ్య, పాగ గ్రమగ్నౌ పవిత్రే నుప్రహరతి స్రుక్స్రు వావగ్నౌ ప్రతితప్య, దర్భా గ్రైస్సమ్మార్ష్టి, స్రువమగ్రైరంతరతోభ్యాకారగ్ం సర్వతోబిలమధ్యే సమా హారం మూలైర్దండం, జుహూమగ్రైరంతరతోభ్యాకారం ప్రాచీందర్భ మధ్యే, బాహ్యతః ప్రతీచీం మూలైర్దండం, పునః ప్రతితప్య, ప్రోక్ష్య, స్రువముత్తరతో నిధాయ, దర్భానగ్నిం పరిస్పృణాతి''. ఇట్టి ప్రయోగ మంతట వర్తించును. విద్యుదసివద్యమే పాప్మానమృతాత్సత్యముపైమి'' యని హస్త ప్రక్షాళన.

2. పైె జెప్పినట్లు అదితేనుమన్యస్వ, అనుమతేనుమన్యస్వ, సరస్వతేను మన్యస్వ, దేవసవితః ప్రసువ''యనుచు నైఋతినుండి ఆగ్నేయమునకు, ఆగ్నేయమునుంచి వాయవ్యమునకు, వాయవ్యమునుండి ఈశాన్యమునకు ఈశాన్యమునుండ్యాగ్నేయమునకు నొక్కొక మంత్రముతో నొక్కొక సారి నీళ్లగ్నికి ప్రదిక్షణగా గీతపడునట్లు జుట్టవలెను.

## అగ్ని స్తుతి

౭౯. శ్రుతి॥ ఓంచత్వారిశృంగాస్త్రియోస్యపాదాద్వేశీర్షే సప్తహస్తాసో అస్య ।
త్రిధాబద్ధోవృషభోరోరవీతి । మహాదేవోమర్త్యాగ్ం ఆవివేశ''.

౮౦. శ్రుతి॥ "సప్తహస్తశ్చతుశ్శృంగః, సప్తజహ్వోద్విశీర్షకః, త్రిపాత్ప్రసన్నవదనః, సుఖాసీనశ్శుచిస్మితః, స్వాహాంతు దక్షిణేపార్శ్వే, దేవీంవామేస్వధాంతథా, బిభ్రద్దక్షిణహస్తైశ్చ శక్తిమన్నం స్రుచంస్రువం, తోమరం వ్యజనం వామే, ఘృతపాత్రింతుధారయన్, మేషారూఢం జటాబద్ధం

గౌరవర్ణం మహౌజసం, ధూమధ్వజం లోహితాక్షం, సప్తార్చిస్సర్వ కామదం, ఆత్మాభిముఖమాసీనం ఏవంధ్యాయేద్ధుతాశనం".

ఇట్లగ్ని స్తుతి జేయవలయును. మఱల.

౮౧. శ్రుతి॥ "ఏషహిదేవః ప్రదిశోనుసర్వాః పూర్వోహిజాతస్స ఉగర్భే అంతః, స విజాయ మానస్సజనిష్యమాణః, ప్రత్యఙ్ముఖా స్తిష్ఠతి విశ్వతోముఖః, ప్రాఙ్ముఖాగ్నేమ మాభిముఖోభవ, సుముఖోభవ, సుప్రసన్నోభవ''.

అని తనవైపు దోసిలి త్రిప్పవలెను.

3. మఱల పూర్వమువలె సంకల్పము జేసి శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం ఔపాసనాంతర్గత ప్రాయశ్చిత్తార్థం "అయాశ్చ, మనోజ్యోతిర్భూ ర్భువస్సు వరోమిత్యేతై ర్మం త్రై రాజ్యాహుతీం హోష్యే'' అని యుదకము విడిచి వామ, దక్షిణహస్తములందు క్రమముగ స్రుక్ స్రువల జేకొని, ఆజ్యపాత్రం౦పలి నెయ్యి స్రువచే గ్రహించుచు. ఏకం, ద్వే, త్రీణి, చత్వారి (జామదగ్న్యులు పంచ) యనుచు స్రువయందు నింపి యా స్రుక్స్రువల దక్షిణహస్తముతో బట్టి క్రింది మంత్రములతో ప్రాయశ్చిత్త హోమముల జేయవలయును.

౮౨. శ్రుతి॥ "ఓంఅయా శ్చాగ్నేస్స నభిశ స్తీశ్చ సత్యమిత్వమయా అసి, అయసా మనసా, ధృతోయసాహవ్యమూహిషే యానోదేహిభేషజగ్ స్వాహా'' యని హోమముచేసి అగ్నయఇదం నమమ. మఱలనట్లే నెయ్యినింపి రెండవ హోమము జేయవలయును.

"మనోజ్యోతిర్జు షతామాజ్యం విచ్ఛిన్నం యజ్ఞగ్ం సమిదం దధాతు, యా ఇష్టా ఉషసోనిమ్రుచశ్చతాస్సందధామిహా విష్ణూ తేన స్వాహా'' హోమ ముచేసి ఉషసోనిమ్రుగ్భ్యఇదంనమమ. పిదప ఒకేస్రువలో నెయ్యి ఒక్కొకసారి దీసికొనుచు ఒక్కొక హోమమిట్లు "భూస్స్వాహా", అగ్నయఇదం నమమ, భువస్స్వాహా వాయవేదంనమమ, సువస్స్వాహా సూర్యాయేదంనమమ, భూర్భు వస్సువస్స్వాహా ప్రజాపతయఇదంనమమ. "అదితేన్వమగ్గ్ స్థాః, అనుమతేన్వ మగ్గ్ స్థాః, సరస్వతే న్వమగ్గ్ స్థా, దేవసవితఃప్రాసావీ, అనుచు పైజెప్పినట్లు నల్దిశలందు అగ్నిగుండమునకు నీళ్ల జుట్టవలయును.

4. మఱల నాచమన ప్రాణాయామ సంకల్ప పూర్వకముగ కాలాను గుణ్యమున (సాయం, ప్రాతః) "ఔపాసనహోమంతండులైర్హోష్యే" యని యుదకము విడిచి, తడిపిన బియ్యముదీసికొని (ఆకులోగాని, స్రుచిలో గాని) "తండులానాదయ, అభిఘార్య" అనగా బియ్యముపై నెయ్యి స్రువతో వేసి, వానిలోకొన్నింటిని దీసికొని (మధ్యమ, అనామికాంగుష్ఠములతో) వానితో సాయంకాలమందు, ప్రాతఃకాలమందు క్రమముగ క్రింది క్రమ మంత్రములతో.

౭౩. శ్రుతి॥ ఓంఅగ్నయేస్వాహా" యనుచు అగ్నియందు హోమముజేసి (వేసి) అగ్నయఇదం నమమ. రెండవసారి తండులములన్ని దీసికొని "అగ్నయే స్విష్టకృతేస్వాహా" యనుచు హోమముజేసి "అగ్నయేస్విష్టకృదఇదం" నమమ యనవలయును. ప్రాతః కాలమిందిట్లు:—

2. 'ఓంసూర్యాయస్వాహా' అని హోమముజేసి 'సూర్యాయఇదంనమమ'. 2. 'అగ్నయేస్విష్టకృతేస్వాహా' అనిహోమముజేసి 'అగ్నయేస్విష్టకృద ఇదంనమమ' యనవలయును.

౭౪. శ్రుతి॥ 'యత్రవేత్థవనస్పతేర్దేవానాగ్ం గుహ్యానినామాని, తత్రహవ్యాని కామయ స్వాహా' యని యొకసమిధ హోమమగ్నియందు (వేసి) మఱల నొక సమిధ 'స్వాహా' యనుచు వేసి ప్రజాపతయిదం నమమ యనవలయును. 'అగ్నిస్తుతి క్రింది మంత్రము'.

౭౫. శ్రుతి॥ 'అగ్నేత్వన్నో అంతమః, ఉతత్రాతా శివోభవ వరూధ్యః, తంత్వా శోచిష్టదీదివః, సుమ్నాయనూన మీమహే సఖిభ్యః వసురగ్నిర్వసుశ్రవాః అచ్ఛానక్ష ద్యుమత్తమో రయిందాః, సనోబోధి శృధీహవమురుష్యాణో అఘాయ తస్సమస్మాత్. స్వస్తిశ్రద్ధాం మేధాం యశః ప్రజాం విద్యాం బుద్ధిగ్ శ్రియం బలమాయుష్యం తేజఆరోగ్యం దేహిమే హవ్యవాహన శ్రియందేహిమే హవ్యవాహన యనుచు దోసిలితనవంక త్రిప్పవలయును. 2 సార్లు. మఱల సంకల్పముజేసి.

5. కాలానుసారముగ "ఔపాసన హోమసాద్గుణ్యార్థమనాజ్ఞాతత్రయ దశగాయత్రి మంత్రజపం కరిష్యే" యని యుదకమువిడిచి క్రిందిమంత్రము పఠించి జపము జేయవలయును.

లఃఽ. శ్రుతి॥ ఓమనాజ్ఞాతం యదాజ్ఞాతం యజ్ఞస్యక్రియతే మిధు, అగ్నే తదస్య కల్ప యత్వగ్ం హి వేత్థ యథాతథం, పురుషసమ్మితో యజ్ఞోయజ్ఞః పురుష సమ్మితః, అగ్నేత్వదస్య కల్పయత్వగ్ం హి వేత్థ యథాతథం, యత్పా కత్రిమన సాదీ నదక్షిన యజ్ఞస్యమన్వతే మర్త్యాసః, అగ్నిష్టద్ధోతాకత్రితు విద్విజానన్య జిష్టోదేవాగ్ం ఋతు శోయజాతి' యనుచు అనేన అనాజ్ఞా తత్రియమంత్రిజపేన భగవాన్సర్వాత్మక యజ్ఞ పురుషః ప్రీణాతు యని యుదకమువిడిచి మఱల పూర్వమువలె సంకల్పాదులజేసి సర్వ ప్రాయశ్చిత్తం కరిష్యే యనుచుదకము విడిచి 'ఓంభూర్భువస్సువస్స్వాహా' అని స్రువతో నెయ్యి నొకేసారి అగ్నియందు హోమము జేయవలయును. 'ప్రజాపతయ ఇదంనమమ' త్యాగమనవలెను. 'వృ ష్టి ర సి వృశ్చ మేపాప్మానమృతాత్సత్య ముపాగాం' యని హస్తప్రక్షాళన జేయవలెను. విష్ణుస్మరణ రెండుసార్లు జేసిన నిత్యాగ్నిహోత్రకార్య పూర్తియగును. ఇట్లే ప్రతిదినమందు సాయం ప్రాత రౌపాస నాగ్నికార్యముల జేయునప్పుడు ప్రాయశ్చిత్త హోమాదులు వర్జితములు.

306. ఇట్టి ఔపాసనాగ్నియందు శ్రద్ధగలవారు జపించు మంత్రములనే గాని, లక్ష్మీసూక్తఋచలనుగాని, నవగ్రహహోమాదులుగాని ఒక్కొక మంత్రాంతమందు "స్వాహా" యన్నప్పుడు హోమముల జేయవచ్చును. హోమములచే నిష్కాముకులకు చిత్తశుద్ధి యగుచు మోక్షము జ్ఞానమున గలుగును. ఆత్మజ్ఞానులకు హోమాదుల నవసరము.

500. శ్లో॥ ప్రకాశామర్మ హస్తాభ్యామవలంబ్యోన్మనీ స్రుచం ।
ధర్మాధర్మ కలా స్నేహం పూర్ణవహ్నౌజు హోమ్యహం.

తా. జ్ఞానము, విచారమను రెండు చేతులందు "ఉన్మనీ", "మనోన్మని" యను స్రుక్కు స్రువల జేకొని, ధర్మాధర్మములను (పుణ్యాపాపములను) నెయ్యి బ్రహ్మాగ్నియందు హోమించుచున్నానని జ్ఞాని యనుకొనును.

501. శ్లో॥ అంతర్నిరంతర నిరింధనమేధమానే ।
మోహాంధకార పరిపంథిని సంవిదగ్నౌ ।
కస్మిన్శ్చిదద్భుత మరీచి వికాస భూమౌ ।
విశ్వంజుహోమి వసుధాదిశివావసానం.

తా. కట్టెలు లేకయే ఎల్లప్పుడు హృదయాకాశమందు వెలంగెడు జ్ఞానాగ్నియందు (మోహమను చీకటి విరోధియగు జ్ఞానాగ్నియందు)

ఆ జ్ఞానాగ్ని యొకానొక అద్భుతమైన జ్యోతి స్థలమందుగలదు. అనగా పరిపూర్ణ పరబ్రహ్మజ్యోతి యందాయజ్ఞాన విరోధి జ్ఞానముగలదు. ధర మొదలుకొని శివుని పర్యంతమైన విశ్వమును (ప్రపంచమును) అందే హోమము జేయుదనని జ్ఞాని దలంచుచుండును.

2. ఔపాసనాగ్ని హోత్రహోమము నిత్యమైనందున స్మార్తగుండమునందే శ్రౌతులు పై జెప్పిన నిత్యాగ్ని హోత్రిముల సాయం ప్రాతః కాలము లందు జేయుటవిధి. స్మార్తలీయౌపాసనాగ్నియందే పున్నమ అమావాస్య లందు "స్థాలీపాక" మను హోమముల జేయవలయును. ఈ హోమ వివరము సమాప్తము.

## బ్రహ్మయజ్ఞ దేవఋషి పితృతర్పణలవిధి

307. స్వాధ్యాయాంగమైనందున హోమానంతరము బ్రహ్మయజ్ఞము జేయవలయును. ఇది వైశ్వదేవాంగ బ్రహ్మయజ్ఞమున (బలి) కంటెను వేరగు కర్మవిధి. దీనికై పై జెప్పినట్లు రెండాచమనలజేసి దేశకాలాది సంకీర్తనల ప్రాణాయ పూర్వకమున జేసి మమోపాత్తదురిత క్షయద్వారా శ్రీ పరమేశ్వప్రీత్యర్థం "బ్రహ్మయజ్ఞేనయక్ష్యే" యనుచుదకము విడిచి మఱల "విద్యుదసి" యను పై జెప్పిన మంత్రముతో హస్తప్రక్షాళన జేసి కొనుచు శ్రుత్యాచమనస్మృత్యాచమన పై జెప్పినట్లు జేయవలయును. దర్భ పవిత్రి గలవాడై దర్భాసనస్థుడగుచు దర్భల ధరించవలెను. "దర్భే ష్వాసీనో దర్భాన్ధారయమాణస్స పవిత్రిపాణినా దక్షిణోత్తరౌపాణీపా దౌకృత్వాఓమితి ప్రతిపద్యతే" అనగా జలము హస్తమందు జేకొని తనకు ప్రదక్షిణగా జుట్టుటకు వీరాసనస్థుడై కూర్చుండి ఓ మనుచు హస్తమును (కుడిచేతిని ద్రిప్పి కుడి తొడపై నుంచిన వామహస్తతలమందు కుడిచేతిలో నుండు నీళ్లనుంచి దానిపై దర్భలనుంచి దానిపై హస్తతలము బోర్లించి యుంచవలయునని యర్థము. అప్పుడీక్రింది మంత్రముల పఠించవలెను.

రిక్. శ్రుతి॥ 'ఓంఋచోక్షరే పరమేవ్యోమన్యస్మిన్దేవాధి విశ్వేనిషేదుః యస్తన్న వేదకిమృచాకరిష్యత యఇత్తద్విదుస్త ఇమేసమాసతే' ఈమంత్రము 3 సార్లనవలెను.

౭౭. శ్రుతి॥ 'ఓంభూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనఃప్రచోదయాత్ ఓం భూఃతత్స వితుర్వరేణ్యం ఓంభువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ఓగ్ంసువః ధియోయోనః ప్రచోదయాత్ ఓగ్ంసువః ధియోయోనః ప్రచోదయాత్ ఓంభూర్భు వస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్పరో రజసిసావదోం'. ఇట్లు మంత్రముచ్చరించి మఱల యజుర్వేదులు.

౭౯. శ్రుతి॥ "ఓమిషేత్వోర్జేత్వా వాయవస్థోపాయవస్థః దేవోవస్సవితా ప్రార్పయతు శ్రేష్ఠతమాయకర్మణే ఆప్యాయధ్వ మఘ్నియా దేవభాగ మూర్జస్వతీపయస్వతీ ప్రజాపతీ రనమీమా అయక్ష్మామాన స్తేన ఈశత మాఘశగ్ం సోరుద్రస్యహేతిః పరివోవృణక్తు ధ్రువాస్మి న్గోపతౌస్యామ బహ్వీర్యజమానస్య పశూన్పాహి". 'బ్రహ్మ సంధత్తం తన్మేజిన్వతం క్షత్రగ్ం సధత్తం తన్మే జిన్వతం ఇషగ్ం సంధత్తం తాంమే జిన్వతం ఊర్జగ్ం సంధత్తం తాం మేజిన్వతం రయగ్ం సంధత్తం తాం మేజిన్వతం పుష్టిగ్ం సంధత్తం తామ్మేజిన్వతం ప్రజాగ్ం సధత్తం తామ్మేజిన్వతం పశూగ్ం సంధత్తం తామ్మేజిన్వతం స్తుతోజసినధాః దేవాస్త్వాశుక్రపాః ప్రణయంతు సువీరాః ప్రజాః ప్రజనయన్పరీహి'. మఱల

౮౦. శ్రుతి॥ 'ఓంనమోబ్రహ్మణే ధారణమ్మే స్త్వనిరాకరణం ధారయితా భూయాసం మామముష్యఓం ఋతంతపః సత్యంతపశ్రుతం తపశ్శాంతం తపోదమ స్తపః శమ స్తపః దానంతపోయజ్ఞంతపః భూర్భువస్సు వర్బ్రహ్మైత దుపాస్యై తత్తపః యథావృక్షస్య సంప్రష్పితస్య దూరాద్గంధోవాతి ఏవం పుణ్యస్య కర్మణోదూరాద్గంధోవాతి యథాసిధారాం గర్తేవహితామవక్రామే యద్యువేహులేహవా విహ్వాయిష్యామి గర్తంపతిష్యామీత్యే తదమృతా దాత్మానం జుగుప్సేత్'. 'ఓంసహనావ వతుసహనౌభునక్తు సహవీర్యం కరవావహై తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః'.

౮౧. శ్రుతి॥ 'ఓం అహంవృక్షస్యరేరివా కీర్తిః పృష్ఠగిరేరివ ఊర్ధ్వపవిత్రోవాజినీవ వస్వదమృతమస్మి ద్రవిణగ్ం సవర్చసం సుమేధామృతోక్షితః ఇతి త్రిశంకోర్వే దానువచనం ఓంశాంతిః 3 సార్లు పిదప ఋగ్వేదమంత్రమిట్లు.

౮౨. శ్రుతి॥ "ఓం అగ్నిమీళేపురోహితం యజ్ఞస్యదేవమృత్విజం హోతారం రత్నధాతమం ఓంశాంతిశ్శాంతిః 3 సార్లు. పిమ్మట సామవేద మంత్రమిట్లు :-

౮౩. శ్రుతి॥ 'ఓంఅగ్న ఆయాహి వీతయే గృణానోహవ్యదాతయే నిహౌతాసత్సిబర్హిషి' ఓంశాంతి 3 సార్లు మఱల నథర్వణవేద మంత్రమిట్లు జెప్పవలయును.

౯౪. శ్రుతి॥ 'ఓంశన్నోదేవీరభీష్టయ ఆపోభవంతుపీతయే శన్నోరభిశ్రవంతునః ఓంశాంతి 3 సార్లనవలయును.

2. "అథశిక్షం ప్రవక్ష్యామి వృద్ధిరాదైచ్ మయరసతజభనలగ సగ్ం హితః సమామ్నాయస్స మామ్నాయః పంచసంవత్సరమయం గ్లౌ, గ్మౌ, జ్మౌ, జ్మౌ అథాతోదర్శ పూర్ణమా సౌవ్యాఖ్యాస్యామః". (ఇదంగాధ్యనము)

3. అథాతోధర్మ జిజ్ఞాసా అథాతో బ్రహ్మజిజ్ఞాసా అథాతస్సామయాచారి కాన్ధర్మా న్వ్యాఖ్యాస్యామః ఇది పురాణ న్యాయ ధర్మశాస్త్రాధ్యనము.

౯౫. శ్రుతి॥ ఓంభూర్భువస్సువః సత్యంతప(శ్శ్రద్ధాయాంజుహోమి ఓంనమోబ్రహ్మణే నమో స్త్వగ్నయేనమః పృథివ్యైనమః ఓషధీభ్యః నమోవాచే నమోవాచస్పతయేనమో విష్ణవే బృహతేకరోమి ఓంశాంతి 3 సార్లు జెప్పి 'వృష్టిరసి' యను పై జెప్పిన మంత్రముతో హస్తప్రక్షాళన జేయవలెను.

2. పూర్వోక్తమున నాచమన సంకల్పాదుల జేసి బ్రహ్మయజ్ఞాంగ దేవ, ఋషి, పితృతర్పణం కరిష్యే నీళ్లు విడిచి,

౯౬. శ్రుతి॥ 'అత్రబ్రహ్మదయో యేదేవాః తాన్దేవాగ్ స్తర్పయామి సర్వాన్దేవాగ్ స్తర్ప యామి సర్వాన్దేవగణాన్గ్ం తర్పయామి సర్వాన్దేవ పత్నీగ్ తర్పయామి సర్వాన్దేవ పుత్రాగ్ం తర్పయామి సర్వాన్దేవ పౌత్రాగ్ం తర్పయామి భూర్దేవాగ్ం తర్పయామి భువర్దేవాగ్ం తర్పయామి సువర్దేవాగ్ం తర్పయామి భూర్భువస్సుర్దేవాగ్ం తర్పయామి'. యనుచు నొక్కొక మంత్రముతో సవ్యముగ నొకొక తర్పణ దేవతల గురించి జేయవలయును.

2. నివీతిగ (జన్నిదము హారమువలె నుంచుకొని) కృష్ణద్వైపాయనాదయో యేఋషయః.

౯౭. శ్రుతి॥ "తానృషీగ్ం తర్పయామి తర్పమామి (అంజలి తనపై పువంచి) సర్వా నృషీ స్తర్పణ 2 సార్లు సర్వానృషిగణాన్ 2-సర్వాః ఋషిపత్నీగ్ తర్పయామి-1 సారి. సర్వానృషిపుత్రాగ్ం 2 హర్లు సర్వానృషి పౌత్రాగ్ం 2 సార్లు. భూః ఋషిగ్ం 2, భువ(ఋషీగ్ం 2, సువఋషీగ్ం 2, భూర్భువస్సువఋషీగ్ం 2 సార్లు ప్రజాపతిం కాండర్షిం 2 సార్లు, అగ్నింకాండఋషిం తర్పయామి 2, సోమం కాండర్షిం 2, విశ్వాన్దేవాన్కాండర్షీగ్ం 2. సాగ్ం కీర్దేవతాఉపనిషదగ్ం తర్పయామి 2

యాజ్ఞికీర్దేవతా ఉపనిషదగ్ం 2, వారుణీర్దేవతా ఉపనిషదగ్ం 2, బ్రహ్మాణగ్గ్ స్వయం భువం 2, సదసస్పతిం 2 సార్లు తర్పయామి.

3. ప్రాచీనావీతిగ స్వధాకారముచే పితృతర్పణలను తర్జనిపై నుండి నీళ్లు జారునట్లు జేయవలెను. "సోమః పితృమాన్యమోంగిరః అగ్నిష్వాత్తాగ్నిః కవ్యవాహనాదయోయేపితరః తాన్పిత్రూగ్ం స్వధానమస్తర్పయామి 3 సార్లు. సర్వాన్పితూగ్ం 3, సర్వాన్పితృగణాగ్ం 3, సర్వాన్పితృ పత్నీగ్ 1 సారి, సర్వాన్పితృపుత్రాగ్ం 3, సర్వాన్పితృపౌత్రాగ్ం 3, భూఃపితౄగ్ం 3, భువపితౄగ్ం 3, సువఃపితౄగ్ం 3, భూర్భువః స్వఃపితౄగ్ం 3 పిమ్మట కర్తతన పితృపితామహ, ప్రపితామహాలకు వారి వారి నామగోత్ర శర్మ, వర్మ, గుప్తశబ్దముల త్రైవర్ణ్యులు క్రమముగ నామాంతమందె జేర్చి వసు, రుద్ర, ఆదిత్యపదముల పితృ, పితామహ, ప్రపితామహులకు క్రమముగ జెప్పి తర్పణలు జేయవలయును.

ఉ :- అస్మత్పితరంహారితస గోత్రం రామేశ్వరశర్మాం వసురూపం స్వధానమః తర్పయామి ఇట్లు మూడుసార్లు, పిమ్మట మాతృ, పితామహి, ప్రపితామహిలకు (తల్లి, తండ్రితల్లి, తాత తల్లికి) వారిగోత్ర నామాంతములందుప దేశబ్దమును చేర్చి, వసు, రుద్రాదిత్య క్రమముగా నొక్కొకసారి స్వధానమః స్తర్పయామి యనుచు నుదకము పై జెప్పిన విధముగ విడువ వలయును.

ఉ :- 2. అస్మద్మాతరం హారితస గోత్రాం, రామపదాం వసుహాపాం స్వధానమః స్తర్పయామి.

2. ఇదే విధమున మాతామహ, మాతుః పితామహ మాతుఃప్రపితామహులకును, (తల్లితండ్రికి, తల్లితండ్రి తండ్రికిని, తల్లితాత తండ్రికిని) మఱియు వారి భార్యలకును, (తల్లితల్లికి, తల్లితండ్రితల్లికి, తల్లితాతతల్లికిని) వారి గోత్రనామాంతములందు క్రమముగ వసు, రుద్రాదితుల్యపదములు జేర్చి స్వధాకారమున తర్పణలగును, ఉ :- అస్మద్మాతామహాం కౌశికస గోత్రం రామేశ్వరశర్మాం వసురూపం స్వధానమస్తర్పయామి 3 సార్లు.

ఉ :- 2. అస్మద్మాతామహీం కౌశికస గోత్రాం రాధపదాం స్వధానమస్తర్పయామి 1 సారి.

3. వీరి తరువాత పితృవంశ, మాతృవంశజులకు (ఆత్మబంధు, పితృబంధు, మాతృబంధువులకు నీకిౖంది శ్లోక తాత్పర్యక్రమము) నందరికిని పురుషులకు 3 సార్లు, స్త్రీలకు 1 సారి తర్పణ జేయవలయును.

502. శ్లో॥ ఆదౌపితాతథా మాతాసాపత్నీ జననీతథా ।
మాతామహో మాతృమాతా స్వభార్యా చ సుత స్తథా ,
భ్రాతా పితృవ్య స్తత్పుతా స పరిగ్రహమాతులా ।
స్వసాచైవశ్వశురౌ చ దౌహిత్రో దుహితాతథా ।
భాగినేయకస్నుషా చ పితృష్వసామాతృష్వసా ।
జామాతభావుక స్తథా శ్యాలకస్య చ గోత్రజాన్ ।
తాన్క్రమేణైవ క్రమశః విధివ త్తర్పయేత్యుధీః.

తా. మొదట తండ్రి (తండిౖ, తండిౖ, తండ్రి తాత్సహా) 2. మాత (తండ్రి తల్లి తాతతల్లిసహా) 3. మాతామహా (తల్లితాత, తల్లి ముత్తాతసహా) 4. మాతృమాత (తల్లి తల్లి, తల్లి తాత తల్లిసహా) 5. స్వభార్య జచ్చినప్పుడు (భార్యలందరకు) 6. సుతునకు (మరణించిన పుత్రులందరికిని దత్తునకు) 7. తోబుట్టినవారి కందరికిని (అన్నలకు, తమ్ములకు జచ్చినవారికిని భార్యలతోసహా) 8. చచ్చిన పిన పెద్ద తండ్రులకును, వారి భార్యలకు (పుత్రులతోసహా వారి భార్యలకును) 9. తనకోడండ్రకును 10. మేనమామలకును, వారిభార్యలకును 11. అక్కచెల్లండ్రలకు వారి భర్తలతోసహా 12. భార్య తల్లిదండ్రులకు 13. పుత్రికలందరికిని 14. దౌహిత్రులందరికిని 15. మేనల్లండ్రుకు వారి భార్యలతోసహా 16. తండ్రితోబుట్టు స్త్రీలకు (మేనత్తలకు) 17. తల్లితోబుట్టు స్త్రీలకు (చిన్నమ్మలకు) 18. బిడ్డమొగనికి (జామాతకు) 19. మేనత్తల కొడుకులకు (భార్యలతోసహా) 20. భార్యతోబుట్టినవారికిని (బావ, మరదులకును) గురువులకును భార్యలతోసహా పైజెప్పినట్లు స్వధాకారమున తర్పణలు క్రమముగ జేయవలెను. పిమ్మట నామ గోత్రములు దెలియని గోత్రజుల కందరికిని, బంధువులకీ కిౖంది శ్లోకములతో.

503. శ్లో॥ ఆ బ్రహ్మ స్తంబ పర్యంత దేవర్షి పితృమానవాః ।
తృప్యంతు పితరస్సర్వే పితృమాతామహాదయాః,

504. శ్లో॥ అతీతకులకోటీనాం సప్తద్వీపనివాసినాం ।
తేషామాప్యాయనార్థాయ ఇదమస్తితిలోదకం.

505. శ్లో॥ నారకేషు సహస్రేషు యాతనాయేషు సంస్థితః ।
తేషామాప్యాయ నార్థాయ దీయతే సలిలం మయా॥

ఇట్లు జెప్పి మృతబంధువులకు తర్పణ జేయుటట్లగును.

506. శ్లో॥ యే బాంధవాశ్చా బాంధవాః యేచాన్యే జన్మబాంధవాః ।
తే సర్వే తృప్తి మాయాంతు మయాదత్తాంబునా సహ॥

507. శ్లో॥ యేకే చాస్మత్కులేజాతా అపుత్రా గోత్రిణోమృతాః ।
తేషామాప్యాయ నార్థాయ వస్త్ర నిష్పీడ నోదకం॥

ఈ శ్లోకముచే బట్టపిండిన నీళ్లను తెలియని బంధువుల గురించి యివ్వ వలయును.

## 4. దేవపూజ

308. దివ్ = క్రీడాయాం, ద్యోతనే యను రెండును ధాత్వర్థములు. ప్రకాశించుటచేగాని, క్రీడించుటచేగాని దేవశబ్ద నిర్వచనము. దీనికి లక్ష్యార్థము పరబ్రహ్మ. వాచ్యార్థమున బ్రహ్మాదిదేవతలంనరు జెప్పబడుదురు. పూజయనగా దేవుని మహీకరించుట (గొప్ప జేయుట) అర్థము. ఇందులకు తన శరీర, ప్రాణ, ధనాదుల సహితము దేవుని కర్పించుట ముఖ్యార్థమగును. లాక్షణికముగా :-

దేవుడు తనకిచ్చిన అన్నాదులను యిష్టదేవత కర్పించి పూజించుట సాధారణార్థము ఇదే వాడుకయందు గలదు. ఆత్మజ్ఞానము కల్గనంతవరకు దేవతామూర్తులను కల్పించుకొని వాని కర్పనాదులతో బూజించవలయును.

2. ఆత్మజ్ఞానులైనవారు దేవశబ్దమునకు లక్ష్యార్థమైన పరబ్రహ్మార్థమునే గ్రహించి యభేదదృష్టిచే మూర్తిపూజల జేయరు.

3. ఉపాసకులు లక్ష్యము నిల్పుకొను నేర్పరులైన ధ్యానమాత్రమే జేయుదురు గాన మూర్తిని బూజించరు.

4. మఱికొందరు సాధకులు మానసిక స్నానసంధ్యలను, మానసిక జప హోమాదులను, మానసిక పూజలనే జేతురు.

మానసిక స్నానాదుల జేయుటందు ప్రాణాయామాద్యష్టాంగ యోగము దాని సాధనము. యోగసిద్ధులకే యది శక్యమగును. ఇతరుల కశక్యము గాన మానసిక స్నానాదుల గోరువారి క్రింది శ్లోకముల పఠన మాత్రము జేసినచో వారి కట్టిఫలములు గలుగును.

508. శ్లో॥ ఖస్థితం పుండరీకాక్షం మంత్రమూర్తిం హరిం స్మరేత్ ।
శ్యామలం శాంతహృదయం ప్రసన్నవదనం శుభం॥

509. శ్లో॥ దివ్యచందన లిప్తాంగం చారుహాసం శుభేక్షణం ।
వనమాలా పరివృతం దివ్య పీతాంబరావృతం॥

510. శ్లో॥ అనేకరత్న సంఛన్న స్ఫురన్మకుట కుండలం ।
నారదాదిభిరాసేవ్యం భాస్వద్విమల కంకణం॥

511. శ్లో॥ సకింకిణీక కేయూర ధారిణం మకుటోజ్వలం ।
సువర్ణకంకణైర్దీప్తం కింకిణీ భిర్విరాజితం॥

512. శ్లో॥ గరుత్మతా వినతయా స్తూయమాన మహర్నిశం ।
ధ్వజ వజ్రాంకుశాలక్ష్య పాదపద్మైస్సు నిర్మలం॥

513. శ్లో॥ తత్పాద పంకజాం గంగాం నిపతంతీంస్వమూర్ధని ।
చింతయేద్బ్రహ్మరంధ్రేణ ప్రవిశంతీంస్వకాంతనుం॥

514. శ్లో॥ తయాసంక్షాళితం ధ్యాయే బాహ్యమభ్యంతరమలం ।
తత్క్షణాద్వి రజోమంత్రీ జాయతే స్ఫటికోపమః॥

515. శ్లో॥ ఇదం మానసికం స్నానం ప్రోక్తం హరిహరాదిభిః ।
ఇదం స్నానం వరం మంత్రాత్సహస్రాదధికం స్మృతం॥

516. శ్లో॥ సార్ధ త్రికోటి తీర్థేషు స్నానాత్కోటి గుణాధికం ।
రజస్తమో మోహజాతా న్జాగ్రత్స్వప్న సుషుప్తిజాన్॥

517. శ్లో॥ వాఙ్మనః కాయజా న్దోషాన్న వైతాన్న వభిర్హరేత్ ।

518. శ్లో॥ జ్ఞానహ్రదే ధ్యానజలే రాగద్వేషమలాపహే ।
యస్స్నాతిమానసే తీర్థే సయాతి పరమంపదం॥

519. శ్లో॥ ఇడా భాగీరథీ గంగా పింగళా యమునానదీ ।
తయోర్మధ్య గతానాడీ సుషుమ్నాచ సరస్వతీ॥

520. శ్లో॥ ఏవం జ్ఞానహ్రదే తీర్థే రాగద్వేషమలాపహే ।
యస్స్నాతి మానసే తీర్థే సయాతి పరమాంగతిం॥

2. సంధ్యా జపాదుల మానసిక విధ మీ క్రింది శ్లోకముల పఠించుటచేనగు.

521. శ్లో॥ అచ్యుతోహ మనంతోహ మవ్యక్తోహ మహం హరిః ।
ఆనందోహ మచింత్యోహ మజోహ మృతోస్మ్యహం॥

522. శ్లో॥ నిత్యోహం నిర్వికల్పోహం నిరాకారోహ మవ్యయః ।
సచ్చిదానంద రూపోహం పరిపూర్ణో స్మ్యహం సదా॥

523. శ్లో॥ బ్రహ్మైవాహం న సంసారీ ముక్తోహ మితిభావయేత్ ।
అశక్నువంధారయంతు వాక్యమే తదుదీరయేత్॥

3. దేవపూజా మానసిక మీ క్రింది శ్లోకముల పఠనచే జేయవలయును.

524. శ్లో॥ రత్నైః కల్పితమాసనైర్హి మజలైః స్నానం చ దివ్యాంబరం ।
నానారత్న విభూషితం మృగ మదా మోదాంకితం చందనం ।
జాజీచంపక బిల్వపత్ర రచితం పుష్పం చ ధూపం తథా ।
దీపం దేవదయానిధే పశుపతే హృత్కల్పితం గృహ్యతాం॥

525. శ్లో॥ సౌవర్ణేమణి ఖండరత్న ఖచితే పాత్రే ఘృతం పాయసం ।
భక్ష్యం పంచవిధం పయోదధియుతం రంభాఫలం పానకం ।
శాకానామయుతం జలే రుచికరం కర్పూర ఖండోజ్వలం ।
తాంబూలం మనసామయా విరచితం భక్త్యా ప్రభోస్వీకురు॥

526. శ్లో॥ ఛత్రం చామరయోర్యుగం వ్యజనకంచా దర్శకం నిర్మలం ।
వీణాభేరి మృదంగ కాహళ కళాగీతం చ నృత్యం తథా ।
సాష్టాంగం ప్రణత స్తుతిర్బహువిధం హ్యేతత్సమ స్తంమయా ।
సంకల్పేన సమర్పితం తవ విభోపూజాం గృహాణప్రభో॥

527. శ్లో॥ ఆత్మాత్వం గిరిజామతిస్సహ చరాఃప్రాణాః శరీరం గృహం ।
పూజాతే విషయోప భోగరచనా నిద్రాసమాధి స్థితిః ।
సంచారః పదయోః ప్రదక్షిణ విధి స్తోత్రాణి సర్వాగిరో ।
యద్యత్కర్మ కరోమిత త్తదఖిలం శంభో తవారాధనం॥

528. శ్లో॥ కరచరణకృతం వాకాయజం కర్మజం వా ।
శ్రవణ నయనజంవా మానసం వా పరాధం ।
విహితమ విహితం వా సర్వమే తత్షమస్వ ।
జయజయ కరుణాబ్దే శ్రీమహాదేవ శంభో ॥

529. శ్లో॥ శృణు బ్రహ్మ విదాంశ్రేష్ఠ దేవతార్చన ముత్తమం ।
న దేవః పుండరీకాంక్షోన దేవస్త్రిలోచనః ।
అకృత్రిమమ నాద్యంతం దేవం తుచిచ్ఛివం విదుః॥

తా॥ బ్రహ్మజ్ఞులందు శ్రేష్ఠుడా! ఉత్తమ దేవతార్చన జెప్పెదవినుము. కల్పిత నామరూపములుగల విష్ణువేగాని, శివుడేగాని దేవుడని యదార్థమైన యర్థముగాజాలదు. యదార్థమందు దేవుడు కల్పిత మూర్తిరూపుడుగాని, మనోమయుడుగాని గాజాలడు. కృత్రిమములుగాని, ఆద్యంతములు లేని కేవల చిన్మాత్రుడు, స్వయంప్రకాశుడు (దేవుడు) శివుడు.

530. శ్లో॥ అహింసా ప్రథమం పుష్ప మింద్రియాణాం చ నిగ్రహం ।
క్షాంతిపుష్పం దయాపుష్పం జ్ఞానపుష్ప మతఃపరం ।
తపఃపుష్పం సత్యపుష్పం భావపుష్ప మథాష్టకం॥

తా॥ జ్ఞానులకు పుష్పము లివి :- 1. అహింసా 2. ఇంద్రియనిగ్రహము 3. క్షమ 4. దయ 5. జ్ఞానము 6 తపస్సు 7. సత్యము 8. భావన.

531. శ్లో॥ దేహో దేవాలయః ప్రోక్తః సజీవః కేవలశ్శివః ।
త్యజేదజ్ఞా నిర్మాల్యం సోஉహం భావేనపూజయేత్॥

తా॥ దేహమే దేవాలయము. వాసనవర్జితుడైన కేవల జీవుడు శివదేవుడు. ఇట్లు దెలిసికొని యజ్ఞానమను నిర్మాల్యమును విడిచి ఆత్మ దేవు నర్చించవలెను.

532. శ్లో॥ అజ్ఞాత శివతత్వానాం ఆకారాద్యర్చనం స్మృతం ।
యోజనాధ్వన్య శక్తస్య క్రోశాధ్వః పరికల్పితః॥

తా॥ పై జెప్పినట్లు శివతత్వ జ్ఞానము గలుగనివారికి మూర్తిపూజ కల్పించబడినది. 8 మైళ్లు నడువజాలనివానికి 2 మైళ్ళే దూరముగలదని లోకులు కల్పించి చెప్పుదు రదే న్యాయమిచ్చటని దెలిసికొనవలయును.

309. పరమహంస పరివ్రాట్టులైన జ్ఞాన సన్యాసులందును, స్థిరవైరాగ్య వివేక యుక్తులందు మాత్రమే వారి ప్రశాంత మనస్సులందు నివాతాచంచల దీపము వెలుంగునట్లు ఆత్మజ్ఞాన మచంచలముగ నుండునుగాని యితరులందట్టిది యుండజాలదు. కావున ఆత్మజ్ఞాన మట్టిదిగలుగునంతవరకు ప్రతివారునిత్యకర్మలందు మూర్తిపూజాదుల విడిచినయెడల పతితులగుదురు. దైనిక షట్కర్మలందు జేరిన నాల్గవదైన దేవపూజ విధియగునుగాన విడువక జేయవలయును గాని నిరసించరాదు. ఆత్మజ్ఞుడు సహితము లోకసంగ్రహార్థము ధర్మాచరణ జేయవచ్చును.

533. శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠస్తత్త దేవేతరోజనః ।
సయత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే॥ గీ. అ. 3 శ్లో. 21

తా॥ గొప్పవాడేది జేయునో, ప్రమాణముగ గ్రహించునో యదే యితరులు ప్రమాణముగ గైకొని యాచరింతురు.

534. శ్లో॥ దుఃఖాన్యపి సుఖాయంతే విషమప్య మృతాయతే ।
మోక్షాయతే చ సంసారోయత్ర మార్గస్సశాంకరః॥

తా॥ ఆత్మజ్ఞుడు లోకసంగ్రహార్థ మాచరించునప్పుడు దుఃఖముల సుఖములుగా భావించును. విషము నమృతముగ, సంసారమునే మోక్షముగ భావించును.

2. సుఖదుఃఖముల సమముగా జూచుచు లోకకల్యాణమునకై వర్తించువారి యాచరణ లోకులకు సుఖప్రదమగును. ఎట్లు వర్తించినగాని "సర్వథా వర్తమానోపి సయోగీమయివర్తతే" యను న్యాయము వారికనువర్తించునుగాన వారియందు దోషారోపణ జేయరాదు. ఇట్టి యాత్మజ్ఞానము గలుగునంతవరకు దేవపూజ విడిచి మూర్తిపూజ నిందించినవారికే దోషములు గలుగును. ఉభయభ్రష్టులగుదురు.

పద్యము 16_దారుశిలాది భావమున దైవముల న్నిరసించి తామను ।
జ్జేరుదు రెంతచేరువ యొకో తమ కాత్మ వివేకపాకము ।
ల్వారి ధరంబులి న్విడిచి వచ్చిన చాతకధూర్తు లంబుధి ।
న్దారు గనంగ శక్తులె సుధా మధురోదక పానసౌఖ్యముల్॥

310. మూర్తులందు పరబ్రహ్మ అస్తిరూపమని భావనగాన భక్తిశ్రద్ధలే దేవపూజయందు ప్రధానము. కాని సంభారాధిక్యము (పూజాద్రవ్యముల హెచ్చు) ముఖ్యము గాజాలదు. దంబార్థముగ జేయరాదు. ప్రేమయే కారణమగును. ఆ ప్రేమయే భక్తి శ్రద్ధనామములతో జెప్పబడుచున్నది. కావున మూర్తులందు బ్రహ్మదృష్టి యుంచియే పూజించవలయును. వానిని (మూర్తులను) యవి దారుశిలలను భావముచే పూజించరాదు.

535. శ్లో॥ శివభక్తి ప్రథా పూర్ణే శరీరే వృత్తిరన్యయా ।
వ్రతమేత ధనుష్ఠేయం నతచ్ఛప్రచ్ఛధారణం॥

తా॥ శరీరమందెప్పుడు పరిపూర్ణ శ్రద్ధాభక్తులతో వృత్తి జ్ఞానముదయించునో నప్పుడు దానిచే శివవ్రతమనుష్ఠించవలయునేగాని తుచ్ఛమైన శిలా మూర్తిని మాత్రము ధరించినంతనే శివపూజ గాజాలదు.

536. శ్లో॥ అస్తిభాతి ప్రియంరూపం నామచేత్యంశ పంచగం ।
ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయం॥ "పంచదశి"

తా॥ అస్తి, భాతి, ప్రియము (సత్తు, చిత్తు, ఆనందము), రూపము నామము లివి యైదుమూర్తులందు అంశములు (కళలు). మొదటి మూడంశములు బ్రహ్మస్వరూపములు తుది రెండు జగద్రూపములు (వికారములు).

311. వర్ణాతిశయ, జ్ఞానాతిశయములచే దేవతల నామరూపాతిశయముల దారుశిలాది మూర్తులందు కల్పనజేతురు. పంచాయతన దేవతాకల్పన వేదవిరుద్ధము గాజాలదు. దేవత నామరూపముల మూర్తులందు ప్రాణ ప్రతిష్ఠాదులచే కల్పనజేయబడును. ప్రాణప్రతిష్ఠ రెండువిధము లివి :-
1. స్థిరప్రతిష్ఠ 2. చరప్రతిష్ఠ.

1. దేవాలయములందు సమస్తజనుల కుపయోగపడుటకై మూర్తులందు స్థిరప్రతిష్ఠల జేయబడును.

2. ప్రతివాడు తన మాత్రమునకే యుపయోగపడుటకు మూర్తులందు చరప్రతిష్ఠ జేసికొనుచు నిత్యము పూజించును. కల్పసూత్రములందు స్థిర చర ప్రతిష్ఠా విధానము జెప్పబడినది. అదే ప్రకారముగ జేయవలయును.

3. పంచాయతన దేవతల దేవాలయములందు మూర్తులుంచి ప్రాణ ప్రతిష్ఠలనుజేయునప్పు డేదేవతను మధ్యనుంచి తక్కినదేవతల నల్దిశలందుంచగ నా దేవాలయము మా దేవతనామమున బల్కుచుందురు. మన భారతదేశ మందన్ని మతముల దేవాలయములు గలవు.

537. శ్లో॥ యదాతుమధ్యే గోవింద మీశాన్యం శంకరం యజే ।
దాగ్నేయే గణనాథంచ నైరుత్యాం తపనం తథా ।
వాయవ్యమంబికాంచైవ యజేన్నిత్యం సమాహృతః.

తా. ఎచ్చట మధ్యన విష్ణువు, శంకరుడు, గణపతి, సూర్యుడు, దేవి క్రిమముగ ఈశాన్యాగ్నేయ, నైఋతి, వాయవ్య దిశలందుంచుదురో అదివిష్ణు దేవాలయమందురు.

538. శ్లో॥ యదాతుశంకరంమధ్యే ఈశాన్యం శ్రీపతింయజే ।
దాగ్నేయ్యాం చ తథా హంసం నైరుత్యాం పార్వతీసుతం ।
వాయవ్యంచ సదాపూజ్యా భవానీం భక్తవత్సలా.

తా. ఏ దేవాలయమందు మధ్యన శంకరుని, తక్కినవారిని పై జెప్పి నట్లుంచుదురో యది శివాలయము.

539. శ్లో॥ హేరంబంతు యదామధ్యే ఐశాన్యామచ్యుతంయజే ।
దాగ్నేయ్యాం పంచవక్త్రింతు నైరుత్యాంద్యుమణిం తథా ।
వాయవ్యమంబికాంచైవం యజేన్నిత్యమతంశ్రితః.

తా. ఏ దేవాలయమందు మధ్యన గణపతిని తక్కిన నలుగురిని పైజెప్పి నట్లుంచుదురో యది గణపతి దేవాలయమందురు.

540. శ్లో॥ సహస్రాంశుం యదామధ్యే ఐశాన్యాం పార్వతీపతిం ।
ఆగ్నేయ్యామేకదంతంచ నైరుత్యామచ్యుతం తథా ।
వాయవ్యం పూజయేద్దేవీం భోగమోక్షైక భూమికాం.

తా. సూర్యుడు మధ్యగల దేవాలయమును ఆదిత్యాలయమందురు.

541. శ్లో॥ భవానీంతు యదామధ్యే ఐశాన్యాం మాధవం యజే ।
దాగ్నేయ్యాం పార్వతీనాథం నైరుత్యాం గణనాయకం ।
ప్రద్యోతనంతు వాయవ్యా మాచార్యస్తు పూజయేత్.

తా. దేవాలయమందు మధ్యన దేవి, ఈశాన్యమందు విష్ణు, ఆగ్నేయ మందు శంకరుడు, నైరుతియందు గణపతి, వాయవ్యమందు సూర్యు డుండురో అది దేవీగుడి యందురు.

312. చరమూర్తి పూజలకు స్వతస్సిద్ధములైన శాలిగ్రామములు ముఖ్య ములు. వానికి ప్రాణప్రతిష్ఠాదులనవసరములు, ఇతరములైనవి బంగారు మొదలగు ధాతునిర్మితములకును, శిల, దారు, మృణ్మయాదులకును, యంత్రములకును, ప్రాణప్రతిష్ఠ జేసికొనియే పూజలకుపయోగించ వలయును. భక్తిశ్రద్ధలచే నిష్కామనగా నిత్యము పూజించగ నవిచిరకాలము నందు చిత్తశుద్ధిని కలిగించును. సకాముకులకు ప్రతిబంధకము లేనప్పుడు చిరకాలమున ఫలమొసంగును.

542. శ్లో॥ ఆరోగ్యం భాస్కరాదిచ్ఛే ద్ధనమిచ్ఛే ద్ధుతాశనాత్ ।
ఐశ్వర్య మీశ్వరాదిచ్ఛే న్మోక్షమిచ్ఛే జ్జనార్ధనాత్.

తా. సూర్యునిపూజచే ఆరోగ్యము, ధనము అగ్నిపూజతో, ఈశ్వరపూజచే నైశ్వర్యము, విష్ణు పూజతో మోక్షము గలుగునని గౌతముడు క్రియా కాండయందు జెప్పెను.

543. శ్లో॥ అతఃపరంచ దేవానామర్చనం కారయేద్బుధః ।
గణేశం పూజయేద్యస్తు విఘ్నస్తస్యనవిద్యతే ।
ఆరోగ్యార్థేర్చయేత్సూర్యం ధర్మమోక్షాయమాధవం ।
శివం ధర్మార్థమోక్షాయ చతుర్వర్గాయ చండికాం.

తా. స్నానసంధ్యా జపహోమానంతరము దేవతలపూజ బుద్ధిమంతుడు జేయవలయును. గణపతిపూజచే విఘ్నములు దొలంగును. సూర్యుని వలన ఆరోగ్యముగలుగును. విష్ణుపూజచే ధర్మమోక్షములుగలుగును. శివపూజవలన ధర్మార్థమోక్షము గలుగును. దేవిని పూజించినవారికి చతు ర్విధ పురుషార్థఫలములని పద్మపురాణమందు గలదు.

313. పూజాభేదములివి :- 1. పంచోపచారములు 2. షోడశోపచార ములు 3. చతుష్షుపచారములు.

1. పై జెప్పిన లమిత్యాదులు పంచోపచారములు.

2. షోడశోపచారములివి :- ధ్యానా, వాహనా, సన, పాద్యా, ర్ఘ్యా, ఆచమన, స్నాన (పంచామృతాది) పునరాచమన, వస్త్రోపవస్త్ర, యజ్ఞోప వీత, ఆభర్ణాద్యలంకార, అక్షత, ధూప, దీప, నైవేద్య (శర్కరాది) ఫల తాంబూల, దక్షిణ, నీరాజన మంత్రపుష్ప, ప్రదక్షిణాది నమస్కారస్తుతి, నృత్యగీతాది సర్వస్వసమర్పణాంతములు.

3. చతుష్షష్టిపూజలు తాంత్రికములు-తంత్రభేదమున వేరు వేరు గలవు. త్రిపురతంత్రమందు జెప్పినట్లు దేవీపూజలందు చతుష్షష్టిపూజలు జేయుదురు. అశక్తులను గురించి జెప్పిన శ్రీ శంకరభగవత్పాదకృత చతుష్షష్టి శ్లోక పఠన జేయవచ్చును.

2. సంకల్ప పూర్వకముగ పృథివి, కలశ, శంఖు, ఘంట, గణపతిని (ఆవరణదేవతలను) ముందుపూజించియే ఇష్టదేవతపూజ పై విధములం దేదేనిచే నైనగాని జేయవచ్చును. పూజద్రవ్యములు, అక్షతలు, కాలోద్భవ పత్రపుష్పాదులు, పంచామృతములు, నీళ్లు, గంధము, పసుపుకుంకుమ, ఊదువత్తులు, కర్పూరము, శర్కరాదులు, ఫలములు, దీపములు, దక్షిణ, తాంబూలములు. వీనితో దేవునర్చించవలయును.

3. అర్చానంతరము దేవునకు ప్రదక్షిణ నమస్కారములు జేసి నృత్య గీతాదులతో స్తుతి జేయవలయును.

**544.** శ్లో॥ నమస్కార స్తథా శీశ్చ సిద్ధాంతోక్తిః ప్రరాక్రమః ।
విభూతి ప్రార్థనాచేతి షడ్విధం స్తోత్రలక్షణం.

తా. నమస్కారము జేయుట, దీవెనలగోరుట, నీవే దేవుడనుట, అతని పరాక్రమ విభూతుల వర్ణించుట, అతనిని ప్రార్థించుట లీయారు స్తుతులన బడును.

4. దేవునికి స్నానము జేయించునప్పుడు వైదికమంత్రములచేగాని, భక్తితోతాంత్రికోక్త విధానమునగాని జేయవచ్చును. శ్రద్ధయే తపస్సన బడినది. అశ్రద్ధచే జేయరాదు, జేసిన పూజ నిష్ఫలమగుచు పాపము గలుగును.

545. శ్లో॥ అశ్రద్ధాపరమం పాప్మశ్రద్ధాహి పరమంతపః ।
తస్మాదశ్రద్ధయా దత్తం హవిర్నాశ్నంతి దేవతాః ।
ఇష్ట్వాదత్వాపివామూర్ఖః స్వర్గం నహిసగచ్ఛతి.

తా. పై జెప్పినది తాత్పర్యము.

546. శ్లో॥ శంకావిహితచారిత్రో యస్స్వాభిప్రాయ మాశ్రితః ।
శాస్త్రాతిగస్స్మృతో మూర్ఖోధర్మతంత్రోపలోధనాత్.

తా. మూర్ఖుడు ధర్మశాస్త్ర మతిక్రమించి స్వకపోల కల్పితముచే స్వేచ్ఛాచరణ జేసిన పతితుడగును. "ధర్మోరక్షతరక్షితః" కావున భక్తి శ్రద్ధలచే దేవపూజ జేయవలయును. దేవపూజజేసిన దైనికషట్కర్మలందలి నాల్గవ నిత్యకర్మ జేసినవాడగును. ఇట్లు దేవపూజ సమాప్తము.

# 5. వైశ్వదేవము

314. వైశ్వదేవమును దైనికషట్కర్మలందారవదిగా శ్లోకమున జెప్పబడినది. అందే అతిథి పూజ నైదవది యనబడినది. కాని శ్లోకమునందు క్రమవివక్షలేదు కావున వైశ్వదేవమును ముందాచరించియే యతిథిపూజ గావింపవలయును. పాకము సిద్ధమైనంతనే అన్నసంస్కారార్థమునకై వైశ్వదేవము మొదట జేయవలయును. సంస్కృతాన్నము దేవత నివేదనకుపకరించును. నివేదనాంతరమతిథ్యభ్యాగతుల కన్నమిడవలయును. మొదటనే యతిథులకన్నమిచ్చినచో శేషాన్నముచే వైశ్వదేవము దేవతా నివేదన జేయరాదు. ఉచ్ఛిష్టాన్నమనబడును. కావున వైశ్వదేవముచే సంస్కారమగుచున్న పంచసూన దోషపరిహారము జేయవచ్చును. "పాఠక్రమాదర్థక్రమోబలీయాన్" అను న్యాయమిచ్చట వర్తించును.

547. శ్లో॥ చుల్లీఫేటనీ చైవ మార్జనీలేపనీ తథా ।
ఉదకుంభీ చ పంచైతే పంచసూనాప్రకీర్తితా.

తా. పంచసూనములివి :- 1. చుల్లీ=పొయ్యిలు 2. ఫేటనీ=కట్టెలమంట 3. మార్జనీ=ఊడ్పు 4. లేపనీ=అలుకజల్లుట 5. ఉదకుంభీ=నీళ్లఘటములు. ఈ పనులు జేయునప్పుడు జీవహింస ఘటించును. ఇట్టి వైదు దోషముల పంచసూనములందురు.

2. అన్నముల పాకము జేయునప్పుడీ పంచసూనములు సంభవించుట లనివార్యము లైనందున వైశ్వదేవముజేసి యన్నసంస్కారము గావించని యెడల దోషయుక్తాన్నములతో దేవతా నివేదనగాని, అతిథ్యభ్యాగతుల కిడుటగాని, భుజించుటగాని దోషమే యగును. ఇందువలన వైశ్వదేవమును మొదటనే జేయుటవిధి.

548. శ్లో॥ అకృత్వావైశ్వదేవేతు యదిదేవ నివేదనం ।
సద్యః పాషండతామేతి కర్తోచ్ఛిష్టం యదిస్మరేత్.

తా. వైశ్వదేవమునకు పూర్వము దేవునికి అన్నము నివేదించిన యెడల నుచ్ఛిష్ట మనబడినందున కర్త వెనువెంటనే పాషండుడనబడును. మఱియు

549. శ్లో॥ నివేదితేన చాన్నేన వేశ్వదేవం యదిష్యతే ।
వినియోక్త విధాదేవమీమాంసాయాః ప్రకోపనః.

తా. దేవతా నివేదితాన్నముచే వైశ్వదేవము జేసిన యెడల మీమాంసా శాస్త్రమందలి వినియోగవిధికి విరోధమగును.

550. శ్లో॥ వ్యత్యయో నహిశంకార్హా స్మృతివాక్యవిరోధతః ।
వైశ్వదేవం విధాయాదౌతదన్నం మంత్రసంస్కృతం ।
దేవేభ్యశ్చ ప్రదాతవ్యం బలికర్మావసానకం.

తా. ధర్మశాస్త్రప్రమాణమునకు విరోధమగునప్పుడు వ్యత్యాసముగ (క్రిందు మీదుగ) జేసినగాని దోషముగలుగదు. కాన శంకించ రానందున వైశ్వదేవమే మొదటజేసి తరువాత సంస్కారాన్నమున దేవతలకు నివేదన ద్వారబలి మున్నగునవి జేయవలయును.

551. శ్లో॥ ఖడ్గధారా సమంవిద్యాత్స్మార్త కర్మమునీరితం ।
సూక్ష్మాత్సూక్ష్మతరంతచ్చయత్త స్మృతివిలోకనాత్.

తా. బోధాయనముని జెప్పిన ధర్మశాస్త్రమాలోకించగ స్మార్తకర్మ యతి సూక్ష్మమున కంటెను సూక్ష్మము. శ్రుతి తాత్పర్యజ్ఞుడైనందున నతడు జెప్పినది కత్తిపదను వంటిది. (పొరపాటునందు హాని యగును).

552. శ్లో॥ స్మృతిజ్ఞానాదనుష్ఠాన మనంతం ఫలదం విదుః ।
స్మృత్యాభావేపి వృద్ధాభ్యాం స్త్రీభ్యోమార్గావగాహనం.

తా. శాస్త్రజ్ఞానముచే కర్మలనుష్ఠించినచో ననంత ఫలముగలుగును. స్మృతి ప్రమాణము లభించనిచో పెద్దలవలనగాని, వృద్ధస్త్రీలవలనగాని తెలిసికొని కర్మలనుష్ఠించవలయును.

553. శ్లో॥ శ్రుతిస్మృతివిహీనాంధో కాణోహ్య త్రైకయావినా.

తా. శ్రుతి స్మృత్యర్థములు దెలియనప్పుడంధుడు, నేదొకటి దెలియ నప్పు డేకాక్షుడగును.

554. శ్లో॥ యాతయామంగతరసం పూతి పర్యుషితంచయత్ ।
ఉచ్ఛిష్టమపిచామేధ్యం భోజనంతామ సంప్రియం. గీ. అ_17 శ్లో_10.

తా. అన్నము పక్వము పూర్తిగానిది, పాసిపోయినది, రసహీనమైనది, దాచియుంచినది, ఇతరులుదినగ మిగిలినది, దిను ఆహారపదార్థములు తాము సులకే ప్రియము.

2. పై కారణములున్నందున వైశ్వదేవకర్మ ముందుగ జేయవలయును. ఇది కర్మనామధేయమేగాని శ్రౌతయాగ నామధేయము గాజాలదు. 48 సంస్కారములందు జేరిన వైశ్వదేవమొక స్మార్తకర్మ. వైశ్వదేవమునందు పంచమహాయజ్ఞముల జేయవలయును. ఔపాసనాగ్నిసిద్ధి గలవారధి కారులు. వైశ్వదేవ సమస్థ జేయనివారు పంచమహాయజ్ఞముల జేయుట కనధికారులు. వీరు అన్నసంస్కార మాత్రమునకై లౌకికాగ్నియందు వైశ్వదేవము జేయవచ్చును. స్మార్తులు, శ్రౌతులు వారికి ఔపాసనాగ్ని విచ్ఛిత్తియైనచో లౌకికాగ్నియందు పంచమహాయజ్ఞయుక్త వైశ్వ దేవము జేయవలయును. వైశ్వదేవ మెఱుంగని వారి యిండ్లందు భుజించవలసి నప్పుడైనగాని వైశ్వదేవమును జేయువారు లౌకికాగ్నియందే వైశ్వ దేవము విధిగా యొనరించి భుజించవలయును.

315. దేశకాల సంకీర్తన ఆచమన ప్రాణాయామ పూర్వకముజేసి అన్న సంస్కార ద్వారా ఆత్మ సంస్కారార్థం శ్రీయజ్ఞేశ్వర మద్దిశ్య శ్రీయజ్ఞే

ప్రీత్యర్థం పంచమహాయజ్ఞేనయక్ష్యేయని వైశ్వదేవ సమస్తజేసినవారును, ఇతరులు శ్రీ పరమేశ్వర ముద్దిశ్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం షడాహుతి వైశ్వదేవ కరిష్యేయని యుదకమునిడిచి "యత్ర్వాగ్నిస్థాప్యతే" యను మంత్రములతో పైజెప్పిన ప్రకారమగ్నిస్థాపనాదుల జేసికొనవలయును. పిమ్మట ఆకుల పాత్రియందన్నమును మధ్యగ వ్యంజనాదికముల నొకచోట ప్రక్కన యుంచవలయును (మొదట పాత్రయందు నీళ్లు ప్రోక్షించి నెయ్యి వేసి అన్నాదులుంచవలయును) క్రింది మంత్రముచే నన్నపాత్ర అగ్నిపై పెట్టితీసి అగ్నికి ఉత్తరమున అలికిన నేలపై బెట్టి ప్రోక్షించి యభిఘారము వేసి భాగములు వేరుజేయవలెను.

"అన్నమగ్నావధిశ్రిత్య ఉదగుద్వాస్య అద్భిఃప్రోక్ష్య అభిఘార్య తదన్నం పంచధావిభజ్య (స్మార్తలు) ఇతరులు తదన్నంత్రైధావిభజ్య యనుచు మూడు భాగములందొకటి పూర్వదిశకు రెండవది యుత్తరము, మూడవది పశ్చిమమునకు వేరు జేయవలెను.

2. షడాహుతి హోమములు, అగ్రిదానము, బలిహరణాదు లందరికిని సమానము. పూర్వభాగాన్నమునుండి షడాహుతులు క్రింది మంత్రములతో జేయవలయును. ఆహుతి మృగీముద్ర(మధ్యమానామికాంగుష్ఠములగలిపి)చే నన్నము దీసికొని యొక్కొక మంత్రముతో నొకొక ఆహుతి అగ్నియందు స్వాహాంతమున హోమము జేయవలయును. తర్జనీకనిష్ఠికల నంటనీయక పైకి ఉంచవలయును. మొదట "విద్యుదసి" యను మంత్రిముతో హస్త ప్రక్షాళన జేసికొని, "అదితేనుమన్యస్వ" మంత్రముతో నీళ్ళగ్నికి ప్రదక్షిణగా పైజెప్పినట్లు జుట్టియే అన్నము జేకొనవలయును.

1. "ఓమగ్నయే స్వాహా" అగ్నయ ఇదంనమమ. త్యాగమన్ని హోమములకు విధి.
2. "సోమాయ స్వాహా" సోమాయేదం. (ఇది సంఖ్యకు హెచ్చైనను పెద్దలనుష్ఠించవలెననిరి.)
3. "విశ్వేభ్యో దేవేభ్యస్స్వాహా" విశ్వేభ్యో దేవేభ్యః ఇదం.

4. "ధృవాయ భూమాయ స్వాహా" ధృవాయ భూమాయేదం.

5. "ధృవక్షితయే స్వాహా" ధృవక్షితయ ఇదం.

6. "అచ్యుతక్షితయే స్వాహా" అచ్యుతక్షితయ ఇదం.

7. "అగ్నయే స్విష్టకృతే స్వాహా" అగ్నయే స్విష్టకృత ఇదం. (త్యాగ మన్నిటికి)

3. కొంచమన్నము పూర్వోత్తర భాగములనుండి చేకొని పరిక్కనున్న వ్యంజనములతో గలిపి మృగీముద్రచే దీసికొని అగ్నికుత్తరమందుండు ఊష్ణభస్మమందు "అగ్నేరుత్తరతః ఊష్ణేభస్మమని స్వాహా" యనుచు దానిని భస్మమందుంచి ప్రజాపతయ ఇదంనమమ యనవలయును. (మనస్సునందే యనవలెను) అనంతరము "వృష్టిరసి" "అదితేన్వమగ్గిస్థా" మంత్రముల పైజెప్పినవి జేయవలయును. పిమ్మట నేత్రాచమన సంకల్పపూర్వకముగ శ్రీయజ్ఞేశ్వర (శ్రీపరమేశ్వర) ప్రీత్యర్థమగ్రిదానంకరిష్యే యని విడిచి మఱల "విద్యుదసి" "అదితేనుమన్యస్వ" పూర్వమువలె జేసి అన్నభాగ పూర్వమునుండి స్మార్తలు, ఇతరులు పశ్చిమభాగమునుండి జెప్పిన ముద్రతో నన్నము జేకొని క్రింది మంత్రముతో "ఓం దదామీత్యగ్నిర్వదతి । తథేతి వాయురాహతత్ । హంతేతిసత్యంచంద్రిమాః । ఆదిత్యాత్త్సత్యమోమితి । ఆపఃతత్సత్యమాభరన్యశో యజ్ఞస్యదక్షిణాం । మమోపాత్తదురితక్షయోమే కామస్సమృతాగ్గ్స్వాహా" అగ్నయే పరమాత్మన ఇదంనమమ. మఱల "నదితేస్వమగ్గ్స్థా" "వృష్టిరసి" జేయవలెను.

4. మఱల పూర్వము జెప్పినట్లు ఆచమన సంకల్పాదులజేసి స్మార్తలు పంచ మహాయజ్ఞానంతరము ఇతరులు వెంటనే వ్యాహృతిహోమం కరిష్యే యను చుదకము విడిచి "విద్యుదసి" "అదితేనుమన్యస్వ" జెప్పి "అన్నభాగాన్మి శిత్వా" యని గలిపిన అన్నమునుండి పైవిధముగ నొక్కొక్క ఆహుతి ఒక్కొక క్రింది మంత్రముతో హోమము జేయవలయును.

1. "ఓం భూస్వాహా" అగ్నయ ఇదంనమమ. 2. "ఓం భువస్వాహా" వాయవే ఇదంనమమ. 3. "ఓం సువఃస్వాహా" సూర్యాయ ఇదంనమమ.

4. "ఓం భూర్భువస్స్వస్స్వాహా" ప్రజాపతయ ఇదంనమమ. మఱల "అదితేన్వ మగ్గ్‌స్థా" "వృష్టిరసి" జేసి అగ్నిస్తు పై జెప్పినట్లు జేసి పూర్వమువలె సంకల్పాదులజేసి కాలానుగుణ్యముగ వైశ్వదేవకర్మ సాద్గుణ్యార్థమనాజ్ఞాతత్రియ, దశవార గాయత్రి మంత్ర జపంకరిష్యే యనుచుదకమువిడిచి పై జెప్పినట్లు జేయవలయును. పిదప అనేనషడాహుతి వైశ్వదేవకర్మణా భగవాన్సర్వాత్మకః యజ్ఞపురుషః ప్రీణాతు యనుచుదకమువిడిచి దేవతలకు మహానివేదన జేసిన పిమ్మట బలిహరణము అతిథి సత్కారాది భోజనాంత నిత్యకర్మల పూర్తి జేయవలయును.

315. వైశ్వదేవ సమస్థజేసిన శ్రౌతస్మార్తయాజులు షడాహుతి హోమానంతరము అగ్నికి పశ్చిమమందు మొదట భూమినలికి క్రింది ప్రకారముగ బలుల క్రింది విధముగ స్మార్తయాజుష కారికా ప్రకారముగ పంచధా విభాగించిన యన్నమునుండి పూర్వభాగమున షడాహుతిజేసి, పూర్వోత్తర భాగములనుండి కొంచము కొంచమన్నము దీసికొని వ్యంజనాదులతో నూష్ణభస్మమందు పైజెప్పినట్లుహోమముల జేసినపిదప బలులనుంచక పూర్వమే అలికిన భూమిపై తూష్ణీ "వాస్తేన" "అవోక్ష్య", "పరిషిచ్య" ప్రతిసారి యనుచు నైదుప్రేళ్ళని గలిపిన ముద్రతో నుత్తర భాగాన్నమునుండి యొక్కొక్క మంత్రముతో నొక్కొక బలిపెట్టవలయును. కారిక-"కర్తా శుచిర్భూత్వాఽచార్యముఖా ద్వైశ్వదేవ స్వరూపం సర్వం యథాశాస్త్రం జ్ఞాత్వాఽచార్యం సంపూజ్యతదనుజ్ఞాం గృహీత్వాయథా ధర్మోపదేశం ప్రథమమాచార్య సన్నిధౌకుర్యాత్" అనగా కర్త శుచియగుచు నాచార్యునివలన యథాశాస్త్రముగ వైశ్వదేవకర్మయంతయు దెలిసికొని వారి యనుజ్ఞతో నతనిముందర మొదటిదినమందు వైశ్వదేవమును (బలులబెట్టు ప్రకారము దెలియుటకు) జేయవలయును.

555. శ్లో॥ ప్రథమం పూర్వదిగ్భాగే ద్వితీయం చ తథోత్తరే ।
తృతీయం మధ్యమం ప్రోక్తం చతుర్థం దక్షిణే తథా ।
పంచమం పశ్చిమం ప్రోక్తమితిభాగ వినిర్ణయః॥

తా॥ పంచధాన్న విభాగమందు మొదటిభాగము తూర్పుగ, రెండవదు త్తరము వంకగ, మూడవది మధ్యనుండునట్లు నాల్గవదాని దక్షిణమున, నైదవ భాగము పడమరగునట్లు భాగకల్పన జేయవలయును.

556. శ్లో॥ షడాహుతీరగ్రిభాగే ద్వితీయే శాకహోమకం ।
ద్వితీయే బలిదానంస్యా దగ్రిదానం తృతీయకం ।
తృతీయే దేవ భూతేపి పితృర్థేచ చతుష్టయం ।
పంచమే మానుషో హోమం వైశ్వదేవస్య లక్షణం॥

తా॥ 1 వ భాగమునుండి (తూర్పునగల) షడాహుతి. 2 వ (ఉత్తరమునగల) భాగమునుండి కొంచెమన్నము వ్యంజనాదులతో గలిపి ఊష్ణభస్మ హోమము. దీనినుండియే (2 వ దానినుండి) బలులబెట్టవలయును. 3 వ (మధ్యనగల) భాగమునుండి అగ్రదానము, దేవయజ్ఞము, భూతయజ్ఞము. 4 వ (దక్షిణమునగల) భాగమునుండి పితృయజ్ఞము. 5 వ (పశ్చిమమునగల) భాగమునుండి మనుష్యయజ్ఞము జేయవలయును. 1. "ధర్మాయస్వాహా" అని బలిపెట్టి దీనిచుట్టు నీళ్లు ప్రదక్షిణగా జుట్టుటకుముందు దేవతనామముచే త్యాగము ప్రతిబలినిపెట్టి "నమమ" యనవలెను. ఉ॥ ధర్మాయేదంనమమ. 2. "అధర్మాయస్వాహా" అధర్మాయేదంనమమ. ఈ రెండుబలుల కొకే సారి నీళ్ళు జుట్టవలెను. 3. "అద్భ్యస్వాహా"=అద్భ్యఇదం. 4. "ఓషధి వనస్పతిభ్యస్స్వాహా" = ఓషధివనస్పతిభ్య ఇదం 5. "రక్షోదేవజనేభ్య స్స్వాహా"=రక్షోదేవజనేభ్య ఇదం. 6. "గృహ్యాభ్యస్వాహా"=గృహ్యాభ్య ఇదం. 7. "అవసానేభ్యస్స్వాహా"=అవసానేభ్యఇదం. 8. "అవసాన పతిభ్యస్స్వాహా"=అవసానపతిభ్య ఇదం. 9. "సర్వభూతేభ్యస్స్వాహా"= సర్వభూతేభ్య ఇదం. 10. "కామాయస్వాహా"=కామాయ ఇదం. 11. "అంతరిక్షాయస్వాహా"=అంతరిక్షాయ ఇదం. 12. "యదేజతిజగతియచ్చ చేష్టతినామోభాగోయం నామ్నేస్వాహా"=వాయవ ఇదం. 13."పృథివ్యై స్వాహా"=పృథివ్యా ఇదం. 14. "అంతరిక్షాయస్వాహా"=అంతరిక్షా యేదం. 15. "దివేస్వాహా"=దివఇదం. 16. "సూర్యాయస్స్వాహా"= సూర్యాయ ఇదం. 17. "చంద్రమసేస్వాహా"=చంద్రిమస ఇదం. 18.

"నక్షత్రేభ్యస్స్వాహా"=నక్షత్రేభ్య ఇదం. 19. "ఇంద్రాయసస్వాహా"= ఇంద్రాయేదం. 13వ బలి మొదలుకొని 19వర కేడుబలుల "ప్రోక్ష్యా వోక్ష్య పరిమృజ్య" ప్రాగపవర్గముగ అగ్నికి దక్షిణదిశయం దలికిన భూమిపై పడమరనుండి తూర్పుగ నొకదాని కొకటిగబెట్టి యన్నిటి కొకే సారి నీళ్లతో పరిషేచనజేసి 20. "బృహస్పతయేస్వాహా"=బృహస్పతయ ఇదం. 21. "ప్రజాపతయేస్వాహా"=ప్రజాపతయ ఇదం. 22. "బ్రహ్మణే స్వాహా"=బ్రహ్మణ ఇదం. 20 నుండి 21 వరకగు మూడుబలుల దక్షిణదిశ యందే 19వ బలిముందర నొకదానికి ముందొకటిగ తూర్పునకుబెట్టి వేరువేరుగ ప్రోక్షణ జేయవలయును. పిదప అపసవ్యముగ "ప్రోక్ష్యపరిమృజ్య" 23. "స్వధాపితృభ్య స్వాహా" యనుచు బలిబెట్టి పితృభ్య ఇదంనమమయని అప్రదక్షిణగా నీళ్లుజుట్టి సవ్యము "అపఉపస్పృస్య" యని నీళ్ళంటవలెను. ఈ 23వ బలిని 17వ బలికి సరిగ దక్షిణమునకు దూరముగ బెట్టవలయును. (17-23 మధ్య ఇంకొక బలికి స్థలముండునట్లు) మఱల నపసవ్యము "ప్రోక్షణావోక్షణ"జేసి 24. "నమోరుద్రాయపశుపతయేస్వాహా"=యని బలిపెట్టి పశుపతయేరుద్రాయ ఇదం యనుచు ప్రదక్షిణగా నీళ్లుజుట్టి సవ్యముగనప "ఉపస్పృశ్య"జేసి నేత్రాచమన ప్రాణాయామ పూర్వక సంకల్పమున శ్రీయజ్ఞేశ్వర ప్రీత్యర్థం "భూతయజ్ఞేనయక్ష్యే" యనుచుదకము విడిచి "విద్యుదసి" చేసి అలికిన భూమిపై 9వ బలికి నుత్తరముగ ముందు వేరుగ "ప్రోక్షణావోక్షణ"జేసి దానిపై 25. "భూతేభ్యోనమః"యనుచు బలిపెట్టి భూతేభ్యః ఇదంనమమయనవలెను. మఱొకపక్షమునం దిట్లు మంత్రము. "యే భూతేభ్యో ప్రచరంతి దివా లేదానక్తం (కాలానుసారముగ) బలిమిచ్ఛంతోవితుదస్య ప్రేష్యాః తాభ్యోబలిం పుష్టికామోహరామి మయి పుష్టిం పుష్టిపతిర్దధాతు స్వాహా" యనుచు బలిపెట్టి దివానక్తం చారిభ్యోభూతేభ్య ఇదంనమమ అనవలెను. 25వ బలికి నీళ్ళు ప్రదక్షిణగా జుట్టి "వృష్టిరసి" తో హస్తప్రక్షాళన (ఈ బలికి అన్న మధ్య 3వ భాగమునుండి దీసికొని భూతయజ్ఞము జేయవలయును.) మఱలాచమన ప్రాణాయామపూర్వక సంకల్పముగ శ్రీయజ్ఞేశ్వర ప్రీత్యర్థ "మగ్రిదానం

కరిష్యే''యని యుదకమువిడిచి అగ్నికి పై జెప్పినట్లు"అదితేనుమన్యస్వ"తో నీళ్ళు జుట్టి "విద్యుదసి'' జేసికొని 21 వ మధ్యభాగాన్నము మృగీముద్రతో దీసికొని "ఓం దదామీ" యని పై జెప్పిన మంత్రముతో నగ్రదానము అగ్నియందు హోమము జేయవలయును. "నమమ" త్యాగము జెప్పిన పిమ్మట "వృష్టిరసి"ని "అదితేన్వమగ్గ"ను తరువాత జేయవలయును. పూర్వమువలె ప్రాణాయామ సంకల్ప పూర్వకముగ "పితృయజ్ఞేనయక్ష్యే" యనుచుదకము విడిచి అపసవ్యమై దక్షిణదిశయం దలికిన భూమి "అవోక్ష్యాది"నిజేసి 26వ బలి "పితృభ్యస్స్వధాస్తు" యనుచు బెట్టి పితృభ్యఇదం నమమ యని అప్రదక్షిణగా ప్రోక్షించి (జుట్టి) సవ్యముగ నపోపస్పృశ్య జేసి "వృష్టిరసి'' జెప్పి మఱల పూర్వమువలె సంకల్పాదిపూర్వకముగ శ్రీయజ్ఞేశ్వర ప్రీత్యర్థం మనుష్య యజ్ఞేనయక్ష్యే యనుచుదకము విడిచి నివీతిగా 5 వ పశ్చిమ భాగాన్నమునుండి మృగీముద్రతో నవాదానము జేకొని "మనుష్యేభ్యోహంతా'' యను మంత్రముతో అగ్నియందు హోమము జేయవలెను. మనుష్యేభ్య ఇదంలేక సనకసనందనాది పరమయోగిభ్యః ఇదం యనుచు త్యాగము జెప్పవలయును. మఱల "అదితేన్వనుమగ్గ్స్థా''జేసి "వృష్టిరసి" జేసికొని ప్రాణాయామ సంకల్ప పూర్వకముగ శ్రీయజ్ఞేశ్వర ప్రీత్యర్థం "బ్రహ్మ యజ్ఞేనయక్ష్యే'' యనుచుదకము ఒదలి 2 వ ఉత్తర భాగాన్నమునుండి యైదువేళ్ళు గలిసిన ముద్రతో నవదానము జేకొని 27. ప్రజాపతయే స్వాహా'' యనుచు దక్షిణదిశయం దలికిన భూమిపై 22వ బలికి దక్షిణమందు "పోత్రిక్షణాపోత్రిక్షణ'' జేసిపెట్టి ప్రజాపతయ ఇదంనమమ యనవలయును. పిమ్మట నాల్గుభాగాన్నముల నొకేచోటుజేర్చి మఱలాచమన ప్రాణాయామ పూర్వక సంకల్పముజేసి వ్యాహృతిహోమం కరిష్యేయని "విద్యుదసి" "అదితేనుమన్యస్వ''తో నీళ్ళగ్నికిచుట్టి పైజెప్పిన "భూఃస్వాహా''ది మంత్రములతో వ్యాహృతి హోమమునుజేసి ''అదితేన్వ మగ్గ్స్థా" జేసి "వృష్టిరసి"తో హస్తపరిక్షాళన జేసికొని "అగ్నేత్వన్నోంతమ'' యను పై జెప్పిన మంత్రముతో నగ్నిస్తుతినిజేసి గో బ్రాహ్మణేభ్యః శుభం భవతుయని స్వగోత్ర నామోచ్చారణజేసి "అభివాదయే'' యనవల

యును. పిదప సంకల్ప ప్రాణాయామపూర్వకముగ శ్రీయజ్ఞేశ్వర ప్రీత్యర్థం పంచమహాయజ్ఞాంగ సాద్గుణ్యార్థం "అనాజ్ఞాతత్రియ, దశవారం గాయత్రీ మంత్రజపం కరిష్యే" యనుచుదకము విడిచి పై జెప్పినట్లు మంత్రపఠన గాయత్రీ జపముజేసి అనేన పంచమహాయజ్ఞకర్మణా భగవాన్సర్వాత్మకః యజ్ఞపురుషః ప్రీణాతు యనుచుదకము విడువవలయును. పిమ్మట దేవతా మహానై వేద్యముజేసి ద్వారబలిహరణార్థము శేషాన్నము దీసికొనిపోయి బహిర్ద్వారము ప్రక్కన క్రింది శ్లోకపఠనతో ప్రోక్షించిన భూమిపై బలి పిండనువేసి యుదకము విడువవలయును.

557. శ్లో॥ శ్వానౌహిశ్యామ శబలౌ వైవస్వత కులోద్భవౌ ।
తాభ్యాం బలిం ప్రదాస్యామి రక్షేతాం పథి సర్వదా॥

558. శ్లో॥ ఐంద్ర వారుణ వాయవ్య యామ్యానో నైఋతోద్భవః ।
వాయసాః పరిగృహ్ణంతు భూమౌపిండం మయాహృతం॥

"శ్వావాయసేభ్య ఇదం "నమమయని త్యాగముజెప్పి లోపలజేరి హస్త పాద ప్రక్షాళన జేసికొని అతిథి, అభ్యాగతుల నిరీక్షణజేసి పోష్యవర్గమునకు ముందు భోజనమిచ్చి తాను భుజింపవలయును. ఇదే విధమున వైశ్వదేవ కర్మ నిత్యము జేయవలయును. వైశ్వదేవకర్మ సమాప్తము.

## 6. అ తి థి పూ జ

316. అత=సాతత్యగమనే యను ధాత్వర్థమందు "అతతిస్థితః=అతిథి యగును. సాతత్యగమనజేయు (నిత్యముదిరుగు) వారు అతిథులు లక్షణచే భైక్షుకులనబడుదురు. గృహస్థునింటికన్నార్థులైన పాంథులు జేరినప్పుడు సత్కరించి వారి కన్నాదులనిచ్చుట ఆతిథ్య ధర్మము. ఇది దైనిక నిత్య కర్మలందారవధర్మము. శక్తిలేనియెడల నతిథులకు నుండుటకై వసతి, అర్ఘ్యపాద్యాదుల, పానీయోదకములనైన నిచ్చి అతిథిని సంతోష పెట్టవల యును. గృహస్థుడే ఇతరాశ్రమిణుల కాశ్రియుడు. కావున బ్రహ్మచారి, యతిథి, బిక్షులకన్న ప్రదానముజేయుట విధియగును. వీరికి మాధుకరము తొందరగా నివ్వవలసియుండునప్పుడు పాకాన్నమునుండి వైశ్వదేవార్థము,

మహానివేదనకు వేరు పాత్రిలందన్నము వేరుగదీసికొని శేషాన్నమునుండి మాధుకరమిచ్చిన దోషముగలుగదు. అతిథులకు, వైశ్వదేవానంతరము మధ్యాహ్నకాలమందు జేరిన అభ్యాగతులకు అన్నమిడకతానే భుజించిన దోషముగలుగునని కఠోపనిషత్తునందు ఇతర శ్రుతులందు జెప్పబడినది.

౯౮. శ్రుతి॥ "యస్యాగ్నిహోత్రిమదర్శ, మపౌర్ణమాస్య. మచాతుర్మాస్య మనాగ్రయణ, మతిథి వర్జితంచ ఆహుత, మవైశ్వదేవ, మవిధినాహుతమాసప్తమాన్తస్యలోకాన్హినస్తి". 'ప్రశ్నోపనిషత్'

తా. అగ్నిహోత్రము, దర్శపూర్ణమాస యాగములు, చాతుర్మాస్యలు, అతిథిపూజ జేయకుండుట విధిగా హోమము జేయకునికి, జేసిన ద్రవ్యము హుతముకాకుండుట, వైశ్వదేవము లివి యెవరాచరించరో వారి ఏడు తరముల వారి పుణ్యలోకములకు హాని గలుగును.

2. అతిథుడైన నచికేతునకు ఆతిథ్యమియ్యనందున తనకు దోషము గలుగకుండుటకై యముడు సహితము నచికేతునకు మూడువరంబులొసంగి నట్లు కథ శ్రుతియందు గలదు.

౯౯. శ్రుతి॥ 'తిస్రోరాత్రీయదవాత్సీ గృహేమే అనశ్నబ్రహ్మన్నతిథిర్నమస్యః నమస్తేస్తుబ్రహన్ స్వస్తిమేస్తుతస్మాత్ప్రతిత్రిన్వరాన్వృణీష్వ'.

3. గృహస్థుడతిథ్యభ్యాగతుల సత్కారార్థమునకై యన్న సంచయము జేసికొనవచ్చును.

౧౦౦. శ్రుతి॥ 'నకంచనవసతౌప్రత్యా చక్షీత తద్వ్రతంతస్మాద్యయాకయాచ విధయా బహ్వన్నం ప్రాప్నుయాత్'. అనగా యోగ్యమైన కర్మలచే నన్నసంచయమతిథి సత్కారమునకుగాను జేసికొనవలయును. అతిథికి ఉండుటకు వసతిలేదని మఱలింపరాదు.

3. అతిథిపూజ శ్రద్ధాభక్తులతో యాచరించవలయును, "అశ్రద్ధయా అదేయం" యని శ్రుతిగలదు. అతిథిపూజ దైనికషట్కర్మలందారవ కర్మ నిత్యవిధియనబడినది. ఇట్టి దైనిక షట్కర్మలాచరించువారికి నిస్సంశయముగ పైజెప్పిన ఫలముగలుగును. వైశ్వదేవానంతరము దేవతలకు

మహానివేదన మొనర్చిన శేషాన్నముతో నతిథి యభ్యాగతులకు, పోష్య వర్గమును తృప్తిపరచి శేషమమృతాన్నమును తాను భుజించవలయును. ఇట్టి గృహస్థుడే ధార్మికుడు. ప్రతినిత్యము గృహస్థుడు పగలు, రాత్రి రెండుపూటల వైశ్వదేవానంతరము భోజనము జేయవలయును.

4. కారణాంతరములచే గృహస్థుడు నిత్యకర్మల దినమానమందు ననుష్ఠింప జాలకున్న యెడల రాత్రి ప్రహర పర్యంతము నిత్యకర్మల విడువక నాచ రించవచ్చును.

## భో జ న వి ధి

317. భోజనము తూర్పుముఖముగ జేసిన ఆయుష్యము. దక్షిణదిశ యందపకీర్తి (కొందఱి మతమునకీర్తి) పశ్చిమ ముఖమందు లక్ష్మీప్రాప్తి ఉత్తరాభిముఖమున ఋతఫలముగలుగునని గృహస్థుని భోజన లక్షణము గౌతముడు జెప్పెను.

2. భోజనస్థలమటికి శుద్ధిపరచిన భూమిపై భోజన పాత్రనుంచవలయును. పాత్రనుంచకపూర్వమే భూమిపై నీళ్లతో మండలమును గీయవలయును. వర్ణ క్రమముగ మండలమిట్లు చతురస్ర, త్రికోణ, వర్తుల, అర్ధచంద్రా కారముల క్రమముగ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు మండల ముల జేసికొని దానిపై భోజన పాత్రనుంచి, పాత్రలు "విస్తరి" ఆకు పాత్రయగుచో దానిపై నీళ్ళుజల్లి అభిఘారముంచి (నెయ్యివేసి) తరువాత అన్నాదులుంచవలయును. పాలాశ, పద్మ, కుటజ, మధపర్ణ (ఇప్పాకులు) అరటి పాత్రలకుపయుక్తములు గావచ్చును. కాని

559. శ్లో॥ గర్భస్థకదళీ పత్రం జలస్థం పద్మపత్రకం ।
లతాపాలాశపత్రంచ భుంక్త్వాచాంద్రాయణం చరేత్.

తా. విప్పని అరిటాకు, మునిగియుండు తామరాకు, తీగమోదుకాకు, నిషిద్ధము. వీనిలో యన్నముల దినినచో చాంద్రాయణమను ప్రాయ శ్చిత్తము జేసిన దోషముపోవును.

560. శ్లో॥ సదండం కదళీపత్రం వామభాగేగ్రితస్థితం ।
నిరదండం నిరగ్రించ భుంక్త్వాచాంద్రాయణం చరేత్.

తా. విస్తరి అరటి ఆకగునప్పుడు అది దండము అగ్రముగలదై ఎడమకు అగ్రముగా నుంచుకొనవలయును. గాని దండములేని అగ్రములేని దానిలో భుజించిన చాంద్రాయణ ప్రాయశ్చిత్తమగును.

318. పాలు, నెయ్యి, పప్పు, వ్యంజనాదుల నుపయోగించవచ్చును. శక్తి యున్నను, సంభవించినప్పుడు భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యాదుల దినవచ్చును.

2. పాత్రి యందన్నాదుల వడ్డించిన పిమ్మట అన్నముపై యభిఘారము వేయవలయును. గాయత్రీ మంత్రముతో ప్రోక్షించి దక్షిణహస్త జలముచే "సత్యంత్వర్తేన" యను మంత్రముతో పగటి భోజనమునకు "ఋతంత్వా సత్యేన" మంత్రముతో రాత్రి భోజనమందు పాత్రచుట్టు నీళ్ళనుజుట్టి, పిమ్మట విస్తరికి దక్షిణమందు చిత్రిగుప్తాదుల కీక్రిందివిధమున కొంచ మన్నమునుంచి దానిపై ప్రోక్షణజేసి ఆకు బోర్లించి హస్త ప్రక్షాళనజేసి కొనవలయును. మంత్రములివి :-

"చిత్రాయనమః చిత్రిగుప్తాయనమః యమాయనమః సర్వభూతదమనాయ నమః" యనుచు నొక్కొకటి పెట్టవలయును. రాత్రి నిట్లు జేయరాదు.

3. పిదప హస్తమునందు 'ఆపోశన' కునీళ్ళను భార్యగాని నితరులుగాని యిచ్చినవి జేకొని 'అమృతమస్తు అమృతోపస్తరణమసిస్వాహా' యని చప్పుడు గాకుండునట్లు మ్రింగవలయును. తరువాత ప్రాణాహుతుల నీ క్రిందిమంత్రముతో మ్రింగవలయును. 1. 'ప్రాణాయస్వాహా 2. అపానయ స్వాహా 3. వ్యానాయస్వాహా 4. ఉదానాయస్వాహా 5. సమానాయ స్వాహా' యనుచొక్కొక యాహుతిని తన దక్షిణహస్త తర్జనీమధ మాంగుష్ఠమునగలిపి యాముద్రతో కేవలాన్నము నే చేకొనుచు ప్రాణాయ రెండవసారి తర్జనివిడిచి మధ్యమానామికాంగుష్ఠములతో అపానాయ), మూడవసారి అనామిక కనిష్ఠాంగుష్ఠములతో వ్యానాయ, నాల్గవసారి

కనిష్ఠనువిడిచి నాల్గు వ్రేళ్ళతో ఉదానాయ, ఐదవసారి యైదు వ్రేళ్ళనుగలిపిన ముద్రతో సమానాయ' స్వాహాంతమునందు ముఖములో వేసికొనవలయును.

4. భోజనసమయమందు పై యాహుతులు వేసికొనునప్పుడే వామ హస్తముచే భోజనపాత్రినంటించి యుంచవలయును. గాని ప్రాణాహుతులు వేసికొనిన పిమ్మట వామహస్తముతో పాత్రనంటరాదు. అంటిన దోషమగును. వామహస్తమును పాత్రనుండి దీయునప్పుడు వామపాదాంగుష్ఠముచే పాత్రనంటియుంచవలయును. 'నాంతరేభోజనం' యను గౌతమ వచనముచే యవాంతర భోజనము నిషిద్ధము గానాన్వారబ్ధముండవలయును. ఇట్లు జేయు ప్రాణాహుతులందొక్కొక యాహుతికి ఫలములు క్రమముగ నిట్లొక్కొక్కటి యనబడినది. ఆత్మ, సర్వభూతములు, నాగులు, దేవతలు, పితరులు తృప్తినొందుదురు. పాత్రజుట్టిన జలశేషము త్రాగరాదు.

5. భోజనము జేయునప్పుడు రెండుహస్తముల మోకాళ్ళమధ్య నుంచవలయును. ఇట్లు భుజించువారికి యొక్కొక్క కబళభక్షణం దొక్కొక్క 'అతిరాత్రి' యను యాగఫలము లభించును. ఇట్టి భోజన విధిని అగ్నిహోత్రవిధి యందురు. ఒక లవణ భక్షణమైన అవాంతరముగ నుండుచు భుజించినచో గోమాంస భక్షణతుల్య పాపమని జెప్పబడినది.

6. భోజనసమయమందు నీళ్ళ పాత్రిను దక్షిణమువైపునుంచి కొనవలయును. యెడమవైపునుంచి కొనిన పాత్రలోని నీరు ద్రాగిన దోషమగును.

561. శ్లో॥ యదాభోజనకాలేతు వామపార్శ్వేస్థితం జలం .
శ్వానమూత్రిసమంతోయం పీత్వాచాంద్రియణం చరేత్.

7. అనేకులుగలిసి పంక్తి భోజనము జేయునప్పుడు దృష్టి దోషము గలుగదు. 'త్రిసుపర్ణా' ది మంత్రములతో అన్నము పవిత్రమగును.

8. భోజనము పూర్తియైనప్పుడుత్తరాపోశన క్రింది మంత్రముతో బుచ్చుకొని లేవ వలయునేగాని ఆపోశనదీసికొనక లేవరాదు లేచిన దోషమగును.

"అమృతాభిధానమసి రౌరవేపుణ్యనిలయే పద్మార్బుదనివాసినామర్థినా ముదకం దత్తమక్షయ్యముపతిష్ఠతు' యని నీళ్ళు ఆపోశనగా మ్రింగ వలయును.

562. శ్లో॥ యత్రిక్ృచన సంస్థానాం క్షుత్తృష్ణోపహతాత్మనాం ।
దుర్గతీనాం మయాదత్త ముచ్ఛిష్టముపతిష్ఠతు.

9. పై శ్లోకముతో భుక్తశేషాన్నము భూమిపై వైచి నుదకముచే హస్తప్రక్షాళన దానిపై వైచి ఉత్తరాపోశన పైజెప్పినట్లు దీసికొన వలయును. తరువాత లేచి ముఖహస్త పాదప్రక్షాళన జేసికొనవలయును. తర్జనీతోదంతచాలన జేయరాదు. జేసిన పితరులకు హాని గలిగించిన వారగుదురు. పిమ్మట శుచిస్థలమందు గూర్చుండి రెండాచమనల (పురాణోక్త స్మృత్యుక్తముల) జేసి క్రింది మంత్రము పఠించవలయును.

౧౦౧. శ్రుతి॥ వాఙ్మఆసన్నసోప్రాణః అక్షోశ్చక్షుః కర్ణయోశ్శ్రుతం బాహవోర్బలం ఊరోర్వోరోజః అరిష్టావిశ్వాన్యంగానితనూః తనువామేసహ నమస్తేస్తు మామాహిగ్ంసీ వయఃసుపర్ణః ఉపసేదురింద్రం ప్రియమేధా ఋషయోనాథమానః అపధ్వాంత మూర్ణుహిపూర్ధిచక్షుర్ముముగ్ధ స్మాన్నిధయేవబద్ధాన్ప్రాణా నాంగ్రంధిరసి రుద్రోమా విశాంతకః తేనాన్నేనాప్యాయస్వ నమోరుద్రాయవిష్ణవేర్మృత్యోర్మేపాహి అంగుష్ఠ మాత్రః పురుషః అంగుష్ఠంచ సమాశ్రితః ఈశస్సర్వస్యజగతః ప్రభుః ప్రీణాతు విశ్వభుక్".

౧౦౨. శ్రుతి॥ 'త్వమగ్నేద్యుభిస్త్వమాశుశుక్షణి స్త్వమద్భ్యస్త్వమశ్మనస్పరి ।
త్వంవనేభ్య స్త్వమోషధీభ్య స్త్వంనృణాంనృపతే జాయతేశుచిః'.

ఈ మంత్రమును పఠించి రెండు హస్తాంగుష్ఠములచే నీళ్ళు గైకొని కన్నులదుడువ వలయును. ఇదే యర్థమందు క్రింది శ్లోకమును పఠించవలయును.

563. శ్లో॥ శర్యాతించ సుకన్యాంచ చ్యవనం చేంద్రమశ్వినౌ ।
భోజనాంతేస్మరన్చక్షు రంగుష్ఠాంబునిక్షిపేత్.

తా. భోజనమైన పిమ్మట శర్యాతి, సుకన్య, చ్యవన, ఇంద్ర, అశ్వినీ కుమారులు వీరిని స్మరించుచు అంగుష్ఠముల నీళ్లతో కన్నుల దుడువ వలయును.

564. శ్లో॥ అగస్త్యః కుంభకర్ణంచ శమంచ బడబానలం ।
ఆహార పరిణామార్థం స్మరామిచ వృకోదరం.

తా. భోజనాంతమందు అగస్త్యుని, కుంభకర్ణుని, యముని, బడబానలాగ్నిని, భీముని స్మరించుచు పొట్టపై హస్తము దిప్పుకొనగ అన్నము జీర్ణమగును.

319. బ్రాహ్మణ భోజనోచ్ఛిష్ట పాత్రల శూద్రులంటరాదు. పాత్రనెత్తి యాస్థల పరిశుద్ధి గావించునప్పుడు భోజన పరిశుద్ధి యగును.

2. భోజనమైన పిమ్మట మూడు పూగఫలములుగాని, నక్కలుగాని, విడముగాని చర్వణ జేయవలయును. ఏక సంఖ్యగదినరాదు. తమలపాకుల నారలుదీసి తుది, మొదళ్లు త్రుంచి విడము జేసికొనవలయును. భోజనమైన వెంటనే కాలినడక జేయరాదు. కొంచము విశ్రాంతి గైకొనవలయును. పగలు నిద్రించరాదు. విశ్రాంతియైన సాయంకాలమువరకు సిద్ధాంతచింతనగాని, వేదాభ్యాసముగాని, సద్గ్రంధ పఠనగాని జేయవలయును. అర్ధాస్తమయమువరకు పురాణ కాలక్షేపణ జేయవలెను. అర్ధాస్తమయమునుండి నక్షత్రము లుదయించువరకు సాయసంధ్య జేయవలెను. రాత్రిభోజనము గృహస్థుడు జేయవచ్చును.

౧౦౩. శ్రుతి॥ "తస్మాద్విరన్నో మనుష్యేభ్యః ఉపహ్రియతే ప్రాతశ్చసాయంచ".

అను ప్రమాణముగ ఔపాసన హోమానంతరము వైశ్వదేవము జేసి భుజించవలయును.

3. అలక్ష్మీ పరిహారమునకై మృదుశయ్యయందు కొంచమైనగాని సువాసనగల పుష్పముల సంగ్రహించుకొని భార్యాయుక్తముగ శయనించవలయును. నిషిద్ధదివసములందు భార్యాసంగమము జేయరాదు.

320. స్వగృహమందు శయనించునప్పుడు తల తూర్పువంక, శ్వశుర గృహమందు దక్షిణముగ, పరవాసములందు పశ్చిమముగనుంచి శయనింపవలయును. ఉత్తరమువైపు యెప్పుడుగాని తలయుంచి శయనించరాదు. నిద్రమేల్కొని ఉషఃకాలమందే లేచి మరల పైజెప్పినట్లు దైనిక నిత్యకర్మల విధిగా నాచరించవలయును.

565. శ్లో॥ త్రిసంధ్యం శక్తితః స్నానం, తర్పణం మార్జనం తథా ।
ఉపస్థానం పంచయజ్ఞాన్ కుర్యాదామరణాంతికం.

తా. శక్తియున్న వారుణీస్నానము, త్రికాలసంధ్యల, తర్పణ మార్జనాదుల, ఉపస్థానముల, పంచయజ్ఞముల బ్రతికియున్నంతవరకు విడువక పై జెప్పిన విధముగ నాచరించవలయును.

2. ఈ యాచారకాండయందు జెప్పినట్లు సనాతనధర్మము లాచరించువారికి చతుర్విధ పురుషార్థములు గలుగును. గౌతముడు ఆదరార్థమున ద్వివారము (రెండుసార్లు) లభించు ననుశబ్దప్రయోగమును జేసి క్రియాకాండను పూర్తిజేసినాడు. ఇట్టి సంగ్రహముగ ఆచారకాండముతో త్రివర్గములనెడి ధర్మార్థకామముల విచారము పూర్తియై ద్వితీయగుచ్ఛము సమాప్తము.

ఇతి శ్రీ అంబాగస్త్యేశ్వర కరుణాపాత్రి శ్రీశీలప్పవంశ పారావార
రాకాసుధాకర రామశర్మ సూనుసకల విద్వజ్జన విధేయ
రామకృష్ణశాస్త్రి కృత ఆర్ష విజ్ఞానసర్వస్వమందు
ఆచారకాండముతో ద్వితీయగుచ్ఛము ప్రథమ
భాగము సర్వము సంపూర్ణము.

ఓం తత్సత్.



## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc
www.new.dli.ernet.in

Digital Library of India
Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals
Newspapers
Palm-Leaves (Manuscripts)
Title Ramayanam
Author
Year to
Subject Any Subject
Language Telugu
Scanning Centre Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions |
Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year
1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject
Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language
Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఆర్ష విజ్ఞాన సర్వస్వము

## ద్వితీయసంపుటం



## బ్రాహ్మణాలు

ప్రధానసంపాదకుడు :

**డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య**, ఎమ్.ఏ., పి హెచ్.డి.

న్యాయవిద్యాప్రవీణ; డిప్లొమా ఇన్ జర్మన్

రీడర్, సంస్కృతవిభాగం, ఎస్. వి. యూనివర్శిటీ,

కో-ఆర్డినేటర్, పబ్లికేషన్స్, టి. టి. డి.




ప్రచురణ :

**శ్రీ ఎస్. లక్ష్మీనారాయణ, ఐ.ఏ.ఎస్.**

కార్యనిర్వహణాధికారి,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

**1985**

# ముందుమాట

శ్రీ ఎస్. లక్ష్మీనారాయణ, ఐ.ఏ.ఎస్.
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

విశ్వమానవకల్యాణానికి విశేషించి అంకితమై, మానవతా దృక్పథానికి మహితాశ్రయమై వెలుగొందుతున్న నిత్య సత్య శబ్ద రాశి వేదం. ఇది భగవంతుని నిశ్వాసరూపంగా ఆవిర్భవించింది. సంహితలతో ప్రారంభమై బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, ఉపనిషత్తుల వరకు విస్తరించిన ఈ వాఙ్మయాన్ని వైదికవాఙ్మయం అంటున్నాం. ఛందోబద్ధమైన మంత్రభాగానికే సంహిత అనిపేరు.

ఈ సంహితలు ఋక్సంహిత, యజుస్సంహిత, సామసంహిత, ఆథర్వసంహిత అనే పేర్లతో నాలుగు. యజుస్సంహితలు కృష్ణ—శుక్ల భేదంతో రెండురకాలు. దేవతాస్తుతి ఈ సంహితలలో ప్రధానప్రతిపాద్యాంశమైనా అక్కడక్కడా ఎన్నో వైజ్ఞానిక విశేషాలు కూడా సాక్షాత్తుగాను, సాంకేతికంగాను వీటిల్లో వివరింపబడినాయి. అంత మాత్రమే కాదు; సమాజకల్యాణంకోసం, మానవాభ్యుదయంకోసం మనమాచరించవలసిన ధర్మమర్మాలు, అనుసరించవలసిన ఆదర్శ మార్గాలను కూడా మనకందిస్తున్నది వైదికవాఙ్మయం.

మంత్రద్రష్టలైన మహర్షులు మనకంటే ఎన్నో తరాల ముందువారు. దివ్యజ్ఞానసంపన్నులు, దీర్ఘదృష్టివిలసితులైన ఆ మహనీయులు రాను రాను మానవజాతికి రానున్న బలహీనతలను, సాక్షా

త్కరించుకొని, సంయమనంతో, సమ్యక్ జ్ఞానంతో వాటి నెదుర్కోవ డానికి కావలసిన శక్తిని,యుక్తిని చక్కగా ఉపదేశించారు. నిజమైన సమసమాజభావనను వైదికవాఙ్మయంద్వారా మనకందించారు. వారి ఉపదేశంలో త్యాగమే యాగమైంది. నిస్స్వార్థంగా, నియమ బద్ధంగా మంచి మర్యాదలతో మనుగడ సాధించే మానవజీవితమే ఒక యజ్ఞంగా పరిణమించింది. అలాంటి యజ్ఞభావనను మొట్ట మొదట మనకుపదేశించిన గ్రంథరాశి ఈ బ్రాహ్మణవాఙ్మయం.

(సంహితాభాగం తరువాత ఏర్పడిన ఈ బ్రాహ్మణాలు, సంహితలలో నిగూఢంగా, సాంకేతికంగా ఉన్న విశేషాలను విశ్లేషిస్తూ చక్కని ఉపాఖ్యానాలద్వారా వైదికధర్మాన్ని వివరించినాయి. భార తీయ మత_ధర్మాల చరిత్ర బ్రాహ్మణవాఙ్మయంలోనే ప్రప్రథమంగా రూపుదిద్దుకొన్నది. ఎన్నో యజ్ఞయాగాలను ఇష్టులను, వాటి నాచ రించే పద్ధతులను వివరిస్తూనే బ్రాహ్మణాలు భారతీయ సంస్కృతికి పెట్టని అలంకారాలైన ఎన్నో విశేషాలను ఆశ్చర్యకరంగా అభివర్ణి స్తున్నాయి.)

ప్రాచీన భారతీయుల ధార్మికదృక్పథానికి, సాంస్కృతికచైత న్యానికి, తాత్త్వికచింతనకు, ఎత్తిపట్టిన అద్దమే ఈ బ్రాహ్మణ వాఙ్మయం. ఆర్షవిజ్ఞానసర్వస్వం ప్రణాళికలో "బ్రాహ్మణాలు" అనే రెండవ సంపుటంగా ఈ వాఙ్మయ సారసర్వస్వాన్ని తిరుమల తిరుపతి దేవస్థానాల తరపున నిండుమనస్సుతో మీకందించడానికి నేనెంతో సంతోషిస్తున్నాను. ఈ సంపుటాన్ని చదివి, ప్రాచీన భార తీయ విజ్ఞానవైభవాలను అర్థంజేసుకొని వైదికవాఙ్మయాన్ని ఆదరించ వలసిన బాధ్యతను ప్రతివారు గుర్తుచేసుకొనగలరని ఆశిస్తున్నాను.

(ఆర్షవిజ్ఞానసర్వస్వాన్ని పది సంపుటాలలో భావనచేసి ప్రణా ళికా బద్ధంగా ప్రామాణికులైన పండితులద్వారా చక్కని విశేషాలను

సంపాదించి, సామాన్యమానవునికి అందుబాటులో ఉండేటట్లు తీర్చి దిద్ది మన ముందుంచుతున్నవారు) తి. తి. దే. ప్రచురణల కో-ఆర్డి నేటర్ డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్యగారు. వీరి లోకజ్ఞతకు, అవిశ్రాంతకృషికి నిదర్శనం ఈ సంపుటం. వీరిని మనసారా అభినంది స్తున్నాను. ఈ ప్రణాళికద్వారా ఇంకా ఇతర సంపుటాలను కూడా త్వరత్వరగా సమాజానికి అందించి శ్రీ రఘునాథాచార్యగారు వైదిక వాఙ్మయంపైన, భారతీయ సంస్కృతిపైన శ్రద్ధానక్తులను ఈతరం వారిలో పెంచగలరని భావిస్తున్నాను.

'వేదోఽఖిలో ధర్మమూలమ్'

# సంపాదకుని మాట

పరమ మంగళదేవత ప్రపన్నార్తిహారిణి పద్మావతీదేవి. ఏడు కొండలకేడుగడ, శ్రితరక్షణబద్ధదీక్షుడు, చిద్విలాసభాసురుడు శ్రీనివాస భగవానుడు. ఆ దివ్యదంపతుల పరమానుగ్రహమే ఈ అర్ష విజ్ఞానసర్వస్వం. చరిత్రకందకుండా నశించిపోయినంత పోగా మిగిలిన అర్షవాఙ్మయ విజ్ఞానవైభవాన్ని కొద్దిగానైనా ఈతరంవారికి అందుబాటులోకి తీసుకురావాలనే భవ్యమైన ఆశయంతో తిరుమల తిరుపతి దేవస్థానం అర్షవిజ్ఞానసర్వస్వమనే ఈ పది సంపుటాల ప్రణాళికను ప్రారంభించింది. దీన్ని సంపూర్ణంగా అనుగ్రహించింది భగవాన్ శ్రీనివాసుడు. ఆశీర్వదించింది జగన్మాత శ్రీ పద్మావతీదేవి. వారిరువురికి "బ్రాహ్మణాలు" అనే రెండవ సంపుటాన్ని పూర్తిచేసిన సందర్భంలో నా శతకోటి ప్రణామాల నందిస్తున్నాను.

ఈ ప్రణాళిక అవశ్యకతను సమీక్షించి శ్రీవారి ప్రతినిధిగా దీన్ని మంచి మనస్సుతో ప్రారంభించినవారు అప్పటి తి. తి. దే. కార్యనిర్వహణాధికారి, ఉత్సాహానికి మారుపేరు, శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్‌గారు. వారికి నా కృతజ్ఞతామందారాల నందిస్తున్నాను.

ఈ ప్రణాళిక నిర్విఘ్నంగా కొనసాగడానికి దోహదం చేస్తున్నవారు తి. తి. దే. ధర్మకర్తలమండలివారు. వారికి నా ధన్యవాదాలను తెలియజేస్తున్నాను. ఈ రెండవ సంపుటాన్ని ముద్రించి ప్రచురించడంలో ఎంతో ప్రోత్సాహాన్నందించి, అందమైన ముందుమాటను ఆదరంతో పలికిన, సహృదయశేఖరులు, సరసమధురహృదయులు తి. తి. దే. కార్యనిర్వహణాధికారి, శ్రీ ఎస్. లక్ష్మీనారాయణగారు. వారందించిన ప్రోత్సాహానికి నా కృతజ్ఞతాకుముదమంజరుల నర్పిస్తున్నాను.

ఈ సంపుటాన్ని ప్రచురించడానికి ప్రత్యక్షంగా, పరోక్షంగా ప్రియమిత్రములు తి. తి. దే. పౌరసంబంధశాఖాధికారి, డాక్టర్ రావుల సూర్యనారాయణమూర్తిగారు, సప్తగిరి సంపాదకులు శ్రీ కె. సుబ్బారావుగారు ముఖ్యులు. వారికి నా మనఃపూర్వకకృతజ్ఞతలు. ఇందులోని శీర్షికలకు కావలసిన విషయసేకరణ చేయడంలో, అడిగిన వెంటనే ఎందఱో పండితులు, విమర్శకులు తమ సహకారాన్ని అందజేశారు. వారికందఱికి వైయక్తికంగా నా కృతజ్ఞతాకుసుమాంజలుల నందిస్తున్నాను. సంపాదకసమితి సభ్యులు ఈ సంపుటాన్ని తీర్చిదిద్దడంలో అమూల్యాలైన సలహాలనిచ్చినారు. వారందఱికి నా అభివందనాలు.

ఈ సంపుటాన్ని సంపాదించడంలోను, ప్రెస్‌కాపీ తయారు చేయడంలోను, ప్రూఫ్‌లు చదవడంలోను నా అసిస్టెంట్స్ కుమారి డి. శారద, కుమారి. టి. సావిత్రి, శ్రీ పి. ఎస్. వి. రమణరావు ఎంతో సహకరించినారు. వారికి నా ఆశీస్సులు.

ఈ సంపుటాన్ని సర్వాంగ సుందరంగా ముద్రించిన ప్రియ మిత్రులు టి. టి. డి. ప్రెస్ మేనేజర్ శ్రీ ఎమ్. విజయకుమార్‌రెడ్డి గారికి, శ్రీ ఎమ్. గోపాలరెడ్డికి, శ్రీ పి. మోహన్‌రావుకు, వారి సహచరులకు నా ధన్యవాదాల నందిస్తున్నాను.

శ్రీరామనవమి
30—3—85

— రఘునాథాచార్య

# రచయితలు

ఏ. ఎస్. ఎస్.

శ్రీ ఏ. సోమేశ్వరశర్మ, ఎం. ఏ.
రీడర్, (రిటైర్డ్) సాంస్క్రిట్ డిపార్ట్‌మెంట్,
ఆంధ్రయూనివర్శిటీ, వాల్తేరు,
2.8.6 ప్రమేయం; 2.8.7 వైశిష్ట్యం

డి. వి. ఎ.

ప్రొఫెసర్ దివాకర్ల వెంకటావధాని,
ఎం. ఏ (ఆనర్స్), పిహెచ్.డి.
తెలుగు ప్రొఫెసర్ (రిటైర్డ్)
ఉస్మానియా యూనివర్శిటీ, హైదరాబాద్.
2.1.[illegible] యజ్ఞయాగాలు

జి. ఎస్. ఎస్.

శ్రీ జి. ఎస్. సౌందరరాజన్,
ఎమ్. ఏ. బి. ఓ. ఎల్., విద్యాప్రవీణ.,
సంస్కృతపండితుడు.
తణుకు.
2.3.8 సంగ్రహసమీక్ష

ఐ. వి. ఆర్.

శ్రీ ఐ. వెంకటేశ్వరరావు, ఎం.ఏ., శిరోమణి
లెక్చరర్, ఎస్. వి. ఓరియంటల్ కాలేజ్, తిరుపతి.
1.8 మహర్షులు

| | |
|---|---|
| కె. బి. ఆర్. | శ్రీ కె. భాస్కరరావు, ఎం. ఏ.<br>లెక్చరర్, ఎస్. వి. ఓరియంటల్ కాలేజ్, తిరుపతి.<br>2.7.8 సంగ్రహసమీక్ష |
| కె. ఆర్. | శ్రీ కరి రామానుజాచార్యులు, వ్యాకరణశిరోమణి<br>పండిట్ (రిటైర్డ్) సాంస్క్రిట్ డిపార్ట్మెంట్,<br>ఆంధ్ర యూనివర్శిటీ, వాల్తేరు:<br>2.8.8 సంగ్రహసమీక్ష |
| కె. ఎస్. ఆర్. | డాక్టర్ కె. ఎస్. ఆర్. దత్త, ఎమ్.ఏ., పిహెచ్.డి<br>ప్రిన్సిపాల్, ఎస్.వి. ఓరియంటల్ కాలేజ్, తిరుపతి<br>2.9.7 వైశిష్ట్యం |
| కె. ఎస్. వి. | శ్రీ కె. శ్రీనివాసవరదన్, శిరోమణి<br>రీసెర్చి అసిస్టెంట్, ఎస్. వి. యు. ఓరియంటల్,<br>రీసెర్చి ఇన్స్టిట్యూట్, తిరుపతి.<br>2.2.8 సంగ్రహసమీక్ష, 2.8.8 సంగ్రహసమీక్ష |
| కె. వి. ఆర్. | శ్రీ కె. వి. రాఘవాచార్యులు, ఎం. ఏ. (తెలుగు)<br>ఎం.ఏ (సంస్కృతం), విద్వాన్, డిప్లొమా ఇన్ లింగ్విస్టిక్స్,<br>లెక్చరర్, శ్రీవేంకటేశ్వర కాలేజ్ అఫ్ మ్యూజిక్<br>అండ్ డాన్స్, తిరుపతి.<br>1.14 మతం—తత్త్వం; 2.4.6 యజ్ఞయాగాలు |

కె. వి. ఆర్. కె. డాక్టర్ కె. వి. ఆర్. కృష్ణమాచార్యులు,
ఎం. ఏ., పిహెచ్.డి. విద్యాప్రవీణ
రీడర్, కేంద్రీయసంస్కృతవిద్యాపీఠమ్, తిరుపతి.
1.11 సాంఘికజీవనం; 2. 5. 7. వైశిష్ట్యం

ఎమ్. డి. బి. ప్రొఫెసర్ ఎమ్. డి. బాలసుబ్రహ్మణ్యమ్,
ఎం. ఏ., పిహెచ్.డి.
ప్రిన్సిపాల్, కేంద్రీయసంస్కృతవిద్యాపీఠమ్,
తిరుపతి.
2.1.7 వైశిష్ట్యం

ఎమ్. ఎన్. ప్రొఫెసర్ ఎమ్. నరసింహాచార్య,
ఎం. ఏ (సంస్కృతం) ఎం. ఏ (తెలుగు). పిహెచ్. డి.
ప్రొఫెసర్, హెడ్ ఆఫ్ ఇండియన్ శ్రీవైష్ణవిజం
డిపార్ట్‌మెంట్, మద్రాస్ యూనివర్శిటీ, మద్రాస్.
1.10 రాజులు

ఎమ్. ఎస్. ఎన్. డాక్టర్ ఎమ్. శ్రీమన్నారాయణమూర్తి,
ఎం.ఏ., పిహెచ్.డి; డిప్లొమా ఇన్ జర్మన్
రీడర్, సాంస్క్రిట్ డిపార్ట్‌మెంట్,
శ్రీవేంకటేశ్వర యూనివర్శిటీ, తిరుపతి.
2.2.6 యజ్ఞయాగాలు

ఎన్. ఎస్. ఆర్. ప్రొఫెసర్ ఎన్. ఎస్. ఆర్. తాతాచార్య,
పిహెచ్.డి.,న్యాయ మీమాంసా వ్యాకరణ వేదాంత శిరోమణి
ప్రొఫెసర్, కేంద్రీయసంస్కృతవిద్యాపీఠమ్,
తిరుపతి.
2.1.8 సంగ్రహసమీక్ష

పి. ఆర్. ఎస్. డాక్టర్ పి. రాధాకృష్ణశర్మ, ఎం. ఏ; పిహెచ్.డి.
డైరెక్టర్, ఎస్. వి. సెంట్రల్ లైబ్రరీ అండ్
రీసెర్చి సెంటర్, టి. టి. డి. తిరుపతి.
1.15 కవితాసౌందర్యం; 2.2.7 వైశిష్ట్యం

పి. ఎస్. ఆర్. ప్రొఫెసర్ పి. శ్రీరామచంద్రుడు,
ఎం. ఏ (సంస్కృతం), ఎం. ఏ (తెలుగు),
ఎం. ఏ (ఇంగ్లీషు), పిహెచ్. డి. శిరోమణి
ప్రొఫెసర్, సాంస్క్రిట్ డిపార్ట్ మెంట్,
ఉస్మానియా యూనివర్శిటీ, హైదరాబాద్.
1. 16 భాషాపరిణామం—గద్యవికాసం

ఎస్. బి. ఎల్. ఎన్. శ్రీ ఎస్. బి. ఎల్. నరసింహాచార్యులు, విద్వాన్.
అధ్యక్షులు, ఆగమ గురుకులము,
రావిఅనంతవరం, రేపల్లె.
2. 9. 6 యజ్ఞయాగాలు

ఎస్. బి. ఆర్. డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య, ఎం. ఏ.,
పిహెచ్. డి., విద్యాప్రవీణ, డిప్లొమా ఇన్ జర్మన్.
ప్రధానసంపాదకుడు
రీడర్, సాంస్క్రిట్ డిపార్ట్ మెంట్, శ్రీవేంకటేశ్వర
యూనివర్శిటీ, కో—ఆర్డినేటర్ పబ్లికేషన్స్ టి. టి. డి.,
తిరుపతి.
1. 1 పరిచయం, 1. 2 బ్రాహ్మణం అంటే ఏమిటి?
1. 3 సంహితలు – బ్రాహ్మణాలు, 1. 4 బ్రాహ్మణాల్లో ముందు-వెనుకలు, 1. 5 నశించిపోయిన బ్రాహ్మణాలు, 1. 6 బ్రాహ్మణాలు కూడా వేదాలేనా?

1. 7 బ్రాహ్మణాలవల్ల ఏంప్రయోజనం?
1. 8 బ్రాహ్మణాలు – పర్యానుక్రమణులు

2. 1. 1, 2. 2. 1, 2. 3. 1, 2. 4. 1, 2. 5. 1,
2. 6. 1, 2. 7. 1, 2. 8. 1, 2. 9. 1, పరిచయం

2. 1. 2, 2. 2. 2, 2. 3. 2, 2. 4. 2, 2. 5. 2,
2. 6. 2, 2. 7. 2, 2. 8. 2, 2. 9. 2, విభాగం

2. 1. 3, 2. 2. 3, 2. 3. 3, 2. 4. 3, 2. 5. 3,
2. 6. 3, 2. 7. 3, 2. 8. 3, 2. 9. 3,
సంకలనకాలం

2. 1. 4, 2. 2. 4, 2. 3. 4, 2. 4. 4, 2. 5. 4,
2. 6. 4, 2. 7. 4, 2. 8. 4, 2. 9. 4,
వ్యాఖ్యానాలు –ప్రచురణలు

2. 1. 5, 2. 2. 5, 2. 3. 5, 2. 4. 5, 2. 5. 5,
2. 6. 5, 2. 7. 5, 2. 8. 5, 2. 9. 5 ప్రసిద్ధి

ఎస్. బి. ఎస్. — శ్రీ ఎస్. బి. ఎస్. భట్టాచార్య,
శిరోమణి: ఏ. ఒ. ఎల్.,
లెక్చరర్, ఎస్. జి. కె. ఎస్. కాలేజ్.
తాడికొండ.

2. 4. 6 సంగ్రహసమీక్ష

ఎస్. ఎల్. ఎన్. — శ్రీ ఎస్. లక్ష్మణయ్యనాయుడు, ఎం.ఏ.,శిరోమణి.
కార్యదర్శి; హిందూధర్మరక్షణసంస్థ,
తిరుపతి.

2. 7. 6 ప్రమేయం

| | |
|---|---|
| ఎస్. ఎస్. ఎస్. | శ్రీ ఎస్. సుదర్శనశర్మ, ఎం.ఏ., రీసెర్చి అసిస్టెంట్, ఎస్. వి. సెంట్రల్ లైబ్రరీ అండ్ రీసెర్చి సెంటర్, టి. టి. డి. తిరుపతి. |
| | 1. 12. ప్రకృతి; 1. 13 ఉపాఖ్యానాలు; 2. 5. 6 యజ్ఞయాగాలు |
| టి. ఎస్. | శ్రీ టి. నరసింహాచార్యులు, ఎం. ఏ., వ్యాకరణ—సాహిత్య విద్యాప్రవీణ వైస్‌ప్రిన్సిపాల్, ఎస్. ఎస్. ఎస్. కాలేజ్, చిట్టిగూడూరు. |
| | 2. 7. 7 వైశిష్ట్యం |
| యు. ఎస్. ఆర్. | శ్రీ యు. సుబ్బరామశాస్త్రి, ఎం. ఏ., శిరోమణి ప్రిన్సిపాల్ (రిటైర్డ్) వేద అండ్ సాంస్క్రిట్ కాలేజ్, నెల్లూరు. |
| | 2. 6. 7 వైశిష్ట్యం |
| యు. వి. ఆర్. | శ్రీ యు. వెంకటరామయ్య, ఎం. ఏ., విద్యాప్రవీణ, భాషాప్రవీణ లెక్చరర్, ఎస్. వి. ఓరియంటల్ కాలేజ్, తిరుపతి. |
| | 2. 8. 8 సంగ్రహసమీక్ష |
| వి. కె. ఎస్. | డాక్టర్ వి. కుటుంబశాస్త్రి, పిహెచ్. డి., విద్యాప్రవీణ, శిరోమణి లెక్చరర్, కేంద్రీయసంస్కృతవిద్యాపీఠమ్, తిరుపతి. |
| | 2. 3. 6 యజ్ఞయాగాలు; 2. 4. 7 వైశిష్ట్యం |

| | |
|---|---|
| వి. ఎస్. ఎన్. | శ్రీ వి. స్వామినాథన్, ఎం. ఏ., ఎం. లిట్.<br>ప్రిన్సిపాల్, శ్రీ జగద్గురున్యాయమహావిద్యాలయం,<br>కాంచీపురం.<br>2. 5. 8 సంగ్రహసమీక్ష |
| వి. ఎస్. జి. | శ్రీ వి. సుబ్రహ్మణ్యఘనపాఠి, విద్యాప్రవీణ<br>లెక్చరర్, కె.యల్.ఎన్. సాంస్క్రిట్ కాలేజ్,<br>తెనాలి.<br>2. 3. 7 వైశిష్ట్యం |
| వి. వి. | ప్రొఫెసర్ వి. వరదాచార్య, ఎం.ఏ.,పిహెచ్.డి.<br>ప్రొఫెసర్, ఫ్రెంచి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండాలజీ,<br>పాండిచ్చేరి.<br>2. 6. 6 యజ్ఞయాగాలు |

# ప్రస్తావన

డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య
రీడర్, సంస్కృతవిభాగం
శ్రీ వేంకటేశ్వరవిశ్వవిద్యాలయం
తిరుపతి.

## బ్రాహ్మణవాఙ్మయం:

భారతీయసంస్కృతికి, తత్త్వజ్ఞానానికి, అనూచానంగా వస్తున్న అఖండ ధర్మవాహినికి మూలకందాలు వేదాలు. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదమని అవి నాలుగై వెలుగొందాయి. మంత్ర-బ్రాహ్మణాలకు రెంటికీ వేదమనే వ్యవహారం ఉంది. మంత్రభాగానికి సంహితలని పేరైతే; వాటిని వివరిస్తూ, యజ్ఞయాగాల్లో ఆయా మంత్రాల వినియోగాన్ని నిరూపిస్తూ వాటిని వ్యాఖ్యానించే గ్రంథరాశికి బ్రాహ్మణాలని పేరేర్పడింది. గాయత్రి మొII ఛందస్సులలో మంత్రభాగం అవిర్భవించింది. కాని బ్రాహ్మణ గ్రంథాలు గద్యమయాలుగా రూపొందినాయి. సంహితాభాగంలో సాంకేతికంగా నిరూపింపబడిన తత్త్వాలు కొన్ని అక్కడక్కడా బ్రాహ్మణాలలో ఆఖ్యానరూపంలో స్పష్టస్వరూపాన్ని సంతరించుకున్నాయి.

వైదికవాఙ్మయరంగస్థలిలో ద్వితీయరంగం బ్రాహ్మణకాలం. ఈసమయంలో జనజీవనవాహినిలో తాత్త్వికదృష్టికి రూపురేఖలు అంత స్పష్టంగా ఏర్పడినట్లు లేదు. అలా అని అసలు లేకనూ పోలేదు.

తృతీయరంగమైన ఆరణ్యకకాలంలో తత్త్వచింతనకు తనకంటూ ఒక స్వరూపమేర్పడింది. అయితే మటి బ్రాహ్మణవాఙ్మయం ముఖ్యంగా ప్రతిపాదించిన విశేషాలేమిటి? అనేది ప్రశ్న? ధర్మాచరణం జీవిత సర్వస్వంగా భావింపబడిన రోజులవి. ధర్మమంటే ఏదో కాదు; లోక కల్యాణాన్ని విశ్వశాంతిని కలిగించే యాగానుష్ఠానమే. కాబట్టి బ్రాహ్మణవాఙ్మయం యజ్ఞయాగాల స్వరూప స్వభావ ప్రభావాలను సమగ్రంగా సమన్వయంచేస్తూ సమాజానికి చక్కని వివరణ నిస్తున్నది.

అంతవఱకు వేదసంహితలలో దేవతాస్తుతిరూపాలుగా ఉన్న ఋగాదిమంత్రాలను యజ్ఞయాగాలలో ఎలా వినియోగించాలో బ్రాహ్మణాలు చక్కగా వివరిస్తున్నాయి. ఒకరకంగా; ఛందోబద్ధంగా ఉన్న వేదసంహితలు మూలగ్రంథాలైతే, గద్యరూపంలో ఉన్న బ్రాహ్మణాలు వాటికి వ్యాఖ్యానాలని చెప్పవచ్చు.

**ఆర్షవిజ్ఞానసర్వస్వం :**

విజ్ఞాన — తత్త్వభాండాగారాలైన వేదసంహితలలో ఎన్నో శాఖలు నశించిపోయినాయి. ఆయా శాఖలపైన ఆధారపడిన ఇతర వైదికవాఙ్మయం కూడా కాలగర్భంలో కలిసిపోయింది. ప్రతి సంహితకు ఎన్నో బ్రాహ్మణాలుండేవి. పోయినవి పోగా ఉన్న వాటిని యాగానుష్ఠానానికి ఆదరణ ఉన్నంతవఱకు కాపాడుకుంటూ వచ్చారు మనపూర్వులు. లిపికూడా సరిగా లేని రోజులవి. పుస్తకాలుండే అవకాశమే లేదు. కాని జ్ఞాపకశక్తికి, శ్రద్ధకు వాళ్లల్లో లోటు లేదు కాబట్టి ఎంతటి గ్రంథాన్నైనా అట్టే జ్ఞాపకం పెట్టుకోగలిగే వారు.

కొంతకాలం గడిచింది. కంఠస్థమైన గ్రంథాలను ఏదో ఒక లిపిలో వ్రాతస్థం చేయడం జరిగింది. కాని ఏం ప్రయోజనం? వైదిక ధర్మంమీద శ్రద్ధాసక్తులు సన్నగిల్లాయి. ఆదరణ అంతంతమాత్రం

గానే మిగిలిపోయింది. యజ్ఞయాగాలను చేయించే వాళ్ల సంఖ్య, చేసే వాళ్ల సంఖ్య కూడా నానాటికి తగ్గుతూ వచ్చింది. బ్రాహ్మణాలు నశించిపోవడం ప్రారంభమైంది. ఈనాడు నిజమాలోచిస్తే ఉన్న వాటి సంఖ్య కంటే పోగొట్టుకున్నవాటిసంఖ్యే చాలా ఎక్కువ. ఇదే గతి వాటిమీద ఆధారపడిన ఇతర గ్రంథాలకూ పట్టింది.

ఏమిటి చేయడం? వీటినిలాగే వదిలేయడమా? ఇప్పటికే ఎంతో విజ్ఞానాన్ని మట్టిపాలు చేసుకున్నాం. ఎలాగో మిగిలిన ఈ కొద్దిపాటి విజ్ఞానాన్ని కూడా మనం సంరక్షించలేకపోతే మనవారసులైన రానున్న తరాలవారికి ఎంత అన్యాయం జరుగుతుంది? నానాటికి పైపైకి పెరిగిపోతున్న భౌతికదృష్టి మానవజాతిని సర్వనాశనం చేస్తుందేగాని, శాంతితో సహనంతో బ్రతకనివ్వదు అజ్ఞానం, అహంకారం, అసూయాద్వేషాల అగ్నిజ్వాలలో అసలు మానవత్వమే మాడి మసై పోతున్నది. అందుకే కావాలి ఆర్షవిజ్ఞానసర్వస్వం. అది మనకండ్లు తెరిపిస్తుంది. మనం ఎంత కృత్రిమంగా జీవిస్తున్నామో తెలియజేస్తుంది.

సమాజంలో ప్రతివ్యక్తీ ప్రాచీనభారతీయుల విజ్ఞానవైభవాన్ని విశాలదృక్పథాన్ని సరిగా అర్థంచేసుకున్నప్పుడే ఆర్షవాఙ్మయానికి ఆదరణ లభిస్తుంది. సమాజంలో తన బాధ్యతను గుర్తించి, సమ సమాజస్థాపనకు ప్రతివాడు అంకితమౌతాడు. తద్వారా లోక కల్యాణానికి గట్టి పునాదులు పడతాయి. ఈ ఉద్దేశ్యంతోనే ఆర్షవిజ్ఞాన సర్వస్వం ప్రణాళిక ఆవిర్భవించింది. పదిసంపుటాలలో ఆర్షవిజ్ఞాన సారాన్ని అందటికీ అందుబాటులోకి తేవడానికి తిరుమల తిరుపతి దేవస్థానం అహర్నిశలు కృషిచేస్తోంది. "వేదసంహితలు" అనే మొదటి సంపుటాన్ని ఆంధ్రలోకానికి అందించింది. ఇప్పుడు "బ్రాహ్మణాలు" అనే రెండో సంపుటాన్ని సహృదయులకు సమర్పిస్తున్నది.

**సామాన్యవిభాగం :**

ఈ సంపుటాన్ని సామాన్యవిభాగమని, విశేషవిభాగమని రెండుగా విభజించాను. బ్రాహ్మణాలన్నింటికి సంబంధించిన సాధారణాంశాలు సామాన్యవిభాగంలో సమీక్షించబడినాయి. ఇందులో పది పేనుశీర్షికలున్నాయి.

**విశేషవిభాగం :**

ఇందులో నాలుగువేదాలకు సంబంధించిన ముఖ్యమైన బ్రాహ్మణాలు ప్రణాళికాబద్ధంగా వివరింపబడినాయి. ప్రతి బ్రాహ్మణంలో ఎనిమిది అంశాలపైన దృష్టి కేంద్రీకరింపబడింది. వాటిని చదివితే ఆ బ్రాహ్మణాన్ని గురించి పాఠకునికి కొంతవరకు అవగాహన ఏర్పడటానికి అవకాశం ఉంది. ఇవి ఇందులో సమీక్షింపబడిన బ్రాహ్మణాలు :

ఋగ్బ్రాహ్మణాలు : 1. ఐతరేయబ్రాహ్మణం
2. కౌషీతకిబ్రాహ్మణం

యజుర్బ్రాహ్మణాలు: 1. తైత్తిరీయబ్రాహ్మణం
2. శతపథబ్రాహ్మణం

సామబ్రాహ్మణాలు : 1. తలవకారబ్రాహ్మణం
2. తాండ్యబ్రాహ్మణం
3. ఛాందోగ్యబ్రాహ్మణం

ఉపబ్రాహ్మణాలు : 1. సామవిధానబ్రాహ్మణం
2. దేవతాధ్యాయబ్రాహ్మణం
3. సంహితోపనిషద్బ్రాహ్మణం
4. వంశబ్రాహ్మణం

అథర్వబ్రాహ్మణం : 1. గోపథబ్రాహ్మణం

అనాటి యజ్ఞభావన, యజ్ఞయాగాలలో మధ్య మధ్య వివరింపబడే విశేషాలు, యజ్ఞాచరణలో కనబడే క్రమశిక్షణ మనల్ని ఆశ్చర్య చకితుల్ని చేస్తాయి. ఋతం, సత్యం, అనాటి వారి ప్రవృత్తిలో ఎలా సహజత్వాన్ని సంతరించుకున్నాయో మనం అర్థం చేసుకోగలుగుతాము. సత్య ధర్మ శాంతి ప్రేమలు అనాటి భారతీయులకు సహజాభరణాలనే సత్యం మన మనోనేత్రానికి తప్పక గోచరిస్తుంది. అందుకే ఈ ప్రయత్నం. ఆనందంగా అందుకోండి! ఊరికే అపనిందలు వేయకుండా ఈ వాఙ్మయాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించండి! శాంతితో మీజీవితాలకు కొత్త భాష్యం చెప్పండి! మీ చుట్టూ సమాజాన్ని కూడా శాంతితో బ్రతకనివ్వండి! అదే ఆర్షవాఙ్మయం ఆశించే ఫలం.

# అ ను క్ర మ ణి

# ఆర్ష విజ్ఞాన సర్వస్వము

## బ్రాహ్మణాలు

## 1. సామాన్యవిభాగం

### 1. 1 పరిచయం

భగవంతుని నిశ్శ్వాసలే వేదాలు[1]. అవి ఋక్, యజుస్, సామ, అథర్వాలని నాలుగు. వీటి మూలగ్రంథాలను సంహిత లంటారు. ఇవి అన్నీ దాదాపు ఛందోబద్ధమైన మంత్రాలుగా ఉంటాయి. అందుకనే దీనికి మంత్రభాగమని వ్యవహారం. దేవతా స్తుతులు, యజ్ఞయాగాదివైదిక కర్మలు, ధార్మికప్రక్రియలు, తాత్త్విక చింతనలు ఇందులో ప్రతిపాదింపబడ్డాయి. ఎన్నో సంవత్సరాలు తపస్సుచేసి సంపాదించుకున్న దివ్యజ్ఞానంతో, పరమేశ్వరానుగ్రహంతో ఈసంహితలను మహర్షులు భావనాకాశంలో దర్శించారు. అందుకనే వాళ్లను మంత్రద్రష్టలంటున్నాం. వారు దర్శించిన మంత్రాల నుపయోగించి వివిధదేవతలరూపంలో ఉన్న భగవంతునికి చేసిన ఆరాధనమే యజ్ఞం. ఇది చరాచరసృష్టికంతటికి సుఖాన్ని సంతోషాన్ని, శాంతిని ప్రసాదిస్తుంది.

---

1. అస్య మహతో భూతస్య నిశ్వసితం యదృగ్వేదః బృహ. 2-4-10.

యజ్ఞయాగాలను నిర్వహించడానికి వాళ్లు కొన్ని పద్ధతులను అనుసరించారు. వాటిల్లో ఎంతో సామాజికదృష్టి, తాత్త్వికచింతన, ధర్మపరమైన ఆసక్తి స్పష్టంగా కనబడుతున్నాయి. సంహితను సరిగా అర్థంచేసుకొని దాన్ని అనేకకర్మల్లో ఉపయోగించుకుంటూ, అందులోని సాంకేతికమైన అర్థాలను వివరిస్తూ ఏర్పడిన గ్రంథాలే బ్రాహ్మణాలుగా రూపొందినాయి. ఇవి గద్యమయాలు. వేద సంహితలకు, తరువాత పెరిగిన వాఙ్మయానికి మధ్య ఈ బ్రాహ్మణాలు వంతెనలాంటివి. యాగస్వరూపాన్ని రూపొందించడమే బ్రాహ్మణాలకు ముఖ్యమైన పని అయినప్పటికీ సందర్భాన్ని బట్టి అవి చాలాచోట్ల మానవ జీవనవిధానానికి, సమాజ సంస్కృతులకు ఉపయోగించే విశేషాలనెన్నింటినో చక్కగా వివరిస్తున్నాయి. ఈ వాఙ్మయానికి పట్టిన అద్దమే మీరు చదవబోతున్న ఈ సంపుటం.

— ఎస్.బి.ఆర్.

## 1. 2 బ్రాహ్మణం అంటే ఏమిటి?

సువిశాలమైన వైదికవాఙ్మయరంగంలో సంహితల తరువాత ఉన్నతస్థానాన్ని ఆక్రమించిన మహోత్కృష్టగ్రంథరాశిని బ్రాహ్మణాలని వ్యవహరిస్తున్నాం. ఇవి కూడ వేదాలని పిలువబడే పవిత్ర గ్రంథాలలో అంతర్భాగాలేనని భారతీయుల దృఢవిశ్వాసం.

**బ్రాహ్మణపదనిర్వచనం:**

'బ్రహ్మ' అనే శబ్దానికి సంహితాభాగం అర్థమని శతపథ బ్రాహ్మణం చెబుతున్నది[1]. ఈ బ్రహ్మకు; అంటే ఋగ్యజుస్సామాథర్వసంహితలలోని మంత్రభాగానికి వినియోగాన్ని విధిస్తూ వ్యాఖ్యానరూపంగా ఏర్పడినగ్రంథం 'బ్రాహ్మణం' అనబడుతున్నది. ఋగాదిసంహితల్లోగల మంత్రాలను ఆయా యజ్ఞాలలో ఎక్కడెక్కడ ఎలా వినియోగించాలో నిరూపిస్తూ, వాటిని సరైన పద్ధతిలో అవసరమైనచోట్ల వ్యాఖ్యానిస్తూ ఉండేగ్రంథాలకు బ్రాహ్మణాలని పేరని తెలుస్తున్నది[2]. సంహితలలో నిగూఢంగా ఉన్న అర్థాన్ని అనేకవివరణల ద్వారా, ఉపాఖ్యానాల ద్వారా ఈ బ్రాహ్మణగ్రంథాలు తెలియజేస్తుంటాయి.

బ్రాహ్మణపదాన్ని ఇంకోరకంగా కూడా కొందఱు నిర్వచించారు. బ్రహ్మ=యాగనిర్వాహకుడు. ఇతడికి బ్రాహ్మణుడని కూడా పేరు[3]. నాలుగువేదాలను అధ్యయనం చేసి, యజ్ఞస్వరూ

---

1. బ్రహ్మవై మన్త్రః 7-1-1-5.
,, సప్తాక్షరం వై బ్రహ్మర్గిత్యేకాక్షరం. యజురితి ద్వే. సామేతి ద్వే
అథ యదతోఽన్యద్ బ్రహ్మైవ తద్ ద్వ్యక్షరం వై బ్రహ్మ. తదేతత్సర్వం
సప్తాక్షరం బ్రహ్మ 10-2-4-6.
2. మన్త్రో మననాత్, బ్రాహ్మణమభిధానాత్-కపర్దివ్యాఖ్య. ఆప. శ్రౌ. సూ. 32.
3. బ్రహ్మ వై బ్రాహ్మణః. శ. బ్రా.
,, సమావర్తావేతౌ బ్రహ్మన్ శబ్దో బ్రాహ్మణశబ్దశ్చ మహా. 5-1-1.

పాన్ని బాగా అర్థంచేసుకుని నడిపించగలవాడితడు. ఇలాంటి బ్రహ్మ యాగనిర్వహణవిధానాన్ని క్రమబద్ధంచేసి ప్రతిపాదిస్తాడు. బ్రహ్మచేత శాస్త్రీయంగా ప్రతిపాదింపబడిన యాగానుష్ఠానవిధానమే బ్రాహ్మణం అనబడుతున్నది[1]. దయానందసరస్వతి, సత్యవ్రతసామాశ్రమి మొ॥ భారతీయపండితులు, జూలియస్ ఎగ్గలింగ్ (Julius Eggeling) మార్టిన్ హాగ్ (Martin Haug) మొ॥ పాశ్చాత్యపండితులు బ్రాహ్మణపదానికి పైన చెప్పిన రెండవనిర్వచనాన్ని అనుసరించారు.

సామాన్యంగా ఆరణ్యకాలు, ఉపనిషత్తులు బ్రాహ్మణవాఙ్మయంకంటే విభిన్నమైనవి. కాని కొన్ని ఆరణ్యకాలు, ఉపనిషత్తులు బ్రాహ్మణగ్రంథాల్లో భాగాలుగా ఉన్నాయి. ఉదా :- బృహదారణ్యకోపనిషత్తు, శతపథబ్రాహ్మణంలో ఉన్నది. కాని ఆరణ్యకాలు, ఉపనిషత్తులు కలసిఉన్న బ్రాహ్మణాల్లో వాటిని విడిచి మిగత భాగాలనే బ్రాహ్మణాలుగా పరిగణించి ఈసంపుటంలో విషయపరిశీలనం చేయబడుతుంది. కనుక ఇందులో "బ్రాహ్మణం" అనే పదాన్ని పై అర్థంలో పరిమితం చేసి వాడుతున్నాను.

## బ్రాహ్మణాల స్వరూపం ఏమిటి ?

జైమిని పూర్వమీమాంసాదర్శనంలో బ్రాహ్మణాలను గురించి చెబుతూ "మంత్రాలు కాకుండా మిగిలినదంతా బ్రాహ్మణ"మని (శేషే బ్రాహ్మణశబ్దః 2.1.33) చెప్పాడు. యాగానుష్ఠానంలో మనల్ని ప్రేరేపించే విధులే బ్రాహ్మణాలని ఆపస్తంబుడు ప్రతిపాదించాడు[2]. ఈప్రేరణ, విధి- అర్థవాదలద్వారా మనకు లభిస్తున్నదని సాయణుని అభిప్రాయం[3].

---

1. చతుర్వేదవిద్భిః బ్రహ్మభిః బ్రాహ్మణైః మహర్షిభిః ప్రోక్తాని యాని వేదవ్యాఖ్యానాని తాని బ్రాహ్మణాని దయానంద ఋ. భా. భూ.
2. కర్మచోదనా బ్రాహ్మణాని ఆప. శ్రౌ. సూ. 34-35.
3. ద్వివిధం బ్రాహ్మణమ్-విధిః, అర్థవాదశ్చ ఋక్. భా. భూ. 9

